
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కృష్ణయజుర్వేదీయ
# తైత్తిరీయ సంహిత
## వేదార్థదీపికాసహితము

## షష్ఠకాండము
## షష్ఠ సంపుటము

వ్యాఖ్యానకర్త:
శిరోమణి, భాషాప్రవీణ
తర్క-వ్యాకరణ పూర్వోత్తర మీమాంసా విశారద
**శ్రీరామవరపు కృష్ణమూర్తిశాస్త్రి**

ప్రచురణ:
**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తిరుపతి**

# కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత

## వేదార్థదీపికాసహితము

### షష్ఠకాండము
### షష్ఠ సంపుటము


వ్యాఖ్యానకర్త

శిరోమణి, భాషాప్రవీణ,
తర్క వ్యాకరణ పూర్వోత్తర మీమాంసా విశారద,

**శ్రీ రామవరపు కృష్ణమూర్తి శాస్త్రి**



ప్రచురణ

**శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి
1993

# Krishna Yajurvediya Taittiriya Samhita with Telugu Commentary Vedarthadipika

## SIXTHKANDA - SIXTH VOLUME

Edited, Translated and Commented by:
Siromani Ramavarapu Krishnamurthy Sastry

T.T.D. Religious Publications Series No. 401

First Edition: 1993

Copies: 2,000

Price: Rs.

*Published by*
Sri D.V.L.N. Murthy, I.A.S.,
Executive Officer,
T.T. Devasthanams, Tirupati.

Printed at:

Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

సకలవిజ్ఞానభాండారమైన వేదం ఈశశాసనరూపం. అందువల్లనే ఋగాదిరూపమైన ఆ వేదాన్ని ప్రభుసమ్మితం అన్నారు శాస్త్రకారులు. అది సర్వవిద్యానిధిరూపమూ, ప్రదీపంవలె స్వతంత్రంగా సర్వార్థప్రకాశకమూ అయి సర్వవిషయాలనూ, సర్వజగత్తునూ, తత్కారణీభూత పరబ్రహ్మతత్త్వాన్నీ తెలుసుకొనటంలో ప్రత్యక్షప్రమాణంగా విరాజిల్లుతున్నది. ఈ విషయం ప్రాచీనులైన ప్రామాణికులకూ, విద్యావినీతులైన ఆధునిక పాశ్చాత్యవిపశ్చిత్తులకు అభిమతమూ, ఆమోదయోగ్యమూ కూడ.

ఋగ్యజురాది మంత్రాలు ప్రత్యక్షబ్రహ్మస్వరూపాలు. బ్రాహ్మణ-ఆరణ్యక-ఉపనిషదాది నామములచే ప్రసిద్ధమైన గద్యగాథాది భాగమంతా ఆ మంత్రముల గూఢార్థాన్ని ప్రకాశింపజేయుటానికే ఆవిర్భవించింది. ఈ విధంగా వేదాలతో సాక్షాత్సంబంధం ఉన్నందువల్లనే అది వేదంలోనే అంతర్గతమై వేదమని వ్యవహరింపబడుతున్నది. భారతీయవైభవానికీ, భారతీయ సంస్కృతికీ ఆ వేదమే మూలాధారం. వేదప్రామాణ్యవిషయంలో అనేకులకు అనేక మతభేదాలు ఉన్ననూ భౌతిక-దైవత- అధ్యాత్మాది తత్త్వవిజ్ఞానానికీ, సర్వవిద్యాప్రతిపత్తికీ ఏదో ఒక విధంగా వేదాశ్రయణం అవశ్యకమై వుండటం సంతోషాస్పదం. వైదిక సమాజమందు వేదనాస్తికులుగా పరిగణింపబడుతున్న జైనులు కూడ వేదం ఈశ్వరోక్తమని అంగీకరించకున్ననూ, సర్వజ్ఞులైన మహర్షులచే చెప్పబడినదని మాత్రం అంగీకరిస్తున్నారు.

దేవతాద్యలౌకిక తత్త్వాన్ని తెలుసుకొనటంలో ప్రమాణాలైన సర్వవాఙ్మయాలకంటె అతిప్రాచీనాలైన వేదాలే లేనిచో సృష్టికి పూర్వం స్వతస్సిద్ధమైన వస్తుతత్త్వాన్నీ, సృష్టికి అనంతరం ఆవిర్భవించిన తత్త్వవిశేషాలనూ అవగతం చేసుకొనటంలో ప్రమాణాంతరం లేకపోవటం వల్ల ఈ విషయంలో ఇప్పటివారికి అంధకారమే అయివుండేది. ఈ విధంగా ఆదిసృష్టి మొదలుకొని వేదావిర్భావానంతరం ఇప్పటివరకూ ఒక్కరూపంతో వున్నదీ, ఉపదేశపరంపరాప్రవాహంచే చిరకాలంనుండి సమాగతమైనదీ వేదమే. కావున సర్వవిద్యానిధీ, సర్వజగత్తునకు ఆదీ, బ్రహ్మవస్తువువలె ప్రమాణాస్పదమైనదీ అయినవేదమే అన్నివిధాలా సుప్రతిష్ఠితమై వుందని స్పష్టమవుతున్నది. ఇలాంటి మహామహిమోపేతమైన వేదం ప్రాచీన సంస్కృతభాషలో వున్నది. దానికి సాయణాచార్యాది మహర్షులు వ్రాసిన భాష్యాలు కూడ సంస్కృతభాషలోనే ఉన్నాయి. సంస్కృతంలో వున్న ఆ వేదభాష్యాలను అధ్యయనం చేసి వేదార్థాన్ని అవగతం చేసుకొవడం అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు.

ఈ పరిస్థితిని గమనించి తిరుమల తిరుపతి దేవస్థానం కీ॥శే॥ నేమాని వేంకటనరసింహశాస్త్రిగారు తెలుగులో పద్యరూపంలో అనువదించిన ఋగ్వేదాన్ని మూలసహితంగా ప్రచురించి ఆంధ్రులకు అందజేసింది. మరొక ప్రక్క కీర్తిశేషులు విద్వాన్ విశ్వంగారి అనువాదంతో అథర్వవేదం ఐదు సంపుటాలు విడుదల చేశాము. డాక్టరు యస్.బి. రఘునాథాచార్యులవారి సారథ్యంలో అథర్వవేదం మిగిలిన భాగాల ముద్రణ జరుగవలసివున్నది. ఇక వేదవిభాగంలో ఋగాది వేదాల వరుసలో ద్వితీయంగా వున్న యజుర్వేదాన్ని తెలుగులో వెలుగులోకి తీసుకరావాలనే సంకల్పంతో దేవస్థానం ప్రముఖ విద్వాంసులు, శిరోమణి శ్రీ రామవరపు కృష్ణమూర్తిశాస్త్రి గారు తెలుగులో ప్రతిపదార్థ తాత్పర్య మంత్రవినియోగ విశేషాంశాలతో విపులంగా వ్రాస్తున్న వేదార్థ దీపికావ్యాఖ్యానంతో కూడ కృష్ణయజుర్వేదాన్ని స్వరసహితంగ వెలువరిస్తున్నది. ఈ ప్రయత్నంలో ఇది షష్ఠకాండాత్మకమైన షష్ఠసంపుటం. మిగిలిన సంపుటాలను కూడ అనతికాలంలోనే ఆంధ్రపాఠక మహాశయులకు అందజేయుటానికి అవిరళ కృషి చేస్తున్నాము.

వేదవాఙ్మయం ఒక అగాధక్షీరసాగరం. నిర్విరామ మథనంతో అనర్ఘరత్నాలను వెలికి దీసి అందించవలసిన పవిత్రకర్తవ్యం అందరి మీదా వున్నది. ఈ విషయంలో ప్రతి ఒక్కరి సహకారం లభించగలదన్న ఆకాంక్షతో దేవస్థానం ముందుకు సాగుతున్నది. ఆదరం మీది. అనుగ్రహం శ్రీనివాసునిది.


**శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,**
**కార్యనిర్వహణాధికారి**
**తిరుమల తిరుపతి దేవస్థానములు.**

# అంకితం

యో దేవానాం ప్రథమం పురస్తాద్విశ్వాధికో రుద్రో మహర్షిః,

హిరణ్యగర్భం పశ్యత జాయమానగ్ం స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు.

చిదంశం విభుం నిర్మలం నిర్వికల్పం
నిరీహం నిరాకార మోంకారగమ్యమ్,
గుణాతీత మవ్యక్త మేకం తురీయం
పరం బ్రహ్మ యం వేద తస్మై నమస్తే.

సీ. అఖిలలోకాధార! ఆశ్రితమందార!
  నిగమాంతగోచర! నీరజాక్ష!
ఇందిరాసుందరీమందిరాయిత వక్ష!
  కారుణ్యసాగర! కనకవసన!
కల్యాణ గుణగణౌఘ మహార్ణవా! సత్య
  సంకల్ప! గోవింద! సత్యకామ!
పురుషోత్తమ! మహాప్రభూ! పరబ్రహ్మ భూ
  తా! విపన్నశరణ్య! దైత్యదమన!

గీ. జ్ఞానతేజో బలైశ్వర్య శక్తివీర్య
నిలయ! నారాయణా! వృషాచలవిహార!
అజముఖామరనుత! అతృప్త్యమృతరూప!
వేయి మ్రొక్కులు నీ కివే వేంకటేశ!

నీవే తల్లివి; తండ్రి వీవె; సఖుఁడున్ నీవే; గురుండీవె; నీ
వే విత్తంబును; విద్య లన్నియును నీవే; చుట్టపక్కంబు లీ
వే; వేయేల? సమస్తమీవె; త్రిజగద్విక్రాంత పాదాంబుజున్
భావారూఢుని నిన్ను నమ్మితిని దేవా! వేంకటాద్రీశ్వరా!

ఏమి తపంబు సల్పితినొ! ఎట్టి వ్రతంబు లొనర్చినాఁడనో!
స్వామి! భవత్పదాబ్జములు ప్రత్యహమున్ మది నిల్పి తావక
శ్రీమహితోక్తి భూష్ఠలికి శ్రేయమొసంగు "యజుస్సు" తెన్గులో
నేమ మునన్ రచించువని నేటికి నాకు లభించె నీ కృపన్.

ఆగమార్థదీపికాఖ్యల వెలసిన
ఐదు కృతులు నీకు నంకితమ్ము
సలిపినాఁడ దీని షష్ఠసంఖ్యాకమ్ము
నాదరించి బ్రోవు మయ్య! మమ్ము.

— రామవరపు కృష్ణమూర్తి శాస్త్రి

# ఆముఖము

బ్రహ్మనిశ్వాసరూపమును, ఆర్షవాఙ్మయమున కాద్యమును, భారతీయసంస్కృతి కాలవాలమును శబ్దరూపమునైన వేదము సర్వము ఒక్కటేయైనను తత్తల్లక్షణభేదముచే ఋగ్యజుస్సామాథర్వ నామములతో వ్యవహరించబడుచున్నది. ఋక్కులకు మితత్వము, యజుస్సులకు అమితత్వము, సామములకు స్వరత్వము ప్రధానలక్షణమని పంచమసంపుటమునందు సిద్ధాంతీకరించబడినది. మూఁడు వేదములకే లక్షణము చెప్పబడినది కాని యథర్వవేదమునకు పూర్వమీమాంసా శాస్త్రమునందుగాని, తదితర శాస్త్రములందుగాని పృథక్కుగ లక్షణము నిర్దిష్టము కాకుండుటచే పారిశేషికన్యాయము ననుసరించియు, అచట గీత్యాదులు లేకుండుటవలనను, ఋగ్యజుర్లక్షణవిశిష్టమంత్రము లచట కనబడుచుండుటవలనను అథర్వవేదము ఋగ్యజూరూపోభయాత్మక మని నిశ్చయ మగుచున్నది. ఋగ్వేదమునందు ప్రసిద్ధములైన ఋక్కులే కొన్ని కొన్ని తావులందు పాఠభేదముచే పఠితములైనవి అథర్వవేదమునందు సహస్రసంఖ్యాకములుగ కనఁబడుచున్నవి. వానికంటె భిన్నములైన ఋక్కులు కూడ సహస్రసంఖ్యాకములుగానే కలవు :–

"శం నో దేవీరభిష్టయే" (ఋ.10.9.4.; అథర్వ.1.6.1), "అమ్బయో యన్త్యధ్వభిః" (ఋ.1.23.16; అథర్వ.1.4.1), ఇటువంటి ఋక్కులు ఋగ్వేదములోనివే. "స్వస్తిదా విశాంపతిః" (ఋ.10.152.2; అథర్వ.1.21.21), "ఆ త్వా హార్షమన్తరభూః" (ఋ.10.173.1.; అథర్వ.6.87.1), ఇటువంటివి పాఠభేద విశిష్టములు. "అత్ర విశస్పతిః అన్తరేధి, విశ్వవిదం, వాచ మవిశ్వమిన్వామ్" ఇది ఋక్పాఠము. ఈ విధముగ ఋగ్వేదములోని సూక్తము లనేకములు కలవు. "యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః" (అథర్వ.1.1.1) ఇటువంటివి ఋగ్వేదమునందు అప్రసిద్ధములైన ఋక్కులే. ఈ విధముగ కొన్ని యజుస్సులు కూడ అథర్వవేదమునందు కనఁబడుచున్నవి. "విరాట్ వా ఇదమగ్ర ఆసీత్" (అథర్వ.8.10.1) ఇత్యాదు లిందుకు ఉదాహరణములు. యజూరూపములైన యీ మంత్రములే యథాయథముగ నిర్దిష్టములైన ఛందస్సులతో కూడియున్నవి. ఈ తురీయవేదమునకు అథర్వవేదసంజ్ఞ మాత్రము అథర్వఋషిచే సంగృహీత మగుటవలన ఏర్పడినది. లేదా – భృగ్వంగిరసులు, అథర్వాంగిరసులునైన ఆథర్వణ ఋషుల మంత్రబాహుళ్యమువలననైనను సిద్ధించినదని చెప్పవచ్చును. ఈ విధముగ వేదములకు చతుష్ట్వవల సిద్ధము కాకున్నను మంత్రరాశికి "ఋగ్యజుః" అని రెండువిధములుగానే భేదము వస్తుతత్త్వ సిద్ధమైనది. అందువలన ఋగాది లక్షణప్రయుక్తమే అయిన "ఋగ్యజుస్సామ్నాం స్వరూపమ్" ఋగ్యజుస్సామముల స్వరూపమని సిద్ధమైనది. కనుకనే "ఋషయోఽపి పదార్థానాం నాన్తం యన్తి పృథక్త్వశః.," "లక్షణేన తు సిద్ధానామన్తం యన్తి విపశ్చితః." "ఋషులు కూడ పదార్థముల అంతమును వేఱువేఱుగా పొందుటలేదు. లక్షణముచేత మాత్రము సిద్ధములైన పదార్థముల అంతమును విపశ్చిత్తులు పొందుచున్నారని చెప్పబడినది. అందువలన ఋగ్యజుస్సామశబ్దములు ఋగాదిలక్షణోపహితములైన ఋగాదిమంత్రములనే స్పృశించుచున్నవి. అంతేకాని ఋగాదివేదములందు ప్రసిద్ధమైన సంహితాగ్రంథమాత్రమును కాదు. ఆ విధముగనే బ్రాహ్మణాదిగ్రంథమాత్రమును కూడ కాదు. ఈ విషయము "అహే బుధ్నియ మన్త్రం మే గోపాయ | ఋచః సామాని యజూగ్ంషి" (తై. బ్రా.) అను మంత్రమున స్పష్టతరముగ నాఖ్యాత మైనది.

## వేదములు వ్యాసవ్యస్తములా?

ప్రథమమున ఏకరూపమున ఉన్న ఒకే వేదమును పరమపూజ్యుఁడైన వ్యాసభగవానుఁడు పాఠప్రవచనాది సౌకర్యమునకై నాలుగు విధములుగ విభజించెనని భారతాదిగ్రంథములందు కనబడుచున్నది. వ్యాసకృతమైన యీ విభాగ మెటువంటిది? ఋగాదివేదములు స్వస్వలక్షణసిద్ధము లనినచో వానికి నూతన విభాగమును చేయుటకై యెవరు సమర్థులు కాఁగలరు? లక్షణమువలన సిద్ధములును, స్వరూపముచే భిన్నములు నైనను వ్రీహి యవ గోధూమాదులకు వలె గ్రంథవిభాగముచే ప్రవచనసౌకర్యమునకై యేకరాశినుండి వ్యాస భగవానుఁడు పృథక్కరించినాడనినచో ప్రసిద్ధమైన యజుర్వేదమునందు కేవలము యజుస్సులే కాదు, ఋక్కులు కూడ కలవు కదా! మఱియు మధుచ్ఛందః ప్రభృతులైన యనేక ఋషులచే దృష్టములైన యనేక

మంత్రములను సూక్తములను ఒకచోట సంగ్రహముగ సంహితాదిగ్రంథములందు వారు కూర్చినవారే కాని, విభజించినవారు కారు. ఋగ్వేదమునందు శాకలాదులును, శుక్లయజుర్వేదమునందు కణ్వ మాధ్యందినాదులును, కృష్ణయజుర్వేదమునందు తిత్తిరి మైత్రాయణాదులును, సామవేదమునందు రాణాయనప్రభృతులును, అథర్వవేదమునందు శౌనకాదులును తత్తద్వ్యాఖ్యాప్రవర్తకులు గాను, ప్రవచనకర్తలుగాను ప్రసిద్ధులైరి. కాని, అచట వ్యాసభగవానుని పేరు కూడ వినబడుటలేదు. వ్యాసకృతమైన యీ వేదవిభక్తృత్వమైనను సంహితా-బ్రాహ్మణారణ్యకోపనిషదాది వేదగ్రంథములందు కాని, నిరుక్తాదులైన వేదాంగములందు కాని, వేదసంబద్ధములైన కల్పసూత్రాదులందు కాని ప్రసిద్ధమై యుండలేదు.

వేదార్థవిచారశాస్త్రములైన పూర్వోత్తరమీమాంసలందు కూడ ఎచ్చటను ఈ వ్యాసకృతవిభక్తృత్వము ప్రస్తుతించబడలేదు, నిర్ణయించబడలేదు కూడ మఱియు "ఋగ్గాథా కుమ్బ్యా తన్మితమ్" (ఐతరేయోపనిషత్) "అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్యదృగ్వేదః" ( బృహదారణ్యకోపనిషత్.) "తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః" (ముండకోపనిషత్) ఇత్యాది ప్రసిద్ధ బ్రాహ్మణోపనిషదాదులకంటెను వ్యాసకృత వేదవిభాగము ప్రాచీనమా? లేక అర్వాచీనమా? ప్రాచీనమనినచో వసిష్ఠాదిదృష్టము లైన ఋగాదులను వ్యాసుఁడు విభజించెనను పక్షమున వసిష్ఠాది మహర్షులవలె వ్యాసుఁడు ఉపనిషదాదులకంటె ప్రాచీనుఁడనుట యసంగతము. అర్వాచీనమనినచో తత్తల్లక్షణములవలన సిద్ధములును, భిన్నరూపములునైన యీ ఋగాదులను ఏకరాశినుండి పృథక్కరించుటచే పునర్విభాగము సంభవమైనను ప్రసిద్ధములైన సమస్త ఋగాదివేదగ్రంథములందు లక్షణమువలన ఆ విధముగ విభాగము కనబడుటలేదు కనుక ఈ వాదము కూడ అసంగతమే యగుచున్నది. యజుర్వేదమునందు ఋక్కులు కూడా నుండుటవలన ఋక్సామవేదములందు లక్షణమువలన విభాగ మున్నను యజుర్వేదమునకు లక్షణప్రయుక్త విభాగము లేదనుట స్పష్టము. ఆ విధముగనే "ఋచః సామాని జజ్ఞిరే, ఋచః సామాని యజూంషి" అని వేదమంత్రములందే శ్రుతము లైన యీ ఋగాదిమంత్రములకు లక్షణముచే నావిర్భావమువలననే, అంతకు పూర్వము కూడ ఆ ఋగాదులకు పునర్విభాగ మనుపపన్నమే యగును.

## మంత్రవిభాగము — వ్యాసపూర్వము

ఇఁక ప్రవచనసౌకర్యముకొఱకును, అల్పమేధస్కులు ఒక్కొక్క వేదమును లాఘవముగ నధ్యయనము చేయుటకొఱకును ఋగాదిగ్రంథవిభాగము వ్యాసకృతమని యనుట కూడ కల్పనామాత్రమే యని పర్యవసన్న మగును. తత్తద్గ్రంథ ప్రవక్తలుగా శాకల-తిత్తిరి-మాధ్యందినాది మహర్షులు ప్రసిద్ధులై యున్నారనియు, అచట వ్యాసనామప్రసిద్ధి లేదనియు పూర్వము విస్తరించి చెప్పబడినది. ఇట్లుండగా వేదమును నాలుగు విధములుగ విభాగము చేయుటయందు "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అనిన విధముగ నిమిత్తమాత్రత్వమే క్లుప్తమైనది. ఆ విధముగ 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వమ్' అని వ్యాసునకు సర్వజ్ఞత్వాదిప్రసిద్ధి గౌరవాద్యుపోద్బలకము కూడ నని తెలుచున్నది.

## మంత్రములకే సంహితాత్వము బ్రాహ్మణములకు కాదు

పూర్వోక్తములైన యీ ఋగ్యజుస్సామాథర్వము లనెడి నాలుగు వేదములందు కూడ మంత్రాత్మకమైన భాగము, తద్గ్రంథము కూడ సంహితాశబ్దముచే ప్రసిద్ధమై యున్నది. ఆ గ్రంథములకు సంహితాత్వము, ఆ విదముగ సంహితాశబ్దవాచ్యమైన శబ్దరాశికి మంత్రత్వము, మంత్రావయవభూత వర్ణ-పద-పాదాదులకు నియత పౌర్వాపరీభావాదినిబంధన క్లుప్తత్వము ప్రసిద్ధ ములే. అందుచేత మంత్రములకు ఛందోవృత్తాది నిబంధనమువలన సాంహిత్యము కోరఁదగియున్నది. కనుకనే "పరః సన్నికర్షః సంహితా" అని పాణినిమహర్షి సూత్రీకరించియుండెను. అందువలన నియతచ్ఛందో నిబంధనము చేతనే మంత్రములకు సంహితాత్వ మంగీకరింపవలసియున్నది. కనుకనే ఆధ్వర్యవమైన యాజుషకర్మానుష్ఠానమునందు యాజుషమంత్రప్రయోగావసరమున

"దేవస్య త్వా సవితుః, అగ్నయే జుష్టం నిర్వపామ్యగ్నీషోమాభ్యామ్" అనియే మంత్రపాఠమునందు కూడ కలదు. "సవిత్రే జుష్టం నిర్వపామి, ఇన్ద్రాయ జుష్టం నిర్వపామి" అని తత్తద్దేవతాభేదముచే ప్రయోగింపవలసిన ఊఢమంత్రములకు మంత్రత్వము లేదు. అచట ప్రయోక్తృమతికల్పితమగుటచేత యథోక్త ఛందోనిబంధన నియతపరమసన్నికర్షరూప సంహితాత్మకమంత్రత్వము లేకపోవుటయే అందుకు కారణము. ఈ విషయము "గుణశబ్దస్తథేతి చేత్ | న సమవాయాత్" అను సూత్రములందు జైమినిమహర్షిచే మీమాంసిత మైనది (చర్చింపఁబడినది). ఆ విధముగ ఈ ఊహామంత్రములు ప్రయోక్తృమతికల్పితము లగుటచే వానికి పౌరుషేయత్వము నిర్ణీత మైనది. "సామాని మన్త్రమేకే స్మృత్యుపదేశాభ్యాం | తదుక్తదోషమ్" అని జైమిని సూత్రము.

ఈ విధముగ పాఠప్రవచనగ్రంథమునందు సమామ్నాతములును, "సూర్యాయ జుష్టం నిర్వపామి" ఇత్యాదిరూపమున కల్పితములునైన ఊఢవాక్యములు పౌరుషేయము లగుట వలననే వానికి అమంత్రత్వము నిర్ణయింపఁబడినది. "అనామ్నాతేష్వమంత్రత్వ మామ్నాతేషు హి విభాగః" అను జైమినిసూత్ర మీ విషయములనే నిర్ధారించినది. ఇట్లు కాఁగా ఊఢవాక్యములు పురుషమతి కల్పితము లగుటవలన మంత్రత్వాభావము నిశ్చయింపబడగా పరిశేషన్యాయమువలన బ్రాహ్మణవాక్యమువలె వాక్యత్వములే. దీనిచేత యథోక్తమంత్రలక్షణాభావముచే బ్రాహ్మణవాక్యములకు మంత్రత్వము లేదని, దానివలన సంహితాత్వము లేదనియు సిద్ధించుచున్నది.

## యజుర్వేదప్రాధాన్యము

యజ్ఞస్వరూపుఁడైవ పరమపురుషుడు యజ్ఞముచేతనే యజనీయుఁడు (పూజింపఁదగినవాఁడు) కనుక యజ్ఞమునకే ప్రాధాన్యము సర్వవేదములందు కూడ క్లుప్తమై యున్నది. జ్ఞానోపాసనాక్రియాదిరూప మైన ఆ యజ్ఞము వేదోపదిష్టమైన సమస్తధర్మము కూడ. "యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్" ( ఋగ్వేదము) "ద్రవ్యయజ్ఞాస్తపో యజ్ఞాః ధ్యానయజ్ఞా స్తథా పరే | స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః" (భగవద్గీత) అను నీ శ్రుతిస్మృతులు యజ్ఞముచేత యజ్ఞస్వరూపుఁడైన పరమేశ్వరుని పూజింపవలయునని చెప్పుచున్నవి. యజ్ఞముకొఱకే సర్వవేదముల ప్రవృత్తి యని "వేదా హి యజ్ఞార్థమభిప్రవృత్తాః కాలానుపూర్వా విహితాశ్చ యజ్ఞాః" అను వేదాంగమైన జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. యజ్ఞప్రాధాన్యమువలననే మనోమయమైన ఆత్మకు యజుశ్శిరస్త్వము "తస్మాద్వా ఏతస్మాత్ప్రాణమయాత్ | అన్యోఽన్తర ఆత్మా మనోమయః | తస్య యజురేవ శిరః" అను శ్రుతియందు (తై. ఉ. ఆనందవల్లి) చెప్పఁబడినది. 'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్' = సర్వగాత్రమునకు శిరము ప్రధానమని ప్రత్యక్షసిద్ధమైన న్యాయతత్త్వము.

మఱియు "గాయన్తి త్వా గాయత్రిణోఽర్చన్త్యర్కమర్కిణః" (ఋగ్వేదము), "ఋచాం త్వః పోషమాస్తే పుపుష్వాన్గాయత్రం త్వో గాయతి శక్వరీషు" (ఋగ్వేదము) అను మంత్రవర్ణమువలనను, "ఋచైవ హౌత్రం క్రియతే, యజుషాఽఽధ్వర్యవం, సామ్నోద్గీథమ్" (ఐతరేయోపనిషత్) అను బ్రాహ్మణవచనమువలనను ఋగ్యజుస్సామములు హౌత్ర హవన గానాదులందు యజ్ఞార్థములుగా వినియోగింపఁబడుటవలనను సర్వవేదములకు కూడ యజ్ఞపదముగ లాక్షణికమైన యజుర్వేదత్వము అర్థాత్తు క్లుప్తమైనది. "యత్స్వాధ్యాయమధీయీతైకామప్యృచం యజుః సామ చ వా తద్బ్రహ్మయజ్ఞః సన్తిష్ఠతే" (తై. అరణ్యకము) అను శ్రుతి సర్వవేదములచే బ్రహ్మయజ్ఞము సిద్ధించునని చెప్పుచున్నది.

ఇంకను "సర్వే వేదా యత్పదమామనన్తి | తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్" ( కఠోపనిషత్) అను శ్రుతి సర్వవేదమూలభూతమును, బ్రహ్మవాచకమునైన 'ఓమ్' అను ప్రణవమునకు కూడ యజుష్ట్వమును చెప్పుచున్నది. ఆ విధముగ బ్రహ్మయజ్ఞాదికమునందు సర్వవేదములయొక్క ఆదియందు తత్ప్రణవానువచనము విహితమై యనుశ్రుతమగుచున్నది-- "బ్రహ్మయజ్ఞేన యక్ష్యమాణగ్ం--ఓమితి ప్రతిపద్యతే ఏతద్వై యజుస్త్రయీం విద్యాం ప్రత్యేషా వాగేతత్పరమక్షరమ్" అను తైత్తిరీయారణ్యకమువలన ఈ విషయము స్పష్టమగుచున్నది.

ఆ విధముగ "ఓమితి బ్రహ్మ. ఓమితీదగ్ం సర్వమ్ | ఓమిత్యేతదనుకృతి హ స్మ వా అప్యోశ్రావయేత్యాశ్రావయన్తి | ఓమితి సామాని గాయన్తి | ఓగ్ంశోమితి శస్త్రాణి శగ్ంసన్తి | ఓమిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతిగృణాతి | ఓమితి బ్రహ్మ ప్రసౌతి | ఓమిత్యగ్నిహోత్రమనుజానాతి | ఓమితి బ్రాహ్మణ ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్నవానీతి | బ్రహ్మైవోపాప్నోతి" అను తైత్తిరీయోపనిషత్తు కూడ పైవిషయమునే విశదీకరించినది. దీని యర్థము:-

నిర్గుణపరబ్రహ్మోపాసనము చేయుటకై అర్హత కలవారు 'మందబుద్ధులు, మధ్యములు, ఉత్తములు' అని మూఁడు విధములుగ నున్నారు. వీరిలో సూక్ష్మదర్శులైన ఉత్తమాధికారులకు వేదాంతప్రతిపాద్య ప్రణవాభిధేయ శుద్ధబ్రహ్మోపాసన మిచట చెప్పఁబడినది. 'ఓమ్' అను శబ్దముచే ప్రతిపాదించఁబడుచున్న బ్రహ్మపదార్థము ఉపాసించఁదగినది. శుద్ధ బ్రహ్మపదార్థ వాచకమైన ఓంకారము నుచ్చరించుచు తద్వాచ్యమైన బ్రహ్మ నుపాసించవలెను. 'ఓమ్' అను నక్షరమునందు శబ్దరూపము, అర్థరూపమునైన యీ సర్వజగత్తు అంతర్భూతమై యున్నది. "తద్యథా శఙ్కునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాన్యేవమోంకారేణ సర్వా వాక్సంతృణ్ణా"= 'శంకుశబ్దాభిధేయమైన పర్ణాంతర్గత శలాకావిశేషముచేత (ఆకులోని నరముచేత) మఱ్ఱి, రావి మొదలైన ఆకులు వ్యాప్తములైన విధముగ ఓంకారముచేత సర్వవాక్కు వ్యాప్తమై యున్నదని' ఛాందోగ్యోపనిషత్తునందు వివరించఁబడినది. ఓంకారమునందు (ప్రణవమునందు) వాక్కుయొక్క అంతర్భావము అకారము ద్వారా యుండునని గ్రహించవలెను. ఈ విధముగ ప్రణవము సర్వాత్మక మగుటచే ఆ ప్రణవమునకు సర్వాత్మక బ్రహ్మవాచకత్వ యోగ్యత సంభవించుచున్నది.

దర్శపూర్ణమాసాది యాగములందు యజుర్వేదోక్తకర్మల ననుష్ఠింపఁజేయునట్టి యధ్వర్యులు ఆగ్నీధ్రుని గూర్చి "ఆశ్రావయ" అను ప్రైషమంత్రమును ప్రయోగించునపుడు 'ఓ శ్రావయ' అను ప్రైషమంత్రమును పఠించుచున్నారు. 'ఓ ఆగ్నీధ్రా! దేవతలకు హవిష్ప్రదానావసరమును వినిపించుము' అని యీ మంత్రమున కర్థము. "ఆశ్రావయో శ్రావయోం శ్రావయేతి శ్రావయతి" అని ఆపస్తంబమహర్షులు చెప్పియున్నారు. అనఁగా 'శ్రావయ' అను మంత్రమును ఆకారాదికముగను, ('ఆశ్రావయ') ఓకారాదికముగను, ('ఓ శ్రావయ') ఓంకారాదికముగను (ఓం శ్రావయ) ప్రయోగించవచ్చునని యర్థము. 'ఓ శ్రావయ' అను మంత్రమునందలి ఓకారము ఆగ్నీధ్ర సంబోధనార్థకము. ఈ ఓకారము 'ఓమ్' అను ప్రణవమునకు అనుకరణము. అనఁగా ఓంకార సాదృశ్య సంపాదకము. 'హ, స్మ, వా' అను మూఁడు నిపాతములు ప్రసిద్ధిద్యోతకములు. అపి అను అవ్యయము వక్ష్యమాణములైన ఉదాహరణముల సముచ్చయార్థకము. అధ్వర్యులు కూడ ప్రణవభాగమైన ఓకారముతోనే మంత్రముల నుచ్చరించుచున్నారు.

ఆ విధముగనే సామగానము చేయునట్టి ఉద్గాతలు కూడ ప్రణవోచ్చారణ పురస్సరముగనే సామగానము చేయుచున్నారు. శస్త్రశంసనమునకై యధ్వర్యుని యనుజ్ఞను యాచించునట్టి హోతలు "అధ్వర్యో శంసావోమ్" = 'ఓ యధ్వర్యూ ! శంసనము చేయుదుమా?' అని యీ మంత్రముచేత ననుజ్ఞను యాచించుచున్నారు. 'అధ్వర్యో, శంసోమ్, 'ఓమ్' అని పదవిభాగము. ఇచట ఆదియందు శోమ్ అనునది, అంతమునందు ఓమ్ అను ప్రణవము అను ఈ యుభయము కనఁబడుచున్నది. ఈ యభిప్రాయములోనే 'ఓగ్ం శోమితి శస్త్రాణి శగ్ంసన్తి' అని ఆమ్నాత మైనది. హోత శస్త్రములను ( స్తోత్రమంత్రములను) పఠించునప్పు డధ్వర్యుఁడు ఆ హోతను గూర్చి ప్రోత్సాహనద్యోతక శబ్దము నుచ్చరించును. ఆ ప్రోత్సాహనశబ్దమే ప్రతిగర మనఁబడును. ప్రతిగరాదియందు అధ్వర్యుఁడు ప్రణవమును ప్రయోగించవలెను. ఆ ప్రణవము శస్త్రశంసనాంగీకారమును తెలియఁజేయును. కనుక ప్రతిగరమునందు కూడ ప్రణవము అనువర్తించును. బ్రహ్మను పొందుదును గాక యని కోరుచున్న పురుషుఁడు 'ఓమ్' అను శబ్దముచే వాచ్యమైన పరబ్రహ్మము నుపాసించవలెను.

ఈ విధముగ ఋగాదివేదసాధ్యములైన సర్వయజ్ఞములందును యజుర్మంత్రాత్మక ప్రణవపూర్వకముగనే సర్వవేద మంత్రానువచనముచేత తద్యజ్ఞకర్మానుష్ఠానము విధించఁబడుటవలన యజ్ఞప్రధానములు సర్వవేదములు, యజ్ఞప్రధానములు సర్వయజ్ఞములు అని సంపన్న మగుచున్నది. ఆ విధముగనే వేదత్రయసారభూతములును, "భూర్భువః సువః" అని ప్రసిద్ధములునైన మూఁడు

వ్యాహృతులకు ఛందస్సువలన యజుష్ట్వము క్లుప్తమై యున్నది, ఆ వ్యాహృతులు వేదసారములగుటవలన వేదసాధ్యములైన ప్రాణాయామ బ్రహ్మయజ్ఞ సంధ్యోపాసనాది సర్వయజ్ఞములందు కూడ యజుర్మంత్రాత్మక ప్రణవవ్యాహృతిపూర్వకముగనే గాయత్రీజపము, ఆ విధముగ సర్వవేదములయొక్క అనువచనము విధించఁబడినవి. "ఓమితి ప్రతిపద్యతే । త్రీనేవ ప్రాయుఙ్క్తే భూర్భువః స్వరిత్యాహైతద్వై వాచః సత్యమ్" (తై. ఆరణ్యకము.) "ఏక ఏవ యజుర్వేదస్తం చతుర్ధా వ్యకల్పయత్" (విష్ణు పురాణము) "ఏక ఏవ పురా వేదః ప్రణవః సర్వవాఙ్మయః" (భాగవతము), "ఓమితి ప్రతిపద్యతే ఏతద్వై యజుః" (తై. ఆరణ్యకము.) ఇత్యాది శ్రుతి స్మృతి పురాణాదు లన్నియు సర్వవేదములకు యజుష్ట్వమును, యజుర్వేదమునకు ప్రాధాన్యమును ప్రతిపాదించుచున్నవి.

శిరోమణి, భాషాప్రవీణ,
తర్క వ్యాకరణ పూర్వోత్తరమీమాంసా విశారద
రామవరపుకృష్ణమూర్తిశాస్త్రి

# ఓమ్

## పారిభాషిక పదార్థ సంగ్రహము

అగ్నిహోత్రహవణి =హోమసాధనములైన స్రుక్--స్రువములలో స్రుక్కునకు అగ్నిహోత్రహవణి యని వివక్షచేయఁబడినది.

అతిపన్నము =సకాలమున చేయక నిలిపివేయఁబడినది.

అన్వారంభము =యజ్ఞపశువును వధించుటయందు ఈ పదముపయోగింపఁబడును. వధించుట.

అవభృథము =యజ్ఞము సమాప్తమైన పిమ్మట తుదిదినమున చేయు కార్యకలాపము. అవభృథమునాఁడు యజ్ఞకర్త యజ్ఞదీక్షను విడిచిపెట్టును.

ఆఘారము =నైర్ఋతిదిక్కున ప్రారంభించి యీశాన్యదిక్కున సమాప్తమగునట్లుగా చేయు హోమము.

ఇధ్మము =ఎండిన మోదుగుపుల్ల (సమిధ). లేక ఎండిన రావిపుల్ల "ఇ ఇన్ధి=దీప్తౌ" అను ధాతువునుండి ఇధ్మశబ్ద ముత్పన్నమైనది. దీనిచే అగ్ని ప్రకాశించును.

ఇష్టము =యజ్ఞమునందలి హోమదానాదిక్రియ ఇష్ట మనఁబడును.

ఉక్థము =ఏకాక్షరఛందస్సు కల సామవిశేషము ఉక్థః

ఉత్కరము =యజ్ఞభూమియందు ధూళి మొదలగువానిని ఉంచునట్టి స్థానము ఉత్కర మనఁబడును.

ఉపశయము =యూపైకాదశినీసమీపమున శయానమైయున్న యూపమునకు సమీపమున శయానమైయున్న యూపము.

ఛందస్సు =మంత్రము. దేవతలు మృత్యుదేవతవలన భయపడి త్రయీవిద్య( వేదము) ను పొంది యా మంత్రములచే నాచ్ఛాదనము చేసికొనిరి కావున మంత్రములకు 'ఛందస్సు' అను పేరు వచ్చినట్లు ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పఁబడినది. 'ఛందస్సు' అను పదము గాయత్ర్యాది ఛందస్సులకు సామాన్యవాచకము. "ఛది=ఆహ్లాదనే" ఆహ్లాదమును కలుగఁజేయునది.

దీక్ష =వపనాది సంస్కారము దీక్షయనఁబడును.

నిధనము =సామములో అంత్యభాగము నిధన మనఁబడును.

పంచదశస్తోమము =అయిదుమాఱు లావృత్తి చేయఁబడిన స్తుతిమంత్ర సమూహము పంచదశస్తోమ మనఁబడును.

పరిధి =యజ్ఞార్హమైన మేడిచెట్టునకు సంబంధించిన పుల్ల. పరితః దధాతి=పుష్ణాతీతి పరిధిః. హోమాగ్నికి రక్షణముగ నాలుగువైపులందు పఱచఁబడి యుండును.

పరిపతిః =అనేకవిషయములందు ప్రవర్తించునది మనస్సు. పరితః నానావిషయేషు పతతి=ప్రవర్తతే ఇతి పరిపతిః

పురోడాశము =హోమమునిమిత్తము నీటితో తడిపి ముద్దగా చేయఁబడిన పిండి పురోడాశ మనఁబడును.

పృశ్ని =పృశ్నిః=ఆదిత్యుఁడు.

ప్రతినిర్వాపము =ఒకపర్యాయము హవిస్సును నిర్వాపము చేసిన యనంతరము మఱల చేయు హవిర్నిర్వాపము.

ప్రస్తరము =దర్భలకట్టకు ప్రస్తరమని వైదికవ్యవహారము.

పురోనువాక్య =పురస్తాత్ లక్ష్మ్యా పురోనువాక్యా. అప్పటికే పుట్టియున్న శత్రువులను సంహరించునది. పురోనువాక్య మంత్రములందు పూర్వార్ధమున దేవతా వాచక పదముండును. మంత్రవిశేషము. పురస్తాదామ్నాతాః పురోనువాక్యాః అని విద్యారణ్యము.

యాజ్య =యాజ్యానువాక్యమంత్రము 'యాజ్య' అనఁబడును. ఇజ్యతే అనయేతి యాజ్యా అని వ్యుత్పత్తి. ఈ మంత్రమునుచ్చరించగానే 'యజ' అని పలుకవలెను.

యాజ్యానువాక్య =పుట్టఁబోవు శత్రువులను సంహరించు మంత్రవిశేషము యాజ్యానువాక్య యనఁబడును. ఈ మంత్రము నందు ఉత్తరార్ధమున దేవతా వాచక పద ముండును. ఉపరిష్టాత్ లక్ష్మా యాజ్యా. పశ్చాదామ్నాతాః యాజ్యాః అని విద్యారణ్యము.

శమిత =యజ్ఞపశువుయొక్క హృదయాదిస్థానీయమైన పచను పక్వము చేయునట్టి వ్యక్తికి శమిత యని వ్యవహారము.

***

# షష్ఠ కాండము

## విషయ సూచిక

### ప్రథమ ప్రపాఠకము



### ద్వితీయ ప్రపాఠకము



### తృతీయ ప్రపాఠకము



### చతుర్థ ప్రపాఠకము



### పంచమ ప్రపాఠకము

## షష్ఠ ప్రపాఠకము



* * *

# అథ షష్ఠకాణ్డే ప్రథమః ప్రపాఠకః

## తత్ర ప్రథమోఽనువాకః

### హరిః ఓమ్

మూలము : [1]ప్రాచీనవగ్ంశం కరోతి దేవమనుష్యా దిశో వ్యభజన్త ప్రాచీం దేవా దక్షిణాం పితరః ప్రతీచీం మనుష్యా ఉదీచీగ్ం రుద్రా యత్ప్రాచీనవగ్ంశం కరోతి దేవలోకమేవ తద్యజమాన ఉపావర్తతే [2]పరి శ్రయ త్యన్తర్హితో హి దేవలోకో మనుష్యలోకా [3]న్నాస్మాల్లోకాత్స్వేతవ్య మివేత్యాహుః కో హి తద్వేద యద్యముష్మింల్లోకే ఽస్తి వా న వేతి దిక్ష్వతీకాశా న్కరోతి (౧) ఉభయో ర్లోకయో రభిజిత్యై [4]కేశశ్మశ్రు వపతే నఖాని ని కృన్తతే మృతా వా ఏషా త్వగమేధ్యా యత్కేశశ్మశ్రుమృతామేవ త్వచ మమేధ్యా మపహత్యం యజ్ఞియో భూత్వా మేధ ముపై [5]త్యఙ్గిరసః సువర్గం లోకం యన్తోఽప్సు దీక్షా తపసీ ప్రావేశయన్నప్సుస్నాతి సాక్షాదేవ దీక్షా తపసీ అవ రున్ధే [6]తీర్థే స్నాతి తీర్థే హి తే తాం ప్రావేశయ [7]స్తీర్థే స్నాతి (౨) తీర్థమేవ సమానానాం భవ [8]త్యపోఽశ్నా త్యన్తరత ఏవ మేధ్యో భవతి [9]వాససా దీక్షయతి సౌమ్యం వై క్షౌమం దేవతయా సోమమేష దేవతా ముపైతి యో దీక్షతే [10]సోమస్య తనూరసి తనువం మే పాహీత్యాహ స్వామేవ దేవతా ముపైత్యథో ఆశిష మేవైతా మా శాస్తే [11]ఽగ్నే స్తూషాధానం వాయోర్వాతపానం పితృణాం నీవి రోషధీనాం ప్రఘాతః (3) ఆదిత్యానాం ప్రాచీనతానో విశ్వేషాం దేవానా మోతు ర్నక్షత్రాణా మతీకాశా స్తద్వా ఏతత్సర్వదే

వత్యం యద్వాసో యద్వాససా దీక్షయతి సర్వాభి రేవైనం దేవతాభిర్దీక్షయతి [12]బహిః ప్రాణో వై
మనుష్య స్తస్యాశనం ప్రాణోఽశ్నాతి సప్రాణ ఏవ దీక్షత [13]ఆశితో భవతి యావానేవాస్య ప్రాణ
స్తేన సహ మేధ ముపైతి [14]ఘృతం దేవానాం మస్తు పితృణాం నిష్పక్వం మనుష్యాణాం తద్వై (౪)
ఏతత్సర్వదేవత్యం యన్నవనీతం యన్నవనీతే నాభ్యఙ్క్తే సర్వా ఏవ దేవతాః ప్రీణాతి [15]ప్రచ్యుతో
వా ఏషోఽ స్మా ల్లోకా దగతో దేవలోకం యో దీక్షితోఽన్తరేవ నవనీతం తస్మాన్నవనీతేనాభ్యఙ్క్తే
[16]ఽనులోమం యజుషా వ్యావృత్త్యా [17]ఇన్ద్రో వృత్ర మహన్తస్య కనీనికా పరాఽపత త్తదాఞ్జన మభవ
ద్యదాఙ్క్తే చక్షురేవ భ్రాతృవ్యస్య వృఙ్క్తే [18]దక్షిణం పూర్వ మాఽఙ్క్తే (౫)సవ్యగ్ంహిపూర్వం
మనుష్యా అఞ్జతే న ని ధావతే నీవ హి మనుష్యా ధావన్తే పఞ్చకృత్వ ఆఽఙ్క్తే పఞ్చాక్షరా పఙ్క్తిః
పాఙ్క్తో యజ్ఞో యజ్ఞ మేవావ రున్ధే పరిమిత మాఽఙ్క్తే పరిమితగ్ంహి మనుష్యా అఞ్జతే సతూ
లయాఽఽఙ్క్తేఽ పతూలయా హి మనుష్యా అఞ్జతే వ్యావృత్త్యై [19]యదపతూలయాఽఽఞ్జీత వజ్ర
ఇవ స్యా త్సతూలయాఽఙ్క్తే మిత్రత్వాయ (౬) [20]ఇన్ద్రో వృత్రమహా న్సోఽ౨ పోఽ౨ భ్యమ్రి
యత తాసాం యన్మేధ్యం యజ్ఞియగ్ం సదేవ మాసీత్తదపోదక్రామత్తే దర్భా అభవ న్యద్దర్భ పుఞ్జీలైః
పవయతి యా ఏవ మేధ్యా యజ్ఞియాః సదేవా అపస్తాభి రేవైనం పవయతి [21]ద్వాభ్యాం పవ
యత్యహోరాత్రాభ్యా మేవైనం పవయతి త్రిభిః పవయతి త్రయ ఇమే లోకా ఏభిరేవైనం లోకైః
పవయతి పఞ్చభిః (౭) పవయతి పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞాయైవైనం పవయతి

షడ్భిః పవయతి షడ్వా ఋతవ ఋతుభి రేవైనం పవయతి సప్తభిః పవయతి సప్త ఛన్దాగ్ంసి ఛన్దోభి రేవైనం పవయతి నవభిః పవయతి నవ వై పురుషే ప్రాణాః సప్రాణ మేవైనం పవయత్యేకవిగ్ంశత్యా పవయతి దశ హస్త్యా అఙ్గులయో దశ పద్యా ఆత్మైకవిగ్ంశో యావానేవ పురుష స్తమపరి వర్గమ్ (౮) పవయతి [22]చిత్పతి స్త్వా పునాత్విత్యాహ మనో వై చిత్పతిర్మనసైవైనం పవయతి వాక్పతి స్త్వా పునాత్విత్యాహ వాచైవైనం పవయతి దేవస్త్వా సవితా పునాత్విత్యాహ సవితృప్రసూత ఏవైనం పవయతి [23]తస్య తే పవిత్రపతే పవిత్రేణ యస్మై కం పునే తచ్ఛకేయ మిత్యాహా ఽఽశిష మేవైతా మా శాస్తే (౯) ||

[అతికాశా న్కుర్గోత్యవేశయస్త్రిగ్ంస్నాతి ప్రసూతో మనుష్యాణాం తద్వా ఆఽక్ష్యే మిత్రత్వాయ పఞ్చభి రపరివర్గ మష్టాచత్వా రిగ్ంశచ్చ] ||౧||

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠకాణ్డే ప్రథమప్రపాఠకే ప్రథమోఽనువాకః ||౧||

## వేదార్థ దీపిక

అవతారిక : ప్రథమ కాండమునందు ప్రథమ ప్రపాఠకమునందు దర్శపూర్ణమాసేష్టి, ద్వితీయాది ప్రపాఠక త్రయమునందు సోమయాగము చెప్పఁబడినవి. ఆ సోమయాగమునకు సంబంధించిన మంత్రములకు బ్రాహ్మణము (వ్యాఖ్యానరూపము) ఈ షష్ఠకాండమునందలి ప్రథమ ప్రపాఠకమునందు చెప్పఁబడుచున్నది. ప్రాగ్వంశము, లేక ప్రాచీనవంశ మనఁగా యజ్ఞశాల. సోమయాగకర్త యజ్ఞశాలలో ప్రవేశించుటకు సంబంధించిన మంత్రములు ప్రథమ కాండమునం దభిహితము లైనవి. సోమయాగము చేయఁబోవు యజమానుఁడు యజ్ఞదీక్షను స్వీకరించవలసియున్నది. ఆ దీక్షను స్వీకరించుటకు పూర్వము యజ్ఞశాలానిర్మాణము చేయవలయునని, తద్విధి యిచట చెప్పఁబడుచున్నది.

1. అర్థము : ప్రాచీనవంశమ్=ప్రాచీనవంశ మనెడి యజ్ఞశాలను, కరోతి=చేయవలెను (నిర్మించవలెను). దేవమనుష్యాః=దేవతలు, మనుష్యులు, దిశః=దిక్కులను, వ్యభజన్త=విభజించిరి. దేవాః=దేవతలు, ప్రాచీనమ్=తూర్పుదిక్కును, పితరః=పితృదేవతలు, దక్షిణామ్=దక్షిణ దిక్కును, మనుష్యాః=మనుష్యులు, ప్రతీచీమ్=పశ్చిమ దిక్కును, రుద్రాః=రుద్రులు, ఉదీచీమ్=ఉత్తర దిక్కును, వ్యభజన్త=విభజించిరి. ప్రాచీనవంశమ్=ప్రాచీనవంశ మనెడి యజ్ఞశాలను, కరోతి యత్=నిర్మాణము చేయుచున్నచో, తత్=అప్పుడు, యజమానః=యజమానుఁడు, దేవలోకమేవ=దేవలోకమును గూర్చియే, ఉపావర్తతే=వచ్చుచున్నాఁడు.

తాత్పర్యము : సోమయాగము నిమిత్తము ప్రాచీనవంశ మనెడి యాగశాలను నిర్మించవలెను. దేవతలు తూర్పు దిక్కును, పితృదేవతలు దక్షిణ దిక్కును, మనుష్యులు పశ్చిమ దిక్కును, రుద్రులు ఉత్తర దిక్కును అని యీ విధముగ దేవతలు, మనుష్యులు యజ్ఞశాలకు దిక్కులను విభజించిరి. ప్రాచీనవంశ మనెడి యజ్ఞశాలను నిర్మించినచో యజమానుఁడు ఆ యజ్ఞశాలను దేవలోకమునుగానే భావించి అందు ప్రవేశించవలెను. [యజ్ఞదీక్షాంగమైన క్షురకర్మకు పూర్వమే యజ్ఞశాలా నిర్మాణము విహిత మైనది. యజ్ఞశాల ప్రాచీనవంశముగా నుండవలెను. అనఁగా ప్రాగగ్రములుగ వెదుళ్ళనుంచి శాలాగ్రభాగమును విశాలమైనదిగ నుండునట్లు నిర్మించవలెను. కావున ఈ శాలకు ప్రాచీనవంశ మనెడి నామ మేర్పడినది.]

2. అర్థము : పరిశ్రయతి=యజ్ఞశాలకు ఆవరణమును నిర్మించవలెను. దేవలోకః=దేవలోకము, మనుష్య లోకాత్=మనుష్య లోకముకంటె, అన్తర్హితః హి=లోపల నుండునట్టిది కదా!

తాత్పర్యము : దేవలోకము మనుష్యుల కదృశ్యమై యుండును. కావున దేవలోకమువంటి ప్రాచీనవంశ మనెడి యజ్ఞ శాల ఇతర మనుష్యులకు కనుపించని విధముగా ఆవరణమును (గోడలను) నిర్మించవలెను. (ఇచట కుడ్య నిర్మాణము విహిత మైనది. కుడ్యము=గోడ).

3. అర్థము : అముష్మిన్ లోకే=స్వర్గ లోకమునందు, (సుఖమ్=సుఖము), అస్తి యది వా=ఉన్నదా? న వా=లేదా? ఇతి=అని, కః=ఏ పురుషుఁడు, వేద హి=తెలిసి కొనెనఁట! తత్=ఆ కారణమువలన, అస్మాత్ లోకాత్=ఈ భూలోకమునుండి, న స్వేతవ్యమివ=సంపూర్ణముగ నిర్గమించరానివిధముగ, (అస్తి=ఉన్నది) ఇతి=అని, ఆహుః=కొంద ఱభిజ్ఞులు చెప్పుచున్నారు. తత్=ఆ కారణమువలన, ఉభయోః లోకయోః=రెండు లోకముల యొక్క, అభిజిత్యై=జయము కొఱకు, దిక్షు=యజ్ఞశాలకు నాలుగు దిక్కులందు, అతీకాశాన్=ద్వార ములను, కరోతి=నిర్మాణము చేయవలెను.

తాత్పర్యము : ఇహ లోకమునందు గృహ క్షేత్ర పుత్ర మిత్రాదులవలన సుఖము కలుగుచున్నదను విషయము ప్రత్యక్ష సిద్ధము. స్వర్గమునం దైనచో ఆ సుఖము సందిగ్ధము. ఈ యజ్ఞకర్మ నిర్విఘ్నముగ సమాప్తమైనచో, అప్పుడు స్వర్గమునందు సుఖము లభించును. నిర్విఘ్నముగ సమాప్తము కానిచో స్వర్గసుఖము లభించదు. నిర్విఘ్న ముగ యజ్ఞము సమాప్త మైనను ఆ స్వర్గసుఖము మరణానంతరము లభించును. కాని యిప్పుడు కలుగదు. అయినను ఏదియేని ఒక ప్రబల ప్రతిబంధకము సంభవించినచో స్వర్గప్రాప్తి యింకను ఆలస్యమగును. కావున ఇప్పుడే సంపూర్ణముగ ఈ లోకమునుండి నిర్గమించరాదని కొంద ఱభిజ్ఞులు చెప్పుచున్నారు. అందువలన ఉభయ లోకముల విజయమునకై యజ్ఞశాలకు నాలుగు దిక్కులందు ద్వారములను నిర్మించవలెను. ఈ మంత్రము ద్వార విధాయకము.

4. అర్థము : కేశశ్మశ్రు=కేశములను, మీసములను, వపతే=వపనము చేయవలెను. నఖాని=గోళ్లను, నికృన్తతే=ఖండించవ లెను. కేశశ్మశ్రు యత్=కేశములు మీసములు అనునది యేది కలదో, ఏషా=ఇది, అమేధ్యా=అపవిత్రమైన, మృతా త్వక్ వై= మరణించిన శరీరమే. (అతః=ఈ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) అమేధ్యామ్=అపవిత్రమైన, మృతాం త్వచమేవ=మరణించిన శరీరమునే, అపహత్య=పోఁగొట్టి, యజ్ఞియః భూత్వా=యజ్ఞార్హుఁడై, మేధమ్=యజ్ఞమును, ఉపైతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము : సోమయాగకర్తకు కేశములను మీసములను వపనము చేయవలెను. కేశములు, మీసములు అనునవి అపవిత్రమైన మృతశరీరభాగమే. కావున యజమానుఁడు అపవిత్రమైన కేశశ్మశ్రురూప మృతశరీర భాగమును, పోఁగొట్టి, యజ్ఞార్హుఁడై యజ్ఞమును పొందవలెను. [యాగదీక్షాంగముగా సోమయాగకర్త కిచట వపనకరణప ద్ధతి విధించఁబడినది.]

5. అర్థము : అఙ్గిరసః=మహర్షులు, సువర్గం లోకమ్=స్వర్గలోకమును గూర్చి, యన్తః=వెళ్లుచున్నవారై, అప్సు=ఉదకము లయందు, దీక్షాతపసీ=దీక్షను, తపస్సును, ప్రావేశయన్=ప్రవేశపెట్టిరి. (తత్=ఆ కారణముచేలన, యజమానః=యజమానుఁడు,) అప్సు=ఉదకములయందు, స్నాతి=స్నానము చేయవలెను. [తదా=అప్పుడు, అయమ్=ఈ స్నానము చేసిన యజమానుఁడు,] సాక్షాదేవ=ప్రత్యక్షముగానే, దీక్షా తపసీ=దీక్షా తపస్సులను, అవరున్ధే=పొందినవాఁడగుచున్నాడు.

తాత్పర్యము : పూర్వము మహర్షులు యాగము చేసి తత్ఫలితముగ స్వర్గమునకు పోవుచు తాము యజ్ఞసమయమున వహించిన దీక్షాతపస్సుల నుదకములందు ఉంచిపోయిరి. కావున వపనానంతరము ఉదకములందు స్నానము చేసిన యజమానుఁడా దీక్షా తపస్సులను సాక్షాత్తుగానే పొందినవాఁ డగును. [ముండనాది సంస్కారము దీక్షయనియు, ఆహారాది నియమము తపస్సనియు అర్థము. ఇచట దీక్షాంగమైన వపనసంస్కారము విహితమైనది.]

6. అర్థము : తీర్థే=తీర్థమునందు, స్నాతి=స్నానము చేయవలెను. తే=ఆ మహర్షులు, తామ్=ఆ దీక్షను, తీర్థే=తీర్థము నందు, ప్రావేశయన్ హి=ప్రవేశపెట్టిరి కదా!

తాత్పర్యము : ఆ మహర్షులు ఆ దీక్షను పవిత్ర జలమునందే ప్రవేశపెట్టిరి. కావున వపనసంస్కారము చేయించుకొనిన యజమానుఁడు పవిత్రజలమునందు స్నానము చేయవలెను.

7. అర్థము : తీర్థే=పవిత్ర జలమునందు, స్నాతి=(యజ్ఞకర్త) స్నానము చేయవలెను. సమానానామ్=మిత్రులు మొదలగు సమానులలో (అయమ్=ఈ తీర్థ స్నానము చేసిన యజమానుఁడు) తీర్థమేవ=తీర్థము వలెనే, భవతి=సేవింపఁదగిన వాఁడగుచున్నాడు.

తాత్పర్యము : తీర్థమునందు యజ్ఞకర్త స్నానము చేయవలెను. ఆ యజమానుఁడు మిత్రాదులైన సమానులలో తీర్థము వలె సేవింపఁదగినవాఁ డగును. (6వ మంత్రమున చెప్పబడిన యర్థమే యిచట అనువదింపఁబడి ప్రశంసింపఁబడినది.)

8. అర్థము : అపః=ఉదకములను, అశ్నాతి=ఆచమించవలెను. ( తదా=అప్పుడు, అయమ్=ఆచమనము చేసిన యీ యజమానుఁడు) అన్తరతః=అంతరంగమునందు, మేధ్యః=పవిత్రుఁడు, భవత్యేవ= నిశ్చయముగ నగుచున్నాఁడు.

తాత్పర్యము : స్నానానంతరము యజ్ఞకర్త ఉదకముల నాచమించవలెను.

9. అర్థము : వాససా=వస్త్రముచేత, దీక్షయతి=యజమానుని (స్నానానంతరము) దీక్షింపఁజేయవలెను. క్షౌమమ్=తెల్లని వస్త్రము, సౌమ్యం వై=సోమదేవతాకమే. యః=ఏ యజ్ఞకర్త, దీక్షతే=దీక్షను వహించుచున్నాఁడో, ఏషః= ఈ యజ్ఞకర్త, దేవతయా=దేవతా భావనచేత, సోమం దేవతామ్=సోమ దేవతను, ఉపైతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము : యజ్ఞకర్తను వపన సంస్కారానంతరము స్నానము చేసిన పిమ్మట వస్త్రముచే దీక్షింపఁజేయవలెను. క్షౌమ వస్త్రమునకు సోముఁడభిమాని యగుటచే, క్షౌమ వస్త్ర దీక్షితుఁడైన యజ్ఞకర్త సోమదేవతను పొందును. ఇచట యజ్ఞకర్తకు క్షౌమ వస్త్రధారణము దీక్షాంగముగ విహితమైనది. (దీక్షయతి=సంస్కరోతి. యజ్ఞకర్త వస్త్రధారణము సంస్కారరూపము.)

10. అర్థము : "సోమస్య తనూ రసి తనువం మే పాహి" ఇతి ఆహ="ఓ వస్త్రమా! నీవు సోమదేవునకు శరీర మగుచున్నావు. కావున నా శరీరమును రక్షించుము" అను నర్థమును "సోమస్య తనూః" అను మంత్రము చెప్పినది. (అయమ్=క్షౌమవస్త్రధారణము చేసిన ఈ యజ్ఞకర్త), స్వాం దేవతామేవ=స్వీయ సోమదేవతనే, ఉపైతి= పొందుచున్నాఁడు. అథో=మఱియు, ఏతామ్=దీనిని, ఆశిషమేవ=ఆశీస్సుగానే, ఆశాస్తే=కోరుచున్నాఁడు.

తాత్పర్యము : "సోమస్య తనూరసి" ఇత్యాది మంత్రము ప్రథమ కాండము ప్రథమ ప్రపాఠకము, ద్వితీయానువాకమునందు చెప్పఁబడినది. ఆ మంత్ర మచటనే వ్యాఖ్యాత మైనది. తన్మంత్రోక్తవిధముగ యజ్ఞదీక్షాంగముగ క్షౌమ వస్త్రధారణము చేసిన యజ్ఞకర్త క్షౌమ వస్త్రాభిమానియైన సోమదేవతనే పొందును. మఱియు నతఁడు

ఈ యర్థమును ఆశీస్సుగానే భావించుచున్నాఁడు. [ఏతద్వస్త్ర పరిహితుఁడైన యజ్ఞకర్తకు సోముఁడే స్వీయదేవత.]

11. అర్థము: తూషాధానమ్=(వస్త్రము నేయుటకు సాధనమైన ఒక విధమైన కొయ్య (నాడె) ను ఉపయోగించి) తంతువులను పూరించుట, అగ్నేః=అగ్నికి, ( ప్రియమ్=ఇష్టమైనది.) వాతపానమ్=అర్థ్రిము అయిన దారములను గాలిచేత ఆఱునట్లు చేయుట, వాయోః=వాయుదేవునకు, ప్రియమ్=ఇష్టమైనది. నీవిః=(ఆ దారములకు సంబంధించిన) బంధ విశేషము, పితృణామ్=పితృదేవతలకు, ప్రియమ్= ఇష్టమైనది. ప్రఘాతః=దండముచే కొట్టుట, ఓషధీనామ్=ఓషధి దేవతలకు, ప్రియమ్=ఇష్టమైనది. ప్రాచీనతానః=దీర్ఘ తంతు ప్రసారణము, ఆదిత్యానామ్=ఆదిత్య దేవతలకు, ప్రియమ్=ఇష్టమైనది. ఓతుః=తిర్యక్తంతు ప్రసారణము, విశ్వేషాం దేవానామ్=విశ్వేదేవ దేవతలకు, ప్రియమ్=ఇష్టమైనది. అతికాశాః= ఛిద్రములు, నక్షత్రాణామ్=నక్షత్ర దేవతలకు, ప్రియమ్=ఇష్టమైనది. తద్వై=ఆ కారణము వలననే, వాసః యత్=వస్త్రమేది కలదో, ఏతత్=ఇది, సర్వదేవత్యమ్=సర్వదేవ దేవతాకము. వాససా=వస్త్రముచేత, దీక్షయతి యత్=యజమానుని దీక్షితుని గాఁ జేయుచున్నచో, ఏనమ్=ఈ యజమానుని, సర్వాభిః దేవతాభిః ఏవ=సర్వదేవతల చేతనే, దీక్షయతి=దీక్షావంతుని చేసినవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: తూషాధానాదులకు అగ్న్యాది దేవతలభిమాని దేవతలు. తూషాధానాది ప్రక్రియల వలన వస్త్రము ఏర్పడుచున్నది. కావున వస్త్రము సర్వదేవతాకమైనది. అధ్వర్యుఁడు యజ్ఞకర్తను అట్టి సర్వదేవతాక వస్త్రముచే దీక్షింపఁ జేసినచో, సర్వదేవతల చేతనే యజమానుని దీక్షింపఁ జేసిన వాఁ డగును. వస్త్రముచే యజ్ఞకర్తను దీక్షింపఁ జేయుట ఇచట ప్రకారాంతరముగ ప్రశంసింపఁబడినది.

12. అర్థము: మనుష్యః=మనుష్యుఁడు, బహిఃప్రాణః వై= బహిఃప్రాణ స్వరూపుఁడే. తస్య=అతనికి, అశనమ్=భోజనము, ప్రాణః= ప్రాణము (ప్రాణము వంటిది). అశ్నాతి=భుజించవలెను. (తదా=అప్పుడు), సప్రాణః ఏవ=ప్రాణ సహితుఁడేయై, దీక్షతే=దీక్షితుఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: మనుష్యుఁడు బహిఃప్రాణ స్వరూపుఁడే. అతనికి భోజనము ప్రాణస్థితి హేతు వగుటచే ప్రాణము వంటిది. కావున యజమానుఁడు భోజనము చేయవలెను. అప్పుడతఁడు ప్రాణ సహితుఁడే అయి దీక్షను గైకొన్నవాఁ డగును.

13. అర్థము: (యజమానః=యజ్ఞకర్త,) ఆశితః భవతి= భుజించినవాఁడై యుండవలెను. అస్య=ఈ యజమానునియొక్క, ప్రాణః= ప్రాణము, యావానేవ=ఎంతటిదై యున్నదో, తేన సహ=ఆ ప్రాణముతోఁ గూడ, మేధమ్=యజ్ఞమును, ఉపైతి=పొందుచున్నాఁడు.

14. అర్థము: ఘృతమ్=ఆజ్యము, దేవానామ్=దేవతలకు, మస్తు=పెరుఁగుమీఁది మీఁగడ, పితృణామ్= పితృదేవతలకు, నిష్పక్వమ్=పక్వము కాని (కాచఁబడని) నవనీతము, మనుష్యాణామ్=మనుష్యులకు, (అభిమతమ్=ఇష్టమైనది). తత్ వై=ఆ కారణము వలననే, నవనీతం యత్=వెన్న యనునది యేది కలదో, ఏతత్=ఈ వెన్న, సర్వదేవత్యమ్=సర్వదేవదేవతాక మైనది. నవనీతేన=వెన్నతో, అభ్యఙ్క్తే యత్=అభ్యంగము చేసికొనినచో, అయమ్=ఈ అభ్యంగము చేసికొనిన యజ్ఞకర్త, సర్వాః దేవతాః ఏవ=సర్వ దేవతలనే, ప్రీణాతి=సంతోషపఱచుచున్నవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: దేవతలకు ఆజ్యము, పితృదేవతలకు పెరుఁగుమీఁది మీఁగడ, మనుష్యులకు వెన్న, అభీష్టము లయిన పదార్థములు. కావున నవనీతము సర్వదేవదేవతాక మగుచున్నది. యజ్ఞదీక్షితుఁ డైన యజమానుఁడు వెన్నను తలపైని అంటుకొనినచో సర్వదేవతలను సంతృప్తి పఱచిన వాఁ డగును. ఆజ్యము, మీఁగడ, అనునవి నవనీతముయొక్క అవస్థా విశేషములే. [నవనీతమునకు పక్వము, కించిత్పక్వము, నిష్పక్వము, అని పాక

జన్యము లయిన అవస్థలు మూఁడు అని నిర్ణయింపఁబడినది. వెన్నను కాఁచిన తరువాత 'తమలపాకు' మొదలగు ద్రవ్యాంతరములను ఆ కాగిన దానియందు ఉంచినచో ఆ నేయి పరిమళవంతమగును. అట్టి యాజ్యము సురభి యనియు, నిశ్శేష పక్వమనియు వ్యవహరింపఁ బడును. ఇది నవనీతాభ్యంగ విధి.]

15. అర్థము: యః=ఏ యజ్ఞకర్త, దీక్షతే=యజ్ఞదీక్షను వహించుచున్నాఁడో, ఏషః=ఈ దీక్షితుఁడైన యజ్ఞకర్త, అస్మాత్ లోకాత్=ఈ లోకమునుండి, ప్రచ్యుతః వై=జారి పోయినవాఁడే. దేవలోకమ్=స్వర్గలోకమును, అగతః=పొంద నివాఁడు. నవనీతమ్ (అపి)=నవనీతము కూడ, అన్తరేవ= అంతరాలమునందున్నటువంటిదియే. తస్మాత్=ఆ కారణమువలన, నవనీతేన=వెన్నతో (అయమ్=ఈ యజ్ఞదీక్షితుఁడు), అభ్యఙ్క్తే=తల అంటుకొనవలెను.

తాత్పర్యము: స్వర్గమును పొందవలెననెడి కోరిక కలవాఁడు యజ్ఞము చేయఁబోవుచు యజ్ఞ దీక్షను వహించును. ఆ దశయం దతఁడు స్వర్గమును పొందుటకై యజ్ఞమును ప్రారంభించెను. కావున భూలోకమును విడిచిన వాఁడగును. ఆ దశలో యజ్ఞము సంపూర్ణము కాలేదు. కనుక, స్వర్గమును పొందలేదు. అనఁగా యజ్ఞదీక్షా దశలో యజ్ఞకర్త పృథివీ స్వర్గముల మధ్యమున ఉన్నట్లు అర్థమగుచున్నది. వెన్నకూడ పాలనుండి ఒక దశ మారినది. ఆజ్యముగా పక్వము కాలేదు. కావున నవనీతము క్షీరమునకు, ఆజ్యమునకు అంతరాలమున (మధ్యస్థితియందు) ఉండుటచే యజ్ఞదీక్షితునకు నవనీతమునకు సామ్యమేర్పడినది. ఆ సామ్యముచే యజ్ఞకర్త దీక్షను వహించిన అనంతరము నవనీతమును తలపైని అంటుకొనవలెను. (ఇచట నవనీతాభ్యంగము ప్రకారాంతరముగ ప్రశంసింపఁబడినది.)

16. అర్థము: వ్యావృత్త్యై=లోకాచార వ్యావృత్తికొఱకు, అనులోమమ్=ఆరోహణ క్రమముగా, యజుషా=మంత్రముచే, అభ్యఙ్క్తే= నవనీతాభ్యంగము చేసికొనవలెను.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు లోకాచారము కంటె భిన్నముగ నవనీతమును అనులోమముగ మంత్రోచ్చారణ సహితముగ అభ్యంగము చేసికొనవలెను. ( లోకమునందు మనుజులకు అనులోమ్యమునందు నియమము లేదు. నవనీతాభ్యంగమునందు మంత్ర వినియోగము లేదు. యజ్ఞదీక్షితునకు ఆ రెండు నియమములు కలవు. కావున ఇచట లోకాచార వ్యావృత్తి కలుగుచున్నది.]

17. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రమ్=వృత్రాసురుని, అహన్=సంహరించెను. తస్య=ఆ వృత్రునియొక్క, కనీనికా=కంటి నల్లగ్రుడ్డు, పరాపతత్=పడెను. తత్=ఆ నల్లగ్రుడ్డు, ఆఞ్జనమ్=కాటుక, అభవత్=ఆయెను. ఆఙ్క్తే యత్=(యజ్ఞకర్త) కాటుకను కంటియందు పెట్టుకొనినచో, (సః=ఆ యజ్ఞకర్త,) భ్రాతృవ్యస్య=శత్రువు యొక్క, చక్షురేవ=చక్షుస్సునే, వృఙ్క్తే=నశింపఁజేయుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వమింద్రుఁడు వృత్రాసురుని సంహరింపఁగా ఆ వృత్రుని కంటి నల్లగ్రుడ్డు క్రింద పడెను. అది కాటుకయ్యెను. యజ్ఞదీక్షితుఁడు కాటుకను కంటికి పెట్టుకొనినచో, అతఁడు శత్రువుయొక్క చక్షుస్సునే నశింపఁజేయును. ["వృత్రస్య కనీనికాసి" అనెడి ప్రథమ కాండము ద్వితీయ ప్రపాఠకమునందలి మంత్రము యొక్క అర్థమును వివరించుచు ఇచట వేదము యజ్ఞదీక్షితునకు అంజనమును విధించినది.]

18. అర్థము: (యజ్ఞదీక్షితః=యజ్ఞదీక్షను స్వీకరించిన యజ్ఞకర్త,) పూర్వమ్=ప్రథమమున, దక్షిణమ్=కుడికంటిని, ఆఙ్క్తే=కాటుకతో పూయవలెను. మనుష్యాః=(లోకమునందు) మనుష్య స్త్రీలు, పూర్వమ్=ప్రథమమున, సవ్యమ్=ఎడమ కంటిని, అఞ్జతే హి=కాటుకను పూయుచున్నారు కదా. న ని విధావతే=యజ్ఞదీక్షితుఁడు నిధావనము చేయరాదు. మనుష్యాః =మనుష్యస్త్రీలు, నీవధావన్తే హి=నిధావనము చేయుచున్నారు కదా! పఞ్చకృత్వః =అయిదు పర్యాయములు, ఆఙ్క్తే=కాటుకను పెట్టవలెను. పఙ్క్తిః=పంక్తి ఛందస్సు, పఞ్చాక్షరా=అయిదక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=నవనీయ పురోడాశాది ద్రవ్యములు పంచ సంఖ్యాకము లగుటచేత, పంచత్వ సంఖ్య కలది. (తదా=అప్పుడు, యజ్ఞదీక్షితః=యజ్ఞదీక్షితుఁడు)

యజ్ఞమ్=యజ్ఞమును, (యజ్ఞఫలమును,) అవరున్ద్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు. పరిమితమ్=(కాటుకను) పరిమితముగా, అఙ్క్త్యే=(కంటికి) పెట్టవలెను. మనుష్యాః=మనుష్య స్త్రీలు, అపరిమితమ్=పరిమితి లేకుండగ, అఙ్క్తే హి =కంటికి కాటుకను పెట్టుచున్నారు కదా! సతూలయా=అగ్రసహితమైన కుంచెవంటి సాధనముచే, అఙ్క్త్యే=కాటుకను పెట్టవలెను. అపతూలయా=కుంచెలేని హస్తాంగులివంటి సాధనముచే, మనుష్యాః=మనుష్య స్త్రీలు, అఙ్క్తే హి =కాటుకను పెట్టుకొనుచున్నారు కదా! వ్యావృత్త్యై=ఈ అంజన నియమము లోకాచార వ్యావృత్తి కొఱకు, భవతి=అగుచున్నది. (నిధావనము=కాటుక కల వ్రేలిని కంటియందు శీఘ్రముగ అటునిటు త్రిప్పుట.)

తాత్పర్యము: లోకమునందు మనుష్య స్త్రీలు ప్రథమమున ఎడమ కంటికి అంగులితో కాటుకను పెట్టుకొందురు. ఆ సమయమున వారు అంగులిని కంటియందు శీఘ్రముగ అటునిటు త్రిప్పుదురు. కాటుకను పెట్టుకొనుటయందు వారికి సంఖ్యా నియమము లేదు. సాధనము నుపయోగించకుండ అంగులితోనే కాటుకను అపరిమితముగ పెట్టుకొందురు. ఆ సాంఘికాచారమును అతిక్రమించి యజ్ఞదీక్షితునకు కాటుకను పెట్టుటలో కొన్ని నియమములు విధించఁబడినవి. ప్రథమమున యజ్ఞదీక్షితునకు కుడికంటికి కొనలు కల కుంచెతో కాటుకను అయిదు పర్యాయములు పెట్టవలెను. అది పరిమితముగ నుండవలెను. నిధావనము చేయరాదు. అప్పుడా యజ్ఞకర్త యజ్ఞఫలమును పొందును. (ఈ విషయము పంచమ ప్రపాఠకమునందు "బ్రహ్మవాదినో వదన్తి" అను మంత్రమునందు కూడ వివరింపఁబడును.)

19. అర్థము: అపతూలయా=కొనలు లేని కుంచెవంటి సాధన విశేషముచే, అఙ్క్తే యత్=కాటుకను పెట్టినచో, వజ్రః ఇవ=వజ్రమువలె, స్యాత్=అగును. మిత్రత్వాయ=మిత్రత్వము కొఱకు, సతూలయా=కొనతో గూడిన ఇషీక (కుంచె)చే, అఙ్క్త్యే=కాటుకను పెట్టవలెను.

తాత్పర్యము: అగ్ర రహిత సాధన విశేషము చేత కాటుకను పెట్టినచో, ఆ సాధనము వజ్రమువంటిదగును. మిత్రత్వము నకై అగ్రసహిత శరేషికచేత కాటుకను పెట్టవలెను. (సతూల శరేషిక=కొన గల దర్భవిశేషము. కొనలేని దర్భ వజ్రము వలె కఠినముగ నుండునని భావము).

20. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రమ్=వృత్రాసురుని, అహన్=సంహరించెను. సః=ఆ వృత్రుఁడు, అపః అభి=ఉదకముల కభిముఖముగ, అమ్రియత=మరణించెను. తాసామ్=ఆ ఉదకములకు, మేధ్యమ్= శుద్ధమైనదియు, యజ్ఞియమ్=యజ్ఞార్హమైనదియు, సదేవమ్=దేవతా ప్రియమునునైన, యత్(అస్తి)=ఏది కలదో, తే దర్భాః=అవి దర్భలుగా, అభవన్= అయినవి. దర్భపుఞ్జీలైః=దర్భల సముదాయములచేత, పవయతి యత్=పవిత్రము చేసినచో, మేధ్యాః=శుద్ధములును, యజ్ఞియాః=యజ్ఞార్హములును, సదేవాః= దేవతా ప్రియములునైన, యాః ఆపః=ఏ యుదకములు, (సన్తి=కలవో,) తాభిరేవ =ఆ ఉదకములచేతనే, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్ ఈ యజ్ఞ దీక్షితుని, పవయతి=పవిత్రునిఁ జేయుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వమింద్రుఁడు వృత్రాసురుని సంహరింపఁగా, నతఁడు ఉదకములకు అభిముఖముగ మరణించెను. ఆ యుదకములకు సంబంధియైన శుద్ధమును, యజ్ఞార్హమును దేవతా ప్రియమునైన అంశము తొలఁగి పోయి దర్భలుగా ఆయెను. కావున అధ్వర్యుఁడు, యజ్ఞదీక్షితుని దర్భల సముదాయములచే మార్జనము చేసినచో, శుద్ధములు, యజ్ఞార్హములు, దేవతా ప్రియములునైన ఆ యుదకములచేతనే యీ యజ్ఞదీక్షితుని మార్జనము చేసిన వాఁడగును. (ఇచట దర్భ స్తోమముచే మార్జనము విధింపఁబడినది.)

21. అర్థము: ద్వాభ్యామ్=రెండు దర్భల చేత, పవయతి=(యజ్ఞదీక్షితుని,) మార్జనము చేయవలెను. (తదా=అప్పుడు అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజ్ఞదీక్షితుని, అహోరాత్రాభ్యామేవ=అహో రాత్రములచేతనే, పవ

యతి=మార్జనము చేసినవాఁడగుచున్నాఁడు. త్రిభిః=మూఁడు దర్భలచేత, పవయతి=మార్జనము చేయవలెను. ఇమే లోకాః=ఈ లోకములు, త్రయః=త్రి సంఖ్యాకములు. (తత్=ఆ కారణము వలన,) ఏభిః లోకైః ఏవ=ఈ లోకములచేతనే, ఏనమ్=ఈ యజ్ఞదీక్షితుని, పవయతి=మార్జనము చేసినవాఁడగు చున్నాఁడు. పఞ్చభిః=అయిదు దర్భలచేత, పవయతి=మార్జనము చేయవలెను. పఙ్క్తిః=పంక్తి ఛ్ఛందస్సు, పఞ్చాక్షరా=అయిదక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పవనీయ పురోడాశములచే పంచత్వసంఖ్యకలది. (తదా=అప్పుడు,) యజ్ఞామైవ=యజ్ఞము కొఱకే, ఏనమ్=ఈ యజ్ఞదీక్షితుని, పవయతి=మార్జనము చేసినవాఁడగుచున్నాడు. షడ్భిః=ఆఱు దర్భలచేత, పవయతి=మార్జనము చేయవలెను. ఋతవః=ఋతువులు, షట్ వై=ఆఱే. (తత్=ఆ కారణమువలన,) ఋతుభిః ఏవ=ఋతువుల చేతనే, ఏనమ్=ఇతనిని, పవయతి=మార్జనము చేసిన వాడఁడగు చున్నాఁడు. సప్తభిః=ఏడు దర్భలచే, పవయతి=మార్జనము చేయవలెను. ఛన్దాంసి=గాయత్ర్యాది ఛ్ఛందస్సులు, సప్త=ఆఱు నొకటి. తత్=ఆ కారణము వలన, ఛన్దోభిః ఏవ=ఛందస్సులచేతనే, ఏనమ్=ఈ యజ్ఞకర్తను, పవయతి=మార్జనము చేసిన వాఁడగు చున్నాఁడు. నవభిః=తొమ్మిది దర్భల చేత పవయతి=మార్జనము చేయవ లెను. పురుషే= పురుషునియందు, ప్రాణాః=ప్రాణములు, నవ వై=తొమ్మిదికదా! (తదా= అప్పుడు,) సప్రాణ మేవ ఏనమ్=ప్రాణ సహితుఁడేయైన ఈ యజమానుని, పవయతి=మార్జనము చేసిన వాఁడగుచున్నాఁడు. ఏకవింశత్యా=ఇరువదియొక్క దర్భలచేత, పవయతి=మార్జనము చేయవలెను. హస్త్యాః=హస్తముల సంబం ధములయిన, అఙ్గులయః=వ్రేళ్లు, దశ=పది. పద్యాః=పాదముల సంబంధములయిన, అంగుళులు, దశ=పది. ఆత్మా=ఆత్మయు, ఏకవింశః= మొత్తము ఇరువది యొకటి. పురుషః=పురుషుడు, యావానేవ=ఎంతటి పరిమితి కలవాఁడో, తమ్=ఆసర్వపురుషుని, (యజ్ఞకర్తను,) అపరివర్గమ్= నిశ్శేషముగ, పవయతి=మార్జనము చేసిన వాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడైన యజమానుని ఇరువదియొక్క దర్భల సముదాయముచేత మార్జనము చేయవలెను. పూర్వ పక్షముగా ప్రథమమున రెండు దర్భలచేతను, మూఁడు దర్భల చేతను మార్జనము చేయవలెను. ఈ విధముగ పంచ, షట్, సప్త, నవ దర్భలచేత మార్జనము చేయవలెనని చెప్పఁబడినది. తత్తత్సంఖ్యోపేత ములయిన దర్భలచే మార్జనము చేయుటచే కలుగునట్టి ప్రయోజనములు అర్థమునందు వివరింపఁబడినవి. ఇరువదియొక్క దర్భలచే మార్జనము చేయవలెననుట సిద్ధాంత పక్షము. మానవునకు హస్తాంగుళులు దశ సంఖ్యాకములు. పాదాంగుళులు దశ సంఖ్యాకములు. ఆత్మ ఒకటి పురుషుఁడు ఏకవింశతి సంఖ్యాత్వము కలవాఁడు. కావున ఏకవింశతి దర్భలచే శరేషికను మార్జనము చేసినచో సంపూర్ణ పురుషుని మార్జనము చేసినట్లగునని సారాంశము. (ఇచట దర్భస్తోమముయొక్క సంఖ్యా విశేషములు విహితములయినవి.)

22. అర్థము: "చిత్పతి స్త్వా పునాతు" ఇతి ఆహ='ఓ యజమానుఁడా!, జ్ఞానములకు పతియైన మనస్సు నిన్ను పవిత్రుని చేయుఁగాక' అని "చిత్పతిస్త్వా" ఇత్యాది మంత్రము చెప్పినది. మనః వై=మనస్సే, చిత్పతిః=చిత్పతి. (చితాం జ్ఞానానాం పతిః మనః చిత్పతిః). మనసైవ=మనస్సుచేతనే, ఏనమ్=ఈ యజ్ఞదీక్షితుని పవ యతి=(అధ్వర్యుఁడు) పవిత్రుని చేయుచున్నాఁడు. "వాక్పతి స్త్వా పునాతు" ఇతి ఆహ=వాక్కులకు (శబ్దము లకు) పతియైన సరస్వతి నిన్ను పవిత్రుని జేయుఁగాక, అని "వాక్పతి స్త్వా" ఇత్యాది మంత్రము చెప్పినది. వాచైవ= వాక్కు చేతనే (అధ్వర్యు=అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజ్ఞపతిని, పవయతి=పవిత్రుని చేయు చున్నాఁడు. "దేవ స్త్వా సవితా పునాతు" ఇతి ఆహ=సవితృదేవుఁడు నిన్ను పవిత్రుని జేయుఁగాక అని "దేవస్త్వా" ఇత్యాది మంత్రము చెప్పినది. సవితృ ప్రసూతః ఏవ=సూర్యునిచే ప్రేరితుఁడే అయి, ఏనమ్=ఈ యజ్ఞకర్తను, పవయతి=పవిత్రునిఁజేయుచున్నాఁడు.

తాత్పర్యము: ప్రథమ కాండము ద్వితీయ ప్రపాఠకము ప్రథమానువాకము నందలి "చిత్పతి స్త్వా పునాతు వాక్పతి స్త్వా పునాతు దేవస్త్వా సవితా పునాతు" అను మంత్రము ఇచట వివరింపఁబడినది. ఇది మార్జనము చేయునపుడు పఠించవలసిన మంత్రము. ఓ యజమానుఁడా! చిత్పతి, వాక్పతి, సవితృ దేవుఁడు, (ఛిద్ర రహిత పవిత్రము చేత) నిన్ను పవిత్రుని చేయుదురు గాక అని యీ మంత్రమున కర్థము.

23. అర్థము: హే పవిత్రపతే!=ఆదిత్య రూపమైన ఛిద్రరహిత పవిత్రమునకు పతివైన (ప్రేరకుఁడవైన,) అంతర్యామీ! తస్య= అటువంటి తే=నీయొక్క పవిత్రేణ=పవిత్రముచేత, యస్మై=ఏ అగ్నిష్టోమ కర్మ కొఱకు, కమ్=ఆత్మను, పునే=శోధన చేసికొనుచున్నానో, తత్=ఆ అగ్నిష్టోమ కర్మను, (కర్తుమ్=చేయుటకై), శకేయమ్=సమర్థుఁడనగుదును, ఇతి= అని ఆహ="తస్య తే పవిత్రపతే" ఇత్యాది పూర్వోక్త మంత్రము చెప్పినది. ఏతామ్= దీనిని (ఈ మంత్రార్థమును,) ఆశిషమేవ=ఆశీస్సుగానే, ఆశాస్తే=(యజమానుఁడు,) కోరుచున్నాఁడు.

తాత్పర్యము: "తస్య తే పవిత్రపతే" ఇత్యాదికము "చిత్పతి స్త్వా" ఇత్యాది మంత్రమునకు శేషభాగము. ఛిద్రములు లేని దర్భ స్తోమము (పవిత్రము) ఆదిత్య రూపము. ఆ పవిత్రమునకు ప్రేరకుఁడు అంతర్యామి. "ఓ అంతర్యామీ! అటువంటి నీ పవిత్రము చేత ఏ అగ్నిష్టోమ కర్మకొఱకు ఆత్మను శోధన చేసికొనుచున్నానో, ఆ అగ్నిష్టోమ కర్మను చేయుటకై నేను సమర్థుఁడనగుదును." అని ఈ మంత్ర తాత్పర్యము. యజమానుఁడు ఈ మంత్రార్థమును, ఆశీస్సుగానే తలఁచుచున్నాఁడు. [అధ్వర్యుఁడు యజమానునిచేత "తస్య తే పవిత్రపతే" ఇత్యాది మంత్రపాఠమును పఠింపఁజేయవలెను.]

ప్రథమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః

మూలము: [1]యావన్తో వై దేవా యజ్ఞాయా పునత త ఏవా భవ న్య ఏవం విద్వా న్యజ్ఞాయపునీతే భవత్యేవ బహిః పవయిత్వాఽన్తః ప్ర పాదయతి మనుష్యలోక ఏవైనం పవయిత్వా పూతం దేవలోకం ప్ర ణయ [2]త్య దీక్షిత ఏకయాఽఽ హుత్యే త్యాహుః స్రువేణ చతస్రో జుహోతి దీక్షితత్వాయ స్రుచా పఞ్చమీం పఙ్క్త్యక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞమేవావ రున్ధ [3]ఆకూత్యై ప్రయుజే ఽగ్నయే (౧) స్వాహేత్యాహాఽఽ కూత్యా హి పురుషో యజ్ఞ మభి ప్రయుఙ్క్తే యజేయేతి [4]మేధాయై మనసే ఽగ్నయే స్వాహేత్యాహ మేధయా హి మనసా పురుషో యజ్ఞ మభి గచ్ఛతి స [5]రస్వత్యై పూష్ణేఽ గ్నయే స్వాహేత్యాహ వాగ్వై సరస్వతీ పృథివీ పూషా వాచైవ పృథివ్యా యజ్ఞం ప్ర యుఙ్క్తే [6]ఆపో దేవీర్బృహతీ ర్విశ్వశంభువ ఇత్యాహ యా వై వర్ష్యా స్తాః(౨) ఆపో దేవీ ర్బృహతీ ర్విశ్వ శంభువో [7]యదేతద్యజుర్న బ్రూయా ద్దివ్యా ఆపోఽ శాన్తా ఇమం లోకమా గచ్ఛేయు [8]రాపో దేవీ ర్బృహతీ ర్విశ్వ శంభువ ఇత్యాహాస్మా ఏవైనా లోకాయ శమయతి తస్మా చ్ఛాన్తా ఇమం లోకమా గచ్ఛన్తి [9]ద్యావాపృథివీ ఇత్యాహ ద్యావాపృథివ్యో ర్హి యజ్ఞ ఉర్వన్తరిక్ష మిత్యాహాన్తరిక్షే హి యజ్ఞో [10]బృహస్పతి ర్నో హవిషా వృధాతు(౩) ఇత్యాహ బ్రహ్మ వై దేవానాం బృహస్పతి ర్బ్రహ్మణైవాస్మై యజ్ఞమవ రున్ధే [11]యద్బ్రూయా ద్విధే రితి యజ్ఞస్థాణు మృచ్ఛే ద్వృధాత్విత్యాహ యజ్ఞస్థాణుమేవ పరి వృణక్తి [12]ప్రజాపతిర్యజ్ఞ మసృజత సోఽ స్మా త్సృష్టః పరాఙైత్స ప్ర యజురవ్లీనాత్ప్ర సామ తమృగుదయచ్ఛద్యదృగుదయచ్ఛ త్తదౌద్గ్రహణస్యౌద్గ్రహణత్వ [13]మృచా(౪) జుహోతి యజ్ఞస్యోద్యత్యా [14]అనుష్టుప్ఛన్దసా ముదయచ్ఛ దిత్యాహా న్తస్మా దనుష్టుభా జుహోతి యజ్ఞస్యోద్యత్యై [15]ద్వాదశ వాత్సబన్ధాన్యుదయచ్ఛ న్నిత్యాహా న్తస్మా ద్ద్వాదశభి ర్వాత్సబన్ధవిదో దీక్షయన్తి [16]సా వా ఏషర్గ నుష్టుగ్వాగ

నుష్వ గ్యదేతయర్చా దీక్షయతి వాచై వైనగ్ం సర్వయా దీక్షయతి [17]విశ్వే దేవస్య నేతు రిత్యాహ

సావిత్ర్యేతేన మర్తో వృణీత సఖ్యమ్(౫) ఇత్యాహ పిత్రుదేవత్యైతేన విశ్వే రాయ ఇషుధ్యసీత్యాహ వైశ్వ

దేవ్యేతేన ద్యుమ్నం వృణీత పుష్యస ఇత్యాహ పౌష్ణ్యేతేన సా వా ఏషర్క్సర్వదేవత్యా యదేతయర్చా

దీక్షయతి సర్వాభి రేవైనం దేవతాభి ర్దీక్షయతి [18]సప్తాక్షరం ప్రథమం పద మష్టాక్షరాణి త్రీణి

యాని త్రీణి తాన్యష్టా వుపయన్తి యాని చత్వారి తాన్యష్టౌ యదష్టాక్షరా తేన(౬) గాయత్రీ యదేకా

దశాక్షరా తేన త్రిష్టు గ్యద్ద్వాదశాక్షరా తేన జగతీ సా వా ఏషర్క్సర్వాణి ఛన్దాగ్ంసి యదేతయర్చా

దీక్షయతి సర్వేభి రేవైనం ఛన్దోభి ర్దీక్షయతి [19]సప్తాక్షరం ప్రథమం పదగ్ం సప్తపదా శక్వరీ పశవః

శక్వరీ పశూనేవావ రున్ద్ధ [20]ఏకస్మా దక్షరా దనాప్తం ప్రథమం పదం తస్మా ద్యద్వాచో౽ నాప్తం

తన్మనుష్యా ఉప జీవన్తి పూర్ణయా జుహోతి పూర్ణ ఇవ హి ప్రజాపతిః ప్రజాపతేరాప్త్యై న్యూనయా

జుహోతి న్యూనాద్ధి ప్రజాపతిః ప్రజా అసృజత ప్రజానాగ్ం సృష్ట్యై(౭)॥

(అగ్నయే తా పృథాత్వ్యచా సఖ్యం తేన జుహోతి పఞ్చదశ చ)॥

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే ద్వితీయో౽ నువాకః ॥౨॥

## వేదార్థదీపిక

అవతారిక : యజ్ఞకర్త ప్రాగ్వంశ మనెడి యజ్ఞశాలయందు ప్రవేశించుటకు ముందు అవసరమైన దీక్షాదికము ప్రథమా నువాకమునందు వివరింపఁబడినది. యజ్ఞదీక్షకు సంబంధించిన ఆహుతులు ఈ ద్వితీయానువాకమునందు చెప్పఁబడుచున్నవి. ప్రథమకాండము ద్వితీయ ప్రపాఠక గత ద్వితీయానువాకమునందలి మంత్రముల కిది వ్యాఖ్యానరూపము.

1. అర్థము : యావన్తః=ఎంతమంది, దేవాః వై=దేవతలైతే, యజ్ఞాయ=యజ్ఞము కొఱకు, అపునత=పవిత్రులుగా చేయఁబడిరో, తే ఏవ=వారే, అభవన్=ఐశ్వర్యమును పొందినవారైరి. యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, విద్వాన్=తెలిసినవాఁడై, యజ్ఞాయ=యజ్ఞము కొఱకు, పునీతే=పవిత్రుఁడగు చున్నాఁడో, సః=అతఁడు, భవత్యేవ =నిశ్చయముగ ఐశ్వర్యమును పొందుచున్నాఁడు. బహిః=వెలుపల, పవయిత్వా=పవిత్రము చేసి, అన్తః=లోపల, ప్రపాదయతి=పవిత్రతను పొందించుచున్నాఁడు. ఏనమ్=ఇతనిని, మనుష్యలోకే ఏవ=మను

ష్యలోకమునందే, పవయిత్వా=పవిత్రునిగాఁజేసి, పూతమ్=పవిత్రుఁడైన యితనిని, దేవలోకమ్=దేవలోకమును, ప్రణయతి=పొందించుచున్నాడు.

తాత్పర్యము : దేవత లందఱు యజ్ఞము కొఱకు మార్జనము వలన పవిత్రులై నిశ్చయముగ నైశ్వర్యమును పొందిరి. ఈ విధముగ తెలిసికొనిన యజ్ఞకర్త కూడ యజ్ఞము కొఱకు (మార్జనముచే) పవిత్రుఁడై, నిశ్చయముగ నైశ్వర్యమును పొందును. బాహ్యభాగమున పవిత్రునిఁ జేసి మార్జనము అంతర్భాగమున పవిత్రుని చేయుచున్నది. మార్జనము ఈ యజ్ఞకర్తను మనుష్యలోకమునందే పవిత్రునిఁ జేసి పూతుఁడైన యితనిని పిమ్మట దేవలోకమునకు పంపుచున్నది. (పూర్వము విహితమైన దర్భస్తోమ విశిష్ట మార్జన మిచట ప్రశంసింపఁబడినది.)

2. అర్థము : అదీక్షితః=దీక్షను వహించనివాఁడు, ఏకయా ఆహుత్యా=ఒక ఆహుతిచేత; (జుహోతి=హోమము చేయవలెనని), ఆహుః=అభిజ్ఞులు చెప్పచున్నారు. దీక్షితత్వాయ=దీక్షితత్వము (దీక్ష) కొఱకు, స్రువేణ=స్రువముచేత, చతస్రః=నాలుగు ఆహుతులను, స్రుచా=స్రుచముచేత, పఞ్చమీమ్=ఐదవ యాహుతిని, జుహోతి=హోమము చేయవలెను. పఙ్క్తిః=పంక్తిచ్ఛన్దస్సు, పఞ్చాక్షరా=ఐదు అక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పురోడాశాది ద్రవ్యములు ఐదు కలది కావున పాంక్తము. (పంచత్వ సంఖ్య కలది) అయమ్=ఈ హోమము చేసిన యజ్ఞదీక్షితుఁడు, యజ్ఞమ్=యజ్ఞమును, అవరున్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము : దీక్షను వహించని యజమానుఁ డొక యాహుతిని హోమము చేయవలెను. అనఁగా దీక్షను వహించుటకు ముందు ఒక ఆహుతిని హోమము చేయవలెను. దీక్షను గైకొనిన పిమ్మట యజమానుఁడు స్రువముచే నాలుగు ఆహుతులను, స్రుచముచే ఐదవ ఆహుతిని దీక్ష సిద్ధించుటకై హోమము చేయవలెను. పంక్తిచ్ఛన్దస్సు ఒక్కొక్క పాదమునందు అయిదు అక్షరములు కలది. యజ్ఞము పురోడాశాది ద్రవ్యములచే పంచత్వ సంఖ్య కలది కావున పాంక్త మగుచున్నది. ఈ విధముగ హోమము చేసిన యజ్ఞ దీక్షితుఁడు యజ్ఞఫలమును పొందును. లేదా యజ్ఞమును నిర్విఘ్నముగ పరిసమాప్తిని పొందించును.

3. అర్థము : ఆకూత్యై='యజ్ఞమును చేయఁగలను' అనెడి మానస సంకల్పముకొఱకు, ప్రయుజే=ప్రేరణచేయుచున్న, అగ్నయే=అగ్నికొఱకు, స్వాహా=ఈ హవిస్సు హుత మగుఁగాక, ఇతి=అని, ఆహ="ఆకూత్యై ప్రయుజే" ఇత్యాది మంత్రము చెప్పినది. పురుషః=పురుషుఁడు, ఆకూత్యా హి=మానస సంకల్పము చేతనే కదా, యజ్ఞమ్ అభి=యజ్ఞమును అభిలక్షించి 'యజేయ' ఇతి=యాగము చేయుదును అని, ప్రయుఙ్క్తే=వాక్కును ప్రయోగించుచున్నాఁడు.

తాత్పర్యము : ['ఇత్యాహ' వఱకుఁగల మంత్రభాగములు ప్రథమ కాండము నందలి ద్వితీయ ప్రపాఠక గత ద్వితీయానువాకములోనివి. ఆకూతి యనఁగా యజ్ఞమును చేయుదును అనెడి మానస సంకల్పము. అట్టి మానస సంకల్పము సిద్ధించుటకై ప్రేరించుచున్నట్టి యగ్నికొఱకు ఈ యాహుతి హుత మగుఁగాక అని పై మంత్ర భాగమున కర్థము. పురుషుఁడు తన మనస్సుచే సంకల్పించినపుడు ఋత్విజుల యెదుట యజ్ఞము నుద్దేశించి యజ్ఞమును చేయుదును అను వాక్కును పలుకును. ఇచట ఆకూతి యొక్క ఉపయోగము చెప్పఁబడినది.]

4. అర్థము : "మేధాయై=మేధకొఱకు, మనసే=మదీయ మనోభిమానియగు, అగ్నయే=వహ్నికొఱకు, స్వాహా=ఈ హవిస్సు హుత మగుఁగాక", ఇతి=అని, ఆహ='మేధాయై' ఇత్యాది ద్వితీయ మంత్రము చెప్పినది. మేధయా హి=మేధ చేతనే కదా, మనసా=మనస్సుతో, పురుషః=పురుషుఁడు, యజ్ఞమ్ అధిగచ్ఛతి=యజ్ఞకర్తవ్యతను పొందుచున్నాఁడు.

తాత్పర్యము : శ్రుతము లయిన ఫలసాధనములయొక్క ధారణాశక్తి మేధ యనఁబడును. అట్టి "మేధ సిద్ధించుటకై మదీయ మనోభిమానియైన అగ్నిదేవునికొఱకు ఈ హవిస్సు హుత మగుఁగాక" అని పైమంత్రము చెప్పినది. యజ్ఞ

ఫలసాధనములను విస్మరించకుండ యజ్ఞకర్త యజ్ఞకర్తవ్యతను పొందుచున్నాఁడు. (యజ్ఞము కర్తవ్యమని యజ్ఞోన్ముఖుఁ డగుచున్నాఁడు. ఇచట ద్వితీయ మంత్రమునందలి మేధోపయోగము చెప్పఁబడినది).

5. అర్థము : "సరస్వత్యై=మంత్రోచ్చారణ శక్తి రూప సరస్వతికొఱకు, పూష్ణే=వాగింద్రియ పోషకుఁడగు, అగ్నయే=అగ్ని కొఱకు, స్వాహా=ఈ హవిస్సు హుత మగుఁగాక; ఇతి=అని, ఆహ=పై మంత్రము చెప్పినది. వాక్ వై=వాక్కే, సరస్వతీ=సరస్వతి. పృథివీ=పృథివి, పూషా=పోషక మైనది. వాచైవ=వాక్కుచేతనే, పృథివ్యాః=పృథివివలన, యజ్ఞమ్=యజ్ఞమును, ప్రయుఙ్క్తే=ఆచరించుచున్నాఁడు.

తాత్పర్యము : సరస్వతి యనఁగా మంత్రోచ్చారణ శక్తి. ఆ శక్తి సిద్ధించుటకై వాగింద్రియ పోషకుఁడైన యగ్నికొఱకు ఈ హవిస్సు హుత మగుఁగాక. వాక్కుచే మంత్రోచ్చారణ సిద్ధి ఏర్పడుచున్నది. పృథివిచే దేవయజన వ్రీహ్యాది ద్రవ్య సిద్ధి కలుగుచున్నది అని భావము. [తపోభిమానియగు అగ్నియొక్క అనుగ్రహముచేత దీక్షాసిద్ధి స్పష్టమే కావున "దీక్షాయై తపసే ఽగ్నయే స్వాహా" అను మూడవ మంత్రము ఈ బ్రాహ్మణ భాగమున వివరింపఁబడలేదు. "సరస్వత్యై పూష్ణే" ఇత్యాది చతుర్థ మంత్రమునందలి పదవాక్యములయొక్క అర్థ మిచట వివరింపఁబడినది.]

6. అర్థము : దేవీః=ద్యులోకమునుండి ఆగతములయినవియు, బృహతీః=బహుళములును, విశ్వశంభువః=సర్వజగత్తునకు (సస్యమును పండించుట మూలమున) సుఖమును కలుగఁజేయుచున్నవియునగు, అపః=ఉదకములు, (వర్ధన్తామ్=ఈ హవిస్సుచే వృద్ధి నొందుఁగాక.) ఇతి=అని, ఆహ="ఆపో దేవీ" రిత్యాది మంత్రము చెప్పినది. యాః అపః వై=ఏ యుదకము లయితే, వర్ష్యాః=వర్షమువలన సిద్ధించినవో, తాః అపః=ఆ యుదకములు, దేవీః=ద్యులోకమునుండి వచ్చినవి, బృహతీః=బహుళములు, విశ్వశంభువః=సస్యమును పండించునవి యగుటచే సర్వజగత్తునకు సుఖమును కలుగఁజేయునవియు, భవన్తి=అగుచున్నవి.

తాత్పర్యము : వర్షము వలన సిద్ధించిన యుదకములు ద్యులోకమునుండి వచ్చినవి, బహుళములు, సర్వజగత్తునకు సస్యపాచనముచే సుఖకరములు నగుచున్నవి. అట్టి ఉదకములారా! మీరు ఈ హవిస్సుచే వృద్ధి నొందుఁడు అని "ఆపో దేవీ" రిత్యాది మంత్రమునకు తాత్పర్యము. "ఆపో దేవీ" రిత్యాది పంచమ మంత్రముయొక్క పూర్వభాగమునందలి బహు విశేషణముల తాత్పర్యమును ఈ బ్రాహ్మణ భాగము వివరించినది. పాచనము=పండింపఁజేయుట.

7. అర్థము : ఏతత్=ఈ, యజుః=మంత్రమును, యత్ న బ్రూయాత్=పఠించనిచో, అపః=ఉదకములు, అశాన్తాః=శాంతి లేనివై, ఇమం లోకమ్=ఈ లోకమును గూర్చి, ఆగచ్ఛేయుః=వచ్చును.

తాత్పర్యము : "ఆపో దేవీ ర్బృహతీ ర్విశ్వశంభువః" ఇత్యాది మంత్రమును హోమ సమయమున యజమానుఁడు పఠించనిచో ఆ దివ్యములయిన యుదకములు అశాంతములై యీ లోకమునకు వచ్చును. [అనగా – ఆ యుదకములు అశాంతములై పిడుగుపాటువలె ఈ లోకమునకు వచ్చి నశింపఁజేయునని భావము. ఇచట విపక్షమున వచ్చునట్టి బాధ చెప్పఁబడినది.]

8. అర్థము : "ఆపో దేవీ ర్బృహతీ ర్విశ్వశంభువః" ఇతి ఆహ="ఆపో దేవీః" ఇత్యాదిమంత్రముచేత, (యజమానః=యజమానుఁడు), అస్మై లోకాయైవ=ఈ లోకముకొఱకే, ఏనాః=ఈ యుదకములను, శమయతి=శాంతింపఁజేయుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, శాన్తాః=శాంతము లయిన యుదకములు, ఇమం లోకమ్=ఈ లోకమును గూర్చి, ఆ గచ్ఛన్తి=వచ్చుచున్నవి.

తాత్పర్యము : యజ్ఞకర్త "ఆపో దేవీ" రిత్యాది మంత్ర పఠనముచేత ఈ లోకముకొఱకే ఈ ఉదకములను శాంతింపఁజేయుచున్నాఁడు. అందువలన ఉదకములు శాంతములై ద్యులోకమునుండి ఈ లోకమునకు వచ్చుచున్నవి.

[అనఁగా -- మంత్రోక్త గుణస్తుతిచే జలదేవతకు శాంతి కలుగును. అందువలన ఆ యుదకములు శాంతములై సుఖకారు లగుచున్నవి అని సిద్ధాంతము.]

9. అర్థము : "ద్యావాపృథివీ" ఇతి ఆహ="ఆపో దేవీః" ఇత్యాది మంత్రమునందు 'ద్యావా పృథివీ' అని రెండవ భాగము కలదు. యజ్ఞః=యజ్ఞము, ద్యావా పృథివ్యోః హి=ద్యావా పృథువుల యందు కలదు కదా! "ఉర్వన్తరిక్షమ్" ఇతి ఆహ=ఆ మంత్రమునందే "ఉర్వన్తరిక్షమ్" అని మూఁడవ భాగము కలదు. యజ్ఞః=యజ్ఞము, అన్తరిక్షే హి=అంతరిక్షమునందు కదా!

తాత్పర్యము : భూమియందు దేవయజనము, అనుష్ఠానమునకై అంతరిక్షమున సంచారము, ద్యులోకమునందు యజ్ఞఫలము, అని యీ విధముగ యజ్ఞము మూఁడు లోకములందు వర్తించుచున్నది. ["దేవీ రాపః" ఇత్యాది మంత్రము యొక్క ద్వితీయ తృతీయ భాగముల యుపయోగ మిచట చెప్పఁబడినది.]

10. అర్థము: "బృహస్పతిః=బృహస్పతి, నః=మాయొక్క, హవిషా=హవిస్సుచేత, వృధాతు=వృద్ధి నొందుఁగాక." ఇతి=అని, ఆహ=పూర్వోక్త మంత్ర చతుర్థ భాగము చెప్పినది. దేవానామ్=దేవతలకు, బృహస్పతిః=బృహస్పతి, బ్రహ్మ వై=బ్రహ్మయే. [తత్=ఆ కారణము వలన] బ్రహ్మణైవ=బ్రహ్మ చేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు [అధ్వర్యుః= అధ్వర్యుఁడు,] యజ్ఞమ్=యజ్ఞమును, అవరున్ధే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: "ఆపో దేవీ" రిత్యాది మంత్రము, 'బృహస్పతి మా హవిస్సుచే వృద్ధి నొందుఁగాక' అని చెప్పినది. బృహస్పతి దేవతలకు బ్రహ్మయే కావున, యజమానుఁడు బ్రహ్మచేతనే యజ్ఞము ననుష్ఠించుచున్నాఁడు. యజ్ఞమును నిర్విఘ్నముగ పరిసమాప్తము చేయునని భావము. [మంత్ర చతుర్థభాగముయొక్క అభిప్రాయము ఇచట చెప్పఁబడినది.]

11. అర్థము: "విధేః" ఇతి='బృహస్పతిః నః హవిషా విదధాతు' అని శాఖాంతరమున చెప్పిన విధముగా, బ్రూయాత్ యత్=చెప్పినచో, (యజమానః= యజమానుఁడు,) యజ్ఞ స్థాణుమ్=యజ్ఞమునకు విఘ్నమును, ఋచ్ఛేత్= పొందును. (అతః=ఇందువలన,) 'వృధాతు' ఇతి=వృద్ధి నొందుఁగాక అని, ఆహ=వేదము చెప్పినది. (ఏవం సతి=ఇట్లు చెప్పఁగా, యజ్ఞస్థాణుమేవ=యజ్ఞవిఘ్నమునే, పరివృణక్తి=పోఁగొట్టుచున్నాఁడు.

తాత్పర్యము: శాఖాంతరమునందు "బృహస్పతి ర్విదధాతు," అని చెప్పఁబడినది. అట్లు చెప్పినచో అభివృద్ధి సూచిత మగుట లేదు కావున యజమానుఁడు యజ్ఞమునకు విఘ్నమును పొందును. అందువలన 'వృధాతు' అని చెప్పఁబడినది. ఇట్లు చెప్పుటవలన అభివృద్ధి సూచిత మగుటచే యజ్ఞవిఘ్నము పరిహరింపఁబడినది. (ఇచట శాఖాంతర పాఠమునందలి దోషమును నిందించి స్వపాఠ ప్రశంస చేయఁబడినది.

12. అర్థము: ప్రజాపతిః=ప్రజాపతి, యజ్ఞమ్=యజ్ఞమును, అసృజత=సృజించెను. సృష్టః సః=సృజింపఁబడిన ఆ యజ్ఞము, అస్మాత్= ఈ ప్రజాపతినుండి, పరాజైత్=పారిపోయెను. సః=ఆ యజ్ఞము, యజుః= యజుర్వేదపురుషుని, ప్రావ్లీనాత్=ప్రకర్షముగా నావరించెను. (చ=మఱియు,) సామ=సామవేద పురుషుని, ప్రావ్లీనాత్=ప్రకర్షముగా నావరించెను. తమ్=ఆ యజ్ఞమును, ఋక్=ఋగ్దేవత ఉదయచ్ఛత్=ఉద్ధరించెను. యత్=ఏ కారణమువలన, ఋక్=ఋగ్దేవత, ఉదయచ్ఛత్=ఉద్ధరించెనో, తత్=ఆ కారణమువలన, ఔద్గ్రహణస్య=ఔద్గ్రహణమునకు, ఔద్గ్రహణత్వమ్=పైకి గ్రహించుట, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ప్రజాపతి యజ్ఞమును సృష్టించెను. సృజింపఁబడిన యీ యజ్ఞము ప్రజాపతినుండి పారి పోయెను. ఆ యజ్ఞము యజుస్సామ పురుషులను ప్రకృష్టముగ ఆవరించెను. ఋగ్దేవత ఆ యజ్ఞమును ఉద్ధరించెను. ఆ కారణమువలన ఋక్సాధ్యమైన అనుష్ఠానము ఔద్గ్రహణ మనఁబడుచున్నది. (ఔద్గ్రహణ హోమమును విధించుటకు ముందు ఔద్గ్రహణ పదోత్పత్తికి సంబంధించిన ఆఖ్యాయిక ఇచట చెప్పఁబడినది.)

13. అర్థము: యజ్ఞస్య=యజ్ఞముయొక్క, ఉద్యత్యై=ఉద్యతి కొఱకు, ఋచా=ఋక్కుచేత, జుహోతి=హోమము చేయవలెను.

తాత్పర్యము: యజ్ఞముయొక్క ఉద్యతి కొఱకు ఋక్కును పఠించుచు యజ్ఞదీక్షితుఁడైన యజ్ఞకర్త హోమము చేయవలెను. [ఇచట ఔద్గ్రహణ హోమము విహితమైనది.]

14. అర్థము: ఛన్దసామ్=ఛందస్సులలో, అనుష్టుప్=అనుష్టుప్ ఛందస్సు, ఉదయచ్ఛత్=యజ్ఞమును ఉద్ధరించెను; ఇతి=అని, ఆహుః= అభిజ్ఞులు చెప్పిరి. తస్మాత్=ఆ కారణమువలన, యజ్ఞస్య=యజ్ఞము యొక్క, ఉద్యత్యై=ఉద్ధరణము కొఱకు, అనుష్టుప్ ఛందస్సుగల ఋక్కుచేత, జుహోతి= హోమము చేయవలెను.

తాత్పర్యము: యజుస్సామ పురుషుల నావరించిన యజ్ఞమును ఋగ్దేవత ఉద్ధరించెనని పూర్వము చెప్పఁబడినది. ఆ ఋక్కులలో అనుష్టుప్ ఛన్దస్క ఋక్కు యజ్ఞమును ఉద్ధరించినదని యభిజ్ఞులు చెప్పుచున్నారు. కావున యజ్ఞముయొక్క ఉద్ధరణము కొఱకు అనుష్టుప్ ఛన్దస్కఋక్కును పఠించుచు యజ్ఞదీక్షితుఁడు ఔద్గ్రహణ నామక హోమము చేయవలెను. (ఆ ఋక్కునకు సంబంధియైన ఛందస్సు ఇచట ప్రశంసింపఁబడినది.)

15. అర్థము: ద్వాదశ=పండ్రెండు, వాత్సబంధాని=వత్స బంధములవంటి పదములు, ఉదయచ్ఛన్=(యజ్ఞమును) ఉద్ధరించినవి, ఇతి=అని, ఆహుః=(అభిజ్ఞులు) చెప్పిరి. తస్మాత్=ఆ కారణమువలన, వాత్సబన్ధ విదః=వాత్స బంధములను తెలిసిన యధ్వర్యులు, ద్వాదశభిః="విశ్వే దేవస్య"ఇత్యాది ఋక్కునందలి పండ్రెండు పదముల చేత, దీక్షయన్తి=యజమానుని దీక్షింప జేయుచున్నారు.

తాత్పర్యము: వత్సము, ఒక్కొక్క పాశముచే బంధింపఁబడిన విధముగ యజ్ఞము "విశ్వే దేవస్య" ఇత్యాది ఋక్కునందలి పండ్రెండు పదములలో ఒక్కొక్క పదముచే బంధింపఁబడి యుండుటచే ఆ ఋక్కునందలి పండ్రెండు పదములు వాత్సబంధములనఁబడుచున్నవి. ఆ వాత్సబంధములు యజ్ఞమును ఉద్ధరించినవని ప్రాచీనులైన యభిజ్ఞులు చెప్పుచున్నారు. తదభిజ్ఞులయిన యధ్వర్యులు (ఇప్పుడు కూడ), ఆ పదములచే హోమము చేయుచున్నారు. ఆ కారణము వలన వాత్సబంధ విదులు పండ్రెండు పదములచే యజ్ఞకర్తను దీక్షింపఁజేయుచున్నారు. (అనఁగా దీక్షాంగముగా ఆ పండ్రెండు పదములచే హోమము చేయుచున్నారని భావము. మంత్రగతమైన ఋక్త్వము ఛందస్సు ప్రశంసింపఁబడిన విధముగ ఋక్కులోని పదసంఖ్యకూడ నిచట ప్రశంసింపఁబడినది.)

16. అర్థము: సా ఏషా ఋక్ వై=ఆ యీ వాగ్రూప ఋక్కే, అనుష్టుక్ వాక్=వాగ్రూపమైన అనుష్టుక్ ఛందోయుతము. ఏతయా ఋచా=ఈ అనుష్టుక్ఛందోయుతమైన ఋక్కుచే, దీక్షయతి యత్=యజ్ఞకర్తను దీక్షింపఁజేసినచో, ఏనమ్=ఈ యజమానుని సర్వయా=సంపూర్ణమైన, వాచా ఏవ=వాక్కుచేతనే, దీక్షయతి=(యజమానుని, అధ్వర్యుఁడు) దీక్షింపఁజేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: (అనుష్టుప్పు వాగ్విశేషమగుటచే వాగ్రూప మగును. అనుష్టుక్ఛందస్సు కూడ తత్సమ మనినచో, అది కూడ స్తుతింపఁదగినది.)

పూర్వోక్తమైన ఋక్కు అనుష్టు క్ఛందోయుక్తమైనది. అనుష్టుప్పు వాక్స్వరూపమైనది. అధ్వర్యుఁడు యజమానుని ఈ అనుష్టు క్ఛందోయుతమైన ఋక్కుచే దీక్షింపఁజేసినచో (దీక్షాంగముగ ఈ ఋక్కునందలి ద్వాదశ సంఖ్యాక పదములచే హోమము చేసినచో) ఈ యజమానుని సర్వవాక్కుచేతనే దీక్షింపఁజేసి నవాఁడగుచున్నాఁడు. (ఇచట ఛందస్సు వాక్స్వరూపముగ స్తుతింపఁబడినది.)

17. అర్థము: "విశ్వే దేవస్య నేతుః" ఇతి ఆహ="విశ్వే దేవస్య నేతుః" అని వేదము చెప్పినది. ఏతేన=ఈ ప్రయోగముచే సావిత్రీ=సావిత్రత్వము, (అభివ్యజ్యతే=అభివ్యక్తమగుచున్నది.) "మర్తో వృణీత సఖ్యమ్" ఇతి ఆహ="మర్తో వృణీత సఖ్యమ్" అని వేదము చెప్పినది. ఏతేన=ఈ ప్రయోగముచేత పితృదేవతీ=పితృదేవతత్వము, అభివ్యజ్యతే=అభివ్యక్త మగుచున్నది. "విశ్వే రాయ ఇషుధ్యసి" ఇతి ఆహ="విశ్వే రాయ ఇషుధ్యసి" అని వేదము చెప్పినది. ఏతేన=ఈ ప్రయోగముచేత, వైశ్వదేవీ=వైశ్వదేవత్వము, అభివ్యజ్యతే. "ద్యుమ్నం వృణీత పుష్యస" ఇతి ఆహ= "ద్యుమ్నం వృణీత పుష్యసే" అని వేదము చెప్పినది. ఏతేన=ఈ ప్రయోగముచేత,

పౌష్ణీ=పౌష్ణత్వము అభివ్యజ్యతే. సా ఏషా ఋక్ వై=ఆ యీ ఋక్కే, సర్వదేవత్యా=సర్వదేవ దేవతా కము. ఏతయా ఋచా=ఈ ఋక్కుచేత, దీక్షయతి యత్=(అధ్వర్యుఁడు యజమాని) దీక్షింపఁజేసినచో, ఏనమ్=ఈ యజమానుని, సర్వాభిః దేవతాభిః ఏవ= సమస్త దేవతలచేతనే దీక్షయతి=దీక్షింపఁజేసినవాఁడగు చున్నాఁడు.

తాత్పర్యము: "విశ్వే దేవస్య నేతు ర్మర్తో వృణీత సఖ్యం విశ్వే రాయ ఇషుధ్యసి ద్యుమ్నం వృణీత పుష్యసే" అను నీ మంత్రము (ఋక్కు) నాలుగు పాదములు కలది. ఇది ప్ర.కాం. ద్వితీయ ప్రపాఠకమునందలి ద్వితీ యానువాకమునందు వ్యాఖ్యాత మైనది. ఇందలి మొదటి పాదమునందలి సవితృ పర్యాయమైన నేతృశబ్ద ప్రయోగముచేత సావిత్రత్వము అభివ్యక్తమగుచున్నది. రెండవ పాదమునందలి మర్త శబ్దము చేత మృత పితృ సూచనచే పితృదేవత్యత్వము, తృతీయ పాదమునందలి విశ్వ శబ్ద ప్రయోగముచేత వైశ్వదేవత్వము, చతుర్థ పాదమునందలి పుష్యసే అని ప్రయుక్తమగుటచే పౌష్ణత్వము అభివ్యక్తము లగుచున్నవి. సవిత్రాది దేవతలను సూచించునట్టి ఈ ఋక్కుచే అధ్వర్యుఁడు యజ్ఞకర్తను యజ్ఞదీక్షితునిగాఁజేసినచో సర్వ దేవతల చేతను దీక్షింపఁజేసిన వాఁడగును. (ఇచట మంత్రమునందలి నేతృ, మర్త, విశ్వ, పుష్యసే అను శబ్దముల నాధారముగాఁ జేసికొని "విశ్వే దేవస్య" ఇత్యాది మంత్రము స్తుతింపఁబడినది.)

18. అర్థము: ప్రథమం పదమ్=పూర్వోక్తమైన ఋక్కునందలి ప్రథమ పాదము, సప్తాక్షరమ్=ఏడు అక్షరములు కలది. త్రీణి=(మిగిలిన) మూఁడు పాదములు, అష్టాక్షరాణి=ఎనిమిదేసి అక్షరములు కలవి. యాని త్రీణి=(ప్రథమ పాదములోని) ఏ మూఁడక్షరములు (కలవో), తాని =ఆ మూఁడక్షరములు, అష్టౌ=(తృతీయ పాదములోని) ఎనిమిది అక్షరములను, ఉపయన్తి=కలయుచున్నవి (పొందుచున్నవి). యాని చత్వారి=(ప్రథమ పాదములో మిగిలిన,) నాలుగు అక్షరములు ఏవి కలవో, తాని=ఆ నాలుగక్షరములు, అష్టౌ=నాల్గవ పాదములోని యెని మిది అక్షరములను, ఉపయన్తి=పొందుచున్నవి. అష్టాక్షరా యత్=ఎనిమిదక్షరములు కలది యేది కలదో, తేన=దానిచేత, గాయత్రీ=గాయత్రీ ఛ్ఛందస్సు (సిధ్యతి= సిద్ధించుచున్నది.) ఏకాదశాక్షరా యత్=పదునొకండక్ష రములు కలది యేది కలదో, తేన=దానిచేత, త్రిష్టుక్=త్రిష్టుక్ఛందస్సు, సిధ్యతి=సిద్ధించుచున్నది. ద్వాదశాక్షరా యత్=పంౘ్రెండక్షరములు కలది యేది కలదో, తేన=దానిచేత, జగతీ= జగతీఛ్ఛందస్సు సిధ్యతి=సిద్ధించుచున్నది. సా ఏషా ఋక్ వై=ఆ యీ ఋక్కే, సర్వాణి ఛన్దాంసి=సర్వ ఛ్ఛందస్సులను, ఆప్నోతి=పొందుచున్నది. ఏతయా ఋచా= సర్వఛ్ఛందోపేతమైన యీ ఋక్కుచేత, దీక్షయతి యత్=(అధ్వర్యుఁడు యజమానుని) దీక్షింపఁజేయుచున్నచో, (తదా=అప్పుడు), సర్వాభిః ఛన్దోభిః ఏవ=సర్వఛ్ఛన్దస్సులచేతనే, దీక్షయతి=దీక్షింపఁజేసిన వాఁడగుచున్నాడు.

తాత్పర్యము: "విశ్వే దేవస్య నేతు"రిత్యాది ఋక్కునందు నాలుగు పాదములు కలవు. వానిలో మొదటి పాదమున ఏడ క్షరములు కలవు. ద్వితీయ పాదమున 'సఖ్యమ్' అను పదమును సఖియమ్, మార్పు చేయవలెను. అప్పుడు ద్వితీయ పాదమున ఎనిమిదక్షరములు ఏర్పడును. తృతీయ చతుర్థ పాదములు ప్రత్యేకముగ ఎనిమిదేసి అక్షర ములు కలిగి యున్నవి. మొదటి పాదములోని ఏడక్షరములలో మూఁడక్షరములను తృతీయ పాదములోను, మిగిలిన నాల్గక్షరములను చతుర్థ పాదములోను చేర్పవలెను. ఇట్లు చేసినప్పుడు ఎనిమిదక్షరములు కల ద్వితీయపాదము గాయత్రీ ఛ్ఛంధస్సు కలదగును. ప్రథమ పాదములోని మూఁడక్షరములతోఁగూడియున్న తృతీయపాదము ఏకాదశాక్షరము కనుక త్రిష్టుక్ఛందస్సు కలదగును. ప్రథమ పాదములోని నాల్గక్షరము లతోఁగూడియున్న చతుర్థ పాదము ద్వాదశాక్షరము కావున జగతీఛ్ఛందస్సు కలది యగును. ఈ విధముగ ద్వితీయ తృతీయ పాదములు అక్షర సంఖ్యలచే గాయత్ర్యాది సమములగుటచే ఛన్దస్త్రయ సంపత్తి సిద్ధించు చున్నది. గాయత్ర్యాది ఛ్ఛందస్త్రయమునకు సవనత్రయమునందు ప్రాధాన్య ముండుటచే సర్వఛ్ఛన్దస్సంపత్తి

యేర్పడుచున్నది. కావున ఇట్టి సర్వచ్ఛన్ద స్సంపత్తితోఁగూడిన "విశ్వే దేవస్య నేతు" రిత్యాది ఋక్కుచే యజమానుని యజ్ఞదీక్షితునిగాఁజేసిన యధ్వర్యుఁడు ఈ యజ్ఞకర్తను సర్వచ్ఛందస్సులచేతనే దీక్షింపఁజేసిన వాఁడగును. (అక్షర సంఖ్య నాధారముగాఁజేసికొని పూర్వోక్త ఋక్కు ఇచట స్తుతింపఁబడినది.)

19. అర్థము: ప్రథమం పదమ్="విశ్వే దేవస్య నేతు" రిత్యాది ఋక్కునందలి ప్రథమ పాదము సప్తాక్షరమ్=ఏడక్షర ములు కలది. శక్వరీ=శక్వరీ ఛ్ఛందస్సు, సప్తపదా=ఏడు పాదములు కలది. శక్వరీ=శక్వరీ ఛ్ఛందస్సు, పశవః=పశురూపము. (**తత్**=అ కారణమువలన, **అయమ్**=ఈ ఋక్కుచే దీక్షితుడైన యీ యజ్ఞకర్త,) పశూన్=పశువులను, అవరున్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము: "విశ్వే దేవస్య నేతు" రిత్యాది ఋక్కుయొక్క ప్రథమ పాదమునందు ఏడక్షరములు కలవు. శక్వరీ ఛ్ఛంద స్సునందు ఏడు పాదములున్నవి. సప్తత్వ సంఖ్యావత్త్వము ఈ రెండింటికి సామాన్యము. శక్వరీ ఛ్ఛందస్సు పశుప్రదమగుటచే పశుస్వరూపముగా వర్ణింపబఁడినది. కావున ఈ "విశ్వే దేవస్య నేతు" రిత్యాది ఋక్కుచే దీక్షితుఁడైన యజ్ఞకర్త నిశ్చయముగ పశు సంపదను పొందును.

20. అర్థము: ప్రథమం పదమ్=పూర్వోక్త ఋక్కుయొక్క ప్రథమ పాదము, ఏకస్మాత్ అక్షరాత్=ఒక యక్షరము వలన, అనాప్తమ్=న్యూనమైనది. **తస్మాత్**=అ కారణమువలన, మనుష్యాః=మనుష్యులు, వాచః=వాక్కుయొక్క, **తత్** అనాప్తమ్=అ (న్యూనమైన) అసంపూర్ణమైన స్వరూపమును, **ఉపజీవన్తి**= ఆధారముగఁజేసికొని జీవించుచు న్నారు. పూర్ణయా=ద్వితీయాద్యుత్తర పాదములందు అక్షర పూర్ణమైన ఋక్కుచేత, **జుహోతి**=యజ్ఞదీక్షితుఁడు హోమము చేయవలెను. ప్రజాపతిః=ప్రజాపతి, పూర్ణః ఇవ హి=సృష్టి చేయుటచే పూర్ణుని వంటివాఁడు కదా! (**తత్**=అ కారణము వలన, అయం హోమః=ఈ హోమము), ప్రజాపతేః=ప్రజాపతియొక్క, ఆప్త్యై=ప్రాప్తి కొఱకు, భవతి=అగుచున్నది న్యూనయా=ఏకాక్షరముచే న్యూనమైన ప్రథమపాదము కల ఋక్కుచే, జుహోతి=హోమము చేయవలెను. ప్రజాపతిః=ప్రజాపతి, న్యూనాత్ హి=న్యూనమునుండియే కదా!, ప్రజాః=ప్రజ లను, అసృజత=సృష్టించెను. (అనేన=ఈ సామ్యముచే,) ప్రజానామ్=ప్రజలయొక్క, సృష్ట్యై=సృష్టికొఱకు, (అయమ్=ఈ హోఁమము) భవతి=కారణ మగుచున్నది.

తాత్పర్యము: "విశ్వే దేవస్య నేతు" రిత్యాది ఋక్కు సర్వ జగద్వ్యవహార సామ్యముచే నిచట ప్రశంసింపఁబడుచున్నది. ఈ ఋక్కుయొక్క ప్రథమ పాదము ఎనిమిదక్షరములకు ఒక్కయక్షరము తక్కువగానున్నది. ఉత్తర పాదములు మూఁడును ఎనిమిదేసి అక్షరములు కలిగియుండుటచే ఈ ఋక్కు పూర్ణయగుచున్నది. అనఁగా ఈ ఋక్కునందు న్యూనత్వము పూర్ణత్వము రెండును కలవు. ఇటులనే ప్రజాపతి సృష్టిని చేసెను కావున పూర్ణుడు. శూన్యమునుండి ప్రజలను సృజించెను కావున ఇతని యందు పూర్ణత్వము వలె శూన్యత్వము కూడ కలదు. అందువలన పూర్ణత్వ సామ్యముగల ఈ ఋక్కుచే హోమము చేయుట వలన యజమా నునకు ప్రజాపతి లాభము కలుగును. న్యూనత్వ సామ్యము గల ఈ ఋక్కుచే హోమము చేయుట వలన ఈ హోమము ప్రజోత్పత్తికి కారణ మగుచున్నది.

ఏకాక్షరముచే న్యూనమైన ప్రథమ పాదముకల ఈ ఋక్కునకు మనుష్యులు పలుకునట్టి వాక్కుతో సామ్యము కలదు. మూలాధారమునుండి ఉత్పన్నమైన వాయువు మనుష్యునియొక్క మూర్ధ పర్యంతము వ్యాపించినదియై ముఖమునందలి ఆ యా స్థానములందు వర్ణములను పుట్టించుచున్నది. ఈ వర్ణాభివ్యక్తి లక్షణము కలది వాక్కుయొక్క నాల్గవ పాదము. ఈ వాక్కుయొక్క పూర్వ పాదములు మూఁడును కంఠము నకు అధో భాగమునందే రూఢములై యుండుట వలన ఆ మూఁడు పాదములు వర్ణముల నభివ్యక్తము చేయులేక

పోవుచున్నవి. కనుకనే "గుహా త్రీణి నిహితా నేఙ్గయన్తి తురీయం వాచో మనుష్యా వదన్తి" అని శ్రుతి చెప్పుచున్నది. ఈ విధముగ అసంపూర్ణ వాగ్వ్యవహార సామ్యము ఋక్కునకు చూపఁబడినది.

ద్వితీయానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే తృతీయోఽనువాకః

మూలము: [1]ఋక్సామే వై దేవేభ్యో యజ్ఞాయాఽతిష్ఠమానే కృష్ణో రూపం కృత్వాఽపక్రమ్యాతిష్ఠతాం తేఽమన్యన్త యం వా ఇమే ఉపావర్త్స్యతః స ఇదం భవిష్యతీతి తే ఉపామన్త్రయన్త తే అహోరాత్రయో ర్మహిమాన మపనిధాయ దేవానుపావర్తేతా మేష వా ఋచో వర్ణో యచ్ఛుక్లం కృష్ణాజినస్యైష సామ్నో యత్కృష్ణ [2]మృక్సామయోః శిల్పే స్థ ఇత్యాహ ర్క్సామే ఏవావ రున్ధ [3]ఏషః (౧) వా అహ్నో వర్ణో యచ్ఛుక్లం కృష్ణా జినస్యైష రాత్రియా యత్కృష్ణం యదేవైన యో స్తత్ర న్యక్తం తదేవావ రున్ధే [4]కృష్ణాజినేన దీక్షయతి బ్రహ్మణో వా ఏతద్రూపం యత్కృష్ణాజినం బ్రహ్మణైవైనం దీక్షయతి [5]మాం ధియగ్ం శిక్షమాణస్య దేవేత్యాహ యథాయజు రేవైత [6]ద్గర్భో వా ఏష యద్దీక్షిత ఉల్బం వాసః ప్రోర్ణుతే తస్మాత్(౨) గర్భాః ప్రావృతా జాయన్తే [7]న పురా సోమస్య క్రయా దపోర్ణ్వీత యత్పురా సోమస్య క్రయా దపోర్ణ్వీత గర్భాః ప్రజానాం పరాపాతుకాః స్యుః క్రీతే సోమేఽపోర్ణుతే జాయత ఏవ తదథో యథా వసీయాగ్ంసం ప్రత్యపోర్ణుతే తాదృగేవ తద [8]ఙ్గిరసః సువర్గం లోకం యన్త ఊర్జం వ్యభజన్త తతో యదత్యశిష్యత తే శరా అభవ న్నూర్గ్వై శరా యచ్ఛరమయీ (3)మేఖలా భవత్యూర్జ మేవావ రున్ధే [9]మధ్యతః సం నహ్యతి మధ్యత ఏవాస్మా ఊర్జం దధాతి తస్మాన్మధ్యత ఊర్జా భుఞ్జత [10]ఊర్ధ్వం వై పురుషస్య నాభ్యై మేధ్య మవాచీన మమేధ్యం యన్మధ్యతః సం నహ్యతి మేధ్యం చైవాస్యామేధ్యం చ వ్యావర్తయతి [11]ఇన్ద్రో వృత్రాయ వజ్రం ప్రాహరత్స త్రేధా వ్యభవత్స్ఫ్య స్తృతీయగ్ం రథస్తృతీయం యూపస్తృతీయమ్ (౪) యేఽన్తఃశరా అశీర్యన్త తే శరా అభవ న్తచ్ఛరాణాగ్ం శరత్వం వజ్రో వై శరాః క్షుత్ఖలు వై మనుష్యస్య భ్రాతృవ్యో యచ్ఛరమయీ మేఖలా భవతి వజ్రేణైవ సాక్షాత్క్షుధం భ్రాతృవ్యం మధ్యతోఽప హతే [12]త్రివృద్భ

వతి త్రివృద్వై ప్రాణస్త్రివృత మేవ ప్రాణం మధ్యతో యజమానే దధాతి [13]పృథ్వీ భవతి రజ్జూనాం వ్యావృత్త్యై [14]మేఖలయా యజమానం దీక్షయతి యోక్త్రేణ పత్నీం మిథునత్వాయ (౫) [15]యజ్ఞో దక్షిణా మభ్యధ్యాయ త్తాగ్ం సమభవ త్తదిన్ద్రోఽచాయత్సోఽమన్యత యో వా ఇతో జనిష్యతే స ఇదం భవిష్యతీతి తాం ప్రావిశ త్తస్యా ఇన్ద్ర ఏవాజాయత సోఽమన్యత యో వై మదితోఽపరో జనిష్యతే స ఇదం భవిష్యతీతి తస్యా అను మృశ్య యోని మాఽచ్ఛినత్సా సూతవశాఽభవ త్తత్సూత వశా యై జన్మ(౬)తాగ్ం హస్తే న్యవేష్టయత తాం మృగేషు న్యదధాత్సా కృష్ణవిషాణాఽభవ దిన్ద్రస్య యోని రసి మా మా హిగ్ంసీ రితి కృష్ణవిషాణాం ప్రయచ్ఛతి సయోని మేవ యజ్ఞం కరోతి సయోనిం దక్షిణాగ్ం సయోని మిన్ద్రగ్ం సయోనిత్వాయ [16]కృష్యై త్వా సుసస్యాయా ఇత్యాహ తస్మా దకృష్ట పచ్యా ఓషధయః పచ్యన్తే [17]సుపిప్పలాభ్య స్త్వౌ షధీభ్య ఇత్యాహ తస్మాదోషధయః ఫలం గృహ్ణన్తి [18]యద్ధస్తేన (౭)కణ్డూయేత పామనంభావుకాః ప్రజాః స్యు ర్యత్స్మయేత నగ్నంభావుకాః కృష్ణ విషాణయా కణ్డూయతేఽపిగృహ్య స్మయతే ప్రజానాం గోపీథాయ [19]న పురా దక్షిణాభ్యో నేతోః కృష్ణవిషాణామవ చృతేద్యత్పురా దక్షిణాభ్యో నేతోః కృష్ణవిషాణా మవచృతేద్యోనిః ప్రజానాం పరాఘా తుకా స్యాన్నీతాసు దక్షిణాసు చాత్వాలే కృష్ణవిషాణాం ప్రాస్యతి యోనిర్వై యజ్ఞస్య చాత్వాలం యోనిః కృష్ణవిషాణా యోనావేవ యోనిం దధాతి యజ్ఞస్య సయోనిత్వాయ(౮)॥

[రున్ధ ఏష తస్మా చ్ఛరమయీ యూపస్తృతీయం మిథునత్వాయ జన్మ హస్తేనాష్టాచత్వారిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే తృతీయోఽనువాకః ॥3॥

## వేదార్థ దీపిక

**అవతారిక:** ద్వితీయానువాకమునందు యజ్ఞకర్త యజ్ఞదీక్ష వహించిన సమయమున దీక్షాంగముగా హోమ మంత్రములు అభిహితము లయినవి. యజ్ఞ దీక్షకు సంబంధించిన కృష్ణాజిన ధారణము మున్నగు విషయములు ఈ

తృతీయానువాకమునందు చెప్పఁబడుచున్నవి. యజ్ఞ దీక్షకు సంబంధించిన మంత్రములు ద్వితీయ ప్రపాఠక మునందు చెప్పఁబడినవి. ఆ మంత్రములకు ఈ యనువాకము వివరణాత్మకము.

1. అర్థము: ఋక్సామే=ఋక్సామ దేవతలు, దేవేభ్యః=దేవతలకైన (దేవతలయొక్క), యజ్ఞాయ=యజ్ఞముకొఱకు, అతిష్ఠ మానే=ఆత్మను ప్రకాశింపఁజేసికొననివై, కృష్ణః(భూత్వా)=కృష్ణమృగమై (జింకగానై), రూపమ్= కృష్ణమృగ రూపమును, కృత్వా=చేసికొని (ధరించి), అపక్రమ్య=దేవతలనుండి తొలఁగి, అతిష్ఠతామ్=ఉండిరి. ఇమే=ఈ ఋక్సామ దేవతలు, యమ్=ఏ పురుషుని, ఉపావర్త్స్యతః=సమీపించి ఉందురో, సః=ఆ పురుషుడు, ఇదమ్=ఈ యజ్ఞఫలమును గూర్చి, భవిష్యతి=కాఁగలఁడు (యజ్ఞఫలమును పొందఁగలఁడు), ఇతి=అని, తే=ఆ దేవతలు, అమన్యన్త=తలఁచిరి (ఆలోచించిరి). తే=ఆ ఋక్సామ దేవతలు, అహోరాత్రయోః=అహో రాత్రముల యొక్క, మహిమానమ్=మహిమ రూపమైన శుక్ల కృష్ణ వర్ణ ద్వయమును, అపనిధాయ=స్వీయ మృగ శరీరమునందు, స్థాపించి, దేవాన్= దేవతలను, ఉపావర్తేతామ్=సమీపించెదము, ఇతి=అని, తే= ఆ ఋక్సామ దేవతలు, ఉపామన్త్రయన్త=ఆలోచించిరి. కృష్ణాజినస్య=కృష్ణాజినముయొక్క, శుక్లం యత్=తెల్లని వర్ణము ఏది కలదో, ఏషఃవై=ఇదియే, ఋచః= ఋగ్దేవతయొక్క, వర్ణః=వర్ణము. కృష్ణం యత్=నల్లని రూపము ఏది కలదో, ఏషః=ఇది, సామ్నః=సామ దేవతయొక్క, వర్ణః=వర్ణము.

తాత్పర్యము: ఋక్సామ దేవతలు దేవతల యజ్ఞమునకు వచ్చి కారణాంతరముచే తమ నిజ స్వరూపము కనఁబడకుండుటకై జింకగా రూపమును దరించి దేవతలనుండి తొలఁగి నిగూఢముగ నుండిరి. దేవతలు ఆలోచించి ఋక్సామ దేవతలు ఏ పురుషుని పొందుదురో అతఁడు యజ్ఞఫలమును పొందఁగలఁడు, అని, వారు ఏదియో ఒక ఉపాయముచే ఋక్సామ దేవతలను సమీపించిరి. ఆ ఋక్సామ దేవతలు అహోరాత్రముల మహిమను శుక్ల కృష్ణ వర్ణ ద్వయముగ తాము ధరించిన కృష్ణమృగ శరీరమునందు స్థాపించి దేవతల సమీపమునకు వచ్చిరి. ఆ వర్ణ ద్వయమునందు కృష్ణాజినము, యొక్క శుక్ల వర్ణము ఋగ్దేవతచే గ్రహింపఁబడిన అహస్సు యొక్క వర్ణము. కృష్ణాజినము నందలి కృష్ణ వర్ణము సామదేవతచే గ్రహింపఁబడిన రాత్రియొక్క వర్ణము ["ఋక్సామయోః శిల్పే స్థః" అని ద్వితీయ ప్రపాఠకమునందు చెప్పఁబడిన శిల్పత్వము ఇచట ఆఖ్యాయికచే విశదీకరింపఁబడినది.]

2. అర్థము: "ఋక్సామయోః శిల్పే స్థః" ఇతి ఆహ='ఓ శుక్ల కృష్ణ వర్ణములారా! మీారు ఋక్సామములయొక్క శిల్ప ములుగా నుంటున్నారు'. అని చెప్పుటచే, [యజ్ఞదీక్షితః=సోమయాగమునందు దీక్షాంగముగా కృష్ణాజినమును స్వీకరించిన యజ్ఞకర్త] ఋక్సామే=ఋక్సామములను, అవరున్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము: కృష్ణాజినమునందలి శుక్ల కృష్ణ వర్ణములు ఋక్సామములయొక్క శిల్పములు కావున ఆ కృష్ణాజినమును యజ్ఞ దీక్షాంగముగా స్వీకరించిన యజ్ఞదీక్షితుఁడు ఋక్సామములను నిశ్చయముగ పొందును. (ఇచట యజమాను నకు ఋక్సామ ప్రాప్తి చెప్పఁబడినది.)

3. అర్థము: కృష్ణాజినస్య=కృష్ణాజినముయొక్క, శుక్లం యత్= శుక్ల వర్ణ మేది కలదో, ఏషః వై=ఇదియే, అహ్నః=అహస్సు యొక్క, వర్ణః= వర్ణము. కృష్ణం యత్=కృష్ణాజినముయొక్క కృష్ణ వర్ణము ఏది కలదో, ఏషః=ఇది, రాత్రియాః=రాత్రియొక్క, వర్ణః=వర్ణము. ఏనయోః=ఈ ఋక్సామముల సంబంధియగు, యదేవ=ఏ సార మైతే, తత్ర=ఆ కృష్ణాజినమునందు, (కృష్ణ మృగమునందు,) న్యక్తమ్=ఉంచఁబడినదో (దాఁచఁబడినదో), తదేవ= ఆ సారమును గూడ, అవరున్ధే=పొందుచున్నాడు. (రాత్రియాః=రాత్ర్యాః)

తాత్పర్యము: కృష్ణాజినముయొక్క శుక్ల రూపము అహస్సుయొక్క వర్ణము. కృష్ణ వర్ణము రాత్రియొక్క వర్ణము. ఇంతియగాక, ఋక్సామములయొక్క సారము ఏది కృష్ణ మృగమునందు ఉంచఁబడినదో, యజ్ఞదీక్షితుఁడు

ఆసారమును గూడ పొందును. (ఋక్సామ ప్రాప్తియే గాక యజ్ఞదీక్షితునకు ఋక్సామ సారప్రాప్తి కూడ చెప్పఁబడినది.)

4. అర్థము: కృష్ణాజినేన=కృష్ణాజినముచేత, దీక్షయతి= యజ్ఞకర్తను దీక్షింపఁజేయవలెను. కృష్ణాజినం యత్=కృష్ణాజినమేది కలదో, ఏతత్=ఇది, బ్రహ్మణః=వేదముయొక్క, రూపం వై=రూపమే. (అతః= ఇందువలన, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజమానుని, బ్రహ్మణైవ=వేదముచేతనే, దీక్షయతి=దీక్షింపఁజేసినవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: కృష్ణాజినము ఋక్సామముల శిల్పమును ధరించి యుండుటచే అది వేద స్వరూపము. కావున అధ్వర్యుఁడు యజమానుని కృష్ణాజినముతో యోజన చేయవలెను. అట్లు చేసిన యధ్వర్యుఁడీ యజమానుని వేదముతోనే యోజనము చేసినవాఁడగుచున్నాఁడు. యోజన రెండు విధములుగా నున్నది. పఱచఁబడిన కృష్ణాజినమునందు అధిష్ఠించుట ఒక విధము. మరియొక కృష్ణాజినమును యజమానుని పైని ఆచ్ఛాదనము చేయుట ఇంకొక విధము. ఈ రెండు విధములయిన యోజనను చేయవలెను. (ఈ మంత్రము కృష్ణాజిన ధారణ విధాయకము.)

5. అర్థము: హే దేవ!=ఓ వరుణదేవా!, ఇమాం ధియమ్=ఈ అగ్నిష్టోమ విషయమైన బుద్ధిని, శిక్షమాణస్య=గ్రహించుచున్న యజమానుని సంబంధియైన అగ్నిష్టోమ క్రతువును బాగుగ పారము పొందించుము; ఇతి=అని, ఆహ='ఇమాం ధియమ్' ఇత్యాది వేదమంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ= మంత్రమునందు చెప్పఁబడిన విధమే.

తాత్పర్యము: ఓ వరుణదేవా! ఈ యగ్నిష్టోమ విషయమైన బుద్ధిని ఉపదేశము పొందుచున్న యజమానుని యొక్క అగ్నిష్టోమ క్రతువును సంపూర్ణము చేయుమని "ఇమాం ధియమ్" ఇత్యాది వేదమంత్రము చెప్పినది. మంత్రము స్పష్టార్థమునే చెప్పినదని యిచట చెప్పఁబడినది.

6. అర్థము: దీక్షితః=యజ్ఞదీక్షితుఁడు, ఉల్బమ్=మావి వలె, వాసః=వస్త్రమును, ప్రోర్ణుతే యత్=కప్పుకొనుచున్నాఁడనుటయేది కలదో, ఏషః=ఈ యజ్ఞదీక్షితుఁడు, గర్భః వై=గర్భస్థ పిండమువంటివాఁడే. తస్మాత్=ఆ కారణమువలన, గర్భాః=గర్భస్థ పిండములు, ప్రావృతాః=( మావిచే) ఆవరింపఁబడినవై, జాయన్తే=పుట్టుచున్నవి.

తాత్పర్యము: అధ్వర్యుఁడు యజ్ఞకర్తకు దీక్షాంగముగా దక్షిణ భుజముపైని వస్త్రము నాచ్ఛాదించును. గర్భస్థపిండము మావిచే నావృతమై పుట్టుచున్నది. కనుక దీక్షాంగముగా దక్షిణ భుజముపైని వస్త్రము నాచ్ఛాదనము చేసికొనిన యీ యజమానుఁడు (యజ్ఞదీక్షితుఁడు), గర్భస్థపిండము వంటివాఁడే. యజ్ఞదీక్షితుఁడు వస్త్రాచ్ఛాదనము చేసికొనుట వలననే, లోకమునందు గర్భస్థ పిండములు మావి నాచ్ఛాదనము చేసికొని పుట్టుచున్నవి. (ఇచట యజ్ఞకర్తకు దీక్షాంగముగా వస్త్ర ప్రావరణము విధింపఁబడినది.)

7. అర్థము: సోమస్య=సోమలతయొక్క, క్రయాత్ పురా=క్రయము (కొనుట) కంటె పూర్వము, న అపోర్ణ్విత=యజ్ఞదీక్షితుని వస్త్రాచ్ఛాదనమును తీసివేయకూడదు. సోమస్య క్రయాత్=సోమముయొక్క క్రయముకంటె, పురా=పూర్వము, అపోర్ణ్విత యత్=వస్త్రాచ్ఛాదనమును తొలఁగించినచో, ప్రజానామ్=ప్రజలయొక్క గర్భాః=గర్భస్థ పిండములు, పరాపాతుకాః=పడిపోవునవి, స్యుః= అగును. సోమే=సోమము, క్రీతే సతి=కొనఁబడినదగుచుండగా, అపోర్ణుతే=వస్త్రాచ్ఛాదనమును తొలఁగించవలెను. యథా=ఏ విధముగా, వసీయాంసం ప్రతి=ధనవంతుని గూర్చి, అపోర్ణుతే=అడ్డముగా నుంచిన పటాదికము తొలఁగించఁబడుచున్నదో, తత్=ఆ యజ్ఞదీక్షితుని వస్త్రాచ్ఛాదనము, తాదృగేవ= అటువంటిదియే.

తాత్పర్యము: సోమయాగమునందు సోమలతను కొనుట యనునది ఒక అంశము. ఆ సోమలతను కొనుటకు పూర్వము యజ్ఞదీక్షితుని వస్త్రాచ్ఛాదనమును తీసివేయరాదు. సోమక్రయమునకు పూర్వమే వస్త్రాచ్ఛాదనమును

తొలఁగించినచో, ప్రజలయొక్క గర్భములు పడిపోవును. కావున సోమక్రయానంతరము వస్త్రాచ్ఛాదనమును తొలఁగించవలెను. రాజాదులను చూచుటకు ప్రజలు వచ్చినప్పుడు ఆవరణ పటాదికము (తెర) తొలఁగించుట వంటిదియే యీ వస్త్రాచ్ఛాదనమును తొలఁగించుట. (ఇచట వస్త్రాచ్ఛాదనము యొక్క అపనయన కాలము విధించఁబడినది.)

8. అర్థము: అఙ్గిరసః=అంగిరో నామక ఋషులు, సువర్గం లోకమ్=స్వర్గలోకమును గూర్చి, యన్తః=వెళ్లుచున్నవారై, ఊర్జమ్=అన్నరసమును, వ్యభజన్త=విభజించిరి. తతః=ఆ అన్నరసమునుండి, అవశిష్టం యత్=మిగిలిన అన్నరస మేది కలదో, తత్=అది, శరాః=దర్భలు, అభవన్=ఆయెను. ఊర్క్= అన్నరసము, శరాః=దర్భలుగా, అభవన్ వై=ఆయెనఁట. మేఖలా=రజ్జు సదృశ మేఖల, శరమయీ=దర్భలతో నిర్మితమై, భవతి యత్=ఉండినచో, యజమానః= యజమానుఁడు, ఊర్జమ్=అన్నరసమును, అవరున్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము: అంగిరసు లనెడి ఋషులు స్వర్గమునకు పోవుచు అన్న రసమును విభజింపఁగా మిగిలిన అన్నరసము దర్భలనెడి తృణ విశేషములుగా నాయెను. అన్నరసము శరములుగా ఆయెనఁట! కావున యజ్ఞకర్త యజ్ఞదీక్షాంగముగా ధరించెడి మేఖల దర్భలతో కూర్చఁబడిన రజ్జుసదృశ మేఖలగా నుండవలెను. అప్పుడు యజ్ఞకర్త నిశ్చయముగ అన్నరసమును పొందును. (యజ్ఞదీక్షితుఁడు దీక్షాంగముగా నడుమునకు దర్భలతో కూర్చఁబడిన త్రాడువంటి మేఖలను ధరించవలెనని ప్రథమ కాండమునందు చెప్పఁబడినది. ఆ సందర్భమున "ఊర్గస్యాఙ్గిరసీ" అని మేఖల అంగిరసుల అన్నరసముగా జెప్పఁబడినది. మేఖల లోని దర్భలు అన్నరస రూపము లను విషయము కథానికగా నిచట వివరింపఁబడినది.)

9. అర్థము: మధ్యతః=శరీర మధ్యభాగమునందు, సంనహ్యతి= మేఖలను బంధించవలెను. అస్మై=ఈ యజమానునియొక్క, మధ్యతః ఏవ=శరీర మధ్యభాగమునందే, ఊర్జమ్=అన్నరసమును, దధాతి=స్థాపించు చున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, మధ్యతః=శరీర మధ్యభాగమునందు, ఊర్జా=అన్నరసముతో, భుఞ్జతే=భుజించుచున్నారు.

తాత్పర్యము: (ఇచట యజ్ఞకర్తకు దీక్షాంగముగా మేఖలా బంధన ప్రదేశము విధించఁబడుచున్నది.) యజ్ఞదీక్షితునకు అధ్వర్యుఁడు శరీర మధ్య భాగమునందు మేఖలను కట్టవలెను. ఆ విధముగ కట్టిన యధ్వర్యుఁడు యజమానునియొక్క శరీర మధ్య భాగమునందే అన్నరసమును ఉంచినవాఁ డగుచున్నాఁడు. కావున లోకమునందు మనుష్యులు శరీర మధ్య భాగమునందు అన్నరసమును ధరించుచున్నారు.(అస్మై=అస్య)

10. అర్థము: పురుషస్య=పురుషునియొక్క, నాభ్యై=నాభియొక్క, (షష్ఠ్యర్థే చతుర్థీ) ఊర్ధ్వం వై=ఊర్ధ్వభాగమే, మేధ్యమ్=పవిత్రమైనది. అవాచీనమ్=క్రిందిభాగము, అమేధ్యమ్=అపవిత్ర మైనది. మధ్యతః=శరీర మధ్య భాగమునందు, సంనహ్యతి యత్=మేఖలను కట్టుట వలన, అస్య=ఈ యజమానునియొక్క, మేధ్యం చైవ=పవిత్ర ప్రదేశమే, అమేధ్యం చ=అపవిత్ర ప్రదేశమును కూడ (అపవిత్రతను), వ్యావర్తయతి=నివర్తింపఁజేయుచున్నది.

తాత్పర్యము: సాధారణముగ లోకమునందు మానవుని నాభియొక్క పైభాగము పవిత్రము. క్రింది భాగము అపవిత్రమైనది. మేఖలను శరీర మధ్య భాగమున కట్టుట వలన, పవిత్రమైన నాభి యొక్క పైభాగమే క్రింది భాగము యొక్క అపవిత్రతను కూడ తొలఁగించుచున్నది. (ఇచట మధ్యప్రదేశ ప్రశంస చేయఁబడినది.)

11. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రాయ= వృత్రాసురుని కొఱకు, వజ్రమ్=వజ్రాయుధమును, ప్రాహరత్=ప్రయోగించెను. సః=ఆ వజ్రాయుధము, త్రేధా=మూఁడు విధములుగా, వ్యభవత్=(వి+ అభవత్.) విశ్లథము (విఱిగినది) ఆయెను. తృతీయమ్=ఒక మూఁడవ భాగము, స్ఫ్యః=స్ఫ్యము అను ఖడ్గవిశేషముగాను, తృతీయమ్=ఇంకొక మూఁడవ భాగము, రథః=రథముగాను, తృతీయమ్=మఱియొక తృతీయ భాగము, యూపః= యూపముగాను (అభవన్=అయినవి). యే అన్తఃశరాః=వజ్రాయుధముయొక్క లోపల అల్పావయవములు ఏవి, అశీర్యన్త=శిథిల ములైనవో, తే=అవి, శరాః= దర్భలుగా (వెల్లులో ఒక భేదము), అభవన్=అయినవి. తత్=ఆ కారణమువలన,

శరాణామ్=దర్భలకు, శరత్వమ్=శరసంజ్ఞ, (సిధ్యతి=సిద్ధించుచున్నది.) శరాః=శరనామక తృణవిశేషములు (దర్భలు), వజ్రః వై=వజ్రస్వరూపములే. మనుష్యస్య=మనుష్యునకు, క్షుత్=ఆఁకలి, భ్రాతృవ్యః ఖలు వై=శత్రువే కదా! మేఖలా=దీక్షాంగమైన మేఖలా బంధనము, శరమయీ యత్=శరమయమైనచో, [యజ్ఞదీక్షితః=యజ్ఞదీక్షను వహించిన యజమానుఁడు] భ్రాతృవ్యమ్=శత్రువైన, క్షుధమ్=ఆఁకలిని, సాక్షాత్=సాక్షాత్తుగా, మధ్యతః=శరీర మధ్యమునుండి, అపహతే=పోఁగొట్టుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వము ఇంద్రుఁడు వృత్రాసురుని మీఁద వజ్రాయుధమును ప్రయోగించెను. ఆ వజ్రాయుధము మూఁడు భాగములుగా విఱిగెను. అందొక భాగము 'స్ఫ్యము' అను ఖడ్గవిశేషముగాను, ఒక భాగము రథముగాను, ఒక భాగము యూపముగాను అయినవి. వజ్రాయుధముయొక్క అల్పములయిన లోపలి యవయవములు శరనామక తృణవిశేషములు (దర్భలు)గా నైనవి. ఆ కారణమువలననే వానికి శరసంజ్ఞ సిద్ధించినది. శరనామక తృణవిశేషములు వజ్ర స్వరూపములే. మనుష్యునకు ఆఁకలియే కదా శత్రువు! యజ్ఞకర్త దీక్షాంగముగా ధరించిన మేఖలా బంధనము దర్భలతో కూడినదైనచో, ఆ యజ్ఞదీక్షితుఁడు శత్రువైన ఆఁకలిని సాక్షాత్తుగా శరీరమధ్యమునుండి తొలఁగించును. ("శౄ"=హింసాయామ్ అను ధాతువునుండి శరశబ్దము ఉత్పన్నమైనది. ఇచట 'ఆఁకలిని హింసించును,'అను అర్థమున శరపదము సార్థక మగుచున్నది. మేఖలకు శరమయత్వము ప్రశంసింపఁబడినది.)

12. అర్థము: (మేఖలా=మేఖల),త్రివృత్=మూఁడు వరుసలు కలదియై (త్రిగుణమై,) భవతి=ఉండవలెను. ప్రాణః=ప్రాణము, త్రివృత్ వై=ప్రాణాపానవ్యాన వృత్తులచే త్రిగుణమే. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁగా, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యజమానే=యజమానునియందు, మధ్యతః= శరీర మధ్యమునందు, త్రివృతం ప్రాణమేవ=ప్రాణా పాన వ్యాన వృత్తి రూప త్రిగుణాత్మక ప్రాణమునే, దధాతి=స్థాపించిన వాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞ దీక్షాంగమైన మేఖల త్రిగుణాత్మకముగ నుండవలెను. ప్రాణము ప్రాణా పాన వ్యాన వృత్తులచే త్రిగుణాత్మకమే. కావున త్రిగుణాత్మక మేఖలా బంధనము కావించిన యధ్వర్యుఁడు యజమానునియందు శరీర మధ్యమున త్రిగుణాత్మక ప్రాణమునే స్థాపించిన వాఁడగుచున్నాఁడు. (ఇచట గుణము విహితమైనది.)

13. అర్థము: రజ్జూనామ్=త్రాళ్లయొక్క, వ్యావృత్త్యై=వ్యావృత్తికొఱకు, మేఖలా=మేఖల, పృథ్వీ=పృథ్వీ సంబంధినియై, భవతి=ఉండవలెను.

తాత్పర్యము: ఖట్వాది స్థితము లయిన సూక్ష్మ రజ్జువులు మేఖలయందు చేరకుండుటకై మేఖల పృథివీ సంబంధినియై ఉండవలెను. (ఇచట గుణాంతరము విహితమైనది.)

14. అర్థము: మేఖలయా=మేఖలచేత, యజమానమ్=యజమానుని, యోక్త్రేణ=యోక్త్రము చేత, పత్నీమ్=యజమాన పత్నిని, దీక్షయతి= దీక్షింపఁజేయవలెను. (ఇయమ్=ఈ వ్యవస్థ), మిథునత్వాయ=మిథునత్వము కొఱకు భవతి=అగుచున్నది.

తాత్పర్యము: మేఖలచే యజమానుని, యోక్త్రముచే యజమాన పత్నిని దీక్షింపఁజేయవలెను. అప్పుడు మిథునత్వము సిద్ధించును. స్త్రీ పురుషుల జంట మిథున మగును. మేఖలా శబ్దము స్త్రీలింగము. తద్యోగము యజమానునకు కలుగుచున్నది. యోక్త్ర శబ్దము పుంలింగము. తద్యోగము యజమానపత్నికి కలుగుచున్నది. ఈ విధముగ మిథునత్వము సిద్ధించుచున్నది. (యోక్త్రము=యుజిర్=యోగే, అను ధాతువునుండి యోక్త్ర శబ్దము ఉత్పన్నమైనది. పశ్వాదులను కట్టుటకుపయోగించునట్టి 'పలుపు' అని యోక్త్ర శబ్దమునకు అర్థము.)

15. అర్థము: యజ్ఞః=యజ్ఞ పురుషుఁడు, దక్షిణామ్= దక్షిణా దేవిని, అభ్యధ్యాయత్=అభిముఖముగ ధ్యానించెను. తామ్=ఆ దక్షిణాదేవిని, సమభవత్=కలసికొనెను. తత్=ఆ ఇరువురి యోగమును, ఇన్ద్రః=ఇంద్రుఁడు, అచాయత్=తెలిసికొనెను. యః వై=ఏ పురుషుఁడైతే, ఇతః=ఈ దక్షిణా దేవినుండి, జనిష్యతే=పుట్టునో, సః=అతఁడు,

ఇదమ్=ఈ యైశ్వర్యమును గూర్చి, భవిష్యతీతి=అర్హుఁడు కాఁగలఁడని, సః=ఆ యింద్రుఁడు, అమన్యత=తలఁచెను. (తతః=పిమ్మట,) తామ్=ఆ దక్షిణాదేవిని, ప్రావిశత్=ప్రవేశించెను. తస్యాః=ఆ దక్షిణాదేవినుండి, ఇన్ద్రః ఏవ= ఇంద్రుఁడే, అజాయత=పుట్టెను. యః వై=ఏ పురుషుఁడైతే, మదితః పరః=నా యనంతరపువాఁడు, జనిష్యతే=పుట్టునో, సః=అతఁడు, ఇదమ్=ఈ ఐశ్వర్యమును గూర్చి, భవిష్యతీతి=అర్హుడు కాఁగలఁడని, సః=ఆ యింద్రుఁడు, అమన్యత=తలఁచెను. తస్యాః=ఆ దక్షిణాదేవియొక్క, యోనిమ్=యోనిని, అనుమృశ్య=స్పృశించి, ఆచ్ఛినత్=ఛేదించెను. సా=ఆ దక్షిణాదేవి, సూతవశా=వంధ్య, అభవత్=అయెను. తత్=అది, సూతవశాయై= వంధ్యయొక్క, (షష్ఠ్యర్థే చతుర్థీ) జన్మ=పుట్టుక. తామ్=ఆ యోనిని, హస్తే= హస్తమునందు, న్యవేష్టయత=చుట్టుకొనెను. తామ్=ఆయోనిని, మృగేషు= మృగముల యందు, న్యదధత్=ఉంచెను. సా=ఆ యోని, కృష్ణ విషాణా= కృష్ణవిషాణముగా, అభవత్=అయెను. "ఇన్ద్రస్య యోని రసి మా మా హిగ్ంసీః" ఇతి="ఇన్ద్రస్య యోనిరసీ" త్యాది మంత్రముచే, (అధ్వర్యుః= అధ్వర్యుఁడు, యజమానాయ=యజమానుని కొఱకు), కృష్ణవిషాణామ్= కృష్ణ విషాణమును, ప్రయచ్ఛతి=ఈయవలెను. [తతః=అందువలన, అధ్వర్యుః= అధ్వర్యుఁడు) యజ్ఞమ్=యజ్ఞమును, సయోనిమేవ=భోగ్యసహితముగానే, కరోతి=చేయుచున్న వాఁడగుచున్నాఁడు. దక్షిణామ్=దక్షిణాదేవిని, సయోనిమ్=అవయవ సహితగాను, ఇన్ద్రమ్=ఇంద్రుని, సయోనిమ్=కారణసహితునిగాను, కరోతి=చేయుచున్న వాఁడగుచున్నాఁడు. (ఇయమ్=ఈ కృష్ణవిషాణము) సయోనిత్వాయ=సయోనిత్వమునకై భవతి=అగుచున్నది.

తాత్పర్యము: యజ్ఞ పురుషుఁడు దక్షిణాదేవిని ధ్యానించి ఆమెను కలసికొనెను. ఇంద్రుఁడు ఆ విషయమును తెలిసికొని యీ దక్షిణాదేవియందు పుట్టినవాఁడు ఈ ఐశ్వర్యమును పొందఁగలఁడని తలఁచి ఆమెయందు ప్రవేశించి ఆమెయందు ఆ యింద్రుఁడే పుట్టెను. అప్పడా యింద్రుఁడు 'తన యనంతరము పుట్టఁబోవువాఁడు కూడ తన మాదిరిగానే యీ ఐశ్వర్యమును పొందఁగలడని ఊహించి యీ విధముగ జరుగకుండుటకై మాతృయోనిని ఛేదించెను. అనంతరమామె యోనిరహిత యగుటచే వంధ్య యైనది. ఆ కారణము వలననే లోకమునందు అనంతరము నష్టబీజ అయిన స్త్రీ వంధ్య యగుచున్నది. ఇంద్రుఁడా విచ్ఛిన్నమైన యోనిని చేతికి చుట్టుకొని దానిని మృగములయందుంచెను. అది కృష్ణవిషాణ మాయెను. అందువలన ఈ కృష్ణవిషాణము యజ్ఞపురుషునకు భోగ్యమైన యోని అయినది. దక్షిణా దేవికి అవయవ భూతము అయినది. ఇంద్రునకు జన్మ కారణ మైనది. యజ్ఞకర్త యజ్ఞదీక్షతో ఉన్నసమయమున శరీరమున కలిగిన కండూతి పోవుటకు కృష్ణవిషాణముతో గోఁకుకొనవలయునని, అధ్వర్యుఁడు కృష్ణవిషాణమును యజ్ఞదీక్షితున కీయవలెను. యజ్ఞదీక్షితుఁడా కృష్ణ విషాణమును "ఇన్ద్రస్య యోని రసి మా మా హిగ్ంసీః" అను మంత్రమును పఠించుచు ఆ కృష్ణవిషాణమును తీసికొనవలెను. (ఇచట కృష్ణవిషాణమునకు ఇంద్ర యోనిత్వము ఆఖ్యాయికా రూపమున వివరించఁబడినది.)

16. అర్థము: "కృష్యై త్వా సుసస్యాయై" ఇతి ఆహ="ఓ లోష్టమా! శోభన సస్యోపేత కృషి కొఱకు నిన్ను (వేదినుండి) పెల్లగించుచున్నాను." అని "కృష్యై త్వా" ఇత్యాది మంత్రము చెప్పినది. తస్మాత్=ఆ కారణమువలన, అకృష్టపచ్యాః= దున్నకయే పండునటువంటి, ఓషధయః=నీవారాది ధాన్యములు, పచ్యన్తే= పండుచున్నవి. (లోష్టము=మట్టిగడ్డ)

తాత్పర్యము: ఓ లోష్టమా! మంచి సస్యముతో కూడిన కృషి నిమిత్తము నిన్ను వేదినుండి పెల్లఁగిలఁజేయుచున్నాను, అని "కృష్యై త్వా" ఇత్యాది మంత్రము చెప్పినది. ఆ కారణమున భూమిని దున్నకయే పండునటువంటి నీవారాది ధాన్యములు ఫలించు చున్నవి అను అర్థము దీనివలన స్పష్టమగుచున్నది. "కృష్యై త్వా"

ఇత్యాది మంత్రముల వినియోగము ద్వితీయ ప్రపాఠకమునందే చెప్పఁబడినది. (ఇచట మంత్ర సామర్థ్యము చూపఁబడినది.)

17. **అర్థము:** "సుపిప్పలాభ్యః త్వా ఓషధీభ్యః" ఇతి ఆహ="ఓ శిరమా! శోభన ఫలోపేతము లయిన యోషధులకొఱకు నిన్ను (కృష్ణవిషాణముతో) గోఁకుచున్నాను" కండూయన ప్రయోజనము ప్రసక్త మైనప్పుఁడు కృష్ణ విషాణముతో యజ్ఞదీక్షితుఁడు శిరస్సును గోఁకుకొనవలెను. (ఇచట పిప్పలాశబ్ద సూచితమైన అర్థము చెప్పఁబడినది.)

18. **అర్థము:** (యజ్ఞదీక్షితః=యజ్ఞదీక్షితుఁడు,) హస్తేన= చేతితో, కణ్డూయేత యత్=గోఁకుకొనుచో, పామనం భావుకాః=పామాఖ్య రోగయుక్తులయిన, ప్రజాః=ప్రజలు, స్యుః=అగుదురు. స్మయేత యత్=నవ్వినచో, నగ్నం భావుకాః=ప్రజలు దారిద్ర్యముచే వస్త్ర రహితులు, స్యుః=అగుదురు. (తత్=ఆ కారణమువలన,) ప్రజానామ్=ప్రజలయొక్క, గోపీథాయ=రక్షణముకొఱకు, కృష్ణవిషాణయా=కృష్ణవిషాణముతో, కణ్డూయతే=గోఁకుకొనవలెను. అపిగృహ్య=ముఖమును చాటు పెట్టుకొని, స్మయతే=నవ్వవలెను.

**తాత్పర్యము:** యజ్ఞదీక్షితుఁడు హస్తముతో గోఁకుకొనినచో ప్రజలు (సంతానము) 'పామ' అను రోగమునకు గుఱి యగుదురు. నవ్వినచో దారిద్ర్యముచే వస్త్రరహితులగుదురు. కావున ప్రజల రక్షణమునకై కృష్ణవిషాణముతో గోఁకుకొనవలెను. ముఖమును మఱుగు పఱచుకొని నవ్వవలెను. (ఇచట విపక్షమునందలి దోషమును తెలుపుచు కృష్ణవిషాణ కండూయనము, ముఖపిధాన పూర్వక స్మయము విధింపఁబడినవి.)

19. **అర్థము:** దక్షిణాభ్యః నేతోః=ఋత్విజులకు దక్షిణల నిచ్చుటకు, పురా=పూర్వము, కృష్ణవిషాణామ్=కృష్ణవిషాణమును, నావచృతేత్= పరిత్యజింపఁగూడదు. దక్షిణాభ్యః నేతోః=దక్షిణల నిచ్చుటకు, పురా= పూర్వము, అవచృతేత్ యత్=పరిత్యజించుచో, ప్రజానామ్=ప్రజలకు, యోనిః= యోని, పరాపాతుకా=పడిపోవునట్టిది, స్యాత్=అగును. దక్షిణాసు=దక్షిణలు, నీతాసు (సత్సు)=ఋత్విజులకు పొందింపఁబడిన వగుచుండఁగా, కృష్ణవిషాణామ్=కృష్ణవిషాణమును, చాత్వాలే=చాత్వాలమునందు (గర్త విశేషమునందు), ప్రాస్యతి=విడువవలెను. చాత్వాలమ్=చాత్వాలము, యజ్ఞస్య= యజ్ఞమునకు, యోనిః వై=యోనివంటిదే. కృష్ణవిషాణా=కృష్ణవిషాణము, యోనిః=యోని. ఏవం కృతే సతి=ఇట్లు చేయఁబడగా, యోనావేవ= యోనియందే, యోనిమ్=యోనిని, దధాతి=ఉంచినవాడగుచున్నాఁడు. (ఏతత్=ఇది,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, సయోనిత్వాయ=సయోనిత్వముకొఱకు, భవతి=అగుచున్నది.

**తాత్పర్యము:** ఋత్విజులకు దక్షిణల నిచ్చుటకు పూర్వము కృష్ణవిషాణమును పరిత్యజించరాదు. అట్లు పరిత్యజించినచో ప్రజలయొక్క యోని పతన మైనదగును. ఋత్విజులకు దక్షిణల నిచ్చిన పిమ్మట చాత్వాల మనెడి గర్త విశేషమునందు కృష్ణవిషాణమును పరిత్యజింపవలెను. చాత్వాలము యజ్ఞమునకు యోనివంటిదియే. కృష్ణవిషాణము యోని. ఇట్లు చేయుటవలన యోనియందే యోనిని ఉంచినట్లగును. యజ్ఞము యోని సహిత మైనదగును. (ఇచట యజ్ఞకర్త కృష్ణవిషాణమును పరిత్యజించుట విపక్ష బాధాపూర్వకముగ విధింపఁబడినది.)

తృతీయానువాకము సమాప్తము.

# అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే చతుర్థోఽనువాకః

మూలము: [1]వాగ్వై దేవేభ్యోఽపాక్రామ ద్యజ్ఞాయాతిష్ఠమానా సా వనస్పతీ న్ప్రావిశత్సైషా వాగ్వనస్పతిషు వదతి

యా దున్దుభౌ యా తూణవే యా వీణాయాం యద్దీక్షితదణ్డం ప్రయచ్ఛతి వాచమేవావ రున్ధ

[2]ఔదుమ్బరో భవత్యూర్గ్వా ఉదుమ్బర ఊర్జ మేవావ రున్ధే ముఖేన సంమితో భవతి ముఖత ఏవాస్మా

ఊర్జం దధాతి తస్మాన్ముఖత ఊర్జా భుఞ్జతే (౧) [3]క్రీతే సోమే మైత్రావరుణాయ దణ్డం ప్ర యచ్ఛతి

మైత్రావరుణో హి పురస్తా దృత్విగ్భ్యో వాచం విభజతి తామృత్విజో యజమానే ప్రతి ష్ఠాపయన్తి

[4]స్వాహా యజ్ఞం మనసేత్యాహ మనసా హి పురుషో యజ్ఞ మభిగచ్ఛతి స్వాహా ద్యావాపృథివీభ్యా

మిత్యాహ ద్యావాపృథివ్యోర్హి యజ్ఞః స్వాహోరో రన్తరిక్షా దిత్యాహాన్తరిక్షే హి యజ్ఞః స్వాహా యజ్ఞం

వాతాదా రభ ఇత్యాహాయమ్(౨)వావ యః పవతే స యజ్ఞస్త మేవ సాక్షాదా రభతే [5]ముష్టీ కరోతి

వాచం యచ్ఛతి యజ్ఞస్య ధృత్యా [6]అదీక్షిష్టాయం బ్రాహ్మణ ఇతి త్రిరుపాగ్ంశ్వాహ దేవేభ్య ఏవైనం

ప్రాఽఽహ త్రి రుచ్చై రుభయేభ్య ఏవైనం దేవమనుష్యేభ్యః ప్రాఽఽహ [7]న పురా నక్షత్రేభ్యో

వాచం వి సృజేద్యత్పురా నక్షత్రేభ్యో వాచం విసృజేద్యజ్ఞం విచ్ఛిన్ద్యాత్ (3) [8]ఉదితేషు నక్షత్రేషు

వ్రతం కృణుతేతి వాచం విసృజతి యజ్ఞవ్రతో వై దీక్షితో యజ్ఞ మేవాభి వాచం వి సృజతి [9]యది

విసృజే ద్వైష్ణవీ మృచమను బ్రూయాద్యజ్ఞో వై విష్ణుర్యజ్ఞేనైవ యజ్ఞగ్ం సం తనోతి [10]దైవీం ధియం

మనామహ ఇత్యాహ యజ్ఞ మేవ తన్మ్రదయతి [11]సుపారా నో అసద్వశ ఇత్యాహ వ్యుష్టి మేవావ

రున్ధే(౪) [12]బ్రహ్మవాదినో వదన్తి హోతవ్యం దీక్షితస్య గృహా3ఇ న హోతవ్యా3 మితి హవిర్వై దీక్షితో

యజ్జుహుయా ద్యజమానస్యావదాయ జుహుయాద్యన్న జుహుయా ద్యజ్ఞపరు రన్తరియాద్యే దేవా మనోజాతా మనోయుజ ఇత్యాహ ప్రాణా వై దేవా మనోజాతా మనోయుజ స్తేష్వేవ పరోక్షం జుహోతి తన్నేవ హుతం నేవా హుతగ్ం [13]స్వపన్తం వై దీక్షితగ్ం రక్షాగ్ంసి జిఘాగ్ంసన్త్యగ్నిః (౩) ఖలు వై రక్షోహాఽగ్నే త్వగ్ం సు జాగృహి వయగ్ం సు మన్దిషీమహీత్యాహాగ్ని మేవాధిపాం కృత్వా స్వపితి రక్షసా మపహత్యా [14]అవ్రత్యమివ వా ఏష కరోతి యో దీక్షితః స్వపితి త్వ మగ్నే వ్రతపా అసీత్యాహాగ్నిర్వై దేవానాం వ్రతపతిః స ఏవైనం వ్రతమా లమ్భయతి [15]దేవ ఆ మర్త్యేష్వే త్యాహ దేవః (౬)హ్యేష సన్మర్త్యేషు [16]త్వం యజ్ఞేష్వీడ్య ఇత్యాహైతగ్ంహి యజ్ఞేష్వీడతే [17]ఽప వై దీక్షితా త్సుషుపుష ఇన్ద్రియం దేవతాః క్రామన్తి విశ్వే దేవా అభి మా మా ఽవవృత్ర న్నిత్యా హేన్ద్రియేణైవైనం దేవతాభిః సం నయతి [18]యదేతద్యజుర్న బ్రూయాద్యావత ఏవ పశూనభి దీక్షేత తావన్తో ఽస్య పశవః స్యూ రాస్వేయత్ (౭)సోమాఽఽభూయో భరేత్యాహాపరిమితానేవ పశూనవ రున్ధే [19]చన్ద్రమసి మమ భోగాయ భవేత్యాహ యథాదేవత మేవైనాః ప్రతి గృహ్ణాతి [20]వాయవే త్వా వరుణాయ త్వేతి యదేవ మేతా నానుదిశే దయథాదేవతం దక్షిణా గమయేదా దేవతాభ్యో వృశ్చ్యేత యదేవమేతా అనుదిశతి యథాదేవతమేవ దక్షిణా గమయతి న దేవతాభ్య ఆ (౮)వృశ్చ్యతే [21]దేవీ రాపో అపాం నపాదిత్యాహ యద్వో మేధ్యం యజ్ఞియగ్ం సదేవం తద్వో మాఽవ క్రమిష మితి వా వైతదాహా [22]చ్ఛిన్నం తన్తుం పృథివ్యా అను గేషమిత్యాహ సేతుమేవ కృత్వాఽత్యేతి(౯) ||

[భుఞ్జతేఽయం ఛిన్ద్యాద్రున్ధేఽగ్నిరాహ దేవ ఇయద్దేవతాభ్య ఆ త్రయస్త్రిగ్ంశ చ్చ||]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమప్రపాఠకే చతుర్థోఽనువాకః ||౪||

# వేదార్థదీపిక

అవతారిక:- తృతీయానువాకమునందు యజ్ఞదీక్షితునకు కృష్ణవిషాణాది దీక్షాకరణము చెప్పఁబడినది. ఈ చతుర్థానువాకమునందు యజ్ఞదీక్షితునకు దండాదానాది పూర్వక నియమానుష్ఠానము చెప్పఁబడుచున్నది.

1. అర్థము: వాక్=వాగ్దేవత, యజ్ఞాయ=యజ్ఞముకొఱకు, అతిష్ఠమానా=ఉండనిదియై, దేవేభ్యః వై=దేవతలనుండియే, అపాక్రామత్= తొలఁగిపోయెను. సా=ఆ వాక్కు, వనస్పతీన్=వనస్పతులను, ప్రావిశత్= ప్రవేశించెను. యా=ఏ వాక్కు, దుందుభౌ=దుందుభి అను వాద్యవిశేషమునందు, (అస్తి=కలదో,) యా=ఏ వాక్కు, తూణవే=వేణువునందు, (అస్తి=కలదో,) యా=ఏ వాక్కు, వీణాయామ్=వీణయందు, (అస్తి=కలదో,) సా ఏషా=ఆ యీ వాక్కు, వనస్పతిషు=వనస్పతులందు, వదతి=పలుకుచున్నది. [యజ్ఞకర్త్రే=యజ్ఞకర్తకొఱకు,] దీక్షిత దణ్డమ్=దీక్షాంగమైన దండమును, ప్రయచ్ఛతి యత్=ఇచ్చినచో, (యజ్ఞదీక్షితః=యజ్ఞదీక్షితుఁడు,) వాచమ్=వాక్కును, అవరున్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము: వాగ్దేవత యజ్ఞముకొఱకు ఉండక దేవతలనుండియే తొలఁగిపోయి వృక్షములందు ప్రవేశించెను వేణు వీణా దుందుభులు అనెడి వాద్యవిశేషములందు ఉండెడి వాక్కు (ధ్వని) వనస్పతులందు (వృక్షములందు) పలుకుచున్నది. కావున యజ్ఞ దీక్షితునకు దండము నిచ్చినచో, అతఁడు నిశ్చయముగ వాక్కును పొందును (వాగింద్రియశక్తి కలవాఁడగును).

2. అర్థము: దణ్డః=దండము, ఔదుమ్బరః=మేడిచెట్టునకు సంబంధించినదిగా, భవతి=కావలెను. ఉదుమ్బరః=మేడిచెట్టు, ఊర్క్ వై=రసవంతమే. (ఏవం సతి=ఇట్లు కాఁగా, యజ్ఞదీక్షితః=(దీక్షాంగముగా ఔదుంబర దండమును గ్రహించిన యజ్ఞదీక్షితుఁడు,) ఊర్జమేవ=రస(బల)మునే, అవరున్ధే= పొందుచున్నాఁడు. దణ్డః=దండము, ముఖేన=ముఖముతో, సమ్మితః= సమాన పరిమితి కలదిగా, భవతి=ఉండవలెను. (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అస్మై=ఈ యజ్ఞకర్తకొఱకు, ముఖతః ఏవ=ముఖమునుండియే, ఊర్జమ్= రసమును, దధాతి=స్థాపించుచున్నాఁడు.తస్మాత్=ఆ కారణమువలన, (లోకే=లోకమునందు, జనాః=జనులు,) ముఖతః=ముఖమునుండి, ఊర్జా=రసములో, భుఞ్జతే=భుజించుచున్నారు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు దీక్షాంగముగా గ్రహింపవలసిన దండము మేడిచెట్టునకు సంబంధించినదియై యుండవలెను. అప్పుడు ఆ దండమును స్వీకరించిన యజమానుఁడు ఉదుంబరము రసవత్తరము కావున రసమునే(బలమునే) పొందును. ఆ దండము ముఖప్రమాణము కలిగి యుండవలెను. అప్ప డధ్వర్యుఁడు ఈ యజమానునికొఱకు ముఖమునుండియే రసమును స్థాపించినవాఁ డగుచున్నాఁడు. కావున లోకమున జనులు రస(బల)ముచే ముఖమునుండి భుజించుచున్నారు.

3. అర్థము: సోమే=సోమము, క్రీతే సతి=కొనఁబడిన దగుచుండఁగా, (యజ్ఞదీక్షితః=యజ్ఞదీక్షితుఁడు,) మైత్రావరుణాయ= మైత్రావరుణ నామక ఋత్విజునికొఱకు, దణ్డమ్=దండమును, ప్రయచ్ఛతి=ఈయవలెను. మైత్రావరుణః=మైత్రావరుణుఁడు, పురస్తాత్=ప్రథమమున, ఋత్విగ్భ్యః= ఋత్విజులకొఱకు, వాచమ్=ప్రైషలచే మంత్రమును, విభజతి హి=విభజించుచున్నాఁడు కదా! తామ్=ఆ మంత్రరూప వాక్కును, ఋత్విజః=ఋత్విజులు, యజమానే= యజమానునియందు, ప్రతిష్ఠాపయన్తి=ప్రతిష్ఠింపఁజేయుచున్నారు.

తాత్పర్యము: యజ్ఞకర్త యజ్ఞమునకు అవసరమైన సోమమును కొనిన పిమ్మట ఆ దండమును మైత్రావరుణుఁడనెడి ఋత్విజున కీయవలెను. మైత్రావరుణుఁడు ప్రథమమున ఋత్విజులకు ప్రైషలచేత మంత్రములను విభజించుచున్నాఁడు కదా! ఆ ఋత్విజులు యజమానుని నిమిత్తము ఆ మంత్రములను పఠించుచుందురు. కావున మైత్రావరుణునకు వాగ్రూప దండము యుక్తమైనది.

4. అర్థము: "స్వాహా యజ్ఞం మనసా" ఇతి ఆహ="స్వాహా యజ్ఞం మనసా" అని వేదము చెప్పినది. పురుషః=పురుషుఁడు, మనసా=మనస్సుచేత, యజ్ఞమ్=యజ్ఞమును, అభి గచ్ఛతి హి=పొందుచున్నాఁడు కదా! "స్వాహా ద్యావా పృథివీభ్యామ్" ఇతి ఆహ="స్వాహా ద్యావా పృథివీభ్యామ్" అని వేదము చెప్పినది. యజ్ఞః=యజ్ఞము, ద్యావా పృథివ్యోః=ద్యావా భూములందు, స్వాహా హి=ఆశ్రితమైనది కదా! "ఉరో రన్తరిక్షాత్" ఇతి ఆహ="ఉరో రన్తరిక్షాత్" అని వేదము చెప్పినది. అన్తరిక్షే హి=అంతరిక్షమునందు కూడ, యజ్ఞః=యజ్ఞము, స్వాహా=ఆశ్రితమైనది. "యజ్ఞం వాతా దారభే" ఇతి ఆహ="యజ్ఞం వాతా దారభే" అని వేదము చెప్పినది. యః=ఏ వాయువు, పవతే=వీఁచుచున్నదో, అయం వావ=ఇదియే, సః యజ్ఞః=ఆ యజ్ఞము. తమేవ=ఆ యజ్ఞమునే సాక్షాత్=సాక్షాత్తుగ, ఆరభతే=యజ్ఞకర్త ఆరంభించుచున్నాఁడు.

తాత్పర్యము: "స్వాహా యజ్ఞం మనసే" త్యాది మంత్రమునందుఁగల స్వాహా శబ్దములకు బ్రాహ్మణము ననుసరించి వేర్వేరు అర్థములు చెప్పఁబడినవి. (ఉపలక్షణీయము లైనవి.) "స్వాహా యజ్ఞం మనసా" అను చోట పురుషుఁడు యజ్ఞమును మనస్సుచే అభిముఖముగ పొందుచున్నాఁడు అని యర్థము. "స్వాహా ద్యావా పృథివీభ్యామ్" అను వాక్యమునకు యజ్ఞము ద్యావా భూములందు ఆశ్రిత మైనది అని యర్థము. "స్వాహోరో రన్తరిక్షాత్" అను వాక్యమునకు గొప్పదియైన అంతరిక్షమునందుఁగూడ యజ్ఞము ఆశ్రితమైనది అని యర్థము. "యజ్ఞం వాతా దారభే" అను వాక్యమునకు సాక్షాత్తుగానే వాయువుయొక్క అనుగ్రహమువలన యజ్ఞమును ఆరంభించుచున్నాను అని యర్థము. (ఇది ఉపలక్షణప్రకారము)

5. అర్థము: (యజ్ఞకర్తా=యజ్ఞకర్త,) యజ్ఞస్య= యజ్ఞముయొక్క, ధృత్యై=ధారణముకొఱకు, ముష్టీ=పిడికిలిని, కరోతి=చేయవలెను. వాచమ్=వాక్కును, యచ్ఛతి=నియమించవలెను.

తాత్పర్యము: యజ్ఞకర్త తాను చేయు యజ్ఞము దృఢముగ సిద్ధించుటకై పిడికిలిని బిగించవలెను. (రెండు చేతులయందలి చిటికినవ్రేలు మొదలు నాలుగు వ్రేళ్లను ముడువవలెను.) వాఙ్నియమమును కూడ పాటించవలెను. యజ్ఞధృతి అనఁగా అప్రమత్తత.

6. అర్థము: అయమ్=ఈ, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, (అధ్వర్యుఁడు) అదీక్షిష్ట=దీక్షను వహింపఁజేసెను, ఇతి=అని త్రిః= మూఁడు మారులు, ఉపాంశు=మెల్లగా, (మంద్రస్వరముతో,) ఆహ=పలుకవలెను. (తదా=అప్పుడు) ఏనమ్=ఈ అధ్వర్యుని గూర్చి, దేవేభ్యః ఏవ=దేవతల కొఱకే, ఆహ=చెప్పినట్లగుచున్నది. త్రిః=మూఁడుమారులు, ఉచ్చైః=ఉచ్చైస్స్వరముతో, ఆహ=పలుకవలెను. తదా=అప్పుడు, ఏనమ్=ఈ అధ్వర్యుని గూర్చి, ఉభయేభ్యః దేవమనుష్యేభ్యః ఏవ=దేవ మనుష్యులైన యుభయులకొఱకే, ప్రాహ=బాగుగ చెప్పినట్లగుచున్నది.

తాత్పర్యము: ఈ యధ్వర్యుఁడు దీక్షను వహింపఁజేసెనని మూఁడు మారులు మంద్రస్వరముతో పలుకవలెను. అట్లు పలికినచో దేవతలకే చెప్పినట్లగును. మూఁడు మారులు ఉచ్చైస్స్వరముతో పలుకవలెను. అట్లు పలికినచో దేవమనుష్యుల కుభయులకు చెప్పినట్లగును (ఇచట అధ్వర్యునకు ఒక మంత్రమును చెప్పి దాని వినియోగము విధించఁబడినది.)

7. అర్థము: నక్షత్రేభ్యః పురా=నక్షత్రముల ఉదయమునకు పూర్వము, వాచమ్=వాక్కును, న విసృజేత్=విడువరాదు. నక్షత్రేభ్యః పురా=నక్షత్రోదయమునకు పూర్వము, వాచమ్=వాక్కును, విసృజేత్ యత్=విడిచినచో, యజ్ఞమ్=యజ్ఞమును, విచ్ఛిన్ద్యాత్=విచ్ఛిన్నము చేసినవాఁ డగును.

తాత్పర్యము: యజ్ఞకర్త స్వీకరించిన వాఙ్నియమమును నక్షత్రోదయమునకు పూర్వము విడువరాదు. నక్షత్రోదయమునకు పూర్వము వాఙ్నియమమును విడిచినచో యజ్ఞమును విచ్ఛిన్నము చేసినవాఁ డగును. (యజ్ఞకర్త స్వీకరించిన వాఙ్నియమమును నక్షత్రోదయమునకు పూర్వము విడువరాదని నిషేధము విధింపఁబడినది.)

8. అర్థము: నక్షత్రేషు=నక్షత్రములు, ఉదితేషు సత్సు= ఉదయించిన వగుచుండఁగా, వ్రతమ్=క్షీర సంపాదన రూప వ్రతమును, కృణుత= చేయుఁడు, ఇతి=అని, వాచమ్=వాక్కును, విసృజతి=విడువవలెను. దీక్షితః=యజ్ఞదీక్షితుఁడు, యజ్ఞవ్రతః వై=యజ్ఞవ్రతుఁడే. (సః= ఆ యజ్ఞవ్రతుఁడు,) యజ్ఞమ్ అభ్యేవ=యజ్ఞమున కభిముఖముగనే, వాచమ్= "వ్రతం కృణుత" అను వాక్కును, విసృజతి=విడువవలెను.

తాత్పర్యము: [వాఙ్నియమమును విడుచునప్పుడు చెప్పవలసిన ప్రైష మంత్ర మిచట విధింపఁబడినది.] నక్షత్రోదయమైన పిమ్మట యజ్ఞదీక్షితుఁడు తాను క్షీరమును త్రాగుటకై క్షీరమును సంపాదించుఁను. అనఁగా తీసికొనిరండు అని అడుగవలెను. "వ్రతం కృణుత" అను నదియే ప్రైష మంత్రము. యజ్ఞదీక్షితుఁడు యజ్ఞవ్రతుఁడే. (యజ్ఞార్థం స్వీకృతం వాఙ్నియమాదిరూపం వ్రతం యస్య సః=యజ్ఞవ్రతః.) క్షీర సంపాదన ప్రైష కూడ యజ్ఞముకొఱకే కావున ఇట్టి వాగ్విమోకము దోషకారి కాదు. ఈ ప్రైషమంత్రమును యజ్ఞమున కభిముఖముగ పలుకవలెను. (యజ్ఞదీక్షితుఁడు రాత్రియందు నక్షత్రోదయమునకు పిమ్మటనే క్షీరమును త్రాగవలెను.)

9. అర్థము: విసృజేత్ యది=నక్షత్రోదయమునకు పూర్వము వాఙ్నియమమును విసర్జించినచో, వైష్ణవీమ్ ఋచమ్=విష్ణు పద ఘటితమైన ఋక్కును, అను బ్రూయాత్=వెంటనే పఠించవలెను. విష్ణుః=విష్ణువు, యజ్ఞః వై=యజ్ఞ స్వరూపుఁడే. (తథా కృతే సతి=అట్లు చేయఁగా,) యజ్ఞేనైవ= యజ్ఞస్వరూపుఁడైన విష్ణువుచేతనే, యజ్ఞమ్=యజ్ఞమును, సంతనోతి= బాగుగ విస్తరింపఁజేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు నక్షత్రోదయమునకు పూర్వము లౌకిక విషయమును మాటలాడినచో తద్దోష పరిహారమునకై వైష్ణవి ఋక్కును వెంటనే పఠించవలెను. విష్ణువు యజ్ఞస్వరూపుఁడే కావున, యజమానుఁడు యజ్ఞస్వరూపుఁడైన విష్ణువుచేతనే యజ్ఞమును బాగుగ విస్తరింపఁజేసినవాఁ డగును (యజ్ఞమును యథావిధిగ అనుష్ఠించినవాఁ డగును. "విష్ణో త్వం నో అన్తమః" అనునది వైష్ణవి ఋక్కు అని కొందఱి మతము. "ఇదం విష్ణు ర్విచక్రమే" అనునది వైష్ణవి ఋక్కు అని మఱికొందఱి మతము.)

10. అర్థము: "దైవీం ధియం మనామహే" ఇతి అహ=మేము అభీష్టసిద్ధికై దేవతా విషయక కర్మానుష్ఠాన బుద్ధిని సంపాదించుచున్నాము అని వేదము చెప్పినది. తత్=ఆ కారణమువలన, (యజమానః=యజమానుఁడు,) యజ్ఞమేవ=యజ్ఞమునే, మ్రదయతి=మృదువుగాఁ జేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ("దైవీం ధియమ్" ఇత్యాది మంత్రములు ప్రథమ కాండస్థ ద్వితీయ ప్రపాఠకగత తృతీయానువాకములోనివి. ఆ తృతీయానువాకములోని మంత్రములకు ఈ యనువాకము వివరణాత్మకము.) "దైవీం ధియం మనామహే సుమృడీకా మభిష్టయే" అని చెప్పటచే యజమానుఁడు యజ్ఞమును మృదువుగా చేయుచున్నాఁడని యర్థము. ("సుమృడీకామ్" అను పదమున కర్థము ఇచట వివరింపఁబడినది.)

11. అర్థము: "సుపారా నో అసద్వశే" ఇతి అహ=పూర్వ మంత్రోక్త మయిన దేవతా విషయక కర్మానుష్ఠానబుద్ధి బాగుగ పారమును పొందినదై మా స్వాధీనమునం దుండుఁగాక, అని "సుపారా" ఇత్యాది మంత్రము చెప్పినది. (తేన=ఆ చెప్పటచే, అయమ్=ఈ యజ్ఞకర్త,)వ్యుష్టిమేవ=కృత్స్న యజ్ఞ ప్రకాశన రూప సుప్రభాతమునే, అవరున్ధే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: "సుపారా నో అసద్వశే" అని చెప్పటచే యజమానుఁడు సుప్రభాతమునే పొందుచున్నాఁడని అర్థము.

12. అర్థము: దీక్షితస్య=యజ్ఞ దీక్షితునియొక్క, గృహే హోతవ్యమ్ ఇతి=గృహమునందు హోమము చేయవచ్చునా? న హోతవ్యామ్= హోమము చేయరాదా? ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి= పరస్పరము చెప్పకొనుచున్నారు. (మాటలాడుకొనుచున్నారు.) దీక్షితః=యజ్ఞదీక్షితుడు, హవిః వై=హవిస్స్వరూపుఁడే. యజమానస్య=యజ్ఞకర్తయొక్క, (గృహే= గృహమునందు,) యత్ జుహుయాత్=హోమము చేయునెడల, అవదాయ=(హవిస్సువంటి యజమానుని,) అవదానము చేసి, జుహుయాత్=హోమము చేసినట్లగును. న

జుహుయాత్ యత్=హోమము చేయనిచో, యజ్ఞపరుః=నిత్యాగ్నిహోత్రముయొక్క ప్రతిదినానుష్ఠాన రూపమైన పర్వము, అన్తరియాత్=విచ్ఛిన్న మగును. "యే దేవా మనోజాతా మనోయుజః ఇతి ఆహ='ఉత్పత్తికాలమునందు మనస్సుతో కూడ పుట్టినవారును, వ్యవహారకాలమునందు మనస్సుతో కూడియుండువారును అగు ఏ దేవతలు కలరో, ఆ దేవతలు పయఃపాన రూప వ్రతమును అనుష్ఠించుచున్న మమ్ము శుద్ధిసంపాదనముచే రక్షింతురు గాక అని వేదము చెప్పినది. ప్రాణాః వై=ప్రాణములే, మనోజాతాః=మనస్సుతో కూడ పుట్టినవారును, మనోయుజః=(వ్యవహారకాలమున,) మనస్సుతో కూడియుండువారును అగు, దేవాః=దేవతలు. తేష్వేవ=ఆ ప్రాణరూప దేవతలయందే, పరోక్షమ్=పరోక్షముగా, జుహోతి=హోమము చేసినవాఁ డగుచున్నాఁడు. తత్=అట్టి హోమము వలన, న హుతమివ=హోమము చేయఁబడినట్టిది కాదు. న అహుతమివ=హోమము చేయఁబడనట్టిదియు కాదు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుని గృహమునందు అగ్నిహోత్ర హోమము చేయవచ్చునా? చేయరాదా? అని మంత్రజ్ఞులు భాషించుకొనుచున్నారు. యజ్ఞదీక్షితుఁడు హవీరూపుఁడే కావున యజమాన గృహమునందు హోమము చేయుచో, యజమానుఁడే హుతుఁడగును. హోమము చేయనిచో నిత్యాగ్నిహోత్రముయొక్క ప్రతిదినానుష్ఠాను రూప పర్వము విచ్ఛిన్న మగును. పూర్వప్రసిద్ధమైన మంత్రముచే ఆహవనీయాగ్నియందు హోమము ప్రత్యక్షమని చెప్పఁబడుచున్నది. ఈ అగ్నిహోత్ర హోమము అన్యమంత్రముచే ప్రాణాగ్నులయందు హూయమానమగుటచే పరోక్ష మైనది. అందువలన పూర్వోక్త దోషద్వయము లేదు. కావున ఈ మంత్రముచే పయఃపాన రూప వ్రతము నాచరించవలెనని యభిప్రాయము.

13. అర్థము: స్వపన్తమ్=నిద్రించుచున్న, దీక్షితం వై= యజ్ఞదీక్షితునే, రక్షాంసి=రాక్షసులు, జిఘాంసన్తి=హింసించుచున్నారు. అగ్నిః=అగ్ని, రక్షోహా ఖలు వై =రాక్షసులను సంహరించువాఁడే కదా! "అగ్నే త్వగ్ం సు జాగృహి వయగ్ం సు మన్దిషీమహి" ఇతి ఆహ=ఓ అగ్నీ! నీవు బాగుగ మేల్కొని యుండుము. మేము (నిర్భయులమై) నిద్రింతుము అని మంత్రము చెప్పినది. (అతః=ఈ కారణమువలన,) రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=నాశముకొఱకు, అగ్నిమేవ=అగ్నినే, అధిపామ్=అధిపతినిగా, కృత్వా=చేసి, (యజ్ఞదీక్షితః=యజ్ఞదీక్షితుఁడు,) స్వపితి=నిద్రించవలెను.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు నిద్రించినచో అతనిని రాక్షసులు హింసింతురు. అగ్ని రాక్షసహన్త. "ఓ యగ్నీ! నీవు బాగుగ మేల్కొనియుండుము. మేము నిర్భయముగ నిద్రింతుము" అని "అగ్నే త్వగ్ం సు జాగృహి" ఇత్యాది మంత్రము చెప్పినది. కావున యజ్ఞకర్త రాక్షసనాశమునకై అగ్నినే అధిపతినిగా చేసి నిద్రించవలెను. (అధిపామ్=అధిపమ్.)

14. అర్థము: యః=ఏ యజ్ఞకర్త, దీక్షితః=యజ్ఞదీక్షను పొందినవాఁడై, స్వపితి=నిద్రించుచున్నాఁడో, ఏషః=ఇతఁడు, (యజ్ఞమ్=యజ్ఞమును,) అవ్రత్యమివ=నియమరహితమైన దానినివలె, కరోతి వై=చేయుచున్నాఁడు కదా! "త్వ మగ్నే వ్రతపా అసి" ఇతి ఆహ='ఓ అగ్నీ! నీవు వ్రతమును పాలించువాఁడ వగుచున్నావు' అని "త్వ మగ్నే" ఇత్యాది మంత్రము చెప్పినది. అగ్నిః వై=అగ్నియే, దేవానామ్=దేవతలకు, వ్రతపతిః=వ్రతపాలకుఁడు, సః ఏవ=ఆ యగ్నియే, ఏనం వ్రతమ్=ఈ యజ్ఞకర్తయొక్క వ్రతమును, ఆలమ్భయతి=వికలము కానిదానినిగా జేయుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞకర్త యజ్ఞదీక్షను పొందినవాఁడై నిద్రించినచో, అతఁడు యజ్ఞమును నియమ రహితమైనదానినివలె ననుష్ఠించినవాఁ డగును. "త్వ మగ్నే వ్రతపా అసి" అని వేదము చెప్పుటచే, అగ్నియే దేవతల వ్రతపాలకుఁడు, కావున ఆ యగ్నియే యా యజమానుని వ్రతమును అవికలముగాఁ జేయును.

15.అర్థము: "దేవ ఆ మర్త్యేషు" ఇతి ఆహా='ఓ యగ్నీ! నీవు వచ్చి మనుష్యులయందు వ్రతపాలకుఁడవైన దేవుఁడవగుచున్నావు' అని "దేవ ఆ మర్త్యేషు" అను మంత్రము చెప్పినది. ఏషః=ఈ యగ్ని, దేవః సన్=దేవుఁడగుచు, మనుష్యేషు=మనుష్యులయందు, వ్రతం పాలయతిహి=వ్రతమును పాలించు చున్నాఁడు కదా!

తాత్పర్యము: "త్వ మగ్నే వ్రతపా అసి దేవ ఆ మర్త్యేష్వా త్వం యజ్ఞేష్వీడ్యః" అను ఈ మంత్రమునందలి "దేవ ఆ మర్త్యేష్వా" అను రెండవ పాదము ఇచట వివరింపఁబడినది. మనుష్యులయందలి విచ్ఛిన్నమైన వ్రతమును మనుష్యావతారముచే పాలించుచున్నాఁడనెడి శంకను నివారించుటకై ఇచట వివరణము ఈయఁబడినది. అగ్ని మనుష్యులయొక్క వ్రతమును దేవతగానే యుండి పాలించుచున్నాఁడు కావున వ్రతమును పాలించుటకు అగ్ని సమర్థుఁడని భావము.

16. అర్థము: "త్వం యజ్ఞే ష్వీడ్యః" ఇతి ఆహా=అగ్నీ! అంతటను యజ్ఞములందు నీవు స్తుతింపఁబడుచున్నావని యీ మంత్రము చెప్పినది. ఏతమ్= ఈ యగ్నిని, యజ్ఞేషు=యజ్ఞములందు, ఈడతే హి=స్తుతించుచున్నారు కదా!

తాత్పర్యము: "అగ్ని ర్మూర్ధా దివః కకుత్" ఇత్యాది యాజ్యా పురోనువాక్యాది మంత్రములందు అగ్ని స్తుతింపఁబడుచున్నాఁ డనెడి అభిప్రాయము "త్వం యజ్ఞే ష్వీడ్యః" అను మంత్ర తృతీయపాదమునందు స్వయముగ చూపఁబడినది. అగ్ని యజ్ఞములందు స్తుతింపఁబడుచుండుట ప్రసిద్ధము.

17. అర్థము: సుషుపుషః=సుషుప్తుఁడైన, దీక్షితాత్= యజ్ఞదీక్షితునినుండి, ఇన్ద్రియం వై=సామర్థ్యమునే, దేవతాః=దేవతలు, అపక్రామన్తి=తొలఁగించుచున్నారు. (అతః=ఇందువలన,) "విశ్వే దేవా అభి మా మాఽవ వృత్రన్" ఇతి ఆహా='సర్వ దేవతలు అంతటను పాలించుటకు నన్ను ఆవరించి ఉందురు గాక,' అని "విశ్వే దేవా" ఇత్యాది మంత్రము చెప్పినది. (అయమ్= ఈ మంత్రము) ఏనమ్=ఈ యజమానుని, ఇన్ద్రియేణైవ=అతీంద్రియ సామర్థ్యముతోను, దేవతాభిః=తదభిమాని దేవతలతోను, సంయోజయతి=బాగుగ కలుపుచున్నది.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు నిద్రించుచున్నచో అతని సామర్థ్యమునే దేవతలు అతనినుండి తొలఁగింతురు. అందువలననే 'సర్వ దేవతలు అంతటను పాలించుటకు నన్ను ఆవరించి ఉందురుగాక, అని "అప వై దీక్షితాత్" ఇత్యాది మంత్రము చెప్పినది. ఈ మంత్రము ఈ యజ్ఞదీక్షితుని అతీంద్రియ సామర్థ్యము కలవానినిగాను, దేవతా సాన్నిధ్యము కలవానినిగాను చేయుచున్నది. కావున యజ్ఞదీక్షితుఁడు ప్రబుద్ధుఁడై యుండి యీ మంత్రమును జపించవలెను.

18. అర్థము: ఏతత్ యజుః="విశ్వే దేవాః" అను నీ మంత్రమును, న బ్రూయాత్ యత్=పఠించనిచో, యావతః పశూనేవ=ఎన్ని పశువులనైతే, అభి దీక్షేత= అంతట పొంది దీక్ష వహించునో, అస్య=ఈ యజమానుని యొక్క, తావన్తః పశవః=అన్ని పశువులే, స్యుః=ఉండును. "రాస్వేయత్సోమా ఽఽభూయో భర" ఇతి ఆహా= ఓ సోమదేవా! ఈ కర్మయందు అపేక్షితమైనది ఈ మాత్ర మొసఁగుము. కర్మను సంపూర్తి చేయుటచే మఱల నన్ను భరించుము' అని 'రాస్వే' త్యాది మంత్రము చెప్పినది. (అతః=ఈ చెప్పుట వలన, అయమ్=ఈ యజమానుఁడు) అపరిమితాన్ పశూనేవ=అపరిమిత సంఖ్యాకములయిన పశువులనే, అవరున్ధే=(పరలోకమునందు,) పొందును.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు "విశ్వే దేవాః" ఇత్యాది మంత్రమును జపించనిచో, తాను దీక్షను వహించు సమయమున ఎన్ని పశువు లుండెనో, అన్ని పశువులే ఉండును. మంత్రమును జపించినచో, మంత్రసామర్థ్యమువలన ఈ యజ్ఞకర్తకు పరలోకమునందు అపరిమిత పశువులు లభించును. ఈ యభిప్రాయమునే "రాస్వే" త్యాది మంత్రము చెప్పినది. విపక్షబాధ పురస్సరముగ "రాస్వేయత్సోమా ఽఽభూయో భర" అను మంత్రభాగము ఇచట వివరించఁబడినది.

19. అర్థము: "చన్ద్రమసి మమ భోగాయ భవ" ఇతి ఆహ="నీవు హిరణ్య మగుచున్నావు. నా భోగముకొఱకు వినియోగపడుము." అని "చన్ద్ర మసీ" త్యాది మంత్రము చెప్పినది. యథాదేవతమేవ=తత్తద్ద్రవ్యాభిమాని దేవతల కనుగుణముగనే, ఏనాః=ఈ దక్షిణలను, ప్రగృహ్ణాతి=స్వీకరించవలెను.

తాత్పర్యము: "చన్ద్ర మసి మమ భోగాయ భవ వస్త్ర మసి మమ భోగాయ భవ" ఇత్యాది మంత్రములచే తత్తద్ద్రవ్యాభిమాని దేవతల కనుగుణముగనే యజమానుఁడు తాను ఋత్విజుల కీయఁబోవు హిరణ్యాది దక్షిణలను గ్రహింపవలెను. అప్పుడు తత్త ద్ద్రవ్యాభిమాని దేవతలు సంతుష్టు లగుదురు.

20. అర్థము: "వాయవే త్వా వరుణాయ త్వా" ఇతి=ఓ హిరణ్యాదికమా! నిన్ను వాయుదేవునికొఱకు, నిన్ను, వరుణ దేవునికొఱకు, సమర్పించుచున్నాను.' అని, ఏవమ్=ఈ విధముగ, ఏతాః=ఈ హిరణ్యాది దక్షిణలను, న అను దిశేత్ యత్=ఆ యా దేవతల నుద్దేశించి అర్పించనిచో, దక్షిణాః=దక్షిణలను, అయథా దేవతమ్=ఆ యా దేవతలకు విముఖముగ, గమయేత్=పొందించినవాఁ డగును. దేవతాభ్యః=దేవతలనుండి, ఆ వృశ్చ్యేత=తొలఁగిపోవును. ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, ఏతాః=ఈ దక్షిణలను, అనుదిశతి యత్=సమర్పించినచో, యథాదేవత మేవ=ఆ యా దేవతల కనుగుణముగనే, దక్షిణాః=దక్షిణలను, గమయతి=పొందించుచున్నవాఁ డగుచున్నాఁడు. దేవతాభ్యః=దేవతలనుండి, న ఆ వృశ్చ్యతే=తొలఁగిపోఁడు.

తాత్పర్యము: పూర్వోక్త దక్షిణా ద్రవ్యములలో, కొన్ని వాయూపద్రవమువలన పోవచ్చును. కొన్ని నీటిలో పడిపోవచ్చును. గవాది పశురూప దక్షిణలను వ్యాఘ్రాదికము హింసించవచ్చును. ఆ విధముగ పోయిన దక్షిణలను యజమానుఁడు వాయ్వాది దేవతలకు "వాయవే త్వా అనుదిశామి" ఇత్యాదివిధముగ సమర్పించవలయును. ఆ విధముగ సమర్పించనిచో ఆ యా దేవతలకు వ్యతిరేకముగ దక్షిణలను పోఁగొట్టుకొనిన వాఁడగును. మఱియు ఆ యా దేవతల యనుగ్రహమునకు పాత్రము కానేరడు. సమర్పించినచో దక్షిణల నా యా దేవతల కనుగుణముగనే పొందించిన వాఁడగును. అప్ప డతఁ డా యా దేవతల యనుగ్రహమునకు పాత్రుఁ డగును.

21. అర్థము: "దేవీ రాపో అపాం నపాత్" ఇతి ఆహ="దేవీ రాపః" ఇత్యాది మంత్రము, ఓ యుదక దేవతలారా! ఓ అపాం నపాత్ అను అగ్నీ! వః=మీయొక్క, మేధ్యమ్=పవిత్రమైనదియు, యజ్ఞియమ్=యజ్ఞసంబంధియు, సదేవమ్=సదేవతాకమునగు, యత్=ఏది, (అస్తి=కలదో,) వః=మీయొక్క, తత్=దానిని, మా అవక్రమిషమ్=అతిక్రమించను. ఇతి వావ ఏతత్=అనెడి ఈ యర్థమునే, ఆహ=చెప్పెను.

తాత్పర్యము: "ఓ యుదకదేవతలారా! ఓ అపాంనపాదగ్నీ! యజ్ఞసంబంధియు, దేవతాసహితము నగు మీయొక్క పవిత్రమైనది ఏది కలదో, నేను దానిని అతిక్రమించను" అనెడి ఈ యర్థమునే "దేవీ రాపో అపాంనపాత్" అను మంత్రము చెప్పినది. ఈ మంత్రమునందలి 'హవిష్య', శబ్దార్థ మిచట వివరింపఁబడినది.

22. అర్థము: "అచ్ఛిన్నం తన్తుం పృథివ్యా అనుగేషమ్" ఇతి="అచ్ఛిన్నం తన్తు" మిత్యాది మంత్రము, సేతుమేవ=(నీటియందు పడవైచిన మట్టిగడ్డను,) సేతువుగానే, కృత్వా=చేసికొని, అత్యేతి=నీటిని దాఁటుచున్నాఁడు, ఇతి=అని, ఆహ=చెప్పినది.

తాత్పర్యము: యజ్ఞకర్త స్థలాంతరమున యజ్ఞదీక్షను వహించి యజ్ఞభూమికి పోవునపుడు దారిలో నీటిప్రవాహ మున్నచో దానియందు ఒక మట్టిగడ్డను పడవైచి ఆ నీటిలో దిగి పోవలయును. యజ్ఞ దీక్షితుఁడు ఆ మట్టిగడ్డను సేతువుగానే చేసికొని నీటిని దాఁటు చున్నాఁ డను నర్థమును "అచ్ఛిన్నం తన్తు" మిత్యాది మంత్రము చెప్పినది. ఇచట 'తన్తు' శబ్దాభిప్రాయము తెలియఁజేయఁబడినది.

చతుర్థానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః

మూలము: [1]దేవా వై దేవయజన మధ్యవసాయ దిశో న ప్రాజాన న్తే ఽన్యోన్య ముపాధావ న్త్వయా ప్ర జానామ త్వయేతి తేఽదిత్యాగ్ం సమధ్రియన్త త్వయా ప్ర జానామేతి సాఽబ్రవీద్వరం వృణై మత్ప్రా యణా ఏవ వో యజ్ఞా మదుదయనా అసన్నితి తస్మాదాదిత్యః ప్రాయణీయో యజ్ఞానా మాదిత్య ఉద యనీయః [2]పఞ్చ దేవతా యజతి పఞ్చ దిశో దిశాం ప్రజ్ఞాత్యై (౧) అథో పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞమేవావ రున్ధే [3]పథ్యాగ్ం స్వస్తి మయజ న్ప్రాచీమేవ తయా దిశం ప్రాజానన్నగ్నినా దక్షిణా సోమేన ప్రతీచీగ్ం సవిత్రోదీచీ మదిత్యోర్ధ్వాం [4]పథ్యాగ్ం స్వస్తిం యజతి ప్రాచీమేవ తయా దిశం ప్రజానాతి పథ్యాగ్ం స్వస్తిమిష్ట్వా ఽగ్నీషోమౌ యజతి చక్షుషీ వా ఏతే యజ్ఞస్య యదగ్నీషోమౌ తాభ్యామేవాను పశ్యతి (౨) అగ్నీషోమావిష్ట్వా సవితారం యజతి సవితృప్రసూత ఏవాను పశ్యతి సవి తారమిష్ట్వా ఽదితిం యజతీయం వా అదితిరస్యామేవ ప్రతిష్ఠాయాను పశ్య [5]త్యదితి మిష్ట్వా మారుతీ మృచమన్వాహ మరుతో వై దేవానాం విశో దేవవిశం ఖలు వై కల్పమానం మనుష్యవిశమను కల్పతే యన్మారుతీ మృచమన్వాహ విశాం క్లృప్త్యై [6]బ్రహ్మవాదినో వదన్తి ప్రయాజవదననూయాజం ప్రాయణీయం కార్య మనూయాజవత్ (3) అప్రయాజ ముదయనీయమితీమే వై ప్రయాజా అమీ అనూయాజాః సైవ సా యజ్ఞస్య సంతతి [7]స్తత్తథా న కార్య మాత్మా వై ప్రయాజాః ప్రజాఽ నూయాజా యత్ప్రయాజా నన్తరియా దాత్మాన మన్తరియా ద్యదనూయాజా నన్తరియా త్ప్రజా

మన్త్రరియాద్యతః ఖలు వై యజ్ఞస్య వితతస్య న క్రియతే తదను యజ్ఞః పరా భవతి యజ్ఞం పరా

భవన్తం యజమానోఽను (౪) పరా భవతి [8]ప్రయాజవ దేవానూయాజవ త్ప్రాయణీయం కార్యం

ప్రయాజవ దనూయాజవ దుదయనీయం నాఽఽత్మాన మన్త్రేతి న ప్రజాం న యజ్ఞః పరాభవతి

న యజమానః [9]ప్రాయణీయస్య నిష్కాస ఉదయనీయమభి నిర్వపతి సైవ సా యజ్ఞస్య సంతతి

[10]ర్యాః ప్రాయణీయస్య యాజ్యా యత్తా ఉదయనీయస్య యాజ్యాః కుర్యాత్పరాఙముం లోకమా

రోహేత్ప్రమాయుకః స్యాద్యాః ప్రాయణీయస్య పురోనువాక్యాస్తా ఉదయనీయస్య యాజ్యాః కరోత్య

స్మిన్నేవ లోకే ప్రతి తిష్ఠతి(౫)||
[ప్రజ్ఞాత్యై పశ్యత్యనూయాజవ ద్యజమానోఽను పురోనువాక్యాస్తా అష్టౌ చ.]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః || (౫) ||

## వేదార్థదీపిక

**అవతారిక:** చతుర్థానువాకమునందు యజ్ఞదీక్షితుని నియమానుష్ఠాన విధి సమాప్త మైనది. ఈ పంచమానువాకమునందు ప్రాయణీయేష్టి చెప్పఁబడుచున్నది. సోమయాగమునం దుపయోగించునట్టి సోమమును కొనుటకై సోమక్రయణీ విషయమైన హోమాదికము ప్రథమ కాండస్థ ద్వితీయ ప్రపాఠకమునం దభిహితమైనది. ఆ హోమమునకు సంబంధించిన మంత్రములు (="ఇయం తే శుక్ర" ఇత్యాదులు,) అచటనే వ్యాఖ్యాతములు. ప్రాయణీయేష్టి సంబంధియగు ధ్రౌవాజ్యముతో హోమము చేయవలెను. ఆ ప్రాయణీయేష్టి యిచట స్తుతింపఁబడుచున్నది.

1. **అర్థము:** దేవాః=దేవతలు, దేవయజనమ్=(దేవతలు యాగము చేయుటకు అర్హమైన) దేవయజన ప్రదేశమును; అధ్యవసాయ=నిశ్చయించి, తే=ఆ దేవతలు, దిశః=దిక్కులను, న ప్రాజానన్=తెలిసికొనలేకపోయిరి. త్వయా=నీచేత, ప్రజానామ=దిక్కు తెలియఁబడినది, ఇతి=అని, అన్యోన్యమ్=పరస్పరము, ఉపాధావన్=పరుగెత్తిరి. త్వయా=నీచేత, ప్రజానామ=తెలియఁబడినది, ఇతి=అని, తే=ఆ దేవతలు, అదిత్యామ్=అదితిదేవియందు, సమధ్రియన్త= (దిగ్బోధకశక్తిని) నిశ్చయించిరి. "వః=మీయొక్క, యజ్ఞాః=యజ్ఞములు, మత్ప్రాయణాః ఏవ=మద్దేవతా రూపముతో ప్రారంభించఁ బడునవిగనే, మదుదయనాః ఏవ=మద్దేవతా రూపముతో సమాప్తి చేయఁబడునవిగానే, అసన్=అగుఁగాక, ఇతి=అని, సా=ఆ అదితి దేవత, వరమ్=వరమును, వృణై=కోరుదును" (అని) అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణమువలన, యజ్ఞానామ్=యజ్ఞములయొక్క, ప్రాయణీయః=ప్రాయణీయ (ప్రారంభమున చేయఁదగినట్టి) హోమము, ఆదిత్యః=అదితి దేవతాకము. ఉదయనీయః=యజ్ఞముల సమాప్తియందు చేయఁదగిన హోమము, ఆదిత్యః=అదితి దేవతాకము.

తాత్పర్యము: దేవతలు దేవయజనముకొఱకు ఈ ప్రదేశము సమీచీనమైనది. ఇతర ప్రదేశము తగినది కాదు, అని దిక్కులందు తిరుగుచు ఒకానొక ప్రదేశమును నిశ్చయించి ఆ తిరుగుటచే దిగ్భ్రమను పొందినవారై మఱల ఆ దేవయజన ప్రదేశమును గుర్తించలేక "నీవు ఆ దేవయజన ప్రదేశమును గుర్తుచేయుము. నీవు ఆ ప్రదేశమును తెలియఁజేయుము" అని ఈవిధముగ వారిలో వారు పరస్పరము వాదించుకొనిరి. పిమ్మట వారు దిగ్బోధకశక్తి అదితి దేవతయందు కలదని నిశ్చయించి యా ప్రదేశమును తెలియఁజేయుమని అదితి దేవత నడిగిరి. అప్పు డా యదితి దేవత "సోమయాగ ప్రారంభ పరిసమాప్తులందు తానే దేవతగా ఉండునుగాక," అని వరమును కోరుకొనెను. ఆ కారణమువలన యజ్ఞములయొక్క ప్రాయణీయ హోమము ఉదయనీయ హోమము అదితి దేవతాకము లైనవి. ప్రయన్తి=ప్రారభన్తే, అనేన దేవతా రూపేణేతి, ప్రాయణమ్. ఉద్యన్తి=ఉత్తిష్ఠన్తి, సమాపయన్తి, అనేన దేవతా రూపేణేతి, ఉదయనమ్. అహమేవ ప్రాయణమ్ =ఆరమ్భదేవతా యేషాం యజ్ఞానాం తే మత్ప్రాయణాః. అహమేవ ఉదయనం =సమాప్తిదేవతా యేషాం యజ్ఞానాం తే మదుదయనాః. ఇచట ప్రాయణీయేష్టి ప్రస్తుతింపఁబడినది. ప్రాయణీయ ప్రసంగవశమున ఉదయనీయ యాగము చెప్పఁబడినది.

2. అర్థము: పఞ్చ దేవతాః=అయిదుగురు దేవతల నుద్దేశించి, యజతి=యాగము(హోమము)చేయవలెను. దిశః=దిక్కులు, పఞ్చ=పంచ సంఖ్యాకములు. (అయమ్=ఈ హోమము,) దిశామ్=దిక్కులయొక్క, ప్రజ్ఞాత్యై=ప్రకృష్టముగ తెలిసికొనుటకై, భవతి=అగుచున్నది. అథో=మఱియు, పఙ్క్తిః=పంక్తిచ్ఛందస్సు, పఞ్చాక్షరా=అయిదక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పంచ సంఖ్యాక ద్రవ్యసాధ్య మైనది. (అతః=ఈ హోమమువలన, అయమ్=ఈ యజ్ఞకర్త,) యజ్ఞమేవ=యజ్ఞ(ఫల)మునే, అవరున్ధే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: అయిదుగురు దేవతల నుద్దేశించి ప్రాయణీయ హోమము చేయవలెను. ఈ దేవతలలో అదితి ప్రధానదేవత. మిగిలిన నలుగురు అంగదేవతలు. ఊర్ధ్వ దిక్కుతో కూడ ప్రాచ్యాది దిక్కులు అయిదు. ఈ విధముగ చేసిన హోమము దిక్కులను తెలిసికొనుటకు సాధన మగును. మఱియు పంక్తి చ్ఛందస్సు అయిదక్షరములు కలది. యజ్ఞము పంచద్రవ్య సాధ్య మైనది. కావున ఈ హోమము చేసిన యజ్ఞకర్త నిశ్చయముగ యజ్ఞఫలమును పొందును.

3. అర్థము: పథ్యామ్=మార్గమునందు సాధువైన, స్వస్తిమ్=స్వస్తినామక దేవత నుద్దేశించి, (దేవాః=దేవతలు,) అయజన్=యాగము చేసిరి. తయా=ఆ దేవతచేత, ప్రాచీం దిశమేవ=తూర్పు దిక్కునే, ప్రాజానన్=బాగుగ తెలిసికొనిరి. అగ్నినా=అగ్ని దేవునిచేత, దక్షిణా=దక్షిణదిక్కును, (ద్వితీయార్థే ప్రథమా.) సోమేన=సోమ దేవునిచేత, ప్రతీచీమ్=పశ్చిమ దిక్కును, సవిత్రా=సూర్యునిచేత, ఉదీచీమ్=ఉత్తర దిక్కును, అదిత్యా=అదితి దేవతచేత, ఊర్ధ్వామ్=ఊర్ధ్వ దిక్కును, ప్రాజానన్=బాగుగ తెలిసికొనిరి.

తాత్పర్యము: పూర్వము దేవతలు దేవయజన ప్రదేశమును నిర్దేశించుటకై దిక్కులందు పరిభ్రమించుచు దిక్కులను బాగుగ తెలిసికొనుటకు మార్గమునందు యోగ్యమైన స్వస్తి నామక దేవత నుద్దేశించి యాగము చేసిరి. వారు ఆ స్వస్తిదేవతచే తూర్పు దిక్కునే తెలిసికొనిరి. పిమ్మట అగ్ని సోమ సవిత్రదితి దేవతలనుద్దేశించి యాగములు చేసి వరుసగా ఆ దేవతలచే దక్షిణ పశ్చిమోత్తరోర్ధ్వ దిక్కులను బాగుగ తెలిసికొనిరి. (ఆ యా దిక్కులందు ఆ యా దేవతలను విధించుటకు ముందు తత్ప్రశంస ఇచట చేయఁబడినది.)

4. అర్థము: పథ్యామ్=మార్గమునందు సాధువైన, స్వస్తిమ్= స్వస్తినామక దేవత నుద్దేశించి, యజతి=యాగము చేయవలెను. తయా=ఆ స్వస్తి దేవతచేత, ప్రాచీం దిశమేవ=తూర్పు దిక్కునే, (యజమానః=యజమానుఁడు,) ప్రజానాతి=బాగుగ తెలిసికొనుచున్నాఁడు. పథ్యాం స్వస్తిమ్=మార్గమునందు సాధువైన స్వస్తిదేవత నుద్దేశించి, ఇష్ట్వా=ఇష్టి చేసి, (తతః=అనంతరము,) అగ్నీషోమౌ=అగ్నీ షోమ దేవతల నుద్దేశించి, యజతి=యాగము చేయ

వలెను. అగ్నీషోమౌ యత్=అగ్ని సోమ దేవత లెవరు కలరో, ఏతే=వీరు, యజ్ఞస్య= యజ్ఞమునకు, చక్షుషీ వై =నేత్రములే(నేత్రముల వంటివారే). (యజమానః=యజమా నుఁడు,) తాభ్యామేవ=ఆ అగ్నీషోముల చేతనే, అను పశ్యతి=క్రమముగ చూచుచున్నాఁడు. అగ్నీషోమౌ=అగ్నీషోముల నుద్దేశించి, ఇష్ట్వా=ఇష్టి చేసి, సవితారమ్=సవితృ దేవు నుద్దేశించి, యజతి=యాగము చేయవలెను. సవితృ ప్రసూతః ఏవ=సవితృ దేవునిచే అనుజ్ఞాతుఁడే అయి, (యజ్ఞకర్త) అను పశ్యతి=క్రమముగ చూచుచున్నాఁడు. సవితారమ్=సవితృదేవు నుద్దే శించి, ఇష్ట్వా= ఇష్టి చేసి, అదితిమ్=అదితి దేవత నుద్దేశించి, యజతి=యాగము చేయవలెను. ఇయమ్=ఈ భూమి, అదితిః వై=అదితియే! (తదా=అప్పుడు, అయమ్=ఈ యాగకర్త,) అస్యామ్=ఈ భూమియందు, ప్రతిష్ఠాయైవ=ప్రతిష్ఠకొఱకే, అను పశ్యతి=క్రమముగఁ జూచుచున్నాఁడు.

తాత్పర్యము: దిగ్విశేష పరిజ్ఞానమునకై అయిదు దిక్కులందు అయిదుగురు దేవతల నుద్దేశించి హోమము చేయవలెను. ఆ హోమమువలన ఈ యజ్ఞకర్త సోమయాగ ప్రారంభమునందు వరుసగా ప్రథమమున తూర్పుదిక్కునందు స్వస్తి నామక దేవత నుద్దేశించి హోమము చేయవలెను. ఆ హోమమువలన ఈ యజ్ఞకర్త తూర్పుదిక్కును బాగుగ తెలిసికొనినవాఁ డగును. స్వస్తి దేవతాక హోమము చేసిన పిమ్మట యజ్ఞకర్త అగ్ని దేవత నుద్దేశించి దక్షిణ దిక్కునందును, సోమ దేవత నుద్దేశించి పశ్చిమ దిక్కునందును హోమము చేయవలెను. (చక్షు ర్ద్వయ రూపమున ప్రశంసించుటకై ఇచట "అగ్నీషోమయోః" అని సహనిర్దేశము చేయఁబడినది.) అగ్నీషోమ దేవతలు యజ్ఞమునకు రెండు నేత్రముల వంటివారు. యజమానుఁ డా యగ్నీషోములచేతనే క్రమముగ చూచును. అగ్నీషోమ దేవతాక హోమానంతరము ఉత్తర దిక్కునందు సవితృ దేవత నుద్దేశించి హోమము చేయవలెను. అప్పుడా యజ్ఞకర్త సవితృదేవునిచే అనుజ్ఞాతుఁడే అయి, క్రమముగ చూచును. తదనంతరము అదితి దేవత నుద్దేశించి ఊర్ధ్వదిగభిముఖముగ హోమము చేయవలెను. ఈ భూమి అది తియే. ఈ భూమియందే ప్రతిష్ఠకొఱకు క్రమముగ చూచును. (ఇచట అగ్ని సోములకు సహనిర్దేశము చేయఁబడినను, దిగ్భేదమువలనను, యాజ్యానువాక్యలవలనను అగ్నిదేవతాక హోమానంతరమే సోమదేవతాక హోమము చేయవలెను.)

5. అర్థము: అదితిమ్=అదితి నుద్దేశించి, ఇష్ట్వా=ఇష్టి చేసి, అను=పిమ్మట, మారుతీమ్ ఋచమ్=మరుచ్ఛబ్ద ఘటిత ఋక్కును, ఆహ=(అధ్వర్యుఁడు) పఠించవలెను. దేవానామ్=దేవతలలో, మరుతః వై=మరుద్గణ దేవతలే, విశః=ధనసంపాదక ప్రజలు. కల్పమానమ్=(స్వవ్యాపారమునందు) సమర్థమైన, దేవవిశం ఖలు వై=దేవప్రజా సంఘము ననుసరించియే కదా! మనుష్య విశమ్ అనుకల్పతే=మంత్రానువచనముచేత మనుష్య సంఘము సమ ర్థమగుచున్నది. మారుతీమ్ ఋచమ్ అన్వాహాయత్=మరుచ్ఛబ్ద యుత మంత్రమును అధ్వర్యుఁడు పఠించినచో, (ఏతత్=ఈ మంత్రానువచనము,) విశామ్=ప్రజలయొక్క, క్లృప్త్యై=సామర్థ్యముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: అదితి దేవతాక హోమము చేసిన పిమ్మట అధ్వర్యుఁడు "మరుతో యద్ధవో దివః" అనెడి మరుచ్ఛబ్ద ఘటితమైన ఋక్కును పఠించవలెను. ఏకోనపఞ్చాశత్సంఖ్యాకులును సప్తగణరూపులునగు మరుద్దేవతలు మనుష్యులలో వైశ్యులవలె దేవతలలో ధనసంపాదక ప్రజలు. అధ్వర్యుఁ డీ ఋక్కును పఠించుటచేత దేవప్రజాసమూహము స్వవ్యాపారమునందు సమర్థ మగును. సమర్థమైన దేవ ప్రజా సంఘము ననుసరించి మనుష్య ప్రజా సంఘము కూడ స్వవ్యాపారమునందు సమర్థ మగును. కావున పూర్వోక్త మంత్రానువచనము ప్రజల సామర్థ్యమునకు సాధన మగును. (ఇచట అధ్వర్యునకు ఋగనువచనము విహితమైనది.)

6. అర్థము: ప్రయాజవత్=ప్రయాజలవలె, అననూయాజమ్=అనూయాజ రహితముగ, ప్రాయణీయమ్=ప్రాయణీయ కర్మ, (హోమము,) కార్యమ్=చేయఁదగినది. అనూయాజవత్=అనూయాజలవలె, అప్రయాజమ్=ప్రయాజ రహి తముగ, ఉదయనీయమ్=ఉదయనీయ కర్మ, (హోమము,) కార్యమ్=చేయఁదగినది, ఇతి=అని, బ్రహ్మవా

దినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు. ప్రయాజాః=ప్రయాజలు, ఇమే వై=ఇవియే (ప్రత్యక్షములు). అనూ యాజాః=అనూయాజలు, అమీ=ఇవి. (పరోక్షములు) యజ్ఞస్య=దర్శయాగముయొక్క, యా సంతతిః=విచ్ఛేద రాహిత్య లక్షణమైన యే సంతతి, (కలదో,) సైవ=అదియే, సా=సోమయాగమున కా విచ్ఛేదరాహిత్య లక్షణమైన సంతతి.

తాత్పర్యము: 'ప్రముఖే యష్టవ్యాః సమిదాది నామకాః పఞ్చ ప్రయాజాః' ప్రముఖమునందు యష్టవ్యములయిన సమిదా దినామక హోమములు అయిదు ప్రయాజలు. అను పశ్చాత్ సమాప్తౌ యష్టవ్యాః బర్హిరాది నామకాః త్రయః అనూయాజాః=సమాప్తియందు యష్టవ్యములయిన బర్హిరాది నామకములయిన హోమములు మూఁడు అనూయాజలు. ఈ ఉభయము ప్రాయణీయోదయనీయేష్టులయందు అతిదేశమువలన ప్రాప్తమైనది. ప్రాయ ణీయేష్టియందు అనూయాజ హోమము అనుష్ఠించఁబడినచో, యాగము సమాప్తమగును. ఆ విధముగనే ఉదయనీయేష్టియందు ప్రయాజ హోమము అనుష్ఠింపఁబడినచో, యాగాంతరము ప్రారంభమగును. ఆ విధముగనైనచో సోమయాగము మధ్యమందే విచ్ఛిన్న మగును. ఉభయమును వర్జించినచో, సోమయాగము యొక్క ప్రారంభరూపమైన ప్రాయణీయేష్టియందు అనుష్ఠించఁబడు ప్రయాజలు ప్రత్యక్షము లగుచున్నవి. సమాప్తిరూపమైన ఉదయనీయేష్టియందు అనుష్ఠింపఁబడునట్టి అనూయాజలు పరోక్షములు. అట్లు కాఁగా, ప్రయాజానూయాజ ద్వయముచేత దర్శయాగమునకుఁ గల సంతతి యేది కలదో, ఈ సోమయాగమునకు మధ్యమందు విచ్ఛేదరాహిత్య లక్షణమైన ఆ సంతతియే సంపన్న మగుచున్నది. (చోదక ప్రాప్తమైన ఒక అంగము పూర్వపక్షముగ నిచట నిరూపితమైనది.)

7. అర్థము: తత్=అది, తథా=ఆ విధముగా, న కార్యమ్=చేయఁదగినది కాదు. ప్రయాజాః=ప్రయాజ హోమములు, ఆత్మా వై=ఆత్మ(వంటివి)యే. అనూయాజాః=అనూయాజ హోమములు, ప్రజా=ప్రజా స్వరూపములు. ప్రయాజాన్=ప్రయాజ హోమములను, అన్తరియాత్ యత్=లోపింపఁజేసినచో (అనుష్ఠింపనిచో), ఆత్మా నమ్=ఆత్మను, అన్తరియాత్=లోపింపఁజేసినవాఁ డగును. అనూయాజాన్=అనూయాజ హోమములను, అన్తరియాత్=లోపింపఁజేసినచో, ప్రజామ్=ప్రజను, అన్తరియాత్ =లోపింపఁజేసినవాఁ డగును. యతః ఖలు వై=ఏ కారణమువలన అయితే, వితతస్య=విస్తృతమైన, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, అఙ్గమ్=అంగము, న క్రియతే=చేయఁబడుట లేదో, తదను=అప్పుడు, యజ్ఞః=యజ్ఞము, పరాభవతి=తిరస్కృత మగుచున్నది. పరాభవన్తమ్=తిరిస్కృత మగుచున్న, యజ్ఞమ్ అను=యజ్ఞము ననుసరించి, యజమానః=యజమానుఁడు, పరాభవతి=తిరస్కృతుఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ప్రయాజ హోమములనుగాని, అనూయాజ హోమములను గాని, అంతరింపఁ జేయరాదు. ప్రయాజ హోమ ములు యజ్ఞమునకు ఆత్మవంటివే. అనూయాజ హోమములు ప్రజవంటివి. యజ్ఞకర్త ప్రయాజల నంతరింపఁ జేసినచో ఆత్మ నంతరింపఁ జేసినవాఁ డగును. అనూయాజ హోమముల నంతరింఁజేసినచో ప్రజ నంతరింపఁ జేసినవాఁ డగును. బహ్వంగ సముపేతమైన యజ్ఞముయొక్క ఏ యంగము అనుష్ఠింపఁ బడనిదైనను, యజ్ఞము పరాభూత మగును. పరాభూత యజ్ఞము ననుసరించి యజ్ఞకర్తయు పరాభూతుఁ డగును. (ఇచట పూర్వోక్త పూర్వపక్షము దూషింపఁబడినది.)

8. అర్థము: ప్రయాజవత్=ప్రయాజలతోఁ గూడినదియు, అనూయాజవత్=అనూయాజలతోఁ గూడినదియునగు, ప్రాయ ణీయమ్ ఏవ=ప్రాయణీయకర్మయే, కార్యమ్=చేయఁదగినది. ప్రయాజవత్=ప్రయాజసహితము, అనూ యాజవత్=అనూయాజ సహితముమునైన, ఉదయనీయమ్=ఉదయనీయ కర్మ, కార్యమ్=ఆచరింపఁ దగ్గి నది. (తదా=అప్పుడు, సః=ఆ యజ్ఞకర్త,) ఆత్మానమ్=ఆత్మను, న అన్తరేతి=లోపింపఁ జేయుట లేదు.

ప్రజామ్=ప్రజను, న అన్తరేతి=లోపింపఁ జేయుట లేదు. యజ్ఞః= యజ్ఞము, న పరాభవతి=తిరస్కృత మగుట లేదు. యజమానః=యజమానుఁడు, న పరాభవతి=పరాభూతుఁ డగుట లేదు.

తాత్పర్యము: ప్రాయణీయ కర్మను ప్రయాజానూయాజ సహితముగనే అనుష్ఠించ వలెను. ఉదయనీయ కర్మను కూడ ప్రయాజానూయాజ సహితముగ నాచరింపవలెను. అప్పు డా యజమానుఁడు ఆత్మను గాని, ప్రజను గాని అంతరింపఁ జేసిన వాఁడు కాఁడు. యజ్ఞము పరాభూతము కాదు. యజమానుఁడును పరాభూతుఁడు కాఁడు.

9. అర్థము: ప్రాయణీయస్య=ప్రాయణీయ యాగ సంబంధియగు, నిష్కాసే=చరుపాత్రము నంటుకొనియున్న అన్నమునందు, ఉదయనీయమ్=ఉదయనీయ యాగ సంబంధి చరువును, అధి నిర్వపతి=అధిముఖముగ నిర్వాపము చేయవలెను. సన్తతిః=నిర్వాపాన్న లేపముయొక్క సంతతి, యా అస్తి=ఏది కలదో, సైవ=అదియే, యజ్ఞస్య=సోమయాగ ముయొక్క, సా=అవిచ్ఛేదరూపమైన యా సంతతి.

తాత్పర్యము: ప్రాయణీయేష్టియందును ఉదయనీయేష్టియందును చరునిర్వాపము చేయవలసియుండును. ప్రాయణీయేష్టి సంబంధియైన చరుపాత్రమును ప్రక్షాళనము చేయకుండ తచ్చరు హోమానంతరము ఆ చరులేశము అంటుకొనియున్న ఆ పాత్రమునందే ఉదయనీయేష్టి సంబంధియగు చరువు నుంచవలెను. ఆవిధముగ చేసినచో పూర్వపక్షి వాదులు చెప్పిన సోమయాగ విచ్ఛిత్తి కలుగదు. ప్రాయణీయ యాగ సంబంధి పాత్రలిప్తాన్నమునందు ఉదయనీయ చరునిర్వాపాన్నముయొక్క అవిచ్ఛేదరూప సంతతి సోమయాగమునకు కలుగుచున్నది. (ఇచట విచ్ఛేద పరిహారము విధింపఁబడినది.)

10. అర్థము: ప్రాయణీయస్య=ప్రాయణీయ యాగమునకు, యాః యాజ్యాః=ఏ యాజ్యలు (సన్తి=కలవో,) తాః=ఆ యాజ్యలను, ఉదయనీయస్య=ఉదయనీయయాగమునకు, యాజ్యాః=యాజ్యలనుగా, కుర్యాత్ యత్= చేయుచో, (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు,) పరాఙ్= ఈ లోకమునుండి పరాఙ్ముఖుఁడై, అముం లోకమ్=స్వర్గలోకమును, ఆరోహేత్=అధిరోహించును. ప్రమాయుకః=(స్వర్గము నధిరోహించుటకు శీఘ్రముగ) మరణించువాఁడు, స్యాత్=అగును. ప్రాయణీయస్య=ప్రాయణీయ యాగమునకు, పురోనువాక్యాః యాః=పురోనువాక్యలేవి కలవో, తాః=ఆ పురోనువాక్యలను, ఉదయనీయస్య=ఉదయనీయ యాగమునకు, యాజ్యాః=యాజ్యలనుగా, కరోతి=చేయవలెను. (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు,) అస్మిన్ లోకే ఏవ=ఈ లోకమునందే, ప్రతి తిష్ఠతి=ప్రతిష్ఠితుఁడగుచున్నాడు.

తాత్పర్యము: "స్వస్తి రిద్ధి ప్రపథే శ్రేష్ఠే" త్యాదులు ప్రాయణీయ యాగమునకు యాజ్యలు. ఉదయనీయ యాగమునకు కూడ వానినే యాజ్యలనుగా నుపయోగించవలెనని కొందఱు చెప్పుచున్నారు. ఆ విధముగ చేసినచో ప్రతినివృత్తి యుండదు. కావున యజమానుఁడు స్వర్గము నారోహించుటకై యీ లోకమున శీఘ్రముగ మరణించును. ఈ కారణమువలన వారి పక్షము యుక్తము కాదు. "స్వస్తి నః పథ్యే"త్యాదులు ప్రాయణీయ యాగమునుకు పురోనువాక్యలు. ఆ పురోనువాక్యలను యాజ్యలనుగాఁ జేసినచో "స్వస్తి రిద్ధే" త్యాదులు పురోనువాక్యలుగా ప్రతినివృత్తము లగుటవలన యజమానుఁ డీ లోకమునందు ప్రతిష్ఠితుఁ డగును. శీఘ్రముగ మరణించఁడని భావము. [ప్రాయణీయ యాగమునకు, ఉదయనీయ యాగమునకు ఒక దేవతయే కావున యాజ్యలకు కూడ ఏకత్వము ప్రాప్తమగుచుండఁగా యాజ్యలు వేఱు అను విషయము ఇచట చెప్పఁబడినది.]

పంచమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే షష్ఠోఽనువాకః

మూలము: [1]కద్రూశ్చ వై సుపర్ణీ చాఽఽత్మరూపయో రస్పర్ధేతాగ్ం సా కద్రూః సుపర్ణీ మజయ త్సాఽబ్రవీ త్తృతీయస్యా మితో దివి సోమస్త మా హర తేనాఽఽత్మానం నిష్క్రీణీష్వే [2]తీయం వై కద్రూ రసౌ సుపర్ణీ ఛన్దాగ్ంసి సౌపర్ణేయాః. [3]సాఽబ్రవీ దస్మై వై పితరౌ పుత్రా న్బిభృత స్తృతీయస్యా మితో దివి సోమస్త మా హర తేనాఽఽత్మానం నిష్క్రీణీష్వ (౧) ఇతి మా కద్రూ రవోచదితి [4]జగత్యు దపత చ్చతుర్దశాక్షరా సతీ సాఽప్రాప్య న్యవర్తత తస్యై ద్వే అక్షరే అమీయేతాగ్ం సా పశుభిశ్చ దీక్షయా చాఽగచ్ఛ త్తస్మా జ్జగతీ ఛన్దసాం పశవ్యతమా తస్మాత్పశుమన్తం దీక్షోప నమతి [5]త్రిష్టుగుద పత త్త్రయోదశాక్షరా సతీ సాఽప్రాప్య న్యవర్తత తస్యై ద్వే అక్షరే అమీయేతాగ్ం సా దక్షిణాభిశ్చ (౨) తపసా చాఽగచ్ఛ [6]త్తస్మాత్త్రిష్టుభో లోకే మాధ్యందినే సవనే దక్షిణా నీయన్త ఏతత్ఖలు వావ తప ఇత్యాహుర్యః స్వం దదాతీతి [7]గాయత్ర్యుదపత చ్చతురక్షరా సత్యజయా జ్యోతిషా తమస్యా అజా ఽభ్యరున్ధ తదజాయా అజత్వగ్ం సా సోమం చాఽహరచ్చత్వారి చాక్షరాణి సాఽష్టాక్షరా సమపద్యత [8]బ్రహ్మవాదినో వదన్తి (౩) కస్మాత్సత్యా ద్గాయత్రీ కనిష్ఠా ఛన్దసాగ్ం సతీ యజ్ఞముఖం పరీయాయేతి యదేవాదః సోమమాఽహర త్తస్మాద్యజ్ఞముఖం పర్యైత్తస్మా త్తేజస్వినీతమా [9]పద్భ్యాం ద్వే సవనే సమగృహ్ణాన్ముఖేనైకం యన్ముఖేన సమగృహ్ణా త్తదధయ త్తస్మాద్ద్వే సవనే శుక్రవతీ ప్రాతఃసవనం చ మాధ్యందినం చ తస్మా త్తృతీయసవన ఋజీషమభి షుణ్వన్తి ధీతమివ హి మన్యన్తే (౪) [10]ఆశిర మవనయతి సశుక్రత్వాయాథో సం భరత్యేవైన [11]త్తగ్ం సోమమాహ్రియమాణం గన్ధర్వో విశ్వావసుః పర్యముష్ణాత్స తిస్రో రాత్రీః పరిముషితోఽవస త్తస్మాత్తిస్రో రాత్రీః క్రీతః సోమో వసతి [12]తే దేవా అబ్రువ న్స్త్రీకామా వై గన్ధర్వాః స్త్రియా నిష్క్రీణామేతి తే వాచగ్ం స్త్రియ మేకహాయనీం కృత్వా

తయా నిరక్రీణ [13]న్నా రోహిద్రూపం కృత్వా గన్ధర్వేభ్యః (౫) అపక్రమ్యాతిష్ఠ త్తద్రోహితో జన్మ [14]తే దేవా అబ్రువన్నప యుష్మదక్రమీ న్నాస్మానుపావర్తతే వి హ్వయామహా ఇతి బ్రహ్మ గన్ధర్వా అవదన్నగాయన్దేవాః సా దేవాన్గాయత ఉపావర్తత తస్మాద్గాయన్తగ్ం స్త్రియః కామయన్తే [15]కాముకా ఏనగ్ం స్త్రియో భవన్తి య ఏవం వేదాథో య ఏవం విద్వానపి జన్యేషు భవతి తేభ్య ఏవ దద త్యుత యద్బహుతయాః (౬)భవ [16]న్త్యేకహాయన్యా క్రీణాతి వాచైవైనగ్ం సర్వయా క్రీణాతి తస్మా దేకహాయనా మనుష్యా వాచం వద [17]న్త్యకూటయాఽకర్ణయాఽకాణయాఽశ్లోణయాఽసప్తశఫయా క్రీణాతి [18]సర్వయైవైనం క్రీణాతి [19]యచ్ఛ్వేతయా క్రీణీయా ద్దుశ్చర్మా యజమానః స్యాద్యత్కృ ష్ణయాఽనుస్తరణీ స్యాత్ప్రమాయుకో యజమానః స్యాద్యద్ద్విరూపయా వార్త్రఘ్నీ స్యాత్స వాఽన్యం జినీయాత్తం వాఽన్యో జినీయా దరుణయా పిఙ్గాక్ష్యా క్రీణాత్యేతద్వై సోమస్య రూపగ్ం స్వయైవైనం దేవతయా క్రీణాతి(౭)||

[నిష్క్రీణీష్వ దక్షిణాభిశ్చ వదన్తి మన్యన్తే గన్ధర్వేభ్యో బహుతయాః పిఙ్గాక్ష్యా దశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే షష్ఠోఽనువాకః ||(౬)||

# వేదార్థదీపిక

**అవతారిక:** పంచమానువాకమునందు ప్రాయణీయాది హోమములఁగూర్చి చెప్పఁబడినది. ఈ షష్ఠానువాకమునందు సోమక్రయమునకు సంబంధించిన విషయములు చెప్పఁబడుచున్నవి. సోమక్రయము=సోమయాగమునందు ఉపయోగింపఁబడు సోమలతను కొనుట.

1. **అర్థము:** కద్రూః చ=కద్రువయు, సుపర్ణీ చ=సుపర్ణియు, ఆత్మరూపయోః=తమసౌందర్యముల విషయమున, అస్పర్ధే తామ్=స్పర్ధ వహించిరి. సా=ఆ, కద్రూః=కద్రువ, సుపర్ణీమ్=సుపర్ణిని, అజయత్=(సౌందర్యము విషయమున) జయించెను. "ఇతః=ఈ లోకమునుండి, తృతీయస్యామ్=మూఁడవదియైన, దివి=ద్యులోకమునందు, సోమః=సోమము, అస్తి=కలదు. తమ్=ఆ సోమమును, ఆహర=తెమ్ము, తేన=ఆ సోమాహరణముచేత, ఆత్మా నమ్=తనను, (నిన్ను,) నిష్క్రీణీష్వ=విడిపించుకొనుము". ఇతి=అని, సా=ఆ కద్రువ, అబ్రవీత్=పలికెను.

**తాత్పర్యము:** కద్రువ సుపర్ణియు సపత్నులు. వా రుభయులు తమ తమ రూపములు మిక్కిలి సౌందర్యము కలవని (నేనే సౌందర్యవతిని, నేనే సౌందర్యవతిని అని,) వివాదపడిరి. ఆ సౌందర్యము విషయమున కద్రువ సుపర్ణిని

జయించెను. అనఁగా కద్రువయే సౌందర్యవతియని మధ్యస్థులు నిర్ణయించిరి. ఓడిపోయిన వ్యక్తి విజయము నొందిన వ్యక్తికి దాసిగా సేవచేయవలెనని వారు పందెము పెట్టుకొనిరి. అప్పుడు కద్రువ సుపర్ణితో ఇట్లు చెప్పెను. "ఈ లోకమునుండి మూఁడవదియైన ద్యులోకమునందు సోమము కలదు. ఆ సోమమును తెచ్చి యిచ్చి దాసీత్వమునుండి నిన్ను విడిపించుకొనుము" అని. (మహ ర్జన స్తప స్సత్య లోకములు కూడ 'ద్యు' శబ్దాభిధేయములు కావున 'ఇఁటనుండి మూఁడవదైన ద్యులోకమునందు,' అని చెప్పఁబడినది. ఇతః పూర్వము ప్రాయణీయేష్టిని చెప్పి ఇప్పుడు సోమక్రయణిని గూర్చి చెప్పుటకు ముందు సోమాహరణము ఉపాఖ్యాన సహితముగ వివరింపఁబడుచున్నది.)

2. అర్థము: కద్రూః=కద్రువ, ఇయం వై=ఈ భూలోక రూపమే. సువర్ణీ=సుపర్ణి, అసౌ=ద్యులోక రూప మైనది. ఛన్దాంసి=గాయత్ర్యాది ఛందస్సులు, సౌపర్ణేయాః=సుపర్ణియొక్క కుమారులు.

తాత్పర్యము: కద్రువ భూలోక స్వరూప యగుటచే స్వయముగ తాను మూఁడవదైన ద్యులోకమునుండి సోమమును తెచ్చుటకు సమర్థురాలు కాదు. సుపర్ణి ద్యులోక స్వరూప యగుటచే సోమాహరణమున సమర్థురాలు. గాయత్ర్యాది ఛందస్సులు సుపర్ణి సంతానములు, ఉత్పతన సమర్థ లగుటయు అందుకు కారణము. (సోమాహరణమును సంభవింపఁ జేయుటకై ఈ శ్రుతి చెప్పఁబడినది.)

3. అర్థము: "అస్మై వై=ఇటువంటి ఉపద్రవ నివారణముకొఱకే, పితరౌ=తల్లిదండ్రులు, పుత్రాన్=పుత్రులను, బిభృతః=పోషించుచున్నారు. ఇతః=ఈ లోకమునుండి, తృతీయస్యాం దివి=మూఁడవదైన ద్యులోకమునందు, సోమః=సోమము, (అస్తి=కలదు.) తమ్=ఆ సోమమును, ఆహర=తీసికొనిరమ్ము. తేన=ఆ సోమాహరణముచే, ఆత్మానమ్=ఆత్మను, నిష్క్రీణీష్వ=విడిపించుకొనుము, ఇతి=అని, కద్రూః=కద్రువ, మా=నన్నుఁగూర్చి, అవోచత్=పలికెను" ఇతి=అని, సా=ఆ సుపర్ణి, అబ్రవీత్=పలికెను.

తాత్పర్యము: [కద్రువ చెప్పిన పిమ్మట సుపర్ణి తన కుమారులైన గాయత్ర్యాదుల సమక్షమునందు తన వృత్తాంతము నీ విధముగ వివరించెను.] ఇటువంటి ఉపద్రవమును నివారించుటకొఱకే లోకమున పితరులు పుత్రులను పోషించుచున్నారు. ఈ లోకమునుండి మూఁడవదియైన ద్యులోకమునందు సోమము కలదు. ఆ సోమమును తెచ్చి యిచ్చి దాసీత్వమునుండి నిన్ను విడిపించుకొనుము," అని ఆ సుపర్ణి పలికెను. (పుంనామనరకోపలక్షితాదశేషా ద్దుఃఖాత్త్రాయన్తే ఇతి పుత్రాః="పుమ్" అను నరకమునుండి అనఁగా తన్నరకోపలక్షితమైన సర్వ దుఃఖమునుండి రక్షించువారు కావున 'పుత్రులు' అని పుత్ర శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము.

4. అర్థము: జగతీ=జగతీ ఛందస్సు, చతుర్దశాక్షరా సతీ=పదునాలుగు అక్షరములు కలది యగుచు, ఉదపతత్=పైకి ఎగిరెను. సా=ఆ జగతి, అప్రాప్య=సోమమును పొందక, న్యవర్తత=ద్యులోకమునుండి మఱలెను. తస్యై=ఆ జగతియొక్క, ద్వే అక్షరే=రెండక్షరములు, అమీయేతామ్=(స్వాన భ్రాజాది సోమరక్షకులచే) గ్రహింపఁబడినవి. సా=ఆ జగతి, పశుభిః చ=పశువులతోడను, దీక్షయా చ=దీక్షతోడను, ఆగచ్ఛత్=వచ్చెను. తస్మాత్=ఆ కారణమువలన, జగతీ=జగతి, ఛన్దసామ్=ఛందస్సులలో, పశవ్యతమా=అత్యంతము పశుప్రద. తస్మాత్=ఆ కారణము వలన, పశుమన్తమ్=పశుమంతునిగూర్చి, దీక్షా=దీక్ష, ఉపనమతి=స్వాధీన మగుచున్నది.

తాత్పర్యము: పూర్వము జగతీ ఛందస్సునకు పదునాలు గక్షరము లుండెడివి. అటువంటి జగతి ద్యులోకమునకు పోయి స్వాన భ్రాజాది సోమరక్షకులతో యుద్ధము చేసి రెండక్షరములు ఆ సోమరక్షకులు హరించఁగా సోమమును పొందలేక పరాజితయై అచటనుండి పశువులను దీక్షను తీసికొని వచ్చెను. ఆ విధముగ పశువులను తెచ్చుటచే ఛందస్సులలో జగతి అత్యంత పశుప్రద యైనది. పశువులతోఁ గూడ దీక్ష వచ్చుటచే పశుమంతునకు దీక్ష వశమై ఉండును. [ఆ పశువులు అగ్నీషోమీయ సవనీయములకు అనుబంధులు. దీక్ష ఇష్టిసాధ్య మైనది. ఛందస్సులలో ప్రౌఢ యగుటచే జగతి ప్రథమమున ద్యులోకమునకు వెడలినది.]

5. అర్థము: త్రిష్టుక్=త్రిష్టుక్ ఛందస్సు, త్రయోదశాక్షరా సతీ=పదుమూఁ డక్షరములు కలది యగుచు, ఉదపతత్=ద్యులోకమును గూర్చి ఎగిరెను. సా=ఆ త్రిష్టుక్ ఛందస్సు, అప్రాప్య=సోమమును పొందక, న్యవర్తత=తిరిగి వచ్చెను. తస్యై=ఆ త్రిష్టుక్కుయొక్క, (షష్ఠ్యర్థే చతుర్థీ.) ద్వే అక్షరే=రెండక్షరములు, అమీయేతామ్=(సోమరక్షకులచే) హరింపఁబడినవి. సా=ఆ త్రిష్టుక్ ఛందస్సు, దక్షిణాభిః చ=గవాశ్వాదిరూప దక్షిణలతోడను, తపసా చ=తపస్సుతోడను, ఆగచ్ఛత్=వచ్చెను.

తాత్పర్యము: జగతీ ఛ్ఛందస్సున కనంతరము త్రిష్టుక్ ఛందస్సు పదుమూఁ డక్షరములు కలదగుచు ద్యులోకమును గూర్చి పైకి ఎగిరి సోమమును పొందక సోమరక్షకులతో యుద్ధముచేసి పరాజయమునొంది రెండక్షరములను సోమ రక్షకు లపహరింపఁగా దక్షిణలతోడను తపస్సుతోడను తిరిగి వచ్చెను. గోవులు అశ్వములు మున్నగునవి దక్షిణలు. అశన పరిత్యాగ, ముష్టిబంధ, వాగ్యమ, నవనీతాభ్యంగ, కృష్ణాజిన ప్రావరణాది, క్లేశ సహిష్ణుత్వము తపస్సు. దక్షిణలు యజ్ఞకర్తచే ఋత్విజుల కీయఁదగినవి. యజ్ఞకర్త వహించవలసినది తపస్సు. [ఇచట త్రిష్టుక్ ఛందస్సుయొక్క యుద్ధము తెలియఁజేయఁబడినది. (ప్రాణమువలె ప్రియమైన గవాశ్వాది దానము అధికమైన తపస్సు.)

6. అర్థము: తస్మాత్=ఆ కారణమువలన, త్రిష్టుభః=త్రిష్టుక్ ఛందస్సునకు, లోకే=లోకమునందు, (స్థానమ్=స్థానము, అస్తి=కలదు.) యః=ఎవఁడు, స్వమ్=ధనమును, దదాతి=ఇచ్చుచున్నాఁడో.

తాత్పర్యము: ద్యులోకమునుండి ప్రాణమువలె ప్రియమైన గవాశ్వాదికమును తీసికొని వచ్చుటవలన లోకమునందు ఈ త్రిష్టుప్పునకు లోకము స్థానము. శరీర ప్రయాసము కంటెను ధనహాని కృతమైన మానస ప్రయాస మధికమగుటవలనను ధనముచేత పరోపజీవనము కలుగుటవలనను దానమే గొప్ప తపస్సు అని కొందఱు అభిజ్ఞుల యభిమతము.

7. అర్థము: గాయత్రీ=గాయత్రీ ఛ్ఛందస్సు, చతురక్షరా సతీ=నాలుగు అక్షరములు కలదగుచు, అజయా=మేఁకతో, (కూడ,) ఉదపతత్=ద్యులోకమును గూర్చి ఎగిరెను. అజా=మేఁక, అస్యై=ఈ గాయత్రికొఱకు, తమ్=ఆ సోమమును, జ్యోతిషా=తేజస్సుతో, అభ్యరున్ద=అంతటను అవరోధించెను. తత్=ఆ కారణమువలన, అజాయాః=అజకు,(మేఁకకు) అజత్వమ్=[''అజ''=గతి క్షేపణయోః] రోధన పర్యాయమైన క్షేపణార్థకమైన 'అజ' ధాతువువలన అజత్వము, (సిధ్యతి=సిద్ధించుచున్నది.) సా=ఆ గాయత్రి, సోమం చ=సోమమును, చత్వారి అక్షరాణి చ=నాలుగక్షరములను, ఆహరత్=తెచ్చెను. సా=ఆ గాయత్రి, అష్టాక్షరా=ఎనిమిది అక్షరములు కలదిగా, సమపద్యత=ఏర్పడెను.

తాత్పర్యము: సహాయ రహితముగ ద్యులోకమునకు పోయి పరాజయము నొందిన జగతీ త్రిష్టుక్ ఛందస్సుల విషయమును తెలిసికొని గాయత్రి ఛ్ఛందస్సు మేఁకతోఁగూడ ద్యులోకమునకు పోయెను. అచట మేఁక తన తేజస్సుతో సోమమును నలువైపులందు అవరోధించెను. ''అజ''=గతి, క్షేపణయోః. అజతీతి అజా. క్షేపణము రోధనము సమానార్థకములు. ఈ యర్థము ననుసరించి అజకు అజత్వము సార్థక మైనది. ఆ గాయత్రి సోమరక్షకులను జయించి సోమమును, జగతీ త్రిష్టుక్ ఛందస్సులు కోల్పోయిన మొత్తము నాలుగక్షరములను తీసికొనివచ్చెను. గాయత్రి ద్యులోకమునకు పోవునపుడు నాలుగక్షరములనే కలిగియున్నను సోమరక్షకులనుండి తెచ్చుకొనిన నాలుగక్షరములతో కలసి అష్టాక్షర ఆయెను. (ఇచట గాయత్రికి యుద్ధమునందు విజయము చూపఁబడినది.)

8. అర్థము: కస్మాత్ సత్యాత్=ఏ కారణమువలన, గాయత్రీ=గాయత్రి, ఛన్దసామ్=ఛందస్సులలో, కనిష్ఠా సతీ=న్యూనాక్షర యగుచు, యజ్ఞముఖమ్=ప్రాతస్సవనమును, పరీయాయ ఇతి=పొందినది? అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=పరిభాషించుచున్నారు. ఇయమ్=ఈ గాయత్రి, యత్=ఏ కారణమువలన, అదః=ద్యులోకమునుండి,

సోమమ్=సోమమును, అహరత్=తెచ్చెనో, తస్మాత్=ఆ కారణమువలన, యజ్ఞముఖమ్=యజ్ఞముఖమును, (ప్రాత స్సవనమును,) పర్యైత్=పొందినది. తస్మాత్=ఆ కారణమువలన, తేజస్వినీతమా=తేజస్వతులలో శ్రేష్ఠమైనది. (ఇతి=అని, బ్రహ్మవాదినః కేచన=కొందఱు మంత్రజ్ఞులు, ఆహుః=చెప్పుచున్నారు.)

తాత్పర్యము: జగతీ త్రిష్టుక్ గాయత్రీ ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు మిగిలిన జగతీ త్రిష్టుక్ ఛందస్సులకంటె అల్పాక్షరములు కలది. ప్రాత స్సవనము మాధ్యందిన సవనము సాయం సవనములు యజ్ఞాంగములు. వానిలో ప్రాతస్సవనము యజ్ఞారంభమున అనుష్ఠేయమైనకర్మ కనుక అది యజ్ఞముఖ మనఁబడుచున్నది. ప్రాతస్సవనమునందు బహిష్పవమాన నామకమైన ప్రథమస్తోత్రమునందు "ఉపాస్మై గాయతా నరః" ఇత్యాది గాయత్రీ ఛన్దోయుతములైన ఋక్కులు పఠించఁబడుచున్నవి. అందువలన అల్పాక్షరమైన గాయత్రీ ఛందస్సు యజ్ఞముఖమైన ప్రాతస్సవనమునందు ఉపయోగింపఁబడుచున్నది? అని కొందఱు మంత్రజ్ఞులు ప్రశ్నించుకొనుచున్నారు. గాయత్రి ద్యులోకమునకు పోయి యుద్ధమున సోమరక్షకులను జయించి సోమమును తెచ్చినది, కావున గాయత్రీ ఛందస్సును, యజ్ఞముఖమునందు ఉపయోగించుచున్నారని కొందఱు మంత్రజ్ఞులు సమాధానము చెప్పుచున్నారు. మాధ్యందిన సవనమునందు త్రిష్టుక్ ఛందస్సు, సాయం సవనమునందు జగతీ ఛందస్సు ఉపయోగింపఁబడుచున్నవి. ఇచట ప్రశ్నోత్తరములచే గాయత్రి ప్రశంసింపఁబడినది.

9. అర్థము: (గాయత్రీ=గాయత్రి) పద్భ్యామ్=పాదములచేత, ద్వే సవనే=రెండు సవనములకు సరిపోవునంతటి సోమభాగములను, సమగృహ్ణాత్=బాగుగ గ్రహించెను. ముఖేన=ముఖముచేత, ఏకమ్=ఒక సవనమునకు సరిపోవునంతటి సోమభాగమును, సమగృహ్ణాత్=సంగ్రహించెను. ముఖేన=ముఖముచేత, యత్=దేనిని, సమగృహ్ణాత్=సంగ్రహించెనో, తత్=దానిని, అధయత్=పానము చేసెను. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాతఃసవనం చ=ప్రాతస్సవనమును, మాధ్యందినం చ=మాధ్యందినమును (అను) ద్వే సవనే=రెండు సవనములు, శుక్రవతీ=సోమ రసోపేతములైనవి. హి=ఏ కారణమువలన, ధీతమివ=ముఖముచే గ్రహింపఁబడిన సోమమును త్రాగఁబడిన దానివలె, మన్యన్తే=తలఁచు చున్నారో, తస్మాత్=ఆ కారణమువలన, తృతీయ సవనే=తృతీయ (సాయం) సవనమునందు, ఋజీషమ్ అభిషుణ్వన్తి=బాణలియందు (బూరెలమూఁకుడునందు,) రసము తీయుచున్నారు.

తాత్పర్యము: పక్షిరూపమైన గాయత్రి సవన ద్వయమునకు సరిపోవునంతటి సోమభాగములను పాదములతో సంగ్రహించి తృతీయ సవన పర్యాప్తమైన సోమ భాగమును చంచుపుటములతో కొఱికి ఆ రసమును త్రాగెను. పాదములతో పట్టుకొనివచ్చిన సోమభాగములు త్రాగఁబడలేదు. కావున ప్రాత స్సవన మాధ్యందిన సవనములు శుక్ర శబ్దాభిధేయమైన సోమరసముతో కూడియున్నవి. మూఁడవ సోమభాగము త్రాగఁబడినది కావున త్రాగఁబడని సోమ సాదృశ్యము సిద్ధించుటకై ఆ సోమభాగమును బూరెలమూఁకుడునందు అభిషవము చేయుచున్నారు. (ఇచట సోమాహరణ ప్రకారము చెప్పఁబడినది.)

10. అర్థము: సశుక్రత్వాయ=సరసత్వమునకై, ఆశిరమ్=క్షీరమును, అవనయతి=సోమమునందు పోయవలెను. అథో=మఱియు, ఏనత్=ఈ క్షీరము, సం భరత్యేవ=(క్షీరసేచనమువలన. ఋజీషగత సోమరసరూప హవిస్సును) బాగుగనే పోషించును.

తాత్పర్యము: మూఁడవ సోమభాగము త్రాగఁబడుటచే రసహీనమై యుండును. రసవంతమైన ప్రథమ ద్వితీయ సోమ భాగములతో సాదృశ్యము సిద్ధించుటకై సరసత్వము కొఱకు ఆ సోమమునందు క్షీరమును పోయవలెను. మఱియు క్షీరసేచనమువలన బాణలియందలి సోమరసరూప హవిస్సును ఈ క్షీరము బాగుగ రసవంతముగఁ జేయును.

11. అర్థము: ఆహ్రియమాణమ్=తీసికొనిరాఁబడుచున్న, తం సోమమ్=ఆ సోమమును, విశ్వావసుః=విశ్వావసువు అనుపేరు గల, గన్ధర్వః=గంధర్వుఁడు, పర్యముష్ణాత్=సంపూర్ణముగ నపహరించెను. పరిముషితః=సంపూర్ణముగ నపహ

రింపఁబడిన, సః=ఆ సోమము, తిస్రః రాత్రీః=మూఁడు రాత్రులు, అవసత్=ఉండెను. తస్మాత్=ఆ కారణ మువలన, క్రీతః సోమః=క్రయము చేయఁబడిన సోమము, తిస్రః రాత్రీః=మూఁడు రాత్రులు, వసతి=ఉంటున్నది.

తాత్పర్యము: గాయత్రిచే తీసికొని రాఁబడుచున్న సోమమును విశ్వావసువను గంధర్వుఁ డపహరించెను. అప్పు డా సోమము మూఁడు రాత్రు లుండెను. కావున క్రయము చేయఁబడిన సోమము మూఁడు రాత్రులు అభిషవము చేయఁబడ కుండ ఉంటున్నది. (మూఁడు ఉపస ద్దినములందు సోమమును అభిషవముచేయకుండ ఉంచవలెనని భావము.)

12. అర్థము: గన్ధర్వాః=గంధర్వులు, స్త్రీకామాః వై=స్త్రీకాముకులే. స్త్రియా=స్త్రీచేత, నిష్క్రీణామ=(సోమమును) క్రయము చేయుదుము, ఇతి=అని, తే దేవాః=ఆ దేవతలు, అబ్రువన్=పలికిరి. తే=ఆ దేవతలు, వాచమ్=వాక్కును, ఏకహాయనీమ్=ఒక సంవత్సరము వయస్సు గల, స్త్రియమ్=స్త్రీనిగా, కృత్వా=చేసి, తయా=ఆ వాగ్రూప స్త్రీ చేత, నిరక్రీణన్=(సోమమును) కొనిరి.

తాత్పర్యము: 'గంధర్వులు స్త్రీకాముకులే కనుక స్త్రీచేత సోమమును క్రయము చేయుదము' అని, పలికి వాక్కు ను ఒక సంవత్సరము వయస్సు గల స్త్రీనిగాఁ జేసి ఆ స్త్రీచేత సోమమును కొనిరి. (ఇచట సోమక్రయమునందు వాగ్రూప స్త్రీని సాధనముగా దేవతలు ఉపయోగించిరి.)

13. అర్థము: సా=ఆ వాగ్రూపయైన స్త్రీ, రోహిద్రూపమ్=ఎఱ్ఱని గోరూపమును, కృత్వా=చేసి, గన్ధర్వేభ్యః=గంధర్వులనుండి, అపక్రమ్య=తొలఁగి, అతిష్ఠత్=ఉండెను. తత్=అది, రోహితః=ఎఱ్ఱని గోరూపముయొక్క, జన్మ=పుట్టుక.

తాత్పర్యము: ఆ వాగ్రూపయైన స్త్రీ ఎఱ్ఱని గోరూపమును ధరించి గంధర్వులనుండి తొలఁగిపోయెను. ఆ విధముగ ఎఱ్ఱని గోరూపముయొక్క పుట్టుక ఏర్పడెను.

14. అర్థము: తే దేవాః=ఆ దేవతలు, "యుష్మత్=మీనుండి, అపక్రమీత్=తొలఁగిపోయెను. అస్మాన్=మమ్ము, న ఉపా వర్తతే=చేరుచుండలేదు. ఇతి=అని, అబ్రువన్=పలికిరి." విహ్వయామహై=విలక్షణమగునట్లుగ పిలుతుము. ఇతి=అని, బ్రహ్మ=వేదము, గన్ధర్వాః=గంధర్వులు, అవదన్=పలికిరి. దేవాః=దేవతలు, అగాయన్=గానము చేసిరి. గాయతః=గానము చేయుచున్న, దేవాన్=దేవతలను గూర్చి, సా=రోహిత గోరూపమును ధరించిన స్త్రీరూపయైన యా వాక్కు, ఉపావర్తత=మఱలివచ్చెను. తస్మాత్=ఆ కారణమువలన, గాయన్తమ్=గానము చేయుచున్న, స్త్రియమ్=స్త్రీని, కామయన్తే=కోరుచున్నారు.

తాత్పర్యము: మీనుండి స్త్రీరూపయైన వాక్కు తొలఁగిపోయెనని, ఆ దేవతలు గంధర్వులతో అనిరి. విలక్షణ మగున ట్లుగా పిలుతుమని వేదము, గంధర్వులు పలికిరి. దేవతలు గానము చేసిరి. గానము చేయుచున్న దేవతల కభిముఖముగ రోహిత గోరూపమును ధరించిన యా స్త్రీరూపవాక్కు వచ్చెను. కావున గానము చేయుచున్న స్త్రీని కోరుచున్నారు.

15. అర్థము: యః=ఏ పురుషుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, వేద=తెలిసికొనుచున్నాఁడో, ఏనమ్=ఇతనినిగూర్చి, స్త్రియః=స్త్రీలను, కాముకాః=కోరుచున్నవారు, భవన్తి=అగుచున్నారు. బహుతయా=అనేకులుగా, భవన్తి ఉత యత్=ఉంటున్నను, జన్యేషు=వరునికై కన్యను అన్వేషించు బంధువులలో, యః=ఎవఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, విద్వాన్ అపి=తెలిసినవాఁడు కూడ, భవతి=అగుచున్నాఁడో, తేభ్యః ఏవ=ఆ బంధువులకొఱకె, దదతి=కన్యను ఇచ్చుచున్నారు.

తాత్పర్యము: పూర్వోక్త వృత్తాంతమును తెలిసినవానిని, బంధువులు కన్య నిచ్చుటకు కోరుచుందురు. మఱియు వరు నికై కన్యాన్వేషణముచేయు బంధువులలో రెండు వర్గములు కలవు. పూర్వోక్తవిధమును తెలియనివారు, అనేక గుణాంతరోపేతులును అయిన అనేకవరులు కలరు. అయినను వారిని ఉపేక్షించి అట్టి బంధువు లలో ఒకఁడైనను పూర్వోక్త విధమును తెలిసికొనినవాఁడున్నను ఆ బంధువులకు తమ కన్య నిచ్చుటకు తల్లిదండ్రులు ఇచ్చయించుచుందురు. (ఇచట పూర్వోక్త వృత్తాంత వేదనము ప్రశంసింపఁబడినది.)

16. అర్థము: ఏకహాయిన్యా=ఒక సంవత్సరము వయస్సు గల గోరూపమును ధరించిన వాక్కుచే, క్రీణాతి=సోమమును కొనవలెను. (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు, సర్వయా వాచైవ=సంపూర్ణ వాక్కుచేతనే, క్రీణాతి=కొనుచున్నవాఁ డగుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, ఏకహాయనాః=ఒక సంవత్సరము వయస్సు గల, మనుష్యాః=మనుష్యులు, వాచమ్=వాక్కును, వదన్తి=పలుకుచున్నారు.

తాత్పర్యము: యజ్ఞకర్త సోమయాగమునకై ఒక సంవత్సరము వయస్సు గల గోరూపమును ధరించిన వాగ్దేవతచే (అనగా-గోవు నిచ్చి సోమమును తీసికొనవలెను.) సోమమును కొనవలెను. ఈ విధముగ కొనిన యజమానుఁడు (వాగ్దేవత సోమక్రయణీ రూపమును స్వీకరించుటవలన,)సంపూర్ణ వాక్కుచేతనే సోమమును కొనినవాఁ డగును. కావున లోకమునందు మనుష్యులు తాము పుట్టిన సంవత్సరకాలమునకు మాటలాడుచున్నారు. (ఇచట సోమక్రయణియందు గుణము విధించఁబడినది. ఆ గుణము ఏకహాయనత్వ రూపము.)

17. అర్థము: అకూటయా=వంకరలేని కొమ్ములు కలదియు, అకర్ణయా=ఛిన్నములు కాని చెవులు కలదియు, అకాణయా=ఒక కన్నుకలది కానిదియు, అశ్లోణయా=కుష్ఠాది దోషములు లేనిదియు, అసప్తశఫయా=న్యూనాంగి కానిదియునగు (ఏకహాయినియైన గోవుచే,) క్రీణాతి=సోమమును కొనవలెను.

తాత్పర్యము: యజమానుఁడు సోమయాగనిమిత్తము ఈ కూటాది దోషములు లేని ఒక సంవత్సరము వయస్సు గల గోవునిచ్చి సోమమును తీసికొనవలెను. (ఇచట వర్జనీయములైన దోషములు తెలుపఁబడినవి.)

18. అర్థము: సర్వయైవ=సంపూర్ణావయవములు గల గోవుచేతనే, ఏనమ్=ఈ సోమమును, క్రీణాతి=కొనవలెను.

తాత్పర్యము: సర్వావయవ సంపూర్ణమైన గోవుచే సోమమును కొనవలెను. (ఇచట ఉపాదేయ గోవు విశదీకరింపఁబడినది.)

19. అర్థము: శ్వేతయా=తెల్లని గోవుచే, క్రీణీయాత్ యత్=సోమమును క్రయము చేయుచో, యజమానః=యజమానుఁడు, దుశ్చర్మా=దుష్టచర్మము కలవాఁ డగును. కృష్ణయా=నల్లని గోవుచే, క్రీణీయాత్ యత్=సోమమును క్రయము చేయునెడల, (సా=ఆ కృష్ణగోవు,) అనుస్తరణీ=అనుస్తరణి (చనిపోయిన పురుషు ననుసరించి చంపఁబడునట్టిది.) యగును. యజమానః=యజమానుఁడు, ప్రమాయుకః=మరణ శీలుఁడు, స్యాత్=అగును. ద్విరూపయా=వర్ణ ద్వయోపేతమైన గోవుచే, క్రీణీయాత్ యత్= క్రయము చేయుచో, వార్త్రఘ్నీ=విరోధి ఘాతిని యగును. (కింతు=కాని,) సః=అతఁడు, అన్యం వా=ఇతరునైనను, జినీయాత్=జయించును. తం వా=అతనినైనను, అన్యః=ఇతరుఁడు, జినీయాత్=జయించును. (అతః=ఈ కారణమువలన,) అరుణయా=ఎఱ్ఱనిదియు, పిఙ్గాక్ష్యా=పచ్చని కన్నులు కలదియునగు గోవుచే, క్రీణీయాత్=సోమమును కొనవలెను. ఏతత్ వై=ఇదియే, సోమస్య=సోమముయొక్క, రూపమ్=రూపము. (ఏవం సతి=ఇట్లు కాఁగా, స్వయా దేవతయైవ=స్వీయ దేవతచేతనే, క్రీణాతి=(యజమానుఁడు) కొనినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞకర్త తెల్లని గోవు నిచ్చి సోమమును తీసికొనినచో, అతఁడు దుష్టచర్మము కలవాఁ డగును. నల్లని గోవు నిచ్చి సోమమును కొనినచో నల్లని గోవు అనుస్తరణి కావున యజమానుఁడు మరణించును. రెండు వర్ణములు కల గోవునిచ్చి సోమమును తీసికొనినచో వర్ణ ద్వయోపేతయైన గోవు విరోధి ఘాతిని యగును కాని, అతఁడైనను ఇతరుని జయించవచ్చును. లేదా, ఇతరుఁడైనను అతనిని జయించవచ్చును. ఈ యిరువురిలో ఎవఁడు ఎవనిని జయించునో తెలియదు. కావున ఎఱ్ఱని వర్ణము కలదియు, పచ్చని కన్నులు కలదియునగు గోవుచే సోమమును కొనవలెను. అరుణత్వము పింగాక్షత్వము సోమదేవత యొక్క స్వరూపము కావున ఇట్టి గోవుచే సోమమును కొనిన యజమానుఁడు స్వీయ దేవతచేతనే సోమమును కొనినవాఁ డగును. (ఇచట విపక్ష బాధాపురస్సరముగ స్వపక్షము విధింపఁబడినది.)

షష్ఠానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే సప్తమోఽనువాకః

మూలము: [1]తద్ధిరణ్య మభవ త్తస్మాదద్భ్యో హిరణ్యం పునన్తి [2]బ్రహ్మవాదినో వదన్తి కస్మాత్సత్యా దనస్థికేన ప్రజాః ప్ర వీయన్తేఽస్థన్వతీ ర్జాయన్త ఇతి యద్ధిరణ్యం ఘృతేఽవధాయ జుహోతి తస్మాదనస్థికేన ప్రజాః ప్ర వీయన్తేఽస్థన్వతీ ర్జాయన్త [3]ఏతద్వా అగ్నేః ప్రియం ధామ యద్ఘృతం తేజో హిరణ్య మియం తే శుక్ర తనూరిదం వర్చ ఇత్యాహ సతేజస మేవైనగ్ం సతనుం (౧) కరోత్యథో సం భరత్యే వైనం [4]యదబద్ధ మవదధ్యా ద్గర్భాః ప్రజానాం పరాపాతుకాః స్యుర్బద్ధమవ దధాతి గర్భాణాం ధృత్యై [5]నిష్టర్క్యం బధ్నాతి ప్రజానాం ప్రజననాయ [6]వాగ్వా ఏషా యత్సోమక్రయణీ జూరసీత్యాహ యద్ధి మనసా జవతే తద్వాచా వదతి ధృతా మనసేత్యాహ మనసా హి వాగ్ధృతా జుష్టా విష్ణవ ఇత్యాహ (౨) యజ్ఞో వై విష్ణు ర్యజ్ఞాయైవైనాం జుష్టాం కరోతి తస్యా స్తే సత్యసవసః ప్రసవ ఇత్యాహ సవి తృప్రసూతామేవ వాచమవ రున్ధే [7]కాణ్డేకాణ్డే వై క్రియమాణే యజ్ఞగ్ం రక్షాగ్ంసి జిఘాగ్ంసన్త్యేష ఖలు వా అరక్షోహతః పన్థా యో ఽగ్నేశ్చ సూర్యస్య చ సూర్యస్య చక్షురాఽరుహ మగ్నే రక్ష్ణః కనీ నికా మిత్యాహ య ఏవారక్షోహతః పన్థాస్తగ్ం సమారోహతి (౩) [8]వాగ్వా ఏషా యత్సోమక్రయణీ చిదసి మనాఽసీత్యాహ శాస్త్యేవైనా మేతత్తస్మాచ్ఛిష్టాః ప్రజా జాయన్తే [9]చిదసీత్యాహ యద్ధి మనసా చేతయతే తద్వాచా వదతి మనాఽసీత్యాహ యద్ధి మనసాఽభిగచ్ఛతి తత్కరోతి ధీరసీత్యాహ యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా (౪) వదతి దక్షిణాఽసీత్యాహ దక్షిణా హ్యేషా యజ్ఞియాఽసీత్యాహ యజ్ఞియామేవైనాం కరోతి క్షత్రియాఽసీత్యాహ క్షత్రియా హ్యేషాఽదితి రస్యుభయతఃశీర్ష్ణీత్యాహ యదేవాఽఽదిత్యః ప్రాయణీయో యజ్ఞానా మాదిత్య ఉదయనీయ స్తస్మాదేవ మాహ [10]యదబద్ధా

స్యాదయుతా స్యాద్యత్పదిబద్ధాఽనుస్తరణీ స్యాత్ప్రమాయుకో యజమానః స్యాత్ (౫) యత్కర్ణ

గృహీతా వార్త్రఘ్నీ స్యాత్స వాన్యం జినీయాత్తం వాఽన్యో జినీయాన్మిత్రస్త్వా పది బధ్నాత్విత్యాహ

మిత్రో వై శివో దేవానాం తేనైవైనాం పది బధ్నాతి [11]పూషా ఽధ్వనః పాత్విత్యాహేయం వై

పూషేమామేవాస్యా అధిపామకః సమష్ట్యా ఇన్ద్రాయాధ్యక్షాయేత్యాహేన్ద్ర మేవాస్యా అధ్యక్షం కరోతి

(౬) అను త్వా మాతా మన్యతామను పితేత్యాహానుమతయైవైనయా క్రీణాతి సా దేవి దేవ మచ్ఛే

హీత్యాహ దేవీ హ్యేషా దేవః సోమ ఇన్ద్రాయ సోమమిత్యాహేన్ద్రాయ హి సోమ ఆ హ్రియతే యదేత

ద్యజుర్న బ్రూయాత్పరాచ్యేవ సోమక్రయణీయా ద్రుద్రస్త్వాఽఽవర్తయత్విత్యాహ రుద్రో వై క్రూరః

(౭) దేవానాం తమేవాస్యై పరస్తా ద్దధాత్యావృత్త్యై క్రూరమివ వా ఏతత్కరోతి యద్రుద్రస్య కీర్త

యతి మిత్రస్య పథేత్యాహ శాన్త్యై వాచా వా ఏష వి క్రీణీతే యః సోమక్రయణ్యా స్వస్తి సోమసఖా

పునరేహి సహ రయ్యేత్యాహ వాచైవ విక్రీయ పునరాత్మన్వాచం ధత్తేఽనుపదాసుకాఽస్య వాగ్భవతి

య ఏవం వేద(౮)

(సతనుం విష్ణవ ఇత్యాహ సమారోహతి ధ్యాయతి తద్వాచా యజమానః స్యాత్కరోతి క్రూరో వేద|)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే సప్తమోఽనువాకః ||౭||

## వేదార్థదీపిక

అవతారిక: షష్ఠానువాకమునందు సోమాహరణము, సోమక్రయ సాధనము వివరింపఁబడినవి. అరుణ గోవుచే సోమక్రయ ప్రకారము ఈ సప్తమానువాకమునందు చెప్పఁబడుచున్నది. ప్రథమ కాండస్థ ద్వితీయ ప్రపాఠక గత చతుర్థానువాకమునందలి మంత్రములకు ఈ సప్తమానువాకము వివరణాత్మకము. వివరణమునకై ఉదాహరింపఁబడిన మంత్రభాగములు అనఁగా 'ఇత్యాహ' అని ఉన్నభాగమునకు ముందున్న మంత్రభాగములు పైని చెప్పఁబడిన యనువాకములోనివి.

1. అర్థము: **తత్**=ఆ యగ్ని రేతస్సు, హిరణ్యమ్=బంగారముగా, **అభవత్**=అయెను. **తస్మాత్=ఆ కారణమువలన, అద్భ్యః=ఉద** కములవలన, హిరణ్యమ్=బంగారమును, పునన్తి=పవిత్రము చేయుచున్నారు.

తాత్పర్యము: "ఆపో వరుణస్య పత్న్యః ఆసన్ తా అగ్ని రభ్యధ్యాయత్ తాః సమభవన్ తస్య రేతః పరాపతత్ తద్ధిరణ్య మభవత్" 'ఉదక దేవతలు వరుణ దేవునకు భార్యలుగా నుండిరి. అగ్ని దేవుఁడు ఆ యుదక దేవతలను తలఁచెను. ఆ యుదక దేవతలు బాగుగ నభిముఖులైరి. అప్పుడు అగ్నియొక్క రేతస్సు పడిపోయెను. పడిన యా రేతస్సు హిరణ్య మైనది.' అని ఆధానబ్రాహ్మణమునందు హిరణ్యముయొక్క ప్రశంస చేయఁబడినది. ఈ ఆధానబ్రాహ్మణము ననుసరించి హిరణ్యమునకు అగ్ని తండ్రి యనియు, ఉదకదేవతలు తల్లు లనియు స్పష్ట మగుచున్నది. ఆ కారణమువలన రజస్వలాది స్త్రీల స్పర్శ కలిగిన హిరణ్యమును స్వత శ్శుద్ధమగుటచే నీటిచేతనే శుద్ధి చేయుచున్నారు. కాంస్య తామ్రాదికమునకువలె భస్మాగ్న్యాదికముచే శుద్ధి చేయుటలేదు.

2. అర్థము: కస్మాత్ సత్యాత్=ఏ కారణమువలన, అనస్థికేన=అస్థి రహితమైన వీర్యముచేత, ప్రజాః ప్రవీయన్తే=గర్భములు చేయఁబడుచున్నవి!, అస్థన్వతీః=అస్థియుక్తులు, జాయన్తే=పుట్టుచున్నారు. ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=సంభాషించుకొనుచున్నారు. హిరణ్యమ్=బంగారమును, ఘృతే=నేతియందు, అవధాయ=ఉంచి, జుహోతి యత్=హోమము చేయుచున్నచో, తస్మాత్=ఆ హోమమువలన, అనస్థికేన=అస్థిరహిత వీర్యముచేత, ప్రజాః ప్రవీయన్తే=గర్భములు చేయఁబడుచున్నవి. అస్థన్వతీః=అస్థిసహితులు, జాయన్తే=పుట్టుచున్నారు. అస్థి=ఎముక.

తాత్పర్యము: లోకమునందు ఏ కారణమువలన ఎముకలేని వీర్యముచేత గర్భములు చేయఁబడుచున్నవి! అస్థిసహితులు పుట్టుచున్నారు! అనఁగా ఎముకలేని వీర్యముచేత గర్భోత్పత్తి అగుచున్నది. ఉత్పత్తి కాలమునందు అస్థిసహితులుగా పుట్టుచున్నారు అని యర్థము. ఆజ్యమునందు హిరణ్యము నుంచి హోమము చేయుచున్నారు. కావున అస్థిరహిత వీర్యముచే గర్భోత్పత్తి యగుచున్నది. ఉత్పత్తి కాలమునందు అస్థి సహితులు పుట్టుచున్నారు. ఇచట ఆజ్యము వీర్యసదృశము. హిరణ్యము అస్థి సదృశము. ఈ సాదృశ్యమును నిర్వహించుటకు ఈశ్వరునిచే అస్థి నిర్మించఁబడుచున్నదని యర్థము.

3. అర్థము: ఘృతం యత్=ఆజ్యము ఏది కలదో, ఏతత్ వై=ఈ ఆజ్యమే, అగ్నేః=అగ్నికి, ప్రియం ధామ=ప్రియమైన స్థానము. తేజః=తేజస్సు, హిరణ్యమ్=హిరణ్యము. "ఇయం తే శుక్ర తనూ రిదం వర్చః" ఇతి ఆహ="ఓ దీప్తిమంతమైన హిరణ్యమా! నీకు ఈ జుహువు శరీరము. ఈ ఆజ్యము నీయొక్క తేజస్సు." అని "ఇయం తే" ఇత్యాది మంత్రము చెప్పినది. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) ఏనమ్=ఈ యగ్నిని, సతేజసమ్=తేజస్వంతునిగాను, సతనుమ్=తనూ సహితునిగాను, కరోతి=చేయుచున్న వాఁడగుచున్నాఁడు. అథో=మఱియు, ఏనమ్=ఈ యగ్నిని, సంభరత్యేవ=బాగుగనే చేయుచున్నవాఁడగు చున్నాఁడు.

తాత్పర్యము: ఈ ఘృతమే అగ్నికి శరీరము. హిరణ్యము అగ్నియొక్క తేజస్సు. కనుకనే "ఇయం తే శుక్ర" ఇత్యాది మంత్రము "దీప్తిమంతమైన హిరణ్యమునకు హోమసాధనమైన జుహువు శరీర మనియు, ఘృతము తేజస్స నియు" చెప్పినది. కావున ఈ యజమానుఁ డీ యగ్నిని తేజస్సహితునిగాను, శరీర సహితునిగాను చేసిన వాఁ డగుచున్నాఁడు. "ఇయం తే శుక్ర" ఇత్యాది మంత్రమును వహ్ని సంబంధ బోధకముగా ఈ బ్రాహ్మణము వివరించినది.

4. అర్థము: అబద్ధమ్=సూత్ర బద్ధము కాని హిరణ్యమును, అవదధ్యాత్ యత్=జుహువులోని ఆజ్యమునందు ఉంచునెడల, ప్రజానామ్=ప్రజలయొక్క, గర్భాః=గర్భములు, పరాపాతుకాః=అంతటను పడిపోవునట్టివి, స్యుః=అగును. గర్భాణామ్=గర్భములయొక్క, ధృత్యై=ధారణమునకై, బద్ధమ్=సూత్రబద్ధ హిరణ్యమును, అవదధాతి=జుహూగత ఘృతమునందు ఉంచవలెను.

తాత్పర్యము: జుహువుతో ఆజ్యమును హోమము చేయునపుడు ఆ జుహువులోని ఆజ్యమునందు దారపు కొనచే హిరణ్యమును కట్టి జుహువునం దుంచవలెను. హిరణ్యమును సూత్రబద్ధము చేయనిచో లోకమునందు ప్రజల గర్భములు

అంతటను పడిపోవును. హిరణ్యమును సూత్రాగ్రముతో ముడివైచి జుహూవునం దుంచినచో, ప్రజలగర్భములు పతనములు కావు. (ఇచట హిరణ్యమునకు సూత్ర బంధనము విహితమైనది.)

5. అర్థము: ప్రజానామ్=ప్రజలయొక్క, ప్రజననాయ=గర్భధారణమునకై, నిష్పర్క్యమ్=శీఘ్రముగా విడఁదీయుటకు వీలగునట్లుగా, బధ్నాతి=ముడివేయవలెను.

తాత్పర్యము: శీఘ్రముగ విడఁదీయుటకు వీలగునట్లుగా హిరణ్యమును సూత్రాగ్రముచే ముడి వేయవలెను. దీనివలన ప్రజల గర్భధారణ మగును. (ఇచట బంధనములోని విశేషాంశము చెప్పఁబడినది.)

6. అర్థము: సోమక్రయణీ యత్=సోమక్రయణి (సోమక్రయ సాధనము) ఏది కలదో, ఏషా=ఈ సోమక్రయణి, వాక్ వై=వాక్కే. "జూ రసి" ఇతి ఆహ="వాగ్రూపమైన ఓ సోమక్రయణీ! నీవు వేగముతోఁ గూడినదానవు," అని మంత్రము చెప్పినది. మనసా=మనస్సుచే, యత్=దేనిని, జవతే=శీఘ్రముగ చేయవలయునని తెలిసికొనుచున్నాఁడో, తత్=దానిని, వాచా=వాక్కుచే, వదతి హి=చెప్పుచున్నాఁడు కదా! "ధృతా మనసా" ఇతి ఆహ="మనస్సుచే నియమించఁబడిన దాన వగుచున్నావు" అని వేదము చెప్పినది. మనసా=మనస్సుచే, వాక్=వాక్కు, ధృతా హి=ధరించఁబడుచున్నది కదా! "జుష్టా విష్ణవే" ఇతి ఆహ="యజ్ఞము కొఱకు ప్రియమైనదావు" అని వేదము చెప్పినది. విష్ణుశబ్దవాచ్యము యజ్ఞమే. (అతః=ఈ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు) ఏనామ్=ఈ వాక్కును, యజ్ఞాయైవ=యజ్ఞముకొఱకే, జుష్టామ్=ఇష్టమైన దానినిగా, కరోతి=చేయుచున్నాఁడు. "తస్యా స్తే సత్యసవసః" ఇతి ఆహ=అటువంటి అమోఘ ప్రేరణ రూపమైన నీకు ప్రేరణము కలుగుచుండఁగా అని వేదము చెప్పినది. (యజమానః=యజమానుఁడు,) సవితృ ప్రసూతామ్ ఏవ=సవితృ ప్రేరితమైన వాక్కునే, అవరున్ధే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: "జూ రసి ధృతా మనసా జుష్టా విష్ణవే తస్యా స్తే సత్యసవసః ప్రసవే" అనెడి ఈ మంత్రములోని పదముల యర్థము ఈ బ్రాహ్మణమునందు వివరింపఁబడినది. దీనివలన యజమానుఁడు సవితృ ప్రేరిత వాక్కునే పొందునని సారాంశము.

7. అర్థము: కాణ్డేకాణ్డే వై=ఒక్కొక్క యజ్ఞాంగమే, క్రియమాణే=చేయఁబడుచుండఁగా, యజ్ఞమ్=యజ్ఞమును, రక్షాంసి=రాక్షసులు, జిఘాంసన్తి=నశింపఁజేయఁ దలఁచుచున్నారు. యః=ఏది, అగ్నేః చ=అగ్నియొక్కయు, సూర్యస్య చ=సూర్యునియొక్కయు, పన్థాః=మార్గమో, ఏషః ఖలు వై=ఇదియే కదా, అరక్షోహతః పన్థాః=రాక్షసులచే నిహతము కాని మార్గము. "సూర్యస్య చక్షురాఽఽరుహ మగ్నే రక్ష్ణః కనీనికామ్" ఇతి ఆహ="నా చక్షురింద్రియము సూర్యసంబంధి. కనీనిక అగ్ని సంబంధిని. కావున నేను ఆ రెండింటిని పొందితిని" అని "సూర్యస్య చక్షు" రిత్యాది మంత్రము చెప్పినది. యః ఏవ పన్థాః=ఏ మార్గమే, అరక్షోహతః=రాక్షసులచే నశింపఁజేయఁ బడనిదియో, (యజమానః=యజమానుఁడు,) తమ్=ఆ మార్గమును, సమారోహతి=బాగుగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞము చేయఁబడుచుండఁగా ప్రతి యజ్ఞాంగమును నశింపఁజేయవలెనని రాక్షసులు తలఁచుచుందురు. సూర్యునియొక్కయు, అగ్నియొక్కయు మార్గము రక్షోహతము కానిది. 'నా చక్షురింద్రియము సూర్యసంబంధి. నా కనీనిక అగ్నిసంబంధిని' అని వేదము చెప్పుటచే ఏ మార్గము రక్షోహతము కానిదో, యజమానుఁడా మార్గమునే యవలంబించుచున్నాఁడు. రక్షోనివారణమునకై యజమానుఁడు సూర్యచంద్రుల మార్గములను పొందుచున్నాఁడని భావము.

8. అర్థము: సోమక్రయణీ యత్=సోమక్రయణి యేది కలదో, ఏషా=ఇది, వాక్ వై=వాక్కే. "చిదసి మనాఽసి" ఇతి ఆహ="వాగాత్మిక అయిన సోమక్రయణి చిచ్ఛబ్ద వాచ్యము, మనశ్శబ్ద వాచ్యము" అని "చిదసీ" త్యాది మంత్రము చెప్పినది. ఏతత్=ఈ మంత్రముచేత, (తృతీయార్థే ప్రథమా.) ఏనామ్=ఈ వాగాత్మిక

సోమక్రయణీని, అనుశాస్త్యేవ=చిదాది శబ్దవాచ్య అగుమని యజమానుఁడు సోమక్రయణీని శాసించినవాఁడే అగుచున్నాడు. తస్మాత్=ఆ కారణమువలన, ప్రజాః=ప్రజలు, శిష్టాః=శాసితులై, జాయన్తే=పుట్టుచున్నారు.

తాత్పర్యము: సోమక్రయణీ వాగాత్మికయే. "చిదసి మనాఽసి" ఇత్యాది మంత్రముచే యజమానుఁడు సోమక్రయణీని చిదాది శబ్దవాచ్య అగుమని శాసించినవాఁడే అగుచున్నాఁడు. కావున లోకమునందు ప్రజలు అనుశాసితులై పుట్టు చున్నారు.

9. అర్థము: "చిదసి" ఇతి ఆహ="ఓ వాగ్దేవతారూప సోమక్రయణీ! నీవు చిచ్ఛబ్దవాచ్య మగుచున్నావు." అని "చిదసి" అను మంత్రము చెప్పినది. మనసా=మనస్సుచే, యత్=దేనిని, చేతయతే=సామాన్యముగ తెలిసికొను చున్నాఁడో, తత్=దానిని, వాచా=వాక్కుచేత, వదతి హి=చెప్పుచున్నాఁడు కదా! "మనాఽసి" ఇతి ఆహ="ఓ వాగ్దేవతారూప సోమక్రయణీ! నీవు మనశ్శబ్ద వాచ్య మగుచున్నావు" అని "మనాఽసి" అను మంత్రము చెప్పినది. యత్=దేనిని, మనసా=మనస్సుచేత, అభిగచ్ఛతి=విచారించుచున్నాఁడో, తత్=దానిని, కరోతి=చేయుచున్నాడు. "ధీరసి" ఇతి ఆహ="ఓ వాగ్దేవతారూప సోమక్రయణీ! నీవు ధీశబ్ద వాచ్య మగుచు న్నావు" అని "ధీరసి" అను మంత్రభాగము చెప్పెను. మనసా=మనస్సుచేత, యత్=దేనిని, ధ్యాయతి=నిశ్చ యించుచున్నాఁడో, తత్=దానిని, వాచా=వాక్కుచే, వదతి హి=చెప్పుచున్నాఁడు కదా! "దక్షిణాఽసి" ఇతి ఆహ="ఓ వాగ్దేవతారూప సోమక్రయణీ! నీవు సమర్థురాలవు (లేదా-దేయ ద్రవ్య స్వరూపమైన దానవు") అని "దక్షిణాఽసి" అను మంత్రభాగము చెప్పినది. ఏషా=ఈ సోమక్రయణీ, దక్షిణా హి=సమర్థురాలు కదా; "యజ్ఞియాఽసి" ఇతి ఆహ= "ఓ వాగ్దేవతారూప సోమక్రయణీ! నీవు సోమక్రయము మూలమున యజ్ఞ సంబంధినివి" అని "యజ్ఞియాఽసి" అను మంత్రభాగము చెప్పినది. (యజమానః=యజమానుఁడు,) ఏనామ్=ఈ సోమక్రయణీని, యజ్ఞియామేవ=సోమక్రయము మూలమున యజ్ఞసంబంధినిగానే, కరోతి=చేయు చున్నాఁడు. "క్షత్రియాఽసి" ఇతి ఆహ="వాగ్దేవతారూపమైన ఓ సోమక్రయణీ! నీవు క్షత్రియ జాత్య భిమానివని "క్షత్రియాఽసి" అను మంత్రభాగము చెప్పినది. (అనఁగా-దేవతలలో సోమము క్షత్రియ జాత్యభిమాని కావునను, ఆ సోమమును కొనుటలో హేతువగుటచే సోమక్రయణీ కూడ క్షత్రియ జాత్య భిమానినిగా చెప్పఁబడినది. సోమము దేవతా రూపముగ "యాన్యేతాని దేవక్షత్రాణీన్ద్రో వరుణః సోమో రుద్రాః పర్జన్యో యమో మృత్యు రీశానః" అని శ్రుత్యంతరమున వర్ణింపఁబడినది.) ఏషా=ఈ సోమక్రయణీ, క్షత్రియా హి=క్షత్రియజాత్యభిమానిని కదా; "అదితి రస్యుభయతః శీర్ష్ణీ" ఇతి ఆహ="ఓ వాగ్దేవతారూప సోమక్రయణీ! నీవు ఉభయతః శీర్ష్ణీ అయిన అదితి దేవత వగుచున్నావు." అని "అదితి రసీ త్యాది మంత్రభాగము చెప్పినది. యదేవ=ఏ కారణమువలననే, యజ్ఞానామ్=జ్యోతిష్టోమాది యాగములలో, ప్రాయణీయః=ప్రాయణీయ హోమము, ఆదిత్యః=అదితి దేవతాకమో, ఉదయనీయః=ఉదయనీయ హోమము, ఆదిత్యః=అదితి దేవతాకమో, తస్మాత్=ఆ కారణమువలన, ఏవమ్=ఈవిధముగా, ('ఉభయతశ్శీర్ష్ణీ' అని,) ఆహ=వేదము చెప్పినది.

తాత్పర్యము: చిన్మనో ధీ శబ్దార్థములు ప్రథమకాండగత ద్వితీయ ప్రపాఠకస్థ చతుర్థానువాక వ్యాఖ్యానమునందు వివరింపఁబడి నవి. జ్యోతిష్టోమ యాగముయొక్క ఆదియందు చేయఁబడు ప్రాయణీయ హోమము, అంతమునందు చేయఁబడునట్టి ఉదయనీయ హోమమును అదితి దేవతాకము లగుటచే అదితి 'ఉభయతః శీర్ష్ణీ' అని చెప్పఁబడినది. శేషము సుబోధము.

10. అర్థము: అబద్ధా=గోరూప సోమక్రయణీ బంధింపఁబడనిది, స్యాత్ యత్=అగునెడల, అయతా=నియమిత కానిది, స్యాత్=అగును. పదిబద్ధా యత్=పాదమునందు బంధింపఁబడిన దగుచో, అనుస్తరణీ=అనుస్త రణీ, స్యాత్=అగును. (తదా=అప్పుడు,) యజమానః=యజమానుఁడు, ప్రమాయుకః=మరణశీలుఁడు,

స్యాత్=అగును. కర్ణగృహీతా=గోరూప సోమక్రయణి కర్ణమునందు గ్రహింపఁబడినది, యత్ స్యాత్=అగుచో, వార్త్రఘ్నీ=వార్త్రఘ్ని, స్యాత్=అగును. సః వాఃఅతఁడు కాని, అన్యమ్=ఇతరుని, జినీయాత్=జయించును. అన్యః వా=ఇతరుఁడు కాని, తమ్=అతనిని, జినీయాత్=జయించును. (అతః=ఈ కారణమువలన,) "మిత్ర స్త్వా పది బధ్నాతు" ఇతి ఆహ=ఓ గోరూప సోమక్రయణీ! మిత్రదేవుఁడు నిన్ను కాలియందు బంధించుఁగాక అని "మిత్ర స్త్వా" ఇత్యాది మంత్ర భాగము చెప్పినది. దేవానామ్=దేవతలలో, మిత్రః=మిత్రదేవుఁడు, శివః వై=మంగళ స్వరూపుఁడే (మంగళకరుఁడే). తేన=ఆ మిత్రదేవునిచేత, (యజమానః=యజమానుఁడు.) ఏనామ్=ఈ గోరూప సోమక్రయణిని, పది=పాదమునందు, బధ్నాతి=బంధించుచున్నాడు. అనుస్తరణీ=మృతుఁడైన పురుషుని అనుసరించి చంపఁబడునట్టి గోవు. వార్త్రఘ్నీ=శత్రుసంహారముచేయునది.

తాత్పర్యము: సోమక్రయణియైన గోవును సోమక్రయ సమయమున కట్టివేయనిచో అది అనియమితమై స్వేచ్ఛగా సంచరించును. దానిని పాదమునందు బంధించినచో, అది అనుస్తరణి వంటిది అగును. అప్పుడు యజ్ఞకర్త మరణించును. సోమక్రయకాలమునందు ఆ గోరూప సోమక్రయణిని చెవియందు పట్టుకొనినచో, అది వార్త్రఘ్ని అగును. అనఁగా- శత్రు సంహర్త్రి యగును కాని యుద్ధమునందు జయాపజయములు పరాధీనములు. ఎవరు ఎవరిని సంహరింతురో చెప్పుటకు వీలు లేదు. అందువలన "ఓ సోమక్రయణీ! మిత్రదేవుఁడు నిన్ను పాదమునందు బంధించుఁగాక అని వేదము చెప్పినది. దేవతలలో మిత్రదేవుఁడు శుభుఁడు [illegible] యజమానుఁ డా మిత్రదేవునిచేతనే యీ గోరూప సోమక్రయణిని బంధించుచున్నాఁడు. (ఇచట మంత్ర విరుద్ధమైన పక్షత్రయమును పూర్వపక్షము చేసి "మిత్రస్త్వా బధ్నాతు" అను మంత్రభాగమును ఈ బ్రాహ్మణము వివరించినది.)

11. అర్థము: "పూషాఽధ్వనః పాతు" ఇతి ఆహ="ఓ సోమక్రయణీ! నిన్ను పోషకుఁడైన దేవుఁడు భయోపేత మార్గమునుండి పాలించుఁగాక" అని "పూషాఽధ్వనః" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. ఇయం వై=ఈ భూదేవతయే, పూషా=పోషక దేవత. ఇమామేవ=ఈ భూ దేవతనే, సమష్ట్యై=బాగుగ పొందుటకై, అస్యాః=ఈ సోమక్రయణికి, అధిపామ్=పాలకురాలినిగా, అకః=చేసెను. 'ఇన్ద్రాయ అధ్యక్షాయ' ఇతి ఆహ='ఓ సోమక్రయణీ! యాగాధ్యక్షుఁడైన యింద్రునికొఱకు' అని వేదము చెప్పినది. ఇయమ్=ఈ భూదేవత, అస్యాః=ఈ సోమక్రయిణికి, ఇన్ద్రమేవ=ఇంద్రునే, అధ్యక్షమ్=అధ్యక్షునిగా, కరోతి=చేసిన దగుచున్నది. 'అను త్వా మాతా మన్యతా మనుపితా' ఇతి ఆహ='ఓ సోమక్రయణీ! తల్లి, తండ్రియు సోమక్రయ సాధనముగ నిన్ను అనుమతింతురు గాక' యని వేదము చెప్పినది. అనుమతయైవ ఏనయా=అనుమతించఁబడినదియేయైన యీ సోమక్రయణిచే, క్రీణాతి=యజమానుఁడు సోమమును కొనుచున్నవాఁ డగుచున్నాఁడు. 'సా దేవి దేవమచ్ఛేహి' ఇతి ఆహ=హే దేవి!=ఓ సోమక్రయణీ దేవీ! సా=అటువంటి, త్వమ్=నీవు, దేవమ్ అను=సోమదేవు ననుసరించి, అచ్ఛేహి=వెళ్లుము' అని వేదము చెప్పినది. ఏషా దేవీ హి=ఈ సోమక్రయణి దేవి కదా! సోమః=సోమము, దేవః=దేవతాత్మకము.

'ఇన్ద్రాయ సోమమ్' ఇతి ఆహ=ఇంద్రునికొఱకు సోమదేవు ననుసరించి' యని వేదము చెప్పినది. ఇన్ద్రాయ=ఇంద్రునికొఱకు, సోమము తీసికొనిరాఁబడుచున్నది కదా! ఏతత్ యజుః='రుద్రస్త్వాఽఽవర్తయతు' అను నీ యజుస్సును, న బ్రూయాత్ యత్=పఠించనిచో, సోమక్రయణీయాత్=సోమక్రయ సాధనము నుండి, పరాచీ ఏవ భవేత్=యజమానుఁడు పరాఙ్ముఖుఁడే యగును. 'రుద్రస్త్వాఽఽవర్తయతు' ఇతి ఆహ='ఓ సోమక్రయణీ! నిన్ను రుద్రదేవుఁడు మమ్ముఁగూర్చి మఱలింపఁజేయుఁగాక' అని మంత్రము చెప్పినది. రుద్రః=రుద్రుఁడు, దేవానామ్=దేవతలలో, క్రూరః వై=క్రూరుఁడే. తమేవ=ఆ క్రూరదేవునే, అస్యై=ఈ సోమక్రయణియొక్క, ఆవృత్త్యై=ఆవృత్తికొఱకు, పరస్తాత్=పరభాగమునందు, దధాతి=స్థాపించినవాఁ

డగుచున్నాఁడు. రుద్రస్య కీర్తయతి యత్=రుద్రుని కీర్తించుచున్నచో, ఏతత్=ఈ కీర్తనము, క్రూరమివ వై=క్రూరునిగానే, కరోతి=చేయుచున్న దగును.

నిన్ను 'మిత్రస్య పథా' ఇతి ఆహ=ఓ సోమక్రయణీ దేవీ! సూర్యునియొక్క మార్గముచేత రుద్రదేవుఁ డావర్తింపఁజేయుఁగాక' యని మంత్రము చెప్పినది. (ఏతత్=ఈ యావర్తనము,) శాన్త్యై=శాంతికొఱకు, భవతి=అగుచున్నది. యః=ఏ సోమము, సోమక్రయణ్యా=సోమక్రయణిచేత, విక్రీణీతే=కొనఁబడుచున్నదో, ఏషః=ఈ సోమము, వాచా వై=వాగ్రూప సోమక్రయణిచేతనే, విక్రీణీతే=కొనఁబడుచున్నది. 'స్వస్తి సోమ సఖా పునరేహి సహ రయ్యా' ఇతి ఆహ=ఓ సోమక్రయణీ! నీకు సుఖ మగుఁగాక. నీవు సోమము మిత్రముగాఁ గలదానవై ధనముతోఁగూడ మఱల రమ్ము' అని మంత్రము చెప్పినది. (ఏతేన=ఈ చెప్పటచే,) వాచైవ=వాక్కుచేతనే, విక్రీయ=కొని, పునః=మఱల, వాచమ్=వాక్కును, ఆత్మన్=తనయందు. ధత్తే=(యజమానుఁడు) ధరించినవాఁ డగుచున్నాఁడు. యః=ఏ పురుషుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్తవిధముగ, వేద=తెలిసికొనునో, అస్య=ఇతనియొక్క, వాక్=వాక్కు, అనుపదాసుకా=క్షయరహితము, భవేత్=అగును.

**తాత్పర్యము:** జ్యోతిష్టోమ యాగమున కవసరమైన సోమలతను కొనునప్పుడు హిరణ్యాదికము నుపయోగించుటకై యా సమయమున మాటలాడిన మాట ఇట సోమక్రయణీ రూపమైన వాగ్దేవతగా నభివర్ణింపఁబడినది. ఈ విధముగ వర్ణించఁబడిన వాగ్దేవత ఇంద్రుని నిమిత్తము సోమదేవు ననుసరించి వెళ్లవలెననియు, మఱల ఆ దేవతను యజమానుని దగ్గఱకు రుద్రదేవుఁడు సూర్యమార్గముద్వారా తీసికొనిరావలయు ననియు, ఆ దేవత ధనముతో రావలయు ననియు ప్రార్థింపఁబడినది. శేషము సులభగ్రాహ్యము. ఇచట 'పూషాఽధ్వనః పాతు' ఇత్యాది మంత్రములోని భాగముల నీ బ్రాహ్మణము క్రమముగ వ్యాఖ్యానించినది.

సప్తమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే ఽష్టమోఽనువాకః

మూలము: [1]షట్పదాన్యను నిష్క్రా9మతి షడహం వాఙ్నాతి వదత్యుత సంవత్సరస్యాయనే యావత్యేవ వాక్తా
మవ రున్ధే [2]సప్తమే పదే జుహోతి సప్తపదా శక్వరీ పశవః శక్వరీ పశూనేవావ రున్ధే సప్త గ్రామ్యాః
పశవః సప్తాఽరణ్యాః సప్త ఛన్దాగ్ం స్యుభయస్యా వరుద్ధ్యై [3]వస్వ్యసి రుద్రాఽసీత్యాహ రూపమేవాస్యా
ఏతన్మహిమానవ్ (౧) వ్యాచష్టే [4]బృహస్పతి స్త్వా సుమ్నే రణ్వత్విత్యాహ బ్రహ్మ వై దేవానాం
బృహస్పతి ర్బృ9హ్మణైవాస్మై పశూనవరున్ధే రుద్రో వసుభిరా చికేత్విత్యాహాఽఽవృత్త్యై [5]పృథివ్యా
స్త్వా మూర్ధన్నాజిఘర్మి దేవయజన ఇత్యాహ పృథివ్యా హ్యేష మూర్ధా యద్దేవయజన మిడాయాః
పద ఇత్యాహేడాయై హ్యేతత్పదం యత్సోమక్రయణ్యై ఘృతవతి స్వాహా (౨) ఇత్యాహ యదేవాస్యై
పదా ద్ఘృతమపీడ్యత తస్మాదేవమాహ [6]యదధ్వర్యు రనగ్నా వాహుతిం జుహుయా దన్ధోఽధ్వర్యుః
స్యాద్రక్షాగ్ంసి యజ్ఞగ్ం హన్యుర్హిరణ్య ముపాస్య జుహోత్యగ్నివత్యేవ జుహోతి నాన్ధోఽధ్వర్యు ర్భవతి
న యజ్ఞగ్ం రక్షాగ్ంసి ఘ్నన్తి [7]కాణ్డే కాణ్డే వై క్రియమాణే యజ్ఞగ్ం రక్షాగ్ంసి జిఘాగ్ంసన్తి పరి
లిఖితగ్ం రక్షః పరిలిఖితా అరాతయ ఇత్యాహ రక్షసా మపహత్యై (౩) ఇద మహగ్ం రక్షసో గ్రీవా
అపి కృన్తామి యోఽస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మ ఇత్యాహ ద్వౌ వావ పురుషౌ యం చైవ
ద్వేష్టి యశ్చైనం ద్వేష్టి తయోరేవానన్తరాయం గ్రీవాః కృన్తతి [8]పశవో వై సోమక్రయణ్యై పదం
యావత్మూతగ్ం సం వపతి పశూనేవావ రున్ధేఽస్మే రాయ ఇతి సం వపత్యాత్మాన మేవాధ్వర్యుః
(౪) పశుభ్యో నాన్తరేతి త్వే రాయ ఇతి యజమానాయ ప్ర యచ్ఛతి యజమాన ఏవ రయిం దధాతి
తోతే రాయ ఇతి పత్నియా అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ యథా గృహేషు నిధత్తే తాదృ

గేవ త [9] త్వష్టీమతీ తే సపేయేత్యాహ త్వష్టా వై పశూనాం మిథునానాగ్ం రూపకృ ద్రూపమేవ పశుషు దధా [10] త్యస్మై వై లోకాయ గార్హపత్య ఆధీయతేఽముష్మా ఆహవనీయో యద్గార్హపత్య ఉప వపే దస్మింల్లోకే పశుమాన్స్యాద్య దాహవనీయేఽముష్మింల్లోకే పశుమా న్స్యాదుభయోరుప వప త్యుభయో రేవైనం లోకయోః పశుమన్తం కరోతి (౫)||

[మహిమానగ్ం స్వాహో ఽపహత్యా అధ్వర్యు ర్ధీయతే చతుర్విగ్ంశతిశ్చ ||]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే ఽష్టమోఽనువాకః ||౮||

# వేదార్థ దీపిక

**అవతారిక:** సప్తమానువాకమునందు సోమక్రయము చేయవలసినవిధ మభిహిత మైనది. ఈ యష్టమానువాకమునందు పదసంగ్రహణము చెప్పఁబడుచున్నది. అనఁగా సోమక్రయ ప్రదేశమునకు పోవుచున్న గోరూప సోమక్రయణియొక్క అడుగులకు సంబంధించిన ప్రదేశములను గూర్చి విశేషాంశములు చెప్పఁబడుచున్నవి. ప్రథమ కాణ్డస్థ ద్వితీయ ప్రపాఠకగత పఞ్చమానువాకమునందలి మంత్రములకు ఈ యనువాకము వివరణాత్మకము.

1. **అర్థము:** (యజమానః=యజమానుఁడు,) షట్పదాని=సోమ క్రయణి యడుగుల నాఱింటి ననుసరించి, నిష్క్రామతి=బయలు వెడలవలెను. వాక్=సోమ క్రయణియైన వాగ్దేవత, షడహమ్=షడహాఖ్య యాగవిశేషమును, నాతి వదతి=అతిక్రమించి స్తోత్రమును చెప్పుటలేదు. ఉత=మఱియు, సంవత్సరస్య అయనే=సంవత్సర కాల సంబంధియగు గవామయనమునందును, నాతివదతి=అతిక్రమించి స్తోత్రమును చెప్పుటలేదు. (తత్=ఆ కారణమువలన) యావతీ వాక్ తామేవ=సర్వ వాక్కునే, అవరున్ధే=(యజ్ఞకర్త) పొందుచున్నాఁడు.

**తాత్పర్యము:** పృష్ఠ్యము షడహాఖ్యమునైన ఒక యాగము కలదు. ఆ యాగమునందు బృహద్రథంతర వైరూప వైరాజ శాక్వర రైవతకము లనెడి సామములచే సాధ్యములైన షడ్విధ స్తోత్రములు కలవు. ఆ యాఱు స్తోత్రములు క్రమముగ నాఱు దినములయందు (దినమునకు ఒక్కటి చొప్పున) గానము చేయఁబడుచున్నవి. ఏడవ పృష్ఠ్య స్తోత్రము ఒక్కటియు లేదు. అందువలన ప్రధాన పృష్ఠ్య స్తోత్రరూప వాగ్దేవత షడహగత సంఖ్య నతిక్రమించి ఎక్కడను చెప్పుటలేదు. మఱియు సంవత్సరకాల సంబంధియైన గవామయనమునందును అధికముగ పృష్ఠ్య స్తోత్రమును చెప్పుటలేదు. కావున వాగ్రూప సోమక్రయణియొక్క షట్పదానుక్రమణము యుక్తమైనది. కావున వాగ్రూప మగుటవలననే యజమానుఁడు సర్వ వాక్కును పొందుచున్నాఁడు. కనుక యజమానుఁడు సోమక్రయ ప్రదేశమునకు పోవుచున్న సోమ క్రయణియైన గోవుయొక్క అడుగుల స్థానములను గ్రహించవలెను.

2. **అర్థము:** సప్తమే పదే=ఏడవ పదస్థానమునందు, జుహోతి=హోమము చేయవలెను. శక్వరీ=శక్వరీ ఛందస్సు, సప్తపదా=ఏడు పాదములు కలది. పశవః=పశువులు, శక్వరీ=శక్వరీ ఛంద స్సాధ్యములు. (తతః=హోమము

వలన, అయమ్=ఈ యజమానుఁడు) పశూన్=పశువులను, అవరున్ద్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు. గ్రామ్యాః పశవః=గ్రామ్యములైన పశువులు, సప్త=సప్త సంఖ్యాకములు. ఆరణ్యాః=ఆరణ్య పశువులు, సప్త=సప్త సంఖ్యాకములు. ఛన్దాంసి=ఛందస్సులు, సప్త=సప్తసంఖ్యాకములు. (అయమ్=ఈ హోమము,) ఉభయస్య=పశు జాతీయము ఛందోజాతీయము అనెడి ఉభయముయొక్క, అవరుద్ధ్యై=పొందుట కొఱకు, భవతి=కారణ మగుచున్నది.

తాత్పర్యము: యజ్ఞకర్త సోమక్రయ ప్రదేశమునకు నడచుచు పోవుచున్న గోవుయొక్క ఏడవ అడుగుజాడయందు హోమము చేయవలెను. శక్వరీ ఛ్ఛందస్సు ఏడు పాదములు కలది. పశువులు శక్వరీ ఛ్ఛందో దేవతా సాధ్యము లైనవి. కావున సంఖ్యాసామ్యముచే యజమానుఁడు నిశ్చయముగ పశువులను పొందును. గ్రామములం దుండునట్టి పశువులు గవాదులు సప్తవిధములు. అరణ్యమునందు సంచరించునట్టి కృష్ణమృగాది పశువులును సప్త విధములే. "సప్త గ్రామ్యాః పశవోఽజా ఽశ్వో గా ర్మహిషీ వరాహో హస్త్యశ్వతరీ చేత్యథ సప్తాఽరణ్యా ద్విఖురా శ్చైకఖురాశ్చ పక్షిణశ్చ సరీసృపాశ్చ శ్వాపదాశ్చ శరభాశ్చ మర్కటా శ్చ" అని బౌధాయన మహర్షులు చెప్పిరి. గాయత్రీ త్రిష్టుబిత్యాదులు సప్త సంఖ్యాకములు. సప్త సంఖ్యా సాదృశ్యముచే ఈ హోమము పశుజాతీయము ఛందోజాతీయము అనెడి ఉభయముయొక్క ప్రాప్తికి హేతువగును. (ఇచట హోమము విధించఁబడినది.)

3. అర్థము: "వస్వ్యసి రుద్రాఽసి" ఇతి ఆహ="ఓ సోమక్రయణీపదమా!" నీవు వసు స్వరూపము, రుద్ర స్వరూపము నగుచున్నావు అని చెప్పుటచేత, అస్యాః=ఈ సోమక్రయణియొక్క, రూపమేవ=రూపమే, ఏతన్మహిమానమ్=ఈ సోమక్రయణియొక్క మహిమను, వ్యాచష్టే=విశేషముగ చెప్పుచున్నది.

తాత్పర్యము: సోమక్రయణి వసు రుద్రాదుల రూపముగ వర్ణింపఁబడుటచేత ఈ సోమక్రయణియొక్క మహిమ స్పష్టముగ వ్యక్తమగుచున్నది. వసు రుద్రాదిత్యులు సవనత్రయ దేవతలు. వసురుద్రాదులచే అపేక్షితమైన సోమయాగ మునకు సాధన మగుటచే సోమక్రయణి వసు రుద్రాదుల స్వరూపముగ వర్ణింపఁబడినది.

4. అర్థము: "బృహస్పతి స్త్వా సుమ్నే రణ్వతు" ఇతి అహ="ఓ సోమక్రయణీ పదమా! బృహస్పతి నిన్ను ఈ సుఖప్రదే శమునందు రమింపఁజేయుఁగాక." అని "బృహస్పతి" రిత్యాది మంత్రము చెప్పినది. బృహస్పతిః=బృహస్పతి, దేవానామ్=దేవతలకు, బ్రహ్మ వై=బ్రహ్మయే. (అతః=ఈ కారణము వలన), (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) బ్రహ్మణైవ=బ్రహ్మచేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, పశూన్=పశువులను, అవరున్ద్ధే=పొందుచున్నాఁడు. "రుద్రో వసుభి రాచికేతు" ఇతి ఆహ="ఓ సోమక్రయణీ పాదమా! వసు సహితుఁడైన రుద్రుఁడు నిన్ను గుర్తించుఁగాక (ఆవర్తింపఁజేయుఁగాక.)" అని వేదము చెప్పినది. (ఇదమ్=ఇది) ఆ వృత్త్యై=ఆ వృత్తి కొఱకు, (భవతి=అగుచున్నది.)

తాత్పర్యము: "బృహస్పతి స్త్వా సుమ్నే రణ్వతు" అని వేదము చెప్పినది. దేవతలకు బృహస్పతి బ్రహ్మయే. కావున అధ్వర్యుఁడీ యజమానునికొఱకు బ్రహ్మచేతనే పశువులను పొందును. "రుద్రో వసుభి రాచికేతు" అని వేదము చెప్పినది. ఓ సోమక్రయణీ పాదమా! వసు సహితుఁడైన రుద్రుఁడు నిన్ను గుర్తించుఁగాక అని చెప్పుట ఈ సోమక్రయణీ పాదముయొక్క గుర్తింపుకే అగుచున్నది.

5. అర్థము: "పృథివ్యా స్త్వా మూర్ధన్నా జిఘర్మి దేవయజనే" ఇతి ఆహ=ఓ ఘృతమా! నిన్ను పృథివికి శిరస్థానీయమైన దేవతల యాగస్థానమునందు ఘృతయుక్తమైన సోమక్రయణియొక్క పాదమునందు అంతటను స్రవింపఁజేయు చున్నాను. అని "పృథివ్యాః" ఇత్యాది మంత్రము చెప్పినది. దేవయజనం యత్=దేవతల యాగస్థానమేది కలదో, ఏషః=ఇది, పృథివ్యాః=భూమికి, మూర్ధా హి=శిరస్సు (వంటిది) కదా! "ఇడాయాః పదే ఇతి ఆహ=సోమక్రయణియొక్క పాదమునందు అని" ఇడాయాః పదే" అను మంత్రభాగము చెప్పినది. సోమక్ర

యద్వై యత్=సోమక్రయణీసంబంధి యేది కలదో, ఏతత్=ఇది, ఇడాయై హి=ఇడకు సంబంధించినది కదా! "ఘృతవతి స్వాహా" ఇతి ఆహ="పాదము ఘృతయుక్తమైనది అని "ఘృతవతి" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. అస్యై=సోమక్రయణీ అయిన ఈ గోవుయొక్క, పదాత్=పాదమునుండి, యదేవ=ఏ కారణమువల ననైతే, ఘృతమ్=ఆజ్యము, అపీద్యత=కార్చఁబడినదో, తస్మాత్=ఆ కారణమువలన, ఏవమ్=ఈ విధముగా (ఘృతవతి అని), ఆహ=చెప్పెను.

**తాత్పర్యము:** "పృథివ్యా స్స్వా" ఇత్యాది మంత్రమునందుఁగల "మూర్ధన్" "ఇడాయాః పదే" "ఘృతవతి" అను పద ములకుఁ గల ప్రసిద్ధార్థమునే ఆ మంత్రము చెప్పినదని ఈ బ్రాహ్మణము స్పష్టపఱచినది.

6. **అర్థము:** అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అనగ్నౌ=అగ్నిరహిత ప్రదేశమునందు, జుహుయాత్ యత్=హోమము చేయుచో, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అన్ధః=గ్రుడ్డివాఁడు, స్యాత్=అగును. రక్షాంసి=రాక్షసులు, యజ్ఞమ్=యజ్ఞమును, హన్యుః=ధ్వంసము చేయుదురు. (తత్=ఆ కారణమువలన,) హిరణ్యమ్=హిరణ్యమును, ఉపాస్య=ఉంచి జుహోతి=హోమము చేయవలెను. (తదా=అప్పుడు,) అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అన్ధః=అంధుఁడు, న భవతి=అగుట లేదు. రక్షాంసి=రాక్షసులు, యజ్ఞమ్=యజ్ఞమును, న ఘ్నన్తి=ధ్వంసము చేయరు.

**తాత్పర్యము:** సోమక్రయణీ అయిన గోవు సోమక్రయ ప్రదేశమునకు పోవునపుడు ఆ గోవుయొక్క ఏడవ అడుగుజాడ యందు హోమము చేయవలెనని పూర్వము చెప్పఁబడినది. ఆ హోమము అగ్నిలేని స్థలమున చేసినచో అధ్వర్యుఁడు అంధుఁడగును. ఆ యజ్ఞమును రాక్షసులు ధ్వంసము చేయుదురు. ఆ యనిష్టము కలుగకుం డుటకై సోమక్రయణీయొక్క సప్తమ పదస్థానమునందు హిరణ్యమునుంచి హోమము చేయవలెను. అట్లు చేసినచో అగ్నియున్న ప్రదేశమున హోమము చేసినట్లే యగును. అప్పుడు అధ్వర్యుఁడు అంధుఁడు కాఁడు. రాక్షసులు యజ్ఞమును ధ్వంసము చేయరు. ఇచట సోమక్రయణీ పదమునందు హిరణ్య ప్రక్షేపము విహిత మైనది.

7. **అర్థము:** కాణ్డేకాణ్డే=యజ్ఞముయొక్క ప్రతియంగము, క్రియమాణే వై= చేయఁబడుచుండఁగానే, రక్షాంసి=రాక్షసులు, యజ్ఞమ్=యజ్ఞమును, జిఘాంసన్తి=నశింపఁజేయవలెనని తలఁచుచున్నారు. (అతః=ఈ కారణమువలన,) రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=నాశమునకై, "పరిలిఖితగ్ంరక్షః పరిలిఖితా అరాతయః" ఇతి ఆహ="రాక్షసజాతి నశింపఁజేయఁబడినది. శత్రువులు నశింపఁజేయఁబడిరి." అని వేదము చెప్పినది. "ఇద మహగ్ం రక్షసో గ్రీవా అపి కృన్తామి యో ౘస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మః" ఇతి ఆహ="ఎవఁడు మమ్ము ద్వేషించుచున్నాఁడో, ఎవనిని మేమును ద్వేషించుచున్నామో, ఇదిగో నేను రాక్షసజాతియొక్క కంఠములను ఛేదించుచున్నాను" అని "ఇదమహ" మిత్యాది మంత్రభాగము చెప్పినది. యం చైవ=ఎవనినైతే, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడో, యః చ=ఎవఁడును, ఏనమ్=వీనిని, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడో, (ఏతౌ=వీరు,) ద్వౌ పురుషౌ వావ=ఇద్దఱే పురుషులు కదా!, తయోః గ్రీవాః ఏవ=ఆ యిద్దఱియొక్క కంఠములనే, అనన్త రాయమ్=(ఒక్కనికి కూడ,) వ్యవధానము లేకుండ, కృన్తతి=ఛేదించుచున్నవాఁ డగుచున్నాఁడు.

**తాత్పర్యము:** యజ్ఞము జరుగుచుండగా ప్రతి యజ్ఞాంగమును ధ్వంసము చేయుటకు రాక్షసులు ఉద్యుక్తు లగుచుందురు. అందువలన "పరిలిఖితగ్ం రక్షః పరిలిఖితా అరాతయః" అని వేదము చెప్పినది. యజ్ఞకర్తచే ద్వేషింపఁబడు శత్రువు ఒకఁడు. యజ్ఞకర్తను ద్వేషించు శత్రువు ఇంకొకఁడు. మొత్తము వారు ఇద్దఱు శత్రువులు. ఆ యిద్దఱియొక్క కంఠములను వ్యవధానము లేకుండ యజమానుఁడనైన నేను ఛేదించుచున్నాను, అను అర్థమును "ఇద మహగ్ం రక్షసః ఇత్యాది మంత్రము చెప్పినది. (ఈ మంత్రములు రెండును అర్థమునందు వివరింపఁబడినవి.)

8. అర్థము: పశవః వై=పశువులే, సోమక్రయణ్యై=సోమక్రయణియొక్క, (షష్ఠ్యర్థే చతుర్థీ,) పదమ్=పాదము. ఘృతమ్=ఘృతముచే తడిసిన రజస్సును, (సోమక్రయణియొక్క సప్తమ పదస్థానమునందుఁగల ధూళి) యావత్=ఏ మాత్ర మును, సం వపతి=స్థాలియందు బాగుగ ఉంచుచున్నాఁడు, (తేన=ఆ ఉంచుటచే, యజమానః=యజమానుఁడు,) పశూనేవ=పశువులనే, అవరున్ధే=పొందుచున్నాడు. "అస్మే రాయః" ఇతి='ఈ యధ్వర్యునియందు రజోరూప ధనము ఉండుఁగాక' అని సం వపతి=స్థాలియందు పూర్వోక్త రజస్సును బాగుగ ఉంచవలెను. (తేన=ఆ సంవాపముచేత,) అధ్వర్యుః=అధ్వర్యుఁడు, ఆత్మానమ్=తనను, పశుభ్యః=పశువులనుండి, నాన్తరేత్యేవ=నిశ్చయ ముగ దూరము చేసికొనుటలేదు. "త్వే రాయః" ఇతి="నీయందు (యజమానునియందు) రజోరూపధనము" అని, యజమానాయ=యజమానునికొఱకు, ప్రయచ్ఛతి=(అధ్వర్యుఁడు) ఈయవలెను. (తేన=ఆ దానముచే,) యజమానే ఏవ=యజమానునియందే, రయిమ్=ధనమును, దధాతి=ఉంచినవాఁ డగుచున్నాఁడు. "తోతే రాయః" ఇతి="కలత్రమునందు ధనము" అని, పత్నియై=యజమానపత్నికొఱకు, ప్రయచ్ఛతి=ఈయవలెను. పత్నీ యత్=పత్ని యేది కలదో, ఏషః=ఈమె, ఆత్మనః=తనయొక్క, అర్ధః వై=అర్ధభాగమే. గృహేషు=గృహ ములందు, యథా=ఏ విధముగ, నిధత్తే=ఉంచుచున్నాఁడో, తత్=అది, తాదృగేవ=అటువంటిదియే.

తాత్పర్యము: సోమక్రయణి అయిన గోవు సోమక్రయ ప్రదేశమునకు పోవునపుడు వేయు నడుగులలోని యేడవ అడుగునందు ఆజ్యముచే హోమము చేయవలెనని పూర్వము చెప్పఁబడినది. ఆజ్యహోమముచే ఆ యేడవ అడుగునందలి ధూళి నేతిచే తడిసియుండును. ఆ సోమక్రయణియొక్క పదము పశుస్వరూపముగా వర్ణింపఁబడినది. ఆజ్య ముచే అప్లుతమైన ధూళి యెంత కలదో దానినంతటిని అధ్వర్యుఁడు "అస్మే రాయః" అని పఠించుచు దుంచవలెను. ఇట్లు చేయుటచే అధ్వర్యుఁడు పశువులనుండి అంతరితుఁడు కాఁడు. పిమ్మట అధ్వర్యుఁడు ఆ ఆజ్యప్లుతమైన మట్టిని "త్వే రాయః" అను మంత్రభాగమును పఠించుచు యజమానున కొసఁగవలెను. అట్లు చేసిన యధ్వర్యుఁడు యజమానునియందు ధనమునే ఉంచినవాఁ డగును. దీనిచే యజమానునకు పశుప్రాప్తి కలుగును. యజమానుని పత్ని యజమానునియొక్క అర్ధభాగమే కనుక ఆ మట్టియొక్క అర్ధ భాగమును "తోతే రాయః" అను మంత్రముభాగమును పఠించుచు యజమానపత్ని కొసఁగవలెను. అట్లు చేయుట గృహములందుంచుటవంటిదే యగును. (మంత్రములు అర్థమునందే వివరింపఁబడినవి. ఈ బ్రాహ్మణభాగము అనుష్ఠానవిధి పూర్వకముగ "అస్మే రాయః" ఇత్యాది మంత్రార్థమును వివరించినది.)

9. అర్థము: "త్వష్టీమతీ తే సపేయ" ఇతి ఆహ="త్వష్టృ ప్రజాపతియొక్క అనుగ్రహము కలదాననై నేను (యజ మానపత్ని) నీతో (యజమానునితో,) కలిసికొందును." అని "త్వష్టీమతీ" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. త్వష్టా వై=త్వష్టృ ప్రజాపతియే పశూనాం మిథునానామ్=స్త్రీ పురుషరూప మిథునములైన పశువులయొక్క, రూపకృత్=రూపమును చేయువాఁడు. రూపమేవ=రూపమునే, పశుషు=పుశువులయందు, దధాతి=ఉంచుచున్నఁడు.

తాత్పర్యము: త్వష్టృ ప్రజాపతియే స్త్రీ పురుషరూప మిథునముల రూపమును చేయువాఁడు. అనఁగా యోనియం దుంచఁబడిన రేతస్సును ఈ స్త్రీ రూపమునుగాఁ గాని, పురుష రూపమునుగాఁ గాని చేయువాఁడు త్వష్టృ ప్రజాపతియే. అందువలన యజమానపత్ని త్వష్టృ ప్రజాపతియొక్క అనుగ్రహము కలదియై యజమానునితో కలసికొందునను నర్థమును "త్వష్టీమతీ తే సపేయ" అను మంత్రము చెప్పుచున్నది. (ఈ బ్రాహ్మణము "త్వష్టీమతీ" అను పదముయొక్క అభిప్రాయమును వివరించినది.)

10. అర్థము: అస్మై లోకాయ వై=ఈ భూలోకముకొఱకే, గార్హపత్యే=గార్హపత్యాగ్నియందు, ఆ ధీయతే=సోమక్రయణీ పదర జస్సుయొక్క తృతీయ భాగమును ఉంచవలెను. గర్హపత్యే=గర్హపత్యాగ్నియందు, ఉప వపేత్ యత్=పూర్వోక్త రజస్సును ఉంచినచో, (యజమానః=యజమానుఁడు,) అస్మిన్ లోకే=ఈ లోకమునందు, పశుమాన్=పశు

మంతుఁడు, స్యాత్=అగును. ఆహవనీయే=ఆహవనీయాగ్నియందు, ఉప వపేత్ యత్=ఉంచినచో, అముష్మిన్ లోకే=స్వర్గలోమమునందు, పశుమాన్=పశుమంతుఁడు, స్యాత్=అగును. ఉభయోః=ఉభయాగ్నులయందు, ఉప వపతి=ఘృతసిక్త రజస్సును ఉంచవలెను. (అయమ్=ఈ ఉంచుట,) ఏనమ్=ఈ యజమానుని, ఉభయోః లోకయోః ఏవ=ఇహలోక స్వర్గలోకములయందే, పశుమన్తమ్=పశుసంపద కలవానినిగా, కరోతి=చేయుచున్నది.

తాత్పర్యము: సోమక్రయణీ పద రజస్సును మూఁడు భాగములనుగాఁ జేసి అందొకభాగమును గార్హపత్యాగ్నియందును, ఇంకొక భాగమును ఆహవనీయాగ్నియందును ఉంచవలెను. గార్హపత్యాగ్నియం దుంచుటవలన ఇహలోకమునందును (భూలోకమునందును), ఆహవనీయాగ్నియం దుంచుటవలన స్వర్గలోకమునందును యజమానుఁడు పశుసంపద కలవాఁడగును. ఉభయాగ్నులయం దుంచుటవలన ఉభయలోకములందును పశుసంపద కలవాఁడగును. (గార్హపత్యాగ్నికి ఉత్తర దిశయందలి శీతలభస్మమునం దుంచవలెను. ఒక భాగమును ఆహవనీయాగ్నికి ఉత్తర దిశయందలి శీతలభస్మమునందును ఉంచి మూఁడవభాగమును యజమానపత్ని కొనఁగవలెననియు ఆమె ఆ భాగమును గృహమునం దుంచవలెననియు కల్పసూత్రము చెప్పుచున్నది. "మాఽహగ్ం రాయస్పోషేణ వియోషమ్" అను మంత్రమును బ్రాహ్మణము వ్యాఖ్యానించక ఉపేక్షించినది.)

అష్టమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే నవమోఽనువాకః

మూలము: [1] బ్రహ్మ వాదినో వదన్తి విచిత్యః సోమా3 న విచిత్యా3 ఇతి సోమో వా ఓషధీనాగ్ం రాజా తస్మి

న్యదాపన్నం గ్రసిత మేవాస్య తద్యద్విచినుయా ద్యథాఽఽస్యా ద్గ్రసితం నిష్ఖిదతి తాదృగేవ తద్యన్న

విచినుయా ద్యథాఽక్షన్నాపన్నం విధావతి తాదృగేవ తత్క్షోధుకోఽధ్వర్యుః స్యాత్క్షోధుకో యజమానః

సోమవిక్రయి న్త్సోమగ్ం శోధయత్యేవ బ్రూయాద్యదీతరమ్ (౧) యదీతర ముభయేనైవ సోమవిక్ర

యిణ మర్పయతి తస్మా త్సోమవిక్రయీ క్షోధుకో [2] ఽరుణో హ స్మాఽఽహౌపవేశిః సోమక్రయణ

ఏవాహం తృతీయసవన మవ రున్ధ ఇతి పశూనాం చర్మన్మిమీతే పశూనేవావ రున్ధే పశవో హి

తృతీయగ్ం సవనం [3] యం కామయేతాపశుః స్యాదిత్యృక్షతస్తస్య మిమీతర్క్షం వా అపశవ్య మప

శురేవ భవతి యం కామయేత పశుమాన్త్స్యాత్ (౨) ఇతి లోమతస్తస్య మిమీతైతద్వై పశూనాగ్ం

రూపగ్ం రూపేణైవాస్మై పశూనవరున్ధే పశుమానేవ భవ [4] త్యపామన్తే క్రీణాతి సరస మేవైనం

క్రీణా [5] త్యమాత్యోఽసీత్యాహామైవైనం కురుతే శుక్రస్తే గ్రహ ఇత్యాహ శుక్రో హ్యస్య గ్రహో [6] ఽ

నసాచ్ఛ యాతి మహిమాన మేవాస్యాచ్ఛ యాత్య [7] నసా (౩) అచ్ఛ యాతి తస్మా దనోవాహ్యగ్ం

సమే జీవనం [8] యత్ర ఖలు వా ఏతగ్ం శీర్ష్ణా హరన్తి తస్మాచ్ఛీర్షహార్యం గిరౌ జీవన [9] మభి త్యం దేవగ్ం

సవితార మిత్యతిచ్ఛన్దసర్చా మిమీతేఽతిచ్ఛన్దా వై సర్వాణి ఛన్దాగ్ంసి సర్వేభి రేవైనం ఛన్దోభి

ర్మిమీతే వర్ష్మ వా ఏషా ఛన్దసాం యదతిచ్ఛన్దా యదతి చ్ఛన్దసర్చా మిమీతే వర్ష్మైవైనగ్ం సమా

వర్షిష్ఠైవైనగ్ం సమానానాం కరో [10]త్యేకమేకమోత్సర్గమ్ (౪)మిమీతేఽయాత యామ్నియాయాత యామ్నిమేవైనం మిమీతే తస్మా న్నానావీర్యా అఙ్గులయః [11]సర్వాస్వఙ్గుష్ఠ ముప నిగృహ్ణాతి తస్మా త్సమావద్వీర్యోఽన్యాభి రఙ్గులిభిస్తస్మాత్సర్వా అను సం చరతి [12]యత్సహ సర్వాభి ర్మిమీత సగ్ంశ్లిష్టా అఙ్గులయో జాయేర న్నేకమేకమోత్సర్గం మిమీతే తస్మా ద్విభక్తా జాయన్తే [13]పఞ్చ కృత్వో యజుషా మిమీతే పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞమేవావ రున్ధే పఞ్చకృత్వ స్తూష్ణీమ్(౫)దశ సం పద్యన్తే దశాక్షరా విరాడన్నం విరాడ్విరాజైవాన్నాద్య మవరున్ధే యద్యజుషా మిమీతే భూతమేవావ రున్ధే యత్తూష్ణీం భవిష్య [14]ద్యద్వై తావానేవ సోమః స్యా ద్యావన్తం మిమీతే యజమానస్యైవ స్యాన్నాపి సదస్యానాం ప్రజాభ్య స్త్వేత్యుప సమూహతి సదస్యా నేవాన్వా భజతి వాససోప నహ్యతి సర్వదేవత్యం వై (౬) వాసః సర్వాభి రేవైనం దేవతాభిః సమర్ధయతి పశవో వై సోమః ప్రాణాయ త్వేత్యుప నహ్యతి ప్రాణమేవ పశుషు దధాతి వ్యానాయ త్వేత్యను శృన్థతి వ్యానమేవ పశుషు దధాతి తస్మాత్స్వపన్తం ప్రాణా న జహతి (౭)||

[ఇతరం పశుమా న్వ్యద్యాత్యనసోత్సర్గం తూష్ణీగ్ం సర్వదేవత్యం వై త్రయస్త్రిగ్ంశ చ్చ ||]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే నవమోఽనువాకః ||౯||

## వేదార్థ దీపిక

అవతారిక: ప్రథమ కాణ్డస్థ ద్వితీయ ప్రపాఠక గత పఞ్చమానువాకమునందు సోమోన్మానము (సోమమును కొలుచుట) చెప్పఁబడినది. ఆ సోమోన్మాన మంత్రములను ఈ బ్రాహ్మణము వివరించుచున్నది. సోమమును విక్రయించువాఁడు సోమవిక్రయి అనఁబడును. ఆ యనువాకమంత్రములను వ్యాఖ్యానించుటకు ముందు అధ్వర్యుఁడు సోమవిక్రయిని గూర్చి ప్రైషమంత్రము నిచట ఉపపాదించుచున్నాఁడు.

1. అర్థము: సోమః=సోమము, విచిత్యః3=తృణాదికమునుండి వేఱుచేయఁదగినదియా? న విచిత్యః3=వేఱుచేయఁ దగనిదియా? ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు. (పరస్పరము సంభాషించుకొనుచున్నారు.) సోమః=సోమము, ఓషధీనామ్=ఓషధులకు, రాజా వై =రాజు కదా! తస్మిన్=ఆ సోమమునందు, యత్=ఏతృణాదికము, ఆపన్నమ్=పడినదో, తత్=అది, అస్య=ఈ సోమరాజునకు, గ్రసితమేవ=గ్రాసమే. విచినుయాత్ యత్=వేఱుచేసినచో, ఆస్యాత్=ముఖమునుండి, గ్రసితమ్=అన్నమును, యథా=ఏ విధముగ, నిష్ఠిదతి=వమనము చేసికొనుచున్నాఁడో, తత్=అది, తాదృగేవ=అటువంటిదియే. న విచినుయాత్ యత్=వేఱు చేయనిచో, యథా=ఏ విధముగ, అక్షన్=చక్షుస్సునందు, ఆపన్నమ్=పడిన నలుసు, విధావతి=వ్యత్యస్తముగ పఱుగిడుచుండునో, తత్=అది, తాదృగేవ=అటువంటిదియే. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, క్షోధుకః=శోధకుఁడు, స్యాత్=కావలెను. యజమానః=యజమానుఁడు, క్షోధుకః=శోధకుఁడు, స్యాత్=కావలెను. "సోమవిక్రయిన్త్సోమగ్ం శోధయ" ఇత్యేవ బ్రూయాత్='ఓ సోమవిక్రయీ! సోమమును శోధించుము' అనియే పలుకవలెను. ఇతరమ్=ఇతరునిఁగూర్చి, ఇతరః యది=విచయదోషమైనను, ఇతరమ్=ఇతరునిగూర్చి, ఇతరః యది=అవిచయదోషమైనను, ఉభయేన=ఉభయవిధ దోషముచేతను, సోమవిక్రయిణమేవ=సోమ విక్రయినే, అర్పయతి=అర్పించినవాఁడగుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, సోమవిక్రయీ=సోమమును విక్రయించునతఁడు, క్షోధుకః=శోధకుఁడు.

తాత్పర్యము: సోమమును విక్రయించు నతఁడు విక్రయమునకై తెచ్చిన సోమలతల సముదాయమునందు తృణాదికము ఉండవచ్చును. ఆ తృణాదికమునుండి సోమమును వేఱుచేయవచ్చునా? వేఱుచేయకూడదా?, అని మంత్రజ్ఞులు పరస్పరము మాటలాడుకొనుచున్నారు. సోమము ఓషధులకు రాజు. అట్టి సోమమునందు తృణాదికము పడినచో అది ఆ సోమరాజునకు అన్నమగును. అట్టి స్థితియందు తృణాదికమునుండి సోమమును వేఱుచేసినచో ఆ వేఱుచేయుట నోటినుండి అన్నమును వమనము చేసికొనుటవంటి దగును. కంటిలో నలుసు పడినపుడు ఆ నలుసు కంటిలో వ్యత్యస్తముగ నటునిటు పఱుగిడుచు నతనిని బాధించును. వేఱుచేయనిచో ఆ వేఱుచేయకుండుట కంటిలోని నలుసువలె సోమరాజునకు బాధాకరమగును. అధ్వర్యుఁడు కాని, యజమానుఁడు కాని, సోమమును శోధించినచో విచయదోషము వారికి చెందును. శోధించనిచో అవిచయదోషము వారికి చెందును. అందువలన ఆ యుభయవిధ దోషము తమకు రాకుండుటకై అధ్వర్యుఁడు "సోమవిక్రయిన్త్సోమగ్ం శోధయ" అను ప్రైష మంత్రమును పఠించవలెను. "ఓ సోమ విక్రయీ! సోమమును శోధించుము" అని ఆ ప్రైష కర్థము. ఆ విధముగ ప్రైషను పలుకుటవలన అధ్వర్యుఁ డా యుభయవిధ దోషమును సోమవిక్రేతకే సంక్రమింపఁజేసినవాఁడగును.

2. అర్థము: "సోమక్రయణే ఏవ=సోమక్రయమునందే, అహమ్=నేను, తృతీయసవనమ్=తృతీయసవనమును, అవరున్ధే=పొందుచున్నాను," ఇతి=అని, ఔపవేశిః=ఉపవేశుని కుమారుఁడైన, అరుణః=అరుణ నామకుఁడు, ఆహ స్మ హ=చెప్పెనఁట!, పశూనామ్=పశువులయొక్క, చర్మన్=చర్మమునందు, మిమీతే=సోమమును కొలువవలెను. సః=ఆ విధముగ ఉన్మానము చేసిన యతఁడు, పశూన్=పశువులను, అవరున్ధే=పొందుచున్నాఁడు. పశవః=పశువులు, తృతీయసవనం హి=తృతీయ సవన రూపములు కదా! (ఉన్మానము=కొలుచుట.)

తాత్పర్యము: అరుణ నామకుఁడైన ఉపవేశపుత్రుఁడు, 'తాను సోమక్రయణమునందే తృతీయసవనమును పొందుచున్నానని'చెప్పెనఁట! కావున పశువుల చర్మమునందు సోమమును కొలువవలెను. సవనీయానుబంధ్యాఖ్యము లయిన పశువులు రెండును తృతీయసవనమునం దుండుటవలన పశువులు తృతీయసవన రూపములుగా వర్ణింపఁబడుటచే నావిధముగ సోమమును కొలిచిన యతఁడు పశువులనే పొందును.

3. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమానునిఁ గూర్చి, అపశుః=పశురహితుఁడు, స్యాత్ ఇతి=అగుఁగాక యని, కామయేత=కోరునో, తస్య=ఆ యజ్ఞకర్తకు, ఋక్షతః=లోమ రహిత చర్మమునందు, మిమీత=సోమమును కొలువవలెను. ఋక్షమ్=నిర్లోమ భాగము, అపశవ్యం వై=పశుసంబంధి కానిది కదా! (తదా=అప్పుడు, సః=ఆ యజమానుఁడు,) అపశుః ఏవ=పశురహితుఁడే, భవతి=అగుచున్నాఁడు. యమ్=ఏ యజమానునిఁ గూర్చి, పశుమాన్=పశువులు కలవాఁడు, స్యాత్ ఇతి=అగుఁగాక అని, కామయేత=కోరునో, తస్య=ఆ యజ్ఞకర్తకు, లోమతః=లోమ(సహిత)భాగమునందు, మిమీత=సోమమును కొలువవలెను. ఏతత్ వై=ఈ సలోమభాగమే, పశూనామ్=పశువులయొక్క, రూపమ్=రూపము. రూపేణైవ=పశురూపముచేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) పశూన్=పశువులను, అవరున్ద్ధే=పొందుచున్నాఁడు. (యజమానః=యజమానుఁడు,) పశుమానేవ=పశువులు కలవాఁడే, భవతి=అగుచున్నాఁడు.

తాత్పర్యము: ఏ యజమానుఁడు పశురహితుఁడు కావలెనని, అధ్వర్యుఁడు కోరునో, ఆ యజమానుని నిమిత్తము సోమమును చర్మముయొక్క నిర్లోమ భాగమునందు కొలువవలెను. నిర్లోమ భాగము పశుసంబంధి కానిది కదా! అప్పుడు యజమానుఁడు పశురహితుఁడే యగును. ఏ యజమానుఁడు పశుమంతుఁడు కావలెనని అధ్వర్యుఁడు కోరునో, ఆ యజమానుని నిమిత్తము చర్మముయొక్క సలోమ భాగమునందు సోమమును కొలువవలెను. ఈ సలోమ భాగమే పశువుల రూపము. కావున అధ్వర్యుఁడు పశురూపముచేతనే యీ యజమానునికొఱకు పశువులను పొందుచున్నాఁడు. యజమానుఁడు నిశ్చయముగ పశుసమృద్ధిని పొందును. (ఇచట చర్మముయొక్క ఉత్తరలోమాస్తరణము విధింపఁబడినది).

4. అర్థము: అపామ్=ఉదకములయొక్క, అన్తే=సమీపమునందు, క్రీణాతి=సోమమును కొనవలెను. ఏనమ్=ఈ సోమమును, సరసమేవ=రసవంతముగానే, క్రీణాతి=కొనవలెను.

తాత్పర్యము: సోమమును ఉదక సమీపమున కొనవలెను. ఆ కొనఁబడు సోమము రసము కలిగినదియై ఉండవలెను. (అనఁగా యజ్ఞమునందు సోమరసమునే ఉపయోగించుదురు. కావున ఆ సోమము ఎండినది కాకుండ రసము కలదిగా నుండవలెనని భావము. ఉదక సమీపము అనఁగా ఉదకుంభ సన్నిధియందు ఈ సోమక్రయము జరుగవలెనని ఇచట ఉదకుంభ సన్నిధి విధించఁబడినది.)

5. అర్థము: "అమాత్యోఽసి" ఇతి ఆహ="ఓ సోమమా!, నీవు యజమానునితోడను, దేవతల తోడను కూడ ఉంటున్నావు" అని ఈ మంత్ర భాగము చెప్పినది. ఏనమ్=ఈ సోమమును, అమైవ=కూడనే, కురుతే=చేయుచున్నాఁడు. "శుక్ర స్తే గ్రహః" ఇతి ఆహ="ఓ సోమమా!, నిన్ను గ్రహించుట హిరణ్య సాధ్యమైనది." అని ఈ మంత్రభాగము చెప్పినది. అస్య=ఈ సోమముయొక్క, గ్రహః=గ్రహణము (స్వీకారము). శుక్రః హి=సువర్ణ సాధ్యము కదా!

తాత్పర్యము: "అమాత్యోఽసి," "శుక్ర స్తే గ్రహోఽసి" అను ఈ మంత్రభాగములు, "అగ్ంశునా తే అగ్ంశుః పృచ్యతామ్" అను అనువాకములోనివి. 'అమాత్యః' 'శుక్రః' అను దుర్బోధ పదములు ఈ బ్రాహ్మణమున వివరించఁబడినవి. అమైవ=సహైవ, స్థితః అమాత్యః అని అర్థము. శుక్రః=సువర్ణ సాధ్యః అని యర్థము. దుర్బోధము=దుర్గ్రాహ్యము.

6. అర్థము: అనసా=శకటముతో, అచ్ఛ=బాగుగ, యాతి= వెళ్లవలెను. అస్య=ఈ సోమముయొక్క, మహిమానమేవ=మహిమనే, అచ్ఛ= బాగుగ, యాతి=తెలియఁబఱచుచున్నాఁడు (ప్రకాశింపఁజేయుచున్నాఁడు).

తాత్పర్యము: సోమమును పొందుటకు యజమానుఁడు, (లేక, అధ్వర్యుఁడు,), శకటముతో బాగుగ వెళ్లవలెను. శకటముతో వెళ్లుటచే యజమానుఁడు ఈ సోమముయొక్క మహిమనే ప్రకాశింపఁజేసినవాఁ డగుచున్నాఁడు. (ఇచట సోమమును పొందుటకై శకటముతో వెళ్లవలెనని విధింపఁబడినది.)

7. అర్థము: అనసా=శకటముతో, అచ్ఛ=బాగుగా, యాతి=(సోమప్రాప్తికై) వెళ్లవలెను. తస్మాత్ ఏవ=ఆకారణము వలననే, సమే=సమప్రదేశమునందు, జీవనమ్=జీవనసాధనమైన ధాన్యము, అనోవాహ్యమ్=శకటముచే మోయఁదగినది. (తద్వత్=ఆ విధముగ, సోమః అపి=సోమము కూడ.)

తాత్పర్యము: సోమమును పొందుటకై బాగుగ శకటముతో పోవలెనని పూర్వమంత్రమున విహితమైనది. కావున జీవన సాధనమైన ధాన్యము సమప్రదేశమునందు శకటముచే మోయఁదగినది. (అనఁగా వ్యవసాయ క్షేత్రమునుండి ధాన్యమును గృహమునకు తీసికొని వచ్చునప్పుడు నేల సమముగా ఉన్నచో, ఆ ధాన్యము శకటముపైని తీసి కొని రాబడుచుండుట లోకప్రసిద్ధము. సోమమును కూడ సమప్రదేశమునందు శకటముమీఁద తీసికొని రావలెనని యర్థము.)

8. అర్థము : యత్ర=ఏ పర్వతాదికమునందు, (సోమమ్=సోమమును, క్రీణన్తి=కొనుచున్నారో, తత్ర=అచ్చట,) ఏతమ్=ఈ సోమమును, శీర్ష్ణా=శిరస్సుచే, హరన్తి ఖలు వా=గ్రహించుచున్నారు (తెచ్చుచున్నారు) కదా!. తస్మాత్=ఆ కారణమువలన, గిరౌ=పర్వతమునందు, జీవనమ్=జీవన సాధనమైన ధాన్యము, శీర్షహార్యమ్=శిరస్సుచే గ్రహింపఁ (తీసికొనిరాఁ) దగినది.

తాత్పర్యము : సోమలతోత్పత్తి ప్రదేశమైన పర్వతమునందు సోమక్రయము జరిగినచో అప్పు డా సోమము శిరస్సుచే మోసి కొని తీసికొని రాఁదగినది. ఆ కారణమువలన పర్వతాది విషమ ప్రదేశమునందు జీవన సాధనమైన ధాన్య విశేషమును శిరస్సుచే మోయుచు తెచ్చుచుందురు. సోమమును గూడ పర్వతాది విషమ ప్రదేశమునందు శిరస్సుచే మోసికొని తీసికొని రావలెను.

9. అర్థము : "అభి త్యం దేవగ్ం సవితారమ్" ఇతి="అభి త్యమ్" ఇత్యాదికమైన, అతిచ్ఛన్దసా=అతిచ్ఛందస్కమైన, ఋచా=ఋక్కుచేత, మిమీతే=సోమమును కొలువవలెను. సర్వాణి ఛన్దాంసి=ఛందస్సు లన్నియు, అతి చ్ఛన్దాః వై=అతిచ్ఛందస్కములే. (తేన=ఆ కారణముచేత, అయమ్=ఈ యజమానుఁడు,) సర్వైః ఛన్దోభిరేవ=సర్వచ్ఛందస్సులచేతనే, ఏనమ్=ఈ సోమమును, మిమీతే=కొలుచుచున్నవాఁ డగుచున్నాఁడు. అతిచ్ఛన్దాః యత్=అతిచ్ఛందస్సు ఏది కలదో, ఏషా=ఇది, ఛన్దసామ్=ఛందస్సులకు, వర్ష్మ వై=శరీరము కదా! అతిచ్ఛన్దసా ఋచా=అతిచ్ఛందస్కమైన ఋక్కుచేత, మిమీతే యత్=సోమమును కొలిచినచో, అయమ్=ఈ సోమోన్మానము చేసిన యజమానుఁడు, ఏనమ్=ఈ సోమమును, సమానానామ్=సజాతీయ ములకు, వర్ష్మైవ=శరీరమునుగానే, కరోతి=చేసినవాఁ డగుచున్నాఁడు. అక్షరాధిక్యేన గాయత్ర్యాదీని ఛన్దాంసి అతిక్రమ్య వర్తతే ఇతి అతిచ్ఛన్దాః=అక్షరాధిక్యముచేత గాయత్ర్యాది ఛందస్సుల నతిక్రమించి ఉండునట్టి ఛందస్సు.

తాత్పర్యము : యజమానుఁడు "అభి త్యం· దేవగ్ం సవితారమ్" అను ఋక్కును పఠించుచు సోమవిక్రేతనుండి కొనుటకు ఉద్దేశించఁబడిన సోమమును కొలువవలెను. ఆ "అభిత్యమ్" ఇత్యాది అతిచ్ఛందస్సు అనఁగా గాయత్ర్యాది చ్ఛందస్సుల నతిక్రమించిన అక్షరములు కలది. కావున అతిచ్ఛందస్కమైన ఈ ఋక్కును పఠించుచు సోమా న్మానము చేసిన యజమానుఁడు అన్ని ఛందస్సులతోను సోమాన్మానము చేసినవాఁ డగును. అతిచ్ఛందస్సు ఛందస్సులకు శరీరమే. కావున అట్టి అతిచ్ఛందస్సుచే సోమమును కొలిచినచో, ఆ యజమానుఁడు ఈ సోమమును సజాతీయములకు శరీరముగానే చేసినవాఁ డగును. (ఇచట "అభి త్యమ్" అను ఋక్కునందలి ఛందస్సు ప్రశంసింపఁబడినది. ఈ ఋక్కు ప్రథమకాండస్థ ద్వితీయ ప్రపాఠక గత షష్ఠానువాకములోనిది. అది అచటనే వ్యాఖ్యానింపఁబడినది.)

10. అర్థము : అయాత యామ్నియా=సారరహితము కానట్టి, ఏకయా ఏకయా=ఒక్కొక్క అంగుళి చేత, ఉత్సర్గమ్=విడిచి విడిచి, మిమీతే=సోమమును కొలువవలెను. (ఏవం కృతే సతి=ఈ విధముగ చేయఁగా,) అయాతయా

మ్నియైవ=సారరహితముకాని అంగులిచేతనే, ఏనమ్=ఈ సోమమును, మిమీతే=కొలిచినవాఁడగుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, అఙ్గులయః=వ్రేళ్లు, నానా వీర్యాః=పృథక్సామర్థ్యము కలవి.

**తాత్పర్యము** : ఒక్కొక్క వ్రేలిని అంగుష్ఠముతో చేర్చి సోమమును కొలువవలెను. అనఁగా ప్రథమమున కనిష్ఠికాంగులిని బొటనవ్రేలితోఁ జేర్చి సోమమును కొలువవలెను. పిమ్మట ఆ కనిష్ఠికాంగులిని విడిచి అనామికను బొటనవ్రేలితో చేర్చి సోమమును కొలువవలెను. ఒక్కొక్క వ్రేలిని విడిచి మఱియొక వ్రేలిని అంగుష్ఠముతోఁ జేర్చుటవలన ఆ కనిష్ఠికాదులైన అంగుళులు పునరావృత్తములు కాకుండుటచే ఆ యంగుళులు సారవంతములే యగును, కాని సారరహితములు కానేరవు. కావున అయాతయామ్నియైన అంగులితోనే ఈ సోమమును కొలువవలెను. ఆ విధముగఁ జేయుటవలన అంగుళులు పృథక్సామర్థ్యము కలిగినవి. (ఇచట అంగుళులయందు ప్రకారవిశేషము విహిత మైనది.)

11. **అర్థము** : సర్వాసు=అన్ని యంగుళులయందు, అఙ్గుష్ఠమ్= బొటనవ్రేలిని, ఉపనిగృహ్ణాతి=జతపఱచవలెను. తస్మాత్=ఆ కారణమువలన, అన్యాభిః అఙ్గులిభిః=ఇతరములైన వ్రేళ్లతో, (అఙ్గుష్ఠః=బొటనవ్రేలు,) సమావద్వీర్యః=తుల్య సామర్థ్యము కలిగినది, భవతి=అగుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, సర్వాః అను=అన్ని వ్రేళ్లను అనుసరించి, సంచరతి=బొటనవ్రేలు సంచరించుచున్నది.

**తాత్పర్యము** : అన్ని వ్రేళ్లతో నంగుష్ఠమును జతపఱచవలెను. అందువలన అంగుష్ఠము అన్ని వ్రేళ్లతో సమాన సామర్థ్యము కలిగియున్నది. అంగుష్ఠమునకు పర్యాయ ప్రవృత్తి లేదు. ఆ కారణమువలన అంగుష్ఠము ప్రత్యేకముగ సర్వాంగుళులను అనుసరించుచున్నది.

12. **అర్థము** : సర్వాభిః సహ=సర్వాంగుళులతోఁగూడ, మిమీత యత్=కొలిచినచో, అఙ్గులయః=వ్రేళ్లు, సంశ్లిష్టాః=సంశ్లిష్టములై (బాగుగ కలసినవై), జాయేరన్=పుట్టును. (తతః=ఆ కారణమువలన,) ఏకయా ఏకయా=ఒక్కొక్క వ్రేలితో, ఉత్సర్గమ్=విడిచి విడిచి, మిమీతే=సోమమును కొలువవలెను. తస్మాత్=ఆ కారణమువలన, విభక్తాః=అంగుళులు వేఱు అయినవై, జాయన్తే=పుట్టుచున్నవి.

**తాత్పర్యము** : ఒక్క పర్యాయము అన్ని అంగుళులతో అంగుష్ఠమును జతపఱచి సోమమును కొలిచినచో, అన్ని వ్రేళ్లు సంశ్లిష్టములుగా (ఒక దానితో ఒకటి కలసి) పుట్టును. ఆ దోషము కలుగకుండుటకై ఒక్కొక్క వ్రేలితో నంగుష్ఠమును జతపఱచి సోమమును కొలిచి పిమ్మట ఆ వ్రేలిని విడిచి మఱియొక వ్రేలితో అంగుష్ఠమును కలిపి సోమమును కొలువవలెను. ఆ కారణము వలన వ్రేళ్లు వేఱు వేఱుగా పుట్టుచున్నవి.

13. **అర్థము** : పఞ్చ కృత్వః=అయిదు పర్యాయములు, యజుషా= మంత్రముచే, మిమీతే=సోమమును కొలువవలెను. పఙ్క్తిః= పంక్తిచ్ఛందస్సు, పఞ్చాక్షరా=అయి దక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పంచద్రవ్య సాధ్య మైనది. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) యజ్ఞమేవ=యజ్ఞ (ఫల)మునే, అవరున్ద్ధే= పొందుచున్నాఁడు. పఞ్చకృత్వః=అయిదు పర్యాయములు, తూష్ణీమ్= మంత్రరహితముగ, మిమీత=సోమమును కొలువవలెను. దశ=పది పర్యాయములు, సంపద్యన్తే=ఏర్పడుచున్నవి. విరాట్=విరాట్ఛందస్సు, దశాక్షరా= పది అక్షరములు కలది. అన్నమ్=అన్నము, విరాట్=విరాట్ఛంద స్సాధ్యమైనది. ( అతః=ఈ కారణమువలన, యజమానః=యజమానుఁడు) విరాజైవ= విరాట్ఛందస్సుచేతనే, అన్నాద్యమ్=శ్రేష్ఠమైన యన్నమును, అవరున్ద్ధే= పొందుచున్నాఁడు. యజుషా=మంత్రముచే, మిమీతే యత్= సోమమును కొలిచినచో, భూతమేవ=భూత వస్తువునే, అవరున్ద్ధే=పొందుచున్నాఁడు. తూష్ణీం యత్-మంత్ర రహితముగ అయినచో, భవిష్యత్=భవిష్య ద్వస్తువును, అవరున్ద్ధే=పొందుచున్నాఁడు.

**తాత్పర్యము** : అయిదు పర్యాయములు "అభిత్యమ్" ఇత్యాది మంత్రమును పూర్వోక్త విధముగ వ్రేళ్లతో లెక్కించుచు ఉచ్చరించుచు సోమమును కొలువవలెను. పంక్తి చ్ఛందస్సు అయిదక్షరములు కలది. యజ్ఞము పంచద్ర

వ్యసాధ్యమగుటచే పాంక్తము. కావున అయిదు పర్యాయములు మంత్రోచ్చారణ సహితముగ సోమమును కొలిచిన యజమానుఁడు నిశ్చయముగ యజ్ఞఫలమును పొందును. అయిదు పర్యాయములు మంత్రోచ్చారణము లేకుండ, (అమంత్రకముగ,) సోమమును కొలువవలెను. అప్పుడు పది పర్యాయము లగును. విరాట్ ఛందస్సు పది అక్షరములు కలది. అన్నము విరాట్ఛంద స్సాధ్య మగుటచే విరాట్ స్వరూపము. కావున యజమానుఁడు విరాట్ఛందస్సుచేతనే శ్రేష్ఠమైన యన్నమును పొందును. సమంత్రకముగ కొలిచినచో భూత వస్తువును, అమంత్రకముగ కొలిచినచో భవిష్య ద్వస్తువును యజమానుఁడు పొందును.

14. అర్థము : యత్ వై= ఏ కారణమువలన నైతే, యావన్తమ్= ఏ మాత్రవు సోమమును, మిమీతే=యజమానుఁడు కొలుచునో, తావానేవ సోమః=ఆ మాత్రవు సోమమే, యజమానస్యైవ=యజమానునకే, స్యాత్=ఉండును. సద స్యానా మపి=సదస్సునందున్నవారికి కూడ, న స్యాత్=ఉండదో, (తత్ వై=ఆ కారణమువలననే,) "ప్రజాభ్య స్త్వా" ఇతి="ప్రజాభ్య స్త్వా" అను మంత్రముచే, ఉపసమూహతి=సోమమును ప్రోగుచేయవలెను. అను= యజమానుననుసరించి, సదస్యానేవ=సదస్యులనే, ఆ భజతి=సోమమును పొందించుచున్నవాఁ డగుచున్నాఁడు. వాససా=వస్త్రముచేత, ఉపనహ్యతి=మూటకట్టవలెను. వాసః=వస్త్రము, సర్వదేవత్యం వై=సర్వదేవతాకమే. (అతః= ఈ కారణమువలన,) ఏనమ్=ఈ సోమమును, సర్వాభిః దేవతాభిః ఏవ=సమస్త దేవతలచేతనే, సమర్ధయతి=సమృద్ధముగఁ జేసినవాఁ డగుచున్నాఁడు. పశవః=పశువులు, సోమః వై=సోమస్వరూపములే. "ప్రాణాయ త్వా" ఇతి= "ప్రాణాయ త్వా" అను మంత్రముచే, ఉపనహ్యతి=సోమమును మూటకట్టవలెను. ( తదా=అప్పుడు,) పశుషు=పశువులయందు, ప్రాణమేవ=ప్రాణమునే, దధాతి=స్థాపించినవాఁ డగుచున్నాఁడు. "వ్యానాయ త్వా" ఇతి="వ్యానాయ త్వా" అను మంత్రముచే, అనుశృన్థతి=(మూటను) ఊడదీయవలెను. పశుషు= పశువులయందు, వ్యానమేవ=వ్యానవాయువునే, దధాతి=స్థాపించినవాఁ డగుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, స్వపన్తమ్=నిద్రించుచున్న యజమానుని, ప్రాణాః=ప్రాణములు, న జహాతి=విడుచుట లేదు.

తాత్పర్యము : ఎంత పరిమాణమున సోమమును (అధ్వర్యుడు) కొలుచునో, తావన్మాత్ర సోమమే యజమానునకు మాత్ర ముండును. ఆ సభయందు ఉన్నవారికి కూడ సోమము ఉండదు. కావున అధ్వర్యుఁడు "ప్రజాభ్య స్త్వా" అను మంత్రమును పఠించుచు సోమమును ప్రోగుచేయవలెను. "ఓ సోమమా! నిన్ను ప్రజల కొఱకు ప్రోగు చేయుచున్నాను" అని ఆ మంత్రమునకు అర్థము. ఇట్లు చేయుటవలన యజమాను ననుసరించి సదస్యులకు కూడ సోమమును సమర్పించినవాఁ డగును. ఆ సోమమును వస్త్రముచే మూట కట్టవలెను. వస్త్రము సర్వదేవతాకమే. కావున ఈ సోమమును సర్వ దేవతలచేతనే సమృద్ధము చేసినవాఁ డగును. సోమము పశువులే. "ప్రాణాయ త్వా" అను మంత్రమును పఠించుచు సోమమును వస్త్రముచే మూట కట్టవలెను. అప్పుడు పశువులయందు ప్రాణమునే స్థాపించినవాఁ డగును. "వ్యానాయ త్వా" అను మంత్రమును పఠించుచు ఆ మూట నూడఁదీయవలెను. అప్పుడు పశువులయందు వ్యాన వాయువునే స్థాపించినవాఁ డగును. ప్రాణ వ్యానములను పశువులయందు స్థాపించుటవలన నిద్రించుచున్న యజమానుని ప్రాణములు విడువవు. (ఇచట సమూహనాదికము విహితమైనది).

నవమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠకే దశమోఽనువాకః

మూలము: [1]యత్కలయా తే శఫేన తే క్రీణానీతి పణేతాగోఅర్ఘగ్ం సోమం కుర్యాదగోఅర్ఘం యజమాన మగో
అర్ఘ మధ్వర్యుం గోస్తు మహిమానం నావ తిరేద్గవా తే క్రీణానీత్యేవ బ్రూయా ద్గోఅర్ఘమేవ సోమం
కరోతి గోఅర్ఘం యజమానం గోఅర్ఘ మధ్వర్యుం న గోర్మహిమానమవ తిర [2]త్యజయా క్రీణాతి సత
పస మేవైనం క్రీణాతి హిరణ్యేన క్రీణాతి సశుక్రమేవ (౧)ఏనం క్రీణాతి ధేన్వా క్రీణాతి సాశిర
మేవైనం క్రీణాత్యృషభేణ క్రీణాతి సేన్ద్రమేవైనం క్రీణాత్యనడుహా క్రీణాతి వహ్నిర్వా అనడ్వా
న్వహ్నినైవ వహ్ని యజ్ఞస్య క్రీణాతి మిథునాభ్యాం క్రీణాతి మిథునస్యావరుద్ధ్యై వాససా క్రీణాతి
సర్వదేవత్యం వై వాసః సర్వాభ్య ఏవైనం దేవతాభ్యః క్రీణాతి దశ సంపద్యన్తే దశాక్షరా విరా
డన్నం విరాడ్ విరాజైవాన్నాద్యమవ రున్ధే (౨) [3]తపసస్తనూరసి ప్రజాపతేర్వర్ణ ఇత్యాహ పశుభ్య
ఏవ తదధ్వర్యుర్ని హ్నుత ఆత్మనో ఽనావ్రస్కాయ [4]గచ్ఛతి శ్రియం ప్ర పశూనాప్నోతి య ఏవం
వేద [5]శుక్రం తే శుక్రేణ క్రీణామీత్యాహ యథాయజురేవైత [6]ద్దేవా వై యేన హిరణ్యేన సోమమక్రీ
ణన్తదభీషహా పున రాఽదదత కో హి తేజసా విక్రేష్యత ఇతి యేన హిరణ్యేన (౩)సోమం క్రీణీయా
త్తదభీషహా పునరా దదీత తేజ ఏవాఽఽత్మన్ధత్తే [7]ఽస్మే జ్యోతిః సోమవిక్రయిణి తమ ఇత్యాహ
జ్యోతిరేవ యజమానే దధాతి తమసా సోమవిక్రయిణ మర్పయతి [8]యదనుపగ్రథ్య హన్యాద్దన్దశూ
కాస్తాగ్ం సమాగ్ం సర్పాః స్యురిదమహగ్ం సర్పాణాం దన్దశూకానాం గ్రీవా ఉప గ్రథ్నామీత్యాహ
దన్దశూకాస్తాగ్ం సమాగ్ం సర్పా భవన్తి తమసా సోమవిక్రయిణం విధ్యతి [9]స్వాన(౪)భ్రాజేత్యాహైతే

వా అముష్మింల్లోకే సోమ మరక్షన్తేభ్యోఽధి సోమమాఽహర[10]న్యదేతేభ్యః సోమక్రయణా న్నాను

దిశే దక్రీతోఽస్య సోమః స్యాన్నాస్యైతే ఽముష్మింల్లోకే సోమగ్ం రక్షేయు ర్యదేతేభ్యః సోమక్రయణా

ననుదిశతి క్రీతోఽస్య సోమో భవత్యేతేఽస్యాముష్మింల్లోకే సోమగ్ం రక్షన్తి(౫)॥.

[సకుక్రమేవ రున్ధ ఇతి యేన హిరణ్యేన స్యాన చతుశ్చత్వారిగ్ంశచ్చ.]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠకే దశమోఽనువాకః ||౧౦||

## వేదార్థదీపిక

అవతారిక: నవమానువాకమునందు సోమోన్మానము చెప్పఁబడినది. ఇతరము లయిన హిరణ్యాదులచే సోమక్రయ మీ దశమానువాకమునందు చెప్పఁబడుచున్నది.

1. అర్థము: హే సోమవిక్రయిన్!=ఓ సోమవిక్రేతా!, తే=నీయొక్క, సోమమ్=సోమమును, కలయా=గోవుయొక్క అవయవ లేశముచేత, క్రీణాని=కొందును. తే=నీయొక్క(సోమమ్=సోమమును,) శఫేన=గోవుయొక్క కాలిగిట్టచేత, క్రీణాని=కొందును. ఇతి=అని, పణేత యత్=వ్యవహరించునెడల, సోమమ్=సోమమును, అగోఅర్ఘమ్=గోరూప మూల్యమున కనర్హముగా, కుర్యాత్=చేయును. యజమానమ్=యజ్ఞకర్తను, అగోఅర్ఘమ్=గోరూప మూల్యము నొసఁగుట కనర్హునిగా, కుర్యాత్=చేయును. అధ్వర్యుమ్=అధ్వర్యుని, అగోఅర్ఘమ్=గోరూప మూల్యమును ఇప్పించలేని వానినిగా, కుర్యాత్=చేయును. తు=మఱియు, గోః=గోవుయొక్క, మహిమానమ్=మహిమను, న అవతిరేత్=తెలియఁ జేయనివాఁ డగును. (అతః=ఈ కారణమువలన,) "గవా తే క్రీణాని" ఇతి ఏవ="నీయొక్క సోమమును గోవుచే కొందును" అనియే, బ్రూయాత్=పలుకవలెను. (తదా=అప్పుడు,) సోమమ్=సోమమును, గోఅర్ఘమేవ=గోరూప మూల్యమున కర్హముగానే, కరోతి=చేయుచున్నాఁడు. యజమానమ్=యజమానుని, గోఅర్ఘమ్=గోరూప మూల్యము నిచ్చుట కర్హునిగాను, అధ్వర్యుమ్=అధ్వర్యుని, గోఅర్ఘమ్=గోరూప మూల్యము నిప్పించుట కర్హునిగాను, కరోతి=చేయుచున్నాఁడు. గోః=గోవుయొక్క, మహిమానమ్=మహిమను, న అవతిరతి=కించపఱచుట లేదు.

తాత్పర్యము: సోమవిక్రేతనుండి సోమమును గోవుయొక్క అవయవలేశముచేత కాని, గోవుయొక్క కాలిగిట్టచేత గాని కొందు నని అనినచో, ("కలయా తే శఫేన తే క్రీణామి") సోమము గోరూప మూల్యమునకు అర్హము కాదు. యజమానుఁడు ఆ మూల్యము నిచ్చుట కర్హుఁడు కాఁడు. అధ్వర్యుఁ డా మూల్యమును యజమానునిచే నిప్పించలేనివాఁ డగును. మఱియు గోమహిమ తెలియకపోవును. "గవా తే క్రీణాని"='సోమము గోమూల్యము' అని చెప్పినచో పైని చెప్పిన దోషత్రయము కలుగదు. గోమహిమ తిరస్కృతము కాదు. కావున "గవా తే క్రీణాని" అను మంత్రముచేత సర్వము సమాహిత మగును. ఇచట "గవా తే క్రీణాని" అను పణన మంత్రము, తద్వినియోగము చెప్పఁబడినవి.

2. అర్థము: అజయా=మేఁకచేత, (సోమమ్=సోమమును,) క్రీణాతి=కొనవలెను. (అయమ్=ఈ కొనిన యజమానుఁడు,) సతపసమేవ ఏనమ్=పుణ్యసహితమైన ఈ సోమమునే, క్రీణాతి=కొనినవాఁ డగుచున్నాఁడు హిరణ్యేన=బంగా

రముచే, క్రీణాతి=సోమమును కొనవలెను. (తదా=అప్పుడు) సశుక్రమేవ ఏనమ్=ఈ సోమమును తేజస్సహితముగనే, క్రీణాతి=కొనినవాఁ డగుచున్నాఁడు. ధేన్వా=లేఁగటియావుచేత, క్రీణాతి=సోమమును కొనవలెను. (తదా=అప్పుడు,) సాశిరమేవ ఏనమ్=ఈ సోమమును దధ్యాది గో రసోపేతమునుగానే, క్రీణాతి=కొనినవాఁ డగుచున్నాఁడు. ఋషభేణ=ఎద్దుచేత, క్రీణాతి=సోమమును కొనవలెను. సేన్ద్రిమేవ ఏనమ్=ఇంద్రియ వర్ధకమే అయిన యీ సోమమును, క్రీణాతి=కొనినవాఁ డగుచున్నాఁడు. అనడుహా=బండిని లాగునట్టి ఎద్దుచేత, క్రీణాతి=సోమమును కొనవలెను. అనడ్వాన్=అనడుచ్ఛబ్ద వాచ్యమైన ఎద్దు, వహ్నిః వై=వాహకము కదా; యజ్ఞస్య వహ్నిః=యజ్ఞనిర్వాహక సోమమును, వహ్నినైవ=వాహకమైన ఎద్దుచేతనే, క్రీణాతి=కొనినవాఁ డగుచున్నాఁడు. మిథునాభ్యామ్=మిథునావయవములైన వత్సతరీ వత్సతరులచేత, క్రీణాతి=సోమమును కొనవలెను. (అయం క్రయః=ఈ క్రయము,)మిథునస్య=మిథునముయొక్క, అవరుద్ధ్యై=పొందుటకొఱకు, భవతి=అగుచున్నది. వాససా=వస్త్రముచేత, క్రీణాతి=కొనవలెను. వాసః=వస్త్రము, సర్వదేవత్యం వై=సర్వదేవతాకమే. (అతః=ఈ కారణమువలన,)సర్వాభ్యః దేవతాభ్యః ఏవ=సర్వ దేవతలకొఱకే, ఏనమ్=ఈ సోమమును, క్రీణాతి=కొనినవాఁ డగుచున్నాఁడు. దశ=(సోమ క్రయ సాధన ద్రవ్యములు) దశ సంఖ్యాకములు, సంపద్యన్తే=సంపన్నము లగుచున్నవి. విరాట్=విరాట్ ఛందస్సు, దశాక్షరా=పది యక్షరములు కలది. అన్నమ్=అన్నము, విరాట్=విరాట్ (ఛందస్సాధ్యము కనుక,) స్వరూపము. (తత్=ఆ కారణములవలన,)విరాజైవ=విరాట్ ఛందస్సుచేతనే, అన్నాద్యమ్=శ్రేష్ఠమైన యన్నమును, అవరున్ద్ధే =పొందుచున్నాఁడు.

తాత్పర్యము: "తపస స్తనూ రసి" అను మంత్రమున మేఁక పుణ్యస్వరూపముగా వర్ణింపఁబడుటచే మేఁక నిచ్చి కొనినట్టి సోమము పుణ్యస్వరూపముగా నిచట వర్ణింపఁబడినది. ఋషభము=ఆవును గూర్చి పోవునది. అనఁగా ఇంద్రియ వర్ధకమైన కోడెదూడ. అనడ్వాహము=బండిని మోయునది, లేదా లాగునట్టి యెద్దు. గోవు సోమక్రయ సాధనమైన విధముగనే, ధేను శబ్దమునకు వత్స సహిత ధేనువు అని చెప్పవలెను. మిథునము వత్సతరము వత్సతరి కావున అవి రెండు ద్రవ్యములు. సార్ధవత్సరము కల దూడ వత్సతర మనఁబడును. పుంవాచకము. వత్సతరి స్త్రీవాచకము. పూర్వ మంత్రమునందు చెప్పఁబడిన గోవు ఒకటి. ఈ మంత్రమున చెప్పఁబడిన అజాదులు తొమ్మిది. మొత్తము సోమక్రయ సాధన ద్రవ్యములు దశసంఖ్యాకములైనవి. ఈ దశద్రవ్యముల నిచ్చి సోమమును సోమ విక్రేతనుండి కొనవలెను. సోమక్రయ సాధనములు దశసంఖ్యాకములు. విరాట్ ఛందస్సు దశాక్షరములు కలది. అన్నము విరాట్ ఛందస్సాధ్యమైనది. కావున ఈ పది ద్రవ్యములచే సోమమును కొనిన యజమానుఁడు శ్రేష్ఠమైన అన్నమును పొందును. శేషము సులభగ్రాహ్యము.

3. అర్థము: "తపస స్తనూరసి ప్రజాపతేర్వర్ణః" ఇతి ఆహ="ఓ మేఁకా! నీవు పుణ్యముయొక్క స్వరూప మగుచున్నావు. ప్రజాపతియొక్క దేహ మగుచున్నావు" అని "తపస స్తనూః" ఇత్యాది మంత్రము చెప్పినది. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, తత్=ఆ మంత్రపాఠముచేత, ఆత్మనః=తనయొక్క, అనావ్రస్కాయ=అపరాధ రాహిత్యముకొఱకు, పశుభ్యః=పశువులకొఱకు, నిహ్నుతే=నిగరణము చేయుచున్నాఁడు.

తాత్పర్యము: అధ్వర్యుఁడు "తపస స్తనూరసి" ఇత్యాది మంత్రపాఠముచే అజాదిపశువులను అపలాపము చేయుచున్నాఁడు. సహజముగ మేఁక పుణ్యస్వరూపము కాదు. ప్రజాపతియొక్క దేహము కాదు. ఇది ఉపచారము మాత్రమే. తనయొక్క అపరాధ రాహిత్యమునకై అధ్వర్యుఁ డీ విధముగ నుపచారము చేసెను.

4. అర్థము: యః=ఏ పురుషుఁడు, ఏవమ్=ఈ విధముగ, వేద=తెలిసికొనుచున్నాఁడో, (సః=అతఁడు,) శ్రియమ్=సంపదను, గచ్ఛతి=పొందుచున్నాఁడు. పశూన్=పశువులను, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్తవిధముగ పశూపచారవిధమును తెలిసికొనిన యతఁడు సంపదను పశువులను పొందును.(ఇచట పశూపచార వేదనము ప్రశంసింపఁబడినది.)

5. అర్థము: "శుక్రం తే శుక్రేణ క్రీణామి" ఇతి ఆహ="ఓ సోమవిక్రేతా!, తేజస్వంతమైన నీయొక్క సోమమును, తేజస్వంతమైన హిరణ్యముచే కొనుచున్నాను" అని "శుక్రం తే" ఇత్యాది మంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ=మంత్రోక్తమైనవిధమే.

తాత్పర్యము: క్రీతవ్యమైన సోమమునందు, క్రయసాధనమైన హిరణ్యమునందును తేజస్వత్వము సమానమే యని యీ బ్రాహ్మణ వాక్యము మంత్రము స్పష్టార్థముగా ఉన్నదని చెప్పినది.

6. అర్థము: దేవాః=దేవతలు, యేన హిరణ్యేన వై=ఏ హిరణ్యముచేతనే, సోమమ్=సోమమును, అక్రీణన్=కొనిరో, 'తేజసా=తేజస్స్వరూపమైన హిరణ్యముచే, కః=ఎవఁడు, విక్రేష్యతే హి= విక్రయించును?' ఇతి=అని, తత్=ఆ హిరణ్యమును, అభీషహా=బలాత్కారముగ, పునః=మఱల, ఆదదత=తీసికొనిరి. యేన హిరణ్యేన=ఏ హిరణ్యముచేత, సోమమ్=సోమమును, క్రీణీయాత్=కొనునో, తత్=ఆ హిరణ్యమును, అభీషహా=బలాత్కారముగ, పునః=మఱల, ఆ దదీత=తీసికొనవలెను. (తత్=ఆ తీసికొనుటవలన, యజమానః=యజమానుఁడు,) తేజః ఏవ=తేజస్సునే, ఆత్మన్=తనయందు, ధత్తే=ధరించుచున్నాఁడు.

తాత్పర్యము: దేవతలు ఏ హిరణ్యముచే సోమమును కొనిరో, ఎవఁడు తేజస్స్వరూపమైన హిరణ్యముచే సోమమును విక్రయించును?, అని బలాత్కారముగ ఆ హిరణ్యమును తీసికొనిరి. కావున ఏ హిరణ్యముచే యజ్ఞకర్త సోమమును కొనునో, ఆ హిరణ్యమును బలాత్కారముగ తీసికొనవలెను. ఆ విధముగ తీసికొనుటవలన, అతఁడు తేజస్సునే తనయందు ధరించినవాఁ డగును. (ఇచట హిరణ్యముయొక్క పునరాదానము విధింపఁబడినది.)

7. అర్థము: "అస్మే జ్యోతిః సోమవిక్రయిణి తమః" ఇతి ఆహ="మాయందు తెల్లని ఊర్ణాస్తుక, సోమవిక్రేతయందు నల్లని ఊర్ణాస్తుక ఉండుఁగాక" అని "అస్మే జ్యోతిః" ఇత్యాది మంత్రము చెప్పుటచే, యజమానే=యజ్ఞకర్తయందు, తేజః ఏవ= తేజస్సునే, దధాతి=ధరింపఁజేయుచున్నాఁడు. తమసా=తమస్సుచే, సోమవిక్రయిణమ్=సోమవిక్రేతను, అర్పయతి=అర్పించుచున్నాఁడు.

తాత్పర్యము: "మాయందు తెల్లని ఊర్ణాస్తుక, సోమవిక్రేతయందు నల్లని ఊర్ణాస్తుక ఉండుఁగాక", అని "అస్మే జ్యోతిః" అను మంత్రము చెప్పుటచే, అధ్వర్యుఁడు యజమానునియందు జ్యోతిస్సును స్థాపించుచున్నాఁ డనియు, సోమవిక్రేతయందు తమస్సు నర్పించు చున్నాఁడనియు ఈ బ్రాహ్మణము చెప్పుచున్నది. (అవిలోమభిః నిర్మితః తన్తుః ఊర్ణాస్తుకా. గొఱ్ఱెయొక్క లోమములచే నిర్మితమైనది ఊర్ణాస్తుక.)

8. అర్థము: అనుపగ్రథ్య=ఊర్ణాస్తుకను ముడివేయక, హన్యాత్ యత్=సోమవిక్రేతను హింసించినచో, తాం సమామ్=ఆ సంవత్సర మంతయు, సర్పాః=పాములు, దన్దశూకాః=కుత్సితముగ కఱచునట్టివి, స్యుః=అగును. "ఇద మహగ్ం సర్పాణాం దన్దశూకానాం గ్రీవా ఉపగ్రథ్నామి" ఇతి ఆహ="ఇదిగో, నేను కుత్సితముగ కఱచునట్టి సర్పముల కంఠములను గ్రుచ్చుచున్నాను" అని పఠించుటవలన, తాం సమామ్=ఆ సంవత్సర మంతయు, సర్పాః=సర్పములు, అదన్దశూకాః=కుత్సితముగ కఱవనట్టివి, భవన్తి=అగుచున్నవి. తమసా=నల్లని ఊర్ణాస్తుకచే, సోమవిక్రయిణమ్=సోమవిక్రేతను, విధ్యతి=గ్రుచ్చవలెను.

తాత్పర్యము: ఊర్ణాస్తుకను దశాపవిత్రముయొక్క నాభిగా ముడివేయక, సోమవిక్రేతను గ్రుచ్చినచో, సంవత్సరమంతయు సర్పములు కుత్సితముగ కఱచునట్టి వగును. "ఇద మహగ్ం సర్పాణాం దన్దశూకానాం గ్రీవా ఉపగ్రథ్నామి" అని పఠించినచో, సంవత్సరమంతయు సర్పములు కుత్సితముగ కఱవనట్టి వగును. నల్లని ఊర్ణాస్తుకచే

సోమవిక్రేతను గ్రుచ్చవలెను. (గొఱ్ఱెయొక్క లోమములచే నిర్మితమైన దారము ఊర్ణాస్తుక అనఁబడును. తెల్లని ఊర్ణాస్తుకను యజమానున కిచ్చి నల్లని ఊర్ణాస్తుకను సోమవిక్రేత కీయవలెనని వెనుక చెప్పఁబడినది.)

9. అర్థము: "స్వాన భ్రాజ" ఇతి ఆహ=స్వాన భ్రాజాదులు సోమరక్షకులు. "ఓ స్వానభ్రాజాదులారా! ఈ గో హిరణ్యాదులు మీయొక్క సోమమును కొనుటకు సాధనములు. ఈ సోమక్రయములను రక్షించుఁడు." అని "స్వాన భ్రాజ" ఇత్యాది మంత్రము చెప్పినది. ఏతే వై=ఈ స్వానభ్రాజాదులే, అముష్మిన్ లోకే=స్వర్గలోకమునందు, సోమమ్=సోమయాగ ఫలమును, అరక్షన్=రక్షించిరి. తేభ్యః=ఆ సోమరక్షకులనుండి, అధి=అధికమైన, సోమమ్=సోమయాగ ఫలమును, ఆహరన్=సంపాదించవలెను.

తాత్పర్యము: స్వాన భ్రాజేత్యాదులే స్వర్గలోకమునందు సోమయాగ ఫలమును రక్షించిరి. వారినుండి సోమయాగ ఫలమును అధికముగ గ్రహించవలెను.

10. అర్థము: ఏతేభ్యః=ఈ సోమరక్షకులకొఱకు, సోమక్రయణాన్=సోమక్రయ సాధనములైన గో హిరణ్యాదులను, న అనుదిశేత్ యత్=అనుదేశించనిచో, అన్య=ఇతనియొక్క, సోమః=సోమము, అక్రీతః=కొనఁబడనిది, స్యాత్=అగును. అన్య=ఇతనియొక్క, సోమమ్=సోమయాగ ఫలమును, అముష్మిన్ లోకే=స్వర్గలోకమునందు, న రక్షేయుః=రక్షింపకుందురు. ఏతేభ్యః=ఈ సోమరక్షకులకొఱకు, సోమ క్రయణాని=సోమక్రయ సాధనము లయిన గోహిరణ్యాదులను, అనుదిశతి యత్=అనుదేశించినచో, అన్య=ఇతనియొక్క, సోమః=సోమము, క్రీతః=కొనఁబడినదగుచున్నది. అన్య=ఇతనియొక్క, సోమమ్=సోమయాగ ఫలమును, అముష్మిన్ లోకే=స్వర్గలోకమునందు, రక్షన్తి=రక్షించుచున్నారు. (సోమః క్రీయతే యైః గవాదిభిః తే సోమక్రయణాః= గవాదయః సోమక్రయ సాధనాని.)

తాత్పర్యము: సోమరక్షకులగు స్వానభ్రాజాదులకు సోమక్రయణములను అనుదేశించనిచో సోమము కొనఁబడనిది యగును. ఈ యజమానుని సోమయాగఫలమును ఆ సోమ రక్షకులు రక్షింపరు. ఈ సోమరక్షకులకు సోమ క్రయములను అనుదేశించినచో, ఈ యజ్ఞకర్తకు సోమము క్రీత మగును. ఈ యజ్ఞకర్తయొక్క సోమయాగ ఫలమును స్వర్గమునందు సోమరక్షకులు రక్షింతురు. (అనుదేశము=ఆజ్ఞ.)

దశమానువాకము సమాపము.

# అథ షష్ఠకాణ్డే ప్రథమ ప్రపాఠక ఏకాదశోఽనువాకః

మూలము: [1]వారుణో వై క్రీతః సోమ ఉపనద్ధో మిత్రో న ఏహి సుమిత్రధా ఇత్యాహ శాన్త్యై [2]ఇన్ద్రస్యోరుమా విశ దక్షిణమిత్యాహ దేవా వై యగ్ం సోమమక్రీణ న్తమిన్ద్రస్యోరౌ దక్షిణ ఆఽసాదయన్నేష ఖలు వా ఏతర్హీన్ద్రో యో యజతే తస్మాదేవ మాహో [3]దాయుషా స్వాయుషేత్యాహ దేవతా ఏవాన్వారభ్యోత్ (౧) తిష్ఠ [4]త్యుర్వన్తరిక్ష మన్విహీత్యాహాన్తరిక్షదేవత్యో ఽహ్యేతర్హి సోమో [5]ఽదిత్యాః సదో ఽస్యదిత్యాః సద ఆ సీదేత్యాహ యథాయజు రేవైత [6]ద్వి వా ఏనమేతదర్ధయతి యద్వారుణగ్ం సన్తం మైత్రం కరోతి వారుణ్యర్చాఽఽసాదయతి స్వయైవైనం దేవతయా సమర్ధయతి [7]వాససా పర్యానహ్యతి సర్వదేవత్యం వై వాసః సర్వాభిరేవ (౨)ఏనం దేవతాభిః సమర్ధయత్యథో రక్షసామపహత్యై [8]వనేషు వ్యన్తరిక్షం తతానేత్యాహ వనేషు హి వ్యన్తరిక్షం తతాన వాజమర్వత్స్విత్యాహ వాజగ్ం హ్యర్వత్సు పయో అఘ్నియాస్విత్యాహ పయో హ్యఘ్నియాసు హృత్సు క్రతుమిత్యాహ హృత్సు హి క్రతుం వరుణో విక్ష్వగ్ని మిత్యాహ వరుణో హి విక్ష్వగ్నిం దివి సూర్యమ్ (౩)ఇత్యాహ దివి హి సూర్యగ్ం సోమ మద్రా విత్యాహ గ్రావాణో వా అద్రయస్తేషు వా ఏష సోమం దధాతి యో యజతే తస్మాదేవమాహో [9]దు త్యం జాతవేదసమితి సౌర్యర్చా కృష్ణాజినం ప్రత్యానహ్యతి రక్షసా మపహత్యా [10]ఉస్రావేతం ధూర్షాహావిత్యాహ యథాయజురేవైత [11]త్ప్ర చ్యవస్వ భువస్పత ఇత్యాహ భూతానాగ్ం హి (౪) ఏష పతి ర్విశ్వాన్యభి ధామానీత్యాహ విశ్వాని హ్యే ఽషోఽభి ధామాని ప్రచ్యవతే మా త్వా పరిపరీ విదదిత్యాహ యదేవాదః సోమమాహ్రియమాణం గన్ధర్వో విశ్వావసుః పర్య

ముష్ణా త్తస్మాదేవ మాహోపరిమోషాయ [12]యజమానస్య స్వస్త్యయన్యసీత్యాహ యజమానస్యైవైష యజ్ఞస్యాన్వారమ్భోఽనవచ్ఛిత్త్యై [13]వరుణో వా ఏష యజమాన మభ్యైతి యత్ (౫) క్రీతః సోమ ఉపనద్ధో నమో మిత్రస్య వరుణస్య చక్షస ఇత్యాహ శాన్త్యై [14]ఆ సోమం వహన్త్యగ్నినా ప్రతి తిష్ఠతే తౌ సంభవన్తౌ యజమానమభి సంభవతః పురా ఖలు వావైష మేధాయాఽఽత్మాన మారభ్య చరతి యో దీక్షితో [15]యదగ్నీషోమీయం పశుమాలభత ఆత్మనిష్క్రయణ ఏవాస్య స [16]తస్మాత్తస్య నాఽఽశ్యం పురుషనిష్క్రయణ ఇవ హ్య [17]థో ఖల్వాహు రగ్నీషోమాభ్యాం వా ఇన్ద్రో వృత్ర మహన్నితి యదగ్నీషోమీయం పశుమాలభతే వార్త్రఘ్న ఏవాస్య స తస్మాద్వాశ్యం [18]వారుణ్యర్చా పరి చరతి స్వయైవైనం దేవతయా పరి చరతి (౬)||

(అన్వారభ్యోత్సర్వాభిరేవ సూర్యం భూతానాగ్ం హ్యేతి యదాహః సప్తవిగ్ంశతిశ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమ ప్రపాఠక ఏకాదశోఽనువాకః ||౧౧||

ప్రాచీనవగ్ంశం యాపన్త ఋక్సామే వై వాగ్వై దేవేభ్యో దేవా వై దేవయజనం కద్రూశ్చ తద్ధిరణ్యగ్ం షట్పదాని బ్రహ్మవాదినో విచిత్యో యత్కలయా తే వారుణో వై క్రీతః సోమ ఏకాదశ ||౧౧||

ప్రాచీనవగ్ంశగ్ం స్వాహేత్యాహ యేఽన్తఃశరా హ్యేష సంతపసా చ యత్కార్ణగృహీతేతి లోమతో వారుణః షట్సప్తతిః ||౭౬||

హరిః ఓమ్

ఇతి కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ప్రథమః ప్రపాఠకః ||౧||

# వేదార్థ దీపిక

**అవతారిక:** నవమానువాకమునందు సోమక్రయణిగా గోవు వర్ణింపఁబడఁగా, దశమానువాకమునందు అజాహిరణ్యాదులు నవద్రవ్యములు సోమక్రయణములుగా చెప్పఁబడినవి. ఈ యేకాదశానువాకమునందు పూర్వోక్త దశద్రవ్యములచే క్రయము చేయఁబడిన సోమమును శకటముపైని తీసికొనివచ్చుట చెప్పఁబడుచున్నది. ప్రథమ కాండస్థ ద్వితీయ ప్రపాఠకగత సప్తమాష్టమానువాకములందలి మంత్రముల కీ యేకాదశానువాకము వివరణాత్మకము.

1. **అర్థము:** క్రీతః=కొనఁబడినదియై, ఉపనద్ధః=(మూటగా) కట్టఁబడిన, సోమః=సోమము, వారుణః వై=వరుణ దేవతాకమే. "మిత్రో న ఏహి సుమిత్రధాః" ఇతి ఆహ="ఓ సోమమా! మంచి మిత్రుని పోషించునట్టి నీవు మాకు మిత్రమై రమ్ము" అని వేదము చెప్పినది. ఏతత్=ఈ కథనము, శాన్త్యై=శాంతికొఱకు, భవతి=అగుచున్నది.

**తాత్పర్యము:** క్రయము చేయఁబడి మూటగా కట్టఁబడిన సోమము వరుణ దేవతాకమే. బంధనము వరుణ పాశరూపము కావున, సోమము వరుణ దేవతాక మైనది. లేదా, వరుణ సంబంధి యైనది. ఈ కారణముచే వరుణునివలె సోమమునకు క్రూరత్వము ప్రాప్త మగుచుండఁగా, తచ్ఛాంతికొఱకు "ఓ సోమమా! మంచి మిత్రుని పోషించునట్టి నీవు మాకు మిత్రమై రమ్ము" అని "మిత్రో న ఏహి" ఇత్యాది వేదమంత్రము చెప్పినది.

2. **అర్థము:** "ఇన్ద్రస్యోరు మా విశ దక్షిణమ్" ఇతి ఆహ="ఓ సోమమా! ఐశ్వర్యవంతుఁడైన యజమానునియొక్క కుడి తొడను ప్రవేశించుము" అని మంత్రము చెప్పినది. దేవాః వై=దేవతలే, యం సోమమ్=ఏ సోమమును, అక్రీణన్=కొనిరో, తమ్=ఆ సోమమును, ఇన్ద్రస్య=ఇంద్రునియొక్క, దక్షిణే ఊరౌ ఏవ=కుడితొడయందే, ఆసాదయన్=ప్రవేశపెట్టిరి. యః=ఏ యజమానుఁడు, యజతే=యాగము చేయుచున్నాఁడో, ఏషః=ఇతఁడు, ఏతర్హి ఖలు వై=ఇటువంటివాఁడే కదా! తస్మాత్=ఆ కారణమువలన, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, ఆహ=చెప్పెను.

**తాత్పర్యము:** క్రయము చేయఁబడిన సోమమును యజ్ఞకర్తయొక్క కుడితొడయందు కూర్చుండు మని అధ్వర్యుఁడు సోమమును ఆహ్వానించెను. పూర్వము దేవతలు సోమమును కొని యజ్ఞకర్తయగు ఇంద్రుని దక్షిణోరువునందు ప్రవేశపెట్టిరి. కావున ఇది ప్రాచీన సంప్రదాయానుగతమే యని వివరింపఁబడినది.

3. **అర్థము:** "ఉదాయుషా స్వాయుషా" ఇతి ఆహ="ఆయుస్స్వరూపమును స్వాయుస్స్వరూపమునగు సోమముతోఁగూడ యజమానుఁడనైన నేను లేచుచున్నాను." అని వేదమంత్రము చెప్పినది. దేవతాః ఏవ=దేవతలనే, అన్వారభ్య=అభిలక్షించి, ఉత్తిష్ఠతి=యజమానుఁడు లేచుచున్నాఁడు.

**తాత్పర్యము:** ఆయుస్స్వరూపమును స్వాయుస్స్వరూపమునగు సోమముతోఁ గూడ అమృతులైన దేవతల నభిలక్షించి యజమానుఁడు కూర్చున్న ప్రదేశమునుండి లేచుచున్నాఁడని భావము. సోమము ఆయుఃప్రద మగుటవలన ఆయుస్స్వరూపముగాను, స్వాయుఃప్రద మగుటచే స్వాయుస్స్వరూపముగాను వర్ణింపఁబడినది. అమృతాన్ అను=దేవతలను అనుసరించి. [అనఁగా పూర్వము దేవతలు సోమమును యాగప్రదేశమునకు తీసికొని వెళ్లినవిధముగ అని భావము.] ఆయుః=జీవనము. స్వాయుః=రోగాద్యుపద్రవ రహితము. సోమము భూమివిశేషమునందు పుట్టుటవలన, పర్జన్యుని వర్షముచే వృద్ధినొందుటవలన ఓషధులయొక్కయు, పర్జన్యుని యొక్కయు సారముగా వర్ణింఁబడినది.

4. **అర్థము:** "ఉర్వన్తరిక్ష మన్విహి" ఇతి ఆహ="ఓ సోమమా! గొప్పదియైన అంతరిక్షము ననుసరించి వెళ్లుము" అని వేదమంత్రము చెప్పినది. ఏతర్హి=ఈ కారణమువలననే, సోమః=సోమము, అన్తరిక్ష దేవత్యః హి=అంతరిక్షదేవత దేవతగా కలది కదా! (సోమమును శకటముపైని ఉంచుటకై పైకి ఎత్తినప్పటినుండి మఱల యాగశాలయందు భూమియందు ఉంచుటవఱకు ఆ సోమమునకు అంతరిక్షమే ఆధారము కావున సోమము అంతరిక్షదేవత్యముగా వర్ణింపఁబడినది. తాత్పర్యము స్పష్టము.)

5. అర్థము: "అదిత్యాః సదో ఽస్యదిత్యాః సద ఆసీద" ఇతి ఆహ="ఓ కృష్ణాజినమా! నీవు భూమికి స్థాన మగుచున్నావు. ఓ సోమమా! నీవు ఆ భూమియొక్క స్థానమును (కృష్ణాజినమును) పొందుము." అని "అదిత్యాః" ఇత్యాది వేదమంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ=మంత్రోక్తవిధమే.

తాత్పర్యము: ఈ మంత్రముయొక్క అర్థము స్పష్టముగానే యున్నది. వివరించ నవసరము లేదని భావము.

6. అర్థము: వారుణం సన్తమ్=వరుణ దేవతాకముగ ఉంటున్న సోమమును, మైత్రమ్="మిత్రః నః ఏహి" అని మిత్రసంబంధిగ, కరోతి యత్=ఏది చేయుచున్నదో, ఏతత్=ఇది, ఏనమ్=ఈ సోమమును, వ్యర్ధయతి వై=సమృద్ధిహీనముగనే చేయుచున్నది. (తత్=ఆ కారణమువలన,) వారుణ్యర్చా=వరుణ దేవతాక (వరుణ పద ఘటితమైన) ఋక్కుచే, ఆసాదయతి=సోమము నాసాదనము చేయవలెను. (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు,) స్వయా దేవతయైవ=స్వీయ వరుణదేవతచేతనే, ఏనమ్=ఈ సోమమును, సమర్ధయతి=సమృద్ధముగ చేయుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: "ఓ సోమమా! మంచి మిత్రుఁడు గల నీవు మాకు మిత్రమై రమ్ము. భూమియొక్క స్థానమైన కృష్ణాజినమును పొందుము" అని చెప్పఁబడినదేది కలదో, అది ఈ సోమమును సమృద్ధిహీనముగనే చేయుచున్నది. అందువలన కేవలము ఆసాదనము కాక, వరుణదేవతాక ఋక్కును పఠించుచు సోమమును కృష్ణాజినముపైని ఆసాదనము చేయవలెను. అట్లు ఆసాదనము చేసిన యజమానుఁడు సోమమునకు స్వీయ అయిన దేవతచేతనే సమృద్ధముగా చేయుచున్నవాఁ డగుచున్నాఁడు.

7. అర్థము: వాససా=వస్త్రముచే, పర్యానహ్యతి=సోమమును అంతటను మూట కట్టవలెను. వాసః=వస్త్రము, సర్వదేవత్యం వై=సర్వదేవతాకమే. (అయమ్=వస్త్రముచే సోమమును మూట కట్టిన ఈ యజమానుఁడు,) సర్వాభిః దేవతాభిః ఏవ=సర్వదేవతలచేతనే, ఏనమ్=ఈ సోమమును, సమర్ధయతి=సమృద్ధముగాఁ జేసినవాఁ డగుచున్నాఁడు. అథో=మఱియు, రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=తొలఁగింపుకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: సోమమును వస్త్రముచే మూట కట్టవలెను వస్త్రము సర్వదేవతాకము. కావున, వస్త్రముచే మూటకట్టిన యీ యజమానుఁడు సర్వదేవతలచేతనే యీ సోమమును సమృద్ధముగఁ జేసినవాఁడగును. మఱియు ఈ చేయుట రాక్షసుల అపహతికిఁ గూడ కారణ మగును. "వనేషు వ్యన్తరిక్షం తతాన" అను మంత్రముచే చేయవలసిన విధాన మిచట విహిత మైనది.

8. అర్థము: "వనేషు వ్యన్తరిక్షం తతాన" ఇతి ఆహ="వృక్షములయందు వరుణ నామక సోమదేవుఁడు అవకాశమును విస్తరింపఁజేసెను." అని వేదము చెప్పినది. వనేషు=వృక్షములందు, అన్తరిక్షమ్=అవకాశమును, వితతాన హి=విస్తరింపఁజేసెను కదా! "వాజ మర్వత్సు" ఇతి ఆహ="వరుణ నామక సోమదేవుఁడు అశ్వములయందు వేగమును విస్తరింపఁజేసెను" అని వేదము చెప్పినది. అర్వత్సు=అశ్వములయందు, వాజమ్=గతివిశేషమైన వేగమును, వితతాన హి=విస్తరింపఁజేసెను కదా! "పయో అఘ్నియాసు" ఇతి ఆహ="గోవులయందు పాలను విస్తరింపఁజేసెను" అని వేదము చెప్పినది. అఘ్నియాసు=గోవులయందు, పయః=పాలను, వితతాన హి=విస్తరింపఁజేసెను కదా! హృత్సు=చిత్తములయందు, క్రతుమ్=సంకల్పమును, వితతాన=విస్తరింపఁజేసెను ఇతి=అని, ఆహ=వేదము చెప్పినది. హృత్సు,=చిత్తములయందు, క్రతుమ్=సంకల్పమును, వరుణః=వరుణ నామక సోమదేవుఁడు, వితతాన హి=విస్తరింపఁజేసెను కదా! "విక్ష్వగ్నిమ్" ఇతి ఆహ="ప్రజలయందు జఠరాగ్నిని విస్తరింపఁజేసెను. వరుణః=వరుణ నామక సోమదేవుఁడు, విక్షు=ప్రజలయందు, అగ్నిమ్=జఠరాగ్నిని, వితతాన హి=విస్తరింపఁజేసెను కదా! "దివి సూర్యమ్" ఇతి ఆహ=ద్యులోకమునందు సూర్యుని విస్తరింపఁజేసెను. దివి=ద్యులోకమునందు, సూర్యమ్=సూర్యుని, వితతాన హి=విస్తరింపఁజేసెను కదా! "సోమ మద్రౌ" ఇతి

ఆహ="ఖాలయందు సోమలతను విస్తరింపఁజేసెను" అని వేదము చెప్పినది. అద్రయః=అద్రులు, గ్రావాణః వై=ఖాలే. యః=ఏ యజమానుఁడు, యజతే=యాగము చేయుచున్నాఁడో, ఏషః=ఇతఁడు, తేషు వై=ఆ ఖాలయందే, సోమమ్=సోమలతను, దధాతి=స్థాపించుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, ఏవమ్=ఈ విధముగ, ఆహ=చెప్పెను. "వనేషు వ్యన్తరిక్షం తతాన" ఇత్యాది మంత్రముయొక్క అర్థము ప్రసిద్ధ మైనదే; అని యీ బ్రాహ్మణము చెప్పినది. తాత్పర్యము స్పష్టము.

9. అర్థము: రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=తొలఁగింపునకై, "ఉదు త్యం జాతవేదసమ్" ఇతి="ఉదు త్యం జాతవేదసమ్" అను సూర్యదేవతాకమైన (సూర్యపద ఘటిత)ఋక్కుచేత, కృష్ణాజినమ్=కృష్ణాజినమును, ప్రత్యానహ్యతి=మఱల మూటకట్టవలెను.

తాత్పర్యము: "ఉదు త్యం జాతవేదసమ్" అను సూర్యపద ఘటితమైన ఋక్కును పఠించుచు సోమము నుంచిన కృష్ణాజినమును మఱల మూటకట్టవలెను. ఇట్లు చేయుటవలన రాక్షసులు తొలఁగి పోవుదురు. (శకటముపైని కృష్ణాజినమును పఱచి దానియందు సోమమునుంచి మూటకట్టవలెనని పూర్వమంత్రములలో జెప్పఁబడినది. ఇప్పు డా కృష్ణాజినమును మఱల మూట కట్టవలెనని చెప్పఁబడినది.

10. అర్థము: "ఉస్రా వేతం ధూర్షా" ఇతి ఆహ="ఓ భారమును సహించునట్టి యెద్దులారా! రండు" అని ఈ మంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ=మంత్రోక్తవిధమే.

తాత్పర్యము: "ఉస్రా వేతం ధూర్షా" అను మంత్రముయొక్క అర్థము మంత్రోక్తమే. అధికముగ చెప్పఁదగినది లేదు.

11. అర్థము: "ప్ర చ్యవస్వ భువస్పతే" ఇతి ఆహ="భూతపతివైన యో సోమమా! ప్రకర్షముగ (ముందుకు) పొమ్ము" అని వేదము చెప్పినది. ఏషః=ఈ సోమము, భూతానాం పతిః హి=యజమానాధ్వర్యు ప్రభృతి ప్రాణులకు (పాలకముగుటచే) పతి కదా! "విశ్వా న్యభిధామాని" ఇతి ఆహ=విశ్వాని ధామాని అభి=సమస్తములైన ప్రాచీన వంశ హవిర్ధానాది స్థానముల నభిలక్షించి, ప్ర చ్యవతే హి=ప్రకర్షముగ పోవుచున్నది కదా! "మా త్వా పరిపరీ విదత్" ఇతి ఆహ="మార్గమునందు బాధకుఁడైన తస్కరప్రభువు నిన్ను తెలిసికొనకుండుఁగాక." అని "మా త్వా" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. యదేవ=ఏ కారణముచేతనే, ఆహ్రియమాణమ్=తీసికొనిరాఁబడు చున్న, అదః (=అముమ్)సోమమ్=ఈ సోమమును, విశ్వావసుః గన్ధర్వః=విశ్వావసు వనెడి గంధర్వుఁడు, పర్యముష్ణాత్=అంతటను అపహరించెనో, తస్మాత్=ఆ కారణమువలన, అపరిమోషాయ=దొంగిలింపకుండుటకై, ఏవమ్=ఈ పూర్వోక్తవిధముగ ఆహ=(వేదము)చెప్పెను.

తాత్పర్యము: "ప్ర చ్యవస్వ భువస్పతే విశ్వాన్యభి ధామాని మా త్వా పరిపరీ విదత్" ఈ మంత్రముయొక్క మూఁడు భాగములు ఇచట వివరింపఁబడినవి. తాత్పర్యము అర్థమునందే వివరించఁబడినది. ["భువస్పతే" అను సమాసమునందలి 'భూ' శబ్దముచే భూమియందున్న యజమానాధ్వర్యు ప్రభృతులు ఉపలక్షింపఁబడినారు. ఈ మంత్రము ప్రథమ కాండస్థ ద్వితీయ ప్రపాఠకగత నవమానువాకమునందు సంపూర్ణముగ వ్యాఖ్యానింపఁబడినది.]

12. అర్థము: "యజమానస్య స్వస్త్యయన్యసి" ఇతి ఆహ="ఓ సోమమా! నీవు యజమానునకు యజ్ఞమును పొందించుదాన వగుచున్నావు." అని వేదము చెప్పినది. యజమానస్య=యజమానునకు, ఏషః ఏవ=ఈ సోమమే, యజ్ఞస్య=యజ్ఞమునకు, అనవచ్ఛిత్త్యై=విచ్ఛిత్తి లేకుండుటకై, అన్వారమ్భః=అన్వారంభము.

తాత్పర్యము: 'స్వస్త్యయనీ' శబ్దముచేత 'యజమానునకు సోమము యజ్ఞప్రాపకము' అను విషయము వివక్షింపఁబడినదని ఈ బ్రాహ్మణము వివరించినది. స్వస్తి=శ్రేయోరూపః యజ్ఞః. అయనమ్=ప్రాప్తిః, స్వస్త్యయనమ్. స్వస్త్యయనమ్ అస్య=సోమస్య అస్తీతి, 'స్వస్త్యయనీ' యజమానస్య యజ్ఞప్రాపకః సోమః ఇత్యర్థః.

13\. అర్థము: క్రీతః=కొనఁబడినదై, ఉపనద్ధః=మూటకట్టఁబడిన, సోమః యత్=సోమము ఏది కలదో, ఏషః వరుణః వై=ఇది వరుణ రూపమే అయి, యజమానమ్ అభ్యైతి=యజమానున కభిముఖముగా వచ్చుచున్నది. (అతః=ఈ కారణమువలన,) శాన్త్యై=శాంతికొఱకు, "నమో మిత్రస్య వరుణస్య చక్షసే" ఇతి ఆహ="తన కిరణములచే జగత్తు నావరించునదియు, సర్వజ్ఞమునగు సూర్యరూప సోమముకొఱకు నమస్కారము" అని వేదము చెప్పినది.

తాత్పర్యము: క్రయము చేయఁబడిన సోమము మూటగా కట్టఁబడినది. బంధనము పాశరూప మగుటచే వరుణస్వరూపమై వరుణునివలె క్రూర మగును. కావున ఆ క్రూరత్వము శాంతించుటకై ఆ సోమము ఈ మంత్రమున సూర్యరూపముగ స్తుతింపఁబడినది. వరుణ నమస్కారముచే ఉపద్రవము శమించును. సూర్యుఁడు తన కిరణములచే జగత్తును ఆవరించును. సర్వజ్ఞుఁడు. అట్టి సూర్యరూప సోమముకొఱకు నమస్కారము. "మిత్రస్య" "వరుణస్య" అను పదములు చతుర్థ్యర్థమున షష్ఠ్యంతములుగా ప్రయుక్తము లైనవి. వరుణ పదము సూర్య వాచకమైన మిత్ర పదమునకు విశేషణముగా సూర్యార్థ పరముగా సమన్వయింపఁబడినది.

14\. అర్థము: (ఋత్విజః=ఋత్విజులు,) సోమమ్=సోమమును, ఆవహన్తి=(ప్రాచీనవంశమునందలి ఆహవనీయాగ్నియొక్క సమీపమునకు,) తీసికొనివచ్చుచున్నారు. (సః=ఆ సోమము,) అగ్నినా=అగ్నితో, (సమేత్య=కూడి,) ప్రతితిష్ఠతే=ప్రతిష్ఠిత మగుచున్నది. తౌ=ఆ యగ్నీషోములు, (ఇద్దఱు, యదా=ఎప్పుడు,) సంభవన్తౌ=పరస్పరము కలసికొనినవారు అయిరో, (తదా=అప్పుడు,)యజమానమ్ అభి=యజమానుని అభిలక్షించి, సంభవతః=కలసికొనినవారు అగుచున్నారు. పురా=పూర్వము, యః=ఏ యజమానుఁడు, దీక్షితః=యజ్ఞదీక్షితుఁడో, ఏషః=(ఆ) యితఁడు మేధాయై=యజ్ఞముకొఱకు, ఆత్మానమ్=తనను, ఆరభ్య=ఆలంభనము చేసి, చరతి ఖలు వావ=ఆచరించుచున్నాఁడఁట కదా!

తాత్పర్యము: ఋత్విజులు ప్రాచీనవంశ మనెడి యజ్ఞశాలయందలి ఆహవనీయాగ్ని సమీపమునకు సోమమును తీసికొనివచ్చుచున్నారు. ఆ సోమము ఆహవనీయాగ్నితో కూడి ప్రతిష్ఠిత మగుచున్నది. ఆ యగ్నీషోములు పరస్పరము ఎప్పుడు కలసికొనుచున్నారో, అప్పుడు యజమాను నభిలక్షించి సంగతు లగుచున్నారు. పూర్వము యజ్ఞదీక్షితుఁడైన యజమానుఁడు యజ్ఞముకొఱకు తననే ఆలంభనము చేసి అనఁగా పశువునుగా ఉపాకరణము చేసి చరించెడివాఁడఁట!

15\. అర్థము: అగ్నీషోమీయం పశుమ్=అగ్నీషోమ దేవతాక పశువును, ఆలభతే యత్=ఆలంభనము చేయుచున్నాఁ డనుట యేది కలదో, సః=ఆ పశ్వాలంభము, అస్య=ఈ యజమానునకు, ఆత్మనిష్క్రయణః ఏవ=తనను క్రయము చేసికొనుటయే.

తాత్పర్యము: పూర్వము యజ్ఞదీక్షితుఁడు యజ్ఞముకొఱకు తననే పశువునుగా ఉపాకరణము చేసికొనెడివాఁడని పూర్వమంత్రమున చెప్పఁబడి యుండుటచే, యజ్ఞకర్త అగ్నీషోమ దేవతాక పశువును ఆలంభనము చేయుచున్నాఁడనఁగా పశువును అగ్నీషోముల కిచ్చి ఆ అగ్నీషోములనుండి తనను కొనుక్కొనుచున్నాఁడనియే స్పష్ట మగుచున్నది. అనఁగా ఈ యాలంభనము చేయఁబడు పశువు తనకు మూల్యముగా వినియోగింపఁబడినదని యర్థము.

16\. అర్థము: తస్మాత్=ఆ కారణమువలన, తస్య=ఆ పశువుయొక్క, (హవిః=హవిస్సు,)న అశ్యమ్=భక్షింపఁదగినది గాదు. (సః=ఆ పశువు,) పురుష నిష్క్రయణః ఇవ హి=పురుష నిష్క్రయణము వంటిదే కదా!

తాత్పర్యము: ఆలభ్యమాన పశువు పురుషనిష్క్రయణమువంటిది కావున ఆ పశువుయొక్క హవిస్సు భక్షింపఁదగినది కాదు. భక్షించినచో మూల్యనాశము సంభవించును. ఇది పూర్వపక్షము.

17\. అర్థము: అథో=ఈ పూర్వపక్షము సరియైనది కాదు. "ఇన్ద్రః=ఇంద్రుఁడు, అగ్నీషోమాభ్యాం వై=అగ్నీషోమ దేవతల కొఱకే, వృత్రమ్=వృత్రాసురుని, అహన్=సంహరించెను." ఇతి=అని, ఆహుః ఖలు=అభిజ్ఞులు చెప్పచు

న్నారు కదా! అగ్నిషోమీయమ్=అగ్నిషోమ దేవతాకమైన, పశుమ్=పశువును, ఆలభతే యత్=ఆలంభనము చేయుచున్నచో, సః=ఆ పశ్వాలంభము, వార్త్రఘ్నః ఏవ=శత్రుఘాతియే, భవతి=అగుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, ఆశ్యం వై=పశు హవిస్సు భక్షింపఁ దగినదియే.

తాత్పర్యము: పూర్వమంత్రోక్త పూర్వపక్షము సరియైనది కాదు. ఇంద్రుఁడు అగ్నిషోములకొఱకే వృత్రాసురుని సంహరించెనని అభిజ్ఞులు చెప్పుచున్నారు కదా! (ఈ వృత్తాంతము ద్వితీయ కాండస్థ పంచమ ప్రపాఠకమునందలి "త్వష్టా హతపుత్రః" అనెడి అనువాకమునందు వివరించఁబడినది.) అగ్నిషోమీయ పశ్వాలంభము యజమానునియొక్క శత్రువును నశింపఁ జేయునది యగును. కావున ఆలభ్యమాన పశు సంబంధియైన యా హవిస్సు భక్షింపఁదగినదియే యని సిద్ధాంతము.

18. అర్థము: వారుణ్యర్చా=వరుణ మంత్రముచే, పరిచరతి=నమస్కారము చేయవలెను. ఏవం కృతే సతి=ఇట్లు చేయఁబడఁగా, ఏనమ్=ఈ సోమరూప వరుణదేవుని, స్వయైవ దేవతయా=స్వీయదేవతచేతనే, పరిచరతి=పరిచర్య చేయుచున్నవాఁ డగుచున్నాఁడు. (పరిచరణము=నమస్కారాద్యుపచారము.)

తాత్పర్యము: ఉపనద్ధ సోమమునకు వరుణుఁడు దేవత. కావున వరుణ మంత్రముచే నమస్కారము చేయుట యుక్తము. అట్లు చేసినచో స్వీయ దేవతచేతనే పరిచరణము చేసినట్లగును. పిమ్మట ప్రాగ్వంశమునందు (యజ్ఞశాలయందు) ఆసందియందు సోమమును ప్రతిష్ఠాపనచేసి యా సమయమునందే "వనస్వ వరుణం బృహన్తమ్" అను వారుణీ ఋక్కుచేతఁగాని, "తత్త్వా యామి" అను వారుణీ ఋక్కుచేఁగాని అర్చోపస్థానరూప పరిచరణము చేయవలెను.

ఏకాదశానువాకము సమాప్తము.

షష్ఠ కాండమునందు ప్రథమ ప్రపాఠకము పరిసమాప్తము.

# అథ షష్ఠకాణ్డే ద్వితీయః ప్రపాఠకః

## తత్ర ప్రథమోఽనువాకః

### హరిః ఓమ్

మూలము: [1]యదుభౌ విముచ్యాఽఽతిథ్యం గృహ్ణీయాద్యజ్ఞం వి చ్ఛిన్ద్యా ద్యదుభావవిముచ్య యథాఽఽనాగ తాయాఽఽతిథ్యం క్రియతే తాదృగేవ తద్విముక్తోఽన్యోఽనడ్వా న్భవత్యవిముక్తోఽన్యోఽథాఽఽతిథ్యం గృహ్ణాతి యజ్ఞస్య సంతత్యై [2]పత్న్యన్వారభతే పత్నీ హి పారీణహ్యస్యేశే పత్నియైవానుమతం నిర్వ పతి యద్వై పత్నీ యజ్ఞస్య కరోతి మిథునం తదథో పత్నియా ఏవ (౧) ఏష యజ్ఞస్యాన్వా రమ్భోఽనవచ్ఛిత్త్యై [3]యావద్భి ర్వై రాజాఽనుచరై రాగచ్ఛతి సర్వేభ్యో వై తేభ్య ఆతిథ్యం క్రియతే ఛన్దాగ్ంసి ఖలు వై సోమస్య రాజ్ఞోఽనుచరాణ్యగ్నే రాతిథ్యమసి విష్ణవే త్వేత్యాహ గాయ త్రియా ఏవైతేన కరోతి సోమస్యాఽఽతిథ్యమసి విష్ణవే త్వేత్యాహ త్రిష్టుభ ఏవైతేన కరోత్యతిథే రాతిథ్యమసి విష్ణవే త్వేత్యాహ జగత్యై (౨)ఏవైతేన కరోత్యగ్నయే త్వా రాయస్పోషదావ్నే విష్ణవే త్వేత్యాహానుష్టుభ ఏవైతేన కరోతి శ్యేనాయ త్వా సోమభృతే విష్ణవే త్వేత్యాహ గాయత్రియా ఏవై తేన కరోతి [4]పఞ్చ కృత్వో గృహ్ణాతి పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞమేవావ రున్ధే [5]బ్రహ్మవాదినో వదన్తి కస్మాత్సత్యా ద్గాయత్రియా ఉభయత ఆతిథ్యస్య క్రియత ఇతి యదేవాదః సోమమా (౩)అహర త్తస్మాద్గాయత్రియా ఉభయత ఆతిథ్యస్య క్రియతే పురస్తా చ్చోపరిష్టాచ్చ [6]శిరో వా ఏతద్యజ్ఞస్య యదాతిథ్యం నవకపాలః పురోడాశో భవతి తస్మాన్నవధా శిరో విష్యూతం [7]నవ కపాలః పురోడాశో భవతి తే త్రయ స్త్రికపాలా స్త్రివృతా స్తోమేన సంమితా స్తేజ స్త్రివృత్తేజ ఏవ

యజ్ఞస్య శీర్షన్దధాతి [8]నవకపాలః పురోడాశో భవతి తే త్రయస్త్రికపాలా స్త్రివృతా ప్రాణేన సంమితా

స్త్రివృద్వై (౪)ప్రాణ స్త్రివృతమేవ ప్రాణమభిపూర్వం యజ్ఞస్య శీర్షన్దధాతి [9]ప్రజాపతేర్వా ఏతాని

పక్ష్మాణి యదశ్వవాలా ఐక్షవీ తిరశ్చీ యదాశ్వవాలః ప్రస్తరో భవత్యైక్షవీ తిరశ్చీ ప్రజాపతేరేవ తచ్చక్షుః

సంభరతి [10]దేవా వై యా ఆహుతీ రజుహవుస్తా అసురా నిష్కావమాదన్తే దేవాః కార్ష్మర్య మపశ్య

న్కర్మణ్యో వై కర్మైనేన కుర్వీతేతి తే కార్ష్మర్యమయా న్పరిధీన్ (౫)అకుర్వత తైర్వై తే రక్షాగ్ం

స్యపాఘ్నత యత్కార్ష్మర్యమయాః పరిధయో భవన్తి రక్షసా మపహత్యై [11]సగ్ం స్పర్శయతి రక్షసా

మనన్వవచారాయ [12]న పురస్తాత్పరి దధాత్యాదిత్యో హ్యేవోద్య న్పురస్తా ద్రక్షాగ్ంస్యపహ [13]న్యూర్ధ్వే

సమిధావా దధాత్యుపరిష్టాదేవ రక్షాగ్ంస్యప హన్తి [14]యజుషాఽన్యాం తూష్ణీమన్యాం మిథునత్వాయ

[15]ద్వే ఆ దధాతి ద్విపాద్యజమానః ప్రతిష్ఠిత్యై [16]బ్రహ్మవాదినో వదన్తి (౬)అగ్నిశ్చ వా ఏతౌ

సోమశ్చ కథా సోమాయాఽఽతిథ్యం క్రియతే నాగ్నయ ఇతి యదగ్నావగ్నిం మథిత్వా ప్రహరతి

తేనైవాగ్నయ ఆతిథ్యం క్రియతే [17]ఽథో ఖల్వాహు రగ్నిః సర్వా దేవతా ఇతి యద్ధవి రాసాద్యాగ్నిం

మన్థతి హవ్యాయైవాఽఽసన్నాయ సర్వా దేవతా జనయతి(౭)||

[పత్నియా ఏవ జగత్యా ఆ త్రివృద్వై పరిధీ న్వదన్త్యేకచత్వారిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే ప్రథమోఽనువాకః ||(౧)||

## వేదార్థదీపిక

అవతారిక: సోమయాగమున కవసరమైన సోమమును కొని దానిని శకటముపైని ఉంచి ప్రాచీనవంశ మనెడి యజ్ఞశాలకు తీసికొనివచ్చుటవఱకుఁ గల అంశములకు సంబంధించిన మంత్రము లన్నియు ప్రథమ ప్రపాఠకగత బ్రాహ్మణ

భాగముచే వ్యాఖ్యానింపఁబడినవి. యజ్ఞశాలకు తీసికొనిరాఁబడిన సోమము అతిథిగా భావన చేసి అతిథియైన సోమమునకు అతిథి సత్కారమువంటి ఆతిథ్యేష్టికి సంబంధించిన మంత్రములు ప్రథమ కాండగత ద్వితీయ ప్రపాఠకస్థ దశమానువాకమునందు చెప్పఁబడినవి. ఆ మంత్రములకు వ్యాఖ్యాన రూపమైన బ్రాహ్మణభాగము ఈ యనువాకమునఁ జెప్పఁబడుచున్నది.

1. అర్థము: ఉభౌ=రెండు ఎద్దులను, విముచ్య=(శకటమునుండి) విడి(పిం)చి, ఆతిథ్యమ్=ఆతిథ్యకర్మను, గృహ్ణీయాత్ యత్=గ్రహించుచో, యజ్ఞమ్=యజ్ఞమును, విచ్ఛిన్ద్యాత్=(యజమానుఁడు) విచ్ఛిన్నము చేసినవాఁడగును. ఉభౌ=రెండు ఎద్దులను, అవిముచ్య=(శకటమునుండి) విడువక, ఆతిథ్యమ్=ఆతిథ్యకర్మను, గృహ్ణీయాత్ యత్=గ్రహించుచో, అనాగతాయ=రానిదానికై, యథా=ఏ విధముగ, ఆతిథ్యమ్=ఆతిథ్యకర్మ, క్రియతే=చేయఁబడుచున్నదో, తాదృగేవ=అటువంటిదియే, భవతి=అగుచున్నది. తత్=ఆ కారణమువలన, అన్యః అనడ్వాన్=(రెండింటిలో)ఇతరమైన ఒక యెద్దు, విముక్తః=విడువఁబడినది, భవతి=కావలెను. అన్యః=ఇతరమైన (రెండవ)యెద్దు, అవిముక్తః=విడువఁబడనిది, భవేత్=కావలెను. అథ=అనంతరము,(ఆ సమయమునందు) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, సంతత్యై=అవిచ్ఛిత్తికొఱకు, ఆతిథ్యమ్=ఆతిథ్యకర్మను, గృహ్ణాతి=గ్రహించవలెను.

తాత్పర్యము: విక్రేతనుండి సోమమును రెండు ఎద్దులను పూన్చిన శకటముపైని యజ్ఞశాలకు కొనిపోయినపుడు, బండికి కట్టిన రెండు ఎద్దులను విడిచి సోమమునకు ఆతిథ్యకర్మను చేసినచో సోమగమనరూప కర్మ పరిత్యక్తమగును. అనఁగా ఆతిథ్యకర్మ ఉపక్రమింపఁబడినది కావున యజ్ఞమధ్యమునందు యజ్ఞము విచ్ఛిన్న మగును. రెండు ఎద్దులను విడువకయే ఆతిథ్యకర్మ స్వీకరింపఁబడినచో, సోమగమనము సంపూర్ణము కాలేదు కనుక, అనాగతమైన సోమమునకు ఆతిథ్యము చేసిన ట్లగును. కావున ఒక ఎద్దును విడిచి సోమమునకు ఆతిథ్యమును చేయవలెను. ఒక ఎద్దును విడుచుటవలననే సోమ గమనము సంపూర్ణమైనదని భావము. ఒక ఎద్దును విడువకుండుటచే పూర్వకర్మయు పరిత్యక్తము కాదు. అందువలన ఆ సమయమునందు ఆతిథ్యము చేయుటవలన యజ్ఞము విచ్ఛిన్నము కానేరదు. ఇచట ఆతిథ్యము హవిర్నిర్వాప రూపము. ఆతిథ్యము చేయుటకు కాలవిశేషము చెప్పఁబడినది.

2. అర్థము: పత్నీ=యజమానపత్ని, అన్వారభతే=అధ్వర్యు ననుసరించి శకటమును స్పృశించవలెను. పత్నీ=యజమానపత్ని, పారీణహ్యస్య=గృహమునందు ఉండునట్టి వ్రీహ్యాది ద్రవ్యమునకు, ఈశే హి=స్వామిని యగుచున్నది కదా! పత్నియైవ=యజమానపత్నిచేతనే, అనుమతమ్=అనుమతమైన హవిస్సును, నిర్వపతి=(సోమమునకు) నిర్వాపము చేయవలెను. పత్నీ వై=యజమానపత్నియే, యజ్ఞస్య=యజ్ఞమునకు, యత్ వై కరోతి=దేనినైతే చేయుచున్నదో, తత్=అది, మిథునమ్=మిథునము. అథో=మఱియు, పత్నియాః ఏవ=యజమానపత్నియొక్కయే, ఏషః అన్వారమ్భః=ఈ అన్వారంభము, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, అనవచ్ఛిత్త్యై=విచ్ఛిత్తి లేకుండుటకై, (భవతి=కారణమగుచున్నది.)

తాత్పర్యము: సోమమునకు హవి ర్నిర్వాపము చేయు సమయమునందు యజమానపత్ని అధ్వర్యు ననుసరించి శకటమును తాఁకవలెను. పత్ని గృహమునం దుండునట్టి వ్రీహ్యాది ద్రవ్యమునకు యజమానురాలు కదా! పత్ని యజ్ఞమునకు సంబంధించిన కర్మను దేనిని చేసినను యజ్ఞము పురుషుఁడు? (పుంలింగము,)పత్ని స్త్రీ (స్త్రీలింగము)కావున మిథున మగును. మఱియు యజ్ఞాంగమైన శకటమును యజమానపత్ని తాఁకుటవలన యజ్ఞము విచ్ఛిన్నము కాదు. [ఇచట పత్నియొక్క శకట స్పర్శము విధించఁబడినది.]

3. అర్థము: రాజా=రాజు, యావద్భిః అనుచరైః వై=ఎంతమంది అనుచరులతోడనే, ఆగచ్ఛతి=వచ్చుచున్నాఁడో, తేభ్యః సర్వేభ్యః వై=ఆ యందఱు అనుచరులకొఱకే, ఆతిథ్యమ్=అతిథి సత్కారము, క్రియతే=చేయఁబడుచున్నది. సోమస్య రాజ్ఞః=సోమరాజునకు, ఛన్దాంసి=గాయత్ర్యాది ఛందస్సులు, అనుచరాణ్యేవ ఖలు=అనుచరములే కదా!

"అగ్నే రాతిథ్య మసి విష్ణవే త్వా" ఇతి ఆహ="ఓ హవిర్ద్రవ్యమా! నీవు అతిథిరూపాగ్నికి సత్కారరూప మగుచున్నావు. అటువంటి నిన్ను విష్ణు శబ్దాభిధేయమైన సోమముకొఱకు నిర్వాపము చేయుచున్నాను" అని వేదము చెప్పినది. ఏతేన=దీనిచేత, గాయత్రియై ఏవ=గాయత్రీ ఛ్చందస్సుకొఱకే, కరోతి=హవిర్నిర్వాపము చేయుచున్నవాఁ డగుచున్నాఁడు. "సోమస్యాఽఽతిథ్యమసి విష్ణవే త్వా" ఇతి ఆహ="ఓ హవిర్ద్రవ్యమా! నీవు సోమనామకుఁడైన అనుచరునకు సత్కారరూప మగుచున్నావు." అని వేదమంత్రము చెప్పినది. ఏతేన=దీనిచేత, త్రిష్టుభే ఏవ=త్రిష్టుప్ఛందస్సుకొఱకే, కరోతి=హవిర్నిర్వాపము చేయుచున్నవాఁ డగుచున్నాఁడు. "అతిథే రాతిథ్యమసి విష్ణవే త్వా" ఇతి ఆహ="ఓ హవిర్ద్రవ్యమా! నీవు అతిథినామకునికొఱకు సత్కార రూప మగుచున్నావు. అటువంటి నిన్ను విష్ణుశబ్దాభిధేయమైన సోమముకొఱకు నిర్వాపము చేయుచున్నాను. ఏతేన=దీనిచేత, జగత్యై ఏవ=జగతీఛ్చందస్సుకొఱకే, కరోతి=హవిర్నిర్వాపము చేయుచున్నవాఁ డగుచున్నాఁడు. "అగ్నయే త్వా రాయస్పోషదావ్నే విష్ణవే త్వా" ఇతి ఆహ="ఓ హవిర్ద్రవ్యమా! ధనసమృద్ధి నొసఁగునట్టి అగ్నినామకునికొఱకు నిన్ను నిర్వాపము చేయుచున్నాను. నిన్ను విష్ణుశబ్దాభిధేయమైన సోమముకొఱకు నిర్వాపము చేయుచున్నాను." అని వేదమంత్రము చెప్పినది. ఏతేన=దీనిచేత, అనుష్టుభే ఏవ=అనుష్టుప్ఛంద స్సుకొఱకే, కరోతి=హవిర్నిర్వాపము చేయుచున్నవాఁ డగుచున్నాఁడు. "శ్యేనాయ త్వా సోమభృతే విష్ణవే త్వా" ఇతి ఆహ="ఓ హవిర్ద్రవ్యమా! నిన్ను సోమమును భరించునట్టి శ్యేననామకునికొఱకు నిర్వాపము చేయుచున్నాను. నిన్ను విష్ణు శబ్దాభిధేయమైన సోమముకొఱకు నిర్వాపము చేయుచున్నాను."అని వేద మంత్రము చెప్పెను. ఏతేన=దీనిచేత, గాయత్రియై ఏవ=గాయత్రీ ఛ్చందస్సుకొఱకే, కరోతి=హవిర్నిర్వాపము చేయుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: రాజునకు చేయు సత్కారము రాజుయొక్క భృత్యవర్గమునకు కూడ చేయుచుండుట లోకమునందు ఆచార ముగా నున్నది. ఇచట యజ్ఞశాల సమీపమునకు తీసికొనిరాఁబడిన సోమమునకు చేయునట్టి అతిథి సత్కార రూపమైన ఆతిథ్యేష్టి సోమరాజునకు భృత్యులయిన అగ్న్యాదులచే గాయత్ర్యాది ఛ్చందస్సులు అనుచరములుగా నుపలక్షితము లయినవి. కావున "అగ్నే రాతిథ్యమసి విష్ణవే త్వా" ఇత్యాది మంత్రములందు అగ్న్యాదులకు నుద్దేశింపఁబడిన హవిర్నిర్వాపము గాయత్ర్యాది ఛ్చందస్సులకుఁ గూడ చెందునవి యీ బ్రాహ్మణభాగము చెప్పుచున్నది. అగ్ని శబ్దముచే గాయత్రీ ఛ్చందస్సు, సోమ పదముచే త్రిష్టుప్ఛందస్సు, అతిథి శబ్దముచే జగతీ ఛ్చందస్సు, రాయస్పోష దాతయైన అగ్ని శబ్దముచే అనుష్టుప్ఛందస్సు, శ్యేన శబ్దముచే గాయత్రీఛ్చందస్సును ఉపలక్షితము లగుటచే, ఆ యగ్న్యాదులకు నిర్వాపము చేయఁబడునట్టి హవిస్సు గాయత్ర్యాదులకు కూడ నిర్వాపము చేయఁబడుచున్నదని భావము. ఇచట అగ్ని పదము అర్థభేదముచే ఆవృత్త మైనది. అర్థభే దము లేకుండగనే గాయత్రీ పదము ఆవృత్తమైనది. "అగ్నే రాతిథ్యమసి" ఇత్యాది మంత్రములు ఈ బ్రాహ్మణభాగముచే వ్యాఖ్యాతము లైనవి. సోమమునకు, తద్భృత్యులైన అగ్న్యాదులకు, తదుపలక్షితములైన గాయత్ర్యాది ఛ్చందస్సులకును చేయునట్టి హవిర్నిర్వాపమే యిచట అతిథి సత్కారము(ఆతిథ్యేష్టి).

4. అర్థము: పఞ్చకృత్వః=అయిదు పర్యాయములు, గృహ్ణాతి=హవిస్సును గ్రహించవలెను. (నిర్వాపము చేయవలెను.) పఙ్క్తిః=పంక్తి ఛ్చందస్సు, పఞ్చాక్షరా=అయిదక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పురోడాశాది పంచద్రవ్య సాధ్యమైనది. (అతః=ఈ కారణమువలన, యజమానః=యజమానుఁడు,) యజ్ఞమ్=యజ్ఞ(ఫల) మును, అవరున్ద్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము: సోమమునకు నిర్వాపము చేయఁదగిన హవిస్సును అయిదు పర్యాయములు గ్రహించవలెను. పంక్తి ఛ్చందస్సు అయిదక్షరములు కలది. యజ్ఞము పురోడాశాది పంచద్రవ్య సాధ్యమైనది. హవిర్నిర్వాపావృత్తిలోను, పంక్తి

చ్ఛందస్సులోను, యజ్ఞసాధక ద్రవ్యములలోను పంచత్వసంఖ్య సమానముగా నున్నది. ఈ సంఖ్యా సాదృశ్య ముచే అయిదు పర్యాయములు హవిర్నిర్వాపము చేసిన యజమానుఁడు నిశ్చయముగ యజ్ఞఫలము నొందును.

5. అర్థము: కస్మాత్ సత్యాత్=ఏ కారణమువలన, గాయత్రియై=గాయత్రికొఱకు, ఉభయతః=ఆద్యంత రూపములైన రెండిం టియందు, ఆతిథ్యస్య=ఆతిథ్యము, (ప్రథమార్థే షష్ఠీ విభక్తిః) క్రియతే=చేయఁబడుచున్నది?, ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు.(పరస్పరము ప్రశ్నించుకొనుచున్నారు.) యత్=ఏ కారణ మువలన, అదః ఏవ=ఈ గాయత్రీ ఛందస్సే, సోమమ్=సోమమును, ఆహరత్=ద్యులోకమునుండి తెచ్చెనో, తస్మాత్=ఆ కారణమువలన, గాయత్రియై=గాయత్రికొఱకు, పురస్తాత్=మొదట, ఉపరిష్టాత్ చ=చివరను, ఉభ యతః=రెండింటియందు, ఆతిథ్యస్య=ఆతిథ్యము, క్రియతే=చేయఁబడుచున్నది.

తాత్పర్యము: గాయత్రికి ఆతిథ్యేష్టియొక్క ప్రారంభమునందు, అవసానమునందును అతిథి సత్కారము చేయఁబడినదని పూర్వమంత్రమునందు చెప్పఁబడినది. ఎందువలన ఆ విధముగ రెండు పర్యాయములు గాయత్రికి ఆతిథ్య మీయఁబడినది? అని మంత్రజ్ఞులు పరస్పరము ప్రశ్నించుకొనుచున్నారు. గాయత్రీ ఛందస్సే ద్యులోకము నుండి సోమమును తెచ్చినది. కావున గాయత్రికి సోమమునకు చేయునట్టి ఆతిథ్యేష్టియొక్క ఆరంభము నందు, అవసానమునందు ఆతిథ్యము చేయఁబడినదని సమాధానము. గాయత్రీ ఛందస్సు ద్యులోకమునుండి సోమమును తెచ్చినవిధము పూర్వము వివరించఁబడినది.

6. అర్థము: ఆతిథ్యం యత్=అతిథి సత్కార రూపమైన ఆతిథ్యేష్టి యేది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, శిరః వై=శిరస్సువంటి ఉత్తమాంగమే. పురోడాశః=పురోడాశము, నవకపాలః=నవకపాల సంస్కృతముగా, భవతి=ఉండవలెను. తస్మాత్=ఆ కారణమువలన, శిరః=శిరస్సు, నవధా=తొమ్మిది కపాలములచే, విష్యూ తమ్=విశేషముగా కూర్చఁబడినది.

తాత్పర్యము: ఆతిథ్యేష్టి సత్కారరూప మగుటవలన శిరస్సువలె అది యజ్ఞమునకు ఉత్తమాంగము. ఇచట సోమమునకు సమర్పించు పురోడాశమే సత్కారద్రవ్యము. తొమ్మిదికపాలములందు సంస్కృతమైన పురోడాశము నిర్వా పము చేయవలయును. కావున దృష్టాంతభూత శిరస్సు కూడ నవకపాలములచే విశేషముగా నిర్మితమైనదని చెప్పఁబడినది. నవకపాల సంస్కృత పురోడాశ నిర్వాప మిచట విహిత మైనది.

7. అర్థము: పురోడాశః=పురోడాశము, నవకపాలః=నవకపాల సంస్కృతమై, భవతి=ఉండవలెను. తే త్రయః త్రిక పాలాః=ఆ మూఁడు త్రికపాలములు, త్రివృతా=త్రివృత్ అనెడి స్తోమముతో, సమ్మితాః=సమానములైనవి. త్రివృత్=త్రివృత్ స్తోమము, తేజః=తేజోరూపము. (అతః=ఈ కారణమువలన, యజమానః=యజమానుఁడు,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, శీర్షన్=శిరోరూపమైన ఆతిథ్యమునందు, తేజః ఏవ=తేజస్సునే, దధాతి=స్థాపించి నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: త్రివృత్ స్తోమమునందు మూఁడు సూక్తములు కలవు. ఒక్కొక్క సూక్తమునందు మూఁడేసి ఋక్కులు కలవు. కావున త్రివృత్ స్తోమమునకు నవత్వ సంఖ్య ఏర్పడినది. ఒక్క కపాలమునందు పురోడాశము సంస్కృతమై యున్నచో, అది ఏకకపాల మగును. అట్టి కపాలములు మూఁడు అయినచో, అవి త్రికపా లములగును. అట్టి త్రికపాలములు మూఁడు ఉన్నచో మొత్తము కపాలగతసంఖ్య తొమ్మిది యగును. ఈ విధముగ నవకపాలములు త్రివృత్ స్తోమముతో సంఖ్యావిషయమున సమానము లగుటచే నవకపాల సంస్కృత పురోడాశమునకు త్రివృద్రూపత్వము ప్రాప్తమైనది. త్రివృత్ స్తోమము ప్రజాపతి ముఖమునుండి అగ్నితో కూడ పుట్టుటచే త్రివృత్తు తేజోరూపమైనది. ఈ విధముగ యజ్ఞ శిరోరూపమైన యాతిథ్యమునందు తేజస్సు స్థాపిత మైనది. (ఇచట నవకపాల పురోడాశము ప్రశంసింపఁబడినది.)

8. అర్థము: పురోడాశః=పురోడాశము, నవకపాలః=నవకపాల సంస్కృతమైనదిగా భవతి=ఉండవలెను. తే త్రయః=ఆ మూఁడు, త్రికపాలాః=మూఁడు కపాలములచే సంస్కృతమైన పురోడాశములు, త్రివృతా ప్రాణేన=(ఊర్ధ్వాధో మధ్య వృత్తులచే,) త్రిగుణమైన ప్రాణముతో, సమ్మితాః=సమానములైనవి. ప్రాణః=ప్రాణవాయువు, త్రివృత్ వై=త్రిగుణాత్మకమే. త్రివృతమ్=త్రిగుణమైన, ప్రాణమేవ=ప్రాణవాయువునే, అభిపూర్వ్యమ్=అనుక్రమముగ, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, శీర్షన్=శిరస్థానీయమైన ఆతిథ్యమునందు, దధాతి=స్థాపించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: సోమమునకు ఆతిథ్యముగ నీయఁదగిన పురోడాశము నవకపాల సంస్కృతమై యుండవలెను. మూఁడు కపాలములచే సంస్కృతమైన పురోడాశములు త్రిసంఖ్యాకములు. అట్టి పురోడాశములు మూఁడు అగుటచే, మొత్తము నవకపాల పురోడాశ మగును. ప్రాణవాయువు ఊర్ధ్వాధోమధ్య వృత్తులచే త్రిగుణ మగును. కావున త్రికపాలగత త్రివృత్త్వముతో ప్రాణగత త్రివృత్త్వము సమాన మైనది. లేదా-నవచ్ఛిద్రములందు సంచరించుచున్న ప్రాణవాయువు నవసంఖ్యాక మగును. దానిని మూఁడుగా విభాగము చేసినచో ప్రకృత నవకపాల సాదృశ్య మేర్పడుచున్నది. ఇట్టి నవకపాల పురోడాశము నాతిథ్యముగా నొసఁగిన యజమానుఁడు అనుక్రమముగ నటువంటి ప్రాణమును యజ్ఞశిరోరూపమైన యాతిథ్యమునందు స్థాపించినవాఁ డగుచున్నాఁడు. (త్రిభిః కపాలైః సంస్కృతః పురోడాశః=త్రికపాలః. ఇచట నవకపాల పురోడాశము ననువదించి ప్రశంస చేయఁబడినది.)

9. అర్థము: అశ్వవాలాః యత్=తెల్లు అనెడి దర్భవిశేషములు ఏవి కలవో, ఏతాని=ఇవి, ప్రజాపతేః=ప్రజాపతియొక్క, పక్ష్మాణి వై=కంటిరెప్పవెంట్రుకలే. ఇక్షవీ=ఇక్షుపత్రికలు (తెల్లుయొక్క ఆకులు), తిరశ్చీ=(ప్రజాపతియొక్క) కంటిరెప్పలు. ప్రస్తరః=ప్రస్తరము, అశ్వవాలః=తెల్లు అనెడి దర్భవిశేషములచే చేయఁబడినది, భవతి యత్=అయినచో, తిరశ్చీ=ప్రస్తరమునకు క్రిందిభాగమున ఉండునట్టి విధృతులు, ఇక్షవీ=తెల్లు అను దర్భలవిశేషములచే చేయఁబడినవి, భవతః యత్=అగుచున్నచో, ప్రజాపతేః=ప్రజాపతియొక్క, తత్ చక్షుః ఏవ=ఆ చక్షువే, సంభరతి=సంపాదింపఁబడిన దగుచున్నది.

తాత్పర్యము: కాశములు(తెల్లు)అను దర్భవిశేషములు ప్రజాపతియొక్క కంటి వెంట్రుకలే. కంటికి క్రిందను, పైభాగమునను ఉండునట్టి రెప్పలు. ఇక్షవీ=కాశమయములు. ప్రస్తరము తెల్లుతో చేయఁబడినదిగాను, విధృతులు కాశమయములుగాను ఉన్నచో ప్రజాపతియొక్క చక్షుస్సే సంపాదింపఁబడిన దగును. (ఈ యాతిథ్యేష్టియందు ఉపయోగింపఁబడు ప్రస్తరము, విధృతులు తెల్లు అనెడి దర్భలతో చేయఁబడినవిగా నుండవలెనని యిచట చెప్పఁబడినది. ప్రకృతియాగమునందు ప్రస్తర విధృతులు కుశమయములుగా నుండును. ఈ ప్రస్తర విధృతులు ప్రథమకాండమునందు వివరింపఁబడినవి. ప్రస్తరమునకు క్రింద అడ్డముగా ఉంచఁబడునట్టి రెండు దర్భవిశేషములు(కాశములు.) విధృతులు.)

10. అర్థము: దేవాః=దేవతలు, యాః ఆహుతీః=ఏ యాహుతులను, అజుహవుః=హోమము చేసిరో, తాః వై=ఆ యాహుతులనే, అసురాః=అసురులు, నిష్కావమ్=నిశ్శబ్దముగా, ఆదన్=భక్షించిరి. తే దేవాః=ఆ దేవతలు, కార్ష్మర్యమ్=శ్రీవర్ణవృక్షమును, (మారేడు) అపశ్యన్=చూచిరి. కర్మణ్యః వై=కార్ష్మర్య వృక్షము కర్మకు యోగ్యమైనదియే. ఏనేన=దీనిచే, కర్మ=కర్మను, కుర్వీత ఇతి=చేయవలెనని, తే=ఆ దేవతలు, కార్ష్మర్యమయాన్=శ్రీవర్ణమయములైన, పరిధీన్=పరిధులను, అకుర్వత=చేసిరి. తైః వై=ఆ కార్ష్మర్యమయ పరిధులచేతనే, రక్షాంసి=రాక్షసులను, అపాఘ్నత=పోఁగొట్టిరి. పరిధయః=పరిధులు, కార్ష్మర్యమయాః=మారేడుచెట్టునకు సంబంధించినవి, భవన్తి యత్=అగుచున్నయెడల, తే=ఆ పరిధులు, రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=తొలఁగింపుకొఱకు, భవన్తి=కారణము లగుచున్నవి.

తాత్పర్యము: దేవతలు హోమము చేసిన ఆహుతులను రాక్షసులు నిశ్శబ్దముగ(దేవతలకు తెలియకుండ చౌర్యము చేసి,) భక్షించిరి. అప్పుడు దేవతలు మారేడు చెట్టును రాక్షస నివారకముగా తెలిసికొని, అది కర్మయోగ్య మని నిశ్చయించి ఆ మారేడుకట్టచే పరిధులను చేసి, యా పరిధులచేతనే రాక్షసులను తొలఁగించిరి. కావున కార్ష్మర్యమయ పరిధులు రక్షోనివారణమునకు కారణము లగును.(ఇచట పరిధులకు శ్రీపర్ణమయత్వము విధింపఁబడినది. పరిధులు ప్రథమకాండమునందు వివరింపఁబడినవి.)

11. అర్థము: రక్షసామ్=రాక్షసులయొక్క, అనన్వవచారాయ=సంచారము లేకుండుటకై, సంస్పర్శయతి=మధ్యమ పరిధిని దక్షిణోత్తర పరిధులతో తాఁకించవలెను.

తాత్పర్యము: రాక్షసులు సంచరింపకుండుటకై దక్షిణోత్తరపరిధులతో మధ్యమపరిధిని తాఁకించవలెను.(స్పర్శము లేనిచో పరిధుల సంధియందు రాక్షసులు ప్రవేశింతురు.)

12. అర్థము: పురస్తాత్=తూర్పుదిక్కునందు, న పరిదధాతి=పరిధి నుంచరాదు. ఆదిత్యః=సూర్యుఁడు, ఉద్యన్నేవ=ఉదయించుచునే, పురస్తాత్=తూర్పుదిక్కునందు, రక్షాంసి=రాక్షసులను, అపహన్తి హి=పోఁగొట్టుచున్నాఁడు కదా!

తాత్పర్యము: తూర్పుదిక్కునందు రక్షః ప్రవేశ నివారణమునకై (చతుర్థ)పరిధి నుంచరాదు. తూర్పుదిక్కునందు సూర్యుఁడుదయించుచునే రాక్షసులను పోఁగొట్టుచున్నాఁడు కదా!(ఇచట చతుర్థ పరిధి నిషేధించఁబడినది.)

13. అర్థము: ఊర్ధ్వే=ఊర్ధ్వ దిగగ్ర భాగమునందు, సమిధౌ=(రెండు) సమిధలను, ఆదధాతి=ఉంచవలెను. (తేన=ఆ సమిదాధానముచేత, యజమానః=యజమానుఁడు,) ఉపరిష్టాత్ ఏవ=అంతరిక్షమునందే, రక్షాంసి=రాక్షసులను, అపహన్తి=పోఁగొట్టుచున్నాఁడు.

తాత్పర్యము: అంతరిక్షమునందలి రాక్షసులను నివారించుటకు అంతరిక్షమునందు సమిధలను స్థాపించవలెనని చెప్పబడుచున్నది. ఆకాశమున సమిదాధానము చేయుట సాధ్యము కాదు కావున అంతరిక్షగత రాక్షస నివారణమునకై ఆహవనీయాగ్నికి పూర్వభాగమునందు (రెండు) ఆఘార సమిధల నుంచవలెను. ఈ యాధానముచే యజమానుఁడు అంతరిక్షమునందే రాక్షసులను నివారింపఁగలవాఁ డగును. (ఇచట ఆహవనీయ పూర్వభాగమునందు రెండు ఆఘారసమిధల స్థాపనము విహిత మైనది. "సమిధౌ" అను ద్వివచనాంతముచే రెండు సమిధలని యర్థము గ్రహించఁబడినది.)

14. అర్థము: మిథునత్వాయ=మిథునత్వముకొఱకు, యజుషా=మంత్రముచే, అన్యామ్=ఇతరమైన ఒక సమిధను, తూష్ణీమ్=మంత్ర రహితముగ, అన్యామ్=ఇతర సమిధను, ఆదధ్యాత్=ఉంచవలెను.

తాత్పర్యము: 12 వ మంత్రముచే విహితము లయిన రెండు సమిధలలో ఒక సమిధను "వీతిహోత్రం త్వా కవ" ఇత్యాది మంత్రము నుచ్చరించుచు, ఇంకొక సమిధను మంత్ర రహితముగను ఆధానము చేయవలెను. (దక్షిణ సమిధను సమంత్రకముగను, ఉత్తర సమిధను అమంత్రకముగను ఉంచవలెను.) సమంత్రకామంత్రకములు స్త్రీపురుష లక్షణము లగుటచే దీనివలన మిథునత్వము సిద్ధించును. సమిదాధానమునందలి విశేషాంశ మిచట విహిత మైనది.

15. అర్థము: ద్వే=రెండు సమిధలను, ఆ దధాతి=ఆధానము చేయవలెను. యజమానః=యజమానుఁడు, ద్విపాత్=రెండు పాదములు కలవాఁడు. (ఏతత్=ఈ సమిద్ద్వయాధానము,) ప్రతిష్ఠిత్యై=ప్రతిష్ఠకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: రెండు సమిధల నాధానము చేయవలెను. యజమానుఁడు రెండు పాదములు కలవాఁడు కావున ఈ ద్విత్వసంఖ్య యజమాన ప్రతిష్ఠకు కారణ మగుచున్నది.(ఇచట సమిత్సంఖ్య విహిత మైనది.)

16. అర్థము: అగ్నిశ్చ=అగ్నియు, సోమశ్చ=సోముఁడును, ఏతౌ వై=ఈ ఉభయ దేవతలుకూడ (యాగనిర్వాహకౌ దేవౌ=యాగమును నిర్వహించునట్టి దేవతలు.) కథా=ఎందుకు సోమాయ=సోమదేవతకొఱకు, ఆతిథ్యమ్=ఆతిథ్యము, క్రియతే=చేయఁబడుచున్నది? అగ్నయే=అగ్ని కొఱకు, న క్రియతే=చేయఁబడుట లేదు?, ఇతి=అని, బ్రహ్మ

వాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=భాషించుచున్నారు. అగ్నిమ్=అగ్నిని, మథిత్వా=మథించి, అగ్నౌ=ఆహవనీయాగ్ని యందు, ప్రహరతి యత్=పడవేయుచో, తేనైవ=ఆ మథితాగ్నిని ఆహవనీయమునందు పడవేయుటచేతనే, అగ్నయే=అగ్నికొఱకు, ఆతిథ్యమ్=ఆతిథ్యము, క్రియతే=చేయఁబడుచున్న దగుచున్నది.

తాత్పర్యము: అగ్నీషోములు ఉభయులును యజ్ఞనిర్వాహక దేవతలు కదా! ఆ దేవతలలో సోమదేవతకు మాత్రము ఆతిథ్యము చేసి, అగ్నిదేవతకు చేయకుండుట ఎందుకు? అని మంత్రజ్ఞులు పరస్పరము భాషించుకొనుచున్నారు. ఆతిథ్యేష్టిమధ్యమందు అగ్నిని మథించి యా మథితాగ్నిని ఆహవనీయమునందు వేయవలెను. ఆ విధముగ నాహవనీయమునందు మథితాగ్ని నుంచినచో ఆ మథితాగ్నిని ప్రక్షేపించుటచేతనే అగ్నికి ఆతిథ్యము చేసిన ట్లగును. (ఇచట ఆతిథ్యేష్టిమధ్యమందు వహ్నిమంథనపూర్వకముగ ఆహవనీయమునందు మథితాగ్ని ప్రక్షేపము విధించఁబడినది.)

17. అర్థము: అథో=మఱియు, అగ్నిః=అగ్ని, సర్వాః దేవతాః ఇతి=ఏకతాన, ద్వితాన, త్రితాన రూప సర్వ దేవతాత్మకుఁడని, ఆహుః ఖలు=మంత్రజ్ఞులు చెప్పుకొనిరి కదా! హవిః=ఆతిథ్య పురోడాశరూప హవిస్సును, ఆసాద్య=వేదియందుంచి, మన్థతి యత్=(ఆ సమయమున)అగ్నిని మథించుచో, ఆసన్నాయ హవ్యాయైవ=వేదియందు ఆసన్నమైయున్న పురోడాశ హవిస్సుకొఱకే, సర్వాః దేవతాః=సర్వదేవతలను, జనయతి=పుట్టించుచున్నాఁడు.

తాత్పర్యము: మఱియు ఈ బ్రహ్మవాదులు కాలవిషక్ష కలవారై దానికి ఉపోద్ఘాతముగ అగ్నికి సర్వదేవతాత్మకత్వమును చెప్పిరి. ఆతిథ్య పురోడాశమును వేదియందుంచి ఆ సమయమున అగ్నిని మథించవలెను. ఆ విధముగ మథ్యమానాగ్నియందు అంతర్భూతులైయున్న ఏకతాన ద్వితాన త్రితానరూప దేవత లందఱును ఆసన్న పురోడాశహవిస్సును భుజించుటకు ఉత్పాదితులగుచున్నారు. అందువలన మంథనకాలము అదియే అని యర్థము. "ఏకతాయ స్వాహా" అను సన్నివేశమునందు ఏకతానాది సర్వదేవతలను గూర్చి పూర్వము విస్తరించఁబడినది. అధ్వర్యుఁడు పఠించవలసిన మంథన మంత్రములు అగ్నీషోమీయ ప్రస్తావమునందు చెప్పఁబడినవి. హోత పఠింపవలసిన మంత్రములు బహ్వృచ బ్రాహ్మణమునందు ఆతిథ్యేష్టి సమీపమున ఉదాహరింపఁబడినవి. (ఇచట మంథనకాలము విహిత మైనది.)

ప్రథమానువాకము సమాప్తము.

# అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః

మూలము: [1]దేవాసురాః సంయత్తా ఆసన్తే దేవా మిథో విప్రియా ఆసన్తే౽న్యోఽన్యస్మై జ్యైష్ఠ్యాయాతిష్ఠమానాః పఞ్చధా వ్యక్రామన్నగ్ని ర్వసుభిః సోమో రుద్రై రిన్ద్రో మరుద్భిర్వరుణ ఆదిత్యై ర్బృహస్పతి ర్విశ్వై ర్దేవై స్తేఽమన్యన్తాసురేభ్యో వా ఇదం భ్రాతృవ్యేభ్యో రధ్యామో యన్మిథో విప్రియాః స్మో యా న ఇమాః ప్రియా స్తనువస్తాః సమవద్యామహై తాభ్యః స నిర్ ఋచ్ఛాద్యః(౧)నః ప్రథమో౽న్యోన్యస్మై ద్రుహ్యాదితి తస్మాద్యః సతానూనప్త్రిణాం ప్రథమో ద్రుహ్యతి స ఆర్తిమార్ఛతి [2]యత్తానూనప్త్రగ్ం సమవద్యతి భ్రాతృవ్యాభిభూత్యై భవత్యాత్మనా పరాఽస్య భ్రాతృవ్యో భవతి [3]పఞ్చ కృత్వో ఽవ ద్యతి పఞ్చధా హి తే తత్సమవాద్యన్తాథో పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞమేవావ రున్ధే [4]ఆపతయే త్వా గృహ్ణామీత్యాహ ప్రాణో వై (౨)ఆపతిః ప్రాణమేవ ప్రీణాతి పరిపతయ ఇత్యాహ మనో వై పరిపతిర్మన ఏవ ప్రీణాతి తనూనప్త్ర ఇత్యాహ తనువో హి తే తాః సమవా ద్యన్త శాక్వరాయేత్యాహ శక్త్యై హి తే తాః సమవాద్యన్త శక్మ న్నోజిష్ఠాయేత్యా హౌజిష్ఠగ్ం హి తే తదాత్మనః సమవాద్యన్తా [5]నాధృష్ట మస్యనాధృష్య మిత్యాహానాధృష్టగ్ం హ్యేతదనాధృష్యం దేవానా మోజః (3)ఇత్యాహ దేవానాగ్ం హ్యేతదోజోఽభిశస్తిపా అనభిశస్తేన్య మిత్యాహాభిశస్తిపా హ్యేతదన భిశస్తేన్య [6]మను మే దీక్షాం దీక్షాపతి ర్మన్యతా మిత్యాహ యథాయజురేవైత [7]ద్ఘృతం వై దేవా వజ్రం కృత్వా సోమ మఘ్నన్నన్తికమివ ఖలు వా అస్యైతచ్చరన్తి యత్తానూనప్త్రేణ ప్రచర [8]న్త్యగ్ంశు రగ్ంశు స్తే దేవ సోమాఽఽప్యాయతామిత్యాహ యత్ (౪)ఏవాస్యాపువాయతే యన్మీయతే తదే

వాస్యైతేనాఽఽప్యాయయత్యా తుభ్యమిన్ద్రః ప్యాయతామా త్వమిన్ద్రాయ ప్యాయస్వేత్యాహోభా వేవేన్ద్రం చ సోమం చాఽఽప్యాయయత్యా ప్యాయయ సఖీన్సన్యా మేధయేత్యాహర్త్విజో వా అస్య సఖాయ స్తానేవాఽఽప్యాయయతి స్వస్తి తే దేవ సోమ సుత్యా మశీయ (౫)ఇత్యాహాఽఽశిష మేవైతామా శాస్తే [9]ప్ర వా ఏతే ఽస్మాల్లోకా చ్చ్యవన్తే యే సోమ మాప్యాయయన్త్యన్తరిక్ష దేవత్యో హి సోమ ఆప్యాయిత ఏష్టా రాయః ప్రేషే భగాయేత్యాహ ద్యావాపృథివీభ్యామేవ నమస్కృత్యాస్మిం ల్లోకే ప్రతితిష్ఠన్తి [10]దేవాసురాః సంయత్తా ఆసన్తే దేవా బిభ్యతోఽగ్నిం ప్రావిశ న్తస్మాదాహు రగ్నిః సర్వా దేవతా ఇతి తే (౬)అగ్నిమేవ వరూథం కృత్వాఽసురా నభ్యభవ న్నగ్నిమివ ఖలు వా ఏష ప్ర విశతి యో ఽవాన్తరదీక్షా ముపైతి భ్రాతృవ్యాభిభూత్యై భవత్యాత్మనా పరాఽస్య భ్రాతృవ్యో భవ [11]త్యాత్మానమేవ దీక్షయా పాతి ప్రజా మవాన్తరదీక్షయా [12]సంతరాం మేఖలాగ్ం సమాయచ్ఛతే ప్రజా హ్యేత్మనోఽన్తరతరా తప్తవ్రతో భవతి మదన్తీభి ర్మార్జయతే నిర్హ్యగ్నిః శీతేన వాయతి సమిద్ధ్యై [13]యా తే అగ్నే రుద్రియా తనూ రిత్యాహ స్వయైవైన ద్దేవతయా వ్రతయతి సయోనిత్వాయ శాన్త్యై(౭)

[యో వా ఓజ ఆహ యదశీయేతి తేఽగ్న ఏకాదశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః ||(౨)||

## వేదార్థదీపిక

అవతారిక: ప్రథమానువాకమునందు ఆతిథ్యేష్టికి సంబంధించిన మంత్రములకు బ్రాహ్మణము చెప్పఁబడినది. ఈ ద్వితీయానువాకమునందు తానూనప్త్రేష్టిని గుఱించి వివరింపఁబడుచున్నది. ఈ యనువాకమునందలి బ్రాహ్మ

ణము ప్రథమ కాండస్థ ద్వితీయ ప్రపాఠకగత దశమానువాక మంత్రములకు, ఏకాదశానువాకమునందలి కొన్ని మంత్రములకును వ్యాఖ్యాన రూపము.

1. అర్థము: దేవాసురాః=దేవతలు రాక్షసులు, సంయత్తాః=సంగ్రామమును పొందినవారు, ఆసన్=అయిరి. తే దేవాః=ఆ దేవతలు, మిథః=పరస్పరము, విప్రియాః=విరోధులు, ఆసన్=అయిరి. తే=వారు, అన్యోన్యస్మై=ఒండొరునికొఱకు, జ్యైష్ఠ్యాయ=జ్యేష్ఠత్వమునకై, అతిష్ఠమానాః=సుముఖులుగా ఉండనివారై, పఞ్చధా=ఐదువిధములుగా, వ్యక్రామన్=వ్యూహములు కలవా రైరి. (తేషు=వారిలో,) అగ్నిః=అగ్ని, వసుభిః=వసువులతోడను, సోమః=సోముఁడు, రుద్రైః=రుద్రులతోడను, ఇన్ద్రః=ఇంద్రుఁడు, మరుద్భిః=మరుద్గణములతోడను, వరుణః=వరుణుఁడు, ఆదిత్యైః=ఆదిత్యులతోడను, బృహస్పతిః=బృహస్పతి, విశ్వైః దేవైః=విశ్వేదేవ దేవతలతోడను, (పఞ్చవ్యూహాః=అయిదు వ్యూహములు కలవారు, అభవన్=అయిరి.) "మిథః=పరస్పరము, విప్రియాః స్మః యత్=విరోధులముగా ఉంటున్నవార మగుచున్నచో, ఇదమ్=ఈ జయరూప కార్యమును (వయమేవ=మనమే,) భ్రాతృవ్యేభ్యః=శత్రువులైన, అసురేభ్యః వై=రాక్షసులకొఱకే, రాధ్యామః=సాధించుదుము" (ఇతి=అని,) తే=ఆ దేవతలు, అమన్యన్త=తలఁచిరి. నః=మనయొక్క, యాః ప్రియాః తనువః=ఇష్టులైన పుత్ర భార్యాది రూప బంధువు లెవరు, (సన్తి=కలరో,) తాః=వారిని, సమవద్యామహై=(ఒకచోట) సమావేశపఱచుదము. (సంఘముగా నేర్పఱచుదము.) "నః=మనలో, యః ప్రథమః అన్యోఽన్యస్మై ద్రుహ్యాత్=మొదట ఎవఁడు ఒండొరునికొఱకు ద్రోహము చేయునో, సః=వాఁడు, తాభ్యః=ఆ సంఘటితులైన బంధువులనుండి, నిర్ఋచ్ఛాత్=తొలఁగిపోవలెను." (బహిష్కృతుఁడు కావలెను.) ఇతి=అని, (శపథమ్ అకుర్వన్=శపథమును చేసిరి.) తస్మాత్= ఆ కారణమువలన, (లోకేఽపి=లోకమునందు కూడ, సతానూనప్త్రిణామ్=శపథము చేసినవారిలో, ప్రథమః యః=మొదట ఎవఁడు, ద్రుహ్యతి=ద్రోహము చేయునో నః=వాఁడు, ఆర్తిమ్=దుఃఖమును, ఆర్చ్ఛతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వము దేవతలు తమలో ఒకరియొక్క ఆధిక్యమును ఇంకొకరు అంగీకరింపక విరోధమును వహించి అయిదు వ్యూహములుగా నేర్పడిరి. వారిలో వసుగణములకు అగ్ని, రుద్రగణములకు సోముఁడు, మరుద్గణములకు ఇంద్రుఁడు, ఆదిత్యులకు వరుణుఁడు, విశ్వేదేవ దేవతలకు బృహస్పతియు సేనానులుగా నుండిరి. "మనలో మనము పరస్పరము విరోధులముగా నున్నచో మన శత్రువులైన యసురులకు జయమును కలుఁగఁజేసినవార మగుదుము." అని దేవతలు తలఁచి తమ బంధువులనందఱిని సంఘటితపఱచి "మనలో ప్రథమమున ఎవఁడు ఇతరునకు ద్రోహము చేయునో వానిని మన సంఘమునుండి బహిష్కరించవలెను." అని శపథము చేసిరి. కావుననే లోకమునందు కూడ శపథము చేసినవారిలో ఎవఁడు ప్రథమమున ద్రోహము చేయునో, వాఁడు వినాశమును పొందుచున్నాఁడు. [తనువః=బంధువులు. తానూనప్త్రిణః=శపథము చేసినవారు. సమానే=ఏకస్మిన్ విషయే, తానూనప్త్రిణః=శపథవన్తః, సతానూనప్త్రిణః.]

2. అర్థము: తానూనప్త్రమ్=తానూనప్త్ర మనెడి ఆజ్యమును, సమవద్యతి యత్=సంఘటితముగ అవదానము చేయుచున్నచో, (తత్=ఆ యవదానము,) భ్రాతృవ్యాభిభూత్యై=శత్రుపరాజయముకొఱకు, భవతి=కారణ మగుచున్నది. (సః=ఆ యజమానుఁడు,) ఆత్మనా=స్వయముగా, భవతి=ఐశ్వర్యవంతుఁ డగుచున్నాఁడు. అస్య=ఈ యజమానునియొక్క, భ్రాతృవ్యః=శత్రువు, పరా భవతి=తిరస్కృతుఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఆతిథ్యేష్టి చేయు యజమానుఁడు సంఘటితముగ నవదానము చేయవలెను. అట్టి యవదానము శత్రుపరాభవమునకు కారణ మగును. ఈ విధముగ చేసిన యజమానుఁడు స్వయముగ ఐశ్వర్యవంతుఁ డగును. ఇతని శత్రువు పరాభూతుఁ డగును. [తనూనప్తృ సంజ్ఞక జఠరాగ్ని విషయమైన శపథకర్మకు హేతువైన

ఆజ్యము తానూనప్త్రి మనఁబడును. ఆ తానూనప్త్రాజ్యముయొక్క అవదానము ఇచట విహిత మైనది. పూర్వమంత్రమునందు ఏతత్ప్రశంస చేయఁబడినది.]

3. అర్థము: పఞ్చకృత్వః=అయిదు పర్యాయములు, అవద్యతి=తానూనప్త్రాజ్యమును అవదానము చేయవలెను. తే=ఆ దేవతలు, తత్=అప్పుడు, పఞ్చధా=అయిదు విధములుగా, (విభక్తాః=విడిపోయినవారై, పశ్చాత్=పిమ్మట,) సమవాద్యన్త హి=కలసి తమవారి నందఱిని ఒక సంఘముగా స్థాపించిరి కదా! అథో=మఱియు, పఙ్క్తిః=పంక్తి చ్ఛందస్సు, పఞ్చాక్షరా=అయిదక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పురోడాశాది పంచద్రవ్యసాధ్య మైనది. (అతః=ఈ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) యజ్ఞమ్=యజ్ఞఫలమును, అవరున్ధే ఏవ=నిశ్చయముగా పొందుచున్నాఁడు.

తాత్పర్యము: యజమానుఁడు హోమము చేయుటకై ఆజ్యపాత్రమునందు ఆజ్యమును అయిదు పర్యాయము లవదానము చేయవలెను(తీసికొనవలెను). అప్పుడు దేవతలు అయిదు వ్యూహములుగా విడిపోయి పిమ్మట దారాపుత్రా దులను ఒకచోట సమావేశపఱచి ఒక సంఘముగా నేర్పఱచిరి కదా! మఱియు పంక్తి చ్ఛందస్సునకు అయిదక్షరములు కలవు. యజ్ఞము పురోడాశాది పంచద్రవ్యసాధ్య మైనది. అయిదు విధములుగా విడిపోయిన దేవతలు ప్రియతనువులను(ఇష్టులైన దారాపుత్రాదులను) ఒక సంఘముగా నేర్పఱచిరి. అయిదక్షరములు కల పంక్తిచ్ఛందస్సు ఒకటిగా నున్నది. యజ్ఞము పంచద్రవ్య సాధ్యము. ఈ విధముగ పంచత్వ సంఖ్యా సామ్యము ననుసరించి తానూనప్త్రాజ్యమును అయిదు పర్యాయము లవదానము చేయవలెనని చెప్పఁబడినది. ఇట్లు చేయుటచే యజమానుఁడు నిశ్చయముగ యజ్ఞఫలము నొందును.

4. అర్థము: "ఆపతయే త్వా గృహ్ణామి" ఇతి ఆహ="ఓ ఆజ్యమా! ప్రాణముకొఱకు నిన్ను ఈ పాత్రమునందు గ్రహిం చుచున్నాను." అని వేదమంత్రము చెప్పినది. ప్రాణః వై=ప్రాణమే, ఆపతిః=ఆపతి శబ్దార్థము. (ఆపతిః నిశ్వాసరూపేణ బహిర్గతః పునః అభిముఖ్యేన పతతీతి ఆపతిః=ప్రాణః. నిశ్వాస రూపమున బహిర్గతమై మఱల అభిముఖముగ లోపలకు పోవుచున్నది ప్రాణమని వ్యుత్పత్త్యర్థము.) ప్రాణమేవ=ప్రాణమునే, ప్రీణాతి=సంతో షపఱచుచున్నాఁడు. "పరిపతయే" ఇతి ఆహ="ఓ ఆజ్యమా! నిన్ను మనస్సుకొఱకు గ్రహించుచున్నాను." అని వేదమంత్రము చెప్పినది. మనః వై=మనస్సే, పరిపతిః=పరిపతి శబ్దార్థము. మనః ఏవ=మనస్సునే, ప్రీణాతి=సంతోషపఱచుచున్నాఁడు. [పరితః నానావిషయేషు పతతీతి పరిపతిః=మనః. నానావిషయములందు వర్తించునది మనస్సు అని వ్యుత్పత్త్యర్థము.] "తనూనప్త్రే" ఇతి ఆహ="ఓ ఆజ్యమా! నిన్ను తనూనప్త్రగ్ని కొఱకు గ్రహించుచున్నానని" వేదము చెప్పినది. తే=ఆ దేవతలు, తనువః తాః=పుత్త్ర భార్యాదిరూపములైన ఆ తనువులను, సమవాద్యన్త హి=సంఘటితపఱచిరి కదా! "శాక్వరాయ" ఇతి ఆహ="ఓ ఆజ్యమా! నిన్ను శక్తిస్వరూపముకొఱకు గ్రహించుచున్నాను." అని వేదము చెప్పినది. శక్త్యై హి=శక్తికొఱకు కదా! తే=ఆ దేవతలు, తాః=ఆ పుత్త్ర భార్యాదులను, సమవాద్యన్త=సంఘటితపఱచిరి. [శకనశీలః శక్వరః=శక్తిమాన్ పురుషః. తస్య సంబంధి శాక్వరమ్=శక్తిస్వరూపమ్. "శక్లృ=శక్తౌ" అను ధాతువునుండి శక్వర శబ్ద మేర్ప డినది. శక్తిమంతుఁడైన పురుషుఁడని యర్థము. తత్సంబంధి శాక్వరమ్=శక్తిస్వరూపమని వ్యుత్పత్త్యర్థము.] "శక్మన్నోజిష్ఠాయ" ఇతి ఆహ="ఓ ఆజ్యమా! శక్తిమంతులయం దుండునట్టి అష్టమ ధాతుసారముకొఱకు నిన్ను గ్రహించుచున్నానని వేదము చెప్పినది. తే=ఆ దేవతలు, తత్=అప్పుడు, ఆత్మనః=స్వాత్మసంబంధమైన, ఓజిష్ఠమ్=ఓజస్సారమును, సమవాద్యన్త హి=సంఘటితపఱచిరి కదా!

తాత్పర్యము: అర్థమునందే తాత్పర్యము వివరింపఁబడినది.

5. అర్థము: "అనాధృష్టమ్ అసి అనాధృష్యమ్" ఇతి ఆహ="ఓ తానూనప్త్రాజ్యమా! నీవు ఇతఃపూర్వము ఎవ్వరిచేతను తిరస్కరింపఁబడనిదాన వగుచున్నావు. ఇఁక ముందు తిరస్కార్యము కాని దానవు నగుచున్నావు" అని

వేదము చెప్పినది. ఏతత్=ఈ తానూనప్త్రిజ్యము, అనాధృష్టమ్=ఇతః పూర్వము తిరస్కరింపఁబడనిది; అనాధృష్యం హి=ఇఁకముందు తిరస్కార్యము కానిది కదా! "దేవానామ్ ఓజః" ఇతి ఆహ="ఓ తానూనప్త్రిజ్యమా! నీవు దేవతలయొక్క ఓజస్సార మగుచున్నావు" అని వేదము చెప్పినది. ఏతత్=ఈ ఆజ్యము, దేవానామ్=దేవతలయొక్క, ఓజః హి=ఓజస్సారము కదా! "అభిశస్తిపా అనభిశస్తా" ఇతి ఆహ="ఓ తానూనప్త్రిజ్యమా! నీవు హింసారూపమైన అన్యోన్యవిరోధమునుండి మమ్ము పాలించుచున్నావు. నీవైతే హింసారూపమైన అన్యోన్యవిరోధమునకు విషయము కానిదానవు." అని వేదము చెప్పినది. ఏతత్=ఈ యాజ్యము, అభిశస్తిపా హి=హింసారూపమైన అన్యోన్యవిరోధమునుండి పాలించునది కదా! అన్యమ్=ఇతరుని, అనభిశస్తే=హింసించుట లేదు.

తాత్పర్యము: "అనాధృష్ట" మిత్యాది మంత్రార్థము ప్రసిద్ధమే అను విషయమును ఈ బ్రాహ్మణభాగము చెప్పుచున్నది. ఈ మంత్రము లన్నియు (కా. 1 ప్ర. 2 అను. 10) ప్రథమకాండమునందు వ్యాఖ్యాతము లైనవి.

6. అర్థము: దేవాః=దేవతలు, ఘృతమ్=ఆజ్యమును, వజ్రం కృత్వైవ=వజ్రాయుధముగాఁ జేసియే, సోమమ్=సోమమును, అఘ్నన్=కొట్టిరి. తానూనప్త్రేణ=తానూనప్త్రిజ్యముతో (కూడ), (ఋత్విజః=ఋత్విజులు,) ప్రచరన్తి యత్=సంచరించుచున్నారు అనుట ఏది కలదో, ఏతత్=ఇది, అస్య=ఈ సోమముయొక్క, అన్తికమివ వై=సమీప మగునట్లుగానే, చరన్తి=సంచరించుచున్నారు.

తాత్పర్యము: పూర్వము ఒకానొకప్పుడు స్వ సామర్థ్యమువలన ఘృతమును వజ్రముగాఁ జేసి దానితో సోమమును కొట్టిరి. ఋత్విజులు తానూనప్త్రిజ్యముతో కూడ వేదియందు ప్రవర్తించుచుండుటవలన, ఆహవనీయ దక్షిణ భాగమునందు సోమము ఉండుటవలన సోమమునకు సమీపముననే సంచరించుచున్నట్లు అగుచున్నది. అందువలన సోమము ఘృతమువలన భయపడుచున్నది. కావున భయపడిన సోమము ఓదార్పతగియున్నది. 1. కాం. 2. ప్ర. 11వ అనువాకమునందలి "అగ్ంశు రగ్ంశు స్తే" అను ఆప్యాయన మంత్రమును వ్యాఖ్యానించుటకు ముందుగా తత్ప్రశంస యిచట చేయఁబడినది.

7. అర్థము: "అగ్ంశు రగ్ంశుస్తే దేవ సోమాఽఽప్యాయతామ్" ఇతి ఆహ="ఓ సోమదేవా! నీయొక్క యే సూక్ష్మావయవము శుష్కించుచున్నదో, ఏ సూక్ష్మావయవము క్షీణించుచున్నదో, ఆ సర్వావయవము వృద్ధి నొందుఁగాక" అని వేదమంత్రము చెప్పినది. అస్య=ఈ సోమముయొక్క, యదేవ=ఏదియైతే, అపువాయతే=శుష్కించుచున్నదో, యత్=ఏది, మీయతే=కొలువఁబడుచున్నదో, అస్య=ఈ సోమముయొక్క, తదేవ=అదియే, ఏతేన=ఈ చెప్పుటచేత, ఆప్యాయయతి=వృద్ధినొందుచున్నది. "ఆ త్వ మిన్ద్రాయ ప్యాయస్వ" ఇతి ఆహ="ఓ సోమదేవా! నీవు ఇంద్రునికొఱకు వృద్ధినొందుము అని వేదమంత్రము చెప్పినది. ఇన్ద్రం చ=ఇంద్రుని, సోమం చ=సోమమును, ఉభావేవ=(ఈ)ఇద్దఱినే, (అయమ్=ఈ యజమానుఁడు,) ఆప్యాయయతి=వృద్ధినొందించుచున్నాఁడు. "ఆ ప్యాయయ సఖీ న్సన్యా మేధయా" ఇతి ఆహ="ఓ సోమదేవా! సఖులైన ఋత్విజులను ధనలాభముచేతను, ప్రజ్ఞచేతను వృద్ధి నొందించుము అని వేదమంత్రము చెప్పినది. ఋత్విజః వై=ఋత్విజులే, అస్య=ఈ సోమమునకు, సఖాయః=సఖులు. తానేవ=ఆ ఋత్విజులనే, ఆప్యాయయతి=వృద్ధి నొందించుచున్నాఁడు. "స్వస్తి, తే దేవ సోమ సుత్యా మశీయ" ఇతి ఆహ="ఓ సోమదేవా! నీకు శుభమగుఁగాక. నీ యనుగ్రహముచేత నేను అభిషవతంత్రమును పొందుదును." అని వేదము చెప్పినది. (యజమానః=యజమానుఁడు,) ఏతామ్=దీనిని, ఆశిషమేవ=ఆశీస్సుగానే, ఆశాస్తే=కోరుచున్నాఁడు.

తాత్పర్యము: సోమముయొక్క ఆప్యాయన ప్రసంగము పూర్వమంత్రమున చెప్పఁబడినది. ఈ బ్రాహ్మణముచే ఆ మంత్రము వ్యాఖ్యానింపఁబడినది. తాత్పర్యము సులభము.

8\. అర్థము: యే=ఎవరు, సోమమ్=సోమమును, ఆప్యాయయన్తి=తృప్తిపఱచుచున్నారో, ఏతే=వీరు, అస్మాత్ లోకాత్ వై=ఈ భూలోకమునుండియే, ప్రచ్యవన్తే=అధికముగ జారిపోవుచున్నారు. ఆప్యాయితః=ఆప్యాయితమైన, సోమః=సోమము, అన్తరిక్ష దేవత్యః హి=అతరిక్షదేవత దేవతగా కలది కదా! "ఏష్టా రాయః ప్రేషే భగాయ" ఇతి ఆహ="ఇచ్ఛావంతుఁడవైన ఓ ద్యావాపృథివ్యభిమాని దేవా! నీవు ధనము కొఱకు, అన్నముకొఱకు, ఐశ్వర్యము కొఱకు యజ్ఞవాదులమైన మాకు యజ్ఞము నొసఁగుము" అని వేదమంత్రము చెప్పినది. (అతః=ఇందువలన,) ద్యావాపృథివ్యామేవ=ద్యావా పృథివీ దేవతలకొఱకే, నమస్కృత్య=నమస్కరించి, అస్మిన్ లోకే=ఈ లోకమునందు, ప్రతితిష్ఠన్తి=ప్రతిష్ఠితు లగుచున్నారు.

తాత్పర్యము: ఆప్యాయితమైన సోమము నాభిదఘ్నమైన ఆసందియందు ఉండుటవలన అంతరిక్షదేవత దేవతగాఁ గలది. అట్టి సోమమును ఆప్యాయనము చేసినవారు కూడ అటువంటివారే. కావున ఆ సోమము నాప్యాయనము చేసినవారు కూడ ఈ పృథివినుండి చ్యుతులైనవా రగుచున్నారు. అట్టివారు పృథివియందు ప్రతిష్ఠను పొందుటకు ద్యావ్యాపృథివీ దేవతలకు నమస్కారము చేసినచో పృథివియందు ప్రతిష్ఠితు లగుదురు. "నమో దివే నమః పృథివ్యై" అను మంత్రముచేత "మేము ద్యుదేవతకు, భూదేవతకు నమస్కారము చేయుచున్నాము" అని చెప్పఁబడిన నమస్కారము సహేతుకమే అని ఇచ్చట సమర్థింపఁబడినది.

9\. అర్థము: దేవాసురాః=దేవాసురులు, సంయత్తాః=యుద్ధసన్నద్ధులు, ఆసన్=అయిరి. తే దేవాః=ఆ దేవతలు, బిభ్యతః=భయపడుచున్నవారై, అగ్నిమ్=అగ్నిశరీరమును, ప్రావిశన్=ప్రవేశించిరి. తస్మాత్=ఆ కారణమువలన, అగ్నిః=అగ్ని, సర్వాః దేవతాః ఇతి=సర్వదేవతా స్వరూపుఁడని, ఆహుః=(అభిజ్ఞులు) చెప్పిరి. తే=ఆ దేవతలు, అగ్నిమేవ=అగ్నినే, వరూథమ్=కవచమునుగా, కృత్వా=చేసి, అసురాన్=రాక్షసులను, అభ్యభవన్=అభిభవించిరి. యః=ఏ యజ్ఞకర్త, అవాన్తరదీక్షామ్=అవాంతరదీక్షను, ఉపైతి=పొందుచున్నాఁడో, ఏషః=ఇతఁడు, అగ్నిం వై=అగ్నినే, ప్రవిశతీవ ఖలు=ప్రవేశించుచున్నవాఁడువలె అగుచున్నాఁడు కదా! (ఇయమ్=ఈ అవాంతరదీక్ష,) భ్రాతృవ్యాభిభూత్యై=శత్రుపరాభవముకొఱకు, భవతి=అగుచున్నది. ఆత్మనా=స్వయముగా, భవతి=విజయుఁడగుచున్నాఁడు. అస్య=ఇతనియొక్క, భ్రాతృవ్యః=శత్రువు, పరాభవతి=పరాభూతుఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వము దేవాసురులు యుద్ధసన్నద్ధు లైరి. కాని దేవతలు భయపడి అగ్నిశరీరమును ప్రవేశించిరి. వారు ఆ యగ్నినే కవచముగా చేసికొని యుద్ధమునందు అసురులను పరాజితులను చేసిరి. యజమానుఁడు యజ్ఞమునందు అవాంతరదీక్షను స్వీకరించవలెను. ఆ అవాంతరదీక్ష అగ్నిప్రవేశమువంటిదే. ఈ యవాంతర దీక్షవలన శత్రువునకు పరాభవము కలుగును. తాను విజయుఁ డగును. అవాంతరదీక్ష శత్రుపరాభవమునకు కారణమగుచున్నది. [పరకాయ ప్రవేశ హేతువగుటవలన యోగశాస్త్రప్రసిద్ధ సంయమ విశేషముచే దేవతలు అగ్నిశరీరమును ప్రవేశించిరి. తపోరూపమగుటచేత అవాంతరదీక్ష అగ్నిసమానమైనది. అందువలన యజమానుఁడు అవాంతరదీక్షను పొందవలెను.]

10\. అర్థము: (యజ్ఞకర్తా=యజ్ఞకర్త,) దీక్షయా=ప్రధాన యజ్ఞదీక్షచేత, ఆత్మానమేవ=తననే, పాతి=రక్షించుచున్నాఁడు. అవాన్తరదీక్షయా=అవాంతరదీక్షచేత, ప్రజామ్=ప్రజను, పాతి=రక్షించుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞకర్త ప్రధానదీక్షచేత తనను, అవాంతరదీక్షచేత సంతానమును రక్షించుకొనును.(ఇచట ప్రధానదీక్ష, అవాంతరదీక్షయు ప్రశంసింపఁబడినవి.)

11\. అర్థము: (యజ్వా=యాగకర్త,) మేఖలామ్=మణికట్టును, సంతరామ్=సంశ్లిష్టమైనదిగా, సమాయచ్ఛతే=బాగుగ పొందవలెను. ప్రజా=సంతానము, ఆత్మనః=తనకంటె, అన్తరతరా=మిక్కిలి సన్నిహిత మైనది. తప్తవ్రతః=తప్తవ్రతుఁడు, భవతి=కావలెను. మదన్తీభిః=మదంతీ నామకములైన ఉదకములచేత, మార్జయతి=మార్జనము చేయువలెను. అగ్నిః=అగ్ని, శీతేన=చల్లని ఉదకముచే -లేదా -క్షీరముచేత, నిర్వాయతి హి=మిక్కిలి శోషించుచున్నాఁడు

కదా! (ఇదమ్=ఈ మదంతీ జల మార్జనము,) సమిద్ధ్యై=బాగుగ జ్వలించుటకై, (భవతి=కారణ మగుచున్నది. "ఓ వై=శోషణే" అను ధాతువునుండి 'వాయతి' అను రూపము ఏర్పడినది. తప్తవ్రతః=తప్తమైన పయోవ్రతము కలవాఁడు.)

తాత్పర్యము: ఇచట అవాంతర దీక్షా నియమములు చెప్పఁబడినవి. యజ్ఞకర్త అవాంతర దీక్షానియమముగ, హస్తమునకు గట్టిగా మేఖలను కట్టుకొనవలెను. మదంతీ జలములచే మార్జనము చేసికొనవలెను. మదంతీ జలములు కొంచెము వేడిగా నుండును. చల్లని నీటితో మార్జనము చేసికొనినచో జఠరమునందున్న అగ్ని జ్వలించఁడు కదా! ఉష్ణోదకముచే మార్జనము జఠరాగ్ని బాగుగ జ్వలించుటకు కారణ మగును.

12\. అర్థము: "యా తే అగ్నే రుద్రియా తనూః" ఇతి ఆహ="ఓ యగ్నీ! ఉగ్రమైన యే శరీరము నీకు కలదో, దానిచే మమ్ము రక్షించుము" అని వేదమంత్రము చెప్పినది. ఏనత్=ఈ దుగ్ధమును, స్వయైవ దేవతయా=స్వీయ దేవతతోడనే, వ్రతయతి=భుజించుచున్నవాఁ డగుచున్నాఁడు. ఇదమ్=ఈ భోజనము, సయోనిత్వాయ=యోనిభూతమైన అగ్నియొక్క సాహిత్యముకొఱకు, (భవతి=అగుచున్నది. తచ్చ=ఆ సాహిత్యము కూడ,) శాన్త్యై=శాంతికొఱకు, (భవతి=అగుచున్నది.)

తాత్పర్యము: ఓ యగ్నీ! నీ రుద్రియమైన శరీర మేది కలదో, ఆ శరీరముచే మమ్ము రక్షించుము అని "యా తే అగ్నీ" ఇత్యాది మంత్రమున కర్థము. ఇచట అగ్ని అనఁగా జఠరాగ్ని అని అర్థము. జఠరాగ్నియొక్క మఱియొక రూపము ఉగ్రమైన తనువు. ఆ యగ్నిశరీరముచే దుగ్ధము తప్త మగుచుండఁగా ఆ యగ్ని దేవతతో కూడ యజమానుఁడు దుగ్ధమును భుజించినవాఁ డగును. ఆ భోజనము యోనిభూతుఁడైన అగ్నియొక్క సాహిత్యము కొఱకు కారణ మగును. ఆ యగ్నిసాహిత్యము ఉగ్రుఁడైన అగ్నియొక్క శాంతికి కారణ మగును.

ద్వితీయానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే తృతీయోఽనువాకః

మూలము: [1]తేషా మసురాణాం తిస్రః పుర అసన్నయస్మయ్యవమాఽథ రజతాఽథ హారిణీ తా దేవా జేతుం
నాశక్నువన్తా ఉపసదైవాజిగీష న్తస్మాదాహు ర్యశ్చైవం వేద యశ్చ నోపసదా వై మహాపురం జయ
న్తీతి త ఇషుగ్ం సమస్కుర్వతాగ్ని మనీకగ్ం సోమగ్ం శల్యం విష్ణుం తేజనం తేఽబ్రువన్క ఇమా
మసిష్యతీతి (౧)రుద్ర ఇత్యబ్రువన్రుద్రో వై క్రూరః సోఽస్యత్వితి సోఽబ్రవీద్వరం వృణా అహామేవ
పశూనా మధిపతి రసానీతి తస్మాద్రుద్రః పశూనా మధిపతిస్తాగ్ం రుద్రో ఽవాసృజత్స తిస్రః పురో
భిత్త్వైభ్యో లోకేభ్యో ఽసురా న్ప్రాణుదత [2]యదుపసద ఉపసద్యన్తే భ్రాతృవ్య పరాణుత్త్యై [3]నాన్యా
మాహుతిం పురస్తా జ్జుహుయా ద్యదన్యా మాహుతిం పురస్తా జ్జుహుయాత్ (౨)అన్యన్ముఖం కుర్యా
[4]త్స్రువేణా ఽఽఘారమా ఘారయతి యజ్ఞస్య ప్రజ్ఞాత్యై [5]పరాఙతిక్రమ్య జుహోతి పరాచ ఏవైభ్యో
లోకేభ్యో యజమానో భ్రాతృవ్యాన్ప్ర ణుదతే [6]పునరత్యాక్రమ్యోపసదం జుహోతి ప్రణుద్యైవైభ్యో
లోకేభ్యో భ్రాతృవ్యాఞ్జిత్వా భ్రాతృవ్య లోక మభ్యారోహతి [7]దేవా వై యాః ప్రాతరుపసద ఉపా
సీద న్నహ్నస్తాభి రసురా న్ప్రాణుదన్త యాః సాయగ్ం రాత్రియై తాభి ర్యత్సాయంప్రాత రుపసదః
(3)ఉపసద్యన్తేఽహోరాత్రాభ్యామేవ తద్యజమానో భ్రాతృవ్యాన్ప్ర ణుదతే [8]యాః ప్రాతర్యాజ్యాః
స్యుస్తాః సాయం పురోనువాక్యాః కుర్యా దయాతయామత్వాయ [9]తిస్ర ఉపసద ఉపైతి త్రయ
ఇమే లోకా ఇమానేవ లోకా న్ప్రీణాతి [10]షట్సం పద్యన్తే షడ్వా ఋతవ ఋతూనేవ ప్రీణాతి

[11]ద్వాదశాహీనే సోమ ఉపైతి ద్వాదశ మాసాః సంవత్సరః సంవత్సరమేవ ప్రీణాతి [12]చతుర్విగ్ంశతిః సమ్ (४)పద్యన్తే చతుర్విగ్ంశతి రర్ధమాసా అర్ధమాసానేవ ప్రీణా [13]త్యారాగ్రా మవాన్తరదీక్షా ముపేయాద్యః కామయేతాస్మిన్మే లోకేఽర్ధుకగ్ం స్యాదిత్యేక మగ్రేఽథ ద్వావథ త్రీనథ చతుర ఏషా వా అరాగ్రాఽవాన్తరదీక్షాఽస్మిన్నేవాస్మై లోకేఽర్ధుకం భవతి [14]పరోవరీయసీ మవాన్తరదీక్షా ముపేయాద్యః కామయేతాముష్మిన్మే లోకేఽర్ధుకగ్ం స్యాదితి చతురోఽగ్రేఽథ త్రీనథ ద్వావథైకమేషా వై పరోవరీయస్యవాన్తరదీక్షాఽముష్మిన్నేవాస్మై లోకేఽర్ధుకం భవతి(౫).

[అసిష్యతీతి జుహాయా త్స్వయంప్రాతరుపసద శ్చతుర్విగ్ంశతిః సం చతురోఽగ్రే షోడశ చ॥]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే తృతీయోఽనువాకః ॥3॥

## వేదార్థదీపిక

అవతారిక: ద్వితీయానువాకమునందు తానూనప్త్రేష్టి మంత్రములు బ్రాహ్మణభాగముచే వ్యాఖ్యానించఁబడినవి. ఈ తృతీయానువాకమునందు ఉపసత్తు లనెడి హోమములకు సంబంధించిన విషయము వివరించఁబడుచున్నది.

1. అర్థము: తేషామ్ అసురాణామ్=ఆ యసురులకు, తిస్రః పురః=మూఁడు పట్టణములు, ఆసన్=ఉండెను. అయస్మయీ=(ఒకటి)లోహమయమైన, అవమా=రక్షకమైన ప్రాకారముతో కూడినది. అథ=పిమ్మట, (ఇంకొకటి,) రజతా=రజతమయమైన ప్రాకారము కలది. అథ=అనంతరము, హారిణీ=మఱియొకటి హిరణ్మయమైన ప్రాకారము కలది. తాః=ఆ పురములను, జేతుమ్=జయించుటకు, దేవాః=దేవతలు, న అశక్నువన్=సమర్థులు కారైరి. ఉపసదైవ=ఉపసత్ అను హోమముచేతనే, అజిగీషన్=జయింప నిచ్ఛయించిరి. తస్మాత్=ఆ కారణమువలన, "యః చ=ఏ బ్రాహ్మణాదికమైతే, ఏవమ్=వేదాధ్యయనముచే ఈవిధముగ వేదవిచారమును, వేద=తెలిసికొనుచున్నదో, యః చ=ఏ శూద్రాదికమైతే, న=తెలిసికొనుటలేదో, (తే సర్వే అపి=వా రందఱును,) ఉపసదా వై=ఉపసత్తుచేతనే, మహాపురమ్=(యుద్ధముచే జయింప సాధ్యముకాని) మహాపట్టణమును, జయన్తీతి=జయించుచున్నారని" ఆహుః=(లోకమునందు)చెప్పుచుందురు. తే=ఆ దేవతలు, అగ్నిమ్=అగ్నిని, అనీకమ్=బాణము మొదటి భాగమైన కాష్ఠముగాను, సోమమ్=సోమదేవుని, శల్యమ్=బాణముయొక్క లోహభాగముగాను, విష్ణుమ్=విష్ణువును, తేజనమ్=బాణాగ్రముగాను (అగునట్లు), ఇషుమ్=బాణమును, సమస్కుర్వత=సంస్కరించిరి. కః=ఎవఁడు, ఇమామ్=దేవతాత్రయ సమష్టిరూపమైన యీ యిషువును, అసిష్యతి ఇతి=(ధనువునుండి)విడువఁగలఁడు? అని, తే=ఆ దేవతలు, అబ్రువన్=పలికిరి. రుద్రః ఇతి=రుద్రుఁడని, అబ్రు

వన్=పలికిరి. రుద్రః వై=రుద్రుఁడే, క్రూరః=క్రూరుఁడు. సః=ఆ రుద్రుఁడు, అస్యతు ఇతి=విడుచుగాక యని, అబ్రువన్=పలికిరి. అహమేవ=నేనే, పశూనామ్=ప్రాణులకు, అధిపతిః=అధిపతిగా, అసాని=ఉందును. ఇతి=అని, వరమ్=వరమును, వృణై=కోరుదును. ఇతి=అని, సః=ఆ రుద్రుఁడు, అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణము వలన, రుద్రః=రుద్రుఁడు, పశూనామ్=పశువులకు, అధిపతిః=అధిపతి. రుద్రః=రుద్రుఁడు, తామ్=దేవతాత్రయ సమష్టిరూపమైన ఆ యిషువును, అవాసృజత్=విడిచెను. సః=ఆ రుద్రుఁడు, తిస్రః పురః=మూఁడు పట్టణములను, భిత్త్వా=భేదించి, ఏభ్యః లోకేభ్యః=ఈ లోకములనుండి, అసురాన్=రాక్షసులను, ప్రాణుదత=పోఁగొట్టెను.

తాత్పర్యము: పూర్వము దేవతలు అగ్నిముఖముగ సైన్యమును నడిపించి రాక్షసులను జయించిరి. దేవతలచే పరాభూతులైన రాక్షసులు భూలోకమునందు లోహప్రాకారముతో కూడిన పట్టణమును, అంతరిక్షమునందు రజత ప్రాకార వేష్టిత పట్టణమును, ద్యులోకమునందు హిరణ్య ప్రాకార వేష్టిత పట్టణమును నిర్మించుకొనిరి. ఆ పట్టణములను అగ్నిముఖ సైన్యముచేత కూడ జయింప నలవి కానివి యని, యా దేవతలు యుద్ధమును పరిత్యజించి ఉపసత్తుచేతనే జయింపవలెనని తలఁచిరి. అప్పుడు వారు రాక్షస దుర్గమును అంతటను ముట్టడించి చిరకాలము అచట నుండిరి. చిరకాలనివాసముచేత దుర్గమధ్యమందు అన్నపానాదులు క్షీణించుటవలనఁగాని, అంతర్భేదమువలనఁగాని నిశ్చయముగ జయము లభించునని వారు నిశ్చయించిరి. చిరనివాసము జయోపాయముగా దేవతలచే నిశ్చయింపఁబడుటవలననే లోకమునందు కూడ వేదాధ్యయనముచేత వేదవిచారము చేయునట్టి బ్రాహ్మణాదులు, వేదవిచారము చేయలేని శూద్రాదులును (అందఱు) యుద్ధముచే అజేయమైన మహాపురమును ఉపసత్తుచే జయింపవచ్చునని చెప్పుచున్నారు.

ఆ సమయమున దేవతలు కాలవిలంబము చేయకుండ అగ్నిని బాణముయొక్క మొదటి భాగముగాను, సోముని బాణముయొక్క లోహభాగముగాను, విష్ణువును బాణాగ్రముగాను సంస్కరించి ఈ దేవతాత్రయ సమష్టిరూపమైన యిషువును రాక్షసులపైని విడువగలవారు ఎవరు? అని అనుకొనిరి. రుద్రుఁడు క్రూర దేవుఁడు కావున ఆ రుద్రుఁడే బాణమును విడువఁగలఁడని అనుకొనిరి. అప్పుడు రుద్రుఁడు తానే పశుపతి కావలెనని వరమును కోరుకొని యనంతరము ఆ యిషువును రాక్షసులపైని ప్రయోగించి ఆ రాక్షసులను భూమ్యంతరిక్ష ద్యులోకములనుండి పాఱఁదోలెను. [ఇచట ఉపసత్ అనఁగా సమీపమున ఉండుట అనియు, 'ఉపసత్' అను హోమము అనియు నర్థము. మూఁడు ఉపసద్ధోమములను విధించుటకు ముందు తత్ప్రశంస యిచట చేయఁబడినది.]

2. అర్థము: ఉపసదః=ఉపసత్తులనెడి ఆహుతులు, ఉపసద్యన్తే యత్=అనుష్ఠించఁబడుచున్నచో, ఏతత్=ఈ యనుష్ఠానము, భ్రాతృవ్య పరాణుత్త్యై=శత్రునిష్కాసనమునకై, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ఉపసత్తు లనెడి ఆహుతులను హోమము చేయవలెను. ఈ యుపసద్ధోమము శత్రువులను తొలఁగించుటకు సాధన మగును. [వైరిదుర్గోపసదన కార్యకారులగుటచే ఈ యాహుతులు ఉపసత్తులని వ్యవహరించఁబడుచున్నవి. ఈ యాహుతులకు అగ్ని సోమ విష్ణువులు ముగ్గురు దేవతలు. ఈ దేవతలయొక్క యాజ్యా పురోనువాక్యలు హౌత్రప్రకరణమునందు ఆమ్నాతము లైనవి. అయాశయాది శరీరధారియైన యగ్ని ఈ ఆహుతులకు చతుర్థ దేవత. తదీయమంత్రము అధ్వర్యవ మగుటచే నిచట చెప్పఁబడినది.]

3. అర్థము: అన్యామ్ ఆహుతిమ్=ఇతరమైన ప్రయాజాజ్యభాగాద్యాహుతిని, పురస్తాత్=ప్రథమమున, న జుహుయాత్=హోమము చేయరాదు. పురస్తాత్=ప్రథమమున, అన్యామ్ ఆహుతిమ్==ఇతరాహుతిని, జుహుయాత్ యత్=హోమము చేయుచో, అన్యత్ ముఖమ్=ఇతర దేవతా ముఖముగా, కుర్యాత్=చేయువాఁ డగును.

తాత్పర్యము: ఉపసద్ధోమములు ఆజ్యహవిష్కము లగుటవలన ఉపాంశుయాజలవలె ప్రయాజాజ్యభాగాహుతిని ప్రథమమున హోమము చేయరాదు. అట్లు చేసినచో వహ్నికి ప్రాధాన్యము క్షీణించును. ఇతర దేవతా ప్రాధాన్యము

సంభవించును. [త్రిపురసంహార సమయమున రుద్రుఁడు ప్రయోగించిన బాణముయొక్క ప్రథమ భాగమున అగ్ని యుండుటచే అగ్నిముఖత్వము న్యాయ్యము. అగ్నికి ప్రథమ భావిత్వ లక్షణమైన ముఖత్వము చెప్పఁబడినది.]

4. అర్థము: యజ్ఞస్య=యజ్ఞముయొక్క, ప్రజ్ఞాత్యై=ప్రత్యభిజ్ఞానముకొఱకు, స్రువేణ=స్రువముచేత, ఆఘారమ్ ఆఘార యతి=ఆఘారహోమమును చేయవలెను.

తాత్పర్యము: దర్శపూర్ణమాసాది యజ్ఞములు ఆఘారహోమములు కలిగియుండుటవలన ఉపసత్తులకు కూడ యజ్ఞత్వ ప్రత్యభిజ్ఞ సిద్ధించుటకై ఉపసత్తులలో స్రువముచే ఆఘారహోమము చేయవలెను.

5. అర్థము: యజమానః=యజమానుఁడు, పరాఙ్=పునరావృత్తి రహితుఁడై, అతిక్రమ్య=వేద్యాహవనీయముల మధ్యభాగము నతిక్రమించి, జుహోతి=(దక్షిణ దిక్కునందు ఉదఙ్ముఖుఁడై యుండి క్రమముగ అగ్ని సోమ విష్ణువులకు మూఁడు ఆహుతులను హోమము చేయవలెను. [తథా=ఆ విధముగ, కృతవాన్=చేసినట్టి,] యజమానః=యజమానుఁడు, భ్రాతృవ్యాన్=శత్రువులను, ఏభ్యః లోకేభ్యః=ఈ లోకములనుండి, పరాచః ఏవ=పునరావృత్తిరహితులనుగానే, ప్రణుదతే=తొలఁగింపఁజేయుచున్నాఁడు.

తాత్పర్యము: యజమానుఁడు పునరావృత్తి రహితుఁడై వేద్యాహవనీయముల మధ్యదేశము నతిక్రమించి దక్షిణదిక్కునందు ఉదఙ్ముఖుఁడుగా నుండి క్రమముగా అగ్ని సోమ విష్ణుదేవతలకు మూఁడు ఆహుతులను హోమము చేయవలెను. ఈ విధముగా హోమము చేసిన యజమానుఁడు శత్రువుల నీ లోకములనుండి పునరావృత్తి రహితులనుగానే తొలఁగింపఁజేసినవాఁ డగును.[ఇచట మూఁడు ఉపసదాహుతులకు హోమప్రకారము విధింపఁబడినది.]

6. అర్థము: పునః=మఱల, అత్యాక్రమ్య=(ఆ దక్షిణదిశను)అతిక్రమించి, ఉపసదమ్=అగ్నిదేవతాకమైన నాల్గవ ఉపసదాహుతిని, జుహోతి=హోమము చేయవలెను. [సః=ఆ యజమానుఁడు,] భ్రాతృవ్యాన్=శత్రువులను, జిత్వా=జయించి, ఏభ్యః లోకేభ్యః=ఈ లోకములనుండి, ప్రణుద్యైవ=తొలఁగించియే, భ్రాతృవ్యలోకమ్=(స్వర్గమునందు వైరిస్థానమైన] పురత్రయమును, అభ్యారోహతి=అధిష్ఠించుచున్నాఁడు.

తాత్పర్యము: యజమానుఁడు దక్షిణ దిక్కునుండి ఉత్తర దిక్కునకు వచ్చి అగ్నిదేవతాకమైన నాల్గవ ఉపసదాహుతిని హోమము చేయవలెను. ఈ హోమము చేయుటవలన యజమానుఁడు శత్రువుల నీ లోకములనుండి తొలఁగించి స్వర్గమునకు వెళ్లి అచట శత్రుస్థానమైన పురత్రయము నధిష్ఠించును.(ఇచట చతుర్థాహుతి ప్రకారము విధింపఁబడినది.)

7. అర్థము: దేవాః=దేవతలు, యాః ఉపసదః ఏవ=ఏ యుపసదాహుతులనే, ప్రాతః=ప్రాతఃకాలమున, ఉపాసీదన్=అనుష్ఠించిరో, తాభిః=ఆ యాహుతులచే, అసురాన్=రాక్షసులను, అహ్నః=పగటినుండి, ప్రాణుదన్త=తొలఁగించిరి. యాః=ఏ యుపసదాహుతులను, సాయమ్=సాయంకాలమునందు, ఉపాసీదన్=అనుష్ఠించిరో, తాభిః=ఆ యాహుతులచేత, రాత్రియై(రాత్ర్యాః)=రాత్రినుండి, అసురాన్=రాక్షసులను, ప్రాణుదన్త=తొలఁగించిరి. సాయం ప్రాతః=సాయం ప్రాతఃకాలముల రెండింటియందు, ఉపసదః=ఉపసదాహుతులు, ఉపసద్యన్తే యత్=అనుష్ఠించఁబడుచున్నచో, తత్=అప్పుడు, యజమానః=యజమానుఁడు, భ్రాతృవ్యాన్=శత్రువులను, అహోరాత్రాభ్యామేవ=అహోరాత్రములనుండియే, ప్రణుదతే=తొలఁగించువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: దేవతలు ఉపసదాహుతులను ప్రాతఃకాలమునందు హోమము చేసి రాక్షసులను పగటినుండియు, సాయంకాలమునందు ఉపసదాహుతులను హోమము చేసి రాత్రినుండియు వెడలఁగొట్టిరి. సాయం ప్రాతఃకాలములందు రెండింటియందును ఉపసత్తులను హోమము చేసిన యజమానుఁడు శత్రువులను అహోరాత్రములనుండియే తొలఁగించును. [ఇచట కాలద్వయమునందు ఉపసదనుష్ఠానము విధింపఁబడినది.]

8. అర్థము: యాః ప్రాతః యాజ్యాః=ప్రాతఃకాలమున ఏవి యాజ్యలుగా, స్యుః=ఉండునో, తాః=ఆ ప్రాతర్యాజ్యలను, అయాతయామత్వాయ=రసహీనత్వము లేకుండుటకై, సాయం పురోనువాక్యాః=సాయంకాలమునందు పురోనువాక్యలుగా, కుర్యాత్=చేయవలెను.

తాత్పర్యము: రసవిహీనత్వము పోవుటకై ప్రాతస్సాయం కాలములందు అనుష్ఠించవలసిన యాజ్యా పురోనువాక్యలను వ్యత్యాసముగ ననుష్ఠించవలయును.

9. అర్థము: తిస్రః ఉపసదః=మూఁడు ఉపసత్తులను, ఉపైతి=పొందవలెను(అనుష్ఠించవలెను). ఇమే లోకాః=ఈ లోకములు, త్రయః=త్రిసంఖ్యాకములు. ఇమాన్ లోకానేవ=ఈ మూఁడు లోకములనే, ప్రీణాతి=సంతోషపఱచువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞకర్త మూఁడు దినములందు ఉపసదాహుతులను హోమము చేయవలెను. ఈ లోకములు మూఁడు కావున ఇట్లు చేసిన యజమానుఁడు ఈ మూఁడు లోకములనే సంతోషపఱచినవాఁ డగును. (ఇచట దినత్రయమునందు ఉపసదనుష్ఠానము విహితమైనది.)

10. అర్థము: షట్ సంపద్యన్తే=[మూఁడు దినములందు కాలద్వయమునందును ఉపసదనుష్ఠానమువలన]ఆఱు ఆహుతు లేర్పడుచున్నవి. ఋతవః=ఋతువులు, షట్ వై=ఆఱు కదా! ఋతూనేవ=ఆఱు ఋతువులనే, ప్రీణాతి=(యజమానుఁడు)సంతోషపఱచుచున్నాఁడు.

తాత్పర్యము: యజమానుఁడు మూఁడు దినములందు ప్రాతస్సాయం కాలములందు ఉపసదనుష్ఠానము చేయుటవలన ఆఱు ఉపసద్ధోమము లగును. ఋతువులు షట్సంఖ్యాకములు కావున, ఈ యజ్ఞకర్త ఆఱు ఋతువులనే సంతోషపఱచినవాఁ డగును. [దినత్రయమునందు కాలద్వయమునందలి ఉపసదనుష్ఠానము ఇచట ప్రశంసించఁబడినది.]

11. అర్థము: అహీనే సోమయాగే=అహీన మనెడి సోమయాగమునందు, ద్వాదశ=పన్రెండు ఉపసదాహుతులను, ఉపైతి=పొందవలెను. (అనుష్ఠించవలెను.) ద్వాదశ మాసాః=పన్రెండు మాసములు, సంవత్సరః=సంవత్సరము. (అతః=ఇందువలన, యజమానః=యజమానుఁడు,) సంవత్సరమేవ=సంవత్సరమునే, (సంవత్సరాధిమాని దేవతనే,) ప్రీణాతి=సంతోష పెట్టువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: అహస్సంఘముచే నిష్పాద్యమైన సోమయాగము అహీన మనఁబడును. అహస్సంఘ సామ్యము సత్రయాగమునకు కూడ కలదు కావున, అహీన శబ్దముచే సత్రయాగము కూడ ఉపలక్షింపఁబడుచున్నది. యజ్ఞకర్త చేయునట్టి అహీన సోమయాగమునందు, సత్రయాగమునందు కూడ రెండవనాటినుండి పన్రెండు దినములందు ఉపస దాహుతులను హోమము చేయవలెను. పన్రెండు మాసములు సంవత్సరము కావున, ఇట్టి యజమానుఁడు సంవత్సరమునే (సంవత్సరాధిమాని దేవతనే,) సంతోష పెట్టినవాఁ డగును. (ప్రసంగవశమున ఇచట అహీన యాగమునందు ఉపసద్దినసంఖ్య విధింపఁబడినది.)

12. అర్థము: చతుర్వింశతిః సంపద్యన్తే=[పూర్వోక్తము లయిన పన్రెండు ఉపసద్దినములయందు ప్రాత స్సాయంకాలములందు ఉపస దాహుతులను హోమము చేయవలెను. అట్లు చేయుటవలన,] ఇరువదినాలుగు ఉపసదాహుతులు సంపన్నము లగుచున్నవి. అర్ధమాసాః=అర్ధమాసములు, చతుర్వింశతిః=ఇరువదినాలుగు. (అతః=ఈ సంఖ్యాసామ్యమువలన, యజమానః=యజమానుఁడు,) అర్ధమాసానేవ=అర్ధమాసములనే, ప్రీణాతి=సంతోష పెట్టుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వోక్తము లయిన పన్రెండు ఉపసద్దినములందు ప్రాతఃకాలమునందు సాయంకాలమునందు కూడ ఉపస దాహుతులను హోమము చేయుటవలన ఇరువదినాలుగు ఉపస దాహుతు లేర్పడుచున్నవి. సంవత్సరమునకు ఇరువదినాలుగు అర్ధమాసములు కావున ఈ యజమానుఁడు ఇరువదినాలుగు అర్ధమాసాధిమాని దేవతలను, సంతోష పెట్టినవాఁ డగును. (ఉపస ద్దినములందు కాలద్వయానుష్ఠాన మిచట ప్రశంసించఁబడినది.)

13. అర్థము: "మే=నాకు, అస్మిన్ లోకే=ఈ భూలోకమునందు, అర్ధుకమ్=సమృద్ధిశీలమైన ఫలము, స్యాత్=కలుగుఁగాక," ఇతి=అని, యః=ఏ యజ్ఞకర్త, కామయేత=కోరునో, సః=అతఁడు, ఆరాగ్రామ్=ఆరాగ్ర మనెడి, అవాంతరదీక్షామ్=అవాంతర దీక్షను, ఉపేయాత్=పొందవలెను. అగ్రే=ప్రథమమునందు, (సోమక్రయదినమున సాయంకాలమునందు) ఏకమ్=(గోవుయొక్క)ఒక స్తనమును, (దుహ్యాత్=పాలు పితుకవలెను.) అథ=పిమ్మట, (మరునాటి ఉదయమున,) ద్వౌ=రెండు స్తనములను, అథ=పిమ్మట, (మరునాటి సాయంకాలమున,) త్రీన్=మూఁడు స్తనములను, అథ=అనంతరము, (మూఁడవనాటి ఉదయమున,) చతురః=నాలుగు స్తనములను (దుహ్యాత్=పాలు పితుకవలెను.) ఆరాగ్రా=ఆరాగ్ర మనెడి అవాంతరదీక్షా=అవాంతరదీక్ష, ఏషా వై=ఇదియే. అస్మై=ఈ విధముగ ఆచరించిన యజమానునికొఱకు, అస్మిన్నేవ=ఈ లోకమునందే, అర్ధుకమ్=సమృద్ధిశీలమైన ఫలము, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: సోమయాగమునందు యాగకర్తకు అవాంతరదీక్ష పూర్వము చెప్పఁబడినది. ఉపసద్దినములందు అవాంతర దీక్షా వ్రత పానములు విధింపఁబడుచున్నవి. ఈ లోకమునందు సమృద్ధిశీలమైన ఫలము తనకు కలుగవలెనని కోరునట్టి యజమానుఁడు ఆరాగ్ర మనెడి అవాంతరదీక్షను స్వీకరించవలెను. యజ్ఞకర్త సోమక్రయదినములలో ప్రథమ దినమున సాయంకాలమునందు గోవుయొక్క ఒక స్తనమును, రెండవ దినమున ఉదయమున రెండు స్తనములను, ఆ సాయంకాలమున మూఁడు స్తనములను, మూఁడవనాటి ఉదయమున నాలుగు స్తనములను పాలు పితుకవలెను. (ఈ పాలు యాగమునందు ఉపయోగింపఁబడును.)ఇదియే ఆరాగ్ర మనెడి అవాంతరదీక్ష అనఁబడును. ఈ విధమైన దీక్షను స్వీకరించిన యజమానుఁడు ఈ లోకమునందే సమృద్ధశీలమైన ఫలమును పొందును. అల్పమ్ అగ్రం=ముఖం యస్యాః సా=ఆరాగ్రా. అల్పారంభము కలది అని అర్థము.

14. అర్థము: "మే=నాకు, అముష్మిన్ లోకే=స్వర్గలోకమునందు, అర్ధుకమ్=సమృద్ధిశీలమైన ఫలము, స్యాత్=కలుగుఁగాక," ఇతి=అని, యః=ఏ యజమానుఁడు, కామయేత=కోరునో, సః=అతఁడు, పరోవరీయసీమ్=పరోవరీయసి అనెడి, అవాన్తరదీక్షామ్=అవాంతరదీక్షను, ఉపేయాత్=పొందవలెను. అగ్రే=ప్రథమమున, (సోమక్రయ దినములలో మొదటినాటి సాయంకాలమున,)చతురః=గోవుయొక్క నాలుగు స్తనములను, (దుహ్యాత్=పాలు పితుకవలెను.) అథ=పిమ్మట, త్రీన్=మూఁడు స్తనములను, అథ=అనంతరము, ద్వౌ=రెండు స్తనములను, అథ=తరువాత, ఏకమ్=ఒక స్తనమును, (దుహ్యాత్=పాలు పితుకవలెను.) ఏషా వై=ఇదియే, పరోవరీయసీ అవాన్తరదీక్షా=పరోవరీయసి యనెడి అవాంతరదీక్ష. అస్మై=ఈ పరోవరీయసి అనెడి అవాంతరదీక్షను స్వీకరించిన యజమానునికొఱకు, అముష్మిన్నేవ=స్వర్గలోకమునందే, అర్ధుకమ్=సమృద్ధిశీలమైన ఫలము, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: స్వర్గలోకమునందు సమృద్ధిశీలమైన ఫలము కలుగవలెనని కోరునట్టి యజ్ఞకర్త పరోవరీయసి యనెడి అవాంతరదీక్షను స్వీకరించవలెను. శ్రేష్ఠవాచక మగుటచే పరశ్శబ్దమున కిచట 'ఉపక్రమము' అను అర్థము వివక్ష చేయఁబడినది. పరే=ఉపక్రమే, వరీయః=అధికం, యస్యాః సా, పరోవరీయసీ. ఉపక్రమమున (ప్రారంభదినమునందు,) అధికము కలది 'పరోవరీయసి' అని యర్థము. అనఁగా సోమక్రయ దినములలో మొదటినాటి సాయంకాలమున గోవుయొక్క నాలుగు స్తనములను పాలు పితుకవలెను. తరువాత మరునాటి యుదయమున మూఁడు, సాయంకాలమున రెండు, మూఁడవనాటి ఉదయమున ఒక స్తనమును పాలు పితుకవలెను. ఇదియే పరోవరీయసి యను అవాంతరదీక్ష. ఆరాగ్రావాంతరదీక్షకు ఇది పూర్తిగా భిన్నమైనది. ఈ దీక్షను స్వీకరించిన యజమానునకు స్వర్గలోకమునందే సమృద్ధిశీలమైన ఫలము కలుగును. "యదహః సోమం క్రీణీయు స్తదహ శ్చతురః సాయం దుహ్యా త్త్రీన్ ప్రాత ర్ద్వౌ సాయ మేక ముత్తమే" అని సూత్రమునందు ఈ పక్షము చెప్పఁబడినది.

తృతీయానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే చతుర్థోఽనువాకః

మూలము: [1]సువర్గం వా ఏతే లోకం యన్తి య ఉపసద ఉపయన్తి తేషాం య ఉన్నయతే హీయత ఏవ న నోదనేషీతి సూన్నీయమివ [2]యో వై స్వార్థేతాం యతాగ్ం శ్రాన్తో హీయత ఉత స నిష్ట్యాయ సహ వసతి [3]తస్మాత్సకృదున్నీయ నాపర మున్నయేత [4]దధ్నోన్నయేతైతద్వై పశూనాగ్ం రూపగ్ం రూపేణైవ పశూనవ రున్దే (౧) [6]యజ్ఞో దేవేభ్యో నిలాయత విష్ణూ రూపం కృత్వా స పృథివీం ప్రావిశత్తం దేవా హస్తాన్సగ్ంరభ్యైచ్ఛన్తమిన్ద్ర ఉపర్యుపర్యత్యక్రామత్సోఽబ్రవీత్కో మాఽయ ముప ర్యుపర్యత్యక్రమీదిత్యహం దుర్గే హన్తేత్యథ కస్త్వమిత్యహం దుర్గాదాహర్తేతి సోఽబ్రవీద్దుర్గే వై హన్తాఽవోచథా వరాహోఽయం వామమోషః (౨)సప్తానాం గిరీణాం పరస్తాద్విత్తం వేద్యమసురాణాం బిభర్తి తం జహి యది దుర్గే హన్తాఽసీతి స దర్భపుఞ్జీల ముద్వృహ్య సప్త గిరీన్భిత్త్వా తమహన్త్సోఽబ్రవీద్దుర్గాద్వా ఆహర్తాఽవోచథా ఏతమా హరేతి తమేభ్యో యజ్ఞ ఏవ యజ్ఞమాఽహర ద్యత్తద్విత్తం వేద్య మసురాణా మవిన్దన్త తదేకం వేద్యై వేదిత్వ [5]మసురాణామ్ (3)వా ఇయ మగ్ర ఆసీద్యావ దాసీనః పరాపశ్యతి తావద్దేవానాం తే దేవా అబ్రువ న్నస్త్వేవ నోఽస్యామపీతి కియద్వో దాస్యామ ఇతి యావదియగ్ం సలావృకీ త్రిః పరిక్రామతి తావన్నో దత్తేతి స ఇన్ద్రః సలావృకీ రూపం కృత్వేమాం త్రిః సర్వతః పర్యక్రామ త్తదిమా మవిన్దన్త యదిమా మవిన్దన్త తద్వేద్యై వేదిత్వమ్ (౪) [7]సా వా ఇయగ్ం సర్వైవ వేది రియతి శక్ష్యామీతి త్వా అవమాయ యజన్తే [8]త్రిగ్ంశత్పదాని పశ్చాత్తిరశ్చీ

భవతి షట్త్రి౨గ్ంశత్ప్రాచీ చతుర్వి౨గ్ంశతిః పురస్తా త్తిరశ్చీ దశ దశ సం పద్యన్తే దశాక్షరా విరాడన్నం విరాడ్విరాజై వాన్నాద్యమవ రున్ధ 9 ఉద్ధన్తి యదేవాస్యా అమేధ్యం తదప హన్త్య 10 ద్ధన్తి తస్మాదోష ధయః పరా భవన్తి బర్హిః స్తృణాతి తస్మాదోషధయః పునరా భవ 11 న్త్యుత్తరం బర్హిష ఉత్తరబర్హిః స్తృణాతి ప్రజా వై బర్హిర్యజమాన ఉత్తరబర్హి ర్యజమాన మేవాయజమానా దుత్తరం కరోతి తస్మా ద్యజమానోఽయజమానా దుత్తరః(౫)

[రున్ధే వామమోషో వేదిత్వ మసురాణాం వేదిత్వం భవన్తి పఞ్చవి౨గ్ంశతిశ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే చతుర్థోఽనువాకః ||౪||

## వేదార్థదీపిక

అవతారిక: తృతీయానువాకమునందు ఉపసద్ధోమములఁగూర్చి వివరింపఁబడినది. ఈ చతుర్థానువాకమునందు యజ్ఞశాలయందలి వేదినిఁగూర్చి చెప్పఁబడుచున్నది.

1. అర్థము: యే=ఏ యజ్ఞకర్తలు, ఉపసదః=ఉపసత్తులను, (ఉపసద్ధోమములను), ఉపయన్తి=పొందుచున్నారో (అనుష్ఠించుచున్నారో), ఏతే=వీరు, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, యన్తి వై=నిశ్చయముగ పొందుచున్నారు. తేషామ్=ఆ యజ్ఞకర్తలలో, యః=ఏ యజ్ఞకర్త, ఉత్=ఉపసద్ధోమానంతరము, నయతే=ఓదనాదికమును ఉదరములోనికి పొందించునో, సః=అతఁడు, హీయతే ఏవ=స్వర్గమునుండి నిశ్చయముగ హీనుఁడగుచున్నాఁడు. (తత్=ఆ కారణమువలన,) నోదనేషీతి=వ్రతానంతరము ఏ కొంచెము ఆహారము కూడ ఉదరములోనికి పోనీయనని నిశ్చయించినచో, సూన్నీయమివ=వాక్యాంతరముచే అభ్యనుజ్ఞాతమైన వస్తువును పాటించినట్లువలె, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ఉపసద్ధోమములు స్వర్గప్రాప్తి హేతువు లగుటచే తదనుష్ఠాత లీ వ్రతము ననుష్ఠించునపుడు జాగరూకులుగా నుండవలెను. ఉపసద్ధోమానంతరము యజ్ఞకర్త ఓదనాదికమును భుజించినచో, అతఁడు స్వర్గమును పొందలేఁడు. కావున ఆ యజ్ఞకర్త "వ్రతానంతరము నేను ఏమియు భోజనముగ గ్రహించను" అని నిశ్చయించినచో, అతఁడు కూష్మాండహోమ ప్రకరణమునందలి "పయో బ్రాహ్మణస్య వ్రతం యవాగూ రాజన్యస్యాఽఽమిక్షా వైశ్యస్య" ఇత్యాది వాక్యార్థమును పాటించినవాఁ డగును. అనఁగా ఉపసద్ధోమముల ననుష్ఠించిన యజ్ఞకర్త ఆ సమయమున అశక్తి పరిహారమునకై పయఃపానము చేయవలెను. అంతకంటె నధికముగ నాహారమును తీసికొనరాదు.

2. అర్థము: యః వై=ఎవఁడైతే, స్వార్థేతామ్=స్వార్థమైన ప్రయాగ స్నానాదికమును పొందుటకు ప్రయత్నించుచున్న, యతామ్=స్వగ్రామమునుండి వెళ్లుచున్నవారిలో, శ్రాన్తః=పోవుటకు అశక్తుఁడై, హీయతే=సంక్రాన్తి కాలీన స్నాన

మునుండి హీనుఁ డగుచున్నాఁడో, సః=అతఁడు, నిష్ప్రాయ=మఱునాడు బయలుదేరి తీర్థమునకు పోయి, సహ వసతి=తీర్థవాసులతో కూడ అవశిష్ట మాసము ఉంటున్నాఁడో, ఆ విధముగనే ఈ యజ్ఞకర్త కూడ ఒక అనువ్రతముచేత అశక్తిని పరిహరించి పరిశిష్ట నియమమును అనుష్ఠించవలెను.

తాత్పర్యము: ఒక పురుషుఁడు మాసము దినములు ప్రయాగయందు నదీస్నానము చేయవలెనని ప్రయాగకు పోవువారితో కూడ వెళ్లుచు, మార్గమధ్యమున అశక్తుఁడైనచో ఆ నాడు మార్గమధ్యమున విశ్రమించి మఱునాడు బయలుదేరి ప్రయాగకు పోయి శేషించినమాసము దినములు వారితో కూడ నదీస్నానాదికమును చేయువిధముగ యజ్ఞకర్త ఉపసద్ధోమములు చేసిన యనంతరము అశక్తిని పోఁగొట్టుకొనుటకు అనువ్రతముగ పయఃపానము చేసి శేషించిన నియమమును ఆచరించవచ్చును.

3. అర్థము: తస్మాత్=ఆ కారణమువలన, సకృత్=ఒక పర్యాయము, ఉత్ నీయ=ఉపసదాది కర్మానుష్ఠానాంతరము అశక్తి పరిహారమునకై 'పయస్సు'మొదలగు నేదియేని అల్పాహారమును తీసికొని, అపరమ్=మఱియొక ఆహారమును, నోన్నయేత=ఉదరములోనికి పోనీయరాదు.

తాత్పర్యము: ఉపసద్ధోమానుష్ఠాన కాలమునందు అశక్తుఁడైన యజమానుఁడు తాత్కాలికమైన అశక్తిని పోఁగొట్టుకొనుటకై ఓదనాదికమును తీసికొనరాదు కనుక క్షీరాదికమును తీసికొనవచ్చును. కాని ఒక పర్యాయము ఆ క్షీరాదికమును తీసికొనిన తరువాత మఱల మఱియొక అల్పాహారమును తీసికొనరాదు. ఒకటవ మంత్రార్థమునకు ఇచట ముగింపు చెప్పఁబడినది.

4. అర్థము: దధ్నా=పెరుఁగుచేత, ఉన్నయేత=ఆహార వ్రతమును స్వీకరించవలెను. ఏతత్=ఈ దధి, పశూనామ్=పశువులయొక్క, రూపం వై=రూపమే. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) రూపేణైవ=పశువులరూపమైన దధివ్రతముచేతనే, పశూన్=పశువులను, అవరున్ధే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: అశక్తుఁడైన యజమానుఁడు అశక్తిపరిహారమునకై ఒక పర్యాయము దధిని ఆహారముగా తీసికొనవలెను. దధి పశువుల క్షీరమునుండి యేర్పడును కావున పశురూపముగ వర్ణింపఁబడినది. కావున దధిని ఒకమారు ఆహారముగ గ్రహించిన యజమానుఁడు పశురూపముచేతనే పశువులను పొందును. (ఇచట సకృదున్నయనమునందు ద్రవ్యము విధింపఁబడినది.)

5. అర్థము: యజ్ఞః=యజ్ఞపురుషుఁడు, విష్ణుం రూపం కృత్వా=విష్ణురూపమును ధరించి, దేవేభ్యః=దేవతలనుండి, పలాయత=పాఱిపోయెను. సః=ఆ యజ్ఞపురుషుఁడు, పృథివీమ్=భూమిని, ప్రావిశత్=ప్రవేశించెను. దేవాః=దేవతలు, తమ్=ఆ యజ్ఞపురుషుని, హస్తాన్=చేతులను, సంరభ్య=చాచి, ఐచ్ఛన్=(గ్రహించుటకు,) కోరిరి. ఇన్ద్రః=ఇంద్రుఁడు, తమ్=ఆ యజ్ఞపురుషుని, ఉపరి ఉపరి=మున్ముందు, అత్యక్రామత్=అతిక్రమించెను. కః అయమ్=ఎవఁడు ఇతఁడు, మా=నన్ను, ఉపరి ఉపరి=మీఁది మీఁదికి (వచ్చి) అత్యక్రమీత్?=అతిక్రమించెను? ఇతి=అని, సః=ఆ యజ్ఞపురుషుఁడు, అబ్రవీత్=పలికెను. "అహమ్=నేను, దుర్గే=దుర్గమునందు, హన్తా=విరోధిని హింసించఁగలను. అథ=కాని, త్వమ్=నీవు, కః?=ఎవఁడవు?" ఇతి=అని, (ఆక్షిప్తః=ఆక్షేపింపఁబడిన యజ్ఞపురుషుఁడు,) "అహమ్=నేను, దుర్గాత్=దుర్గమునుండి, (తమ్=ఆ విరోధిని,) ఆహర్తా=తీసికొనివచ్చెడివాఁడను," ఇతి=అని, సః=ఆ యజ్ఞపురుషుఁడు, అబ్రవీత్=పలికెను. (కించ=మఱియు,) దుర్గే వై=దుర్గమునందే, హన్తా=విరోధిహన్తవై, అవోచథాః=పలికితివి. అయమ్=ఈ సుత్యాహరభిమాని దేవత, వరాహః=వరాహమై, వామమోషః=కమనీయమైన సౌమిక వేది గ్రహచమసాదిరూప దైవవిత్తమును దొంగిలించునదియై, సప్తానాం గిరీణామ్=పృథివియందలి ఏడుకొండలకు, పరస్తాత్=పరభాగమునందు, వేద్యమ్=దేవతలు పొందఁదగియున్న, విత్తమ్=దైవికమైన ధనమును, అసురాణామ్=అసురనిమిత్తము, బిభర్తి=భరించుచున్నది. (హే ఇన్ద్ర!=ఓ

యింద్రా! త్వమ్=నీవు,) దుర్గే=దుర్గమునందు, యది హన్తా అసి=విరోధి హన్తకుఁడవుగా ఉన్నచో, తమ్=ఆ వరాహమును, జహి=హింసించుము. ఇతి=అని, అబ్రవీత్=పలికెను. సః=ఆ యింద్రుఁడు, దర్భపుఞ్జీలమ్=దర్భలసముదాయమును ఉద్వృహ్య=పైకి పట్టుకొని, సప్త గిరీన్=ఏడు కొండలను, భిత్త్వా=భేదించి, తమ్=ఆ వరాహమును, అహన్=కొట్టెను. "దుర్గాత్=దుర్గమునుండి, ఆహర్తా=శత్రువును తీసికొనిరాఁగలను," ఇతి=అని, అవోచథాః వై=చెప్పితివి కదా, ఏతమ్=ఈ విరోధియైన వరాహమును, ఆ హర=తెమ్ము, ఇతి=అని, సః=ఆ యింద్రుఁడు, అబ్రవీత్=పలికెను.

యజ్ఞః ఏవ=యజ్ఞపురుషుఁడే, తమ్=ఆ వరాహాకారమైన వేది గ్రహ చమసాది విత్తోపేత యజ్ఞమును, ఏభ్యః=ఈ దేవతలకొఱకు, ఆ హరత్=తెచ్చెను. యత్=ఏ కారణమువలన, వేద్యమ్=దేవతలు పొందఁదగిన, అసురాణాం తత్ విత్తమ్=అసురులయొక్క ఆవిత్తమును, అవిన్దన్త=దేవతలు పొందిరో, తత్=ఆ కారణము వలన, వేద్యై=వేదికి, వేదిత్వమ్=వేదిత్వము, ఏకమ్=ఒక విధము, (భవతి=అగుచున్నది.)

**తాత్పర్యము:** స్వర్గలోకమునందలి యజ్ఞపురుషుఁడు విష్ణురూపమును ధరించి దేవతలనుండి పాఱిపోయి భూలోకమును ప్రవేశించెను. దేవతలును ఆ యజ్ఞపురుష ననుసరించి వచ్చి చేతులను చాఁచి, ఆ యజ్ఞపురుషుని పట్టుకొనఁ దలఁచిరి. ఈ యజ్ఞపురుషుఁడు ఎచ్చటకు పోవుచుండెనో, ఇంద్రుఁడు అచ్చటకు ముందుగా పోయి. ఆ యజ్ఞపురుష నతిక్రమించి యతని మార్గము నడ్డగించుచుండెను. ఎవఁడితఁడు నా మార్గము నడ్డగించుచున్నాఁడు?, అని యింద్రుని యజ్ఞపురుషుఁ డడిగెను. ఎవ్వఁడును ప్రవేశించుటకు సాధ్యము కాని దుర్గమునందుండి విరోధిని కొట్టఁగలనని యింద్రుఁడు తన మహిమను ప్రకటించుకొనెను. మఱియు నా శక్తిని పరీక్షించునట్టి నీవు ఎవరవు? అని యజ్ఞపురుషుని ప్రశ్నించెను. అట్టి విరోధిని దుర్గమునుండి తీసికొనిరాగలనని యజ్ఞపురుషుఁడు తన శక్తిని ప్రతిజ్ఞ చేసెను.

ప్రతిజ్ఞ చేసిన యజ్ఞపురుషుఁడు ఇంద్రునియెదుట తనపూర్వవృత్తాంతము నీ విధముగ చెప్పకొనెను. "పూర్వ మొకప్పుడు అసురప్రాబల్యమును చూచి, నా యంగము లయిన దీక్షాద్యభిమానులగు స్వర్గలోకవాసు లందఱు నానుండి తొలఁగి పృధివిని ప్రవేశించిరి. దీక్షాదులనఁగా, "నాలుగు దీక్షలు, మూఁడు ఉపసత్తులు, ఒక్కటి సుత్య" అనెడి అష్టదివస సాధ్యము లయిన కర్మలు. వానిలో దీక్షోపసత్తులు ఏడును భూమి యందు వెళ్లి పర్వతములైనవి. సుత్యాభిమాని దేవత కమనీయమైన సౌమిక వేది గ్రహ చమసాదిరూప దైవవిత్తము నపహరించి దాని నంతటిని అసురులకు ఇచ్చి తాను వరాహముగా అయి ఆ కొండలకు పరభాగమున ఆ విత్తమును అసురుల నిమిత్తము రక్షించుచున్నాఁడు. ఆ విత్తము మఱల దేవతలు పొందఁదగినది. కావున, ఓ యింద్రా! నీవు దుర్గమునందలి విరోధిని కొట్టఁగలవాఁడవైనచో, ఆ వరాహమును కొట్టుము" అని యజ్ఞపురుషుఁడు తన పూర్వవృత్తాంతమును ఇంద్రునకు వినిపించెను.

అప్పు డింద్రుఁడు దర్భకట్టుచేతనే ఆ పర్వతములను భేదించి "ఓ యజ్ఞపురుషా! దుర్గమునుండి విరోధిని తెచ్చెదనని ప్రతిజ్ఞ చేసితివి కదా! ఆ ప్రతిజ్ఞను నెఱవేర్చుటకు సమర్థుఁడవైనచో, ఈ విరోధియైన వరాహమును తెమ్ము" అని యజ్ఞపురుషునితో ననెను. అప్పుడు యజ్ఞపురుషుఁడే వరాహాకారమును, వేది గ్రహ చమసాది విత్తోపేతమునైన ఆ యజ్ఞమును తెచ్చి యీ దేవతల కొసఁగెను. దేవతలు పొందఁదగిన అసురులయొక్క ఆ వేదిరూప విత్తమును దేవతలు పొందిరి కావున, విద్యతే=లభ్యతే, అను వ్యుత్పత్తిచే వేదికి **'వేది'** యను పేరు సంపన్న మైనది. ఇది యొక పద్ధతి.

6. **అర్థము:** అగ్రే=మొదట, అసురాణాం వై=అసురులకే, ఇయమ్=ఈ భూమి, ఆసీత్=ఉండెను. ఆసీనః=కూర్చున్నవాఁడై, యావత్=ఎంత ప్రదేశమును, పరాపశ్యతి=బాగుగ చూచుచున్నాఁడో, తావత్=అంత భూమి, దేవానామ్=దేవతలకు, ఆసీత్=ఉండెను. 'అస్యామపి=ఈ భూమియందుఁగూడ, నః=మాకు, (భాగః=భాగము,) అస్త్వేవ=తప్పక

ఉండవలెను.' ఇతి=అని, తే=ఆ దేవతలు, అబ్రువన్=పలికిరి. 'కియత్=ఎంతభాగము, వః=మీ(దేవతల)కొఱకు, దాస్యామః=ఈయఁగలము? (ఈయవలెను?) ఇతి=అని, (అసురాః=అసురులు, అపృచ్ఛన్=అడిగిరి.) ఇయం సలాకీ=ఈ సలాకి, యావత్=ఎంత ప్రదేశమును, త్రిః=మూఁడు మారులు, పరిక్రామతి=అంతటను తిరుగుచున్నదో, తావత్=అంతభూమిని, నః=మా(దేవతల)కొఱకు, దత్త=ఒసఁగుఁడు.' ఇతి=అని, (దేవాః=దేవతలు, అబ్రువన్=పలికిరి.) సః ఇన్ద్రః=ఆ యింద్రుఁడు, సలావృకీరూపమ్=సలావృకిరూపమును, కృత్వా=చేసి (పొంది), ఇమామ్=ఈ భూమిని, త్రిః=మూఁడు పర్యాయములు, సర్వతః=అంతటను, పర్యక్రామత్=తిరిగెను. తత్=ఆ కారణమువలన, (దేవాః=దేవతలు,) ఇమామ్=ఈ భూమిని, అవిన్దన్త=పొందిరి. యత్=ఏ కారణమువలన, ఇమామ్=ఈ భూమిని, అవిన్దన్త=పొందిరో, వేద్యై=వేదికి, వేదిత్వమ్='వేది' అను పేరు. (ఆసీత్=అయెను.)

తాత్పర్యము: మొదట ఈ భూమి అసురులకే ఉండెను. కూర్చుండి యెంత భూభాగమును చూడఁగలఁడో, అంత భూమి దేవతలకు ఉండెను. ఈ రాక్షసుల భూమియందుఁ గూడ, తమకు భూభాగము కావలెనని దేవతలు పలికిరి. 'మీకు ఎంత భూమి నొసఁగవలెను?' అని రాక్షసులు దేవతల నడిగిరి. సలావృకి మూఁడు పర్యాయములు ఎంత భూమిని తిరుగునో, ఆ భూమి యంతయు కావలెనని అడుగఁగా, ఇంద్రుఁడు సలావృకీ రూపమును ధరించి మూఁడు మారులు భూమి నంతటను తిరిగెను. ఈ విధముగ దేవత లీ వేది భూమిని పొందిరి. కావున వేది భూమికి 'వేది' అను పేరు సిద్ధించినది. [ఈ ఉపాఖ్యానము దర్శపూర్ణమాస సంబంధమైన వేది బ్రాహ్మణమునందు శ్రుత మైనది. "వసవ స్త్వా" ఇత్యాది మంత్రములచే ఎంత భూమి పరిగ్రహించఁబడునో, తావన్మాత్రమే వేది భూమి. కాని యిచట సర్వభూమియు వేదిగా చెప్పఁబడినది.]

7. అర్థము: సా ఇయం సర్వైవ=ఆ ఈ సర్వభూమియు, వేదిః వై=వేదియే. (కిం తు=కాని,) ఇయతి=ఈ మాత్రపు పరిమితి గల భూమియందు, శక్ష్యామి=(సదోహవిర్ధానాదికమును నిర్మించుటకు) సమర్థుఁడను కాఁగలను, ఇతి=అని, త్వా=నిన్ను, (భూమిని,) అవమాయ=కొలిచి, యజన్తే=యాగము చేయవలెను.

తాత్పర్యము: భూమి యంతయు వేదియే కాని, ఈ మాత్రపు పరిమితి కల భూ ప్రదేశమునందు సదోహవిర్ధానాదికమును నిర్మించుటకు సమర్థుఁడను కాఁగలనని నిశ్చయించి ఆ భూభాగమును కొలిచి యచట యాగము చేయవలెను. భూమి యంతయు వేదియైనను యాగోపయుక్త ప్రదేశమే వేదికి కల్పించవలెనని యీ మంత్రము చెప్పుచున్నది.

8. అర్థము: పశ్చాత్=పశ్చిమదిక్కునందు, త్రింశత్ పదాని=ముప్పది అడుగుల ప్రదేశము, తిరశ్చీ=అడ్డముగా, భవతి=ఉండవలెను. షట్త్రింశత్=ముప్పదియాఱు అడుగులు, ప్రాచీ=తూర్పుదిక్కు. పురస్తాత్=ముందుభాగమున, చతుర్వింశతిః=ఇరువదినాలుగు అడుగులు, తిరశ్చీ=అడ్డముగా, భవతి=ఉండవలెను. దశ దశ=(ఈ అడుగుల సంఖ్యయందు,) నవదశకములు, సంపద్యన్తే=సంపన్నము లగుచున్నవి. విరాట్=విరాట్ఛందస్సు, దశాక్షరా=పది యక్షరములు కలది. అన్నమ్=అన్నము, విరాట్=విరాట్స్వరూపము. (ఏషః=నవదశక సంఖ్యాక పద పరిమిత ప్రదేశమును కొలిచిన యీ యజమానుఁడు,) విరాజైవ=విరాట్టుచేతనే, అన్నాద్యమ్=శ్రేష్ఠమైన యన్నమును, అవరున్ధే=పొందును.

తాత్పర్యము: స్పష్టము.

9. అర్థము: ఉద్ధన్తి=(పూర్వోక్త ప్రదేశమునందలి మృత్తికను) పెల్లగించవలెను. అస్యాః=ఈ భూమియొక్క, యత్ అమేధ్యమ్=అపరిశుద్ధమైన వస్తువేది, (అస్తి=కలదో,) తత్=దానిని, అపహన్తి=తొలఁగించవలెను.

తాత్పర్యము: పూర్వోక్త పరిమాణము కల ప్రదేశముయొక్క పైభాగమునందలి మృత్తికను పెల్లగించి యచట ఉన్నటువంటి అపరిశుద్ధ పదార్థమును తీసివేయవలెను. (నిష్ఠీవనాదికమువలన ఏర్పడిన అశుచిత్వమును మట్టిని పెల్లగించుటచే పోఁగొట్టవలెనని భావము.)

10. అర్థము: ఉద్ఘన్తి=పూర్వోక్తవిధముగ మట్టిని పెల్లగించవలెను. తస్మాత్=ఆ పెల్లగించుటవలన, ఓషధయః=తృణవిశేషములు, పరాభవన్తి=పరాభూతము లగుచున్నవి. (అతః=ఇందువలన, బర్హిః=బర్హిస్సును, స్తృణాతి=పఱచవలెను. తస్మాత్=ఆ బర్హిరాస్తరణమువలన, ఓషధయః=తృణవిశేషములు, పునః ఆ భవన్తి=మఱల వచ్చినవి యగుచున్నవి.

తాత్పర్యము: పైని చెప్పిన విధముగ మట్టిని త్రవ్వి తీసివైచినచో అచటనున్న తృణవిశేషములు పోవును. ఆ దోషము పోవుటకై ఆ ప్రదేశమునందు బర్హిస్సును పఱచవలెను. బర్హిస్సును పఱచుటవలన ఆ తృణవిశేషాదులు మఱల వచ్చినవి యగును. ఇచట పూర్వవిధి ననువదించి తత్ప్రశంస చేయఁబడినది.

11. అర్థము: బర్హిషః ఉత్తరమ్=(పూర్వోక్త)బర్హిస్సునకు ఉపరిభాగమున, ఉత్తరబర్హిః=ఉత్తరవేది ప్రదేశమునందు బర్హిస్సును, స్తృణాతి=పఱచవలెను. ప్రజాః వై=ప్రజలే, బర్హిః=బర్హిస్స్వరూపులు. యజమానః=యజమానుఁడు, ఉత్తరబర్హిః=ఉత్తరవేది ప్రదేశమునందలి బర్హిస్స్వరూపుఁడు. (అతః=ఈ కారణమువలన, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అయజమానాత్=యజ్ఞకర్త కానివానికంటె, యజమానమేవ=యజమానునే, ఉత్తరమ్=ఉత్కృష్టునిగా, కరోతి=చేయుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, అయజమానాత్=యజమానుఁడు కానివానికంటె, యజమానః=యజమానుఁడు, ఉత్తరః=శ్రేష్ఠుఁడు.

తాత్పర్యము: వేదియందు బర్హిరాస్తరణము విహిత మైనది. అగ్నీషోమీయ పశునిమిత్తము ఉత్తరవేది ప్రదేశమునందు ఆ బర్హిస్సున కుపరిభాగమున బర్హిస్సును పఱచవలెను. ప్రజలే బర్హిస్స్వరూపులు. యజమానుఁడు ఉత్తర బర్హిస్స్వరూపుఁడు. ఈ విధముగ బర్హిస్సున కుపరిభాగమున బర్హిస్సును పఱచిన అధ్వర్యుఁడు యజ్ఞకర్త కాని వానికంటె యజ్ఞకర్తను ఉత్కృష్టునిగా చేసినవాఁ డగుచున్నాఁడు. ఆ కారణమువలన అయజమానునికంటె యజమానుఁడు ఉత్కృష్టుఁడు.

చతుర్థానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః

మూలము: [1]యద్వా అనీశానో భారమాదత్తే వి వై స లిశతే యద్ద్వాదశ సాహ్నాస్యోపసదః స్యుస్తిస్రో ఽహీనస్య యజ్ఞస్య విలోమ క్రియేత తిస్ర ఏవ సాహ్నాస్యోపసదో ద్వాదశాహీనస్య యజ్ఞస్య సవీర్యత్వాయాథో సలోమ క్రియతే [2]వత్సస్యైకః స్తనో భాగీ హి సోఽథైకగ్ం స్తనం వ్రతముపైత్యథ ద్వావథ త్రీనథ చతుర ఏతద్వై (౧)క్షురపవి నామ వ్రతం యేన ప్ర జాతా న్భ్రాతృవ్యా న్నుదతే ప్రతి జనిష్యమా ణానథో కనీయసైవ భూయ ఉపైతి [3]చతురోఽగ్రే స్తనాన్వ్రత ముపైత్యథ త్రీనథ ద్వావథైకమే తద్వై సుజఘనం నామ వ్రతం తపస్యగ్ం సువర్గ్యమథో ప్రైవ జాయతే ప్రజయా పశుభి [4]ర్యవాగూ రాజన్యస్య వ్రతం క్రూరేవ వై యవాగూః క్రూర ఇవ (౨)రాజన్యో వజ్రస్య రూపగ్ం సమృద్ధ్యై [5]ఆమిక్షా వైశ్యస్య పాకయజ్ఞస్య రూపం పుష్ట్యై [6]పయో బ్రాహ్మణస్య తేజో వై బ్రాహ్మణస్తేజః పయస్తేజసైవ తేజః పయ ఆత్మన్ధత్తేఽథో పయసా వై గర్భా వర్ధన్తే గర్భ ఇవ ఖలు వా ఏష యద్దీక్షితో యదస్య పయోవ్రతం భవత్యాత్మానమేవ తద్వర్ధయతి [7]త్రివ్రతో వై మనురాసీద్ద్వివ్రతా అసురా ఏకవ్రతాః (౩)దేవాః ప్రాతర్మధ్యందినే సాయం తన్మనోర్వ్రత మాసీత్పాకయజ్ఞస్య రూపం పుష్ట్యై ప్రాతశ్చ సాయం చాసురాణాం నిర్మధ్యం క్షుధో రూపం తతస్తే పరాఽభవ న్మధ్యందినే మధ్యరాత్రే దేవానాం తత స్తేఽభవన్సువర్గం లోకమాయ [8]న్యదస్య మధ్యందినే మధ్యరాత్రే వ్రతం భవతి మధ్యతో వా అన్నేన భుఞ్జతే మధ్యత ఏవ తదూర్జం ధత్తే భ్రాతృవ్యాభిభూత్యై భవత్యాత్మనా

(౪)పరాఽస్య భ్రాతృవ్యో భవతి [9]గర్భో వా ఏష యద్దీక్షితో యోనిర్దీక్షితవిమితం యద్దీక్షితో దీక్షిత విమితా త్ప్రవసేద్యథా యోనేర్గర్భః స్కన్దతి తాదృగేవ తన్న ప్రవస్తవ్య మాత్మనో గోపీథా [10]యైష వై వ్యాఘ్రః కులగోపో యదగ్నిస్తస్మా ద్యద్దీక్షితః ప్రవసేత్స ఏన మీశ్వరోఽనూత్థాయ హన్తోర్న ప్రవస్తవ్య మాత్మనో గుప్త్యై [11]దక్షిణతః శయ ఏతద్వై యజమానస్యాఽఽయతనగ్ం స్వ ఏవాఽఽయతనే శయే [12]ఽగ్నిమభ్యావృత్య శయే దేవతా ఏవ యజ్ఞ మభ్యావృత్య శయే (౫)||

[ఏతద్వై క్రూర ఇవైకవ్రతా ఆత్మనా యజమానస్య త్రయోదశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః ||౫||

## వేదార్థదీపిక

అవతారిక: చతుర్థానువాకమునందు ప్రాచీనవంశ మనెడి యాగశాలయందు నిర్మించవలసిన వేదిని గుఱించి చెప్పఁబడినది. ఈ పంచమానువాకమునందు వ్రతనిరూపణము చేయఁబడుచున్నది.

1. అర్థము: అనీశానః=అసమర్థుఁడు(అశక్తుఁడు), భారమ్=బరువును, ఆదత్తే యత్ వై=(మోయుటకు)తీసికొనినచో, సః=వాఁడు, విలిశతే వై=అల్పుఁడే యగుచున్నాఁడు. సాహ్నస్య=ఏకాహ జ్యోతిష్టోమ యాగమునకు, ద్వాదశ=పంద్రెండు, ఉపసదః=ఉపస దాహుతులు, అహీనస్య యజ్ఞస్య=అహస్సంఘసాధ్యమైన ద్విరాత్రాదిరూప జ్యోతిష్టోమమునకు, తిస్రః=మూఁడు ఉపస దాహుతులును, యత్ స్యుః=ఉండునెడల, విలోమ=విపరీతము, క్రియేత=చేయఁబడిన దగును. (తత్=ఆ కారణమువలన,) సాహ్నస్య=ఏకాహ జ్యోతిష్టోమయాగమునకు, తిస్రః ఉపసదః ఏవ=మూఁడు ఉపస దాహుతులే, స్యుః=ఉండవలెను. అహీనస్య యజ్ఞస్య=అహస్సంఘసాధ్య ద్విరాత్రాది రూపమైన అహీనజ్యోతిష్టోమమునకు, ద్వాదశ ఉపసదః=పంద్రెండు ఉపసదాహుతులు, స్యుః=ఉండవలెను. తథా సతి=అట్లు కాఁగా, సవీర్యాయ=వీర్యసహిత యజ్ఞముకొఱకు (భవతి=అగుచున్నది). అథో=మఱియు, సలోమ=సరూపము, క్రియతే=చేయఁబడిన దగుచున్నది.

తాత్పర్యము: జ్యోతిష్టోమ యాగము ఏకాహస్సాధ్యము, అనేకాహస్సాధ్యము అని రెండు విధములుగ నున్నది. రెండవదానికి అహీనమని వ్యవహారము. ఏకాహరూప జ్యోతిష్టోమ యాగమునందు పంద్రెండు ఉపస దాహుతులను, అహీన జ్యోతిష్టోమమునందు మూఁడు ఉపస దాహుతులను హోమము చేసినచో అది విపరీత మగును. అశక్తుఁడు తనకు మించిన బరువును మోయుటకై తీసికొనినచో ఆ బరువును పైకి ఎత్తలేక భూమియందు పడును. ఏకాహ జ్యోతిష్టోమమునందు పంద్రెండు ఉపసత్తులను గ్రహించుట అటువంటిదే యగును. వీర్యము హీన మగును కూడ. కావున ఏకాహ జ్యోతిష్టోమమునందు మూఁడు ఉపసత్తులు, అహీన జ్యోతిష్టోమమునందు పంద్రెండు ఉపసత్తులును ఉండవలెను. ఈ విధముగ గ్రహించినచో ఈ యాగము వీర్యవంత

మగును. మఱియు విపరీతము చేసినట్లు కాదు. ["తిస్ర ఉపసద ఉపైతి ద్వాదశాహీనే సోమ ఉపైతి" అని రెండవ యనువాకమునందు చెప్పఁబడిన విషయమున విపక్ష స్వపక్షములందలి దోష దోషాభావము లిచట వివరింపఁబడినవి.]

2. అర్థము: వత్సస్య=దూడకు, ఏకః స్తనః=ఒక స్తనము, భాగీ హి=భాగము కలది కదా! సః=ఆ యజమానుఁడు, అథ=మొదట, ఏకం స్తనమ్=ఒక స్తనమును, వ్రతమ్=వ్రతమునుగా, ఉపైతి=పొందవలెను. అథ=పిమ్మట, ద్వౌ=రెండు స్తనములను, అథ=అనంతరము, త్రీన్=మూఁడు స్తనములను, అథ=తరువాత, చతురః=నాలుగు స్తనములను, ఉపైతి=పొందవలెను. ఏతత్ వై=ఇదియే, క్షురపవి నామ=క్షురపవి అను పేరు కల, వ్రతమ్=వ్రతము. యేన=ఏ క్షురపవి వ్రతముచే, జాతాన్=పుట్టిన, భ్రాతృవ్యాన్=శత్రువులను, ప్రణుదతే=పోఁగొట్టుచున్నాఁడో, జనిష్యమాణాన్=పుట్టఁబోవు శత్రువులను, ప్రతి నుదతే=పోఁగొట్టుచున్నాఁడో, అథో=మఱియు, కనీయసైవ=అల్పమైన కర్మచేతనే(బీజముచేతనే,) భూయః=ప్రౌఢమైన (వృక్షమును) ఫలమును, ఉపైతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వము మూఁడవ అనువాకమునందు విహితమైన ఆరాగ్రావ్రతము ఇచట ప్రశంసించఁబడుచున్నది. ఇది అవాంతరదీక్ష. గోవత్సము ప్రథమమున తన తల్లి పాలపొదుగులోని స్తనములలో ఒక స్తనమునుండి పాలు త్రాగును. పిమ్మట మిగిలిన స్తనములనుండి వరుసగా పాలు త్రాగును. ఆ విధముగనే యజ్ఞకర్త సోమక్రయ కాలమునందు ఆరాగ్రావ్రత మనెడి అవాంతరదీక్షను వహించినప్పుడు ప్రథమ దినమున సాయంకాలమునందు గోస్తనములలో ఒక స్తనమునుండి పాలు పితుకవలెను. రెండవనాటి యుదయమున రెండు స్తనములనుండి, ఆ సాయంతనము మూఁడు స్తనములనుండియు, మూఁడవనాటి యుదయమున నాలుగు స్తనములనుండియు పాలు పితుకవలెను. ఈ వ్రతము క్షురపవి వ్రతమని చెప్పఁబడును. ఈ వ్రతముచేత యజ్ఞకర్త భూత భవిష్యత్కాలములందలి శత్రువులను పోఁగొట్టును. ప్రథమమున ఏకస్తన క్షీరముతో ప్రారంభమై చివరకు చతుస్తనముల క్షీరముతో సమాప్త మగునది కావున అల్పమైన బీజముచే నధికమైన వృక్షమును పొందువిధముగ అల్పమైన కర్మప్రారంభముచే అధికమైన ఫలమును పొందును. క్షురపవి అనఁగా, పదనైన వజ్రాయుధము అని అర్థము. వజ్రాయుధముచే శత్రుసంహారము చేయువిధముగ ఈ క్షురపవివ్రతముచే యజ్ఞకర్త శత్రువులను పోఁగొట్టఁగలుగునని భావము.

3. అర్థము: అగ్రే=ప్రథమమున, చతురః స్తనాన్=నాలుగు స్తనములనుండి పాలు పితుకవలెననెడి, వ్రతమ్='పరోవరీయసి' అనెడి వ్రతమును, ఉపైతి=(యజ్ఞకర్త)పొందవలెను. అథ=పిమ్మట, త్రీన్=మూఁడు స్తనములను, అథ=అనంతరము, ద్వౌ=రెండు స్తనములను, అథ=తరువాత, ఏకమ్=ఒక స్తనమును, (దుహ్యాత్=పితుకవలెను.) ఏతత్ వై=ఇదియే, సుజఘనం నామ వ్రతమ్=సుజఘన నామకమైన వ్రతము. తపస్యమ్=తపస్సునకు యోగ్యమైనది. సువర్గ్యమ్=స్వర్గసాధన మైనది. అథో=మఱియు. (యజమానః=యజమానుఁడు,) అనేన=ఈ వ్రతముచేత, ప్రజయా=సంతానములోను, పశుభిః=పశువులతోను, ప్రజాయతే ఏవ=నిశ్చయముగ పుట్టుచున్నాఁడు.

తాత్పర్యము: పరోవరీయసి అనెడి ఈ అవాంతరదీక్ష కూడ మూఁడవ అనువాకమున చెప్పఁబడినది. దీనికే సుజఘనవ్రతమని పేరు కలదు. రూపవతియైన స్త్రీకి జఘనప్రదేశము స్థూలముగాను, తదుపరిభాగమైన శరీర మధ్యప్రదేశము అల్పముగాను ఉండును. అట్టి సుజఘనయైన యువతి యోగ్యసంతానమును కనుటకు అర్హురాలుగా నుండును. ఆ విధముగనే ఈ సుజఘనవ్రతముయొక్క ప్రారంభము చతుస్స్తనములు కలదిగాను, ఉపరిభాగము ఏక స్తనముగాను ఉండుటచే తపోయోగ్యము, స్వర్గసాధనమునై ప్రజోత్పాదకము, పశూత్పాదకము కూడ నగుచున్నది. ఇచట 'పరోవరీయసి' అను అవాంతరదీక్ష ప్రశంసించఁబడినది.

4. అర్థము: రాజన్యస్య=క్షత్రియునకు, యవాగూః=యవాగు ఆహారము, వ్రతమ్=వ్రతము. యవాగూః=యవాగు ద్రవ్యము, క్రూరేవ వై=క్రూరమైనదివలెనే, (అస్తి=ఉంటున్నది.) రాజన్యః=రాజు, క్రూరః ఇవ=క్రూరునివలెనే, (భవతి=అగుచున్నాఁడు తత్=ఆ యుభయము, మిలిత్వా=కలసి,) వజ్రస్య=వజ్రముయొక్క, రూపమ్=రూప ముగా అయి, సమృద్ధ్యై=సమృద్ధికొఱకు, (భవతి=అగుచున్నది.)

తాత్పర్యము: యజ్ఞము చేయునట్టి త్రైవర్ణికులలో క్షత్రియుఁడైన యజ్ఞకర్త యవాగువును (జావ, లేదా, గంజిని) ఆహారముగా తీసికొనవలెను. జావ కాని, గంజి కాని, అన్నమువలె తృప్తికరముగ నుండదు కనుక అది క్రూర మైనది. రాజు దుష్టశిక్షకుఁడు కావున క్రూరుఁడు. ఆ యుభయము కలసి వజ్రసదృశమై అనిష్ట నివారక మగుటచే సమృద్ధికి కారణ మగుచున్నది. (ఇచట క్షత్రియుఁడైన యజ్ఞకర్తకు ఆహారముగా యవాగూ ద్రవ్యము విహిత మైనది.)

5. అర్థము: వైశ్యస్య=యజ్ఞకర్తయైన వైశ్యునకు, ఆమిక్షా=ఆమిక్ష, (వ్రతమ్=వ్రతము.)పాకయజ్ఞస్య=పాకయజ్ఞముయొక్క, రూపమ్=రూపమైన ఈ ఆమిక్షాద్రవ్యము, పుష్ట్యై=పుష్టికొఱకు, భవతి=అగుచున్నది. [ఆమిక్షా=కాఁచిన పాల యందు దధి నుంచుటచే నేర్పడిన ఘనీభూత భాగము. పాకయజ్ఞః=పురోడాశాదికముచే చేయఁబడిన యజ్ఞము. ఆమిక్ష పక్వమైన పయస్సునుండి నిష్పన్న మగుటచే పాకయజ్ఞముయొక్క రూపముగా వర్ణింపఁబడినది.]

తాత్పర్యము: యజ్ఞము చేయునట్టి త్రైవర్ణికులలో వైశ్యుఁడు ఆమిక్ష నాహారముగా తీసికొనవలెను. ఆమిక్ష పాకయజ్ఞ ముయొక్క రూపము. అది పుష్టికి కారణమగును.(యజ్ఞకర్తయైన వైశ్యునకు ఇచట ఆమిక్షావ్రతము విహిత మైనది.]

6. అర్థము: బ్రాహ్మణస్య=యజ్ఞకర్తయగు బ్రాహ్మణునకు, పయః=క్షీరము, (వ్రతమ్=వ్రతము.) బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, తేజః వై=తేజోరూపుఁడే. పయః=క్షీరము, తేజః=తేజస్స్వరూపము. (ఏవం సతి=ఇట్లు కాఁగా, అయమ్=పయో వ్రతమును స్వీకరించిన ఈ యజ్ఞకర్త) ఆత్మన్=తనయందు, తేజః ఏవ=తేజస్సునే, ధత్తే=ధరించుచున్నాఁడు. అథో=మఱియు, పయసా వై=క్షీరముచేతనే, గర్భాః=గర్భములు, వర్ధన్తే=వృద్ధి నొందుచున్నవి. దీక్షితః యత్=దీక్షితుఁ డనుట యేది కలదో, ఏషః=ఈ దీక్షితుఁడు, గర్భః ఇవ ఖలు వై=గర్భమువంటివాఁడే కదా! అస్య=ఈ యజ్ఞదీక్షితునకు, పయః=క్షీరము, వ్రతమ్=వ్రతముగా, భవతి యత్=అగుచున్నచో, తత్=ఆ పయస్సుచే, ఆత్మానమేవ=తననే, వర్ధయతి=వృద్ధి నొందించుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడైన బ్రాహ్మణుఁడు పయోవ్రతమును స్వీకరించవలెను. (అనఁగా క్షీరమును ఆహారముగా తీసికొనవలెను.) బ్రాహ్మణుఁడు (అధ్యాపనాది రూపముచే,) తేజోరూపుఁడు. పయస్సు (తేజస్సువలె స్వచ్ఛరూప మగుటచే స్వయముగనే తేజోరూపము కావున పయోవ్రతము నవలంబించిన యజ్ఞదీక్షితుఁడైన బ్రాహ్మణుఁడు తేజస్సుచేతనే తేజోరూప పయస్సు నాత్మయందు ధరించును. మఱియు పయస్సుచేతనే గర్భములు వృద్ధి నొందుచున్నవి. దీక్షితుఁడు గర్భమువంటివాఁడే కదా! కనుక ఈ దీక్షితుఁడైన బ్రాహ్మ ణునకు పయోవ్రత మున్నచో, ఆ పయస్సుచే నితఁడు తననే వృద్ధి నొందించుకొనును. (ఇచట బ్రాహ్మణ దీక్షితునకు పయోవ్రతము విహిత మైనది.)

7. అర్థము: మనుః=మనువు, త్రివ్రతః=మూఁడు కాలములందు వ్రతము కలవాఁడుగా, ఆసీత్=ఉండెను. అసురాః=రాక్ష సులు, ద్వివ్రతాః=ద్వికాలములందు వ్రతము కలవారుగా, (ఆసన్=ఉండిరి.) దేవాః=దేవతలు, ఏకవ్రతాః=ఏకకా లమునందు వ్రతము కలవారుగా, (ఆసన్=ఉండిరి.) మనోః=మనువునకు, ప్రాతః=ప్రాతఃకాలమునందు, మధ్యం దినే=మధ్యాహ్నమునందు, సాయమ్=సాయంకాలమునందు, తత్ వ్రతమ్=ఆ వ్రతము, ఆసీత్=ఉండెను. (తత్=ఆ వ్రతము,) పాకయజ్ఞస్య=పాకయజ్ఞముయొక్క, రూపమ్=రూపము. (ఇదమ్=ఈ వ్రతము,) పుష్ట్యై=పుష్టికొఱకు, (భవతి=అగుచున్నది.) ప్రాతః చ =ప్రాతఃకాలమునందును, సాయం చ=సాయంకాలము

నందును, నిర్మధ్యమ్=మధ్యాహ్నకాల రహితమైన (వ్రతమ్=వ్రతము, అసురాణామ్=అసురులకు, **ఆసీత్**=ఉండెను. సః కాలః=ఆ మధ్యాహ్నకాలము,) క్షుధః=ఆఁకలియొక్క, రూపమ్=రూపము. **తతః**=ఆ మధ్యాహ్నకాలమునందు వ్రతము లేకుండుటవలన, **తే**=ఆ అసురులు, పరాఽభవన్=పరాభూతులైరి. మధ్యందినే=మధ్యాహ్నకాలమునందు, మధ్యరాత్రే=మధ్యరాత్రమునందును, దేవానామ్=దేవతలకు, (వ్రతమ్=వ్రతము, **అస్తి**=కలదు.) **తతః**=ఆ కారణమువలన, **తే**=ఆ దేవతలు, అభవన్=విజయులైరి. సువర్గం లోకమ్=స్వర్గలోకమును, **ఆయన్**=పొందిరి.

తాత్పర్యము: మనువు యజ్ఞదీక్షితుఁడై అహస్సుయొక్క త్రికాలములందును (భోజన)వ్రతము నవలంబించుటచేతను, ఆ త్రికాలవ్రతము పాకయజ్ఞముయొక్క స్వరూపమగుటచేతను, ఆ వ్రతము పుష్టికి కారణ మైనది. అసురులు ప్రాత స్సాయంకాలముల రెండింటియందు వ్రతమును గ్రహించిరి. మధ్యాహ్నకాలము ఆఁకలియొక్క రూప మగుటచే ఆ మధ్యాహ్న సమయమున (భోజన)వ్రతము నవలంబించని కారణముచే అసురులు పరాభూతు లైరి. మధ్యాహ్నకాలమున, మధ్యరాత్రమునందును దేవతలు వ్రతము నవలంబించి విజయులై స్వర్గమును పొందిరి. (కావున భోజన వ్రతమునకు మధ్యాహ్నకాలము ప్రశస్త మైనది. మధ్యాహ్న మధ్యరాత్రములందు వ్రతకాలత్వమును విధించుటకు ముందు ఇచట తత్ప్రశంస చేయఁబడినది.)

8. అర్థము: అస్య=ఈ యజ్ఞదీక్షితునకు, మధ్యందినే=మధ్యాహ్నకాలమునందు, మధ్యరాత్రే=అర్ధరాత్రియందును, వ్రతమ్=పూర్వోక్తమైన 'పయ'ఆది స్వీకారరూపమైన వ్రతము, భవతి యత్=ఉండవలెను. మధ్యతః=ముఖమధ్య మునుండి, అన్నేన భుఞ్జతే వై=అన్నమును భుజించుచున్నారు కదా! మధ్యతః ఏవ=ఉదరమధ్యభాగము నందే, తత్=ఆ యన్నము, ఊర్జమ్=బలమును, ధత్తే=ధరించుచున్నది. (కలుగఁజేయుచున్నది. ఇదమ్=ఇది,) భ్రాతృవ్యాభిభూత్యై=శత్రుతిరస్కారముకొఱకు, భవతి=అగుచున్నది. ఆత్మనా=స్వయముగా, భవతి=విజయుఁ డగుచున్నాఁడు. అస్య=ఈ యజమానునియొక్క, భ్రాతృవ్యః=శత్రువు, పరాభవతి=తిరస్కృతుఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు మధ్యాహ్నకాలమునందు, మధ్యరాత్రమునందును (ఆహారస్వీకారరూప)వ్రతమును గ్రహించవలెను. లోకమునందు అందఱు ముఖమధ్యమునందు భోజనము చేయుట, ఆ భుక్తమైన యాహారమును ఉదరమధ్యమునందు ధారణ చేయుటయు ప్రసిద్ధములు కదా! అట్లు చేయుటవలన శరీరమునకు బలము కలుగుచున్నది. ఈ విధముగ వ్రతమును స్వీకరించిన యజమానుఁడు విజయుఁ డగును. ఇతని శత్రువు పరాభూతుఁ డగును. (ఇచట వ్రతము విహిత మైనది.)

9. అర్థము: దీక్షితః యత్=యజ్ఞదీక్షితుఁ డనుట యేది కలదో, ఏషః=ఈ దీక్షితుఁడు, గర్భః వై=గర్భము వంటివాఁడే. (అస్య=ఇతనికి,) దీక్షితవిమితమ్=యజ్ఞశాలాస్థానము, యోనిః=స్థానము. దీక్షితః=యజ్ఞదీక్షితుఁడు, దీక్షితవిమి **తాత్**=యజ్ఞశాలాస్థానమునుండి, ప్రవసేత్ యత్=ప్రవాసము చేయుచో, యోనేః=యోనినుండి, గర్భః=గర్భము, యథా స్కన్దతి=ఎట్లు స్రావ మగుచున్నదో, తత్=యజ్ఞదీక్షితుఁడు తనకు (యోని)స్థానమైన ఆ యజ్ఞ శాలాస్థానమునుండి ప్రవాసమునకు పోవుట, తాదృగేవ=ఆ గర్భస్రావమువంటిదే. **తత్**=ఆ కారణమువలన, **ఆత్మనః**=తనయొక్క, గోపీథాయ=రక్షణమునకై, న ప్రవసితవ్యమ్=ప్రవాసము చేయరాదు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు గర్భస్వరూపుఁడుగా పూర్వమంత్రమున వర్ణింపఁబడెను. ఆ యజ్ఞదీక్షితునకు యజ్ఞశాలాస్థానము యోనివంటిది. (నివసించఁదగినది) అతఁడు ఆ యజ్ఞశాలాస్థానమును విడిచి ప్రవాసము చేసినచో అది గర్భస్రావమువంటి దగును. కనుక యజ్ఞదీక్షితుఁడు యజ్ఞశాలను విడచి ప్రవాసము చేయరాదు. ఇచట దీక్షితునకు స్వనివాస స్థానమునుండి ప్రవాసము నిషేధింపఁబడినది. దీక్షితః విశేషేణ మీయతే=వ్రక్షిప్యతే యస్మిన్ శాలాస్థానే తత్ "దీక్షిత విమితమ్"=దీక్షితుఁడు విశేషముగ నివసించు స్థానము 'దీక్షిత విమిత' మనఁబడును.

10. అర్థము: అగ్నిః యత్=ఏ యగ్ని కలఁడో, ఏషః వై=ఈ ఆహవనీయాగ్నియే, వ్యాఘ్రః=వ్యాఘ్రమువలె హింసకుఁడు. కుల గోపకః=కులరక్షకుఁడు. దీక్షితః=దీక్షితుఁడు, ప్రవసేత్ యత్=ప్రవాసము చేయుచో, సః=ఆ యగ్ని, ఏనమ్=ఈ ప్రవాసమున కేఁగిన దీక్షితుని, అను=అనుసరించి, ఉత్థాయ=స్వయముగ లేచి, హన్తోః=హింసించుటకు, ఈశ్వరః=సమర్థుఁడు, భవతి=అగుచున్నాఁడు. తత్=ఆ కారణమువలన, ఆత్మనః=తనయొక్క, గుప్త్యై=రక్షణ ముకొఱకు, న ప్రవస్తవ్యమ్=ప్రవాసము చేయరాదు.

తాత్పర్యము: ఈ యాహవనీయాగ్ని వ్యాఘ్రమువలె హింసకుఁడు, కులరక్షకుఁడును. యజ్ఞదీక్షితుఁడు ప్రవాసము చేయుచో, ఆ యాహవనీయాగ్ని స్వయముగ లేచి ఈ ప్రవాసితుఁడైన దీక్షితు ననుసరించి పోయి సంహరించుటకు సమర్థుఁ డగును. కావున దీక్షితుఁడు తన రక్షణమునకై ప్రవాసము చేయరాదు. [దీక్షితునకు విహితమైన ప్రవాసనిషేధము ప్రకారాంతరముగ నిచట ప్రశంసింపఁబడినది.]

11. అర్థము: దక్షిణతః=ఆహవనీయమునకు దక్షిణ భాగమున, శయే=యజ్ఞదీక్షితుఁడు శయనించవలెను. ఏతత్ వై=ఇదియే, యజమానస్య=యజ్ఞకర్తకు, ఆయతనమ్=స్థానము. (ఏవం సతి=ఇట్లు కాఁగా, యజమానః=యజమానుఁడు,) స్వే ఆయతనే ఏవ=స్వీయస్థానమునందే, శయే=శయనించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞకర్త ఆహవనీయాగ్నికి దక్షిణ భాగమునందు శయనించవలెను. ఈ యాహవనీయ దక్షిణ భాగమే యజ్ఞకర్తయొక్క స్థానము. కావున యజమానుడీ విధముగ చేసినచో స్వస్థానమునందే శయనించినవాఁ డగును. (ఇచట యజమానుని శయనమునకై ఆహవనీయముయొక్క దక్షిణ ప్రదేశము విధింపఁబడినది.)

12. అర్థము: అగ్నిమ్ అభి ఆవృత్య=అగ్నికి అభిముఖముగా తిరిగి, శయే=యజ్ఞకర్త శయనించవలెను. (ఏవం సతి=ఇట్లు కాఁగా, అయమ్=ఈ యజమానుఁడు,)దేవతాః ఏవ=దేవతల నుద్దేశించియే, యజ్ఞమ్ అభి ఆవృత్య=యజ్ఞ మున కభిముఖముగ తిరిగి, శయే=శయనించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞదీక్షితుఁడు అగ్ని కభిముఖముగ తిరిగి శయనించవలెను. ఇట్లు చేసిన యజమానుఁడు యజ్ఞమున కభిముఖముగ తిరిగి దేవతల నుద్దేశించియే శయనించినవాఁ డగును. (ఇచట శయనమునకు ఆహవనీయా భిముఖ్యము విహిత మైనది.)

పంచమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే షష్ఠోఽనువాకః

మూలము: [1]పురోహవిషి దేవయజనే యాజయేద్యం కామయేతోపైన ముత్తరో యజ్ఞో నమేదభి సువర్గం లోకం జయేదితి [2]త్యేతద్వై పురోహవి ర్దేవయజనం యస్య హోతా ప్రాతరనువాక మనుబ్రువ న్నగ్నిమప ఆదిత్యమభి విపశ్య [3]త్యుపైన ముత్తరో యజ్ఞో నమత్యభి సువర్గం లోకం జయ [4]త్యాప్తే దేవయజనే యాజయే ద్భ్రాతృవ్యవన్తం [5]పన్థాం వాఽభిస్పర్శయేత్కార్తం వా యావన్నానసే యాతవై (౧)న రథాయైతద్వా ఆప్తం దేవయజన [6]మాప్నోత్యేవ భ్రాతృవ్యం నైనం భ్రాతృవ్య ఆప్నో [7]త్యేకోన్నతే దేవయజనే యాజయే త్పశుకామ [8]మేకోన్నతాద్వై దేవయజనా దఙ్గిరసః పశూ నసృజన్తా [9]న్తరా సదోహవిర్ధానే ఉన్నతగ్ం స్యాదేతద్వా ఏకోన్నతం దేవయజనం [10]పశుమానేవ భవతి [11]త్ర్యున్నతే దేవయజనే యాజయే త్సువర్గకామం [12]త్ర్యున్నతాద్వై దేవయజనా దఙ్గిరసః సువర్గం లోక మాయ [13]న్నన్తరా ఽఽహవనీయం చ హవిర్ధానం చ (౨)ఉన్నతగ్ం స్యాదన్తరా హవిర్ధానం చ సదశ్చాన్తరా సదశ్చ గార్హపత్యం చైతద్వై త్ర్యున్నతం దేవయజనగ్ం [14]సువర్గమేవ లోకమేతి [15]ప్రతిష్ఠితే దేవయజనే యాజయే త్ప్రతిష్ఠాకామ [16]మేతద్వై ప్రతిష్ఠితం దేవయజనం యత్సర్వతః సమం [17]ప్రత్యేవ తిష్ఠతి [18]యత్రాన్యా అన్యా ఓషధయో వ్యతిషక్తాః స్యుస్తద్యాజయే త్పశుకామ [19]మేతద్వై పశూనాగ్ం రూపగ్ం రూపేణైవాస్మై పశూన్ (3)అవ రున్ధే [20]పశుమానేవ భవతి [21]నిర్ఋతిగృహీతే దేవయజనే యాజయేద్యం కామయేత నిర్ఋత్యా ఽస్య యజ్ఞం గ్రాహయేయమి [22]త్యేతద్వై నిర్ఋతిగృహీతం దేవయజనం యత్సదృశ్యై సత్యా ఋక్షం [23]నిర్ఋత్యైవాస్య యజ్ఞం గ్రాహయతి

[24]వ్యావృత్తే దేవయజనే యాజయే ద్ద్వ్యావృత్కామం యం పాత్రే వా తల్పే వా మీమాగ్ంసేర

[25]న్ప్రాచీన మాహవనీయా త్ప్రవణగ్ం స్యాత్ప్రతీచీనం గార్హపత్యా దేతద్వై వ్యావృత్తం దేవయజనం

[26]వి పాప్మనా భ్రాతృవ్యేణాఽఽవర్తతే నైనం పాత్రే న తల్పే మీమాగ్ంసన్తే [27]కార్యే దేవయజనే

యాజయే ద్భూతికామం [28]కార్యో వై పురుషో [29]భవత్యేవ (౪)||

(యాతవై హవిర్ధానం చ పశూన్పాప్మనా ఽష్టాదశ చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే షష్ఠోఽనువాకః ||౬||

## వేదార్థదీపిక

**అవతారిక:** పంచమానువాకమునందు యజ్ఞదీక్షితులైన త్రైవర్ణికులకు ప్రత్యేకముగ తత్తదాహార స్వీకారాదికమైన వ్రతము చెప్పఁబడినది. కామ్యయాగములు చేయుట కర్హమైన భూ ప్రదేశము ఈ షష్ఠానువాకమునందు చెప్పఁబడు చున్నది.

1. **అర్థము:** (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, "ఏనమ్=ఈ యజమానుని, ఉత్తరః యజ్ఞః=ఉత్తరయజ్ఞము, ఉపనమేత్=పొందుఁగాక. (ఏషః=ఈ యజమానుఁడు,) సువర్గం లోకమ్=స్వర్గ లోకమును, అభిజయేత్=అంతటను జయించుఁగాక." (పొందుఁగాక.) ఇతి=అని, కామయేత=కోరునో, (తమ్=ఆ యజమానుని,) పురోహవిషి దేవయజనే=పురోహవిర్నామకమైన దేవయాగ ప్రదేశమునందు, యాజయేత్=యాగము చేయించవలెను.

**తాత్పర్యము:** [ఒక్కొక్క జ్యోతిష్టోమ యాగకర్త కొన్ని ప్రత్యేకములైన కోరికలు కలిగి యుండును. ఆ కోరికలను తీర్చుకొనుటకు వేఱు వేఱు అవాంతర యాగములు కలవు. ఈ యాగములు చేయుటకు ప్రత్యేకమైన వేఱు వేఱు ప్రదేశము లుండును. యజ్ఞము చేయించు నతఁడు అధ్వర్యుఁడు. ఈ యాగములను కామ్యయాగములందురు. ఈ కామ్యయాగములు "యా తే అగ్నే ఽయాశయా రజాశయా" అను మంత్రముచే సాధ్యము లయిన ప్రాతఃకాలీన సాయంకాలీనములైన ఉపసత్తుల మధ్యమునందు చేయవలెను.] అధ్వర్యుఁడు ఏ యజమానుని ఉద్దేశించి "ఇతనిని ఉత్తరయజ్ఞము పొందుఁగాక. ఇతఁడు స్వర్గమును పొందుఁగాక," అని కోరునో, ఆ యజమానునిచేత పురోహవిర్నామక దేవయజన ప్రదేశమునందు యాగమును చేయించవలెను. (ఉత్తరయజ్ఞము=మీఁదియజ్ఞము. ఒక యజ్ఞమునకు పిమ్మట చేయునట్టి ఇంకొక యజ్ఞమని భావము.)

2. **అర్థము:** హోతా=హోత, యస్య=ఏ దేవయజనముయొక్క, [హవిర్ధానే=హవిర్ధాన మండపమునందు, ఆసీనః=కూర్చుండినవాఁడై, ప్రాఙ్ముఖః=ప్రాగభిముఖుఁడై,] ప్రాతరనువాకమ్=ప్రాతరనువాక మనెడి శస్త్రవిశేషమును, అనుబ్రువన్=అనుస్యూతముగ పఠించుచు, అగ్నిమ్=ఆహవనీయాగ్నిని, [తతః ప్రాగ్వర్తిన్యః=ఆ యగ్నికంటె తూర్పున ఉన్నటువంటి,] అపః=నదీతటాకాది జలములను, [తతోఽపి=అంతకంటెను, ప్రాగ్దిశి=తూర్పుదిక్కున, ఉద్య

న్తమ్=ఉదయించుచున్న,] ఆదిత్యమ్=సూర్యుని, అభి వి పశ్యతి=అభిముఖముగ విశేషముగ చూచుచున్నాఁడో, ఏతత్ వై=ఇదియే, పురోహవిః దేవయజనమ్=పురోహవి ర్నామక దేవయాగప్రదేశము.

తాత్పర్యము: హోత దేవయజనముయొక్క హవిర్ధాన మండపమునందు ప్రాఙ్ముఖుఁడుగా ఆసీనుఁడై ప్రాతరనువాక మనెడి శస్త్రవిశేషమును పఠించుచు ఆహవనీయాగ్నిని, ఆ యాహవనీయమునకు తూర్పున ఉన్నటువంటి నదీతటాకాదిగత జలములను, అంతకంటెను తూర్పున ఉదయించుచున్న సూర్యుని అభిముఖముగ ఒక్కవర్యాయమే చూచుచుండును. ఆ దేవయజనమే పురోహవిర్నామక దేవయజనము. (ఇచట పురోహవిర్నామక దేవయజనముయొక్క లక్షణము చెప్పఁబడినది.)

3. అర్థము: ఏనమ్=ఈ యజమానుని, ఉత్తరః యజ్ఞః=ఇఁక ముందు చేయఁబోవు యజ్ఞము, ఉప నమతి=పొందుచున్నది. (ఏషః=ఈ యజమానుఁడు,) సువర్గం లోకమ్=స్వర్గలోకమును, అభిజయతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: ఒకటవ మంత్రమున చెప్పఁబడినవిధముగ పురోహవిర్నామక దేవయజన ప్రదేశమునందు యాగము చేసిన యజమానుని ఉత్తర యజ్ఞము పొందును. మఱియు నతఁడు స్వర్గలోకము నొందును. (ఇచట కామిత ఫలసిద్ధి చూపఁబడినది.)

4. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) భ్రాతృవ్యవన్తమ్=శత్రువులు కలిగియున్న యజమానుని, ఆప్తే దేవయజనే='ఆప్త' నామక దేవయజన ప్రదేశమునందు, యాజయేత్=యాగము చేయించవలెను.

తాత్పర్యము: అధ్వర్యుఁడు శత్రువులు కలిగియున్న యజమానునిచేత 'ఆప్త'నామక దేవయజన ప్రదేశమునందు యాగము చేయించవలెను. (ఇచట మఱియొక కామ్యయాగము విహిత మైనది.)

5. అర్థము: పన్థాం వా=రాజమార్గమును కాని, కర్తం వా=ప్రౌఢమైన గర్తమును (గుంటను) కాని, అధి స్పర్శయేత్=(దేవయజన ప్రదేశమునకు) అధికముగా స్పర్శము కలుగునట్లు చేయవలెను. అనసే=శకటముయొక్క, యాతవై=పోవుటకు, యావత్ న=ఎంత అంతరము చాలినంత ఉండదో, రథాయ=రథముయొక్క, యాతవై=పోవుటకు, యావత్ న=ఎంత అంతరము చాలినంత ఉండదో, ఏతత్ వై=ఇదియే, ఆప్తం దేవయజనమ్='ఆప్త'నామక దేవయజనప్రదేశము. ['అనసే' 'రథాయ' ఇవి షష్ఠ్యర్థమున చతుర్థ్యంతములుగా ప్రయుక్తము లైనవి.]

తాత్పర్యము: ప్రౌఢమైన రాజమార్గమును కాని, ప్రౌఢమైన గర్తమును కాని స్పృశించునట్లుగా దేవయజనమును నిర్మించవలెను. ఆ దేవయజన రాజమార్గముల మధ్యభాగమున, దేవయజన గర్తముల మధ్యభాగమున రథము కాని, శకటము కాని పోవుటకు చాలనంతటి అంతరమే యుండవలెను. ఆ దేవయజనమునకే 'ఆప్త'నామక దేవయజనమని పేరు. (ఇచట 'ఆప్త' దేవయజన లక్షణ మభిహిత మైనది.)

6. అర్థము: (అయమ్=ఈ యజమానుఁడు,) భ్రాతృవ్యమ్=శత్రువును, ఆప్నోత్యేవ=నిశ్చయముగ జయించును. భ్రాతృవ్యః=శత్రువు, ఏనమ్=ఈ యజమానుని, నాప్నోతి=జయించలేఁడు. ('ఆప్నోతి=జయతీత్యర్థః' ఇతి విద్యారణ్యభాష్యమ్.)

తాత్పర్యము: శత్రువును కలిగియున్న యజమానునిచే ఆప్తనామక దేవయజనమునందు యాగము చేయించవలెనని నాల్గవ మంత్రమున చెప్పఁబడినది. ఆ విధముగ యాగము చేసిన యజమానుఁడు నిశ్చయముగ శత్రువును జయించును. శత్రువు ఈ యజమానుని జయింపలేఁడు.

7. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) పశుకామమ్=తనకు పశువులు కావలెనని కోరునట్టి యజమానుని, ఏకోన్నతే దేవయజనే='ఏకోన్నత' మనెడి దేవయజనమునందు, యాజయేత్=యాగము చేయించవలెను.

తాత్పర్యము: తనకు పశువులు కావలెనని కోరునట్టి యజమానునిచేత అధ్వర్యుఁడు 'ఏకోన్నత' మనెడి దేవయజన ప్రదేశమునందు యాగము చేయించవలెను. (ఇది మఱియొక కామ్యయాగము.)

8. అర్థము: అఙ్గిరసః=అంగిరసులు, (మహర్షులు,) ఏకోన్నతాత్ దేవయజనాత్ వై=ఏకోన్నత మనెడి దేవయజన ప్రదేశ మునుండియే, పశూన్=పశువులను, అసృజన్త=సృష్టించిరి.

తాత్పర్యము: అంగిరస మహర్షులు 'ఏకోన్నత' దేవయజనమునుండియే పశువులను సృష్టించిరి. (ఇచట 'ఏకోన్నత' దేవయ జనము ప్రశంసింపఁబడినది.)

9. అర్థము: సదో హవిర్ధానే అన్తరా=సదో హవిర్ధానముల మధ్యభాగము, ఉన్నతమ్=ఎత్తైనదిగా, స్యాత్=ఉండవలెను. ఏతత్ వై=ఇదియే ఏకోన్నతం దేవయజనమ్='ఏకోన్నత' మనెడి దేవయజనము. ["అన్తరాన్తరేణ యుక్తే" అను పాణినీయ సూత్రముచే "సదో హవిర్ధానే" అని ద్వితీయాంతము ప్రయుక్త మైనది.]

తాత్పర్యము: సదోమండప హవిర్ధానముల మధ్యదేశము ఎత్తైనదిగా నుండవలెను. ఈ ఎత్తైన ప్రదేశమే 'ఏకోన్నత' దేవయజనము. (ఇచట ఏకోన్నత దేవయజన లక్షణము చెప్పఁబడినది. ప్రాచీనవంశ మనెడి యజ్ఞశాలకు ఎదుట మిక్కిలి దగ్గఱగా నున్నది సదోమండపము. ఉత్తరవేదికి వెనుక మిక్కిలి దగ్గఱగా నున్నది హవిర్ధా నము. ఈ సదో హవిర్ధానముల మధ్యప్రదేశమును ఉన్నతముగా చేయవలెను. ఈ ప్రదేశమునకే 'ఏకోన్నత' దేవయజనమని పేరు.

10. అర్థము: పశుమాన్=పూర్వోక్తవిధముగ యజ్ఞము చేసిన యజమానుఁడు పశుమంతుఁడు, స్యాదేవ=నిశ్చయముగ వగును.

తాత్పర్యము: 'ఏకోన్నత' దేవయజనమునందు యాగము చేసిన యజమానుఁడు నిశ్చయముగ పశువులు కలవాఁ డగును. (ఇచట యాగఫలము చెప్పఁబడినది.)

11. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) స్వర్గకామమ్=స్వర్గమును కోరునట్టి యజమానుని, త్ర్యున్నతే దేవయజనే=త్ర్యున్నత మనెడి దేవయజనమునందు, యాజయేత్=యాగము చేయించవలెను.

తాత్పర్యము: స్వర్గమును కాంక్షించు యజమానునిచేత అధ్వర్యుఁడు త్ర్యున్నత మనెడి దేవయజనమునందు యాగమును చేయించవలెను.

12. అర్థము: అఙ్గిరసః=అంగిరసులు, త్ర్యున్నతాత్ దేవయజనాత్ వై=త్ర్యున్నత మనెడి దేవయజనమునుండియే, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, ఆయన్=పొందిరి.

తాత్పర్యము: తాత్పర్యము స్పష్టము. ఇచట త్ర్యున్నత దేవయజన ప్రశంస చేయఁబడినది.

13. అర్థము: ఆహవనీయం చ హవిర్ధానం చ అన్తరా=ఆహవనీయ హవిర్ధానముల మధ్యప్రదేశము, ఉన్నతమ్=ఉన్నతముగా, స్యాత్=ఉండవలెను. హవిర్ధానం చ సదః చ అన్తరా=సదో హవిర్ధానముల మధ్యప్రదేశము, ఉన్నతమ్=ఉన్న తముగా, స్యాత్=ఉండవలెను. సదః చ గార్హపత్యం చ అన్తరా=సదో గార్హపత్యముల మధ్యప్రదేశము, ఉన్నతమ్=ఉన్నతముగా, స్యాత్=ఉండవలెను. ఏతత్ వై=ఇదియే, త్ర్యున్నతం దేవయజనమ్=త్ర్యున్నత మనెడి దేవయజనము.

తాత్పర్యము: ఆహవనీయ హవిర్ధానముల మధ్యప్రదేశము, సదో హవిర్ధానముల మధ్యప్రదేశము, సదో గార్హపత్యముల మధ్యప్రదేశమును ఉన్నతముగా నుండును. ఈ మూఁడు ఉన్నత ప్రదేశములకు త్ర్యున్నత దేవయజనమని పేరు. ఇచట త్ర్యున్నత దేవయజన లక్షణము చెప్పఁబడినది.

14. అర్థము: సువర్గం లోకమేవ=స్వర్గలోకమునే, ఏతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: స్వర్గమును కోరుచున్న యజమానుఁడు త్ర్యున్నత దేవయజనమునందు యాగము చేసినచో అతఁడు నిశ్చ యముగ స్వర్గలోకమును పొందును. (ఇచట ఫల మభిహితము.)

15. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ప్రతిష్ఠాకామమ్=ప్రతిష్ఠను కోరునట్టి యజమానుని, ప్రతిష్ఠితే దేవయజనే=ప్రతిష్ఠిత మనెడి దేవయజన ప్రదేశమునందు, యాజయేత్=యాగము చేయించవలెను.(ఇచట మఱియొక కామ్యయాగము చెప్పఁబడినది.)

తాత్పర్యము: ప్రతిష్ఠ నభిలషించు యజమానునిచే అధ్వర్యుఁడు ప్రతిష్ఠిత నామక దేవయజనమునందు యాగమును చేయించవలెను.

16. అర్థము: సర్వతః=హవిర్ధానాదుల మధ్యప్రదేశములం దంతటను, సమం యత్=సమమైన ప్రదేశము ఏది కలదో, ఏతత్ వై=ఇదియే, ప్రతిష్ఠితం దేవయజనమ్=ప్రతిష్ఠిత మనెడి దేవయజనము. (ఇచట ప్రతిష్ఠిత లక్షణము విహిత మైనది.)

తాత్పర్యము: అంతటను కల సమమైన ప్రదేశము ప్రతిష్ఠిత నామక దేవయజనము.

17. అర్థము: ప్రతి తిష్ఠత్యేవ=పూర్వోక్త విధముగ ప్రతిష్ఠిత నామక దేవయజనమునందు యాగము చేసిన యజమానుఁడు నిశ్చయముగ ప్రతిష్ఠావంతుఁ డగును. (ఇచట ఫలము విహితము)

తాత్పర్యము: స్పష్టము.

18. అర్థము: యత్ర=ఏ ప్రదేశమునందు, అన్యాః అన్యాః=వేఱు వేఱు ఓషధులు, వ్యతిషిక్తాః=విశేషముగ ఉప్తములు, స్యుః=అగునో, తత్ర=అచట, పశుకామమ్=పశువులను కోరుచున్న యజమానుని, యాజయేత్=యాగము చేయించవలెను.

తాత్పర్యము: విశేషముగ పరస్పర విలక్షణములైన యవ గోధూమా ద్యోషధులు కలసి ఉప్తములైన ప్రదేశమునందు అధ్వర్యుఁడు పశుకాముఁడైన యజమానునిచే యాగమును చేయించవలెను.[ఇచట నామవిశేషమును చెప్పకుండ లక్షణపురస్సరముగ మఱియొక కామ్య యాగము విహిత మైనది.]

19. అర్థము: ఏతత్ వై=విలక్షణములైన ఓషధులు ఉప్తములైన యీ ప్రదేశమే, పశూనామ్=పశువులయొక్క, రూపమ్=రూపము. అస్మై=ఈ యాగము చేసిన యజమానుఁడు, (ప్రథమార్థమున చతుర్థి.) రూపేణైవ=పశువులరూపముచేతనే, పశూన్=పశువులను, అవరున్ధే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్త ప్రదేశమే పశురూపము. ఈ ప్రదేశమున యాగము చేసిన యజమానుఁడు పశురూపము చేతనే పశువులను పొందును. (ఇచట ప్రశంస చేయఁబడినది.)

20. అర్థము: పశుమాన్=(పూర్వోక్త యజమానుఁడు,) పశుమంతుఁడు, భవత్యేవ=నిశ్చయముగ అగుచున్నాఁడు.(ఇచట ఫలము చెప్పఁబడినది. తాత్పర్యము స్పష్టము.)

21. అర్థము: అస్య=ఈ యజమానునియొక్క, యజ్ఞమ్=యజ్ఞమును, నిర్ఋత్యా=నిర్ఋతి చేత (యజ్ఞవిఘాతియైన రాక్షసునిచేత), గ్రాహయేయమ్=గ్రహింపఁజేయుదును, ఇతి=అని, యమ్=ఏ యజమాను నుద్దేశించి, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) కామయేత=కోరునో, (తమ్=ఆ యజమానుని,) నిర్ఋతి గృహీతే దేవయజనే=రాక్షసునిచే ఆక్రమితమైన దేవయజనమునందు, యాజయేత్=యాగము చేయించవలెను.(ఇది మఱియొక కామ్యయాగ విధి.)

తాత్పర్యము: ఏ యజమానునియొక్క యజ్ఞము రాక్షసవశము కావలెనని అధ్వర్యుఁడు తలఁచునో, అతఁడు ఆ యజమానునిచేత రాక్షసగృహీత దేవయజనమునందు యాగము చేయించవలెను.

22. అర్థము: సదృశ్యై=నిమ్నోన్నతత్వ రాహిత్యముచే సదృశమైన, సత్యాః=భూమియొక్క, ఋక్షం యత్=తృణాదిశూన్య స్థానమేది కలదో, ఏతత్ వై=ఇదియే, నిర్ఋతి గృహీతం దేవయజనమ్=నిర్ఋతి గృహీత దేవయజనము.

తాత్పర్యము: నిమ్నోన్నతత్వ రహితమైన భూమికి సంబంధించిన తృణాదిశూన్య స్థానమే నిర్ఋతి గృహీతమైన దేవయజనము. (ఇచట లక్షణము చెప్పఁబడినది.)

23. అర్థము: అస్య=ఈ యజమానునియొక్క, యజ్ఞమ్=యజ్ఞమును, [పూర్వోక్త విధముగ తలఁచిన యధ్వర్యుఁడు] నిర్ ఋత్యా=యజ్ఞ విఘాతియగు రాక్షసునిచేత, గ్రాహయత్యేవ=నిశ్చయముగ గ్రహింపఁజేయుచున్నాఁడు.(ఇచట కామితార్థ సిద్ధి చెప్పఁబడినది.)

తాత్పర్యము: నిర్ ఋతి గృహీత దేవయజనమునందు యాగము చేసిన యజమానునియొక్క యజ్ఞమును అధ్వర్యుఁడు తాను తలఁచినవిధముగ యజ్ఞవిఘాతియగు రాక్షసునిచేత నిశ్చయముగ గ్రహింపఁజేసినవాఁ డగును.

24. అర్థము: యమ్=ఏ పురుషు నుద్దేశించి, పాత్రే వా=సహపంక్తి భోజన విషయమునఁ గాని, తల్పే వా=వివాహ విషయమునఁ గాని, [బంధుమిత్రాదయః=బంధుమిత్రాదులు,] మీమాంసేరన్=సందేహించుదురో, వ్యావృత్కామమ్=ఆ సందేహ హేతువైన అపవాదాది రూపమైన పాపమునుండి వ్యావృత్తిని కోరుచున్న యా పురుషుని, వ్యావృత్తే దేవయజనే=వ్యావృత్త నామక దేవయజనమునందు, యాజయేత్=యాగము చేయించవలెను. ఇచట పాత్రపదముచే సహపంక్తి భోజనము, తల్ప పదముచేత వివాహము ఉపలక్షితములు.

తాత్పర్యము: బంధు మిత్రాదులచే సహపంక్తి భోజన విషయమునఁగాని, వివాహ విషయమునఁ గాని, శంకింపఁబడుచున్న ఏ పురుషుఁడు, తత్సందేహ హేతువైన అపవాదాదిరూప పాపమునుండి వ్యావృత్తిని కోరునో, ఆ పురుషునిచేత అధ్వర్యుఁడు వ్యావృత్త నామక దేవయజనమునందు యాగము చేయించవలెను. (ఇచట మఱియొక కామ్యయాగము విహిత మైనది.)

25. అర్థము: ఆహవనీయాత్=ఆహవనీయముకంటె, ప్రాచీనమ్=ప్రాచీన మైనదియు, గార్హపత్యాత్=గార్హపత్యముకంటె, ప్రతీచీనమ్=ప్రతీచీన మైనదియునగు స్థలము, ప్రవణమ్=నిమ్నమైనదిగా, స్యాత్=ఉండవలెను. ఏతత్ వై=ఇదియే, వ్యావృత్తం దేవయజనమ్=వ్యావృత్త నామక దేవయజనము. ఇది వ్యావృత్త నామక దేవయజన లక్షణము. ప్రాచీనము=తూర్పుగా నున్నది. ప్రతీచీనము=పశ్చిమముగా నున్నది. తాత్పర్యము స్పష్టము.

26. అర్థము: [అయమ్=వ్యావృత్త దేవయజనమునందు యాగము చేసిన యీ యజమానుఁడు,] పాప్మనా=పాపమనెడి, భ్రాతృవ్యేణ=శత్రువుచేత, వ్యావర్తతే=వ్యావృత్తుఁ డగుచున్నాఁడు. [బంధు మిత్రాదయః=బంధు మిత్రాదులు,] ఏనమ్=ఈ యాగము చేసిన పురుషుని, పాత్రే=సహపంక్తి భోజన విషయమున, న మీమాంసన్తే=సందేహించరు. తల్పే=వివాహ విషయమున, న మీమాంసన్తే=సందేహించరు. ఇది ఫలసిద్ధి.

తాత్పర్యము: వ్యావృత్త నామక దేవయజనమునందు యాగము చేసిన పురుషుఁడు తనకు సంభవించిన అపవాదు అనెడి శత్రువుచేత విముక్తుఁ డగును. బంధుమిత్రాదు లితనిని సహపంక్తి భోజన విషయమునఁ గాని, వివాహ విషయమునఁ గాని శంకించరు.

27. అర్థము: భూతికామమ్=ఐశ్వర్యమును కాంక్షించునట్టి పురుషుని, కార్యే=మృత్తికా శిలాదులచేత ఉన్నతముగా చేయఁదగిన, దేవయజనే=దేవయజనమునందు, యాజయేత్=యాగము చేయించవలెను. (ఇది యింకొక కామ్య యాగ విధి.)

తాత్పర్యము: అధ్వర్యుఁడు ఐశ్వర్యమును కోరుచున్నట్టి పురుషుని, మృత్తికా శిలాదులచేత ఉన్నతముగా చేయఁదగిన దేవయజనమునందు యాగము చేయించవలెను.

28. అర్థము: పురుషః=పురుషుఁడు, కార్యః వై=ఉపనయనాది సంస్కారములచే ఉన్నతుఁడుగాఁ జేయఁదగినవాఁడే. (ఇచట ప్రశంస చేయఁబడినది.)

తాత్పర్యము: పురుషుఁడు ఉపనయనాది సంస్కారములచే ఉన్నతుఁడుగా చేయఁదగినవాఁడే. కావున ఇట్టి పురుషునకు మృత్తికా శిలాదులచే ఉన్నతి కరణీయమైన దేవయజనము యాగము చేయుటకు యోగ్యమైనది.

29. అర్థము: భవత్యేవ=ఉన్నతి కరణీయమైన దేవయజనమునందు యాగము చేసిన పురుషుఁడు నిశ్చయముగ ఐశ్వర్యవంతుఁ డగును. [ఈ యనువాకమున విహితములైన సర్వవిధ కామ్యయాగములు "యా తే అగ్నేఽయాశయా

రజాశయా" అను మంత్రముచే సాధ్యములైన ప్రాతఃకాలీన సాయంకాలీనములైన ఉపసత్తుల మధ్యమునందు చేయవలసినవి.]

షష్ఠానువాకము సమాప్తము.

# అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే సప్తమోఽనువాకః

మూలము: [1]తేభ్య ఉత్తరవేదిః సిగ్ంహీ రూపం కృత్వోభయానన్తరాఽవక్రమ్యాతిష్ఠత్తే దేవా అమన్యన్త యత

రాన్వా ఇయ ముపావర్త్స్యతి త ఇదం భవిష్యన్తీతి తాముపామన్త్రయన్త సాఽబ్రవీద్వరం వృణై సర్వా

న్మయా కామాన్వ్యశ్నవథ పూర్వాం తు మాఽగ్నే రాహుతి రశ్నవతా ఇతి తస్మాదుత్తరవేదిం

పూర్వామగ్నే ర్వ్యాఘారయన్తి వారేవృతగ్ం హ్యస్యై [2]శమ్యయా పరి మిమీతే (౧)మాత్రైవాస్యై

సాఽథో యుక్తేనైవ యుక్తమవ రున్ధే [3]విత్తాయని మేఽసీత్యాహ విత్తా హ్యేనానావత్త్రిక్తాయని మేఽ

సీత్యాహ తిక్తాన్హ్యేనానావదవతాన్మా నాథిత మిత్యాహ నాథితాన్హ్యేనానావదవతాన్మా వ్యథితమి

త్యాహ వ్యథితాన్హ్యేనానావ [4]ద్విదేరగ్నిర్నభో నామ (౨)అగ్నే అఙ్గిర ఇతి త్రిర్హరతి య ఏవైషు

లోకేష్వగ్నయ స్తానేవావ రున్ధే తూష్ణీం చతుర్థగ్ం హరత్యనిరుక్తమేవావ రున్ధే [5]సిగ్ంహీరసి మహి

షీరసీత్యాహ సిగ్ంహీర్హ్యేషా రూపం కృత్వోభయానన్తరాఽవక్రమ్యాతిష్ఠ [6]దురు ప్రథస్వోరు తే యజ్ఞ

పతిః ప్రథతా మిత్యాహ యజమానమేవ ప్రజయా పశుభిః ప్రథయతి ధ్రువా (3)అసీతి సగ్ంహన్తి

ధృత్యై దేవేభ్యః శున్ధస్వ దేవేభ్యః శుమ్భస్వేత్యవ చోక్షతి ప్ర చ కిరతి శుద్ధ్యై [7]ఇన్ద్రఘోషస్త్వా

వసుభిః పురస్తా త్పాత్విత్యాహ దిగ్భ్య ఏవైనాం ప్రోక్షతి [8]దేవాగ్ం శ్చేదుత్తరవేది రుపావవర్తీహైవ

వి జయామహా ఇత్యసురా వజ్రముద్యత్య దేవానభ్యాయన్త తానిన్ద్రఘోషో వసుభిః పురస్తాదప (౪)అను

దత మనోజవాః పితృభి ర్దక్షిణతః ప్రచేతా రుద్రైః పశ్చాద్విశ్వకర్మాఽఽదిత్యై రుత్తరతో [9]యదేవ

త్తరవేదిం ప్రోక్షతి దిగ్భ్య ఏవ తద్యజమానో భ్రాతృవ్యాన్ప్ర ణుదత [10] ఇన్ద్రో యతీన్త్సాలావృకేభ్యః ప్రాయచ్ఛత్తాన్దక్షిణత ఉత్తరవేద్యా ఆదన్యత్ప్రోక్షణీనాముచ్ఛిష్యేత తద్దక్షిణత ఉత్తరవేద్యై ని నయే ద్యదేవ తత్ర క్రూరం తత్తేన శమయతి [11] యం ద్విష్యాత్తం ధ్యాయే చ్ఛుచై వైన మర్పయతి (౫)||
[మిమాతే నామ ధ్రువాఽసి శుచా త్రీణి చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే సప్తమోఽనువాకః ||౭||

## వేదార్థదీపిక

అవతారిక: షష్ఠానువాకమునందు కామ్యయాగానుష్ఠానమునకు యోగ్యమైన భూమి అభిహిత మైనది. ఈ సప్త మానువాకమునందు ఉత్తరవేది నిరూపణము చేయఁబడుచున్నది. ప్రథమకాండస్థ ద్వితీయప్రపాఠకగత ద్వాదశానువాకమునందలి "విత్తాయనీ మేఽసి" ఇత్యాది మంత్రములకు ఈ యనువాకము వివరణాత్మకము. [ముప్పదియాఱు అడుగుల పరిమాణము కల మహావేదికి పూర్వభాగమున పది అడుగుల పరిమాణము గల ఉత్తరవేదిని నిర్మించవలయును.]

1. అర్థము: తేభ్యః=ఆ దేవాసురులకొఱకు, ఉత్తరవేదిః=ఉత్తరవేది, సింహీః=సింహిగా, రూపం కృత్వా=రూపమును చేసి, (పొంది,) ఉభయాన్ అన్తరా=ఆ ఉభయుల మధ్యభాగమును, అపక్రమ్య=దాఁటి, అతిష్ఠత్=ఉండెను. యతరాన్ వై=ఎవరిని అయితే, ఇయమ్=ఈ సింహిరూపిణియైన ఉత్తరవేది, ఉపావర్త్స్యతి=సమీపించునో, ఇదమ్=ఈ రూపమును గూర్చి, తే=వారు, భవిష్యన్తి=అర్హులు కాఁగలరు, ఇతి=అని, తే దేవాః=ఆ దేవతలు, అమన్యన్త=తలఁచిరి. తామ్=ఆ యుత్తరవేదిని, ఉపామన్త్రయన్త=ప్రార్థించిరి. "మయా=నాచేత, సర్వాన్ కామాన్=సమస్తములైన కోరికలను, వ్యశ్నవథ=విశేషముగ పొందుఁడు. తు=కాని, అగ్నేః=అగ్నికంటె, పూర్వామ్=పూర్వభావినియైన, మా=నన్ను, ఆహుతిః=ఆద్యాహుతి, వ్యశ్నవతై=పొందుఁగాక." (ఆద్యాహుతి నన్ను ఉద్దేశించి హోమము చేయఁబడుఁగాక.) ఇతి=అని, వరమ్=వరమును, వృణై=కోరుదును, ఇతి=అని, సా=ఆ యుత్తరవేది, అబ్రవీత్=పలికెను. హి=ఏ కారణమువలన, అస్యై=ఈ యుత్తరవేదిచేత, (తృతీయార్థే చతుర్థీ.) వారేవృతమ్=వరము కోరఁబడినదో, తస్మాత్=ఆ కారణమువలన, అగ్నేః=అగ్నికంటె, పూర్వామ్=పూర్వభావినియైన, ఉత్తరవేదిమ్=ఉత్తరవేదినిఁగూర్చి, వ్యాఘారయన్తి=వ్యాఘారము చేయుచుందురు. వ్యాఘారము=విశేషముగ ఆఘారము=హోమము.

తాత్పర్యము: [ఇచట వేదిప్రస్తుతి పూర్వకముగ ప్రసంగవశమున ఆఖ్యాయికారూపమున వ్యాఘారణ మభిహిత మైనది.] ఆ దేవతలకొఱకు, అసురులకొఱకును, ఉత్తరవేది సింహిరూపమును ధరించి ఆ దేవాసురుల మధ్యభాగము నతిక్రమించి యుండెను. ఈ సింహిరూపిణియైన యుత్తరవేది ఎవరిని సమీపించునో, వారు ఈ ఉత్తరవేదిని పొందుదురు అని తలఁచి ఆ యుత్తరవేదిని ప్రార్థించిరి. అప్పు డా యుత్తరవేది "నాచేత సమస్తములైన కోరికలను పొందుఁడు. కాని అగ్నికంటె ముందుగా ఆద్యాహుతిని నన్ను గుఱించి హోమము చేయుఁడు.

ఈ వరమును కోరుచున్నాను" అని పలికెను. ఈ యుత్తరవేది వరమును కోరినది కావున ఉత్తరవేదికి వ్యాఘారము చేయుచుందురు.

2. అర్థము: శమ్యయా=శమ్యచేత, పరిమిమీతే=అంతటను (నాలుగు దిక్కులందును)కొలువవలెను. అస్యై=ఈ ఉత్తరవేదికి, (షష్ఠ్యర్థే చతుర్థీ.) సా=ఆ భూమి, మాత్రైవ=శమ్యచే నిర్ణీతమైనది మాత్రమే. అథో=మఱియు, (అయమ్=ఈ యజ్ఞకర్త,) యుక్తేనైవ=యోగ్యమైన ఉత్తరవేది ప్రమాణముచేతనే, యుక్తమ్=యోగ్యఫలమును, అవరున్ద్దే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: ఉత్తరవేదికై భూమిని నాలుగు దిక్కులందు శమ్యచే కొలువవలెను. ఆ భూమి శమ్యచే కొలువఁబడిన పరిమితి మాత్రమే కలదియై యుండవలెను. అంతకంటె తక్కువగాఁగాని, అధికముగాఁగాని యుండరాదు. మఱియు ఈ యజమానుఁడు యోగ్యమైన ఉత్తరవేది ప్రమాణముచేతనే యోగ్యఫలమును పొందును. (శమ్య=గదవంటి ఆకారము కలిగి, బాహు పరిమితమైన సాధనవిశేషము.)

3. అర్థము: "విత్తాయనీ మేఽసి" ఇతి ఆహ="ఓ ఉత్తరవేదీ! నీవు నాకు వహ్నిరూప విత్తమును పొందించుదాన వగుచు న్నావు" అని వేదము చెప్పినది. విత్తా=వహ్నిరూపమైన విత్తమును కోరునట్టి, ఏనాన్=ఈ యజ్ఞకర్తలను, అవత్ హి=(ఉత్తరవేది వహ్నిని పొందించుటచే) రక్షించెను కదా! "తిక్తాయనీ మేఽసి" ఇతి ఆహ="నాకు జ్వాలారూపమైన వహ్నితేజస్సును పొందించినదాన వగుచున్నావు" అని వేదము చెప్పినది. తిక్తాన్=జ్వాలారూప వహ్నితేజస్సును కోరునట్టి, ఏనాన్=ఈ యజ్ఞకర్తలను, అవత్ హి=(ఉత్తరవేది) రక్షించెను కదా! "అవతాన్మా నాథితమ్" ఇతి ఆహ="వహ్నియాచకుఁడనైన నన్ను ఉత్తరవేదీ! రక్షింపుము." అని వేదము చెప్పెను. నాథితాన్=వహ్నియాచకులైన, ఏనాన్=ఈ యాగకర్తలను, (ఉత్తరవేది వహ్నిని పొందించుటచే) అవత్ హి=రక్షించెను కదా! "అవతాన్మా వ్యథితమ్" ఇతి ఆహ="ఓ ఉత్తరవేదీ! నీవు వహ్ని లభించకపోవుటచే భయపడిన నన్ను రక్షింపుము." అని వేదము చెప్పెను. వ్యథితాన్=వహ్న్యలాభముచే భయపడిన, ఏనాన్=ఈ యాగకర్తలను, అవత్ హి=రక్షించెను కదా!

తాత్పర్యము: "తిక్తాయనీ" త్యాది మంత్రములు ప్రథమకాండమునందలి ద్వితీయప్రపాఠకగత ద్వాదశానువాకమునందు సంపూర్ణముగ వ్యాఖ్యాతము లైనవి. ఆ మంత్రముల భావము మాత్రము ఇచట సంగ్రహముగ చెప్పఁబడినది. ఈ బ్రాహ్మణముయొక్క తాత్పర్యము అర్థమునందే వివరింపఁబడినది. 'విత్తా' 'తిక్తా' అనుపదములకు విత్తార్థులు, తిక్తార్థులు, అని యర్థము.

4. అర్థము: "విదే రగ్ని ర్నభో నామాగ్నే అఙ్గిరః" ఇతి="ఉత్తరవేదిసంబంధియైన అగ్ని నభోనామకము. గార్హపత్య దక్షిణాగ్న్యాదులలో సారమైన ఓ యగ్నీ!" అను నర్థము కల "విదే" రిత్యాదిమంత్రముచే, త్రిః హరతి=(చాత్వాలగత మృద్రూప పృథివియం దున్నటువంటి అగ్నిని) మూఁడు పర్యాయములు తీసికొనవలెను. యే ఏవ అగ్నయః=ఏ అగ్నులే, ఏషు లోకేషు=ఈ మూఁడు లోకములందు, (సన్తి=కలవో,) తానేవ=ఆ యగ్నులనే, (అయమ్=ఈ యజమానుఁడు,) అవరున్ద్దే=పొందుచున్నాఁడు. చతుర్థమ్=నాల్గవ పర్యాయము అగ్నిని, తూష్ణీమ్=మంత్రోచ్చారణ రహితముగ, హరతి=తీసికొనవలెను. (అనేన=ఈ తూష్ణీం హరణముచే, అయమ్=ఈ యజమానుఁడు,) అనిరుక్తమేవ=(ఈ యగ్ని ఈ లోకమునం దుండెనని నిశ్చయించి) చెప్పుటకు సాధ్యము కాని అగ్నిసామాన్యమునే, 'అవ రున్ద్దే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: "విదేరగ్నిః" ఇత్యాది మంత్రమును పఠించుచు చాత్వాలమునందలి అగ్నిని మూఁడు పర్యాయములు (ఉత్తరవేదియందుంచుటకై) గ్రహించవలెను. అట్లు చేయుటవలన యజమానుఁడు ముల్లోకములందలి అగ్నులను పొందును. నాల్గవపర్యాయము మంత్రోచ్చారణము చేయకుండ అగ్నిని గ్రహించవలెను. అప్పుడు యజ

మానుఁడు ఈ యగ్ని లోకమునందుండెనని నిశ్చయించి చెప్పుటకు సాధ్యము కాని అగ్నిసామాన్యమును పొందును.

5. అర్థము: "సింహీరసి మహిషీరసి" ఇతి ఆహ="ఓ ఉత్తరవేది! నీవు సింహస్వరూపిణివి అగుచున్నావు. మహనీయు రాలవగుచున్నావు" అని "సింహీరసీ"త్యాది మంత్రము చెప్పినది. ఏషా=ఈ ఉత్తరవేది, సింహీ=సింహిగా, రూపమ్=రూపమును, కృత్వా=చేసి (పొంది), ఉభయాన్ అన్తరా=దేవాసురులైన ఉభయులయొక్క మధ్య ప్రదేశమును, అపక్రమ్య=తొలఁగి, అతిష్ఠత్ హి=ఉండెను కదా! తాత్పర్యము స్పష్టము.

6. అర్థము: "ఉరు ప్రథస్వోరు తే యజ్ఞపతిః ప్రథతామ్" ఇతి ఆహ="ఓ ఉత్తరవేది! నీవు విపులముగ ప్రసరింపుము. నీయొక్క యజ్ఞపతి ప్రసరించుఁగాక." అని "ఉరు ప్రథస్వ" ఇత్యాది మంత్రము చెప్పినది. (ఇయమ్=ఈ ఉత్తరవేది,) యజమానమేవ=యజమానునే, ప్రజయా=సంతానములోను, పశుభిః=పశువులలోను, ప్రథయతి=విస్తరింపఁజేయుచున్నది. "ధ్రువా అసి" ఇతి=("ఓ ఉత్తరవేది! నీవు,) దృఢ మగుచున్నావు." అను మంత్రముచే, ధృత్యై=ధృతికొఱకు, సంహన్తి=(ఉత్తరవేదిపైని) కొట్టవలెను. "దేవేభ్యః శున్ధస్వ దేవేభ్యః శుమ్భస్వ" ఇతి="ఓ ఉత్తరవేది! నీవు దేవతలకొఱకు పరిశుద్ధ వగుము. దేవతలకొఱకు శోభిత వగుము." అను మంత్రము చేత, శుద్ధ్యై=పరిశుద్ధికొఱకు, అవోక్షతి చ=ఉత్తరవేదిపైని ఉదకమును ప్రోక్షించవలెను. చ=మఱియు, ప్రకిరతి=ఇసుకను చల్లవలెను.

తాత్పర్యము: "ఉరు ప్రథస్వోరు తే యజ్ఞపతిః ప్రథతామ్" అను మంత్రమును పఠించుచు ఉత్తరవేదిని విస్తరింపఁజేసి "ధ్రువాఽసి" అను మంత్రభాగమును పఠించుచు శమ్యచే బాగుగా చదును చేసి "దేవేభ్యః శున్ధస్వ" అను మంత్రమును పఠించుచు ఉదకములచే ప్రోక్షించి, "దేవేభ్యః శుమ్భస్వ" అను మంత్రము నుచ్చరించుచు శుద్ధికొఱకు ఇసుకను చల్లవలెను. మంత్రముల అర్థము స్పష్టము.

7. అర్థము: "ఇన్ద్రఘోష స్త్వా వసుభిః పురస్తా త్పాతు" ఇతి ఆహ="ఓ యుత్తరవేది! ఇంద్రఘోష నామక దేవుఁడు వసుగణములతోఁ గూడ నిన్ను తూర్పుదిక్కునందు రక్షించుఁగాక." అని "ఇన్ద్రఘోష" ఇత్యాది మంత్రము చెప్పినది. దిగ్భ్యః=దిగ్దేవతల(తుష్టి)కొఱకే, ఏనామ్=ఈ యుత్తరవేదిని, ప్రోక్షతి=ఉదకములచే ప్రోక్షించవలెను.

తాత్పర్యము: ఇంద్రఘోషాది నామక దేవతలు మిక్కిలి దార్ఢ్యము కలవారు. వారు తదనుచరులైన వస్వాదిగణములతో కూడినవారై ఉత్తరవేదిని రక్షింతురు గాక, అని భావము. ఇచట 'పురస్తాత్' అను పదము దక్షిణాది దిక్కులకు ఉపలక్షకము. ఇన్ద్రఘోష పదము మనోజవాది పదములకు ఉపలక్షకము. 'వసుభిః' అను పదము రుద్రాది గణములకు ఉపలక్షకము. 'పురస్తాత్' ఇత్యాది దిగ్వాచకశబ్ద ప్రయోగముచేత ప్రోక్షణము దిగ్దేవతా తుష్టికరమని వ్యక్త మగుచున్నది.

8. అర్థము: ఉత్తరవేదిః=ఉత్తరవేది, దేవాన్=దేవతలను, ఉపావవర్తి చేత్=సమీపించినచో, ఇహైవ=ఇచటనే, విజయామహై=విజయమును పొందెదము, ఇతి=అని, అసురాః=అసురులు, వజ్రమ్=వజ్రాయుధమును, ఉద్యత్య=ఎత్తి, దేవాన్=దేవతలను, అభ్యాయన్త=అభిముఖముగ ఎదుర్కొనిరి. తాన్=ఆ యసురులను, ఇన్ద్రఘోషః=ఇంద్రఘోష నామక దేవత, వసుభిః=వసుగణములతోఁ గూడి, పురస్తాత్=తూర్పుదిక్కునుండి, అపానుదత=పోఁదోలెను. మనోజవాః=మనోజవ నామక దేవతలు, పితృభిః=పితృదేవతా గణములతోఁ గూడి, దక్షిణతః=దక్షిణ దిక్కునుండి, (అపానుదన్త=పోఁదోలిరి.) ప్రచేతాః=వరుణుఁడు, రుద్రైః=రుద్రులతోఁ గూడి, పశ్చాత్=పశ్చిమ దిక్కునుండి, అపానుదత=పోఁదోలెను. విశ్వకర్మా='విశ్వకర్మ' అను దేవత, ఆదిత్యైః=ఆదిత్యగణములతోఁ గూడి, ఉత్తరతః=ఉత్తర దిక్కునుండి, అపానుదత=పోఁదోలెను.

తాత్పర్యము: అపక్రమించి దేవాసురుల మధ్యమందు ఉన్నట్టి యుత్తరవేదిని దేవతలు ప్రార్థించినవెంటనే, "ఈ యుత్తరవేది దేవతలను చేరినచో దేవతలే జయింతురు కావున ఇచటనే ఇప్పుడే ఉత్తరవేది దేవతలను చేరుటకు ముందే

దేవతలను జయించుదము" అని అసురులు తలఁచి వజ్రాయుధమునెత్తి వారిని కొట్టుటకు ఉద్యతులైరి. ఆ విధముగ ఉద్యమించిన యసురులను ఇంద్రఘోషాది దేవతలు వస్వాది గణములతోఁ గూడి ప్రాచ్యాది దిక్కులనుండి వెడలఁగొట్టిరి. ప్రోక్షణమును విధించుటకు ముందు ఇచట ఆ ప్రోక్షణము ప్రశంసింపఁబడినది.

9. అర్థము: ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, ఉత్తరవేదిమ్=ఉత్తరవేదిని, ప్రోక్షతి యత్=ప్రోక్షించినచో, తత్=అప్పుడు, యజమానః=యజమానుఁడు, దిగ్భ్యః ఏవ=దిక్కులనుండియే, భ్రాతృవ్యాన్=శత్రువులను, ప్రణుదతే=ప్రకర్షముగా పోఁగొట్టుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వోక్త విధముగ ఉత్తరవేదిని ప్రోక్షించవలెను. అప్పు డా యజమానుఁడు శత్రువులను దిక్కులనుండియే వెడలఁగొట్టును.(ఇది ప్రోక్షణవిధి.)

10. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుడు, యతీన్=ప్రచ్ఛన్న వేషులైన యసురులను, సాలవృకేభ్యః=తోఁడేళ్లకొఱకు, ప్రాయచ్ఛత్=ఇచ్చెను. తాన్=ఆ యసురులను, ఉత్తరవేద్యాః=ఉత్తరవేదికి, దక్షిణతః=దక్షిణ దిశయందు, (సాలవృకాః=తోఁడేళ్లు,) ఆదన్=భక్షించినవి. ప్రోక్షణీనామ్=ప్రోక్షింపఁబడు నుదకములలో, ఉచ్ఛిష్యేత యత్=ఏ యుదకము మిగులునో, తత్=ఆ మిగిలిన యుదకమును, ఉత్తరవేద్యై=ఉత్తరవేదికి, (షష్ఠ్యర్థే చతుర్థీ.) దక్షిణతః=దక్షిణ దిక్కునందు, నినయేత్=పొందించవలెను (పోయవలెను). తత్ర=ఆ దక్షిణ దిశయందు, యదేవ=ఏదియే, క్రూరమ్=క్రూర మైనదో, తత్=ఆ క్రూరమైన దానిని, శమయతి=శమింపఁజేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఇంద్రుడు యతులనఁబడు అసురవిశేషములను చంపి తోఁడేళ్ల కిచ్చెను. తోఁడేళ్లు ఆ యసురులను ఉత్తరవేదికి దక్షిణ దిక్కునందు భక్షించినవి. కనుక పూర్వోక్తములైన ప్రోక్షింపఁబడిన యుదకములను ఉత్తరవేదికి దక్షిణ దిశయందు పోయవలెను. ఈ విధముగ చేసిన యజమానుఁడు ఆ ప్రోక్షణశేషముచే ఆ దక్షిణదిక్కునందుఁగల క్రూరాంశమును శమింపఁజేసినవాఁ డగును. (ఇది ప్రోక్షణశేష నినయన విధి. యతులు=దేవతలను సంహరించుటకై ఎల్లప్పుడు ప్రయత్నించుచు ఉత్తమాశ్రయముచే ప్రచ్ఛన్న వేషులై యుండునట్టి యసురులు.)

11. అర్థము: (యజమానః=యజమానుఁడు,) యమ్=ఏశత్రువును, ద్విష్యాత్=ద్వేషించునో, తమ్=ఆ శత్రువును, ధ్యాయేత్=తలఁచవలెను. (అయమ్=ఈ యజమానుఁడు,) ఏనమ్=ఈ శత్రువును, శుచైవ=దుఃఖముతోనే, అర్పయతి=అర్పించుచున్నాఁడు.

తాత్పర్యము: యజమానుఁడు ప్రోక్షణశేషమును ఉత్తరవేదికి దక్షిణ దిక్కునందు పోయునపుడు తాను ద్వేషించుచున్న శత్రువును తలఁచుచు ఆ ప్రోక్షణశేషమును పాఱపోయవలెను. ఆ విధముగ చేసిన యజమానుఁడు తాను ద్వేషించుచున్న శత్రువును దుఃఖభాజనునిగా చేసినవాఁ డగును. (ఇచట నినయన కాలమునందు ధ్యానము విధింపఁబడినది.)

సప్తమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకేఽష్టమోఽనువాకః

మూలము: [1]సోత్తరవేది రబ్రవీ త్సర్వాన్మయా కామాన్వ్యశ్నవ థేతి తే దేవా అకామయన్తాసురా న్భ్రాతృవ్యా నభి భవేమేతి తేఽజుహవుః సిగ్ంహీరసి సపత్నసాహీ స్వాహేతి తేఽసురాన్భ్రాతృవ్యా నభ్యభవన్తేఽసురా న్భ్రాతృవ్యా నభిభూయాకామయన్త ప్రజాం విన్దేమహీతి తేఽజుహవుః సిగ్ంహీరసి సుప్రజావనిః స్వాహేతి తే ప్రజా మవిన్దన్త తే ప్రజాం విత్త్వా (౧)అకామయన్త పశూన్విన్దేమహీతి తేఽజుహవుః సిగ్ంహీరసి రాయస్పోషవనిః స్వాహేతి తే పశూనవిన్దన్త తే పశూ న్విత్త్వాఽకామయన్త ప్రతిష్ఠాం విన్దేమహీతి తేఽజుహవుః సిగ్ంహీరస్యాదిత్యవనిః స్వాహేతి త ఇమాం ప్రతిష్ఠా మవిన్దన్త త ఇమాం ప్రతిష్ఠాం విత్త్వాఽకామయన్త దేవతా ఆశిష ఉపేయామేతి తేఽజుహవుః సిగ్ంహీరస్యా వహ దేవా న్దేవయతే (౨)యజమానాయ స్వాహేతి తే దేవతా ఆశిష ఉపాఽఽయ [2]న్పఞ్చకృత్వో వ్యాఘార యతి పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞమేవావ రున్ధే [3]ఽక్ష్ణయా వ్యాఘారయతి తస్మా దక్ష్ణయా పశవోఽఙ్గాని ప్ర హరన్తి ప్రతిష్ఠిత్యై [4]భూతేభ్యస్త్వేతి స్రుచ ముద్గృహ్ణాతి య ఏవ దేవా భూతా స్తేషాం తద్భాగధేయం తానేవ తేన ప్రీణాతి [5]పౌతుద్రవాన్పరిధీన్పరి దధాత్యేషాం (3)లోకానాం విధృత్యా [6]అగ్నేస్త్రయో జ్యాయాగ్ంసో భ్రాతర ఆసన్తే దేవేభ్యో హవ్యం వహన్తః ప్రామీయన్త సోఽగ్ని రబిభేదిత్థం వావ స్య ఆర్తిమాఽఽరిష్యతీతి స నిలాయత స యాం వనస్పతి ష్వవసత్తాం పూతుద్రౌ యామోషధీషు తాగ్ం సుగన్ధితేజనే యాం పశుషు తాం పేత్వస్యాన్తరా శృఙ్గే తం దేవతాః ప్రైష మైచ్ఛన్తమన్వవిన్దన్త మబ్రువన్ (౪)ఉప న ఆ వర్తస్వ హవ్యం నో వహేతి

సోఽబ్రవీద్వరం వృణై యదేవ గృహీతస్యాహుతస్య బహిఃపరిధి స్కన్దాత్తన్మే భ్రాతృణాం భాగధేయ

మసదితి తస్మా ద్యద్గృహీతస్యాహుతస్య బహిఃపరిధి స్కన్దతి తేషాం తద్భాగధేయం తానేవ తేన

ప్రీణాతి సోఽమన్యతాస్థన్వన్తో మే పూర్వే భ్రాతరః ప్రామేషతాస్థాని శాతయా ఇతి స యాని

(౫)అస్థాన్యశాతయత తత్పూతుద్వ్రభవ ద్యన్మాగ్ంస ముపమృతం తద్గుల్గులు [7] యదేతా న్త్సంభారా

న్త్సంభరత్యగ్నిమేవ తత్సం [8] భర త్యగ్నేః పురీష మసీత్యాహాగ్నేర్హ్యేతత్పురీషం యత్సంభారా [9] అథో

ఖల్వాహురేతే వావైనం తే భ్రాతరః పరి శేరే యత్పౌతుద్రవాః పరిధయ ఇతి(౬)||

[విత్త్వా దేవయత ఏషా మబ్రువన్న్యాని చతుశ్చత్వారిగ్ంశచ్చ||]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకేఽష్టమోఽనువాకః ||౮||

## వేదార్థదీపిక

అవతారిక: సప్తమానువాకమునందు ఉత్తరవేది నిరూపణము చేయఁబడినది. ఈ యష్టమానువాకమునందు వ్యాఘారణము విధింపఁబడుచున్నది. వ్యాఘారణము=హోమవిశేషము. ఈ యనువాకము ప్రథమకాండగత ద్వితీయప్రపాఠకస్థ ద్వాదశానువాకమునందలి "సింహీరసీ"త్యాది మంత్రములకు వివరణాత్మకము.

1. అర్థము: "మయా=నాచేత, సర్వాన్ కామాన్ సమస్తములైన కోరికలను, వ్యశ్నవథ=పొందుఁడు," ఇతి=అని, సా=ఆ, ఉత్తరవేదిః=ఉత్తరవేది, అబ్రవీత్=పలికెను. 'భ్రాతృవ్యాన్=శత్రువులైన, అసురాన్=అసురులను, అధి భవేమ ఇతి=తిరస్కరించెదము' అని, తే దేవాః=ఆ దేవతలు, అకామయన్త=కోరిరి. (హే ఉత్తరవేదే!=ఓ ఉత్తరవేది! త్వమ్=నీవు,) సింహీః=సింహరూపధారిణివి, సపత్నసాహీ=శత్రుఘాతినివి, అసి=అగుచున్నావు. స్వాహా=ఈ హవిస్సు నీకు హుతమగుఁగాక, ఇతి=అని, తే=ఆ దేవతలు, ఆజుహవుః=హోమము చేసిరి. తే=ఆ దేవతలు, భ్రాతృవ్యాన్=శత్రువులైన, అసురాన్=రాక్షసులను, అభ్యభవన్=తిరస్కరించిరి.

తే=ఆ దేవతలు, భ్రాతృవ్యాన్ అసురాన్=శత్రువులైన రాక్షసులను, అభిభూయ=తిరస్కరించి, "ప్రజామ్=సంతానమును, విన్దేమహి=పొందెదము,' ఇతి=అని, అకామయన్త=కోరిరి. తే=ఆ దేవతలు, (ఓ ఉత్తరవేది నీవు,) సింహీః=సింహరూపధారిణివి, సుప్రజావనిః=శోభనమైన అపత్యమును, భృత్యులను ఒసఁగెడిదానవు, స్వాహా=ఈ ఆహుతి నీకు అర్పితమైనది, ఇతి=అని, అజుహవుః=హోమము చేసిరి. తే=ఆ దేవతలు, ప్రజామ్=సంతానమును, అవిన్దన్త=పొందిరి.

తే=ఆ దేవతలు, ప్రజామ్=సంతానమును, విత్త్వా=పొంది, "పశూన్=పశువులను, విన్దేమహి=పొందెదము," ఇతి=అని, అకామయన్త=కోరిరి. 'సింహీః=సింహరూపధారిణివి. రాయస్పోషవనిః=పశ్వాదిధనసమృద్ధి దాయి

నివి, అసి=అగుచున్నావు. స్వాహా=ఈ హవిస్సు నీకు హుతమగుఁగాక," ఇతి=అని, తే=ఆ దేవతలు, అజు హవుః=హోమము చేసిరి.

తే=ఆ దేవతలు, పశూన్=పశువులను, విత్వా=పొంది, ప్రతిష్ఠాన్=ప్రతిష్ఠను, విన్దేమహి=పొందెదము, ఇతి=అని, అకామయన్త=కోరిరి. సింహీః=సింహరూపధారిణివి, ఆదిత్యవనిః=భూతి సంబంధి ప్రతిష్ఠా దాయినివి, అసి=అగు చున్నావు. స్వాహా=ఈ హవిస్సు నీకు సమర్పితము, ఇతి=అని, తే=ఆ దేవతలు, అజుహవుః=హోమము చేసిరి. తే=ఆ దేవతలు, ఇమాం ప్రతిష్ఠామ్=ఈ ప్రతిష్ఠను, అవిన్దన్త=పొందిరి.

తే=ఆ దేవతలు, ఇమాం ప్రతిష్ఠామ్=ఈ ప్రతిష్ఠను, విత్వా=పొంది, ఆశిషః దేవతాః=కర్మఫలములను కోరునట్టి దేవతలను, ఉపేయామ=పొందెదము ఇతి=అని, తే=ఆ దేవతలు, అకామయన్త=కోరిరి. సింహీః=సింహరూపధా రిణివి, అసి=అగుచున్నావు. దేవాన్=దేవతలను, ఆ వహ=ఆవహించుము. దేవయుతే=దేవతలను కోరుచున్న, యజమానాయ=యజమానునికొఱకు, స్వాహా=ఈ హవిస్సు (నీకు)హుతమగుఁగాక, ఇతి=అని, తే=ఆ దేవ తలు, అజుహవుః=హోమము చేసిరి. తే=ఆ దేవతలు, ఆశిషః దేవతాః=కర్మఫలములను కోరునట్టి దేవతలను, ఉపఽఽయన్=పొందిరి.

తాత్పర్యము: దేవతలు ఉత్తరవేది కోరిన వరము ననుసరించి ఒక్కొక్క కోరికను ఒక్కొక్క ఆహుతిని హోమము చేసి పొందిరి. ఒక్కొక్క ఆహుతికి ఒక్కొక్క వాక్యమును చెప్పుచు హోమము చేయునపుడు ఆ దేవతలు 'సపత్నసాహీ' 'సుప్రజావనిః' 'రాయస్పోషవనిః' 'ఆదిత్యవనిః' 'దేవయుతే యజమానాయ' అనెడి ఆ యా కోరికలకు సంబంధించిన ఈ పదములను ఆ వాక్యములందు చేర్చి పలుకుచు హోమము చేసిరి. శేషము సుగ్రాహ్యము.

2. అర్థము: పఞ్చ కృత్వః=అయిదు పర్యాయములు, వ్యాఘారయతి=విశిష్టమైన ఆఘారహోమము చేయవలెను. పఙ్క్తిః=పంక్తి ఛ్ఛందస్సు, పఞ్చాక్షరా=అయిదు అక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పంచద్రవ్య సాధ్యమైనది. (అతః=ఈ కారణమువలన, అయమ్=అయిదు పర్యాయములు హోమము చేసిన యీ యజమానుఁడు,) యజ్ఞమ్=యజ్ఞ(ఫల)మును, అవరున్ధే ఏవ=నిశ్చయముగ పొందుచున్నాఁడు.

తాత్పర్యము: ఒకటవ మంత్రమున చెప్పఁబడిన ఆహుతులను అయిదు పర్యాయములు హోమము చేయవలెను. పంక్తి ఛ్ఛందస్సు అయిదు అక్షరములు కలది. యజ్ఞము పంచద్రవ్య సాధ్య మైనది. కావున ఈ అయిదు ఆహుతులను హోమము చేసిన యజమానుఁడు నిశ్చయముగ యజ్ఞ(ఫల)మును పొందును. (ఇచట ఆహుతిసంఖ్య విహిత మైనది.)

3. అర్థము: అక్ష్ణయా=వక్రరీతిగా, వ్యాఘారయతి=ఆహుతిని హోమము చేయవలెను. తస్మాత్= ఆ కారణమువ లన, పశవః=పశువులు, అఙ్గాని=అవయవములను, అక్ష్ణయా=వక్రరీతిగా, ప్రహరన్తి=ముడుచుకొనుచున్నవి. (అయమ్=ఈ హోమము,) ప్రతిష్ఠిత్యై=ప్రతిష్ఠకొఱకు, (భవతి=అగుచున్నది.)

తాత్పర్యము: వ్యాఘారహోమమును వక్రగతిగా చేయవలెను (దక్షిణపుటంచునందు ఆరంభించి ఉత్తరదిశగా సమాప్తిచేయు పద్ధతి వక్రగతి యనఁబడును.) పశువులు శయనకాలమున పాదాద్యంగములను ముడుచుకొనును. ఈ యాహుతి ప్రతిష్ఠకొఱకు కారణ మగును.

4. అర్థము: "భూతేభ్య స్త్వా" ఇతి="ఓ జుహూ! నిన్ను ప్రాచీన దేవతలకొఱకు పైకి తీసికొనుచున్నాను" అను మంత్ర ముచేత, స్రుచమ్=హోమసాధన విశేషమును, ఉత్ గృహ్ణాతి=పైకి తీసికొనవలెను. యే దేవాః ఏవ=ఏ దేవతలే, భూతాః=చిరంతనులో, తేషామేవ=వారికే, తత్ భాగధేయమ్=ఆ హోమభాగము. తేన=ఆ హోమభాగము చేత, (అయమ్=ఈ యజమానుఁడు,) తానేవ=ఆ చిరంతన దేవతలనే, ప్రీణాతి=సంతోషపఱచుచున్నాఁడు.

తాత్పర్యము: "భూతేభ్య స్త్వా" ఇత్యాది మంత్రము నుచ్చరించుచు జుహూవును పైకి తీసికొనవలెను. ప్రాచీన దేవతో ద్దేశముచే స్రుచమును పైకి తీసికొనుటవలన ఆ దేవతలు సత్కృతు లగుచు సంతోషింతురు. (ఇచట స్రుచముయొక్క ఉద్గ్రహణము విహితమైనది.)

5. అర్థము: ఏషాం లోకానామ్=ఈ లోకములయొక్క, విధృత్యై=విశేష ధారణమునకై, పౌతుద్రవాన్ పరిధీన్=దేవదారు సంబంధము లయిన పరిధులను, పరిదధాతి=అంతటను స్థాపించవలెను.

తాత్పర్యము: దేవదారు సంబంధములైన మూఁడు పరిధులను అంతటను స్థాపించవలెను. ఈ పరిధి ధారణము ఈ ముల్లోకములయొక్క విశేషధారణముకొఱ కగును. (ఇచట పరిధి పరిధారణము విహిత మైనది.)

6. అర్థము: అగ్నేః=అగ్నికి, త్రయః=ముగ్గురు, భ్రాతరః=సోదరులు, ఆసన్=ఉండిరి. తే=వారు, దేవేభ్యః=దేవతలకొఱకు, హవ్యమ్=హవిస్సును, వహన్తః=వహించుచున్నవారై, ప్రామీయన్త=హవిర్వహన ప్రయాసముచేత మరణించిరి. ఇత్థం వావ=ఈ విధముగనే, స్యః=ఆ యితరుఁడు (కూడ,) ఆర్తిమ్ ఆరిష్యతి ఇతి=మృతిని పొందఁగలఁడని, సః అగ్నిః=ఆ యగ్ని, అబిభేత్=భయపడెను. సః=ఆ యగ్ని, నిలాయత=పాఱిపోయెను. సః=ఆ పాఱిపోయిన యగ్ని, యామ్=ఏ రాత్రిని, వనస్పతిషు=వృక్షములయందు, అవసత్=ఉండెనో, (గడిపెనో,) తామ్=ఆ రాత్రిని, పూతద్రౌ=దేవదారు వృక్షమునందును, యామ్=ఏ రాత్రిని, ఓషధీషు=ఓషధులందు, అవసత్=నివసించెనో, తామ్=ఆ రాత్రిని, సుగన్ధితేజనే=సుగంధయుక్త తృణమునందు, పశుషు=పశువులయందు, యామ్=ఏ రాత్రిని, అవసత్=నివసించెనో, తామ్=ఆ రాత్రిని, పేత్వస్య=మేఁకయొక్క, అన్తరా శృఙ్గే=కొమ్ముల మధ్యమునందును, (నివసన్తమ్=నివసించుచున్న,) తమ్=ఆ యగ్నిని, దేవతాః=దేవతలు, ప్రైషమ్=హవిర్వహనమునందు ప్రేరించుటకు, ఐచ్ఛన్=ఇచ్ఛయించిరి. తమ్=ఆ యగ్నిని, అన్వవిన్దన్=అన్వేషించి తెలిసికొనిరి. "నః=మాయొక్క (సమీపమునకు), ఆ వర్తస్వ=తిరిగి రమ్ము. నః=మాకొఱకు, హవ్యమ్=హవిస్సును, వహ=వహించుము." ఇతి=అని, తమ్=ఆ యగ్నిని గూర్చి, అబ్రువన్=పలికిరి.

"వరమ్=వరమును, వృణై=కోరుదును. గృహీతస్య=గ్రహింపఁబడిన, అహుతస్య=హుతముకాని హవిస్సుయొక్క, యదేవ=ఏ లేశమే, బహిఃపరిధి=పరిధికి వెలుపల, స్కన్దాత్=పడునో, తత్=అది, మే భ్రాతృణామ్=నా సోదరులకు, భాగధేయమ్=భాగముగ, అసత్=అగుఁగాక," ఇతి=అని, సః=ఆ యగ్ని, అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణమువలన, గృహీతస్య=గ్రహింపఁబడిన, అహుతస్య=హుతముకాని హవిస్సుయొక్క, యత్=ఏ లేశము, బహిఃపరిధి=పరిధికి వెలుపల, స్కన్దతి=పడుచున్నదో, తత్=అది, తేషామ్=ఆ యగ్నిసోదరులకు, భాగధేయమ్=భాగము. తేన=ఆ భాగధేయముచేత, తానేవ=ఆ యగ్నిసోదరులనే, ప్రీణాతి=(యజమానుఁడు)సంతోషపఱచుచున్నాఁడు. "మే=నాయొక్క, పూర్వే భ్రాతరః=పూర్వసోదరులు, అస్థన్వన్తః=త్వగస్థిమాంసోపేతులై, ప్రామేషత=మరణించిరి. అస్థాని=వారియొక్క అస్థులు మాంసములు, శాతయై=పరిత్యజింతును, ఇతి=అని, సః=ఆ యగ్ని, అమన్యత=తలఁచెను. సః=ఆ యగ్ని, యాని అస్థాని=ఏ యస్థులను, అశాతయత=పరిత్యజింపఁజేసెనో, తత్=ఆ అస్థి సముదాయము, పూతద్రు=దేవదారువు, అభవత్=ఆయెను. యత్ మాంసమ్=ఏ మాంసము, ఉపభృతమ్=భరింపఁబడినదో, తత్=అది, గుగ్గులు=గుగ్గులువుగా అభవత్=ఆయెను.

తాత్పర్యము: అగ్నికి ముప్వురు సోదరు లుండిరి. వారు ముప్వురు దేవతలకు హవిస్సును వహించుచు మరణించిరి. ఇతరుఁడును (తానును) ఈ విధముగనే మరణించునని అగ్ని భయపడి పాఱిపోయి వనస్పతులలో దేవదారు వృక్షమునందు ఒక రాత్రిని, ఓషధులలో సుగంధ యుక్తమైన తృణవిశేషమునందు ఒక రాత్రిని, మేఁకయొక్క కొమ్ముల మధ్యమునందు ఒక రాత్రిని గడిపెను. దేవతలు ఆ యగ్నిని అన్వేషించి తెలిసికొని హవిస్సును వహించుటకై తమయొద్దకు తిరిగి రమ్మని ఆహ్వానించిరి. అప్పుడా యగ్ని "హోమమునకు పూర్వము పరిధికి వెలుపల పడిన హవిర్లేశము తన సోదరులకు భాగముగా కావలెనని" వరమును కోరెను.

అందువలన జుహూవులోనికి తీసికొనఁబడిన హవిస్సుయొక్క లేశము హోమమునకు పూర్వము పరిధికి బహిర్భాగమునందు పడినచో అది అగ్నిసోదరులకు భాగముగా భావించి యజమానుఁడు ఆ హవిర్లేశభాగముచేత ఆ యగ్నిసోదరులను సంతోషపఱుచుచున్నాఁడు. మఱియు నతని సోదరులు త్వగస్థిమాంసములతో కూడినవారై మరణించిరి. వారి అస్థి మాంసములు పరిత్యజింతునని యగ్ని తలఁచెను. పరిత్యక్తములైన అస్థులు దేవదారు వృక్షము గాను, మాంసములు గుగ్గులు వృక్షముగాను అయినవి. (సంభారవిధికి పూర్వము ఆ సంభారము లిచట స్తుతింపఁబడినవి.)

7. అర్థము: ఏతాన్ సంభారాన్=ఈ పూర్వోక్త సంభారములను, సంభరతి యత్=సంపాదించుకొనుచున్నచో, తత్=అప్పుడు, అగ్నిమేవ=అగ్నినే, సంభరతి=సంపాదించుకొనుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్త సంభారములను సంపాదించుకొనిన యజమానుఁడు అగ్నినే సంపాదించుకొనినవాఁ డగును. ఇది సంభార విధి.

8. అర్థము: "అగ్నేః పురీషమసి" ఇతి ఆహ="ఓ సంభార స్వరూపమా! నీవు అగ్నికి భాసకము, పూరకమును అగుచున్నావు." అని వేదము చెప్పినది. సంభారాః యత్=సంభారము లేవి కలవో, ఏతత్=ఇది, అగ్నేః=అగ్నికి, పురీషం హి=పూరకము కదా!

తాత్పర్యము: పూర్వోక్త సంభారము లగ్నికి భాసకములు, పూరకములు నగుచున్నవి. "అగ్నేః పురీషమ్" అను మంత్రమునందలి పురీష శబ్దముచేత సంభారరూప వహ్నిపూరణము వివక్ష చేయఁబడినది.(గుగ్గులు సుగంధితేజన శుక్లోర్ణాస్తుకలు సంభారములు.)

9. అర్థము: అథో=మఱియు, పౌతుద్రవాః=దేవదారు వృక్ష సంబంధములైన, పరిధయః యత్=పరిధు లేవి కలవో, తే భ్రాతరః=ఆ యగ్నిసోదరులు, ఏతే వావ=ఇవియే అయి, ఏనమ్=ఈ యగ్నిని, పరి శేరే=అంతటను శయనించుచున్నారు, ఇతి=అని, ఆహుః ఖలు=చెప్పుచున్నారు కదా!

తాత్పర్యము: మఱియు దేవదారువృక్ష సంబంధము లయిన యీ పరిధులే ఆ యగ్నిసోదరులు. వారే పరిధిరూపముతో ఈ యగ్ని కంతటను శయనించుచున్నారు కదా! అని అభిజ్ఞులు చెప్పుచున్నారు. దేవదారు పరిధిరూపముతో అగ్నిసోదరులు అగ్నికి సన్నిహితులుగా నున్నారని ఇచట చెప్పఁబడినది.

అష్టమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే నవమోఽనువాకః

మూలము: [1]బద్ధమవ స్యతి వరుణపాశాదేవైనే ముఞ్చతి ప్ర ణేనేక్తి మేధ్యే ఏవైనే కరోతి [2]సావిత్రియర్చా హుత్వా హవిర్ధానే ప్ర వర్తయతి సవితృప్రసూత ఏవైనే ప్ర వర్తయతి [3]వరుణో వా ఏష దుర్వాగుభయతో బద్ధో యదక్షః స యదుత్సర్జే ద్యజమానస్య గృహా నభ్యుత్సర్జే త్సువాగ్దేవ దుర్యాగ్ం ఆ వదేత్యాహ గృహా వై దుర్యాః శాన్త్యై [4]పత్నీ(౧)ఉపానక్తి పత్నీ హి సర్వస్య మిత్రం మిత్రత్వాయ యద్వై పత్నీ యజ్ఞస్య కరోతి మిథునం తదథో పత్నియా ఏవైష యజ్ఞస్యాన్వారమ్భోఽనవచ్ఛిత్త్యై [5]వర్త్మనా వా అన్విత్య యజ్ఞగ్ం రక్షాగ్ంసి జిఘాగ్ంసన్తి వైష్ణవీభ్యామృగ్భ్యాం వర్త్మనోర్జుహోతి యజ్ఞో వై విష్ణుర్యజ్ఞాదేవ రక్షాగ్ంస్యప హన్తి [6]యదధ్వర్యురనగ్నా వాహుతిం జుహుయాదన్ధోఽధ్వర్యుః స్యాద్రక్షాగ్ంసి యజ్ఞగ్ం హన్యుః (౨)హిరణ్యముపాస్య జుహోత్యగ్నివత్యేవ జుహోతి నాన్ధోఽధ్వర్యుర్భవతి న యజ్ఞగ్ం రక్షాగ్ంసి ఘ్నన్తి [7]ప్రాచీ ప్రేతమధ్వరం కల్పయన్తీ ఇత్యాహ సువర్గమేవైనే లోకం గమయతి [8]అత్ర రమేథాం వర్ష్మన్పృథివ్యా ఇత్యాహ వర్ష్మ హ్యేతత్పృథివ్యా యద్దేవయజనగ్ం [9]శిరో వా ఏతద్యజ్ఞస్య యద్ధవిర్ధానం దివో వా విష్ణవుత వా పృథివ్యాః (3)ఇత్యాశీర్పదయర్చా దక్షిణస్య హవిర్ధానస్య మేథీం ని హన్తి శీర్షత ఏవ యజ్ఞస్య యజమాన ఆశిషోఽవ రున్ధే దణ్డో వా ఔపరస్తృతీయస్య హవిర్ధానస్య వషట్కారేణాక్ష మచ్ఛినద్యత్తృతీయం ఛదిర్హవిర్ధానయో రుదాహ్రియతే తృతీయస్య హవిర్ధానస్యావరుద్ధ్యై [11]శిరో వా ఏతద్యజ్ఞస్య యద్ధవిర్ధానం విష్ణో రరాటమసి విష్ణోః పృష్ఠ

మసీత్యాహ తస్మాదేతావద్ధా శిరో విష్యూతం [12]విష్ణోః స్యూరసి విష్ణో ర్ధ్రువమసీత్యాహ వైష్ణవగ్ం హి

దేవతయా హవిర్ధానం [13]యం ప్రథమం గ్రన్థిం గ్రథ్నీయాద్యత్తం న విస్రగ్ంసయేదమేహేనాధ్వర్యుః

ప్ర మీయేత తస్మాత్స విస్రస్యః(౪)॥

[పత్నీ హాన్యత్యా పృథివ్యా విష్యూతం విష్ణోః షడ్విగ్ంశతిశ్చ]॥

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠకే నవమోఽనువాకః ||౯||

## వేదార్థదీపిక

అవతారిక: అష్టమానువాకమునందు వ్యాహారణము విహిత మైనది. ఈ నవమానువాకమునందు కూడ వ్యాహారణమే చెప్పఁబడుచున్నది. ఈ యనువాకమునందలి "సువాగ్దేవ దుర్యాన్" ఇత్యాది మంత్రములు ప్రథమ కాండస్థ ద్వితీయ ప్రపాఠక గత త్రయోదశానువాకములోనివి. ఆ మంత్రములకు ఈ యనువాకము వివరణాత్మకము.

1. అర్థము: బద్ధమ్=(హవిర్ధానములనెడి శకటములయందు) బద్ధమైనదానిని, అవస్యతి=విమోచనము చేయవలెను. (ఏవం కృతవాన్=ఈ విధముగ చేసిన యజమానుఁడు,) వరుణ పాశాదేవ=వరుణ పాశమునుండియే, ఏనే=ఈ శకటములను, ముఞ్చతి=విడిపించినవాఁ డగుచున్నాఁడు. ప్రణేనేక్తి=ప్రక్షాళనము చేయవలెను. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁగా,) ఏనే=ఈ శకటములను, మేధ్యే ఏవ=పవిత్రములనుగానే, కరోతి=చేయుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: హవిర్ధానము లనెడి శకటములయందు పూర్వము బద్ధమైనదానిని విమోచనము చేయవలెను. ఈ విమోచనము చేసిన యజమానుఁడు వరుణపాశమునుండియే విమోచనము చేసినవాఁ డగును. పిమ్మట ప్రక్షాళనము చేయవలెను. ఈ ప్రక్షాళనమువలన ఈ శకటములను పవిత్రములుగానే చేసినవాఁ డగుచున్నాఁడు.

2. అర్థము: సావిత్రియా ఋచా=సవితృసంబంధినియగు ఋక్కుచే, హుత్వా=హోమము చేసి, హవిర్ధానే=(హవిస్సును వహించునట్టి) హవిర్ధానము లనెడి రెండు శకటములను, ప్ర వర్తయతి=ప్రేరించవలెను. సవితృ ప్రసూతః ఏవ=(ఈ విధముగ ప్రేరించిన యజమానుఁడు) సవితృదేవతచే ఆజ్ఞాపించఁబడినవాఁడే అయి, ఏనే=ఈ హవిర్ధానములను, ప్రవర్తయతి=ప్రేరేపించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: యజమానుఁడు సవితృ సంబంధినియగు ఋక్కును పఠించుచు ఈ హవిర్ధానములను ప్రేరేపించవలెను. ఇట్లు చేసిన యజమానుఁడు సవితృదేవుని యనుజ్ఞను పొందినవాఁడే అయి ఈ హవిర్ధానములను ప్రవర్తింపఁజేసినవాఁ డగును. (మంత్రవినియోగపూర్వక శకటప్రేరణ మిచట విహిత మైనది.)

3. అర్థము: ఉభయతః=రెండువైపులందు, బద్ధః=కట్టఁబడిన, అక్షః యత్=బండికన్ను ఏది కలదో, ఏషః=ఇది, దుర్వాక్=దుష్టవాక్కులు కలు, వరుణ వై=వరుణ రూపమే. సః=ఆ యక్షము, ఉత్సర్జేత్ యత్=ధ్వని చేయుచో, యజమానస్య=యజమానునియొక్క, గృహాన్ అభి=గృహముల కభిముఖముగ, ఉత్సర్జేత్=ధ్వని చేయవలెను. "సువాగ్దేవ దుర్యాగ్ం ఆ వద" ఇతి ఆహ="ఓ అక్షదేవ! నీవు యజమానునియొక్క గృహములను గూర్చి, మంచివాక్కులు కలవాఁడవై అంతటను శ్రేయస్కరమైన వాక్కును పలుకుము" అని "సువాగ్దేవ" ఇత్యాది

మంత్రము చెప్పినది. గృహాః వై=గృహములే, ధుర్యాః='ధుర్య' పదవాచ్యములు. (ఇదమ్=ఈ కథనము,) శాన్త్యై=శాంతికొఱకు, భవతి=అగుచున్నది. (అక్షము బంధన హేతువైన పాశముతో కూడియుండుటచే వరుణునిగా ఆరోపించఁబడినది.)

తాత్పర్యము: ఉభయ పార్శ్వములందు బద్ధమైన బండికన్ను ఏది కలదో, ఇది దుర్వాక్కులు కల వరుణస్వరూపమే. ఆ యక్షము ధ్వని చేయుచో యజమానుని గృహముల కభిముఖముగ ధ్వని చేయుఁగాక. కనుకనే, "మంచివాక్కులు గల ఓ యక్షదేవ! గృహములను గూర్చి మంచివాక్కులు గలవాఁడ వగుచు అంతటను శ్రేయస్కరమైన వాక్కును పలుకుము" అని "సువాగ్దేవ" ఇత్యాది మంత్రము చెప్పినది. ధుర్యపదమునకు గృహములే అర్థము. ఈ చెప్పుట శాంతికొఱ కగును. (వరుణుఁడు క్రూరుఁ డగుటచే దుర్వాక్కుగా చెప్పఁబడినాఁడు. మంత్రమునందలి సువాక్శబ్దోపయోగ మిచట చూపఁబడినది.)

4. అర్థము: పత్నీ=యజమానునిభార్య, ఉపానక్తి=ఆజ్యమిశ్రితమైన సోమక్రయణియగు గోవుయొక్క పదరజస్సుయొక్క తృతీయాంశమును ఈ హవిర్ధానములకు పూయవలెను. పత్నీ=యజమానపత్ని, సర్వస్య=యాగసర్వస్వము నకు, మిత్రం హి=మిత్రము కదా! మిత్రత్వాయ=మిత్రత్వమునకై, పత్నీ=యజమానపత్ని, యత్ వై=ఏది యైతే, యజ్ఞస్య=యజ్ఞమునకు, కరోతి=చేయుచున్నదో, తత్=అది, మిథునమ్=మిథునము, (భవతి=అగుచు న్నది.) అథో=మఱియు, పత్నియా ఏవ=యజమానపత్నిచేతనే, ఏషః అన్వారమ్భః=ఈ అన్వారంభము, యజ్ఞస్య=యజ్ఞమునకు, అనవచ్ఛిత్త్యై=విచ్ఛిత్తి లేకుండుటకై, క్రియతే=చేయఁబడుచున్నది.

తాత్పర్యము: సోమలతను కొనుటలో ముఖ్యసాధనమైన గోవు సోమక్రయణిగా పూర్వము చెప్పఁబడినది. ఆ సోమక్రయణి వేసిన అడుగు జాడలోని రజస్సుయొక్క మూఁడవ భాగమును నేతితో మిశ్రము చేసి ఆ మిశ్రమమును అంజనముగా యజమానపత్ని హవిర్ధానములకు(శకటములకు)పూయవలెను. యజ్ఞసంబంధమైన సర్వమునకు యజమానపత్ని మిత్రము. మిత్రత్వమునకై యజమానపత్ని యజ్ఞమునకు చేయునట్టిది మిథున మగును. మఱియు యజ్ఞము విచ్ఛిన్నము కాకుండుటకై యజమానపత్నిచేతనే అన్వారంభము అను కర్మవిశేషము చేయఁబడుచున్నది. (ఇచట హవిర్ధానములకు ఉపాంజనము విహిత మైనది.)

5. అర్థము: రక్షాంసి=రాక్షసులు, యజ్ఞమ్=యజ్ఞమును, వర్త్మనా అన్వీత్య=హవిర్ధానముల(శకటముల)మార్గము ననుసరించి ప్రవేశించి, జిఘాంసన్తి వై=ధ్వంసము చేయుచున్నారు కదా! (తన్నివారణాయ=ఆ యాటంకమును నివారించుటకై,) వైష్ణవీభ్యాం ఋగ్భ్యామ్=విష్ణుదేవతాకములైన ఋక్కులచేత, వర్త్మనోః=హవిర్ధాన(శకట)ములమార్గములందు, జుహోతి=హోమము చేయవలెను. యజ్ఞః=యజ్ఞము, విష్ణుః వై=విష్ణుస్వరూపమే. (అయమ్=ఈ హోమము చేసిన యజమానుఁడు,) యజ్ఞాదేవ=యజ్ఞమువలననే, రక్షాంసి=రాక్షసులను, అపహన్తి=పోఁగొట్టుచున్నాఁడు.

తాత్పర్యము: రాక్షసులు హవిర్ధానముల మార్గము ద్వారా యజ్ఞమును ప్రవేశించి ధ్వంసము చేయుచున్నారు కదా! కావున ఆ బాధ కలుగకుండుటకై యజమానుఁడు హవిర్ధానముల మార్గములందు వైష్ణవ మంత్రములచే హోమము చేయవలెను. "యజ్ఞో దేవేభ్యో నిలాయత విష్ణూరూపం కృత్వా" అని శ్రుతి చెప్పుటచే యజ్ఞము విష్ణుస్వరూపమే. కావున ఈ విధముగ హోమము చేసిన యజమానుఁడు విష్ణురూప యజ్ఞము ద్వారముననే రాక్షసులను పోఁగొట్టును. (ఇచట హోమము విహిత మైనది.)

6. అర్థము: అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అనగ్నౌ=అగ్నిలేని ప్రదేశమునందు, జుహుయాత్ యత్=హోమము చేయుచో, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అన్ధః=అంధుఁడు, స్యాత్=అగును. రక్షాంసి=రాక్షసులు, యజ్ఞమ్=యజ్ఞమును, హన్యుః=హింసింతురు. హిరణ్యమ్=బంగారమును, ఉపాస్య=ఉంచి, జుహోతి=హోమము చేయవలెను. (తదా=అప్పుడు) అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అగ్నివత్యేవ=అగ్నికల ప్రదేశమునందే, జుహోతి=హోమము చేయుచ

న్నవాఁ డగుచున్నాఁడు. అన్ధః=అంధుఁడు, న భవతి=అగుట లేదు. రక్షాంసి=రాక్షసులు, యజ్ఞమ్=యజ్ఞమును, న ఘ్నన్తి=హింసించుట లేదు.

తాత్పర్యము: అధ్వర్యుఁడు అగ్నిలేని ప్రదేశమున హోమము చేయుచో నతఁడు అంధుఁ డగును. ఆ యజ్ఞమును రాక్షసులు నశింపఁజేయుదురు. కావున అగ్నిలేని ప్రదేశమునందు బంగారము నుంచి యా బంగారముపైని హోమము చేయవలెను. అప్పుడు అగ్ని కల ప్రదేశమునందే హోమము చేసిన ట్లగును. ఇట్లు చేసిన యధ్వర్యుఁడు అంధుఁడు కాఁడు. రాక్షసు లా యజ్ఞమును నశింపఁజేయరు. ఇచట హిరణ్యప్రక్షేపము హోమాధారముగా విహితమైనది.

7. అర్థము: "ప్రాచీ ప్రేత మధ్వరం కల్పయన్తీ" ఇతి ఆహ="ఓ శకటములారా! మీరు యజ్ఞమును బాధారహిత ముగాఁజేయుచున్నవారయి ప్రాఙ్ముఖులై వెళ్లుఁడు" అని "ప్రాచీ ప్రేత" మిత్యాది మంత్రము చెప్పినది. (అనేన=ఈ చెప్పుటచే, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనే=ఈ శకటములను, సువర్గం లోకమేవ=స్వర్గలోకమును గూర్చియే, గమయతి=పొందించుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: "ప్రాచీ ప్రేత మధ్వరం కల్పయన్తీ" అని శ్రుతి చెప్పుటచే అధ్వర్యుఁడు ఈ హవిర్ధానములను స్వర్గలోకమునకే పంపుచున్నాఁడని స్పష్ట మగుచున్నది. (ఇచట "ప్రాచీ ప్రేత" మిత్యాది మంత్రమునందలి 'ప్రాచీ' శబ్ద తాత్పర్యము వివరింపఁబడినది.)

8. అర్థము: "అత్ర రమేథాం వర్ష్మన్పృథివ్యాః" ఇతి ఆహ="ఓ శకటములారా! దేవయజన మనెడి పృథివియొక్క శరీర మైన యీ ప్రదేశమునందు క్రీడించుఁడు." అని"అత్ర రమేథా" మిత్యాది మంత్రము చెప్పినది. దేవయజనం యత్=దేవయజన మనునది యేది కలదో, ఏతత్=ఇది, పృథివ్యాః=పృథివియొక్క, వర్ష్మ హి=శరీరము కదా!

తాత్పర్యము: ఓ శకటములారా! మీరు పృథివియొక్క శరీరమైన ఉత్తరవేదియొక్క యీ పశ్చిమభాగమునందు (మూఁడడు గల ప్రదేశమును విడిచి మిగిలిన ప్రదేశమునందు) విహరించుఁడు అని "అత్ర రమేథామ్" ఇత్యాది మంత్రము చెప్పినది. దేవయజనము పృథివికి శరీరము కదా! (దేవయజన రూపమైన వేది పృథివియొక్క శరీరముగా "యదిమా మవిన్దన్త తద్వేద్యై వేదిత్వమ్" అను బ్రాహ్మణమునందు కూడ చెప్పఁబడినది. ఈ విషయము ప్రసిద్ధమే అని యీ బ్రాహ్మణము చెప్పినది.)

9. అర్థము: హవిర్ధానం యత్=హవిర్ధాన మేది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, శిరః వై=శిరస్సే. "దివో వా విష్ణవుత వా పృథివ్యాః" ఇతి ఆశీర్పదయా ఋచా="ఓ విష్ణూ! ద్యులోకమునుండి కాని, భూలోకము నుండి కాని, మహర్లోకమునుండి కాని, అంతరిక్షమునుండి కాని తీసికొనిరాఁబడిన ధనములతో హస్తములను పూరించుము. ఆ హస్తములనుండి అధికముగ ధనాదికము నొసఁగుము" అనెడి ఆశీస్సు స్ఫురింపఁజేయుచున్న పదములు గల ఋక్కుచే, దక్షిణస్య హవిర్ధానస్య=దక్షిణవుదైన హవిర్ధానమునకు, మేథీమ్=కట్టుగుంజను, నిహన్తి=పాఁతవలెను. ఏవం కృతే సతి=ఈ విధముగ చేయఁగా, యజమానః=యజమానుఁడు, యజ్ఞస్య శీర్షతః ఏవ=యజ్ఞమునకు శిరస్సు అయిన హవిర్ధానమునుండియే, ఆశిషః=ఆశీస్సులను, అవరున్ద్ధే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: హవిర్ధానము యజ్ఞమునకు శిరస్సు కదా! "దివో వా విష్ణవుత" ఇత్యాద్యాశీరర్థక పదములు కల ఋక్కును పఠించుచు దక్షిణవు హవిర్ధానమునకు మేథిని పాఁతవలెను. ఇట్లు చేయుటచే యజమానుఁడు యజ్ఞము నకు శిరోరూపమైన హవిర్ధానమునుండియే ఆశీస్సును పొందును. (ఇచట మేథీ నిఖననము విహిత మైనది. మేథి=పశువులఁగట్టుటకుబాఁతిన కట్టుగుంజ. మేథిని ఖననము చేయుట యనఁగా నేలను త్రవ్వి పాఁతుట అని వివక్ష చేయఁబడినది. శిరస్సునందు చక్షురాది గోళకము లున్నవిధముగా హవిర్ద్రవ్యములు హవిర్ధాన మనెడి శకటమునం దుంచఁబడుటచే హవిర్ధానము యజ్ఞశిరస్సుగా వర్ణింపఁబడినది.)

10. అర్థము: ఔపరః=ఉపరుఁడను పేరు గల రాక్షసుని కుమారుఁడైన, దణ్డః=దండుఁడను రాక్షసుఁడు, తృతీయస్య=మూఁడవ దియైన, హవిర్ధానస్య=హవిర్ధాన శకటముయొక్క, అక్షమ్=బండికంటిని, వషట్కారేణ=వషట్కార దేవతా సహాయముచే, అచ్ఛినత్ వై=ఛేదించెను కదా! (అతః=ఈ కారణమువలన,) తృతీయమ్=మూఁడవదియగు, ఛదిః=ఛది, హవిర్ధానయోః=రెండు హవిర్ధానములయొక్క, ఉత్=పైని, ఆ హ్రియతే యత్=తీసికొనిరాఁబడినచో, (నిర్మిత మైనచో, తత్=ఆ ఛది,) తృతీయస్య హవిర్ధానస్య=మూఁడవ హవిర్ధానముయొక్క, అవరుద్ధ్యై=ప్రాప్తి కొఱకు, భవతి=అగుచున్నది.* ఛదిః=ఇంటికప్పు.

తాత్పర్యము: ఉపరాసురుని కుమారుఁడైన దండుఁ డను రాక్షసుఁడు వషట్కారదేవునితో మైత్రి చేసి ఆ వషట్కార దేవుని మూలమున తృతీయ హవిర్ధానమును ప్రవేశించి ఆ హవిర్ధానముయొక్క అక్షమును ఛేదించెను. అందువలన తృతీయ హవిర్ధానమునకు ప్రతినిధిగా మిగిలిన హవిర్ధానములలో ఒక్కొక్క శకటమునకు పైని తృణాది నిర్మితమైన (ఇంటికప్పువంటి) ఛదిని స్థాపించవలెను. (దక్షిణోత్తర పార్శ్వములందు పరిశ్రయణము నకై రెండు ఛదులుండును. ఇప్పుడు స్థాపించినది మూఁడవది యగును. శకటము లోపల హవిర్ధాన మనెడి మండపమును నిర్మించవలెను. అందు దక్షిణ శకటమునకు తూర్పున గ్రహముల నుంచుటకై అవకాశమును విడిచి దక్షిణోత్తర రూపమున ఆఱు స్తంభములను పాఁతవలెను. ఇట్లే పశ్చిమ భాగమునందు కూడ ఆఱు స్తంభములను నాటవలెను. ఆ స్తంభముల వరుసలలో ఉదంచములుగ రెండు వెదుళ్లను స్థాపించవలెను. ఇచట ఆచ్ఛాదకము విహిత మైనది.)

11. అర్థము: హవిర్ధానం యత్=హవిర్ధానము ఏది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, శిరః వై=శిరస్సే. "విష్ణో రరాటమసి విష్ణోః పృష్ఠమసి" ఇతి ఆహ="ఓ దర్భమాలా! నీవు హవిర్ధాన మండపమునకు లలాట మగు చున్నావు. పృష్ఠమగుచున్నావు." అని "విష్ణో" రిత్యాది మంత్రము చెప్పినది. తస్మాత్=ఆ కారణమువలన, ఏతావద్వా=ఈ విధముగనే(విశ్వకర్మణా=విశ్వకర్మచే,) శిరః=శిరస్సు, వి ష్యూతమ్=కూర్పఁబడినది.

తాత్పర్యము: హవిర్ధానమండపము యజ్ఞమునకు శిరస్సే. "విష్ణోః రరాటమసి" ఇత్యాది మంత్రము చెప్పినవిధముగ విశ్వకర్మ హవిర్ధాన మండపమునకు శిరస్సును సమకూర్చెను.(యజ్ఞపురుషునకు హవిర్ధానమండపము శిరస్సుగా వర్ణింపఁబడినది. తత్సామ్యము మంత్రములచే నిచట చూపఁబడినది.)

12. అర్థము: "విష్ణోః స్యూరసి విష్ణో ర్ధ్రువమసి" ఇతి ఆహ="ఓ గ్రంథిరూపమా! నీవు విష్ణుదేవతాకమైన హవిర్ధాన మండపమునకు రజ్జువు అగుచున్నావు. (బంధనము=ముడి) దృఢ మగుచున్నావు" అని "విష్ణోః స్యూరసి" ఇత్యాది మంత్రము చెప్పినది. హవిర్ధానమ్=హవిర్ధాన మండపము దేవతయా=దేవతాత్వ లక్షణముచే, వైష్ణవం హి=విష్ణుసంబంధి కదా!

తాత్పర్యము: "విష్ణోః స్యూరసి విష్ణోర్ధ్రువమసి" అని మంత్రము చెప్పుటచే హవిర్ధాన మండపము విష్ణువునకు దేవతాత్వలక్షణ సంబంధము కలదని యిచట చెప్పఁబడినది.

13. అర్థము: యం ప్రథమం గ్రన్థిమ్=ఏ మొదటి ముడిని గ్రథ్నీయాత్=కూర్చవలెనో, తమ్=ఆ ముడిని, న విస్రంసయేత్ యత్=విడిపించనిచో అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అమేహేన=మూత్రనిరోధముచేత, ప్ర మీయేత=మరణిం చును. తస్మాత్=ఆ కారణమువలన, సః=ఆ ముడి, విస్రస్యః=ఊడఁదీయఁదగినది.

తాత్పర్యము: మొదటి ముడి యేది వేయఁబడినదో, దానిని ఊడఁదీయనిచో, అధ్వర్యుఁడు, మూత్రనిరోధముచే మర ణించును. కావున ఆ ప్రథమ గ్రంథి ఊడఁదీయఁదగినది.

నవమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే దశమోఽనువాకః

మూలము: [1]దేవస్య త్వా సవితుః ప్రసవ ఇత్యభ్రిమాదత్తే ప్రసూత్యా అశ్వినో ర్బాహుభ్యా మిత్యాహాశ్వినౌ హి దేవానా మధ్వర్యూ ఆస్తాం పూష్ణో హస్తాభ్యా మిత్యాహ యత్యై [2]వజ్ర ఇవ వా ఏషా యదభ్రి రభ్రిరసి నారిరసీత్యాహ శాన్త్యై [3]కాణ్డే కాణ్డే వై క్రియమాణే యజ్ఞగ్ం రక్షాగ్ంసి జిఘాగ్ంసన్తి పరిలిఖితగ్ం రక్షః పరిలిఖితా అరాతయ ఇత్యాహ రక్షసామపహత్యై (౧)ఇద మహగ్ం రక్షసో గ్రీవా అపి కృన్తామి యోఽస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మ ఇత్యాహ ద్వౌ వావ పురుషౌ యం చైవ ద్వేష్టి యశ్చైనం ద్వేష్టి తయో రేవానన్తరాయం గ్రీవాః కృన్తతి [4]దివే త్వాఽన్తరిక్షాయ త్వా పృథివ్యై త్వేత్యాహైభ్య ఏవైనాం లోకేభ్యః ప్రోక్షతి [5]పరస్తాదర్వాచీం ప్రోక్షతి తస్మాత్ (౨)పరస్తాదర్వాచీం మనుష్యా ఊర్జముప జీవన్తి [6]క్రూరమివ వా ఏతత్కరోతి యత్ఖనత్యపోఽవ నయతి శాన్త్యై [7]యవమతీరవనయత్యూర్గ్వై యవ ఊర్గుదుమ్బర ఊర్జైవోర్జగ్ం సమర్ధయతి [8]యజమానేన సమ్మితౌదుమ్బరీ భవతి యావానేవ యజమాన స్తావతీ మేవాస్మిన్నూర్జం దధాతి [9]పితౄణాగ్ం సదనమసీతి బర్హిరవ స్తృణాతి పితృదేవత్యగ్ం (3)హ్యేతద్యన్నిఖాతం [10]యద్బర్హి రనవస్తీర్య మినుయాత్పిత్రృదేవత్యా నిఖాతా స్యాద్బర్హి రవస్తీర్య మినోత్యస్యా మేవైనాం మినోత్యథో స్వారుహ మేవైనాం కరో[11]త్యుద్దివగ్ం స్తభానాఽన్తరిక్షం పృణేత్యాహైషాం లోకానాం విధృత్యై [12]ద్యుతానస్త్వా మారుతో మినోత్విత్యాహ ద్యుతానో హ స్మ వై మారుతో దేవానా మౌదుమ్బరీం మినోతి తేనైవ (౪) ఏనాం

మినోతి [13]బ్రహ్మవని త్వా క్షత్రవని మిత్యాహ యథాయజురేవైత [14]ద్ఘృతేన ద్యావాపృథివీ ఆ

పృణేథా మిత్యౌదుమ్బర్యాం జుహోతి ద్యావాపృథివీ ఏవ రసేనాన [15]క్త్యన్త మన్వవస్రావయత్యన్త మేవ

యజమానం తేజసాఽన [16]క్త్యైన్ద్రమసీతి ఛదిరధి ని దధాత్యైన్ద్రగ్ం హి దేవతయా సదో విశ్వజ

నస్య ఛాయేత్యాహ విశ్వజనస్య హ్యేషా ఛాయా యత్సదో [17]నవఛది (౫)తేజస్కామస్య మినుయా

త్త్రివృతా స్తోమేన సమ్మితం తేజ స్త్రివృత్తేజస్వ్యేవ భవత్యేకాదశ ఛదిస్త్రియకామస్యైకాదశాక్షరా

త్రిష్టుగిన్ద్రియం త్రిష్టుగిన్ద్రియావ్యేవ భవతి పఞ్చదశఛది భ్రాతృవ్యవతః పఞ్చదశో వజ్రో భ్రాతృ

వ్యాభిభూత్యై సప్తదశఛది ప్రజాకామస్య సప్తదశః ప్రజాపతిః ప్రజాపతేరాప్త్యై ఏకవిగ్ంశతిఛది ప్రతి

ష్ఠాకామస్యైకవిగ్ంశః స్తోమానాం ప్రతిష్ఠా ప్రతిష్ఠిత్యై [18]ఉదరం వై సద ఊర్గుదుమ్బరో మధ్యత

ఔదుమ్బరీం మినోతి మధ్యత ఏవ ప్రజానా మూర్జం దధాతి తస్మాత్ (౬)మధ్యత ఊర్జా భుఞ్జతే

[19]యజమానలోకే వై దక్షిణాని ఛదిగ్ంషి భ్రాతృవ్యలోక ఉత్తరాణి దక్షిణాన్యుత్తరాణి కరోతి యజ

మాన మేవాయజమానా దుత్తరం కరోతి తస్మాద్యజమానోఽయజమానా దుత్తరో [20]ఽన్తర్వర్తా

న్కరోతి వ్యావృత్త్యై తస్మాదరణ్యం ప్రజా ఉప జీవన్తి [21]పరి త్వా గిర్వణో గిర ఇత్యాహ యథాయజు

రేవైత [22]దిన్ద్రస్య స్యూరసీన్ద్రస్య ధ్రువమసీత్యాహైన్ద్రగ్ం హి దేవతయా సదో [23]యం ప్రథమం

గ్రన్థిం గ్రథ్నీయాద్యత్తం న విస్రగ్ంసయే దమేహేనాధ్వర్యుః ప్ర మీయేత తస్మాత్స విస్రస్యః(౭)॥

[అవహత్యై తస్మాత్పితృదేవత్యం తేవైవ నవఛది తస్మాత్సదః పఞ్చదశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే దశమోఽనువాకః ॥౧౦॥

# వేదార్థదీపిక

అవతారిక: నవమానువాకమునందు, వ్యాఘారణము విహిత మైనది. ఈ దశమానువాకమునందు సదోమండప నిర్మాణము చెప్పఁబడుచున్నది. ఈ యనువాకమునందలి "దేవస్య త్వా" ఇత్యాది మంత్రము లన్నియు మూఁడవ ప్రపాఠకమునందలి ప్రథమానువాకములోనివి. ఆ మంత్రము లా యనువాకమునందే వ్యాఖ్యానింపఁబడినవి.

1. అర్థము: "దేవస్య త్వా సవితుః ప్రసవే" ఇతి="దేవస్య త్వా" ఇత్యాది మంత్రమును పఠించుచు, అభ్రిమ్='అభ్రి' యనెడి ఖనన సాధన విశేషమును, ఆదత్తే=గ్రహించవలెను. (ఇదమ్=ఈ యభ్రి గ్రహణము,) ప్రసూత్యై=సవితృదేవు నియొక్క అజ్ఞకొఱకు, (భవతి=అగుచున్నది.) "అశ్వినో ర్బాహుభ్యామ్" ఇతి ఆహ="అశ్వినీదేవతలయొక్క బాహువులచేత తీసికొనుచున్నాను" అని "అశ్వినో" రిత్యాది మంత్రము చెప్పినది. అశ్వినౌ=అశ్వనీదేవ తలు, దేవానామ్=దేవతలకు, అధ్వర్యూ=అధ్వర్యులుగా, ఆస్తాం హి=ఉండిరి కదా! యత్యై=నియమముకొఱకు, "పూష్ణో హస్తాభ్యామ్" ఇతి ఆహ=పూషదేవునియొక్క హస్తములచేత గ్రహించుచున్నానని "పూష్ణో హస్తాభ్యామ్" అను మంత్రభాగము చెప్పినది.

తాత్పర్యము: అగ్నిష్టోమయాగమునకు అంగముగా సదోమండప నిర్మాణము చేయవలసియున్నది. తదనుగుణముగ అభ్రిగ్రహణము ఇచట విధింపఁబడుచున్నది. "దేవస్య త్వా" ఇత్యాది మంత్రమును పఠించుచు అభ్రిని తీసికొనవలెను. ఇది సవితృదేవుని అనుజ్ఞ ననుసరించి చేయఁబడినది. అధ్వర్యుఁడు అభ్రిని గ్రహించునపుడు అశ్వినీదేవతల బాహువులచేతను, పూషదేవుని హస్తములచేతను అభ్రిని గ్రహించుచున్నానని చెప్పటచే గ్రహించునట్టి తన బాహువులను అశ్వినీదేవతల బాహువులుగా భావన చేయవలెను. అశ్వినీదేవతలు దేవతల యజ్ఞముల కధ్వర్యులుగా నుండిరి. తన హస్తములను పూషదేవుని హస్తములనుగా భావన చేయవలెను. ఇది నియతికొఱకగును. (అభ్రిః=పదనైన అగ్రభాగము కలిగి, మేడికఱ్ఱతో చేయఁబడిన ఖనన సాధనము.)

2. అర్థము: అభ్రిః యత్='అభ్రి' యనునది యేది కలదో, ఏషా=ఇది, వజ్రః ఇవ వై=వజ్రమువంటిదే. శాన్త్యై=శాంతి కొఱకు, "అభ్రి రసి నారి రసి" ఇతి ఆహ="ఓ ఖననసాధనమా! నీవు తీక్ష్ణముఖాగ్రమైన అభ్రివైనను, మమ్ముఁగూర్చి అవిరోధి వగుచున్నా వని ఈ మంత్రము చెప్పినది.

తాత్పర్యము: పూర్వోక్తమైన అభ్రి వజ్రమువంటిదే. అందువలన పదను గల అభ్రిని శాంతపఱచుటకై 'నారిరసి'=(న అరిః అసి,) మాకు శత్రువు అగుటలేదని ఈ వేదమంత్రభాగము చెప్పినది. మంత్రమునందలి 'నారి' పద ప్రయోజనమును ఈ బ్రాహ్మణము చెప్పినది.

3. అర్థము: కాణ్డే కాణ్డే క్రియమాణే వై=ప్రతియజ్ఞాంగము అనుష్ఠించఁబడుచుండఁగానే, రక్షాంసి=రాక్షసులు, యజ్ఞమ్=యజ్ఞమును, జిఘాంసన్తి=నశింపఁజేయఁ దలఁచుచున్నారు. (తత్=ఆ కారణమువలన,) రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=నాశమునకై, "పరిలిఖితం రక్షః పరిలిఖితా అరాతయః"="రక్షోజాతి వినాశితము. శత్రువులు నశింపఁజేయఁబడినవారు" అని వేదము చెప్పినది. "ఇద మహగ్ం రక్షసో గ్రీవా అపి కృన్తామి యోఽస్మా న్ద్వేష్టి యం చ వయం ద్విష్మః" ఇతి ఆహ="ఇదుగో, ఈ రాక్షసజాతియొక్క కంఠములనుఁ గూడ నఱుకుచున్నాను. ఎవఁడు మమ్ము ద్వేషించుచున్నాఁడో, మేము ఎవనిని ద్వేషించుచున్నామో," అని ఈ మంత్రము చెప్పినది. యం చ ఏవ=ఎవనినైతే, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడో," యః చ=ఎవఁడును, ఏనమ్=వీనిని, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడో, (ఏతౌ=వీరు,) ద్వౌ పురుషౌ వావ=ఇద్దఱు పురుషులే, తయోః గ్రీవాః ఏవ=ఆ యిద్దఱియొక్క కంఠములనే, అనన్తరాయమ్=వ్యవధానము లేకుండ, కృన్తతి=ఛేదించుచున్నాఁడు.

తాత్పర్యము: ప్రతి యొక యజ్ఞాంగము అనుష్ఠించఁబడుచుండఁగా, యజ్ఞమును నశింపఁజేయవలెనని రాక్షసులు తలఁచుచుందురు. అందువలన ఆ రాక్షసుల నాశముకొఱకు "పరిలిఖితం రక్షః పరిలిఖితా అరాతయః" అని వేదము చెప్పినది. యజమానుని ద్వేషించువాఁ డొకఁడు. యజమానునిచే ద్వేషింపఁబడువాఁడు మఱియొకఁడు.

అనఁగా ఈ ద్వేష్యులు ఈ పురుషు లిద్దఱే. ఆ యిద్దఱి కంఠములను వ్యవధానము లేకుండ ఛేదించు చున్నాఁడని "ఇద మహగ్ం గ్రీవా అపి కృన్తామి" ఇత్యాది మంత్రము చెప్పినది. సదో మండప నిర్మాణ ప్రదేశమునందు ఖనన సాధనమైన అభ్రిచే గీతలు గీయుటయొక్క ప్రయోజనము ఇచట చెప్పఁబడినది.

4. అర్థము: "దివే త్వాఽన్తరిక్షాయ త్వా పృథివ్యై త్వా" ఇతి ఆహ="ఓ అభ్రీ! నిన్ను స్వర్గలోకముకొఱకు అంతరిక్షలోకముకొఱకు పృథివికొఱకు ప్రోక్షించుచున్నాను." అని యీ మంత్రము చెప్పినది. (అభ్రియొక్క అగ్రభాగము, మధ్యభాగము, మూలభాగముల మీఁద ఉదకమును ప్రోక్షించుటచేత, ఆ మూఁడు భాగములు లోకత్రయాత్మకములనెడి భావముతో) ఏభ్యః లోకేభ్యః ఏవ=ఈ లోకముకొఱకే, ఏనామ్=ఈ అభ్రిని ప్రోక్షతి=(ఉదకములచే) ప్రోక్షించవలెను. (తాత్పర్యము అర్థమునందే వివరింపఁబడినది.)

5. అర్థము: పరస్తాత్=అభ్రియొక్క అగ్రభాగముకంటె, అర్వాచీమ్=క్రిందిభాగమును, ప్రోక్షతి=ఉదకముచే ప్రోక్షణము చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, మనుష్యాః=మనుష్యులు, పరస్తాత్=అగ్రభాగముకంటె, అర్వాచీమ్=క్రింది దియైన, ఊర్జమ్=బలమును, ఉప జీవన్తి=ఆధారముగా జీవించుచున్నారు.

తాత్పర్యము: అభ్రియొక్క అగ్రభాగమునుండి క్రిందిభాగమువఱకు ప్రోక్షణము చేయవలెను. ఆ కారణమువలన మనుష్యులు శిరోభాగముకంటె క్రిందిదియైన ఉదరావసానము నాధారముగాఁ జేసికొని జీవించుచున్నారు.

6. అర్థము: ఖనతి యత్=త్రవ్వుచున్నాఁ డనుట యేది కలదో, ఏతత్=ఈ ఖననము, క్రూరమివ=క్రూరమైనదానివలె, కరోతి వై=నిశ్చయముగ చేయుచున్నాఁడు. (తత్=ఆ కారణమువలన, శాన్త్యై=శాంతికొఱకు, అపః=ఉదకములను, అవనయతి=పోయవలెను.

తాత్పర్యము: సదోమండప నిర్మాణమునకై అభ్రితో భూమిని త్రవ్వుట అను కర్మ క్రూర మైనదివలె నుండును. కావున ఆ క్రూరత్వము శాంతించుటకై ఆ ఖనన ప్రదేశమునందు ఉదకములను పోయవలెను.(ఇచట ఉదకావనయనము విహిత మైనది.)

7. అర్థము: యవమతీః=యవలతోఁ గూడియున్న ఉదకములను, అవనయతి=(ఖననప్రదేశమునందు) పోయవలెను. యవః=యవధాన్యవిశేషము, ఊర్క్ వై=బలస్వరూపమే. ఉదుమ్బరః=ఉదంబరము (మేడి), ఊర్క్=బలస్వరూపము. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁగా,) ఊర్జైవ=బలముతోనే, ఊర్జమ్=బలమును, సమర్ధయతి=సమృద్ధముగఁ జేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: మేడి కొమ్మను పాఁతవలసిన ఖననప్రదేశమునందు యవమిశ్రితములైన ఉదకములను పోయవలెను. యవలు, మేడియు బలస్వరూపములు. కావున యజమానుఁడు ఈ విధముగ చేసినచో బలస్వరూపములైన యవలతో బలస్వరూపమైన మేడిని సమృద్ధముగఁ జేసినవాఁ డగుచున్నాఁడు.

8. అర్థము: ఔదుమ్బరీ=ఔదుంబరి, యజమానేన=యజమానునితో, సమ్మితా=సమానపరిమాణము కలదిగా, భవతి=ఉండవలెను. యజమానః=యజమానుఁడు, యావానేవ=ఎంతపరిమాణమే కలవాఁ డగుచున్నాఁడో, అస్మిన్=ఈ యజమానునియందు, తావతీమ్ ఊర్జమేవ=అంతమాత్రము పరిమాణము కల బలమునే, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు) దధాతి=స్థాపించుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: భూమియందు పాఁతవలసిన మేడికఱ్ఱకు భూమిపైని ఉండవలసిన పరిమాణము యజమానుని పరిమాణముతో సమానముగ నుండవలెను. (ఆ విధముగ నున్నచో,) యజమానుఁడు ఉన్నంతవఱకు అన్నము ఉండును. (నిఖాతభాగముకంటె ఊర్ధ్వభాగమునందు ఔదుంబరియొక్క పరిమాణము ఇచట విహిత మైనది.)

9. అర్థము: "పితృణాగ్ం సదనమసి" ఇతి="పితృణాం సదనమసి" అను మంత్రముచే, బర్హిః=బర్హిస్సును, అవస్తృణాతి=(నిఖాత ప్రదేశమునందు) పఱచవలెను. ఏతత్ నిఖాతమ్=ఈ నిఖాతము, పితృదేవత్యం హి=పితృదేవతాకము కదా!

తాత్పర్యము: "ఓ బర్హిస్సా! నీవు పితృదేవతలకు స్థాన మగుచున్నావు" అను నర్థము కల "పితౄణాగ్ం సదనమసి" అను మంత్రమును పఠించుచు నిఖాత ప్రదేశమునందు బర్హిస్సును పఱచవలెను. ఈ నిఖాతము పితృదేవతాకము కదా! (ఇచట బర్హి రవస్తరణము విధింపఁబడినది.)

10. అర్థము: బర్హిః=బర్హిస్సును, అనవస్తీర్య=పఱచక, మినుయాత్ యత్=నిఖాతమునందు ఔదుంబరిని నిలువఁబెట్టినచో, నిఖాతా=నిఖాతప్రదేశము, (సర్వము) పితృదేవత్యా=పితృదేవతాకము, స్యాత్=అగును. (అతః=ఈ కారణ మువలన,) బర్హిః=బర్హిస్సును, అవస్తీర్య=పఱచి, మినోతి=ఔదుంబరిని నిఖాతమునందు నిలువఁబెట్టవలెను. (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు,) అస్యామేవ=ఈ భూమియందే, ఏనామ్=ఈ ఔదంబరిని, మినోతి=నిలువఁబెట్టినవాఁ డగుచున్నాఁడు. అథో=మఱియు, ఏనామ్=ఈ ఔదుంబరిని, స్వారుహామేవ=స్వసం బద్ధమైనదానినిగానే, కరోతి=చేయుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: సదోమండప నిర్మాణమున కంగముగా అభ్రిచే భూమిని త్రవ్వి ఆ త్రవ్విన గోతియందు బర్హిస్సును పఱచి దానియందు మేడి దండమును నిలువఁబెట్టవలెనని ఇంతవఱకు జరిగిన కార్యకలాపము. (నిఖాతము=త్రవ్వఁబడి నది.) ఆ నిఖాతమునందు బర్హిస్సును పఱచకుండ ఉదుంబర దండమును ఉంచినచో, నిఖాతసామాన్యము పితృదేవతాక మగును. (అనఁగా సమస్తము పితృదేవత్యముగానే స్థాపిత మగును. పితృదేవతల నిఖాతము మనుష్యుల నిఖాతముకంటె ఊర్ధ్వమై యుండు నను వ్యవస్థ లేకపోవును.) కావున బర్హిస్సును పఱచి ఔదుంబరిని నిలువఁబెట్టవలెను. అట్లు చేసినచో ఈ యౌదుంబరిని ఈ భూమియందే నిలువఁబెట్టిన ట్లగును. మఱియు ఈ యౌదుంబరిని స్వసంబద్ధమైనదిగానే చేసిన ట్లగును. (ఇచట ఉచ్ఛ్రయణము విహిత మైనది.)

11. అర్థము: "ఉద్దివగ్ం స్తభానాన్తరిక్షం పృణ" ఇతి ఆహ="ఓ ఔదుంబరీ! ద్యులోకమును ఊర్ధ్వదేశమునందు నిలువఁబెట్టుము. అంతరిక్షమును పూరించుము." అని ఈ మంత్రము చెప్పినది. (ఏతత్=ఇది,) ఏషాం లోకానామ్=ఈ లోకములయొక్క, విధృత్యై=విశేష ధారణముకొఱకు, భవతి=అగుచున్నది. మంత్రమునందలి 'దివమ్' ఇత్యాది పదముల ఉపయోగము చెప్పఁబడినది.

తాత్పర్యము: సులభ గ్రాహ్యము.

12. అర్థము: "ద్యుతాన స్త్వా మారుతో మినోతు" ఇతి ఆహ="ఓ ఔదుంబరీ! ద్యుతాన నామకుఁడైన మరుత్పుత్రుఁడు ఇటునటు పడిన నిన్ను అవటమునందు ఉంచుఁగాక" అని ఈ మంత్రము చెప్పినది. మారుతః=మరు త్పుత్రుఁడైన, ద్యుతానః=ద్యుతాన నామక దేవుఁడు, దేవానామ్=దేవతల నిమిత్తము, ఔదుమ్బరీమ్=ఔదుం బరిని, మినోతి హ స్మ వై=నిఖాతమునందు ఉంచుచున్నాఁడఁట కదా! (అయమ్=ఈ యజమానుఁడు,) తేనైవ=ఆ ద్యుతానునిచేతనే, ఏనామ్=ఈ ఔదుంబరిని, మినోతి=ఉంచుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: దేవతలకు మరుత్పుత్రుఁడైన ద్యుతాన దేవుఁడు ఔదుంబరిని నిఖాతమునం దుంచుచు న్నాఁడు, కావున "ఓ ఔదుంబరీ! ద్యుతాన స్త్వా మారుతో మినోతి" అని మంత్రము చెప్పినది. ఈ విధముగ చెప్పటచే ఈ యజమానుఁడు కూడ ద్యుతాన దేవునిచేత ఔదుంబరిని నిఖాతమునందు స్థాపింపఁజేసినవాఁ డగు చున్నాఁడు. (ఇతర దేవతలను పరిత్యజించి ద్యుతాన దేవ స్వీకార మునకుఁ గల కారణ మిచట చెప్పఁబడినది.)

13. అర్థము: "బ్రహ్మవనిం త్వా క్షత్రవనిమ్" ఇతి ఆహ="ఓ యౌదుంబరీ! బ్రాహ్మణ్యాదికమును భజించునట్టి నిన్ను (నీకు) అంతటను మృత్తిక నుంచుచున్నాను" అని మంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ=ఈ మంత్రము ననుసరించియే యున్నది.

తాత్పర్యము: ఓ యౌదుంబరీ! బ్రాహ్మణ్యాదికము నొసగునట్టి నీకు నాలుఁగు వైపులందు మృత్తిక నుంచుచున్నాను. మంత్రోక్తమైన ఈ యర్థము స్పష్టమే. (బ్రహ్మ=బ్రాహ్మణజాతిమ్, వనతి=భజతీతి, బ్రహ్మవనిః.)

14. అర్థము: "ఘృతేన ద్యావాపృథివీ ఆ పృణేథామ్" ఇతి="ఓ ద్యావాపృథువులారా! మీరు ఈ ఘృతముచే అంతటను తృప్తి నొందుఁడు." అను మంత్రముచే, ఔదుమ్బర్యామ్=ఔదుంబరియందు, జుహోతి=హోమము చేయవలెను. (అనేన=ఈ హోమముచే, అయమ్=ఈ యజమానుఁడు,) ద్యావాపృథివీ ఏవ=ద్యావాభూములనే, రసేన=ఘృతముచే, అనక్తి=తడుపుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: "ఓ ద్యావాభూములారా! మీరు ఈ ఘృతముచే తృప్తినొందుఁడు" అని ఔదుంబరియందు హోమము చేయవలెనని చెప్పుటచే ఆ విధముగ హోమము చేసిన యజమానుఁడు ద్యావాభూములనే ఘృతముచే తడుపుచున్నవాఁ డగును. (ఇచట ఔదుంబరియందు హోమము విధింపఁబడినది.)

15. అర్థము: ఆన్తమ్=అగ్రమునుండి మూలపర్యంతము, అవస్రావయతి=ఆజ్యమును స్రవింపఁజేయవలెను. (అయమ్=ఈ హోమము చేసిన యధ్వర్యుఁడు,) యజమానమ్=యజమానుని, ఆన్తమేవ=ఆమూలాగ్రముగనే, తేజసా=తేజస్సుచేత, అనక్తి=తడుపుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఔదుంబరియందు హోమము చేయునపుడు ఆజ్యమును అగ్రమునుండి మూలమువఱకు స్రవించునట్లుగా హోమము చేయవలెను. ఇట్లు హోమము చేసిన యధ్వర్యుఁడు యజమానుని తేజస్సుచే ఆమూలాగ్రముగ తడిపినవాఁ డగును. (హూతమైన ఆజ్యమునకు మూలపర్యంతత విహిత మైనది.) యజమానుని శిరస్సు మొదలుకొని పాదపర్యంతము తేజస్సు సంపాదిత మగును.

16. అర్థము: "ఐన్ద్రమసి" ఇతి="ఓ సదోభాగమా! నీవు ఇంద్రసంబంధి వగుచున్నావు." అను మంత్రముచేత, అధి=ఔదుంబరియొక్క పైభాగమున, ఛదిః=కప్పును, నిదధాతి=ఉంచవలెను. సదః=సదస్సు, దేవతయా=దేవతచేత, ఐన్ద్రం హి=ఇంద్రసంబంధి కదా! "విశ్వజనస్య ఛాయా" ఇతి ఆహ="సమస్త జనమునకు నీడ వగుచున్నావని" ఈ మంత్రము చెప్పినది. సదః యత్=సదస్సు ఏది కలదో, ఏషా=ఇది, విశ్వజనస్య=సర్వజనమునకు, ఛాయా హి=నీడ కదా!

తాత్పర్యము: "ఐన్ద్రమసి" అను శాఖాంతర మంత్రము నుచ్చరించుచు ఔదుంబరి పైభాగమున కప్పు నుంచవలెను. సదస్సు ఇంద్రదేవతాక మైనది. సదోమండపము సర్వజనులకు ఛాయ అని వేదమంత్రము చెప్పినది.(ఇచట ఛది విధింపఁబడినది.)

17. అర్థము: తేజస్కామస్య=తేజస్కాముఁడైన యజ్ఞకర్త నిమిత్తము, నవఛది=తొమ్మిది కప్పులు కల సదస్సును, మినుయాత్=చేయవలెను. ఇదమ్=ఈ నవఛది, త్రివృతా స్తోమేన=త్రివృత్స్తోమములో, సంమితమ్=సమాన మైనది. త్రివృత్=త్రివృత్స్తోమము, తేజః=తేజోరూపము. (అయమ్=ఈ యజమానుఁడు,) తేజస్వ్యేవ=తేజస్వంతుఁడే, భవతి=అగుచున్నాఁడు. ఇన్ద్రియకామస్య=ఇంద్రియపటుత్వమును కోరునట్టి యజమానుని నిమిత్తము, ఏకాదశ ఛది=పదునొకండు కప్పులు కల సదస్సును, మినుయాత్=చేయవలెను. త్రిష్టుక్=త్రిష్టుక్ఛందస్సు, ఏకాదశాక్షరా=పదునొకండు అక్షరములు కలది. త్రిష్టుక్=త్రిష్టుక్ఛందస్సు, ఇన్ద్రియమ్=ఇంద్రియరూపమైనది. (అయమ్=ఈ యజమానుఁడు,) ఇన్ద్రియావ్యేవ=ఇంద్రియవంతుఁడే, భవతి=అగుచున్నాఁడు. భ్రాతృవ్యవతః=శత్రువులు కల యజమానునినిమిత్తము, పఞ్చదశ ఛది=పదిహేను కప్పులు కల సదస్సును, మినుయాత్=చేయవలెను. పఞ్చదశ=పంచదశ సంఖ్య, వజ్రః=వజ్రరూపము. (అయమ్=ఇది,) భ్రాతృవ్యాభిభూత్యై=శత్రుపరాభవముకొఱకు, భవతి=అగుచున్నది. ప్రజాకామస్య=ప్రజాకాముఁడైన యజమానుని నిమిత్తము, సప్తదశఛది=పదునేడు కప్పులు కల సదస్సును, మినుయాత్=చేయవలెను. ప్రజాపతిః=ప్రజాపతి, సప్తదశః="ఆశ్రావయ" ఇత్యాది మంత్రాక్షరములతో సమానుఁ డగుటచే సప్తదశ స్వరూపుఁడు. (అయమ్=ఈ సప్తదశ,) ప్రజాపతేః=ప్రజాపతియొక్క, ఆప్త్యై=ప్రాప్తికొఱకు, భవతి=అగుచున్నది. ప్రతిష్ఠాకామస్య=ప్రతిష్ఠను కోరునట్టి యజమానుని నిమిత్తము, ఏకవింశః=ఇరువదియొక్క కప్పులుకల సదస్సును, మినుయాత్=చేయవలెను.

ఏకవింశః=ఏకవింశతి, స్తోమానాం ప్రతిష్ఠా=త్రివృదాదిసోమములయొక్క ప్రతిష్ఠారూపము. (అయమ్=ఇది,) ప్రతిష్ఠిత్యై=ప్రతిష్ఠకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: సదస్సునందలి యజమానుల కామనాభేదము ననుసరించి ఛదిసంఖ్య ఇచట విధింపఁబడుచున్నది. త్రివృత్, పంచదశ సప్తదశ ఏకవింశతి శబ్దములచేత సామముయొక్క ఆవృత్తిభేదముచే నిష్పన్నము లయిన స్తోమములు చెప్పఁబడుచున్నవి. త్రివృత్తు అగ్నితోఁ గూడ ప్రజాపతిముఖమునుండి పుట్టుటచే తేజోరూపము. త్రివృదాది స్తోమములు ఏకవింశతి స్తోమమునం దంతర్భూతము లగుటచే, ఏకవింశ స్తోమము ప్రతిష్ఠారూపముగా వర్ణింపఁబడినది. తాత్పర్యము సులభము.

18. అర్థము: సదః=సదోమండపము, ఉదరం వై=ఉదరమువంటిదియే. ఉదుమ్బరః=ఉదుంబరము, ఊర్క్=బలస్వరూపమైనది. (అతః=ఈ కారణమువలన,) మధ్యతః=సదోమండప మధ్యభాగమునందు, ఔదుమ్బరీమ్=ఔదుంబరిని, మినోతి=స్థాపించవలెను. (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు,) ప్రజానామ్=ప్రజలకు, మధ్యతః ఏవ=శరీర మధ్యభాగమునందే, ఊర్జమ్=బలమును, దధాతి=స్థాపించుచున్నవాఁ డగుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, మధ్యతః=శరీర మధ్యభాగమునందు, ఊర్జా=బలకారణమైన రసముతో, భుఞ్జతే=భుజించుచున్నారు.

తాత్పర్యము: సదో మండపము యజ్ఞమునకు ఉదరమువంటిదే. ఉదుంబరము బలస్వరూపము. కావున యజమానుఁడు సదో మండప మధ్యమునందు ఔదుంబరిని స్థాపించవలెను. ఈ విధముగ చేసిన యజమానుఁడు ప్రజలకు శరీర మధ్యమునందే బలమును కలుగఁజేసినవాఁ డగును. కావున లోకమునందు మనుష్యులు శరీర మధ్యభాగమునందు బలకారణమైన రసముతో భుజించుచున్నారు.(ఇచట ఔదుంబరీస్థాపనమునకు సదోమధ్యప్రదేశము విహిత మైనది.)

19. అర్థము: యజమాన లోకే వై=యజమానస్థానమునందే, ఛదింషి=పూర్వోక్తములయిన కప్పులు, దక్షిణాని=దక్షిణ దిగ్గతములు. భ్రాతృవ్య లోకే=శత్రు స్థానమునందు, ఉత్తరాణి=ఉత్తర దిగ్గతములు. దక్షిణాని=దక్షిణ దిగ్గత ఛదులు, ఉత్తరాణి=ఉత్తరదిగ్గత ఛదులను చూచునవిగా, కరోతి=చేయవలెను. [ఏవం కృతవాన్ అధ్వర్యుః=ఈ విధముగ చేసిన యధ్వర్యుఁడు,] యజమానమేవ=యజమానునే, అయజమానాత్=యజమానుఁడు కానివానికంటె, ఉత్తరమ్=ఉత్కృష్టునిగా, కరోతి=చేయుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, యజమానః=యజమానుఁడు, అయజమానాత్=అయజమానునికంటె, ఉత్తరః=ఉత్కృష్టుఁడు.

తాత్పర్యము: యజమానుని స్థానమునందలి ఛదులు దక్షిణ దిగ్గతములు. శత్రుస్థానమునందలి ఛదులు ఉత్తర దిగ్గతములు. వానిని దక్షిణ ఛదులను చూచునట్లుగ నిర్మించవలెను. ఇట్లు చేసిన యధ్వర్యుఁడు యజమానునే యజమానుఁడు కానివానికంటె ఉత్కృష్టునిగాఁ జేసినవాఁ డగును. ఆ కారణమువలన అయజమానునికంటె యజమానుఁ డుత్కృష్టుఁడు. (దక్షిణ దిగ్గత ఛదుల అగ్రములు ఉత్తర దిగ్గత ఛదులపైని కనఁబడునట్లు స్థాపించవలెనని విధింపఁబడినది.)

20. అర్థము: వ్యావృత్త్యై=ఇతరములనుండి వ్యావృత్తికొఱకు, అన్తః=ఛదుల మధ్యమందు, వర్త్మాన్=తృణమూలముల నాచ్ఛాదనముగా, కరోతి=చేయవలెను. తస్మాత్=తృణము అరణ్య జన్యము కావున, ప్రజాః=ప్రజలు, అరణ్యమ్ ఉప జీవన్తి=(తృణకాష్ఠ లాభమునకై,)అరణ్యము నాధారముగా జేసికొని జీవిచుచున్నారు.

తాత్పర్యము: ఇతరములనుండి వైలక్షణ్యము సిద్ధించుటకై ఛదులయొక్క అంతరాళ ఛిద్రములందు తృణమూలములను ఆచ్ఛాదనము చేయవలెను. తృణములు అరణ్య జన్యములు కావున ప్రజలు తృణ కాష్ఠాదుల లాభమునకై అరణ్యము నాధారముగఁ జేసికొని జీవించుచున్నారు. (ఇచట ఛదుల మధ్యమున నుండెడి ఛిద్రములను తృణమూలములచే ఆచ్ఛానము చేయుట విధింపఁబడినది.)

21. అర్థము: "పరి త్వా గిర్వణో గిరః" ఇతి ఆహ="సదోభిమానివగు ఓ యింద్రా! ఈ స్తోత్రశస్త్రరూపములైన వాక్కులు కటకరూపమున నిన్ను చుట్టుకొనుఁగాక" అని ఈ మంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథా యజుః ఏవ=మంత్రోక్తవిధమే.

తాత్పర్యము: తాత్పర్యము సులభము.

22. అర్థము: "ఇన్ద్రస్య స్యూరసీన్ద్రస్య ధ్రువమసి" ఇతి ఆహ="ఓ సదోమండపమా! నీవు ఇంద్రునినిమిత్తము నిర్మితమైతివి. దృఢమైనదాన వగుచున్నావు." అని ఈ మంత్రము చెప్పినది. సదః=సదోమండపము, దేవతయా=దేవతచేత, ఐన్ద్రం హి=ఇంద్రసంబంధి కదా!

తాత్పర్యము: సదోమండపము ఇంద్రదేవతాకము కావున, "ఇన్ద్రస్య స్యూరసీన్ద్రస్య ధ్రువమసి" అని మంత్రము చెప్పినది. ఈ వాక్యము నవమానువాకాంతమున వ్యాఖ్యానింపఁబడినది.

దశమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే ద్వితీయ ప్రపాఠకే ఏకాదశోఽనువాకః

మూలము: [1]శిరో వా ఏతద్యజ్ఞస్య యద్ధవిర్ధానం ప్రాణా ఉపరవా హవిర్ధానే ఖాయన్తే తస్మాచ్ఛీర్షన్ప్రాణా [2]అధస్తా త్ఖాయన్తే తస్మా దధస్తాచ్ఛీర్ష్ణః ప్రాణా [3]రక్షోహణో వలగహనో వైష్ణవా న్ఖనామీత్యాహ వైష్ణవా హి దేవతయోపరవా [4]అసురా వై నిర్యన్తో దేవానాం ప్రాణేషు వలగాన్న్యఖన న్తాన్బాహుమాత్రేఽన్వవిన్ద న్తస్మాద్బాహుమాత్రాః ఖాయన్త [5]ఇదమహం తం వలగ ముద్వపామి (౧)యం నః సమానో యమసమానో నిచఖానేత్యాహ ద్వౌ వావ పురుషౌ యశ్చైవ సమానో యశ్చాసమానో యమేవాస్మై తౌ వలగం నిఖనత స్తమేవోద్వపతి [6]సంతృణత్తి తస్మాత్సంతృణ్ణా అన్తరతః ప్రాణా [7]న సం భినత్తి తస్మాదసంభిన్నాః ప్రాణా [8]అపోఽవ నయతి తస్మాదార్ద్రా అన్తరతః ప్రాణా [9]యవమతీరవ నయతి (౨)ఊర్గ్వై యవః ప్రాణా ఉపరవాః ప్రాణేష్వేవోర్జం దధాతి [10]బర్హిరవ స్తృణాతి తస్మాల్లోమశా అన్తరతః ప్రాణా [11]ఆజ్యేన వ్యాఘారయతి తేజో వా ఆజ్యం ప్రాణా ఉపరవాః ప్రాణేష్వేవ తేజో దధాతి [12]హనూ వా ఏతే యజ్ఞస్య యదధిషవణే న సం తృణత్త్యసంతృణ్ణే హి హనూ [13]అథో ఖలు దీర్ఘసోమే సంతృద్యే ధృత్యై [14]శిరో వా ఏతద్యజ్ఞస్య యద్ధవిర్ధానమ్ (3)ప్రాణా ఉపరవా హనూ అధిషవణే జిహ్వా చర్మ గ్రావాణో దన్తా ముఖమాహవనీయో నాసికోత్తరవేది రుదరగ్ం సదో యదా ఖలు వై జిహ్వయా దత్స్వధి ఖాదత్యథ ముఖం గచ్ఛతి యదా ముఖం గచ్ఛత్యథోదరం గచ్ఛతి తస్మాద్ధవిర్ధానే చర్మన్నధి గ్రావభి రభిషుత్యాఽఽహవనీయే హుత్వా ప్రత్యఞ్చః పరేత్య సదసి

భక్షయన్తి [15] యో వై విరాజో యజ్ఞముఖే దోహం వేద దుహ ఏవైనామియం వై విరాట్ తస్యై త్వక్చర్మోధో ఽధిషవణే స్తనా ఉపరవా గ్రావాణో వత్సా ఋత్విజో దుహన్తి సోమః పయో య ఏవం వేద దుహ ఏవైనామ్(౪)॥

[వపామి యవమతీరవ నయతి హవిర్ధానమేవ త్రయోవిగ్ంశతిశ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయ ప్రపాఠక ఏకాదశోఽనువాకః ॥౧౧॥

యదుభౌ దేవాసురా మిథస్తేషాగ్ం సువర్గం యద్వా అనీశానః పురోహవిషి తేభ్య ఉత్తరవేదిః సోత్తరవేదిర్వృద్ధం దేవస్యాభ్రిగ్ం శిరో వా ఏకాదశ ॥౧౧॥

యదుభావిత్యాహ దేవానాం యజ్ఞో దేవేభ్యో న రథాయ యజమానాయ పరస్తాదర్వాచీం నవపఞ్చాశత్ ॥౫౯॥

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే ద్వితీయః ప్రపాఠకః ॥౨॥

## వేదార్థదీపిక

**అవతారిక:** ఇంతవఱకు ముప్పదియాఱు అడుగుల పరిమితి కల మహావేదియందు నిర్మింపఁదగినట్టి ఉత్తరవేది హవిర్ధాన సదోమండపములు సంపన్నము లయినవి. ఇఁక హవిర్ధానము మధ్యమునందు నిర్మించవలసిన ఉపరవములు ఇచట చెప్పఁబడుచున్నవి. ఈ ఉపరవములకు సంబంధించిన మంత్రములు ప్రథమ కాండస్థ తృతీయ ప్రపాఠకగత ద్వితీయానువాకమునందు చెప్పఁబడినవి. ఆ మంత్రములకు బ్రాహ్మణము ఈ యనువాకమునందు చెప్పఁబడుచున్నది. ఈ బ్రాహ్మణము వివరించుచున్న మంత్రములు ప్రథమ కాండములోనివి.

1. **అర్థము:** హవిర్ధానం యత్=హవిర్ధాన మేది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, శిరః వై=శిరస్సు వంటిదే, ప్రాణాః=ప్రాణములవంటి, ఉపరవాః=ఉపరవములు, హవిర్ధానే=హవిర్ధానమునందు, ఖాయన్తే=త్రవ్వఁబడుచున్నవి. (త్రవ్వవలెను.)తస్మాత్=ఆ కారణమువలన, (లోకే=లోకమునందు,) ప్రాణాః=ప్రాణములు, శీర్షన్=శిరస్సునందు, సన్తి=ఉంటున్నవి. ఉపరవములు=గర్తములు(గుంటలు).

**తాత్పర్యము:** హవిర్ధానము యజ్ఞమునకు శిరస్సువంటిది. కావున ప్రాణములవంటి యుపరవములు శిరస్సువంటి హవిర్ధాన మధ్యమునందు నిర్మింపఁబడుచున్నవి. ఆ కారణమువలన లోకమునందు ప్రాణములు శిరస్సునందు

ఉంటున్నవి.[ఉపరవ బిలములు శ్రోత్ర నాసికాది ఛిద్రగత ప్రాణ స్థానీయము లగుటచే శిరస్స్థానీయమైన హవిర్ధానమునందు ఖననము యుక్తమే.]

2. అర్థము: అధస్తాత్=అధోభాగమునందు, ఖాయన్తే=ఉపరవములు త్రవ్వఁబడుచున్నవి (త్రవ్వవలయును). తస్మాత్=ఆ కారణమువలన, ప్రాణాః=ప్రాణములు, శీర్ష్ణః=శిరస్సునకు, అధస్తాత్=క్రిందిభాగమున, వర్తన్తే=ఉంటున్నవి.

తాత్పర్యము: హవిర్ధానమునకు అధోభాగమైన భూమియందు ఉపరవములను త్రవ్వవలెను. హవిర్ధానముయొక్క అధోభూమి యందు ఉపరవములు త్రవ్వఁబడుచున్నవి కావున, లోకమునందు కూడ శిరస్సునందు ఊర్ధ్వకపాలమునకు క్రిందిభాగమునందే ప్రాణసంచారము జరుగుచున్నది. (1, 2, మంత్రములు ఉపరవ ఖనన విధాయకములు.)

3. అర్థము: "రక్షోహణో వలగహనో వైష్ణవా న్ఖనామి" ఇతి ఆహ="విష్ణు దేవతాకములును, రాక్షసులను సంహరించున వియు, వలగములను నశింపఁజేయునవియునగు ఉపరవములను త్రవ్వుచున్నాను" అని "రక్షోహణః" ఇత్యాది మంత్రము చెప్పినది. ఉపరవాః=ఉపరవములు, దేవతయా=దేవతచేత, వైష్ణవాః హి=విష్ణువునకు సంబంధించి నవి కదా!

తాత్పర్యము: "రక్షోహణో వలగహనో వైష్ణవాన్" అను మంత్రమునందలి 'వైష్ణవాన్' అను పదములోని తద్ధిత ప్రత్య యము దేవతావాచి యని ఈ బ్రాహ్మణము వివరించినది. విష్ణుః దేవతా యేషామ్ ఉపరవాణాం తే వైష్ణవాః. ఉపరవములకు విష్ణువు దేవత యని యర్థము. జీర్ణ కట పటాది ఖండ బద్ధములైన అస్థి నఖ రోమ పాదపాంసువులు మొదలగునవి విరోధుల మారణమునకై భూమియందు పాఁతిపెట్టఁబడియుండును. వానికే వలగములని వ్యవహారము.

4. అర్థము: అసురాః వై=రాక్షసులే, నిర్యన్తః=పారిపోవుట కుద్యుక్తులై, దేవానామ్=దేవతలయొక్క, ప్రాణేషు=ప్రాణ ముల వినాశము నిమిత్తము, వలగాన్=వలగములను, న్యఖనన్=భూమియందు ఎక్కువ లోఁతున పాఁతిపె ట్టిరి. తాన్=ఆ వలగములను, బాహుమాత్రే=బాహుపరిమాణపు లోఁతునందు, అవిన్దన్=(దేవతలు) తెలిసి కొనిరి. తస్మాత్=ఆ కారణమువలన, బాహుమాత్రాః=ఉపరవములు బాహుపరిమాణపు లోఁతు కలవిగా, ఖాయన్తే=త్రవ్వఁబడుచున్నవి (త్రవ్వవలెను).

తాత్పర్యము: అసురులే పారిపోవుట కుద్యుక్తులై దేవతల ప్రాణముల వినాశమునకై ఎక్కువ లోతుగా వలగములను పాఁతిపెట్టిరి. దేవతలు ఆ వలగములను బాహుపరిమాణము కల లోఁతున కనుఁగొనిరి. ఆ కారణము వలన ఉపరవములు బాహుపరిమాణపు లోఁతు కలవిగా త్రవ్వవలెను. (ఇచట ఉపరవములకు వితస్తి త్రయ పరిమాణము విధింపఁబడినది. వితస్తి=జేన. బాహుపరిమాణము=మూఁడు జేనల పరిమాణము.)

5. అర్థము: "ఇద మహం తం వలగ ముద్వపామి యం నః సమానో య మసమానో నిచఖాన" ఇతి ఆహ="మాకు సమానుఁడు కాని, అసమానుఁడు కాని అయిన శత్రువు ఏ వలగమును పాఁతిపెట్టెనో, ఇదిగో, ఇప్పుడే ఆ వలగమును పెల్లగించుచున్నాను" అని "ఇద మహ" మిత్యాది మంత్రము చెప్పినది. యః=ఏ శత్రువు, సమానః చ ఏవ=సమానుఁడే అయి యుండెనో, యః=ఏ శత్రువు, అసమానః చ=అసమానుఁడును అయి యుండెనో, తౌ పురుషౌ=ఆ పురుషులు, ద్వౌ వావ=ఇద్దఱే, తౌ=ఆ యిద్దఱు శత్రువులు, అస్మై=ఈ యజ మానుని కొఱకు, యం వలగమేవ=ఏ వలగమునే, నిఖనతః=ఎక్కువగా త్రవ్వుచున్నారో, అయమ్=ఈ యజమానుఁడు, తమేవ=ఆ వలగమునే, ఉద్వపతి=పెల్లగించుచున్నాఁడు. (యజమాన పక్షమున అధ్వర్యుఁడు పెల్లగించుచున్నాఁడు.)

తాత్పర్యము: మమ్ము నశింపఁజేయుటకై విద్యా విత్త సౌభాగ్యాదులవిషయమున మాకు సమానుఁడు కాని, అసమానుఁడు కాని అయిన శత్రువు ఏ వలగమును పాఁతిపెట్టెనో, అని వేదమంత్రము చెప్పుటచే ఆ శత్రువు లిద్దఱని స్పష్ట మగుచున్నది. ఆ యుభయ శత్రువులు ఈ యజమాను నుద్దేశించి యే వలగమును పాఁతిపెట్టిరో, ఆ

వలగమునే నేను వెళ్లగించుచున్నాను, అని అధ్వర్యుఁడు చెప్పుచున్న మాటలివి. అశేష శత్రు సంగ్రహమునకై సమానాసమాన శబ్దములు రెండును ఉపాదేయములే, అని ఈ బ్రాహ్మణము చెప్పుచున్నది.

6. అర్థము: సం తృణత్తి=ఉపరవములను అధోభాగమున ఏకము చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాణాః=ప్రాణాపాన చక్షు శ్శోత్రాదులు, అన్తరతః=శరీరముయొక్క అంతర్భాగమునందు, సంతృణ్ణాః=కలసినవియై, వర్తన్తే=ఉంటున్నవి.

తాత్పర్యము: నాలుగు ఉపరవములను అంతర్భాగమునందు ఏకము చేయవలెను. ఆ కారణమువలన ప్రాణాపాన చక్షు శ్శోత్రాదులు శరీరాంతర్భాగమునందు ఏకమై సంచరించుచున్నవి. (ఇచట అధోభాగమున ఉపరవములకు ఏకీకరణము విధింపఁబడినది.)

7. అర్థము: న సం భినత్తి=ఉపరిభాగమున ఉపరవములను ఏకము చేయరాదు. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాణాః=ప్రాణాదులు, అసంభిన్నాః=ఏకీభావమును పొందనివై, (వర్తన్తే=ఉంటున్నవి.)

తాత్పర్యము: ఉపరవములను ఉపరిభాగమునం దేకము చేయరాదు. ఆ కారణమువలన బహిఃప్రాణములు స్వ స్వ గోలకములం దుంటున్నవై ఏకీభావమును పొందుట లేదు. (ఇచట ఉపరవములకు ఉపరితలమందు పృథక్కరణము విధించఁబడినది.)

8. అర్థము: అపః=ఉదకములను, అవ నయతి=(ఉపరవదేశమునందు,) పోయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాణాః=ప్రాణములు, అన్తరతః=లోపల, (ముఖ నాసికా చక్షురాది గోలకములందు,) ఆర్ద్రాః=ఆర్ద్రములైనవిగా, (దృశ్యన్తే=కనఁబడుచున్నవి.)

తాత్పర్యము: ప్రోక్షణ శేషమైన ఉదకమును ఉపరవదేశమునందు పోయవలెను. అందువలన ముఖ నాసికా చక్షురాది గోలకరూపములై శరీరాంతర్భాగములందు ప్రాణములు ఆర్ద్రములుగా కనఁబడుచున్నవి. (ఇచట ఉపరవదేశమునందు ప్రోక్షణశేష జలావనయనము విధించఁబడినది.)

9. అర్థము: యవమతీః=యవలతో కూడిన ఉదకములను, అవనయతి=ఉపరవ దేశమునందు ఉంచవలెను. యవః=యవధాన్యము, ఊర్క్ వై=బలస్వరూపమే. ఉపరవాః=ఉపరవములు, ప్రాణాః=ప్రాణరూపములు. (ఏవం కృతే సతి=ఈ విధముగ చేయఁగా,) ప్రాణేష్వేవ=ప్రాణములయందే, ఊర్జమ్=బలమును, దధాతి=స్థాపించుచున్నవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: పూర్వోక్తములైన జలమునందు యవల నుంచవలెను. అనఁగా యవలతో కూడిన జలమును ఉపరవ దేశమునం దుంచవలెను. యవలు బలస్వరూపములు. ఉపరవములు ప్రాణస్వరూపములు. ఈ విధముగ చేసిన యధ్వర్యుఁడు ప్రాణములందే బలమును స్థాపించినవాఁ డగును. (ఇచట జలమునందు యవ ప్రక్షేపము విహిత మైనది.)

10. అర్థము: బర్హిః=బర్హిస్సును, అవ స్తృణాతి=(ఉపరవములందు)పఱచవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాణాః=ప్రాణములు, అన్తరతః=అంతర్భాగమునందు, (అక్షిపక్ష్మ నాసికాదులందు) లోమశాః=రోమమయములుగా, (దృశ్యన్తే=కనఁబడుచున్నవి.)

తాత్పర్యము: ఉపరవములందు బర్హిస్సును పఱచవలెను. అందువలన అక్షిపక్ష్మ నాసికాదులందు ప్రాణములు లోమమయములుగాఁ గనఁబడుచున్నవి.(ఇచట ఉపరవములందు దర్భప్రక్షేపణము విహిత మైనది.)

11. అర్థము: ఆజ్యేన=ఆజ్యముచే, వ్యాఘారయతి=ఉపరవములందు అఘార హోమము చేయవలెను. ఆజ్యమ్=ఆజ్యము, తేజః వై=తేజస్స్వరూపమే. ఉపరవాః=ఉపరవములు, ప్రాణాః=ప్రాణస్వరూపములు. (తత్=ఆ కారణమువలన, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ప్రాణేష్వేవ=ప్రాణములందే, తేజః=తేజస్సును, దధాతి=స్థాపించుచున్నవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: ఉపరవములందు ఆజ్యముచే ఆఘార హోమము చేయవలెను. ఆజ్యము తేజ స్స్వరూపము. ఉపరవములు ప్రాణ స్వరూపములు. కావున ఈ విధముగ హోమము చేసిన యజమానుఁడు ప్రాణములందు తేజస్సును స్థాపించినవాఁ డగును. (ఇచట హోమము విధింపఁబడినది.)

12. అర్థము: అధిషవణే యత్=సోమాభిషవాధారములైన రెండు ఫలకములు ఏవి కలవో, ఏతే=ఇవి, యజ్ఞస్య=యజ్ఞమునకు, హనూ వై=హనువులవంటివే. (తే=ఆ ఫలకములను,) న సం తృణత్తి=ఏకము చేయరాదు. హనూ=హనువులు, అసంతృణ్ణే హి=అసంశ్లిష్టములు కదా! (హనువు=కంటి క్రిందినుండి చెక్కిలి మీఁది భాగము.)

తాత్పర్యము: (సోమము నభిషవము చేయుటకై సోమమునకు క్రిందిభాగమున పఱచునట్టి చర్మఫలకము లధిషవణము లనఁబడును.) లోకమునందు మానవునకు హనువు లెటువంటివో, ఈ అధిషవణములు యజ్ఞమునకు అటువంటివి. హనువులు రెండును కలసి యుండవు కదా! ఆ విధముగనే ఈ అధిషవణములను రెండింటిని రజ్జుబంధనాదికముచే సంశ్లిష్టములుగా చేయరాదు. (ఇచట ఫలకములకు అత్యంత సంశ్లేషము నిషేధింపఁబడినది.)

13. అర్థము: అథో=మఱియు, దీర్ఘసోమే ఖలు=దీర్ఘసోమయాగమునం దైనచో, ధృత్యై=దార్ఢ్యముకొఱకు, సంతృద్యే=అధిషవణ ఫలకములు సంశ్లిష్టములుగా చేయఁదగినవి.

తాత్పర్యము: (సోమము ఆవృత్త మగుటచే సోమమునకు దీర్ఘత్వము.) ద్విరాత్రాది సోమయాగమునం దైనచో అధిషవ బాహుళ్య ముండును కావున, అచట యధిషవణ ఫలకములను దృఢత్వమునకై రజ్జుబంధనాదికముచే సంశ్లిష్టములుగా చేయవలెను.

14. అర్థము: హవిర్ధానం యత్=హవిర్ధానము ఏది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, శిరః వై=శిరస్సువంటిదే. ఉపరవాః=ఉపరవములు, ప్రాణాః=ప్రాణములు. అధిషవణే=అధిషవణములు, హనూ=హనువులు. చర్మ=(సోమాభిషవమునకై ఉపయోగించునట్టి) చర్మము, జిహ్వా=నాలుక(వంటిది). గ్రావాణః=(అధిషవసాధనములైన)పాషాణ విశేషములు, దన్తాః=దంతములు(వంటివి). ఆహవనీయః=ఆహవనీయము, ముఖమ్=ముఖము(వంటిది). ఉత్తరవేదిః=ఉత్తరవేది, నాసికా=నాసిక(వంటిది). సదః=సదోమండపము, ఉదరమ్=ఉదరము(వంటిది). యదా ఖలు వై=ఎప్పుడైతే, జిహ్వయా=నాలుకచేత, దత్సు అధి=దంతములందు క్రిందిభాగమున, ఖాదతి=తినుచున్నాఁడో, అథ=అప్పుడు, తత్=ఆ ఖాదిత పదార్థము, ముఖమ్=ముఖమును, గచ్ఛతి=పొందుచున్నది. యదా=ఎప్పుడు, ముఖమ్=ముఖమును, గచ్ఛతి=పొందుచున్నదో, అథ=అప్పుడు, ఉదరమ్=ఉదరమును, గచ్ఛతి=పొందుచున్నది. (కడుపులోనికి పోవుచున్నది). తస్మాత్=ఆ కారణమువలన, హవిర్ధానే=హవిర్ధానమునందు, చర్మన్=చర్మమునందు, అధి=క్రింద, గ్రావభిః=రాలచేత, అభిషుత్య=సోమము నభిషవము చేసి, ఆహవనీయే=ఆహవనీయాగ్నియందు, హుత్వా=హోమము చేసి, ప్రత్యఞ్చః=ప్రత్యఙ్ముఖులై, పరేత్య=తిరిగివచ్చి, సదసి=సదోమండపమునందు, భక్షయన్తి=సోమమును భక్షించుచున్నారు.

తాత్పర్యము: ఈ బ్రాహ్మణము యజ్ఞాంగములైన హవిర్ధానాదులందు శిరాదుల నారోపించుటచే ఉపరవములను ప్రశంసించుచు సదోమండపమునందు సోమభక్షణము చేయవలెనని చెప్పుచున్నది. ఈ బ్రాహ్మణ భాగమునందలి హవిర్ధానాది పదములు పూర్వము వివరింపఁబడినవి. మానవుఁడు ఆహారమును నాలుకచే దంతాధోభాగములందు నములుటచే ఆ ఆహారము క్రమముగా ముఖాదికమునుండి ఉదరములోనికి చేరువిధముగ, ముఖమువంటి హవిర్ధానమునందు సోమము చర్మమనెడి నాలుకచే పాషాణవిశేషము లనెడి దంతముల క్రింది భాగమున అభిషవము చేసి ఆహవనీయాగ్నియందు హోమముచేసి యజమానాదులు ప్రత్యఙ్ముఖులై తిరిగి వచ్చి సదోమండపమునందు భుజించుచున్నారు. (భుజింపవలెనని విధి.) ఇటుల విశేషమైన సోమభక్షణమునకు అభిషవ హోమములు నిమిత్తములు.

15. అర్థము: యః వై=ఏ యజమానుఁడైతే, యజ్ఞముఖే=యజ్ఞముఖమునందు, విరాజః=విరాట్టనబడెడు అనెడి కామ ధేనువుయొక్క, దోహమ్=(సోమ మనెడి పయస్సును) పిదుకుటను, వేద=తెలిసికొనుచున్నాఁడో, సఃఆ యజమానుఁడు, ఏనామ్=ఈ విరాట్ అనెడి కామధేనువును, దుహే ఏవ=నిశ్చయముగ పిదుకుచున్నాఁడు. ఇయం వై=ఈ మహావేదియే, విరాట్=విరాట్ అనెడి కామధేనువు. చర్మ=సోమాభిషవమునకై ఉపయోగించెడి చర్మము, తస్యై త్వక్=ఆ విరాట్కామధేనువుయొక్క చర్మము. అధిషవణే=అధిషవణములు, (చర్మఫలకములు.) ఊధః=పాలపొదుఁగు. ఉపరవాః=ఉపరవములు, స్తనాః=స్తనములు. గ్రావాణః=పాషాణములు, వత్సాః=దూడలు. ఋత్విజః=ఋత్విజులు, దుహన్తి=(దోగ్ధలుగా)పిదుకుచున్నారు. సోమః=సోమము, పయః=క్షీరము. యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ విధముగ, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=అతఁడు, ఏనామ్=ఈ విరాట్ అనెడి ధేనువును, దుహే ఏవ=నిశ్చయముగ పిదుకుచున్నాఁడు.

తాత్పర్యము: అగ్నిష్టోమమునందు పండ్రెండు స్తోత్రములందు ఉన్న ఋక్కులు ఆవృత్తములై తొంబది యగుచున్నవి. ఆ తొంబదిలో తొమ్మిది దశకములు కలవు. ఆ నవ దశకములలో ప్రత్యేకముగ విరాట్ ఛందోక్షరసంఖ్య కలదు. కావున, ఈ యజ్ఞము 'విరాట్' అని చెప్పఁబడుచున్నది. ఈ యజ్ఞరూపమైన విరాట్టు కామధేనువుగా నిరూపింపఁబడుచున్నది. ఈ మహావేదియే విరాడాఖ్య కామధేనువు. ఆ గోవుయొక్క చర్మము యజ్ఞమునందు పఱచఁబడిన చర్మము, ఆ కామధేనువుయొక్క పాలపొదుఁగు యజ్ఞమునందలి ఫలకద్వయము. ఈ విధముగ ఉపరవాదులు స్తనాదులుగా వర్ణించఁబడినవి. యజ్ఞముఖమునందు విరాడాఖ్యధేనువుయొక్క దోహన ప్రకారమును తెలిసికొనిన యజమానుఁడు సర్వవిధములచేతను ఈ కామధేనువును పిదికినవాఁ డగును. [మఱల కూడ ఉపరవ స్తుతికై ప్రకారాంతరమున రూపకమును కల్పించి తద్వేదనము ప్రశంసింపఁబడినది.]

ఏకాదశానువాకము సమాప్తము.

షష్ఠాష్టకమునందు ద్వితీయ ప్రపాఠకము సమాప్తము.

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే

## ప్రథమోఽనువాకః

## హరిః ఓమ్

మూలము: [1] చాత్వాలా ద్ధిష్ణియా నుప వపతి యోనిర్వై యజ్ఞస్య చాత్వాలం యజ్ఞస్య సయోనిత్వాయ [2] దేవా వై యజ్ఞం పరాఽజయన్త తమాగ్నీధ్రా త్పునరపాజయ న్నేతద్వై యజ్ఞస్యాపరాజితం యదాగ్నీధ్రం యదాగ్నీధ్రా ద్ధిష్ణియా న్విహరతి యదేవ యజ్ఞస్యాపరాజితం తత ఏవైనం పునస్తనుతే [3] పరాజిత్యేవ ఖలు వా ఏతే యన్తి యే బహిష్పవమానగ్ం సర్పన్తి బహిష్పవమానే స్తుతే (౧) ఆహాగ్నీదగ్నీన్విహర బర్హిః స్తృణాహి పురోడాశాగ్ం అలం కుర్వితి యజ్ఞమేవాపజిత్య పునస్తన్వానా యన్త్య [4] ఙ్గారై ర్ద్వే సవనే వి హరతి శలాకాభి స్తృతీయగ్ం సశుక్రత్వాయాథో సం భరత్యేవైన [5] ద్ధిష్ణియా వా అముష్మింల్లోకే సోమమరక్ష న్తేభ్యోఽధి సోమమాఽఽహరన్త మన్వవాయన్తం పర్యవిశ [6] న్య ఏవం వేద విన్దతే(౨) పరివేష్టారం [7] తే సోమపీథేన వ్యార్ధ్యన్త తే దేవేషు సోమపీథ మైచ్ఛన్త తాన్దేవా అబ్రువ న్ద్వే ద్వే నామనీ కురుధ్వ మథ ప్ర వాఽఽప్స్యథ న వేత్యగ్నయో వా అథ ధిష్ణియా స్తస్మాద్ద్వి నామా బ్రాహ్మణోఽర్ధుకస్తేషాం యే నేదిష్ఠం పర్యవిశన్తే సోమపీథం ప్రాఽఽప్నువ న్నాహవనీయ ఆగ్నీధ్రీయో హోత్రీయో మార్జాలీయ స్తస్మాత్తేషు జుహ్వ [8] త్యతిహాయ వషట్కరోతి వి హి(౩) ఏతే సోమపీథేనాఽర్ధ్యన్త [9] దేవా వై యాః ప్రాచీరాహుతీ రజుహవుర్యే పురస్తా దసురా ఆసన్తాగ్ంస్తాభిః ప్రాణుదన్త యాః ప్రతీచీర్యే పశ్చాదసురా ఆసన్తాగ్ం స్తాభి రపానుదన్త ప్రాచీరన్యా ఆహుతయో

హాయన్తే ప్రత్యఞ్చోఽన్యే ధిష్ణియా న్వ్యాఘారయతి పశ్చాచ్చైవ పురస్తాచ్చ యజమానో భ్రాతృవ్యా

న్ప్రణుదతే తస్మాత్పరాచీః ప్రజాః ప్ర వీయన్తే ప్రతీచీః(౪) జాయన్తే [10]ప్రాణా వా ఏతే యద్ధిష్ణియా

యదధ్వర్యుః ప్రత్యఙ్ధిష్ణియా నతిసర్పే త్ప్రాణాన్థ్సం కర్షేత్ప్రమాయుకః స్యా న్నాభిర్వా ఏషా

యజ్ఞస్య యద్ధోతోర్ధ్వః ఖలు వై నాభ్యై ప్రాణోఽవాఙపానో యదధ్వర్యుః ప్రత్యఙ్హోతార మతి

సర్పే దపానే ప్రాణం దధ్యా త్ప్రమాయుకః స్యా [11]న్నాధ్వర్యురుప గాయేద్వాగ్వీర్యో వా అధ్వర్యు

ర్యదధ్వర్యు రుప గాయేదుద్గాత్రే (౫) వాచగ్ం సం ప్రయచ్ఛే దుపదాసుకాఽస్య వాక్స్యా [12]ద్బ్రహ్మవా

దినో వదన్తి నాసగ్ం స్థితే సోమేఽధ్వర్యుః ప్రత్యఙ్సదోఽతీయా దథ కథా దాక్షిణాని హోతుమేతి

[13]యామో హి స తేషాం [14]కస్మా అహ దేవా యామం వాఽయామం వాఽను జ్ఞాస్యన్తీ [15]త్యుత్త

రేణాఽఽగ్నీధ్రం పరీత్య జుహోతి దాక్షిణాని న ప్రాణాన్థ్సం కర్షతి [16]న్యన్యే ధిష్ణియా ఉప్యన్తే

నాన్యే యాన్నివపతి తేన తాన్ప్రీణాతి [17]యాన్న నివపతి యదనుదిశతి తేన తాన్ ||౬||
[స్తుతే విన్దతే హి వీయన్తే ప్రతీచీ రుద్గాత్ర ఉప్యన్తే చతుర్దశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠకాణ్డే తృతీయప్రపాఠకే ప్రథమోఽనువాకః ||౧||

## వేదార్థదీపిక

**అవతారిక:** ప్రథమకాండగత తృతీయ ప్రపాఠకస్థ తృతీయానువాకములో చెప్పఁబడిన ఆగ్నీధ్రీయాది సదఃప్రభృతి స్థానములందలి ధిష్ణియము లీ ప్రథమానువాకమునందు వివరించఁబడుచున్నవి.

1. **అర్థము:** చాత్వాలాత్=చాత్వాలము వలన, ధిష్ణియాన్=ఆగ్నీధ్రుఁడు మున్నగు ఋత్విజులకు సంబంధించిన స్థానములను, ఉపవపతి=చేయవలెను. చాత్వాలమ్=చాత్వాలము, యజ్ఞస్య=యజ్ఞమునకు, యోనిః వై=కారణమే. ఇదమ్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, సయోనిత్వాయ=కారణ సహితత్వముకొఱకు, (భవతి=అగుచున్నది.)

**తాత్పర్యము:** చాత్వాలమునుండి మట్టిని తెచ్చి యజ్ఞాంగమైన ఉత్తరవేదిని నిర్మించుటవలన చాత్వాలము యజ్ఞమునకు కారణ మగుచున్నది. అగ్నీధ్రీయ సదఃప్రభృతి స్థానములందు చాత్వాలమునుండి మట్టిని తెచ్చి దానితో

ధిష్ణియములను నిర్మించవలెను. ఈ విధముగ ధిష్ణియ నామకములైన స్థలవిశేషములను నిర్మించుటవలన యజ్ఞము సర్వము స్వయోనియుక్త మగును.

2. అర్థము: దేవాః వై=దేవతలే, యజ్ఞమ్=యజ్ఞమును, పరాఽ జయన్త=పరాజయముగా చేసిరి. తమ్=ఆ యజ్ఞమును, ఆగ్నీధ్రాత్=ఆగ్నీధ్ర దేవతవలన, పునః=మఱల, అపాజయన్=అసురులనుండి తొలఁగించి విజయము నొందిరి. ఆగ్నీధ్రం యత్=ఆగ్నీధ్ర స్థానము ఏది కలదో, ఏతత్ వై=ఇదియే, యజ్ఞస్య=యజ్ఞమునకు, అప రాజితమ్=పరాజయమును పొందకుండుట. ఆగ్నీధ్రాత్=ఆగ్నీధ్రస్థానమునుండి, ధిష్ణియాన్=ధిష్ణియ నామక స్థానములను, విహరతి యత్=విహరించుచున్నచో, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, అపరాజితం యత్=పరాజ యాభావమేది కలదో, తతః ఏవ=ఆ ఆగ్నీధ్ర స్థానమునుండియే, ఏనమ్=ఈ యజ్ఞమును, పునః=మఱల, తనుతే=విస్తరింప (వృద్ధి)చేయుచున్నవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: దేవతలే యజ్ఞమును పోఁగొట్టుకొనిరి. అనఁగా అసురులు దేవతలనుండి యజ్ఞమును తీసికొనిరి. దేవతలు ఆగ్నీధ్ర దేవతా సామర్థ్యముచేత అసురులనుండి తొలఁగించి పొందిరి. కావున ఆగ్నీధ్రమువలన, యజ్ఞమునకు పరాజయము లేకుండుట సంభవించినది. అందువలన ఆగ్నీధ్ర స్థానమునందలి దగ్ధ కాష్ఠమును తీసికొని దానితో యజమానుఁడు ధిష్ణియములందు విహరించవలెను. ఇట్లు చేసినచో యజమానుఁడు యజ్ఞమును వృద్ధి నొందించినవాఁడగును. అనఁగా యజమానుఁడు ఆగ్నీధ్ర సంబంధియగు ధిష్ణియమునందలి యగ్నిని హోత్రియాది ధిష్ణియములందు స్థాపించవలెనని భావము. [ఇచట ఆగ్నీధ్రీయ ధిష్ణియస్థిత వహ్నిని హోత్రి యాది ధిష్ణియములందు స్థాపించుట విధింపఁబడినది.]

3. అర్థము: యే=ఏ సామగాయకులైన ఋత్విజులు, బహిష్పవమానమ్=బహిష్పవమాన స్తోత్రమును, (గాయన్తః=గానము చేయుచున్నవారై,) సర్పన్తి=ధిష్ణియములందు పరుగిడుచున్నారో, (విహరించు చున్నారో) ఏతే=ఈ ఋత్వి జులు, పరాజిత్యేవ వై=పరాజయమును పొందినట్లువలెనే, యన్తి ఖలు=పోవుచున్నారు కదా! (తత్=ఆ కారణమువలన,) బహిష్పవమానే=బహిష్పవమాన స్తోత్రము, స్తుతే సతి=గానము చేయఁబడిన దగుచుండఁగా, "అగ్నీ దగ్నీ న్వి హారబర్హిః స్తృణాహి పురోడాశాగ్ం అలం కురు" ఇతి="ఓ ఆగ్నీధ్రుఁడా! అగ్నులను విహ రింపఁజేయుము. బర్హిస్సును పఱచుము. పురోడాశముల నలంకరించుము." అనెడి ఈ యగ్ని విహరణాది ప్రైష మంత్రమును, ఆహ=అధ్వర్యుఁడు చెప్పవలెను. (తదా=అప్పుడు, ఋత్విజః=ఋత్విజులు,) యజ్ఞ మేవ=యజ్ఞమునే, అపజిత్య=పరాజయమునుండి తొలఁగించి, పునః= మఱల, తన్వానాః=ప్రవర్తింపఁజేయు చున్నవారై, యన్తి=పోవుచున్నవా రగుచున్నారు.

తాత్పర్యము: ప్రాతఃసవనమునందు ఋత్విజులు "ఉపాస్మై గాయత" ఇత్యాదికమైన బహిష్పవమాన స్తోత్రమును గానము చేయుచు ధిష్ణియములయొద్ద విహరించుచుందురు. వారు ఆ విధముగ చేయుట పరాజితులై పారిపోయిన వారి వంటిదే యగును. అందువలన ఆ స్తోత్రము సమాప్తము కాఁగానే ఆగ్నీధ్రుని సంబోధించి "అగ్నీద గ్నీన్వి హార బర్హిః స్తృణాహి పురోడాశాగ్ం అలం కురు" అను ప్రైషను చెప్పవలెను. ఆ విధముగ ప్రైషను చెప్పఁగానే ఋత్విజులు యజ్ఞమును పరాజయమునుండి తొలఁగించి మఱల ప్రవర్తింపఁజేసినవా రగుదురు. (ఇచట ప్రైషమంత్రము ఉత్పాదిత మైనది.)

4. అర్థము: అఙ్గారైః=దగ్ధకాష్ఠములతో, ద్వే సవనే=ప్రాతఃసవన మాధ్యందిన సవనము లనెడి రెండు సవనముల యందు, (సప్తమ్యర్థమున ద్వితీయ) వి హరతి=విహరించవలెను. తృతీయమ్=తృతీయసవనమునందు, సశుక్రత్వాయ=తేజస్సు కలిగియుండుటకై, శలకాభిః=దీప్తతృణముష్టులతో, వి హరేత్=విహరించవలెను. అథో=మఱియు, ఏనత్=ఈ తృతీయ సవనమును, సంభరతి=బాగుగ పోషించుచున్నవాఁ డగుచున్నాడు.

తాత్పర్యము: ప్రాతఃసవన మాధ్యందిన సవనములందు మందుచున్న కాష్ఠములను పట్టుకొని ఆ ధిష్ణియములయొద్ద విహరించవలెను. తృతీయసవనమునందు మందుచున్న తృణ సముదాయమును పట్టుకొని విహరించవలెను. సోమము గాయత్రి ముఖమున పానము చేయఁబడుటవలన సోమమునందు తేజస్సు హీనమగును. శలాకములు జ్వలించుచుండఁగా సారరూప తేజస్సు ఉండును. కావున తేజస్స్వముకొఱకు ఆ విధముగ చేయవలెను. మఱియు ఈ తృతీయసవనమును ఇతరసదృశముగ చేసి బాగుగ పోషించినవాఁడగును. (విహరణమునందలి విశేషమిచట చెప్పఁబడినది.).

5. అర్థము: ధిష్ణియాః వై=ధిష్ణియ దేవతలు కూడ, అముష్మిన్ లోకే=స్వర్గలోకమునందు, సోమమ్=సోమమును, అరక్షన్=రక్షించిరి. (రక్షించు చుండిరి). ఆహరన్తం తం సోమమ్ అను=తీసికొని రాఁబడుచున్న యా సోమము ననుసరించి వచ్చి, పర్యవిశన్=అంతటను కూర్చుండిరి.

తాత్పర్యము: వెనుక చెప్పఁబడిన స్వాన భ్రాజాదులవలె ధిష్ణియ దేవతలు కూడ స్వర్గలోకమునందు సోమమును రక్షించు చున్నారు. స్వర్గమునుండి తీసికొని రాఁబడుచున్న ఆ సోమముననుసరించి వచ్చి ధిష్ణియ దేవతలు అంతటను ఉపవిష్టులైరి. (ఆ కారణమువలన ధిష్ణియములు ప్రశస్తములు. ఇచట ధిష్ణియ సంఘ ప్రశంస చేయఁబడినది.)

6. అర్థము: యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ విధముగ, వేద=తెలిసికొనెనో, (సః=అతఁడు,) పరివేష్టారమ్=సేవ కజనుని, విన్దతే=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్త విధమును తెలిసికొనిన యజమానుఁడు సేవకజనమును పొందును. (ఇచట వేదన ప్రశంస చేయఁబడినది.)

7. అర్థము: తే=ఆ ధిష్ణియములు, సోమపీథేన=సోమపానముచే, వ్యార్ధ్యన్త=వియుక్తము లైనవి. తే=ఆ ధిష్ణియములు, దేవేషు=దేవతలయందు, సోమపీథమ్=సోమపానమును, ఐచ్ఛన్త=కోరినవి. ద్వే ద్వే నామనీ=రెండు రెండు నామధేయములను, కురుధ్వమ్=చేయుఁడు. అథ=అప్పుడు, ప్రాప్స్యథ వా=పొందఁగలరేమో. న వా=పొంద లేరేమో, ఇతి=అని, దేవాః=దేవతలు, తాన్=ఆ ధిష్ణియములను గూర్చి, అబ్రువన్=పలికిరి. తస్మాత్=ఆ కారణమువలన, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, ద్వినామా=రెండు పేర్లు కలవాఁడై, అర్ధుకః=సమృద్ధిమంతుఁడు, (భవతి=అగుచున్నాఁడు.) తేషామ్=ఆ ధిష్ణియములలో, యే=ఏవి, నేదిష్ఠమ్=సోమమున కత్యంత సమీప మువందు, పర్యవిశన్=పరివేష్టించి యున్నవో, తే=ఆ ధిష్ణియములు, సోమపీథమ్=సోమపానమును, ప్రాప్ను వన్=పొందినవి. (అవి,) ఆహవనీయః=ఆహవనీయము, ఆగ్నీధ్రీయః=ఆగ్నీధ్రీయము, హోత్రీయః=హోత్రీ యము, మార్జాలీయః=మార్జాలీయము అను ధిష్ణియములు. తస్మాత్=ఆ కారణమువలన, తేషు=ఆ నాలుగు ధిష్ణియములయందు, జుహ్వతి=హోమము చేయవలెను.

తాత్పర్యము: పూర్వోక్తములైన యా ధిష్ణియములు సోమపానము లేనివియై తమకు సోమపానము కావలయునని దేవ తలను కోరినవి. "ఓ ధిష్ణియములారా! ఒక్కొక్క నామమును మాత్రము ధరించుటచేత మీకు ఏ విధముగను సోమపాన యోగ్యత కలుగదు. రెండేసి నామధేయములను ధరించినచో సోమపాన యోగ్యత పాక్షికముగ కలుగును" అని దేవతలు ధిష్ణియములకు చెప్పిరి. నామద్వయము ఉత్కర్ష హేతు వగుటవలననే లోకమునందు బ్రాహ్మణుఁడు ప్రథమమున తల్లిదండ్రులవలన ఒక పేరును పొంది పిమ్మట తపో విద్యాదుల చేత ఆచార్యోపాధ్యాయాదులవలన ద్వితీయ నామధేయమును ధరించి సత్కారముచే సమృద్ధుఁడగుచున్నాఁడు. నామద్వయమును ధరించిన ధిష్ణియములలో సోమమున కత్యంత సమీపమున పరివేష్టితములై యున్న టువంటి 'ఆహవనీయము, ఆగ్నీధ్రీయము హోత్రీయము మార్జాలీయము' అను నాలుగు ధిష్ణియములందు యజ్ఞకర్త హోమము చేయవలయును. (ఇచట కొన్ని ధిష్ణియములందు సోమాహుతి విధింపఁబడినది.)

8. అర్థము: అతిహోయ=(సోమమునకు దూరమున నున్నట్టి మైత్రావరుణ ధిష్ణియాదులను) అతిక్రమించి, వషట్ కరోతి=వష ట్కార పూర్వక హోమము చేయవలయును. ఏతే=దూరస్థములైన యీ మైత్రావరుణ ధిష్ణియాదులు, సోమపీథేన=సోమపానముచేత, వ్యార్ధ్యన్త హి=వియుక్తము లైనవి కదా!

తాత్పర్యము: సోమమునకు దూరమున ఉన్న మైత్రావరుణ ధిష్ణియాదులను విడిచి సమీపస్థములైన ఆహవనీయ ఆగ్నీ ధ్రీయ హోత్రీయ మార్జాలీయ ధిష్ణియములందు వషట్కార పూర్వకముగ హోమము చేయవలయును. ఈ మైత్రావరుణ ధిష్ణియములు సోమమునకు దూరమున నుండుటచే సోమపాన రహితములైనవి. సోమపాన వియోగమునకు ప్రతీకారమైన సామీప్య లక్షణము నివి సంపాదించినవి కావు. వీనికి ద్వితీయ నామ ప్రయు క్తమైన ఉత్కర్షము, సోమపానము లేకున్నను ఆజ్య వ్యాఘారణమువలననే ఉపపన్న మగుచున్నది.

9. అర్థము: దేవాః వై=దేవతలే, యాః ప్రాచీః ఆహుతీః=తూర్పు దిక్కునకు సంబంధించిన యే యాహుతులను, అజుహవుః=హోమము చేసిరో, పురస్తాత్=ప్రాగ్దిశయందు, యే అసురాః=ఏ రాక్షసులు, ఆసన్=ఉండిరో, తాన్=ఆ అసురులను, తాభిః=ఆ యాహుతులచేత, ప్రాణుదన్త=పోఁగొట్టిరి. యాః ప్రతీచీః=పశ్చిమ దిక్కునకు సంబంధించిన యే యాహుతులను, అజుహవుః=హోమము చేసిరో, పశ్చాత్=పశ్చిమ దిశ యందు, యే అసురాః=ఏ రాక్షసులు, ఆసన్=కలరో, తాన్=ఆ యసురులను, తాభిః=ఆ యాహు తులచేత, అపానుదన్త=పోఁదోలిరి. ప్రాచీః=ప్రాగ్దిక్సంబంధములైన, అన్యాః ఆహుతయః=ఇతరములైన యాహుతులు, హూయన్తే=హోమము చేయఁబడుచున్నవి. ప్రత్యఙ్ ఆసీనః=పశ్చిమమున నాసీనుఁడై, ధిష్ణి యాన్=మైత్రావరుణీయాది ధిష్ణియములను, వ్యాఘారయతి=వ్యాఘారణము చేయవలెను. యజమానః=యజ మానుఁడు, పశ్చాచ్చ=పశ్చిమ దిక్కునందును, పురస్తాచ్చ=తూర్పు దిక్కునందును, స్థితాన్=ఉన్నటువంటి, భ్రాతృవ్యాన్=శత్రువులను, ప్రణుదతే ఏవ=నిశ్చయముగ పోఁగొట్టుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువ లన, (లోకేఽపి=లోకమునందు కూడ) ప్రజాః=ప్రజలు, పిత్రా=తండ్రిచే, పరాచీః=పరాఙ్ముఖులుగా, ప్ర వీయన్తే=నిషేకించఁబడుచున్నారు. ప్రతీచీః=ప్రత్యఙ్ముఖులుగా, జాయన్తే పుట్టుచున్నారు.

తాత్పర్యము: దేవతలే ప్రాఙ్ముఖముగ సోమమును హోమము చేసి ఆ యాహుతులచే తూర్పు దిక్కునందలి రాక్షసు లను పోఁగొట్టిరి. పశ్చిమ దిఙ్ముఖముగ సోమమును హోమము చేసి పశ్చిమ దిక్కునందలి రాక్షసులను పోఁదోలిరి. ప్రత్యక్కుగ నాసీనుఁడై మైత్రావరుణీయాది ధిష్ణియములను వ్యాఘారణము చేయవలయును. దీనిచే యజమానుఁడు ప్రాక్పశ్చిమ దిక్కులందలి శత్రువులను పోఁగొట్టును. ప్రాఙ్ముఖముగ హూయమాన ములైన యాహుతులు ఉత్తరవేదిగతములు. ఆహుతులలో ద్వైవిధ్యము ఉన్నవిధముగనే, లోకమునందు కూడ తండ్రిచే ప్రాఙ్ముఖముగ నిషేచనము చేయఁబడిన సంతానము తద్విపరీతదిఙ్ముఖముగ కలుగుచున్నది.

10. అర్థము: ధిష్ణియాః యత్=ధిష్ణియములు ఏవి కలవో, ఏతే=ఇవి, ప్రాణాః వై=యజ్ఞమునకు ప్రాణములవంటివే. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, ప్రత్యఙ్=అడ్డముగా, ధిష్ణియాన్=ధిష్ణియములను, అతి సర్పేత్ యత్=అతిక్ర మించి పోవునెడల, ప్రాణాన్=ప్రాణములను, సంకర్షేత్=సంహరించువాఁడగును. (తదా=అప్పుడు) ప్రమా యుకః=మరణించువాఁడు, స్యాత్=అగును. హోతా యత్=హోత అనుట ఏది కలదో, ఏషా=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, నాభిః వై=నాభివంటిది కదా! ప్రాణః=ప్రాణము, నాభ్యై=నాభికి, ఊర్ధ్వః ఖలు వై=పై భాగమున నుండునదియే కదా! అపానః=అపానము, అవాఙ్=క్రింది భాగమున నుండునది. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, హోతారమ్=హోతను, ప్రత్యఙ్=అడ్డముగా, అతి సర్పేత్ యత్=అతిక్రమించి పోవుచో, అపానే=అపానమునందు, ప్రాణమ్=ప్రాణమును, దధ్యాత్=ఉంచువాఁ డగును. (తదా=అప్పుడు) ప్రమాయుకః=మరణించువాఁడు, స్యాత్=అగును.

తాత్పర్యము: ధిష్ణియములు యజ్ఞమునకు ప్రాణములవంటివి కావున, అధ్వర్యుఁడు ధిష్ణియములను అడ్డముగ నతిక్రమించి పోవుచో, అతఁడు ప్రాణములను సంహరించువాఁ డగును. మఱియు నతఁడు మరణించును. హోత యజ్ఞమునకు నాభివంటివాఁడు. ప్రాణము నాభికి పైభాగముననే ఉండును కదా! అపానము నాభి కథో భాగమున నుండును. అధ్వర్యుఁడు హోతను అడ్డముగా అతిక్రమించి పోవుచో ప్రాణము నపానమునం దుంచునట్టి వాఁడగును. అప్పుడు అధ్వర్యుఁడు మరణించును. (ఇచట అధ్వర్యునకు ప్రత్యగ్గమన నిషేధము రెండు విధములైన నిందల ద్వారా తెలియఁజేయఁబడినది. హోత యజ్ఞమునకు నాభివలె మధ్యప్రదేశమున నుండును. ప్రాణము వలె ప్రాగ్వృత్తియగు నధ్వర్యునకు ప్రత్యగ్గమనమయుక్తము.)

11. అర్థము: అధ్వర్యుః=అధ్వర్యుఁడు, నోపగాయేత్=ఉపగానము చేయరాదు. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, వాగ్వీర్యః వై=వాక్కే వీర్యము (బలము)గాఁ గలవాఁడు కదా! అధ్వర్యుః=అధ్వర్యుఁడు, ఉపగాయేత్ యత్=ఉపగానము చేయుచో, ఉద్గాత్రే=(సామగానము చేయుచున్న) ఉద్గాతయందు, వాచమ్=వాక్కును, సం ప్రయచ్ఛేత్=ఈయు వలెను. అస్య=ఈ అధ్వర్యునియొక్క, వాక్=వాక్కు, ఉపదాసుకా=ఉపక్షయము స్వభావముగాఁగలది, స్యాత్=అగును. (ఉపగానము=ఉద్గాత సామమును గానము చేయుచుండఁగా వెనుక నుండి దాని నంగీక రించుట.)

తాత్పర్యము: "ఋత్విజ ఉపగాయన్తి"="ఋత్విజులు ఉపగానము చేయవలెను" అను శ్రుతిచే ఋత్విజులలో ఒకఁడైన అధ్వర్యుఁడు కూడ ఉపగానము చేయవలెనని అధ్వర్యునకు ఉపగానము సంప్రాప్తము కాఁగా ఈ మంత్రము అధ్వర్యునకు ఉపగానమును నిషేధించినది.) అధ్వర్యుఁడు వాక్కే వీర్యముగాఁగలవాఁడు కనుక అతఁడు ఉపగానము చేయరాదు. అధ్వర్యుఁడు ఉపగానము చేయుచో ఉద్గాతయందు వాక్కును ఈయువలయును. అనఁగా అతఁడు ఉద్గాతతోఁగూడ సామము చేయవలయును. అప్పు డతని వాక్కు శక్తిహీన మగును.

12. అర్థము: సోమే=సోమము, అసంస్థితే=సమాప్తము కాని దగుచుండఁగా, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, సదః=సదో మండపమును, ప్రత్యఙ్=అడ్డముగా, నాతియాత్=అతిక్రమించరాదు. అథ=అప్పుడు, కథా=ఏ విధముగా, దాక్షిణాని=దాక్షిణాహుతులను, హోతుమ్=హోమము చేయుటకు, ఏతి=వెళ్ళుచున్నాడు, ఇతి=అని, బ్రహ్మ వాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు (పరస్పరము ప్రశ్నించుకొనుచున్నారు.).

తాత్పర్యము: సోమయాగము సమాప్తము కాని దగుచుండఁగా, అధ్వర్యుఁడు సదోమండపమును అడ్డముగా అతిక్రమించి వెళ్లరాదని నిషేధించఁబడినది. దాక్షిణ హోమము ప్రాచీనవంశమునందు నూతన గార్హపత్యమునందు చేయ వలయును. ఈ దాక్షిణ హోమము చేయుట యే విధముగ సంభవ మగును? అని మంత్రజ్ఞులు పరస్పరము సంభాషించుకొనుచున్నారు. (ఇచట ప్రకారాంతరముగ అధ్వర్యునకు ప్రత్యగ్గమనమును విధించుటకు ఒక చోద్యము భావింపఁబడినది.)

13. అర్థము: తేషామ్=ఆ దేవతలకు, (సంబంధించిన కర్మకు,) నః=ఆ దాక్షిణ హోమము, యామః హి=ఉపరమ కాలీ నము కదా!

తాత్పర్యము: ఆ దాక్షిణ హోమము దేవతల కర్మకు ఉపరమ కాలీనము కనుక లౌకికగమన మగుటచే దేవత లనుజ్ఞ నిత్తురు. అందువలన దాక్షిణ హోమమున కభ్యంతరము లేదని ఇచట సమాధానాభాసము చెప్పఁబడినది. ఈ సమాధానము అభాసమే కాని సరియైనది కాదు (ఉపరమము=విరామము, లేక, చాలించుట.)

14. అర్థము: అపి=అధ్వర్యునకు ప్రత్యగ్గమన నిషేధ ముండఁగా, దేవాః=దేవతలు, యామం వా=ఉపరమమును కాని, అయామం వా=అనుపరతిని కాని, కస్మై=ఏ ప్రయోజనముకొఱకు, అను జ్ఞాస్యన్తి=అనుమతింతురు?

తాత్పర్యము: అధ్వర్యునకు ప్రత్యగ్గమన నిషేధ ముండఁగా దేవతలు ఏ ప్రయోజనముకొఱకు కర్మకు ఉపరతిని కాని, అనుపరతిని కాని అనుమతింతురు? వారి అనుజ్ఞచే వారికి కొంచె మైనను ప్రయోజనము కనఁబడుటలేదు.

పూర్వోక్త సమాధానము సరియైనది కాదు. అందువలన ప్రత్యగ్గమనము నిషేధింపఁబడుటచే దాక్షిణ హోమము సంఘటిత మగుట లేదు.

15. అర్థము: ఆగ్నీధ్రమ్=ఆగ్నీధ్రుని, ఉత్తరేణ=ఉత్తరపు దిక్కున, పరీత్య=అతిక్రమించి, దాక్షిణాని=దాక్షిణాహుతులను, జుహోతి=హోమము చేయవలెను. (తదా=అప్పుడు, అధ్వర్యుః=అధ్వర్యుఁడు) ప్రాణాన్=ప్రాణములను, న సం కర్షతి=సంహరించుట లేదు.

తాత్పర్యము: ఆగ్నీధ్ర హవిర్ధానముల మధ్యమున పోయి సదోతిక్రమణము చేయుట నిషిద్ధ మైనది. ఆ విధముగఁ గాక, అధ్వర్యుఁడు ఆగ్నీధ్రుని వామభాగమున అతిక్రమించి అచ్చటనుండి ఉత్తర దిశయందు ప్రత్యఙ్ముఖుఁడుగా పోయి ప్రాచీనవంశమునందు దాక్షిణములను హోమము చేయవలయును. ఈ విధముగ చేయుటవలన పూర్వోక్త దోషము లేదు. (పూర్వ సమస్యకు ముఖ్య పరిహారమును చూపుచు ప్రత్యగ్గమనము విధింపఁబడినది.)

16. అర్థము: అన్యే ధిష్ణియాః=ఇతర ధిష్ణియములు, న్యుప్యన్తే=(చాత్వాల గత మృత్తుతో) పూరింపఁబడ వలెను. అన్యే=తదితరములైన ధిష్ణియములు, న ఉప్యన్తే=పూరింపఁబడరాదు. యాన్=ఏ ధిష్ణియములను, నివపతి=పూరించుచున్నాఁడో, తేన=ఆ నివపముచేత, తాన్=ఆ ధిష్ణియములను, ప్రీణాతి=తృప్తిపఱచుచున్నాఁడు.

తాత్పర్యము: "చాత్వాలా ద్ధిష్ణియా నుప వపతి" అను సామాన్య శ్రుతిచేత ఆగ్నీధ్రాది షోడశ ధిష్ణియములకు నివపనము ప్రసక్తము కాఁగా మార్జాలీయాంతములైన ధిష్ణియములను మాత్రము చాత్వాల గత మృత్తుతో పూరణము చేయవలెననియు, తదితరములైన ఆహవనీయాద్యష్ట ధిష్ణియములను పూరించరాదనియు ఈ మంత్రము చెప్పినది. ఏ ధిష్ణియములు పూరింపఁబడినవో, ఆ నివపనము చేత ఆ ధిష్ణియములను తృప్తిపఱచిన ట్లగును.

17. అర్థము: యాన్=ఏ ధిష్ణియములను, న నివపతి=చాత్వాలగత మృత్తుతో పూరించ లేదో, తాన్=ఆ ధిష్ణియములను, అను దిశతి యత్=మంత్రముచే ఉపస్థానము చేయుచున్నచో, తేన=ఆ యుపస్థానముచే, తాన్=ఆ ధిష్ణియములను, ప్రీణాతి=సంతోషపఱచుచున్నాఁడు.

తాత్పర్యము: చాత్వాల గత మృత్తుతో పూరించని ధిష్ణియములను మంత్రపూర్వకముగ ఉపస్థానము చేయవలయును. ఆ యుపస్థానముచే ఆ ధిష్ణియములను తృప్తిపఱచిన ట్లగును. (ఇతరములైన ఆహవనీయాది ధిష్ణియముల కీ మంత్రముచే ఉపస్థానము విధింపఁబడినది.)

ప్రథమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః

మూలము: [1]సువర్గాయ వా ఏతాని లోకాయ హూయన్తే యద్వైసర్జనాని [2]ద్వాభ్యాం గార్హపత్యే జుహోతి ద్విపా
ద్యజమానః ప్రతిష్ఠిత్యా ఆగ్నీధ్రే జుహోత్యన్తరిక్ష ఏవాఽఽక్రమత ఆహవనీయే జుహోతి సువర్గ
మేవైనం లోకం గమయతి [3]దేవాన్వై సువర్గం లోకం యతో రక్షాగ్ంస్యజిఘాగ్ంసన్తే సోమేన
రాజ్ఞా రక్షాగ్ంస్యపహత్యాప్సు మాత్మానం కృత్వా సువర్గం లోక మాయన్రక్షసా మనుపలాభాయాఽ
ఽత్తః సోమో భవత్యథ (౧) వైసర్జనాని జుహోతి రక్షసా మపహత్యై [4] త్వగ్ం సోమ తనూకృద్భ్య
ఇత్యాహ తనూకృద్ధ్యేష [5]ద్వేషోభ్యోఽన్యకృతేభ్య ఇత్యాహాన్యకృతాని హి రక్షాగ్ం[6]స్యురు యన్తాఽసి
వరూథ మిత్యాహోరు ణస్కృధీతి వావైతదాహ [7]జుషాణో అప్తు రాజ్యస్య వేత్విత్యాహాప్తుమేవ యజ
మానం కృత్వా సువర్గం లోకం గమయతి రక్షసా మనుపలాభాయా[8]ఽఽసోమం దదతే(౨) ఆగ్రావ్ణ
ఆ వాయవ్యాన్యా ద్రోణకలశ ముత్పత్ని మా నయన్త్యన్వనాగ్ంసి ప్ర వర్తయన్తి యావదేవాస్యాస్తి తేన
సహ సువర్గం లోక మేతి [9] నయవత్యర్చాఽఽగ్నీధ్రే జుహోతి సువర్గస్య లోకస్యాభినీత్యై [10]గ్రావ్ణో
వాయవ్యాని ద్రోణకలశ మాగ్నీధ్ర ఉప వాసయతి[11]వి హ్యేనం తై ర్గృహ్ణతే యత్సహోపవాసయే దపు
వాయేత [12]సౌమ్యర్చా ప్ర పాదయతి స్వయా (౩) ఏవైనం దేవతయా ప్ర పాదయ[13]త్యదిత్యాః
సదోఽ స్యదిత్యాః సద ఆ సీదేత్యాహ యథాయజురేవైత [14]ద్యజమానో వా ఏతస్య పురా గోప్తా
భవత్యేష వో దేవ సవితః సోమ ఇత్యాహ సవితృప్రసూత ఏవైనం దేవతాభ్యః సం ప్ర యచ్ఛ[15]

త్యేతత్త్వగ్ం సోమ దేవో దేవా నుపాగా ఇత్యాహ దేవో హ్యేష సన్ (౪) దేవా నుపైతీద మహం

మనుష్యో మనుష్యా నిత్యాహ మనుష్యోి హ్యేష సన్మనుష్యా నుపైతి యదేతద్యజు ర్న బ్రూయాద

ప్రజా అపశుర్యజమానః స్యాత్సహ ప్రజయా సహ రాయస్పోషేణేత్యాహ ప్రజయైవ పశుభిః సహేమం

లోక ముపావర్తతే [16] నమో దేవేభ్య ఇత్యాహ నమస్కారో హి దేవానాగ్ం స్వధా పితృభ్య ఇత్యాహ

స్వధాకారో హి (౫) పితృణా [17] మిద మహం నిర్వరుణస్య పాశాదిత్యాహ వరుణపాశాదేవ నిర్ము

చ్యతే [18] ఽగ్నే వ్రతపత ఆత్మనః పూర్వా తనూ రాదేయేత్యాహః కో హి తద్వేద యద్వసీయాన్త్స్వే

వశే భూతే పునర్వా దదాతి న వేతి [19] గ్రావాణో వై సోమస్య రాజ్ఞో మలిమ్లుసేనా య ఏవం

విద్వాన్గ్రావ్ణ ఆగ్నీధ్ర ఉపవాసయతి నైనం మలిమ్లుసేనా విన్దతి (౬)||

[అథ దదతే స్వయా సన్స్వధాకారో హి విన్దతి]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః||౨||

## వేదార్థదీపిక

అవతారిక: ప్రథమానువాకమునందు ధిష్ణియములను గుఱించి వివరించఁబడినది. ఈ ద్వితీయానువాకమునందు వైసర్జన హోమ మంత్రములకు వ్యాఖ్యాన రూపమైన బ్రాహ్మణము చెప్పఁబడుచున్నది. ఈ వైసర్జన హోమ మంత్రములు ప్రథమ కాండస్థ తృతీయ ప్రపాఠక గత చతుర్థానువాకములోనివి.

1. అర్థము: వైసర్జనాని యత్=వైసర్జన హోమము లేవి కలవో, ఏతాని=ఇవి, సువర్గాయ లోకాయ వై=స్వర్గలోకముకొఱకే, హూయన్తే=హోమము చేయఁబడుచున్నవి.

తాత్పర్యము: అవాంతర దీక్షను విసర్జించుటకై చేయఁబడు హోమములు వైసర్జనములు. ఈ వైసర్జన హోమములు స్వర్గ లోకముకొఱకు చేయఁబడుచున్నవి. స్వర్గముకొఱకు వైసర్జన హోమములు చేయవలెనని ఈ మంత్రము విధించుచున్నది.

2. అర్థము: ప్రతిష్ఠిత్యై=ప్రతిష్ఠకొఱకు, ద్వాభ్యామ్="త్వగ్ం సోమ జుషాణ" ఇత్యాదికములైన రెండు మంత్రముల చేత, గార్హపత్యే=గార్హపత్యాగ్నియందు, జుహోతి=హోమము చేయవలయును. యజమానః=యజమానుఁడు, ద్విపాత్=రెండు పాదములు కలవాఁడు. ఆగ్నీధ్రే=ఆగ్నీధ్రీయ మనెడి ధిష్ణియమునందు, జుహోతి=[విధా

స్యమానమైన "ఆగ్నే నయ సుపథా" ఇత్యాది మంత్రముచే] హోమము చేయవలయును. [అనేన=ఈ హోమముచేత] అన్తరిక్షే ఏవ=అంతరిక్షమునందే, ఆక్రమతే=యజమానుఁడు ఆక్రమించుచున్నాఁడు. ఆహవనీయే=ఆహవనీయమునందు, జుహోతి="ఉరు విష్ణో విక్రమస్వ" ఇత్యాది మంత్రముచే హోమము చేయవలయును. (అయమ్=ఈ హోమము, యజమానమ్=యజమానుని,) సువర్గం లోకమ్=స్వర్గలోకమును, సమయత్యేవ=నిశ్చయముగ పొందించుచున్నది.

తాత్పర్యము: యజమానుఁడు రెండు పాదములు కలవాఁడు కనుక ప్రతిష్ఠ కొఱకు "త్వగ్ం సోమ జుషాణ" ఇత్యాదికములైన రెండు మంత్రములచే గార్హపత్యాగ్నియందు హోమము చేయవలెను. ఆగ్నీధ్రీయమునందు "అగ్నే నయ సుపథా" ఇత్యాది మంత్రముచే హోమము చేయవలెను. ఈ హోమముచే యజమానుఁడు అంతరిక్షమునే యాక్రమించును. ఆహవనీయమునందు "ఉరు విష్ణో విక్రమస్వ" ఇత్యాది మంత్రముచే హోమము చేయవలెను. ఈ హోమము యజమానునకు నిశ్చయముగ స్వర్గమును కలుగఁజేయును. [ఇచట హోమ విశేషములు చెప్పఁబడినవి.)

3. అర్థము: రక్షాంసి=రాక్షసులు, సువర్గం లోకమ్=స్వర్గలోకమును గూర్చి, యతః=వెళ్లుచున్నవారై, దేవాన్ వై=దేవతలనే, అజిఘాంసన్=హింసింపఁదలఁచిరి. తే=ఆ దేవతలు, సోమేన రాజ్ఞా=సోమరాజుచే, రక్షాంసి=రాక్షసులను, అపహత్య=పోఁగొట్టి, ఆత్మానమ్=తమశరీరమును, అప్తుమ్=అసురులు పొందుట కశక్యమైన అల్పదేహమునుగా, కృత్వా=చేసి, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, ఆయన్=పొందిరి. రక్షసామ్=రాక్షసుల యొక్క, అనుపలాభాయ=అనుపలబ్ధికొఱకు, సోమః=సోమము, ఆత్తః=స్వీకృత మైనది. అథ=అనంతరము, రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=అపహతికొఱకు, వైసర్జనాని జుహోతి=వైసర్జన హోమములను చేయవలెను.

తాత్పర్యము: హోమమునకు పూర్వమే బ్రహ్మ సోమమును స్వీకరించవలయునని ఈ మంత్రము విధించుచున్నది. రాక్షసులు స్వర్గమునకు పోవుచు దేవతలనే హింసించవలెనని తలఁచిరి. కాని, యా దేవతలు సోమరాజుచే రాక్షసులను పోఁగొట్టి తమ శరీరమును రాక్షసులు పొందుట కశక్యమైన అల్పదేహమునుగాఁ జేసి స్వర్గలోకమును పొందిరి. కావున రాక్షసులకు లభించకుండుటకై సోమమును బ్రహ్మ యను ఋత్విజుఁడు స్వీకరించవలయును. అనంతరము రాక్షసులను పోఁగొట్టుటకై యజ్ఞకర్త వైసర్జన హోమములను చేయవలయును.

4. అర్థము: "త్వగ్ం సోమ తనూకృద్భ్యః" ఇతి ఆహ="ఓ సోమమా! నీవు శరీరమును ఛేదించునట్టి రాక్షసులకు (కూడ) నియంతవు" అని ఈ మంత్రము చెప్పినది. ఏషః=ఈ సోమము, తనూకృత్ హి=శరీరమును ఛేదించునది కదా!

తాత్పర్యము: సోమము అత్యంతము శరీర ఛేదకము కావున, రాక్షసులకు నియంత యని "త్వగ్ం సోమ" అను మంత్రము చెప్పినది. ఈ మంత్రముయొక్క ప్రథమ భాగము, సోమముయొక్క సామర్థ్యమును తెలియఁజేసినది.

5. అర్థము: "ద్వేషోభ్యోఽన్యకృతేభ్యః" ఇతి ఆహ='ఓ సోమమా! మమ్ము విరోధించునట్టి శత్రువులచే ప్రేరితులయిన వారికి నియంత వగుచున్నావు' అని "త్వగ్ం సోమ" అను మంత్రముయొక్క ద్వితీయభాగము చెప్పినది. రక్షాంసి=రాక్షసులు, అన్యకృతాని హి=ఇతరులచే ప్రేరితులు కదా! ద్విషన్తీతి ద్వేషాంసి=ద్వేషించువారు.

తాత్పర్యము: అన్యకృతులు రాక్షసులు అని "త్వగ్ం సోమ" అను మంత్రములోని ద్వితీయ భాగము శేషమును పూరించినది.

6. అర్థము: "ఉరు యన్తాఽసి వరూథమ్" ఇతి ఆహ="ఓ సోమమా! నీవు ఆ రాక్షసులకు నియన్త వగుచున్నావు. ఆ కారణమువలన మాకు గొప్ప బల మగుచున్నావు" అని "త్వగ్ం సోమ" అను మంత్రముయొక్క తృతీయ భాగము చెప్పినది. నః=మాకు, ఉరు=గొప్ప (రక్షణమును), కృధి=చేయుము. ఇతి వావ=ఈ యర్థమునే, ఏతత్=ఈ మంత్రము, ఆహ=చెప్పెను.

తాత్పర్యము: 'ఓ సోమమా! నీవు రాక్షసులకు నియన్త వగుచున్నావు. కావున మాకు గొప్ప బల మగుచున్నావు' అని మంత్ర తృతీయభాగము చెప్పినది. 'ఓ సోమమా! నీవు మాకు గొప్ప రక్షణమును చేయు మనియే' ఆ మంత్రము చెప్పినదని ఈ బ్రాహ్మణము వివరించినది. "ఉరు వరూథమ్" అను మంత్రభాగముయొక్క శేషమును ఈ బ్రాహ్మణము పూరించినది.

7. అర్థము: "జుషాణో అప్తు రాజ్యస్య వేతు" ఇతి ఆహ="ఓ సోమమా! నీవు (మాయందు) ప్రీతి కలదానవై రాక్షసులకు కనఁబడకుండుటకై అల్ప దేహము కలదానవగుచు ఆజ్య బిందువును త్రాగుము" అని ద్వితీయ మంత్ర భాగము చెప్పినది. (అయమ్=ఈ సోమము,) రక్షసామ్=రాక్షసులకు, అనుపలాభాయ=లభింపకుండుటకై, యజమానమ్=యజమానుని, అప్తుమేవ=అల్పదేహిని గానే, కృత్వా=చేసి, సువర్గం లోకమ్=స్వర్గలోకమును. గమయతి=పొందించుచున్నది.

తాత్పర్యము: "ఓ సోమమా! నీవు మాయందు ప్రీతి కలదానవై రాక్షసులకు కనఁబడకుండుటకై అల్ప శరీరము కల దానవగుచు నాజ్య బిందువును త్రాగుము" అని ద్వితీయ మంత్ర భాగము చెప్పుటచే, ఈ సోమము రాక్షసులకు లభింపకుండుటకై యజమానుని అల్ప శరీరునిగా చేసి స్వర్గమునకు చేర్చునని ఈ బ్రాహ్మణము వివరించినది.

8. అర్థము: (యజమానః=యజమానుఁడు,) సోమమ్=సోమమును, ఆ దదీత=తీసికొన వలయును, గ్రావ్ణః=అభిష వార్థములైన ఱాలను, ఆ దదీత. వాయవ్యాని=ఉలూఖల సదృశములైన గ్రహ పాత్రములను, ఆ దదీత. ద్రోణకలశమ్=ద్రోణకలశమును, ఆ దదీత. పత్నీమ్=యజమాన పత్నిని, ఉత్=(ఉత్థాప్య) పైకి లేవఁదీసి, ఆ నయన్తి=తీసికొని రావలయును. అనాంసి=శకటములను, అను=అప్పుడు, (మాటి మాటికి) ప్ర వర్తయన్తి=ప్రవర్తింపఁజేయవలయును. ఏవం సతి=ఇట్లు కాఁగా, అస్య=ఈ యజమానునకు, యావ దేవ=స్వీయము ఏమాత్రము, అస్తి=కలదో, తేన సహ=తత్సర్వముతోఁగూడ, సువర్గం లోకమ్=స్వర్గలోక మును, ఏతి=పొందుచున్నాఁడు. (ఉలూఖలము=ఱోలు. ద్రోణకలశము=కొయ్యతో చేయఁబడిన ప్రౌఢమైన పాత్రము. గ్రావ్ణః=గ్రావాణః. సోమాభిషవమునకై యుపయోగించు ఱాలు.)

తాత్పర్యము: యజమానుఁడు ప్రాచీనవంశమునుండి బయలుదేరి ఆగ్నీధ్రస్థానమునకు పోవుట కిచ్ఛయించినవాఁడై హవిర్ధా నమునకు తీసికొని పోవుటకై పైని చెప్పఁబడిన సోమాదులను తీసికొనవలయును. ఈ విధముగ చేయఁగా యజమానుఁడు తనకుఁగల సర్వస్వముతోడను స్వర్గమునకు పోవును. యజమానపత్నిని తాను ఉన్న ప్రదేశ మునుండి లేవఁదీసి ఆగ్నీధ్ర స్థానమునకు తీసికొని రావలయును. వ్రీహ్యాదులైన ఔషధద్రవ్యముల నిమిత్తము తృతీయ శకటమును నడిపించవలయును. ఆ ఒక్క శకటమే మాటి మాటికి తిరుగుచుండుటవలన 'అనాంసి' అని బహువచనము ప్రయుక్తమైనది.

9. అర్థము: సువర్గస్య లోకస్య=స్వర్గ లోకమునకు, అభినీత్యై= అభిముఖముగ పొందించుటకై, నయవతీ='నయ' శబ్ద ఘటితమైన, ఋచా="అగ్నే నయ సుపథా" అను ఋక్కుచే, ఆగ్నీధ్రే=ఆగ్నీధ్రీయ ధిష్ణియమునందు, జుహోతి= హోమము చేయవలెను.

తాత్పర్యము: స్వర్గలోక ప్రాప్తికై నయ శబ్ద ఘటితమైన "అగ్నే నయ సుపథా" అను ఋక్కుచే హోమము చేయవలెను. (ఇది పైసర్జన హోమ విధి. ఈ హోమ విధి రెండవ మంత్ర వ్యాఖ్యానమున సూచింపఁబడినది.)

10. అర్థము: గ్రావ్ణః=(అభిషవమునకై ఉపయోగించు) ఱాలను, వాయవ్యాని=ఉలూఖల సదృశములైన గ్రహపాత్రములను, ద్రోణకలశమ్=కొయ్యతో చేయఁబడిన ప్రౌఢ పాత్రమును, ఆగ్నీధ్రే=ఆగ్నీధ్రస్థానమునందు, ఉప వాసయతి= దగ్గఱ స్థాపించవలెను.

తాత్పర్యము: పైని చెప్పిన వస్తువులను ఆగ్నీధ్రస్థాన సమీపమున నుంచవలయును.

11. అర్థము: ఏనమ్=ఈ సోమమును, తైః=ఆ గ్రావాదులతో, వి గృహ్ణాతే హి=వేఱు చేసి తీసికొనవలయును. సహ=గ్రావాదులతో కూడ, ఉప వాసయేత్ యత్=అగ్నీధ్ర సమీపమున నుంచినచో, అపువాయేత హి=(సోమ మధ్యభాగము) దుర్గంధము కలది యగును కదా!

తాత్పర్యము: సోమమును గ్రావాదులనుండి వేఱుచేసి హవిర్ధానమునకు తీసికొని పోవుటకై గ్రహించవలెను. ఈ సోమమును గ్రావాదులతో కూడ అగ్నీధ్ర సమీపమున నుంచినచో అభిషవ భీతిచే సోమ మధ్యభాగము దుర్గంధ యుక్తమగును. ( గ్రావాదులకు వలె సోమమునకు కూడ అగ్నీధ్ర సమీపమున స్థాపనము ప్రాప్తించుచుండఁగా దానిని వారించుటకై గ్రహణము ఇచట విధింపఁబడినది.)

12. అర్థము: సౌమ్యర్చా=సోమపద ఘటితమైన "సోమో జిగాతి గాతువిత్" అను ఋక్కుచే, ప్ర పాదయతి=హవిర్ధానమునందు ప్రవేశపెట్టవలయును. (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు, ఏనమ్=ఈ సోమమును, స్వయా దేవతయైవ=స్వీయ దేవతచేతనే, ప్ర పాదయతి=ప్రవేశపెట్టినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: సోమమును బ్రహ్మనుండి తీసికొని పూర్వద్వారము ద్వారా సోమపద ఘటితమైన "సోమో జిగాతి గాతువిత్" అను ఋక్కును పఠించుచు హవిర్ధానమునందు ప్రవేశపెట్టవలయును. ఇట్లు చేసినచో సోమమును స్వీయదేవతచేతనే ప్రవేశపెట్టిన ట్లగును. (ఇచట సోమమును హవిర్ధానందు ప్రవేశపెట్టుట విధింపఁబడినది.

13. అర్థము: "అదిత్యాః సదోఽస్యదిత్యాః సద ఆ సీద" ఇతి ఆహ="ఓ కృష్ణాజినమా! నీవు భూదేవికి సదోరూపమగుచున్నావు. భూమియొక్క సదమునందు ఉపవసించుము" అని ఈ మంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః=మంత్రోక్తము ననుసరించియే ఉన్నది. ఈ మంత్రము కాం. 1, ప్ర. 3, అను. 4. న వివరింపఁబడినది.

తాత్పర్యము: స్పష్టము

14. అర్థము: "యజమానో వా ఏతస్య పురా గోప్తా భవత్యేష వో దేవ సవితః సోమః" ఇతి ఆహ="పూర్వము (ఇప్పటివఱకు) యజమానుఁడే సోమమునకు రక్షకుఁడుగా నుండెను. ఓ సవితృదేవా! ఈ సోమము ఇతః పరము మీకు సంబంధించినది." (ఈ సోమమును మీరు రక్షించవలయును) అని ఈ మంత్రము చెప్పెను. సవితృ ప్రసూతే ఏవ=సవితృదేవుని యనుజ్ఞ ననుసరించియే, దేవతాభ్యః=దేవతలకొఱకు, ఏనమ్=ఈ సోమమును, సం ప్ర యచ్ఛతి=మిక్కిలి ప్రకర్షముగా నీయవలెను.

తాత్పర్యము: "ఓ సవితృదేవా! ఇప్పటివఱకు ఈ సోమమును యజమానుఁడు రక్షించెను. ఇప్పటినుండి మీరు రక్షింపవలయును" అని మంత్రమున సవితృదేవుఁడు మాత్రము సంబోధింపఁబడెను. 'వః' అను బహువచనాంతము వలన ఇంద్రాది దేవత లందఱిని సంబోధించవలయును. పరివృఢుఁడగుటచే అశేష దేవతోపలక్షణమునకై సవితయే సంబోధించఁబడెను. సవితృ దేవు ననుజ్ఞ ననుసరించియే యజమానుఁడీ సోమమును దేవతల కొసఁగవలయును. (ఇచట సవితృ సంబోధన తాత్పర్యము వివరింపఁబడినది.)

15. అర్థము: "ఏతత్త్వగ్ం సోమ దేవో దేవానుపాగా" ఇతి ఆహ="ఓ సోమమా! నీవు దేవత వగుచు ఇప్పుడు నీ దేవతలను పొందినవాడ వగుచున్నావు" అని యీ మంత్రము చెప్పినది. ఏషః=ఈ సోమము, దేవః సన్=దేవుఁ డగుచు, దేవాన్=దేవతలను, ఉపైతి హి=పొందు చున్నది కదా! "ఇద మహం మనుష్యో మనుష్యాన్" ఇతి ఆహ="ఓ సోమమా! మనుష్యుఁడనైన నేను ఇప్పుడు మనుష్యులను పొందుచున్నాను," అని "ఇద మహ" మిత్యాది మంత్రభాగము చెప్పినది. ఏషః=ఈ యజమానుఁడు, మనుష్యః సన్=మనుష్యుఁ డగుచు, మనుష్యాన్=మనుష్యులను, ఉపైతి హి=పొందుచున్నాఁడు కదా! ఏతత్=ఈ, యజుః=మంత్రము, న బ్రూయాత్ యత్=ఈ విధముగ చెప్పనిచో, యజమానః=యజమానుఁడు, అప్రజాః=సంతానము లేనివాఁడును, అపశుః=పశువులు లేని వాఁడును, స్యాత్=అగును. "సహ ప్రజయా సహ రాయస్పో

షేణ" ఇతి ఆహ="సంతానముతోను ధనసమృద్ధితోను కూడియున్నవాఁడనై మనుష్యులను పొందినవాఁడ నగుచున్నాను" అని "సహ ప్రజయా"ఇత్యాది మంత్రభాగము చెప్పినది. (యజమానః=యజమానుఁడు,) ప్రజయా=సంతానముతోను, పశుభిః=పశువులతోను, సహైవ=కూడియే, ఇమం లోకమ్=ఈ భూలోకమును గూర్చి, ఉపావర్తతే=తిరిగి వచ్చుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ మంత్రమునందు మూఁడు భాగములు కలవు. మొదటి రెండు మంత్ర భాగముల యర్థము ప్రసిద్ధమే యని ఈ బ్రాహ్మణము స్పష్టము చేసినది. "యజమానుఁడు సంతానముతోను ధన సమృద్ధితోను కూడియున్నవాడై మనుష్యులను పొందిన వాఁ డగుచున్నాఁడని" మూఁడవ మంత్రభాగము చెప్పనిచో, యజమానుఁడు సంతాన రహితుఁడు, పశు రహితుఁడు నగునని విపక్షబాధను వ్యక్తపఱచి, తృతీయ మంత్ర భాగము చెప్పుటవలన యజమానుఁడు స్వర్గలోకమునుండి భూలోకమునకు సంతాన సహితుఁడు గాను పశు సహితుఁడు గాను తిరిగి వచ్చునని యీ బ్రాహ్మణము విపక్ష బాధను తొలఁగించినది.

16. అర్థము: "నమో దేవేభ్యః" ఇతి ఆహ="దేవతలకొఱకు నమస్కారము" అని ఈ మంత్ర భాగము చెప్పినది. దేవానామ్=దేవతలకు, నమస్కారః హి=నమస్కారము కదా! "స్వధా పితృభ్యః" ఇతి ఆహ="పితృదేవతలకు స్వధాకారము" అని ఈ మంత్రభాగము చెప్పినది. పితృణామ్=పితృదేవతలకు, స్వధాకారః హి=స్వధాకారము కదా!

తాత్పర్యము: 'దేవతలకు నమస్కారము. పితృదేవతలకు స్వధాకారము' అని మంత్రద్వయము చెప్పినది. ఈ యర్థము ప్రసిద్ధమే యని ఈ బ్రాహ్మణము వివరించినది.

17. అర్థము: "ఇద మహం నిర్వరుణస్య పాశాత్" ఇతి ఆహ="ఓ సోమమా! నిన్ను ఇదుగో? వరుణపాశమునుండి విడిపించుచున్నాను" అని యీ మంత్రము చెప్పినది. వరుణపాశాదేవ=వరుణపాశమునుండియే, నిర్ముచ్యతే=విడిపింపఁబడుచున్నది.

తాత్పర్యము: "ఇద మహం నిర్వరుణస్య పాశాత్" అను మంత్రభాగమునందు 'నిర్' అని మాత్రమే యున్నది. కాని "ముఞ్చామి" అను క్రియాపదము లేదు. ఆ క్రియా పదమును 'నిర్' అను నుపసర్గముతో చేర్చి "నిర్ముఞ్చామి" అని అర్థము సమన్వయము చేయవలెనని ఈ బ్రాహ్మణము వివరించినది. ఓ సోమమా! నిన్ను ఇదుగో! వరుణ పాశమునుండి విడిపించుచున్నాను. (అని భావము.)

18. అర్థము: "అగ్నే వ్రతపతే" అనునది "అగ్నే వ్రతపతే త్వం వ్రతానాం వ్రతపతిరసి" ఇత్యాది మంత్రమునకు ప్రతీకము. ఆత్మనః=తనయొక్క, (యజమానునియొక్క,) పూర్వా తనూః=పూర్వపు శరీరము, ఆదేయా=అగ్నినుండి స్వీకరించఁదగినది, ఇతి=అని, ఆహుః=బుద్ధిమంతులు, చెప్పిరి. వసీయాన్=అత్యంత ధనికుఁడైన ప్రభువు, స్వే వశే భూతే=పరకీయ వస్తువు స్వాధీనము కాఁగా, పునః=మఱల, దదాతి వా=ఇచ్చునా? న వా=ఈయఁడా?, ఇతి యత్=అను నది ఏది కలదో, తత్=దానిని, కః=ఎవఁడు వేద హి=తెలిసికొనునో కదా !

తాత్పర్యము: అవాంతర దీక్షా స్వీకారారంభమునందు యజమానుఁడు తన శరీరమును అగ్నియందు, అగ్ని శరీరమును తనయందును సంకల్పముచే స్థాపించుకొని వ్రతనియమమును ప్రారంభించును. అవాంతర దీక్షానంతరము యజమానుఁడు తనశరీరమును తనయందును, అగ్ని శరీరమును అగ్నియందును ఉంచుచున్నట్లు "అగ్నే వ్రతపతే" ఇత్యాది మంత్రము చెప్పుచున్నది. అత్యంత ధనికుఁడైన ప్రభువు పరకీయ వస్తువును తాను స్వాధీనము చేసికొనిన పిమ్మట మఱల ఆ వస్తువును తద్వస్తుస్వామికి ఇచ్చునో! ఈయఁడో! ఎవ్వఁడెఱుఁగును? అని కొందఱు బుద్ధిమంతులు పలుకుచున్నారు. కావున వశీభావముకంటె ముందుగానే తనశరీరమును తీసికొనవలయునని ఈ బ్రాహ్మణముయొక్క తాత్పర్యము.

19. అర్థము: గ్రావాణః=సోమాభిషవార్థములైన పాషాణములు, సోమస్య రాజ్ఞః=సోమరాజుయొక్క, మలిమ్లుసేనా వై=విరోధి తస్కర సేనయే. యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ విధముగ, విద్వాన్=తెలిసికొనినవాఁడై, ఆగ్నీధ్రే=ఆగ్నీధ్రీయ ధిష్ణియమునందు, ఉప వాసయతి=సమీపమున నుంచుచున్నాఁడో, ఏనమ్=ఈ యజమానుని, మలిమ్లుసేనా=విరోధి తస్కర సేన, న విన్దతి=పొందుట లేదు.

తాత్పర్యము: సోమము నభిషవము చేయుటకు సాధనములైన పాషాణములు సోమరాజుయొక్క విరోధిసేనయే అని తెలిసికొనినవాఁడై యజమానుఁడు ఆ పాషాణములను ఆగ్నీధ్రీయ ధిష్ణియము సమీపమున నుంచినచో, ఆ యజమానుని విరోధి తస్కర సేన పొందదు. [పదవ మంత్రమునందు చెప్పఁబడిన 'ఆగ్నీధ్రమునందు గ్రావాదుల స్థాపనము' ఇచట ప్రశంసించఁబడినది.]

ద్వితీయానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే తృతీయోఽనువాకః

మూలము: [1]వైష్ణవ్యర్చా హుత్వా యూపమచ్ఛైతి వైష్ణవో వై దేవతయా యూపః స్వయైవైనం దేవతయాఽ
చ్ఛై[2]త్యత్యన్యానగాం నాన్యానుపాగా మిత్యాహాతి హ్యన్యానేతి నాన్యానుపైత్యర్వాక్త్వా పరైరవిదం
పరోఽవరై రిత్యాహార్వాగ్ఘ్యేనం పరైర్విన్దతి పరోఽవరైస్తం త్వా జుషే (౧) వైష్ణవం దేవయ
జ్యాయా ఇత్యాహ దేవయజ్యాయై హ్యేనం జుషతే[3] దేవస్త్వా సవితా మధ్వాఽనక్త్విత్యాహ తేజసై
వైన మనక్త్యోషధే త్రాయస్వైనగ్ం స్వధితే మైనగ్ం హిగ్ంసీరి త్యాహ వజ్రో వై స్వధితిః శాన్త్యై[4]
స్వధితే ర్వృక్షస్య బిభ్యతః ప్రథమేన శకలేన సహ తేజః పరా పతతి యః ప్రథమః శకలః పరా
పతే త్తమప్యా హరేత్సతేజసమ్ (౨) ఏవైనమా హరతి[5]మే వై లోకా యూపాత్ప్రయతో బిభ్యతి
దివ మగ్రేణ మా లేఖీరన్తరిక్షం మధ్యేన మా హిగ్ంసీ రిత్యాహైభ్య ఏవైనం లోకేభ్యః శమయతి
[6]వనస్పతే శతవల్శో విరోహేత్యావ్రశ్చనే జుహోతి తస్మా దావ్రశ్చనా ద్వృక్షాణాం భూయాగ్ంస
ఉత్తిష్ఠన్తి [7] సహస్రవల్శా వి వయగ్ం రుహేమేత్యాహాఽఽశిష మేవైతామా శాస్తే[8]ఽనక్షసఙ్గమ్(౩)
వృశ్చే[9]ద్యదక్షసఙ్గం వృశ్చేదధశీర్షం యజమానస్య ప్రమాయుకగ్ం స్యా[10]ద్యం కామయేతాప్రతిష్ఠితః
స్యాదిత్యారోహం తస్మై వృశ్చేదేష వై వనస్పతీనా మప్రతిష్ఠితో ఽప్రతిష్ఠిత ఏవ భవతి[11]యం
కామయేతాపశుః స్యాదిత్యపర్ణం తస్మై శుష్కాగ్రం వృశ్చేదేష వై వనస్పతీనా మపశవ్యో ఽపశు
రేవ భవతి[12]యం కామయేత పశుమాన్త్స్యాదితి బహుపర్ణం తస్మై బహుశాఖం వృశ్చేదేష వై (౪)
వనస్పతీనాం పశవ్యః పశుమానేవ భవతి[13]ప్రతిష్ఠితం వృశ్చే త్ప్రతిష్ఠాకామస్యైష వై వనస్పతీనాం

ప్రతిష్ఠితో యః సమే భూమ్యై స్యాద్యోనే రూఢః ప్రత్యేవ తిష్ఠతి[14] యః ప్రత్యఙ్ఙుపనతస్తం వృశ్చేత్ప

హి మేధమభ్యుపనతః [15] పఞ్చారత్నిం తస్మై వృశ్చేద్యం కామయేతోపైన ముత్తరో యజ్ఞో నమేదితి

పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞ ఉపైన ముత్తరో యజ్ఞః (౫) నమతి షడరత్నిం ప్రతిష్ఠాకా

మస్య షడ్వా ఋతవ ఋతుష్వేవ ప్రతి తిష్ఠతి సప్తారత్నిం పశుకామస్య సప్తపదా శక్వరీ పశవః

శక్వరీ పశూనేవావ రున్ధే నవారత్నిం తేజస్కామస్య త్రివృతా స్తోమేన సంమితం తేజస్త్రివృత్తేజ

స్వ్యేవ భవత్యేకాదశారత్ని మిన్ద్రియకామస్యైకాదశాక్షరా త్రిష్టుగిన్ద్రియం త్రిష్టుగిన్ద్రియావ్యేవ భవతి

పఞ్చదశారత్నిం భ్రాతృవ్యవతః పఞ్చదశో వజ్రో భ్రాతృవ్యాభిభూత్యై సప్తదశారత్నిం ప్రజాకామస్య

సప్తదశః ప్రజాపతిః ప్రజాపతే రాప్త్యై ఏకవిగ్ంశత్యరత్నిం ప్రతిష్ఠాకామస్యైకవిగ్ంశః స్తోమానాం ప్రతిష్ఠా

ప్రతిష్ఠిత్యా [16] అష్టా ర్భవత్యష్టాక్షరా గాయత్రీ తేజో గాయత్రీ గాయత్రీ యజ్ఞముఖం తేజసైవ

గాయత్రియా యజ్ఞముఖేన సంమితః(౬)||

[జుషే సతేజస మనక్షసఙ్గం బహుశాఖం వృశ్చేదేష వై యజ్ఞ ఉపైనముత్తరో యజ్ఞ ఆప్త్యై ఏకా
న్నవిగ్ంశతిశ్చ||]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే తృతీయోఽనువాకః ||3||

## వేదార్థదీపిక

అవతారిక: ద్వితీయానువాకమునందు అగ్నీషోమీయ ప్రణయనార్థములైన వైసర్జన హోమములు చెప్పఁబడినవి. అగ్నీషోమీయ పశ్వంగమైన యూపఖండనమును గూర్చి యీ తృతీయానువాకమునందు చెప్పఁబడుచున్నది. ప్రథమ కాండములోని తృతీయ ప్రపాఠకస్థ పంచమానువాకమునందలి మంత్రములకు ఈ అనువాకము వివరణాత్మకము.

1. అర్థము: వైష్ణవ్యర్చా="ఉరు విష్ణో విక్రమస్వ" అను ఋక్కుచేత, హుత్వా=[ఆహవనీయాగ్నియందు యూపాహుతిని] హోమము చేసి, యూపమ్= యూపమును, అచ్ఛ=పొందుటకు, ఏతి=వెళ్లవలయును. యూపః=యూపము, దేవతయా=దేవతచే, వైష్ణవః వై=విష్ణుసంబంధియే. [ఏవం కృతవాన్=ఈ విధముగ చేసిన, యజమానః=యజమానుఁడు,] స్వయా దేవతయైవ=స్వీయ దేవతచేతనే, ఏనమ్= ఈ యూపమును, అచ్ఛ=పొందుటకు, ఏతి= వెళ్లుచున్నాఁడు.

తాత్పర్యము: [అగ్నిష్టోమయాగమున ఉపయోగించునట్టి యూపస్తంభమును గూర్చి ప్రథమ కాండమునందలి తృతీయ ప్రపాఠకమునందు విశేషముగ వివరింపఁబడినది. ఆ యూపమును గుఱించి ఇచట కొన్ని విధులు చెప్పఁబడుచున్నవి.] యజమానుఁడు యూపవృక్షము దగ్గఱకు పోవుటకు పూర్వము "ఉరు విష్ణో విక్రమస్వ" అను ఋక్కును పఠించుచు ఆహవనీయాగ్నియందు యూపమునకు సంబంధించిన ఆహుతిని హోమము చేసి పిమ్మట యూపవృక్షమును పొందుటకు పోవలయును. యూపము విష్ణుదేవతాకమే కావున ఈ విధముగ చేసిన యజమానుఁడు స్వీయ దేవతచేతనే యూపమును పొందుటకు వెళ్లినవాఁడగుచున్నాఁడు.

2. అర్థము: "అత్యన్యానగాం నాన్యానుపాగామ్" ఇతి ఆహ="ఓ యూపవృక్షమా! నీకంటె నితరములైన (సమప్రదేశ జన్మాది లక్షణ రహితములైన) వృక్షములను అతిక్రమించి వచ్చితిని. యూపార్హములు కాని యితర వృక్షములను పొందలేదు." అని "అత్యన్యానగామ్" ఇత్యాది మంత్రము చెప్పినది. అన్యాన్=ఇతర యూపవృక్షములను, అత్యేతి హి=అతిక్రమించుచున్నాఁడు కదా! అన్యాన్=యూపార్హములు కాని వృక్షములను, నోపైతి =పొందుటలేదు. "అర్వాక్త్వా పరైః రవిదం పరోఽవరైః" ఇతి ఆహ="ఓ యూపవృక్షమా! ఉత్కృష్ట లక్షణములచే ప్రత్యాసన్నము, నికృష్టలక్షణములచే దూరవర్తియు నగు నిన్ను పొందితిని" అని "అర్వాక్త్వా" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. పరైః అర్వాక్=ఉత్కృష్ట లక్షణములచే ప్రత్యాసన్నము, పరోఽవరైః= నికృష్టలక్షణములచే దూరస్థమైనదియునగు, ఏనమ్=ఈ యూపవృక్షమును, విన్దతి= (యజమానుఁడు) పొందుచున్నాఁడు. "తం త్వా జుషే వైష్ణవం దేవయజ్యాయై" ఇతి ఆహ="ఓ యూపవృక్షమా! విష్ణుదేవతాకమైన అటువంటి నిన్ను దేవయజనముకొఱకు సేవించుచున్నాను." అని "తం త్వా" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. (యజమానః= యజమానుఁడు,) ఏనమ్=ఈ యూపార్హ వృక్షమును, జుషతే హి=సేవించుచున్నాఁడు కదా!

తాత్పర్యము: "అత్యన్యానగాం నాన్యానుపాగామ్" ఇత్యాది మంత్రము లన్నియు ప్రథమ కాండమున వ్యాఖ్యానింపఁబడినవి. ఆ యర్థము ప్రసిద్ధమే అని యీ బ్రాహ్మణము చెప్పినది.

3. అర్థము: "దేవ స్త్వా సవితా మధ్వాఽనక్తు" ఇతి ఆహ="ఓ వృక్షమా! సవితృదేవుఁడు నిన్ను మధురమైన ఆజ్యముతో తడుపుఁగాక" అని యీ మంత్ర భాగము చెప్పుటచే, తేజసైవ=తేజస్సుచేతనే, ఏనమ్=ఈ యూపవృక్షమును, అనక్తి=తడుపుచున్నవాఁడగుచున్నాఁడు. "ఓషధే త్రాయస్వైనగ్ం స్వధితే మైనగ్ం హిగ్ంసీః" ఇతి ఆహ=ఓ యోషధి విశేషమా! ఈ యజమానుని రక్షించుము. ఓ స్వధితీ! ఈ యూపవృక్షమును హింసింపకుము అని ఈ మంత్ర భాగము చెప్పినది. స్వధితిః=స్వధితి యను ఖడ్గవిశేషము, వజ్రః వై=వజ్రాయుధ (సదృశ)మే. (ఇయమ్ ఈ ప్రార్థన,) శాన్త్యై శాంతికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: "ఓ యూపవృక్షమా! సవితృదేవుఁడు నిన్ను మధురమైన ఆజ్యముతో తడుపుఁగాక" అని చెప్పుటచే యజమానుఁడు యూపవృక్షమును తేజస్వంతముగానే చేసినవాఁ డగుచున్నాఁడు. "ఓ వృక్ష విశేషమా! ఈ యజమానుని రక్షించుము. ఓ స్వధితీ! ఈ యూపవృక్షమును హింసింపకుము." అని చెప్పుటచే స్వధితి వజ్రాయుధము వంటిది కావున ఈ విధముగ చెప్పుట శాంతికొఱ కగును. (స్వధితి= ఖడ్గవిశేషము.)

4. అర్థము: స్వధితేః=స్వధితి యను ఖడ్గవిశేషమువలన, బిభ్యతః=భయపడుచున్న, వృక్షస్య=యూప్యవృక్షముయొక్క, ప్రథమేన శకలేన సహ=ప్రథమ శకలముతోఁ గూడ, తేజః=తేజస్సు, పరాపతతి=అంతటను పడుచున్నది. యః ప్రథమః శకలః=ఏ ప్రథమ శకలము, పరాపతేత్=పడిపోవునో, తమపి=దానినిఁ గూడ, ఆహరేత్=తీసికొనవలెను. (తదా=అప్పుడు, యజమానః=యజమానుఁడు,) ఏనమ్=ఈ యూప్య వృక్షమును, సతేజసమేవ=తేజస్సహితమును గానే, ఆహరతి=తీసికొనినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: స్వధితి యను ఖడ్గ విశేషమువలన భయపడుచున్న వృక్షము యొక్క ప్రథమ శకలముతో గూడ తేజస్సు అంతటను పడును. పడిపోయిన ప్రథమ శకలమును యజమానుఁడు గ్రహించవలెను. తీసికొనినచో, యజమానుఁడు ఈ వృక్షమును తేజస్సహితమును గానే గ్రహించినవాఁ డగును. [యూపమునకై యూపార్హమైన వృక్షమును నఱికిన సమయమున మొదట క్రింద పడిన శకలము ప్రథమ శకల మనఁబడును. ఇచట ప్రథమ శకలాహరణము విహితమైనది.]

5. అర్థము: ప్రయతః=పడుచున్న, యూపాత్=యూపమువలన, ఇమే లోకాః వై=ఈ భూరాది లోకములే, బిభ్యతి=భయపడుచున్నవి. (తత్=ఆ కారణమువలన,) "దివ మగ్రేణ మా లేఖీ రన్తరిక్షం మధ్యేన మా హిగ్ంసీః" ఇతి ఆహ="ఓ ఛిన్న వృక్షమా! నీవు పడుచు అగ్రముచే దివిని చీల్చకుము. మధ్యభాగముచే అంతరిక్షమును హింసింపకుము." అని యీ మంత్రభాగము చెప్పెను. (ఏవమ్=ఈ విధముగ, ప్రార్థయమానః=ప్రార్థించుచున్న యజమానుఁడు,) ఏనమ్=ఈ యూప్య వృక్షమును, లోకేభ్యః=లోకములకొఱకు, శమయత్యేవ=నిశ్చయముగ శాంతింపఁజేయుచున్నాఁడు.

తాత్పర్యము: వృక్షమును ఛేదించినప్పుడు అది క్రింద పడును. అది పడునప్పుడు దానివలన లోకములు భయపడును. అందువలన దివిని అగ్రముచేతను, అంతరిక్షమును మధ్యభాగము చేతను హింసించవలదని కోరుటవలన ఈ వృక్షమును లోకములకొఱకు శాంతింపఁజేసినవాఁ డగును.

6. అర్థము: "వనస్పతే శతవల్శో వి రోహ" ఇతి="ఓ వృక్షమా! నీవు అనేక శాఖావిశేషములు కలదానవుగా మొలువుము" అను మంత్రముచేత, ఆవ్రశ్చనే=వృక్షముయొక్క ఛిన్నప్రదేశమునందు, జుహోతి=హోమము చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, వృక్షాణామ్=వృక్షములయొక్క, ఆవ్రశ్చనాత్=ఛిన్నప్రదేశమునుండి, ఉత్తిష్ఠన్తి=ఉద్భవించుచున్నవి.

తాత్పర్యము: యజమానుఁడు "వనస్పతే శతవల్శో విరోహ" అను మంత్రమును పఠించుచు వృక్షముయొక్క ఛిన్న ప్రదేశమునందు హిరణ్యమునుంచి దానిపైని హోమము చేయవలెను. ఆ కారణమువలన వృక్షముల ఛిన్న ప్రదేశములనుండి అనేక శాఖలు ఉద్భవించు చున్నవి. (ఇచట హోమము విహిత మైనది. "అథాఽఽవ్రశ్చనే హిరణ్యం నిధాయ" అను సూత్రము ననుసరించి 'హిరణ్యమునుంచి' అని తాత్పర్యమున వ్రాయఁబడినది.)

7. అర్థము: "సహస్ర వల్శా వి వయగ్ం రుహేమ" ఇతి ఆహ="ఓ వృక్షమా! మేము అనేక శాఖలు కలవారముగా వృద్ధినొందుదుము" అని చెప్పుటచే, ఏతామ్=దీనిని, ఆశిషమేవ=ఆశీస్సునుగానే, ఆ శాస్తే=యజమానుఁడు కోరుచున్నాఁడు.

తాత్పర్యము: "సహస్రవల్శా వి వయగ్ం రుహేమ" అని యజమానుఁడు చెప్పుటచే దీనిని ఆశీస్సును గానే కోరుచున్నాఁడు. (ఇచట ఆశీరర్థము వివక్ష చేయఁబడినది.)

8. అర్థము: అనక్షసఙ్గమ్=బండికి తగులకుండునట్లు, వృశ్చేత్=యూప్య వృక్షమును నఱకవలెను.

తాత్పర్యము: ఛిన్నావశిష్ట వృక్ష మూలభాగముపైని బండి పోవునపుడు ఆ ఛిన్నావశిష్టము బండికి తగులకుండునట్లు వృక్షమును నఱకవలెను.

9. అర్థము: అక్ష సఙ్గమ్=బండికి తగులునట్లుగా, వృశ్చేత్ యత్=వృక్షమును ఛేదించినచో, అధ ఈషమ్=శకటముయొక్క ఈషకు క్రింద, యజమానస్య=యజమాన సంబంధియగు గోవత్సాదికము, ప్రమాయుకమ్=మరణించునట్టిది, స్యాత్= అగును. ఈష=బండియొక్క ప్రాచీనమైన దీర్ఘకాష్ఠము.

తాత్పర్యము: ఛిన్నావశిష్టము బండికి తగులునట్లుగా వృక్షమును ఛేదించినచో, శకటముయొక్క ఈషక్రింద యజమాన సంబంధియగు గోవత్సాధికము మరణించునట్టి దగును.

10. అర్థము: అధ్వర్యుః=అధ్వర్యుఁడు, యమ్=ఏ యజమాను నుద్దేశించి, అప్రతిష్ఠితః=అప్రతిష్ఠితుఁడు, స్యాత్=అగుఁగాక, ఇతి=అని, కామయేత=కోరునో, తస్మై=ఆ యజమానునికొఱకు, ఆరోహమ్=వృక్షశాఖను, వృశ్చేత్=(యూప మునకై) ఛేదించవలెను. ఏషః వై=ఇదియే, వృక్షాణామ్=వృక్షములయొక్క, అప్రతిష్ఠితః=అప్రతిష్ఠిత భాగము. తదా=అప్పుడు, సః=ఆ యజమానుఁడు, అప్రతిష్ఠితః ఏవ=అప్రతిష్ఠితుఁడే, భవతి=అగుచున్నాఁడు.

తాత్పర్యము: (వృక్షమ్) ఆ రుహ్యా జాయత ఇతి ఆరోహః=శాఖావృక్షము నారోహించి పుట్టునది కావున, ఆరోహ మనఁగా శాఖ యని యర్థము. అది భూమియందు పుట్టినది కాదు కావున అప్రతిష్ఠితము. అధ్వర్యుఁడు ఏ యజమానుఁడు అప్రతిష్ఠితుఁడు కావలెనని తలఁచునో, ఆ యజమానునియొక్క యజ్ఞమునందు శాఖను యూపముగా నుపయోగించవలయును. అప్పుడు ఆ యజమానుఁడు అప్రతిష్ఠితుఁ డగును. (యూపమునకై శాఖాచ్ఛేదము యుక్తము కాదని యిచట శాఖాచ్ఛేదము నిషేధింపఁబడినది.)

11. అర్థము: యమ్=ఏ యజమాను నుద్దేశించి, (అధ్వర్యుః= అధ్వర్యుఁడు,) అపశుః=పశువిహీనుఁడు, స్యాత్=అగుఁగాక, ఇతి=అని, కామయేత=కోరునో, తస్మై=ఆ యజమానునికొఱకు, అపర్ణమ్= పర్ణములు లేనిదైన, శుష్కా గ్రమ్=శుష్కమైన అగ్రభాగమును, వృశ్చేత్=(యూపము నిమిత్తము,) ఛేదించవలెను. ఏషః=పర్ణరహితమైన ఈ శుష్కాగ్రము, అపశవ్యః వై= పశువులకు హితము కానిదియే. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) అపశుః ఏవ=పశు విహీనుఁడే, భవతి=అగుచున్నాఁడు. పర్ణము=ఆకు.

తాత్పర్యము: ఏ యజమానుఁడు పశువిహీనుఁడు కావలెనని అధ్వర్యుఁడు తలఁచునో, ఆ యజమానుని యజ్ఞమునందు, యూపమునకై పర్ణ రహితమైన వృక్షముయొక్క శుష్కాగ్రమును ఛేదించవలెను. పర్ణరహితమైన యీ శుష్కాగ్రము పశువులకు హితమైనది కాదు. కావున ఆ యజమానుఁడు పశుహీనుఁ డగును. (ఇచట యూపమునకై పర్ణరహితము కూడ నిషేధించఁబడినది.)

12. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, 'పశుమాన్ స్యాత్ ఇతి=(ఈ యజ మానుఁడు,) పశువులు కలవాఁ డగుఁగాక,' అని, కామయేత=కోరునో, తస్మై=ఆ యజమానునికొఱకు, బహుపర్ణమ్=అనేకము లయిన ఆకులు కలదియు, బహుశాఖమ్=అనేకములైన కొమ్మలు కలదియు నగు వృక్షమును, వృశ్చేత్=(యూపమునకై) ఛేదించవలెను. వనస్పతీనామ్=వృక్షములలో, ఏషః వై=ఇదియే, పశవ్యః=పశువులకు హితమైనది. సః=ఆ యజమానుఁడు, పశుమాన్=పశువులు కలవాఁడు, భవత్యేవ=నిశ్చ యముగ నగును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు ఏ యజమానుఁడు పశుమంతుఁడు కావలెనని తలఁచునో, ఆ యజమానుని నిమిత్తము బహు పర్ణములు బహుశాఖలును గల వృక్షమును యూపమునకై ఛేదించవలెను. వనస్పతులలో ఇదియే పశువులకు హితమైనది. ఆ యజమానుఁడు నిశ్చయముగ పశుమంతుఁ డగును. (వనస్పతిః=పూవక కాచెడు చెట్టు. వృక్షసామాన్యము అనియు అర్థము కలదు. ఇచట బహు పర్ణ వృక్షము యూపమునకై విధించఁబడినది.)

13. అర్థము: ప్రతిష్ఠాకామస్య=ప్రతిష్ఠను కోరునట్టి యజమానుని నిమిత్తము, ప్రతిష్ఠితమ్=స్వ బీజమునుండి పుట్టిన వృక్ష మును, వృశ్చేత్=( యూపమునకై) ఛేదించవలెను. యః=ఏ వృక్షము, సమే=సమ ప్రదేశమునందు, భూమ్యై=భూమియందు, (సప్తమ్యర్థే చతుర్థీ.) స్యాత్ యోనేః=తనకు కారణమైన బీజము (విత్తనము)

నుండి, రూఢః=మొలకెత్తినది, అభవత్=అయెనో, ఏషః వై= ఇదియే, వనస్పతీనామ్=వృక్షములలో, ప్రతి ష్ఠితః=ప్రతిష్ఠిత మైనది. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) ప్రతిష్ఠితః=ప్రతి ష్ఠితుఁడు, భవత్యేవ=నిశ్చయముగ నగును.

తాత్పర్యము: ప్రతిష్ఠను కోరునట్టి యజమానుని నిమిత్తము స్వ బీజమునండి పుట్టిన వృక్షమును యూపమునకై ఛేదించవ లెను. సమప్రదేశమైన భూమియందు స్వ బీజమునండి పుట్టిన వృక్షము వనస్పతులలో ప్రతిష్ఠితము కావున, ఈ యజమానుఁడు తప్పక ప్రతిష్ఠితుఁ డగును. (ఇచట సమప్రదేశ భూమియందు స్వబీజమునుండి పుట్టిన వృక్షము యూపమునకై ఛేదనార్థముగా విధించఁబడినది. "స్యాత్ యోనేః" అని మంత్రమునం దుండుట వలన వృక్షజన్య శాఖ వ్యావృత్త మైనది.)

14. అర్థము: యః=ఏ వృక్షము, ప్రత్యఙ్=పశ్చిమ దిక్కునందు, ఉపనతః=వంగినది, (స్యాత్=అగునో,) తమ్=ఆ వృక్షమును, వృశ్చేత్=( యూపమునకై,) ఛేదించవలెను. సః=ఆ వృక్ష(భాగము,) మేధమభి=యజ్ఞము నభిలక్షించియే, ఉపనతః హి=ఉపనత మైనది కదా!.

తాత్పర్యము: ఉత్తరవేదియందు చేయఁబడుచున్న యజ్ఞము యూప స్థానమునకు పశ్చిమముగా నుండును. పశ్చిమ దిక్కునందు ఉపనతమైన వృక్షమును యూపమునకై ఛేదించవలెను. అప్పుడు ఆ ఛిన్నమైన వృక్షభాగము (యూపము నిమిత్తము) యజ్ఞము నభిలక్షించియే ఉపనతమై యుండును.

15.(i) అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్= ఈ యజమానునిఁగూర్చి, ఉత్తరః యజ్ఞః=సోమ వికృతి యాగము, ఉప నమేత్ ఇతి=ఉపనతము కావలెనని, యమ్=ఏ యజమానుని ఉద్దేశించి, కామయేత= కోరునో, తస్మై=ఆ యజమానునికొఱకు, పఞ్చారత్నిమ్=అయిదు అరత్నుల పరిమాణము గల వృక్షభాగమును, (యూపము నిమిత్తము) వృశ్చేత్=ఛేదించవలెను. పఙ్క్తిః=పంక్తి ఛ్ఛందస్సు, పఞ్చాక్షరా=అయిదు అక్షర ములు కలది. యజ్ఞః= యజ్ఞము, పాఙ్క్తః=పంచద్రవ్య సాధ్యమైనది. ఏనమ్=ఈ యజమానుని గూర్చి, ఉత్తరః యజ్ఞః=సోమ వికృతి యాగము, ఉప నమతి=ఉపనత మగును. (అరత్నిః= ఇరువది నాలుగు అంగుళములు.)

తాత్పర్యము: ఏ యజమానునకు సోమవికృతి యాగము ఉపనతము కావలెనని అధ్వర్యుఁడు కోరునో, అతఁడు ఆ యజ మానుని నిమిత్తము యూపమునకై అయిదు అరత్నుల పరిమాణము గల వృక్షభాగమును ఛేదించవలెను. పంక్తి ఛ్ఛందస్సు అయిదక్షరములు కలది. యజ్ఞము పంచద్రవ్య సాధ్య మైనది. కావున సోమ వికృతి యాగము ఈ యజమానునకు ఉపనత మగును. (ఆ యజ్ఞము ఆ యజమానునకు స్వాధీన మగునని భావము.)

(ii) అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ప్రతిష్ఠాకామస్య=ప్రతిష్ఠను కోరునట్టి యజమానుని నిమిత్తము, షడరత్నిమ్=ఆఱు అరత్నుల పరిమాణము గల వృక్షభాగమును, వృశ్చేత్=(యూపము కొఱకు,) ఛేదించవలెను. ఋతవః=ఋతు వులు, షట్ వై=ఆఱు కదా! (ఏషః=ఈ యజమానుఁడు,) ఋతుషు=ఆఱు ఋతువులయందును, ప్రతి తిష్ఠత్యేవ=నిశ్చయముగ ప్రతిష్ఠావంతుఁ డగును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు ప్రతిష్ఠాకాముఁడైన యజమానుని నిమిత్తము ఆఱు అరత్నుల పరిమాణము గల వృక్షభాగ మును యూపమునకై ఛేదించవలెను. ఋతువులు ఆఱు కావున తత్సామ్యముచే ఈ యజమానుఁడు ఆఱు ఋతువులందును ( సర్వకాలములందును,) ప్రతిష్ఠ కలవాఁ డగును.

(iii) అర్థము: పశుకామస్య=పశువులను కోరునట్టి యజమానుని నిమిత్తము, సప్తారత్నిమ్=ఏడు అరత్నుల పరిమాణము గల వృక్షభాగమును, వృశ్చేత్=ఛేదించవలెను. శక్వరీ=శక్వరీఛ్ఛందస్సు, సప్తపదా=ఏడు పాదములు కలది.

పశవః=పశువులు, శక్వరీ=శక్వరీ ఛ్ఛందో దేవతాకములు. (తత్=ఆ కారణముచే, అయమ్=ఈ యజమానుఁడు,) పశూన్=పశువులను, అవ రుద్ధే ఏవ=నిశ్చయముగ పొందును.

తాత్పర్యము: పశువులను కోరునట్టి యజమానుని యాగమునందు యూపమునకై అధ్వర్యుఁడు ఏడు అరత్నుల పరిమాణము కల వృక్షభాగమును ఛేదించవలెను. శక్వరీ ఛ్ఛందస్సు ఏడు పాదములు కలది. పశువులు శక్వరీ ఛ్ఛందో దేవతాకములు. కావున తత్సాదృశ్యముచే ఈ యజమానుఁడు నిశ్చయముగ పశువులను పొందును.

(iv) అర్థము: తేజస్కామస్య=తేజస్సును కోరునట్టి యజమానుని నిమిత్తము, నవారత్నిమ్=తొమ్మిది అరత్నుల పరిమాణము కల వృక్షభాగమును, వృశ్చేత్=(యూపమునకై,) ఛేదించవలెను. (ఏతత్=ఈ నవారత్ని యూపము,) త్రివృతా స్తోమేన=త్రివృత్స్తోమముతో, సంమితమ్=సమాన మైనది. త్రివృత్=త్రివృత్తు, తేజః=తేజోరూప మైనది. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) తేజస్వీ=తేజస్వంతుఁడు, భవత్యేవ=నిశ్చయముగ నగును.

తాత్పర్యము: తేజస్కాముని నిమిత్తము అధ్వర్యుఁడు నవారత్ని పరిమాణము కల వృక్షభాగమును యూపమునకై ఛేదించవలెను. మూఁడు సామముల సమూహము మూఁడు పర్యాయములు ఆవృత్త మగుటవలన త్రివృత్ స్తోమ మేర్పడి దానికి నవత్వ సంఖ్య లభించుటచే నవారత్ని యూపము త్రివృత్స్తోమముతో సమాన మగును. త్రివృత్తు తేజోరూపము. కావున ఈ యజమానుఁడు నిశ్చయముగ తేజస్వంతుఁ డగును.

(v) అర్థము: ఇన్ద్రియకామస్య=ఇంద్రియ బలమును కోరునట్టి యజమానుని నిమిత్తము, ఏకాదశారత్నిమ్=పదునొకండు అరత్నుల పరిమాణము కల వృక్షభాగమును, వృశ్చేత్=(యూపమునకై) ఛేదించవలయును. త్రిష్టుక్=త్రిష్టుప్ఛందస్సు, ఏకాదశాక్షరా=పదునొకండు అక్షరములు కలది. త్రిష్టుక్= త్రిష్టుక్కు, ఇన్ద్రియమ్=ఇంద్రియ రూపము. తత్=ఆ ఏకాదశ సంఖ్యాసామ్యమువలన, అయమ్=ఈ యజమానుఁడు, ఇన్ద్రియావీ=ఇంద్రియ బలము కలవాఁడు, భవత్యేవ=నిశ్చయముగ నగును.

తాత్పర్యము: ఇంద్రియ బలమును కోరునట్టి యజమానుని యజ్ఞమునందు యూపమునకై అధ్వర్యుఁడు పదునొకండు అరత్నుల పరిమాణము కల వృక్షభాగమును ఛేదించవలెను. త్రిష్టుప్ఛందస్సు పదునొకం డక్షరములు కలది. త్రిష్టుక్కు ఇంద్రియ రూపము. కావున ఈ యజమానుఁడు తప్పక ఇంద్రియ బలము కలవాఁ డగును.

(vi) అర్థము: భ్రాతృవ్యవతః=శత్రువులు కల యజమానుని నిమిత్తము, పఞ్చదశారత్నిమ్=పదునైదు అరత్నుల పరిమాణము గల వృక్షభాగమును, వృశ్చేత్=(యూపమునకై) ఛేదించవలెను. పఞ్చదశః=పదునైదు అరత్నుల పరిమాణము గల యూపము, వజ్రః=వజ్రమై, భ్రాతృవ్యాభిభూత్యై=శత్రు నిరాసమునకై, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: అధ్వర్యుఁడు శత్రువులు కల యజమానుని యజ్ఞమునందు యూపముకొఱకు పదునైదు అరత్నుల పరిమాణము కల వృక్షభాగమును ఛేదించవలెను. పంచదశారత్నియైన యూపము వజ్రరూపమై శత్రు నాశమునకు సమర్థమగును.

(vii) అర్థము: ప్రజాకామస్య=సంతానమును కోరునట్టి యజమానుని నిమిత్తము, సప్తదశారత్నిమ్=పదునేడు అరత్నుల పరిమాణము గల వృక్షభాగమును, వృశ్చేత్=(యూపమునకై) ఛేదించవలెను. ప్రజాపతిః=ప్రజాపతి, సప్తదశః=సప్తదశాక్షర సంఖ్యాకుఁడు (అయమ్=ఈ సప్తదశారత్నియైన యూపము,) ప్రజాపతేః=ప్రజాపతియొక్క, ఆప్త్యై=ప్రాప్తికొఱకు, భవతి=అగుచున్నది. ప్రతిష్ఠాకామస్య=ప్రతిష్ఠా కాముని నిమిత్తము, ఏకవింశత్యరత్నిమ్=ఇరువదియొక్క అరత్నుల పరిమాణము గల వృక్షభాగమును, వృశ్చేత్=(యూపమునకై, ఛేదించవలెను. ఏకవింశః=ఏకవింశతి సంఖ్య, స్తోమానామ్=స్తోమములయొక్క, ప్రతిష్ఠా= ప్రతిష్ఠారూపము. (అయమ్=ఈ ఏకవింశత్యరత్ని యూపము) ప్రతిష్ఠిత్యై= ప్రతిష్ఠకొఱకు, భవతి=అగుచున్నవి.

తాత్పర్యము: ప్రతిష్ఠా కాముని యజ్ఞమునందు యూపమునకై అధ్వర్యుఁడు ఇరువదియొక్క అరత్నుల పరిమాణము కల వృక్షభాగమును ఛేదించవలెను. ఏకవింశతి సంఖ్య స్తోమముల ప్రతిష్ఠారూపము. కనుక ఈ యేకవింశత్యరత్ని యూపము యజమానుని ప్రతిష్ఠకొఱకు కగును. (శేషము స్పష్టము.)

16. అర్థము: (యూపః=యూపస్తంభము) అష్టాశ్రిః=ఎనిమిది అంచులు కలది, భవతి=కావలెను.. గాయత్రీ=గాయత్రీ ఛ్చందస్సు, అష్టాక్షరా= ఎనిమిది అక్షరములు కలది. గాయత్రీ=గాయత్రి, తేజః=తేజస్స్వరూపము. గాయత్రీ=గాయత్రి, యజ్ఞముఖమ్=యజ్ఞముఖము. (తత్=ఆ కారణమువలన, అయమ్= ఈ యూపము,) తేజసా=తేజస్సుతోడను, గాయత్రియా=గాయత్రితోడను, యజ్ఞముఖేన=యజ్ఞముఖముతోడను, సమ్మితః ఏవ=సమాన మైనదియే.

తాత్పర్యము: యూపము ఎనిమిది అంచులు కలదిగా నుండవలెను. గాయత్రి (అగ్నితో కూడ పుట్టుటచే) తేజోరూపము. గాయత్రీ ఛ్చందస్సు ఎనిమిది అక్షరములు కలది. గాయత్రీ ఛ్చందస్సు ప్రాతస్సవనమునందు ప్రయుజ్యమాన మగుటచే యజ్ఞముఖ స్వరూపము. కావున అష్టసంఖ్యాద్వారా యూపము తేజో గాయత్రి యజ్ఞముఖములతో సమాన మైనది. ఆ కారణముచే యూపమునకు ఎనిమిది అంచులు చెక్కవలెను.

తృతీయానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే చతుర్థోఽనువాకః

మూలము: [1] పృథివ్యై త్వాఽన్తరిక్షాయ త్వా దివే త్వేత్యాహైభ్య ఏవైనం లోకేభ్యః ప్రోక్షతి [2] పరాఞ్చం ప్రోక్షతి పరాఙివ హి సువర్గో లోకః [3] క్రూరమివ వా ఏతత్కరోతి యత్ఖనత్యపోఽవ నయతి శాన్త్యై యవమతీరవ నయత్యూర్గ్వై యవో యజమానేన యూపః సంమితో యావానేవ యజమాన స్తావతీ మేవాస్మిన్నూర్జం దధాతి (౧) పితృణాగ్ం సదన మసీతి బర్హిరవ స్తృణాతి పితృదేవత్యాగ్ం హ్యేత ద్యన్నిఖాతం యద్బర్హి రనవస్తీర్య మినుయా త్పితృదేవత్యో నిఖాతః స్యాద్బర్హి రవస్తీర్య మినోత్యస్యా మేవైనం మినోతి [4] యూపశకల మవాస్యతి సతేజస మేవైనం మినోతి [5] దేవస్త్వా సవితా మధ్వాఽనక్త్విత్యాహ తేజసైవైన మనక్తి [6] సుపిప్పలాభ్య స్త్వౌషధీభ్య ఇతి చషాలం ప్రతి (౨) ముఞ్చతి తస్మాచ్ఛీర్షత ఓషధయః ఫలం గృహ్ణ [7] న్త్యనక్తి తేజో వా ఆజ్యం యజమానే నాగ్నిష్ఠాఽశ్రిః సంమితా యదగ్నిష్ఠా మశ్రిమనక్తి యజమానమేవ తేజసాఽనక్త్యాన్త మనక్త్యాన్తమేవ యజమానం తేజసాఽనక్తి [8] సర్వతః పరి మృశత్యపరివర్గ మేవాస్మిన్తేజో దధా [9] త్యుద్దివగ్ం స్తభానాఽన్తరిక్షం పృణేత్యాహైషాం లోకానాం విధృత్యై [10] వైష్ణవ్యర్చా (3) కల్పయతి వైష్ణవో వై దేవతయా యూపః స్వయైవైనం దేవతయా కల్పయతి [11] ద్వాభ్యాం కల్పయతి ద్విపాద్యజమానః ప్రతిష్ఠిత్యై [12] యం కామయేత తేజసైనం దేవతాభి రిన్ద్రియేణ వ్యర్ధయేయ మిత్యగ్నిష్ఠాం తస్యాశ్రి మాహవనీయాదిత్థం వేత్థం వాఽతి నావయే త్తేజసైవైనం దేవతాభి రిన్ద్రియేణ వ్యర్ధయతి [13] యం కామయేత తేజసైనం దేవతాభి

రిన్ద్రియేణ సమర్ధయేయ మితి (౪) అగ్నిష్ఠాం తస్యాశ్రి మాహవనీయేన సం మినుయా త్తేజసైవైనం దేవతాభి రిన్ద్రియేణ సమర్ధయతి [14] బ్రహ్మవనిం త్వా క్షత్త్రవని మిత్యాహ యథాయజురేవైత [15] త్పరి వ్యయత్యూర్జ్యై రశనా యజమానేన యూపః సంమితో యజమాన మేవోర్జా సమర్ధయతి [16] నాభి దఘ్నే పరి వ్యయతి నాభిదఘ్న ఏవాస్మా ఊర్జం దధాతి తస్మా న్నాభిదఘ్న ఊర్జా భుఞ్జతే [17] యం కామయేతోర్జైనమ్ (౫) వ్యర్ధయేయ మిత్యూర్ధ్వాం వా తస్యావాచీం వాఽవోహే దూర్జైవైనం వ్యర్ధయతి [18] యది కామయేత వర్షుకః పర్జన్యః స్యాదిత్యవాచీ మవోహేద్వృష్టిమేవ ని యచ్ఛతి యది కామయేతావర్షుకః స్యాదిత్యూర్ధ్వా ముదూహే ద్వృష్టిమేవోద్యచ్ఛతి [19] పితౄణాం నిఖాతం మనుష్యాణా మూర్ధ్వం నిఖాతాదా రశనాయా ఓషధీనాగ్ం రశనా విశ్వేషామ్ (౬) దేవానా మూర్ధ్వగ్ం రశ నాయా ఆ చషాలా దిన్ద్రస్య చషాలగ్ం సాధ్యానా మతిరిక్తగ్ం స వా ఏష సర్వదేవత్యో యద్యూపో యద్యూపం మినోతి సర్వా ఏవ దేవతాః ప్రీణాతి [20] యజ్ఞేన వై దేవాః సువర్గం లోక మాయన్తేఽ మన్యన్త మనుష్యా నో ఽన్వాభవిష్యన్తీతి తే యూపేన యోపయిత్వా సువర్గం లోక మాయన్త మృషయో యూపేనైవాను ప్రాజానన్తద్యూపస్య యూపత్వమ్(౭) యద్యూపం మినోతి సువర్గస్య లోకస్య ప్రజ్ఞాత్యై [21] పురస్తా న్మినోతి పురస్తాద్ధి యజ్ఞస్య ప్రజ్ఞాయతే ప్రజ్ఞాతగ్ం హి తద్యదతిపన్న ఆహురిదం కార్యమాసీదితి [22] సాధ్యా వై దేవా యజ్ఞమత్యమన్యన్త తాన్యజ్ఞో నాస్పృశ త్తాన్యద్య జ్ఞస్యాతిరిక్త మాసీత్తదస్పృశ దతిరిక్తం వా ఏతద్యజ్ఞస్య యదగ్నావగ్నిం మథిత్వా ప్రహరత్యతిరిక్త మేతత్ (౮) యూపస్య యదూర్ధ్వం చషాలాత్తేషాం తద్భాగధేయం తానేవ తేన ప్రీణాతి [23] దేవా

వై సగ్ంస్థితే సోమే ప్ర స్రుచోఽహరన్ప్రి యూపం తేఽమన్యన్త యజ్ఞ వేశసం వా ఇదం కుర్మ

ఇతి తే ప్రస్తరగ్ం స్రుచాం నిష్క్రియణ మపశ్యన్స్వరుం యూపస్య సగ్ంస్థితే సోమే ప్ర ప్రస్తరగ్ం

హరతి జుహోతి స్వరు మయజ్ఞవేశసాయ(౯)||

(దధాతి ప్రత్యృచా సమర్ధయేయు మిత్యార్త్యైనం విశ్వేషాం యూపత్వ మతిరిక్త మేతద్ద్వి చత్వారిగ్ం

శచ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠకే చతుర్థోఽనువాకః ||౪||

# వేదార్థదీపిక

అవతారిక: తృతీయానువాకమునందు యూపచ్ఛేదనము విహిత మైనది. అదియు అధికారి భేదముచే వివిధ రీతులుగా చెప్పఁబడినది. ప్రథమ కాండమునందలి తృతీయ ప్రపాఠకమునందు యూపస్థానమునకు సంబంధించిన మంత్రములు చెప్పఁబడినవి. ఆ మంత్రములకు వివరణాత్మకముగ తత్తద్విధులు ఈ చతుర్థానువాకమునం దభిహితము లైనవి.

1. అర్థము: "పృథివ్యై త్వాఽన్తరిక్షాయ త్వా దివే త్వా" ఇతి ఆహ= "ఓ యూపమా! నిన్ను భూమ్యంతరిక్ష ద్యులోక ములకొఱకు ప్రోక్షించుచున్నాను." అని యీ మంత్రము చెప్పినది. ఏభ్యః లోకేభ్యః ఏవ=ఈ పృథివ్యాది లోకములకొఱకే, ఏనమ్=ఈ యూపమును, ప్రోక్షతి=ప్రోక్షించవలెను.

తాత్పర్యము: అధ్వర్యుఁడు పృథివ్యాది లోకత్రయాభిమాని దేవతల ప్రీతికొఱకు యూపమును ప్రోక్షించవలెను.

2. అర్థము: పరాఞ్చమ్=యూపముయొక్క అగ్రభాగమును, ప్రోక్షతి=ప్రోక్షించవలెను. సువర్గః లోకః=స్వర్గలోకము, పరా ఙివ హి=పై భాగమునందువలె నున్నది కదా!

తాత్పర్యము: ప్రోక్షణము యూపమూలమున నారంభించి ఊర్ధ్వముఖముగ చేయవలెను. ఔదుంబరికివలె అగ్రభాగమున ఆరంభించి అధోముఖప్రోక్షణము చేయరాదనియు, మూలమున నారంభించి ఊర్ధ్వముఖముగ చేయవలెననియు విధింపఁబడినది. ఈ సోమయాగమునకు ఫలము స్వర్గము కావున స్వర్గము ఊర్ధ్వ దేశమున నుండుట యిందుకు కారణముగ చెప్పఁబడినది.

3. అర్థము: ఖనతి యత్=(అవట నిర్మాణమునకై,) త్రవ్వుట యేది కలదో, ఏతత్=ఇది, క్రూరమివ వై=క్రూరమైనది వలెనే, కరోతి=చేయుచున్నాఁడు. శాన్త్యై=శాంతికై, అపః=ఉదకములను, అవ నయతి=(అవట ప్రదేశము నందు,) చల్లవలెను. యవమతీః=యవలు కలిగియున్న ఉదకములను, అవనయతి=త్రవ్విన అవటమునందు చల్లవలెను. యవః=యవధాన్యము, ఊర్క్ వై=రస రూపమే. యూపః=యూపము, యజమానేన=యజ మానునితో, సంమితః=సమాన పరిమాణము కలదియై, భవతి=ఉండవలెను. యజమానః=యజమానుఁడు, యావానేవ=ఎంత పరిమాణము కలవాఁడో, అస్మిన్=ఈ యజమానునియందు, తావతీమేవ=అంత పరి మాణము కలదియేయైన, ఊర్జమ్=రస (బల)మును, దధాతి= (అధ్వర్యుఁడు) ఉంచినవాఁడగుచున్నాఁడు.

పితౄణామ్= పితృదేవతలకు, సదనమ్=స్థానము, అసి=అగుచున్నావు, ఇతి=అని, బర్హిః=బర్హిస్సును, అవస్తృణాతి=(అవటమునందు,) పఱచవలెను. నిఖాతంయత్= త్రవ్విన (అవట) ప్రదేశము ఏది కలదో, ఏతత్=ఇది, పితృదేవత్యం హి=పితృదేవ దేవతాకము కదా! బర్హిః=బర్హిస్సును, అనవస్తీర్య=పఱచక, మినుయాత్ యత్= యూపమును అవటమునందు ఉంచినచో, (ప్రక్షేపించినచో,) నిఖాతః=త్రవ్విన అవట ప్రదేశము, పితృదేవత్యః=పితృదేవ దేవతాకము, స్యాత్=అగును. (తత్=ఆ కారణమువలన,) బర్హిః=బర్హిస్సును, అవస్తీర్య=పఱచి, మినోతి=యూపమును అవటమునందు ఉంచవలెను. (తదా=అప్పుడు,) అస్యామేవ=ఈ భూమియందే, ఏనమ్=ఈ యూపమును, మినోతి=ఉంచినవాఁ డగుచున్నాఁడు. ("డు మిఞ్=ప్రక్షేపణే" అను ధాతువునుండి, 'మినోతి' అను క్రియాపద మేర్పడినది.)

తాత్పర్యము: యూపస్థాపనమునకై ఈ మంత్రమున కొన్ని విధులు చెప్పఁబడినవి. యూపస్థాపనమునకై అవటమును త్రవ్వవలెనని ఇచట చెప్పఁబడలేదు. కాని ఔదుంబరి స్థాపన విషయమున చెప్పఁబడిన అవట ఖననము ఇచట అనువృత్త మగునని ఉద్దేశించి తద్విశేషవిధులు వివరింపఁబడినవి. ఈ విధులు యజమానునిషక్షమున అధ్వర్యుఁ డాచరించవలెను. భూమిని త్రవ్వుట క్రూరమైనది వలెనే యుండును. అందువలన తత్క్రూరత్వ శాంతికై ఆ త్రవ్విన ప్రదేశమునందు ఉదక ప్రక్షేపము విహితమైనది. యవలు రసవంతములు కావున యవలతో కూడిన యుదకముల నవటమునందు చల్లవలెను. యూపము యజమానపరిమాణము కలిగి యుండవలెను. అట్లు ఉండుటవలన అంతటి పరిమాణముతో రసమును యజమానునియందు అధ్వర్యుఁడు ఉంచిన వాఁడగును. "పితౄణాం సదన మసి" అని పఠించుచు అధ్వర్యుఁ డవటమునందు బర్హిస్సును పఱచవలెను. అవటము పితృదేవ దేవతాకము. కావున బర్హిస్సును పఱచకుండ అందు యూపమును స్థాపించినచో అది పితృదేవ దేవతాక మగును. కావున అధ్వర్యుఁ డవటమునందు బర్హిస్సును పఱచి యూపమును స్థాపించవలెను. అప్పు డధ్వర్యుఁ డీ భూమియందే యూపము నుంచినవాఁ డగును. (ఈ విధులన్నియు విపులముగ కల్పసూత్రమునందు వివరింపఁబడినవి. అవటము=పితృదేవత లుండునట్టి లోకవిశేషము.)

4. అర్థము: యూపశకలమ్=యూపముయొక్క శకలమును, అవాస్యతి=యూపమునందుంచవలెను. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁబడఁగా,) ఏనమ్=ఈ యూపమును, సతేజసమేవ=తేజస్సహితముగానే, మినోతి= స్థాపించినవాఁడగుచున్నాఁడు. (యూపమును ఛేదించినపుడు పడిన మూఁడు శకలములలో ఇది మొదటిది.)

తాత్పర్యము: అధ్వర్యుఁడు యూపశకలమును, యూపమునం దుంచవలెను. ఇట్లు చేసిన యధ్వర్యుఁడు యూపమును తేజస్సహితముగానే అవటమునందు ఉంచినవాఁడగును. (యూపమునకై 'స్వధితి' అను ఆయుధముచే వృక్షమును ఛేదించునపుడు, వృక్షము స్వధితివలన భయపడుననియు, అందువలన ఛేదించుసమయమున పడిన వృక్షముయొక్క ప్రథమ శకలముతో కూడ తేజస్సు పోవుననియు, ఆ శకలమును యూపమునందుంచినచో యూపమును తేజస్సహితముగనే ఉంచిన ట్లగుననియు విద్యారణ్యమున చెప్పఁబడినది. ప్రథమ శకలము, స్వరువు, చషాలము, వీని వివరణమునకు ప్రథమ సంపుటములోని 123వ పుటను చూడుఁడు.)

5. అర్థము: "దేవస్త్వా సవితా మధ్వానక్తు" ఇతి ఆహ=ఓ చషాలమా! సవితృదేవుఁడు నిన్ను మధురమైన తేజోరూపమైన ఆజ్యముచే అలఁదుఁ గాక, అని వేదము చెప్పినది. (తేన=ఆ చెప్పుటచే, అయమ్=ఈ యధ్వర్యుఁడు,) తేజసైవ=తేజస్సుచేతనే, ఏనమ్=ఈ యూపాగ్రమును, అనక్తి=అలఁదినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: "దేవస్త్వా సవితా మధ్వానక్తు" అను మంత్రమునందలి 'మధ్వా' అను పదమునకు తేజోరూపమైన ఆజ్యము అని ఈ బ్రాహ్మణము చెప్పినది. (అలఁదు= పూయు.)

6. అర్థము: "సుపిప్పలాభ్య స్త్వౌషధీభ్యః" ఇతి=(ఓ చషాలమా! నిన్ను మంచి ఫలములతోఁ గూడిన యోషధులకొఱకు యూపాగ్రమున నుంచుచున్నాను.) అను మంత్రముచే, చషాలమ్=చషాలమును, ప్రతి ముఞ్చతి=(యూపా

గ్రమునందు) ఉంచవలెను. తస్మాత్=ఫలముల నిమిత్తము యూపాగ్రమున చషాలము నుంచుట వలన, ఓషధయః=ఓషధులు, శీర్షతః=అగ్రభాగమునుండి, ఫలమ్=ఫలమును, గృహ్ణన్తి=గ్రహించుచున్నవి.

తాత్పర్యము: అధ్వర్యుఁడు "సుపిప్పలాభ్య స్త్వౌషధీభ్యః" అను మంత్రభాగమును పఠించుచు, చషాలమును యూపాగ్రమున నుంచవలెను. చషాలమును యూపాగ్రమున నుంచుటవలన ఓషధులు శిరోభాగమునుండి ఫలమును గ్రహించుచున్నవి.

7. అర్థము: అనక్తి=ఆహవనీయాగ్నికి సమీపమునందలి యూపముయొక్క అశ్రిని (అంచును) ఆజ్యముచే అలఁద వలెను. ఆజ్యమ్= నేయి, తేజః వై=తేజస్స్వరూపము కదా! అగ్నిష్ఠా అశ్రిః=ఆహవనీయాగ్ని సమీపమున ఉన్న యూపముయొక్క అంచు, యజమానేన=యజమానునితో, సంమితా=సమానమైనదిగా, భవేత్=ఉండవలెను. అగ్నిష్ఠామ్ అశ్రిమ్= ఆహవనీయాగ్నిసమీపస్థమైన అశ్రిని, అనక్తి యది=నేతితో అలఁదినచో, యజమానమేవ=యజమానునే, తేజసా=తేజస్సుచే, అనక్తి=అలఁదినవాఁ డగుచున్నాఁడు. ఆన్తమ్=సంపూర్ణముగ, అనక్తి=ఆజ్యముచే అలఁద వలెను. (తదా=అప్పుడు, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యజమానమ్=యజమానుని, ఆన్తమేవ=సర్వావయవసహితునిగానే, తేజసా= తేజస్సుచే, అనక్తి=అలఁదినవాఁ డగు చున్నాఁడు.

తాత్పర్యము: యూపమును ఎనిమిది అంచులు కలదిగా చెక్కవలెను. చెక్కిన అంచులు కల యూపమును అవటమున స్థాపించిన పిమ్మట ఆహవనీయాగ్నికి సమీపమున ఉన్నట్టి అంచు అగ్నిష్ఠమైన అశ్రియగును. అట్టి అగ్నిష్ఠమైన యూపాశ్రిని నేతితో అలఁదవలెను. నేయి తేజస్స్వరూపము కదా! ఆ యగ్నిష్ఠమైన యూపాశ్రి యజమాన సంమితమై యుండవలెను. ఆ విధముగ అశ్రిని ఆజ్యముచే నలఁదినచో, అధ్వర్యుఁడు యజమానుని తేజస్సుచేతనే అలఁదినవాఁ డగును. అనఁగా యజమానుని తేజస్వంతునిగా చేసినవాఁ డగును. అధ్వర్యుఁడు అశ్రిని సంపూర్ణముగా నేతితో అలఁదవలెను. అట్లు చేసిన యధ్వర్యుఁడు యజమానుని సర్వావయవ సహితముగ తేజస్వంతుని చేసినవాఁ డగును. "అఞ్జూ=వ్యక్తిమ్రక్షణ కాన్తి గతిషు" అను ధాతువునుండి 'అనక్తి' అను క్రియాపద మేర్పడినది.

8. అర్థము: సర్వతః=యూపాశ్రిని అంతటను, పరి మృశతి= స్పృశించవలెను. (ఏవం కృతవాన్=ఈ విధముగ చేసిన యధ్వర్యుఁడు,) అస్మిన్= ఈ యజమానునియందు, అపరివర్గమేవ=ఒక అవయవమును కూడ విడువకయే, తేజః= తేజస్సును, దధాతి=ఉంచినవాఁ డగుచున్నాఁడు. (ధరింపఁజేసినవాఁ డగుచున్నాఁడు.).

తాత్పర్యము: అధ్వర్యుఁడు యూపాశ్రి నంతటను స్పృశించవలెను. ఇట్లు చేసిన యధ్వర్యుఁడు ఈ యజమానునియందు సంపూర్ణముగ తేజస్సు నుంచినవాఁ డగును. అపరివర్గమేవ=కమవ్యవయవ మవర్జయిత్వా, ఇతి విద్యారణ్యమ్.

9. అర్థము: "ఉద్దివగ్ం స్తభానాఽన్తరిక్షం" ఇతి=ఓ యూపమా! నీవు ద్యులోకమును క్రింద పడకుండునట్లు స్తంభింపఁజేయుము. అంతరిక్షమును పూరించుము అని, ఏషాం లోకానామ్=ఈ లోకములయొక్క, విధృత్యై=విశేష స్థితికొఱకు, ఆహ=వేదము చెప్పినది.

తాత్పర్యము: "ఉద్దివగ్ం స్తభానాఽన్తరిక్షం పృణ పృథివీ ముపరేణ దృగ్ంహ"="ఓ యూపమా! నీవు స్వర్గలోకమును క్రింద పడకుండునట్లు స్తంభింపఁజేయుము. ఆకాశమును పూరించుము. భూమిని దృఢముగాఁ జేయుము." అని ప్రార్థించుచు అధ్వర్యుఁడు యూపమును అవటమునందు స్థాపించుటచే ముల్లోకములకు విశేషమైన ధారణము (గట్టితనము-లేక-స్థిరత్వము) ఏర్పడును.

10. అర్థము: వైష్ణవ్యర్చా="తే తే ధామాన్యుశ్మసి" అనెడి ఋక్కుచేత, కల్పయతి=యూపమును అవటమునం దుంచునపుడు ఒక అంచును ఆహవనీయాగ్నికి సమీపమున ఉండునట్లుగా చేయవలెను. యూపః=యూపము, దేవతయా=దేవతచే, వైష్ణవః వై=విష్ణుసంబంధియే. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ విధముగ

చేసిన అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యూపమును, స్వయా దేవతయైవ=యూపసంబంధినియైన దేవతచేతనే, కల్పయతి=కల్పించినవాఁ డగును.

తాత్పర్యము: "తే తే ధామాని" అను ఋక్కు వైష్ణవి. ఆ ఋక్కును పఠించుచు అధ్వర్యుఁడు యూపముయొక్క ఒక అంచును ఆహవనీయాగ్నికి సమీపమున నుండునట్లుగా యూపము నవటమునందు స్థాపించవలెను. యూపము విష్ణుదేవతాకము. కావున అధ్వర్యుఁడు యూపాధిమానినియగు విష్ణుదేవతచేతనే యూపమును పూర్వోక్తవిధముగ చేసినవాఁ డగును.

11. అర్థము: ద్వాభ్యామ్=రెండు ఋక్కులచేత, కల్పయతి=యూపమును స్థాపించవలెను. యజమానః=యజమానుఁడు, ద్విపాత్=రెండు పాదములు కలవాఁడు. (ఏవం కరణమ్=ఇట్లు చేయుట,) ప్రతిష్ఠిత్యై=ప్రతిష్ఠకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: అధ్వర్యుఁడు "విష్ణోః కర్మాణి పశ్యత", "తద్విష్ణోః పరమం పదమ్", అను రెండు ఋక్కుల నుచ్చరించుచు, యూపమును స్థాపించవలెను. యజమానుఁడు రెండు పాదములు కలవాఁడు. కావున రెండు ఋక్కులచే స్థాపించఁబడిన యూపము దృఢమైన స్థితి కలది యగును. రెండు పాదములచే యజమానుఁడు దృఢముగ నిలుచుండును కదా!

12. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, ఏనమ్=ఈ యజమానుని, తేజసా=తేజస్సుచేతను, దేవతాభిః=దేవతలచేతను, ఇన్ద్రియేణ=ఇంద్రియబలముచేతను, వ్యర్ధయేయమ్ ఇతి=వియుక్తునిగా చేయుదునని, కామయేత=కోరునో, తస్య=ఆ యజమానునియొక్క, అగ్నిష్ఠామ్ అశ్రిమ్=ఆహవనీయాగ్నికి సమీపముననున్న యూపముయొక్క అంచును, ఆహవనీయాత్=ఆహవనీయాగ్నినుండి, ఇత్థం వా, ఇత్థం వా=ఈ విధముగానా? ఈ విధముగానా? (అని) అతి=అతిక్రమించి, నావయేత్=పొందించవలెను. (తదా=అప్పుడు, సః=ఆ యధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజమానుని, తేజసా=తేజస్సుచేతను, దేవతాభిః=దేవతలచేతను, ఇన్ద్రియేణ=ఇంద్రియబలముచేతను, వ్యర్ధయతి=వియుక్తునిఁగాఁ జేసినవాఁ డగును.

తాత్పర్యము: యూపమునకు ఎనిమిది అంచులు చెక్కునప్పుడు అందు ఒక అంచును అగ్నిష్ఠమని తెలియునట్లు చేయవలెను. పై విధముగ తలఁచిన అధ్వర్యుఁడు, ఆ అంచును యూపమునకు పశ్చిమ భాగమున ఉన్నట్టి ఆహవనీయాగ్నిని ఉల్లంఘించి దక్షిణ దిక్కునకుఁ గాని, ఉత్తర దిక్కునకుఁ గాని చేరునట్లుగా చేయవలెను. ఆవిధముగ చేయఁగా అతఁడు యజమానుని తేజస్సుచేతను, దేవతలచేతను, ఇంద్రియబలముచేతను వియుక్తుఁ డగునట్లు చేసినవాఁ డగును. (ఇది పూర్వపక్షము.)

13. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, ఏనమ్=ఈ యజమానుని, తేజసా=తేజస్సుచేతను, దేవతాభిః=దేవతలచేతను, ఇన్ద్రియేణ=ఇంద్రియ పటుత్వముచేతను, సమర్ధయేయమ్ ఇతి=సమృద్ధునిగాఁ జేయుదునని, కామయేత=కోరునో, తదా=అప్పుడు, తస్య=ఆ యూపముయొక్క, అగ్నిష్ఠామ్ అశ్రిమ్=అగ్నిష్ఠమైన అంచును, ఆహవనీయేన=ఆహవనీయాగ్నితో, సంమినుయాత్=సమ్ముఖముగా చేయవలెను. (తదా=అప్పుడు, సః=ఆ యధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజమానుని, తేజసా=తేజస్సుచేతను, దేవతాభిః=దేవతలచేతను, ఇన్ద్రియేణ=ఇంద్రియ బలముచేతను, సమర్ధయత్యేవ=నిశ్చయముగ సమృద్ధునిగాఁ జేసినవాఁ డగును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు ఏ యజమానుని తేజోదేవతేంద్రియములతో సంయుక్తునిగా చేయుదునని తలఁచునో, అతఁడు యూపాశ్రిని ఆహవనీయాగ్నికి సమ్ముఖముగా చేయవలెను. అప్పు డతఁ డీ యజమానుని తేజోదేవతాదులచే సమృద్ధునిగాఁ జేసినవాఁ డగును. ఇది సిద్ధాంతము.

14. అర్థము: "బ్రహ్మవనిం త్వా క్షత్త్రవనిమ్" ఇతి ఆహ="ఓ యూపమా! బ్రాహ్మణ్యాదికము నిచ్చునట్టి నీకు నలు వైపుల మట్టి నుంచుచున్నాను." అని వేదము చెప్పినది. ఏతత్=ఇది, యధాయజుః ఏవ=మంత్రోక్తమే. ఈ మంత్రము కాం. 1, ప్ర. 3, అను. 1, లో వ్యాఖ్యానింపఁబడినది. అచట ఔదుంబరి పరముగ ప్రోక్త మైనది. ఇచట యూపపరముగ ఆమ్నాత మైనది. తాత్పర్యము స్పష్టము.

15. అర్థము: పరి వ్యయతి=యూపమునకు దర్భలత్రాటిని చుట్టవలెను. రశనా=దర్భల త్రాడు, ఊర్క్ వై=రసరూపమే. యజమానేన=యజమానునితో, సంమితః=సమాన పరిమాణము కలదైన, యూపః=యూపము, యజమానమ్=యజమానుని, ఊర్జైవ=రసరూప బలముతోడనే, సమర్ధయతి=సమృద్ధునిగాఁ జేయును.

తాత్పర్యము: ఓషధి విశేషములైన దర్భలచే నిష్పన్నమైన రశనను (త్రాటిని) యూపమునకు చుట్టవలెను. రశన ఓషధి విశేష రూప దర్భలచే నిష్పన్నమగుటచే, రసరూపమే యగును. కావున యజమాన పరిమాణముతో ఉన్న యూపము రసరూప రశనతో కూడియుండుటచే యజమానుని రసము (బలము)చే సమృద్ధునిగాఁ జేసినవాఁ డగును.

16. అర్థము: నాభిదఘ్నే=బొడ్డువఱకుఁ గల యూపమునందు, పరి వ్యయతి=పూర్వోక్త రశనను చుట్టవలెను. అస్మై=ఈ యజమానునియొక్క, (షష్ఠ్యర్థే చతుర్థీ.) నాభిదఘ్నే ఏవ=నాభివఱకు గల ఉదరమునందే, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఊర్జమ్=రసరూప బలమును, దధాతి=స్థాపించువాఁ డగుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, (సర్వే=అందఱు,) నాభిదఘ్నే=నాభివఱకుఁ గల ఉదరమునందు, ఊర్జమ్=రసమును, భుఞ్జతే=భుజించుచున్నారు. భుక్తమైన రసమును, ధరించుచున్నారని భావము.

తాత్పర్యము: అధ్వర్యుఁడు బొడ్డువఱకుఁ గల యూపమునందు రశనను చుట్టవలెను. ఆ విధముగ చేసిన యధ్వర్యుఁ డీ యజమానునియొక్క నాభిదఘ్నమైన ఉదరమునందే రసరూప బలమును స్థాపించువాఁ డగును. లోకమునందు అందఱును భుక్తమైన రసమును ఉదరమునందు ధరించుచున్నారు. (ఇచట రశనకు యూపముయొక్క నాభిదఘ్న(మధ్య)ప్రదేశము విహిత మైనది.)

17. అర్థము: ఏనమ్=ఈ యజమానుని, ఊర్జా=రసరూప బలముచే, వ్యర్ధయేయమ్ ఇతి=సమృద్ధి రహితునిగా చేయుదునని, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, కామయేత=కోరునో, ఊర్ధ్వాం వా=యూపము యొక్క నాభిదఘ్నమైన ఉదర సదృశ ప్రదేశమునకు పైభాగమునఁ గాని, తస్య=ఆ యజమానుని నిమిత్తము, అవాచీం వా=అధోభాగమునఁ గాని, అవోహేత్=చుట్టవలెను. (తదా=అప్పుడు, సః=ఆ అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజమానుని, ఊర్జైవ=అన్నము(రసము)చే, వ్యర్ధయతి=వియుక్తునిగాఁ జేయును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు ఏ యజమానుని రసరూపమైన అన్నముతో వియుక్తుని చేయుదునని తలఁచునో, ఆ యధ్వర్యుఁడు ఆ యజమానుని నిమిత్తము, యూపముయొక్క నాభిప్రదేశమునకు క్రిందిభాగమునఁ గాని, ఊర్ధ్వభాగ మునఁ గాని రశనను చుట్టవలెను. అప్పు డతఁడు ఆ యజమానుని అన్నముచే వియుక్తునిగాఁ జేయును. అన్నశూన్యునిగా చేయునని భావము.(ఇది నింద్యమైన పద్ధతి.)

18. అర్థము: పర్జన్యః=వర్షాధిదేవత, వర్షుకః స్యాదితి=వర్షించునది కావలయునని, కామయేత యది=వాంఛించుచో, అవాచీమ్ అవోహేత్=అధోదేశమునందు బద్ధమైన రశనను ఇంకను క్రిందికి ఆకర్షించవలెను. (తేన=దానిచే, పర్జన్యః=పర్జన్యుఁడు,) వృష్టిమ్=వర్షమును, నియచ్ఛతి=క్రిందికి ప్రవర్తింపఁజేయును. అవర్షుకః స్యాదితి=పర్జన్య దేవత వర్షించనిది కావలెనని, కామయేత యది=కోరునెడల, ఊర్ధ్వామ్ ... దేశమున బద్ధమైన రశనను, ఉదూహేత్=ఇంకను ఊర్ధ్వభాగమునకు ఉత్కర్షించవలెను(... (తేన=దానిచే, పర్జన్యః=పర్జన్యుఁడు,) వృష్టిమ్=వర్షమును, ఉద్యచ్ఛతి=ఊర్ధ్వభాగమున ప్రవర్తింపఁజేయును( నివారింపఁజేయును).

తాత్పర్యము: పర్జన్య దేవత వర్షము కురియవలెనని కోరినచో, యూపమున నాభిదేశమునకు క్రిందిభాగమున బద్ధమైన రశనను ఇంకను క్రిందికి లాఁగవలెను. ఆ రశనాపకర్షముచే పర్జన్య దేవత వర్షమును క్రిందికి ప్రవర్తింపఁజేయును. పర్జన్యుఁడు వర్షించకుండుఁ గాక, యని కోరినచో, ఊర్ధ్వమున బద్ధమైన రశనను ఇంకను ఊర్ధ్వ ప్రదేశమునకు ఉత్కర్షించవలెను. ఆ రశనోత్కర్షముచేత పర్జన్యుఁడు వర్షము నూర్ధ్వ ప్రదేశమునకు ప్రవర్తింపఁజేయును. వర్షమును నివారింపఁజేయునని భావము. [ఇచట కామనా భేదము ననుసరించి రశనా బంధనమునకు దేశవిశేషము విధింపఁబడినది.]

19. అర్థము: నిఖాతమ్=యూపముయొక్క మూలభాగము, (త్రవ్వఁబడిన ప్రదేశముయొక్క లోపలి భాగము), పితౄణామ్=పితృదేవతలకు, ప్రియమ్=ఇష్ట మైనది. ఆ రశనాయాః=రశనవఱకుఁ గల, నిఖాతాత్ ఊర్ధ్వమ్=నిఖాతముకంటె నూర్ధ్వభాగము, మనుష్యాణామ్=మనుష్యులకు, ప్రియమ్=ఇష్ట మైనది. రశనా=రశనాప్రదేశము, ఓషధీనామ్=ఓషధ్యభిమాని దేవతలకు, ప్రియా=ఇష్ట మైనది. ఆ చషాలాత్=చషాలమువఱకుఁ గల, రశనాయాః ఊర్ధ్వమ్=రశనయొక్క ఊర్ధ్వభాగము, విశ్వేషాం దేవానామ్=విశ్వేదేవ దేవతలకు, ప్రియమ్=ఇష్ట మైనది. చషాలమ్=యూపముననున్న చషాల ప్రదేశము, ఇన్ద్రస్య=ఇంద్రునకు, ప్రియమ్=ఇష్ట మైనది. అతిరిక్తమ్=యూపముయొక్క మిగిలిన భాగము, సాధ్యానామ్=సాధ్యు లనెడి దేవతలకు, ప్రియమ్=ఇష్ట మైనది. యూపః యత్=యూప మనునది యేది, (అస్తి=కలదో,) సః ఏషః వై=ఆ యీ యూపమే, సర్వదేవత్యః=సర్వదేవదేవతాకము. (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యూపమ్=యూపమును, మినోతి యత్=అవటమునందు ప్రక్షేపించినచో, సర్వాః దేవతాః ఏవ=సర్వ దేవతలనే, ప్రీణాతి=సంతృప్తులను చేయువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: (1)యూపమునకు మూలభాగము, (2)దానికి ఊర్ధ్వమునను రశనకు అధోభాగమున ఉన్న ప్రదేశము, (3)రశనా ప్రదేశము, (4)రశనకు ఊర్ధ్వమునను, చషాలమునకు దిగువను ఉన్న ప్రదేశము, (5)చషాల ప్రదేశము (6)దాని కతిరిక్తప్రదేశము, అను యూపముయొక్క ఈ యాఱు ప్రదేశములు వరుసగా పితృదేవతలకు, మనుష్యులకు, ఓషధి దేవతలకు, విశ్వేదేవదేవతలకు, ఇంద్రునకు, సాధ్యులకు ఇష్టము లైనవి. కనుక యూపము సర్వదేవ దేవతాక మయినది. అట్టి సర్వదేవతాకమైన యూపమును అధ్వర్యుఁడు అవటమున స్థాపించినచో, సర్వదేవతలను సంతృప్తులను చేసినవాఁ డగును.(యూపముయొక్క అగ్రభాగమునందు చషాలమును కడియముగా ధరింపఁజేయుదురు. యూపముయొక్క చివర నాలుగంగుళముల పరిమాణము గల భాగమును ఛేదించి దానిమధ్యమునందు రంధ్రము నేర్పఱచవలెను. ఆ రంధ్రముతో కూడిన భాగమునకు చషాలమని పేరు. ఇచట యూపము సర్వదేవతా ప్రీతిహేతువుగా స్తుతింపఁబడినది.

20. అర్థము: దేవాః=దేవతలు, యజ్ఞేన వై=యజ్ఞముచేతనే, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, ఆయన్=పొందిరి. "మనుష్యాః=మనుష్యులు, నః=మమ్ము, అను ఆ భవిష్యన్తీతి=అనుసరించి వచ్చి అస్మత్సదృశులు కాఁగలరని, తే=ఆ దేవతలు, అమన్యన్త=తలఁచిరి. తత్=ఆ కారణమువలన, యూపేన=యూపముచే, యోపయిత్వా=మోహింపఁజేసి, (తే=ఆ దేవతలు,) సువర్గం లోకమ్=స్వర్గలోకమును, ఆయన్=పొందిరి. ఋషయః=అతీంద్రియ ద్రష్టలగు ఋషులు, తమ్=ఆ స్వర్గమును, యూపేనైవ=యూపముచేతనే, అను=దేవతల ననుసరించి, ప్రాజానన్=బాగుగ తెలిసికొనిరి. తత్=మనుష్య మోహన హేతురూపమైన ఆ కారణమువలన, యూపస్య=యూపమునకు, యూపత్వమ్=యూపశబ్ద వాచ్యత్వము, సిధ్యతి=సిద్ధించుచున్నది. యూపమ్=యూపమును, మినోతి యత్=అవటమునందు స్థాపించినచో, (తత్=ఆ స్థాపించుట,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, ప్రజ్ఞాత్యై=ప్రకృష్ట జ్ఞానముకొఱకు (భవతి=అగుచున్నది.)

తాత్పర్యము: పూర్వము ఒకానొకప్పుడు దేవతలు యజ్ఞము చేసి స్వర్గలోకమునకు వెళ్లుచు 'మనుష్యులు కూడ మమ్ము అనుసరించి వచ్చి మనతో సమాను లగుదు రని' తలఁచి యూపముచేత మనుష్యులను మోహింపఁజేసి తామే స్వర్గమునకు పోయిరి. ఋషులు అతీంద్రియ ద్రష్టలు కావున తమ జ్ఞానదృష్టిచే యూపమాహాత్మ్యమును తెలిసికొని, దేవతల ననుసరించి ఆ స్వర్గమును తెలిసికొనిరి. "యుప=విమోహనే" అను ధాతువునుండి యూపశబ్ద ముత్పన్న మైనది. యుప్యతి=విముహ్యతీతి యూపః. మోహింపఁజేయునది అని యర్థము. యూపము సర్వదేవత్య మని తెలియక కాష్ఠమాత్రరూప మనెడి బుద్ధి మోహమని విద్యారణ్య నిర్వచనము. కావున యూపము యూపశబ్ద వాచ్య మైనది. విదిత మాహాత్మ్యము కల యూపమును స్థాపించుటచే స్వర్గము తెలియఁబడును.

21. అర్థము: పురస్తాత్=ఆహవనీయమునకు తూర్పు వైపునందు, మినోతి=యూపమును స్థాపించవలెను. యజ్ఞస్య=యజ్ఞముయొక్క, (కర్తవ్యమ్ అఙ్గజాతమ్=చేయఁదగిన అంగసముదాయము,) పురస్తాత్=యజ్ఞానుష్ఠానముకంటె పూర్వమే, ప్రజ్ఞాయతే హి=తెలియఁబడుచున్నది కదా! అతిపన్నే=అనుష్ఠేయమైన కర్మకలాపము అనుష్ఠింపఁబడక నష్ట మగుచుండఁగా, ఇదమ్=ఈ అనుష్ఠించఁదగిన కర్మ, (తస్మిన్నేవ దినే=ఆ దినము నందే,) కార్యమ్ ఆసీదితి తత్=చేయఁదగిన దాయె ననునది, ప్రజ్ఞాతం హి=ప్రజ్ఞాతము కదా!

తాత్పర్యము: యూపమును ఆహవనీయమునకు పూర్వదిక్కునందు స్థాపించవలెను. 'పురస్తాత్' అను శబ్దము విధివాక్యము నందు పూర్వదేశవాచి. అర్థవాదమునందు పూర్వకాలవాచి. యజ్ఞమునకు సంబంధించిన అంగజాత మంతయు యజ్ఞానుష్ఠానమునకు పూర్వమే తెలియఁబడుచుండును. లోకమునందు కొందఱు తాము నిర్దిష్టకాలమున చేయవలసిన పనిని విస్మరించుటచేఁగాని, మఱియొకవిధముగ చేయుటచేఁగాని ఆ పని నష్టమైనప్పుడు పశ్చాత్తాపము చెందుచు 'ఈ పని ఆ దినముననే చేయవలసినది. కాని అప్పుడు మనము గుర్తించలేదు.' అని అనుకొనుచుందురు. కావున పూర్వకాలము ప్రజ్ఞానార్థముగ ప్రశస్త మైనది. ఆ విధముగ పూర్వదేశము కూడ పూర్వత్వ సామ్యముచే ప్రశస్త మైనది. (ఇచట యూపస్థాపమునకై ఆహవనీయమునకు పూర్వదేశము విధింపఁబడినది.)

22. అర్థము: సాధ్యాః దేవాః=సాధ్యనామకులైన దేవతలు, యజ్ఞమ్=క్లుప్తమైన యజ్ఞభాగమును, అతి=అతిక్రమించి, అమన్యన్త వై='తమకు అధిక భాగము కావలెనని' తలఁచిరట! తాన్=అధికభాగము నభిలషించిన యాదేవతలను, యజ్ఞః=యజ్ఞము, న అస్పృశత్=స్పృశించలేదు. యజ్ఞస్య=యజ్ఞసంబంధియైన, అతిరిక్తం యత్=అతిరిక్త మైన భాగము ఏది, (అస్తి=కలదో,) తత్=దానిని, అస్పృశత్=స్పృశించెను. అగ్నిమ్=అగ్నిని, మథిత్వా=మథించి, అగ్నౌ=అగ్నియందు, యత్ ప్రహరతి=దేనిని వేయునో, ఏతత్ వై=ఇదియే, యజ్ఞస్య=యజ్ఞమునకు, అతిరిక్తమ్=అతిరిక్త మైనది. చషాలాత్=చషాలముకంటె, ఊర్ధ్వమ్=పైభాగమున, యూపస్య (అగ్రం)యత్=యూపముయొక్క అగ్రభాగ మేది, (అస్తి=కలదో,) తత్=అది, తేషామ్=ఆ సాధ్య నామక దేవతలకు, భాగధేయమ్=యజ్ఞభాగము. తేనైవ=ఆ యుభయముచేతనే, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) తాన్=ఆ సాధ్యులను, ప్రీణాతి=సంతోషపఱచుచున్నాఁడు. 'వై' అనునది పూర్వకాల సూచకము.

తాత్పర్యము: పూర్వము 'సాధ్య' లనెడి దేవతలు క్లుప్తమైన యజ్ఞభాగము నతిక్రమించి తమకు అధిక భాగము కావలెనని తలఁచిరి. అధిక భాగమును కోరిన వారిని యజ్ఞము తాఁకలేదు. కాని ఆ యజ్ఞము తనకుఁగల అతిరిక్తమును స్పృశించెను. అగ్నిని మథించి మఱియొక అగ్నియం దుంచుదురు. అదియే యజ్ఞముయొక్క అతిరిక్తము. అది ఈ యజ్ఞమునందు లేనిది కనుక అది అతిరిక్త మగుచున్నది. ఇది యొక అతిరిక్తము. చషాలమునకు పైని కల యూపాగ్రము యజమాన పరిమాణముకంటె అధిక మగుటచే అది మఱియొక అతిరిక్తము. ఆ యతిరిక్త ద్వయము సాధ్యులకు ప్రీతిహేతువు. [చషాలముకంటె పైని ఉన్న

యూపాగ్రము(అతిరిక్తము)సాధ్యులకు ప్రీతిహేతువుగా 19 వ మంత్రమున చెప్పఁబడినది. అది యిచట సమర్థింపఁబడినది.]

23. అర్థము: దేవాః=దేవతలు, సోమే సంస్థితే సతి=సోమయజ్ఞము సమాప్త మగుచుండఁగా, స్రుచః=స్రుక్కులను, యూపం (చ)=యూపమును (కూడ, అగ్నౌ=అగ్నియందు) ప్రాహరన్ వై=పడవేయుటకు సంకల్పించిరఁట! ఇదం యది=ఈ పడవేయుట యైనచో, యజ్ఞవేశసం కుర్మః వై=యజ్ఞ వినాశమును నిశ్చయముగ చేయుచున్నాము. ఇతి=అని, తే=ఆ దేవతలు, అమన్యన్త=తలఁచిరి. (తదా=అప్పుడు,) తే=ఆ దేవతలు, స్రుచామ్=స్రుక్కులకు, ప్రస్తరమ్=ప్రస్తరమును, యూపస్య=యూపమునకు, స్వరుం చ=స్వరువును, నిష్క్రియణమ్=క్రయసాధనముగా, అపశ్యన్=చూచిరి(తెలిసికొనిరి). (తస్మాత్=ఆ కారణమువలన,) సోమే సంస్థితే సతి=సోమయజ్ఞము సమాప్తము కాఁగా, అయజ్ఞవేశాయ=యజ్ఞవినాశము లేకుండుటకై, ప్రస్తరమ్=ప్రస్తరమును, (అగ్నౌ=అగ్నియందు,) ప్ర హరతి=పడవేయవలెను. స్వరుమ్=స్వరువును, జుహోతి=హోమము చేయవలెను. ["ప్ర స్రుచోఽహరన్ప్ర యూపమ్" అని 'ప్ర' అను ఉపసర్గము రెండు మారులు ప్రయుక్త మగుట 'స్రుచః ప్రాహరన్' 'యూపం ప్రాహరన్' అని వాక్యద్వయమును సూచించుటకే.]

తాత్పర్యము: పూర్వము దేవతలు సోమయజ్ఞము సమాప్తము కాఁగానే స్రుక్కులను యూపమును అగ్నియందు పడవేయవలెనని సంకల్పించిరి. అట్లు వేసినచో యజ్ఞవినాశము కలుగునని భావించి, ప్రస్తరముచే స్రుక్కులన స్వరువుచే యూపమును నిష్క్రియణము చేసిరి. ఆ కారణమువలన సోమయజ్ఞ సమాప్తియందు ప్రస్తరము నగ్నియందు పడవేయవలెను. స్వరువును హోమము చేయవలెను. [స్వరువు=యూపమును చెక్కినపుడు పడిన ప్రథమ శకలము. స్రుచః='జుహువు' మున్నగు హోమసాధనములు. నిష్క్రియణము=ధనమును కాని, వస్తువును కాని యిచ్చి విడిపించుకొనుట. ఇచట ప్రస్తరమును అగ్నియందు పడవైచి ఆ పడవేయుటనుండి స్రుక్కులను విడిపించుకొనుట. ఇచట ప్రస్తరమును అగ్నియందు పడవైచి ఆ పడవేయుటనుండి స్రుక్కులను విడిపించుటయు, స్వరువును హోమముచేసి దానినుండి యూపమును విడిపించుటయు జరిగినవి.]

చతుర్థానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః

మూలము: [1]సాధ్యా వై దేవా అస్మింల్లోక ఆసన్నాన్యత్కిం చన మిషత్తేఽగ్నిమేవాగ్నయే మేధాయాఽలభన్త న హ్యన్యదాలమ్భ్య మవిన్దన్తతో వా ఇమాః ప్రజాః ప్రాజాయన్త యదగ్నావగ్నిం మథిత్వా ప్రహరతి ప్రజానాం ప్రజననాయ [2]రుద్రో వా ఏష యదగ్ని ర్యజమానః పశుర్యత్పశు మాలభ్యాగ్నిం మన్థేద్రుద్రాయ యజమానమ్ (౧)అపి దధ్యా త్ప్రమాయుకః స్యా [3]దథో ఖల్వాహురగ్నిః సర్వా దేవతా హవిరేతద్యత్పశురితి యత్పశు మాలభ్యాగ్నిం మన్థతి హవ్యాయైవాఽఽసన్నాయ సర్వా దేవతా జనయ[4]త్యుపాకృత్యైవ మన్థ్యస్తన్నైవాఽఽలబ్ధం నైవానాలబ్ధ [5]మగ్నేర్జనిత్ర మసీత్యాహాగ్నే ర్హ్యేత జ్జనిత్రం వృషణౌ స్థ ఇత్యాహ వృషణౌ (౨)హ్యేతా [6]వుర్వశ్యస్యాయు రసీత్యాహ మిథునత్వాయ [7]ఘృతేనాక్తే వృషణం దధాథామిత్యాహ వృషణగ్ం హ్యేతే దధాతే యే అగ్నిం [8]గాయత్రం ఛన్దోఽను ప్ర జాయస్వేత్యాహ ఛన్దోభి రేవైనం ప్ర జనయ[9]త్యగ్నయే మథ్యమానాయాను బ్రూహీత్యాహ [10]సావిత్రీ మృచమన్వాహ సవితృప్రసూత ఏవైనం మన్థతి [11]జాతాయాను బ్రూహి (౩)ప్రహ్రియమాణాయాను బ్రూహీత్యాహ కాణ్డేకాణ్డ ఏవైనం క్రియమాణే సమర్ధయతి [12]గాయత్రీః సర్వా అన్వాహ గాయత్రచ్ఛన్దా వా అగ్నిః స్వేనైవైనం ఛన్దసా సమర్ధయ[13]త్యగ్నిః పురా భవత్యగ్నిం మథిత్వా ప్ర హరతి తౌ సంభవన్తౌ యజమానమభి సం భవతో భవతం నః సమనసావిత్యాహ శాన్త్యై [14]ప్రహృత్య జుహోతి జాతాయైవాస్మా అన్నమపి దధాత్యాజ్యేన జుహోత్యేతద్వా అగ్నేః ప్రియం

ధామ యదాజ్యం ప్రియేణైవైనం ధామ్నా సమర్ధయత్యథో తేజసా(౪)||
(యజమానమాహ వృషణౌ జాతాయాను బ్రూహ్యావ్యష్టాదశ చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః ||౬||

# వేదార్థదీపిక

అవతారిక: చతుర్థానువాకమునందు యూపస్థాపనవిధిపూర్వకముగ యూపస్థాపన మంత్రములు వ్యాఖ్యానించఁబడినవి. అనఁగా ఆ మంత్రములకు వ్యాఖ్యాన రూపమైన బ్రాహ్మణము చెప్పఁబడినది. ఈ యనువాకమునందు పాఠక్రమము ననుసరించి "ఇషే త్వోపవీ" రిత్యాదులైన ఉపాకరణ మంత్రములకు వ్యాఖ్యాన రూపమైన బ్రాహ్మణము చెప్పవలసియున్నది. అయినను పూర్వానువాకమునందు ప్రసంగవశమున "అతిరిక్తం వా ఏతద్యజ్ఞస్య యదగ్నావగ్నిం మథిత్వా ప్రహరతి"='ఒక అగ్నిని మథించి ఆ యగ్నిని మఱియొక అగ్నియందుంచవలెను.' ఇది యజ్ఞమునకు అతిరిక్త మైనది. అది సాధ్యనామక దేవతలకు ప్రీతికరము' అని చెప్పఁబడినది. ఆ విషయమును స్పష్టముగ వివరించుటకు ప్రథమమున అగ్నిమంథన మంత్రములను వ్యాఖ్యానింపఁబోవుచు మంథన విశిష్టమైన అగ్నిప్రహరణమును శ్రుతి విధించుచున్నది.

1. అర్థము: సాధ్యాః దేవాః వై=సాధ్యులు అను పేరు కల దేవతలే, అస్మిన్ లోకే=ఈ లోకమునందు, ఆసన్=ఉండిరి. అన్యత్ కించన మిషత్=ఇతరమైన ఏ ప్రాణి సముదాయము కూడ, న=లేదు. తే=ఆ సాధ్యనామక దేవతలు, మేధాయ=యజ్ఞము(నందు)కొఱకు, అగ్నయే=అగ్నికొఱకు, అగ్నిమేవ=అగ్నినే, ఆలభన్త=ఆలంభనము చేసిరి. అన్యత్ ఆలమ్భ్యమ్=ఆలంభనీయుమైన మఱియొకదానిని, న అవిన్దన్ హి=పొందరైరఁట! తతః వై=ఆ అగ్న్యాలంభన రూపమైన యజ్ఞమునుండియే, ఇమాః ప్రజాః=ఈ ప్రజలు, ప్రాజాయన్త=ప్రకర్షముగ పుట్టిరి. అగ్నిం మథిత్వా=అగ్నిని మథించి, అగ్నౌ=(పూర్వసిద్ధమై యున్న) అగ్నియందు, ప్రహరతి యత్=పడవేసిన(ఉంచిన)చో, (ఏతత్=ఈ యగ్ని ప్రహరణము,) ప్రజానామ్=ప్రజలయొక్క, ప్రజననాయ=ప్రకృష్టమైన ఉత్పత్తికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: మనుష్య పశ్వాది సృష్టికి పూర్వము లోకమునందు సాధ్యనామక దేవతలే యుండిరి. మఱియొకవిధమైన ప్రాణిజాత మేదియు లేదు. ఆ సాధ్య దేవతలు ప్రజాకాములై ప్రజాహేతువైన యజ్ఞముకొఱకు ఆలంభనము చేసిరి. అనఁగా ఆలంభన యోగ్యమైన ఇతర పశుజాత మేదియు వారికి లభించకపోవుటచే అగ్నినే పశువునుగా అగ్నికొఱకు ఆలంభనము చేసిరి. పురుషారణ్య న్యాయము ననుసరించి పర్యగ్నికరణమువఱకుఁ గల సంస్కారములను చేసిరి. ఆ అగ్న్యాలంభన రూపమైన యజ్ఞమునుండియే ప్రజలు అధికముగ పుట్టిరి. కావున ప్రజాకాముఁడు అగ్నిని మథించి ఆ యగ్నిని పూర్వము సిద్ధముగా ఉన్న యగ్నియందు వేయవలెను. ఈ మథితాగ్నిప్రహరణము సంతానోత్పత్తికి కారణ మగును.

2. అర్థము: అగ్నిః యత్=ఏ అగ్నిదేవుఁడు కలఁడో, ఏషః=ఈ యగ్ని, రుద్రః వై=క్రూరుఁడే. యజమానః=యజమానుఁడు, పశుః=(యజమాన నిష్క్రియణ రూప మగుటచే) పశు రూపుఁడు. పశుమ్=పశువును, ఆలభ్య=ఆలంభము చేసి, అగ్నిమ్=అగ్నిని, మన్థేత్ యత్=మథించునెడల, రుద్రాయ=రుద్రరూపుఁడైన యగ్నికొఱకు, యజమానమపి=యజమానునిఁ గూడ, దద్యాత్=(హవిస్సుగా)నీయవలెను. (సః=ఆ యజమానుఁడు,) ప్రమాయుకః=మరణశీలుఁడు, స్యాత్=అగును.

తాత్పర్యము: [ఇచట అగ్ని మంథనకాలము విచారింపఁబడుచున్నది. ఉపాకరణము మొదలుకొని మారణపర్యంతము గల వ్యాపారము ఆలంభ శబ్దార్థము. ఆ యాలంభమున కనంతరము అగ్నిని మథించవలెనా?, లేక, ఉపాక రణానంతరము ఆలంభము చేయవలెనా? అను సందేహము కలుగఁగా పూర్వపక్షము చెప్పఁబడుచున్నది. మంత్రపూర్వకముగ దర్భలచేఁగాని, జువ్వికొమ్మచేఁగాని సంస్కరించుట ఉపాకరణము.] అగ్ని క్రూరదేవుఁడు. పశువు యజమాన నిష్క్రయణరూప మగుటచే యజమానుఁడు పశువుగా నతిదేశించఁబడెను. ప్రథమ మున అగ్నిని మథించి పిమ్మట పశువు నాలంభము చేసినచో, పశువుగా నతిదేశింపఁబడిన యజమానుని హవిస్సుగా రుద్రరూపుఁడైన అగ్నిదేవునకొఱకు కీయవలెను. అప్పుడు యజమానుఁడు మరణశీలుఁ డగును. నిష్క్రయణము=డబ్బిచ్చి విడిపించుట.

3. అర్థము: అథో=మఱియు, ఆహుః ఖలు=చెప్పుచున్నారు కదా! అగ్నిః=అగ్నిదేవుఁడు, సర్వాః దేవతాః=సర్వ దేవతా స్వరూపుఁడు. పశుః ఇతి యత్=పశువు అనునది ఏది కలదో, ఏతత్=ఇది, హవిః=హవీరూపము. [హవి శ్శబ్దము నపుంసకలింగము కావున తద్విశేషణమైన ఏతచ్ఛబ్దము పశువాచకమైనను విధేయమైన హవిశ్శబ్ద ప్రాధాన్యము ననుసరించి నపుంసకలింగముగ ప్రయుక్త మైనది.] పశుమ్=పశువును, ఆలభ్య=ఆలంభము చేసి, అగ్నిమ్=అగ్నిని, మన్థతి యత్=మథించినచో, ఆసన్నాయ హవ్యాయైవ=సమీపస్థమైన హవిస్సుకొఱకే, సర్వాః దేవతాః=సర్వదేవతలను, జనయతి=(అధ్వర్యుఁడు)దగ్గఱకు చేర్చినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: (పూర్వోక్త పూర్వపక్షమునఁగల గుణవిశేషము చూపఁబడుచున్నది.) కొందఱు ఇంకను ఈ విధముగ చెప్పుచున్నారు. 'అగ్ని సర్వదేవతా స్వరూపుఁడు. పశువు హవీరూపము. అధ్వర్యుఁడు పశువు నాలంభము చేసి పిమ్మట అగ్నిని మథించినచో దగ్గఱ నున్నట్టి హవిస్సుకొఱకే సర్వదేవతలను దగ్గఱకు చేర్చినవాఁ డగును.'

4. అర్థము: ఉపాకృత్యైవ=పశూపాకరణము చేసియే, మన్థ్యః=అగ్ని మథించఁ దగినది. (ఏవం సతి=ఇట్లు కాఁగా,) తత్=అది, ఆలబ్ధమివ న=ఆలంభము చేయఁబడినదానివంటిది కాదు. అనాలబ్ధమివ న=ఆలంభము చేయఁబడనిదానివంటిదియు కాదు.

తాత్పర్యము: (ఇచట ద్వితీయ పక్షమైన సిద్ధాంతము ప్రతిపాదింపఁబడినది.) ప్రథమమున పశూపాకరణము చేసి అనం తరము అగ్నిని మథించవలెను. ఇట్లు చేసినచో ఉపాకరణముచే ఆలంభము ఉపక్రాంత మైనది. కనుక మూఁడవ మంత్రమున చెప్పఁబడిన గుణము సిద్ధించుచున్నది. పశుమారణ రూపమైన ఆలంభము చేయఁబడ లేదు. కావున రెండవ మంత్రమున చెప్పఁబడిన దోషము సంభవించదు.

5. అర్థము: "అగ్నే ర్జనిత్రమ్" ఇతి ఆహ=ఓ శకలమా!, నీవు అగ్ని జనక మగుచున్నావు, అని పైమంత్రము చెప్పినది. ఏతత్=ఈ శకలము, అగ్నేః=అగ్నికి, జనిత్రం హి=జనకము కదా! "వృషణౌ స్థః" ఇతి ఆహ=ఓ దర్భలారా! మీరు వీర్యసేచకము లగుచున్నారు; అని పై మంత్రము చెప్పినది. ఏతౌ=ఈ దర్భలు, వృషణౌ హి=వీర్యసేచకములు కదా!

తాత్పర్యము: "అగ్నే ర్జనిత్ర" మిత్యాది-మంత్రములు ఉపాకరణ మంత్రములు. ఆ మంత్రములకు (ప్ర. కాం. తృ. ప్ర. సప్త. అనువాకములోనివి:) ఈ బ్రాహ్మణ భాగము వివరణాత్మకము. శకలము అగ్నిజనక మనియు, దర్భలు వీర్యసేచకము లనియు ఈ బ్రాహ్మణము వివరించినది.

6. అర్థము: "ఉర్వశ్యాయురసి" ఇతి ఆహ=ఓ అధరారణీ! నీవు ఉర్వశితో సదృశ మగుచున్నావు; అని ఈ మంత్రము చెప్పినది. (ఏతత్=ఇది,) మిథునత్వాయ=మిథునభావముకొఱకు, (భవతి=అగుచున్నది).

తాత్పర్యము: అగ్నిని మథించుటకు అరణిద్వయము ఉపయోగించఁబడును. ఆ ద్వయములో క్రిందనుండునట్టి అరణి అధ రారణి యనఁబడును. ఆ అధరారణి ఉర్వశితో సమాన మైనదిగా వర్ణింపఁబడినది. ఈ మంత్రముయొక్క

ఉత్తర భాగమున ఉత్తరారణి పురూరవునితో సమానముగ వర్ణింపఁబడినది. ఉర్వశీపురూరవులతో సమానముగా వర్ణింపఁబడిన అరణీ ద్వయము మిథునభావము సిద్ధించుటకు కారణ మగుచున్నది. స్త్రీ మంత్ర పురుష మంత్రముల సమవధానమువలన మిథునత్వ సిద్ధి కలుగునని యిచట చెప్పఁబడినది.

7. అర్థము: "ఘృతేనాక్తే వృషణం దధాథామ్" ఇతి ఆహ=ఓ అధరోత్తరారణులారా! మీరు నేతిచే తడుపఁబడినవారై నిషిక్త వీర్యమువంటి అగ్నిని ధరించుదురు గాక; అని యీ మంత్రము చెప్పినది. యే=ఏ అధరోత్తరారణులు, అగ్నిమ్=అగ్నిని, దధాతే=ధరించుచున్నవో, ఏతే=ఈ అధరోత్తరారణులు, వృషణమ్=నిషిక్తవీర్యమును, దధాతే హి=ధరించుచున్నవి కదా!

తాత్పర్యము: అగ్నిని పుట్టించుటకై కాష్ఠాంతరముచే మథింప యోగ్యమైన దారువు అరణి యనఁబడును. అడుగున ఉన్న అరణి అధరారణి. పైని ఉన్న అరణి ఉత్తరారణి. అరణియందు అగ్ని పుట్టును కావున, అగ్ని నిషిక్తమైన వీర్యమువంటిది. కావున ఓ అరణులారా! మీరు ఆజ్యముచే తడుపఁబడినవారై నిషిక్తవీర్యమువంటి అగ్నిని ధరించుఁడు, అని "ఘృతేనాక్తే" ఇత్యాది మంత్రము చెప్పినది.

8. అర్థము: "గాయత్రం ఛన్దోఽను ప్ర జాయస్వ" ఇతి ఆహ=ఓ యగ్నీ! నీవు హోతచే పఠింపఁబడుచున్న గాయత్రీ ఛ్ఛందో బద్ధమైన మంత్రము ననుసరించి ఉద్భవించుము; అని ఈ మంత్రము చెప్పినది. (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యగ్నిని, ఛన్దోభిరేవ=ఛందోయుక్త మంత్రములచేతనే, ప్ర జనయతి=ప్రకర్షముగ పుట్టించు చున్నాఁడు.

9. అర్థము: (హే హోతః!=ఓ హోతా!) మధ్యమానాయ=మథింపఁబడుచున్న, అగ్నయే=అగ్నికొఱకు, అను బ్రూహి=వెంటనే మంత్రమును ఉచ్చరించుము. ఇతి=అని, ఆహ=వేదము చెప్పెను.

తాత్పర్యము: 'ఓ హోతా! మథింపఁబడుచున్న అగ్నికొఱకు మంత్రమును పఠించుము' అని వేదము చెప్పినది. దీనికి 'ప్రైష' అని వ్యవహారము. ఈ ప్రైషను ఉచ్చరించు మని హోతకు అధ్వర్యుఁడు చెప్పను.

10. అర్థము: సావిత్రీమ్=సవితృ పద ఘటితమైన, ఋచమ్="అభి త్వా దేవ సవితః" అను ఋక్కును, అను ఆహ=అగ్నిని మథించుచుండఁగానే హోత పఠించవలెను. (అనేన=ఈ ఋక్కును పఠించుటచే,) సవితృ ప్రసూతః ఏవ=అధ్వర్యుఁడు సవితృదేవ ప్రేరితుఁడే అయినవాఁడై, ఏనమ్=ఈ యగ్నిని, మన్థతి=మథించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: అగ్నిమథన సమయమునందు సవితృ పదము కలిగియున్న "అభి త్వా దేవ సవితః" అను ఋక్కును పఠించ వలెను. ఈ పఠనముచేత అధ్వర్యుఁడు సవితృ దేవత ప్రేరితుఁడే అయినవాఁడై అగ్నిని మథించుచున్నవాఁ డగును. (ఇది హోత పఠించవలయు నని పూర్వ వాక్యమున అధ్వర్యుఁడు ప్రైషను చెప్పియుండెను.)

11. అర్థము: "జాతాయాను బ్రూహి" ఇతి ఆహ=(మథించుటచే)'పుట్టిన అగ్నికొఱకు, (ఓ హోతా!) ఋక్కును వెంటనే పఠించుము.' అని వేదము చెప్పెను. "ప్రహ్రియమాణాయాను బ్రూహి" ఇతి ఆహ='(ఓ హోతా! పూర్వాగ్నియం దుంచఁబడిన అగ్నికొఱకు వెంటనే ఋక్కును పఠించుము.' అని వేదము చెప్పెను. కాణ్డే కాణ్డే క్రియమాణే ఏవ=ప్రతి కాండము అనుష్ఠించఁబడుచున్నప్పుడే, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యగ్నిని, సమర్ధయతి=సమృద్ధుని చేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: మంథనకాండము మథితాగ్నికి జన్మకాండము. మంథనమువలన ఉత్పన్నమైన అగ్నిని పూర్వాగ్నియం దుంచుట అనెడి కాండము. మూఁడు కాండములు (ప్రకరణములు) కలవు. ఈ యన్ని కాండములందు (అనఁగా మంథన సమయముననను, అగ్ని జన్మ సమయముననను, జాతాగ్నిని పూర్వాగ్నియం దుంచుసమయముననను,) హోత మంత్రములను పఠించినప్పుడే (ప్రైష ఉన్నపుడే,) ఆ మంత్రములచే అగ్ని సమృద్ధుఁ డగును.

12. అర్థము: సర్వాః గాయత్రీః=సర్వ గాయత్రీ ఛ్ఛందస్కములైన ఋక్కులను, అన్వాహ=హోత అగ్ని మంథనానంతరము జన్మానంతరము ప్రహరణానంతరము పఠించవలెను. (ప్రహరణము=నూతనాగ్నిని పూర్వాగ్నియందుంచుట) అగ్నిః=అగ్ని, గాయత్రచ్ఛన్దాః వై=గాయత్రీ ఛ్ఛందస్సు కలవాఁడు కదా! (ఏషః=ఈ యగ్ని,) ఏనమ్=ఈ యజమానుని, స్వేన ఛన్దసైవ=స్వీయ ఛ్ఛందస్సుచేతనే, సమర్ధయతి=సమృద్ధుని చేయును.

తాత్పర్యము: మంథన సమయమున హోత "అభి త్వా దేవ సవితః" ఇత్యాది ఋక్కులను పఠించవలయును. అగ్ని పుట్టఁగానే హోత "ఉత బ్రువన్తు జన్తవః" ఇత్యాది ఋక్కులను పఠించవలయును. ఈ నూతనాగ్నిని పూర్వాగ్నియం దుంచుసమయమున హోత "ప్ర దేవం దేవవీతయే" ఇత్యాది ఋక్కులను పఠించవలయును. ఈ ఋక్కు లన్నియు గాయత్రీచ్ఛందస్సు కలవి. అగ్ని గాయత్రితో కూడ పుట్టుటచే గాయత్ర ఛ్ఛందస్కుఁడు. ఇట్టి యగ్ని స్వీయ గాయత్రీ ఛ్ఛందస్సుచేతనే యీ యజమానుని సమృద్ధుని చేయును.

13. అర్థము: అగ్నిః=అగ్ని, పురా=పూర్వము, భవతి=(ఆహవనీయమందు,)ఉంటున్నాఁడు. (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అగ్నిమ్=అగ్నిని, మథిత్వా=మథించి, ప్ర హరతి=పూర్వాగ్నియం దుంచుచున్నాఁడు. తౌ=ఆ ఉభయాగ్నులు, సంభవన్తౌ=కలసికొనినవారు, (భవతః=అగుచున్నారు.) యజమానమ్ అభి=యజమాను నుద్దేశించి, సంభవతః=భక్షించుటకు కలసికొనుచున్నారు. (అతః=ఈ కారణమువలన,) శాన్త్యై=(అగ్నులయొక్క) శాంతి కొఱకు, "భవతం నః సమనసౌ" ఇతి ఆహ='ఓ యగ్నులారా! మీరు ఉభయులు మమ్ముఁ గూర్చి సమాన మనస్కులు(విప్రతిపత్తి రహితులు) కండు.' అని వేదము చెప్పినది.

తాత్పర్యము: మొదట ఆహవనీయమునందు ఒక అగ్ని ఉన్నాఁడు. పిమ్మట అరణి మంథనమువలన అగ్ని ఉద్భవించినాఁడు. ఈ ఉభయాగ్నులు కలసికొనినవారై యజమానుని భక్షించుటకు సంసిద్ధు లైరి. కావున ఆ ఉభయాగ్నులను శాంతింపఁజేయుటకై "భవతం న స్సమనసౌ" విత్యాది మంత్రముచే యజమానుఁడు ప్రార్థించవలయును. "ఓ యగ్నులారా! మీరు ఉభయులు మమ్ముఁ గూర్చి సమాన మనస్కులు (విప్రతిపత్తి లేనివారు) కండు" అని ఈ మంత్రముయొక్క యర్థము. (ఈ మంత్రము కా. 1. ప్ర. 3. అను. 7. లోనిది.)

14. అర్థము: ప్రహృత్య=(ఆహవనీయాగ్నియందు నూతనాగ్నిని)ఉంచి, జుహోతి=హోమము చేయవలయును. జాతాయ అస్మై ఏవ=మంథనమువలన పుట్టిన ఈ అగ్నికొఱకే, అన్నమ్ అపి=అన్నమును కూడ, దధాతి=ఉంచవలయును. ఆజ్యేన=నేతితో, జుహోతి=హోమము చేయవలయును. ఆజ్యం యత్(అస్తి)=నేయి యేది (కలదో,) ఏతత్=ఈ నేయి, అగ్నేః=అగ్నికి, ప్రియం ధామ వై=ఇష్టమైన స్థానమే. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁగా, అయమ్=ఈ యజమానుఁడు, ప్రియేణ ధామ్నా ఏవ=ఇష్టమైన స్థానముచేతనే, ఏనమ్=ఈ యగ్నిని, సమర్థయతి=సమృద్ధుని చేయుచున్నవాఁ డగుచున్నాఁడు. అథో=మఱియు, తేజసా=తేజస్సుచే, సమర్ధయతి=సమృద్ధుని చేయుచున్నవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: అరణిమంథనమువలన పుట్టిన అగ్నిని ఆహవనీయాగ్నియం దుంచి హోమము చేయవలయును. మంథనమువలన పుట్టిన ఈ యగ్నికొఱకే అన్నమును కూడ ఉంచవలయును. పిమ్మట ఆజ్యముచే హోమము చేయవలయును. నేయి అగ్నికి ప్రియమైనదే. కావున ఈ విధముగ చేసిన యజమానుఁడు ప్రియమైన ఆజ్యముచేతనే ఈ యగ్నిని సమృద్ధుని చేసినవాఁ డగును. మఱియు తేజస్సుచే సమృద్ధుని చేసినవాఁ డగును.

పంచమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే షష్ఠోఽనువాకః

మూలము: [1]ఇషే త్వేతి బర్హిరా దత్త ఇచ్ఛత ఇవ హ్యేష యో యజత [2]ఉపవీరసీత్యాహోప హ్యేనానాకరో [3]త్యుపో దేవాన్దైవీర్విశః ప్రాగురిత్యాహ దైవీర్హ్యేతా విశః సతీ ర్దేవానుప యన్తి [4]వహ్నీరుశిజ ఇత్యాహ ర్త్విజో వై వహ్నయ ఉశిజ స్తస్మా దేవమాహ [5]బృహస్పతే ధారయా వసూనీతి(౧) ఆహ బ్రహ్మ వై దేవానాం బృహస్పతి ర్బ్రహ్మణైవాస్మై పశూనవ రున్ధే [6]హవ్యా తే స్వదన్తా మిత్యాహ స్వదయ త్యేవైనా [7]న్దేవ త్వష్టర్వసు రణ్వేత్యాహ త్వష్టా వై పశూనాం మిథునానాగ్ం రూపకృద్రూపమేవ పశుషు దధాతి [8]రేవతీ రమధ్వ మిత్యాహ పశవో వై రేవతీః పశూనేవాస్మై రమయతి [9]దేవస్య త్వా సవితుః ప్రసవ ఇతి (౨)రశనామా దత్తే ప్రసూత్యా అశ్వినో ర్బాహుభ్యా మిత్యాహాశ్వినౌ హి దేవానా మధ్వర్యూ ఆస్తాం పూష్ణో హస్తాభ్యా మిత్యాహ యత్యా [10]ఋతస్య త్వా దేవహవిః పాశేనాఽఽరభ ఇత్యాహ సత్యం వా ఋతగ్ం సత్యేనైవైన మృతేనాఽఽరభతే [11]ఽక్ష్ణయా పరి హరతి వధ్యగ్ం హి ప్రత్యఞ్చం ప్రతిముఞ్చన్తి వ్యావృత్త్యై [12]ధర్షా మానుషానితి ని యునక్తి ధృత్యా [13]అద్భ్యః(3)త్వౌషధీభ్యః ప్రోక్షామీత్యాహాద్భ్యో హ్యేష ఓషధీభ్యః సంభవతి యత్పశు [14]రపాం పేరు రసీత్యాహైష హ్యపాం పాతా యో మేధాయాఽఽరభ్యతే [15]స్వాత్తం చిత్సదేవగ్ం హవ్యమాపో దేవీః స్వదతైన మిత్యాహ స్వదయత్యేవైన [16]ముపరిష్టా త్ప్రోక్షత్యుపరిష్టాదేవైనం మేధ్యం కరోతి పాయయత్యన్తరత ఏవైనం మేధ్యం కరోత్యధస్తా దుపోక్షతి సర్వత ఏవైనం మేధ్యం కరోతి (౪)||

(వసూనీతి ప్రసవ ఇత్యద్భ్యోఽన్తరత ఏవైనం దశ చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే షష్ఠోఽనువాకః ||౬||

# వేదార్థదీపిక

అవతారిక: ప్రథమ కాండమునందలి తృతీయ ప్రపాఠకమునఁ గల సప్తమానువాకమునందు ప్రథమమున "ఇషే త్వోపవీః" ఇత్యాదులైన అగ్నీషోమీయ పశూపాకరణ మంత్రములు ఆమ్నాతము లైనవి. తరువాత "అగ్నే ర్జనిత్రమసీ" త్యాదులైన మంథన మంత్రము లామ్నాతములైనవి. ఈ మంత్రములకు వ్యాఖ్యాన రూపమైన (షష్ఠ కాండమునందలి తృతీయ ప్రపాఠకమునఁ గల పంచమానువాకరూప) బ్రాహ్మణ భాగము ఔత్సుక్యమువలన ప్రథమమున మంథన మంత్రములను వ్యాఖ్యానించినది. మంథన మంత్రములకంటె పూర్వము ఆమ్నాతము లైన "ఇషే త్వోపవీః" ఇత్యాదులైన పశూపాకరణ మంత్రము లీ షష్ఠానువాకాత్మక బ్రాహ్మణ భాగమున వ్యాఖ్యానింపఁబడుచున్నవి. పశూపాకరణ మంత్రములను వ్యాఖ్యానింపఁబోవుచు బ్రాహ్మణ రూపమైన వేదము పశునియోజనమునకై బర్హిరాదానమును విధించుచున్నది.

1. అర్థము: "ఇషే త్వా" ఇతి="ఇషే త్వా" 'ఓ బర్హిస్సూ! కోరఁబడుచున్న దేవాన్నముకొఱకు నిన్ను గ్రహించు చున్నాను' అను మంత్రముచే, బర్హిః=బర్హిస్సును, ఆదత్తే=గ్రహించవలెను. యః=ఏ యజమానుఁడు, యజతే=యాగము చేయుచున్నాఁడో, ఏషః=ఈ యజమానుఁడు, ఇచ్ఛతే ఇవ హి=(దేవతలకొఱకు పశు రూప హవిస్సును ఇచ్చుటకు) కోరుచున్నవానివలె నున్నాఁడు కదా!

తాత్పర్యము: యాగము చేయు యజమానుఁడు దేవతలకు పశురూప హవిస్సు నొసఁగుటకు ఇచ్ఛయించుచునే యున్నాఁడు. కనుక పశూపాకరణమునకై "ఇషే త్వా" అను మంత్రమును పఠించుచు అధ్వర్యుఁడు బర్హిస్సును గ్రహించవలయును. (పశురూప హవిస్సు దేవతలకు అన్నము.) ఇది బర్హి రాదాన విధాయక మంత్రము.

2. అర్థము: "ఉపవీః అసి" ఇతి ఆహ=(ఓ జువ్వికొమ్మా! నీవు దేవతల నాహ్వానించుటకై వారి సమీపమునకు పోవుదాన వగుచున్నావు.) అని వేదము చెప్పినది. (ప్లక్షశాఖా=జువ్వికొమ్మ,) ఏనాన్=ఈ దేవతలను, ఆ కరోతి హి=ఆహ్వానించుచున్నది కదా!

తాత్పర్యము: ప్లక్షశాఖ (జువ్వికొమ్మ)దేవతల నాహ్వానించునది. కావున ప్లక్షశాఖను ఉపవి యని వేదము చెప్పినది. (ఉప=దేవతల సమీపమునకు, వాతితి వీః=ఆహ్వానించుటకై పోవునది అని వ్యుత్పత్త్యర్థము.)

3. అర్థము: "ఉపో దేవాన్దైవీర్విశః ప్రాగుః" ఇతి ఆహ='యాగ పశువుయొక్క హృదయాద్యవయవములు దేవతలను దేవ ప్రజలను సమీపమునందు పొందినవి' అని వేదము చెప్పినది. (పశువుయొక్క హృదయాద్యవయవములే, ఏతాః దైవీః విశః సతీః=ఈ దేవ సంబంధులైన ప్రజలుగా నగుచున్నవియై, దేవాన్=దేవతలను, ఉప యన్తి=పొందుచున్నవి.

తాత్పర్యము: యజ్ఞపశువుయొక్క హృదయాద్యవయవములే పదార్థములుగా దేవప్రజ లగుచు దేవతలను పొందుచున్నవి అని "ఉపో దేవాన్దైవీర్విశః" అను మంత్రము చెప్పుచున్నది.

4. అర్థము: "వహ్నీ రుశిజః" ఇతి ఆహ='యజ్ఞపశువుయొక్క హృదయాద్యవయవములు యాగనిర్వాహకులైన (హోమము చేయఁగా మిగిలిన పశు హవిస్సును భక్షించుటకు) ఇచ్ఛ కల ఋత్విజులను పొందినవి' అని ఈ మంత్రభా గము చెప్పినది. ఋత్విజః వై=ఋత్విజులే, వహ్నయః=యాగనిర్వాహకులైన, ఉశిజః=శేష పశుహవిస్సును భక్షింప నిచ్ఛ కలవారు. తస్మాత్=ఆ కారణమువలన, ఏవమ్=ఈ విధముగ, ఆహ=వేదము చెప్పినది.

తాత్పర్యము: "వహ్నీ రుశిజః" అను మంత్రభాగమునందలి వహ్ని శబ్దము వాహకవాచి యను నర్థము నభిలక్షించి ఇచట వివరింపఁబడినది. ఋత్విజులే యాగనిర్వాహకులైన పశు హవి రృక్షణ కాములు కావున ఈ విధముగ వేదము చెప్పినది.

5. అర్థము: "బృహస్పతే ధారయా వసూని" ఇతి ఆహ='ఓ బృహస్పతీ! పశు హృదయాది ద్రవ్యములను పోషించుము' అని వేదము చెప్పినది. బృహస్పతిః=బృహస్పతి, దేవానామ్=దేవతలకు, బ్రహ్మ వై=బ్రహ్మయే. బ్రహ్మ

బైవ=బ్రహ్మచేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, పశూన్=పశువులను, అవరున్ధే=(అధ్వర్యుఁడనైన నేను పొందుచున్నాను.

తాత్పర్యము: 'ఓ బృహస్పతీ! యజ్ఞపశువులయొక్క హృదయాది ద్రవ్యములను పోషించుము' అని వేదము చెప్పినది. బృహస్పతి దేవతలకు బ్రహ్మయే కావున బ్రహ్మచేతనే నేను(అధ్వర్యుఁడు) ఈ యజమానునికొఱకు పశువులను పొందుచున్నాను. (బృహస్పతి పశుప్రదుఁడుగా ఇచట ప్రార్థించఁబడినాఁడు.)

6. అర్థము: "హవ్యా తే స్వదన్తామ్" ఇతి ఆహ='ఓ యజ్ఞపశూ! నీ హవిస్సులు స్వాదువు(రుచ్యము) లగుఁగాక' అని వేదమంత్రము చెప్పినది. ఏనాన్=ఈ పశు హృదయాది ద్రవ్యములను, స్వదయత్యేవ=స్వాదువులుగానే చేయును.

తాత్పర్యము: యజ్ఞ పశువుయొక్క హృదయాది ద్రవ్యములను స్వాదువులుగా చేయుటకై ఈ యాశీస్సు చెప్పఁబడినది. ఓ పశూ! నీ హవిస్సులు స్వాదువు లగుఁగాక, అని వేదము చెప్పినది. ఈ యాశీస్సు యజ్ఞపశు హవిస్సును స్వాదువుగానే చేయును.

7. అర్థము: "దేవ త్వష్ట ర్వసు రణ్వ" ఇతి ఆహ=' ఓ త్వష్టృనామక దేవా! పశు ద్రవ్యమును రమణీయముగాఁ జేయుము' అని వేదము చెప్పినది. త్వష్టా వై=త్వష్టృ దేవుఁడే, పశూనాం మిథునానామ్=పశువుల జంట లకు రూపకృత్=రూపమును చేయువాఁడు. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ త్వష్టృదేవుఁడు,) పశుషు=పశువులయందు, రూపమ్=రూపమును, దధతి ఏవ=తప్పక ఉంచును(చేయును).

తాత్పర్యము: ఓ త్వష్టృదేవా! నీవు పశు ద్రవ్యములను రమణీయముగాఁ జేయుము అని వేదము చెప్పినది. త్వష్టృ దేవుఁడే పశు మిథునములకు రూప కల్పన చేయువాఁడు కావున ఈ ప్రార్థనచేత త్వష్ట నిశ్చయముగ పశువులయందు రూప కల్పన చేయును. (త్వష్ట పశు మిథున రూప కర్త కావున తద్రూపకల్పనకై ఇచట ప్రార్థింపఁబడినాఁడు.)

8. అర్థము: "రేవతీ రమధ్వమ్" ఇతి ఆహ='క్షీరాది రూప ధనము కల ఓ పశువులారా! మీరు (యజమాన గృహమునందు) క్రీడించుఁడు' అని వేదము చెప్పినది. పశవః=పశువులు, రేవతీః వై=క్షీరాది రూపములైన ధనములు కలవి కదా! అస్మై=ఈ యజమానుఁడు, (ప్రథమార్థమున చతుర్థి.) పశూన్=పశువులను, రమయతి ఏవ=తప్పక క్రీడింపఁజేయును.

తాత్పర్యము: "రేవతీ రమధ్వమ్" అను మంత్రమునందలి రేవతీ శబ్దమును పశుపరముగా ఈ బ్రాహ్మణ వాక్యము వ్యాఖ్యానించుచున్నది. తాత్పర్యము సులభము.

9. అర్థము: (హే రశనే!=ఓ రశనా!,) "దేవస్య త్వా సవితుః ప్రసవే" ఇతి='ప్రేరకుఁడైన దేవునియొక్క ప్రేరణము కలుగుచుండఁగా నిన్ను గ్రహించుచున్నాను.' అను మంత్రముచేత, రశనామ్=పశుబంధన సాధనమైన త్రాటిని, ఆదత్తే=గ్రహించవలెను. (ఏతత్=ఈ గ్రహణము,) ప్రసూత్యై=దేవునియొక్క ప్రేరణము కొఱకు, (భవతి=అగుచున్నది.) "అశ్వినో ర్బాహుభ్యామ్" ఇతి ఆహ="అశ్వినీదేవతలయొక్క బాహువులచేత (నిన్ను గ్రహించుచున్నాను.)" అని వేదము చెప్పినది. అశ్వినా=అశ్వినీ దేవతలు, దేవానామ్=దేవతలకు, అధ్వర్యూ హి=అధ్వర్యులు కదా! "పూష్ణో హస్తాభ్యామ్" ఇతి ఆహ='పూష దేవునియొక్క హస్తములచేత (రశనను గ్రహించుచున్నాను.)' అని వేదము చెప్పినది. (ఏతత్=ఇది,) యత్యై=పశువుయొక్క నియమనముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ఈ బ్రాహ్మణ భాగము ప్రథమాష్టకమునందలి తృతీయ ప్రపాఠకములోని అష్టమానువాక మంత్రములకు వ్యాఖ్యానరూపము. ఆ యష్టమానువాకారంభమునందలి 'ఆదదే' అను పదముచేత "దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్" అను మంత్రము పూరింపఁబడినది. అధ్వర్యుఁడు ఈ

మంత్రమునందలి "దేవస్య త్వా సవితుః ప్రసవే" అను మంత్రమును పఠించుచు యజ్ఞపశువును బంధించుటకై త్రాటిని హస్తములతో పట్టుకొనవలెను. అశ్వినీ దేవతలు దేవతల యజ్ఞములందు అధ్వర్యులుగా నుండువారు కనుక "అశ్వినో ర్బాహుభ్యా" మని వేదము చెప్పినది. "పూష్ణో హస్తాభ్యామ్" అను మంత్ర భాగమును పఠించుట యజ్ఞపశువును కదలకుండ నియమించుటకొఱకు కగుచున్నది.

10. అర్థము: "ఋతస్య త్వా దేవహవిః పాశేనాఽఽరభే" ఇతి ఆహ='ఓ దేవహవీ రూప పశూ! యజ్ఞసిద్ధికొఱకు నిన్ను పాశముచే బంధించుచున్నాను' అని వేదము చెప్పినది. ఋతమ్=యజ్ఞము, సత్యం వై=తప్పనిసరిగ కలిగెడి ఫలముతోఁ గూడియుండుటచే సత్యస్వరూపమే. సత్యేన ఋతేన ఏవ=సత్యరూపమైన యజ్ఞము అనెడి నిమిత్తముచేతనే, ఏనమ్=ఈ పశువును, ఆరభతే=బంధించుచున్నాఁడు.

తాత్పర్యము: "ఋతస్య త్వా దేవహవిః పాశేనాఽఽరభే" అను మంత్రమునందలి ఋతశబ్దార్థమును ఈ బ్రాహ్మణ భాగము వివరించుచున్నది. యజ్ఞము నియమముగ ఫలము నొసఁగునది. అందువలన యజ్ఞము సత్యరూపము. అట్టి సత్యరూప యజ్ఞమునిమిత్తమే అధ్వర్యుఁడు ఈ యజ్ఞపశువును బంధించుచున్నాఁడు.

11. అర్థము: అక్ష్ణయా=వక్రముగా, పరిహరతి=అధ్వర్యుఁడు యజ్ఞపశువును పాశముచే చుట్టవలెను. వధ్యమ్=(లోకమునందు మాంసభక్షకులు,) వధ్యమైన పశువును, ప్రత్యఞ్చమ్=స్వాభిముఖముగ,(పశువు నుంచి) ప్రతి ముఞ్చన్తి హి=(కంఠమునందు పాశమును,) ఉంచుచున్నారు కదా! వ్యావృత్త్యై=ఆ లోకాచారముయొక్క వ్యావృత్తికై, (ఏతత్=ఈ వక్రబంధనము, విహితమ్=విధించఁబడినది.)

తాత్పర్యము: లోకమునందు మాంసభక్షకులు వధార్హమైన పశువును తమ కభిముఖముగ ఉంచి దానికంఠమునందు త్రాటిని బిగించుచున్నారు. ఆ లోకాచారమునకు భిన్నముగ అధ్వర్యుఁడు యజ్ఞపశువును పాశముచే వక్రముగ చుట్టవలయును (బంధించవలయును). ఇచట బంధన పద్ధతి విహిత మైనది. (వక్రబంధనము అనఁగా త్రాటిని యజ్ఞపశువుయొక్క దక్షిణపాదము మొదలు శిరోభాగము వఱకు చుట్టుట.)

12. అర్థము: "ధర్షా మానుషాన్" ఇతి="యజ్ఞమునందు వినియోగింపఁబడుచున్న యో పశూ! దేవత్వ ప్రాప్తిచే నీవు మనుష్య కృతములగు తాడనా ద్యుపద్రవములను తిరస్కరించుము," అను మంత్రముచే, ధృత్యై=పలాయన నివారణ రూపమైన ధృతికొఱకు, ని యునక్తి=(యజ్ఞపశువును) నిరంతరము బంధించవలయును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు "ధర్షా మానుషాన్" అను మంత్రభాగమును పఠించుచు పలాయన నివారణముకై యజ్ఞపశువును నిరంతరము బంధించుచుండవలెను. ఇచట బంధనము విహిత మైనది.

13. అర్థము: "అద్భ్య స్త్వౌషధీభ్యః ప్రోక్షామి" ఇతి ఆహ='ఓ పశూ! నిన్ను ఉదకములచేతను, ఓషధులచేతను ప్రోక్షించుచున్నాను' అని వేదము చెప్పినది. పశుః యత్=పశువు ఏది కలదో, ఏషః=ఈ పశువు, అద్భ్యః=ఉదకములనుండి, ఓషధీభ్యః=ఓషధులనుండి, సంభవతి హి=పుట్టుచున్నది కదా!

తాత్పర్యము: ఓ యజ్ఞపశూ! నేను (అధ్వర్యుఁడు) నిన్ను ఉదకములచేతను ఓషధులచేతను ప్రోక్షించుచున్నాను అను నర్థము కల "అద్భ్యస్త్వౌషధీభ్యః ప్రోక్షామి" అను మంత్రమును పఠించుచు యజ్ఞపశువును ఉదకములచేత, ఓషధుల (దర్భల)చేతను ప్రోక్షించవలెను. పశువు నీటివలన, ఓషధులవలన పుట్టును. కావున వేదము ఈ విధముగ చెప్పినది. (వైదిక కర్మలందు దర్భలచే నీటిని ఉత్పవనము చేయుదురు కావున, దర్భలకు కూడ ప్రోక్షణ సాధనత్వము కలదు. ఉత్పవనము=నీటిలో దర్భలనుంచి యా దర్భల ముందుకు, వెనుకకు కదలించుట.)

14. అర్థము: "అపాం పేరు రసి" ఇతి ఆహ='ఓ యజ్ఞపశూ! నీవు నీటిని త్రాగుదానవు అగుచున్నావు' అని వేదము చెప్పినది. యః=ఏ పశువు, మేధాయై=యజ్ఞముకొఱకు, ఆరభ్యతే=ఆలంభనము(విశసనము) చేయఁబడుచున్నదో, ఏషః=ఈ పశువు, అపాం పాతా హి=నీటిని త్రాగునది కదా!

తాత్పర్యము: "అపాం పేరు రసి" అని వేదము చెప్పినది. యజ్ఞముకొఱకు అలంభనము చేయఁబడు పశువు అలంభము నకు పూర్వము నీటిని త్రాగునట్టిది. కావున వేదము ఈ విధముగ చెప్పినది. (ఈ మంత్రమునందలి పేరు శబ్దము పాతృవాచి యని ఈ బ్రాహ్మణ భాగము వివరించినది. యజ్ఞముకొఱకు అలభ్యమాన మగుచున్న పశువునకు ఇఁక పైని ఉదకపాన ముండదు. కావున ఇప్పుడే ఉదక పాతృత్వ ముండును.)

15. అర్థము: "స్వాత్రం చిత్సదేవగ్ం హవ్య మాపో దేవీః స్వదతైనమ్" ఇతి ఆహ='ఓ ఉదక దేవతలారా! స్వాదుపై యున్నను దేవతకొఱకు హవ్యమైన (హోమము చేయుటకు యోగ్యమైన) ఈ యజ్ఞపశువును స్వాదువుగా చేయుఁడు' అని వేదము చెప్పినది. ఏనమ్=ఈ పశువును, (అనేన=ఈ మంత్రముచేత, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) స్వదయతి ఏవ=తప్పక స్వాదువుగా చేయును.

తాత్పర్యము: 'ఓ ఉదక దేవతలారా! ఈ పశూరూప హవిస్సు స్వాదుపై యున్నను హోమార్హమైన యీ పశువును ఇంకను స్వాదువుగా చేయుఁడు! అని వేదము చెప్పినది. ఈ వేదమంత్రముచే ఈ పశువునకు తప్పక స్వాదుత్వము కలుగును. (అని యీ బ్రాహ్మణము వివరించినది.)

16. అర్థము: ఉపరిష్టాత్=యజ్ఞపశువుయొక్క పైభాగమున, ప్రోక్షతి=ప్రోక్షించవలెను. (అనేన=ఈ ప్రోక్షణముచేత, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఉపరిష్టాత్ ఏవ=పైభాగమునందే, ఏనమ్=ఈ పశువును, మేధ్యమ్=పవిత్రమైన దానినిగా, కరోతి=చేయుచున్నాఁడు. పాయయతి=పశువుచే నీటిని త్రాగించవలయును. ( అనేన=దీనిచే) అన్తరతః ఏవ=అంతర్భాగమునందే, ఏనమ్=ఈ పశువును, మేధ్యమ్=పవిత్రమేనదిగా, కరోతి=చేయుచున్నాఁడు. అధస్తాత్=పశువుయొక్క క్రిందిభాగమున, ఉపోక్షతి=ప్రోక్షణము చేయవలెను. (అనేన=దీనిచే) సర్వతః ఏవ=పశువుయొక్క సర్వభాగములందును, ఏనమ్=ఈ పశువును, మేధ్యమ్=పవిత్ర మైనదిగా, కరోతి=చేయు చున్నాఁడు.

తాత్పర్యము: అధ్వర్యుఁడు "సం తే ప్రాణో వాయునా గచ్ఛతామ్" అను మంత్రముచే యజ్ఞపశువుయొక్క పైభాగ మున ప్రోక్షించవలెను. ఈ ప్రోక్షణముచే పశువుయొక్క ఉపరిభాగమునే పవిత్రముగా చేయును. "సం యజత్రై రఙ్గాని" అను మంత్రభాగముచే యజ్ఞపశువుచే నీటిని త్రాగించవలయును. దీనిచే పశువుయొక్క అంతర్భాగమునే పవిత్రముగా చేయును. "సం యజ్ఞపతి రాశిషా" అను మంత్రభాగముచే పశువుయొక్క అధోభాగమును ప్రోక్షించవలెను. దీనిచే యజ్ఞపశువును సర్వభాగములందు పవిత్రముగా చేయును. (ఈ మూఁడు మంత్రములచే అనుష్ఠేయములైన కర్మవిశేషము లిచట విహితము లైనవి.)

షష్ఠానువాకము సమాప్తము.

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే సప్తమోఽనువాకః

మూలము: [1]అగ్నినా వై హోత్రా దేవా అసురా నభ్యభవ న్నగ్నయే సమిధ్యమానాయాను బ్రూహీత్యాహ భ్రాతృ వ్యాభిభూత్యై [2]సప్తదశ సామిధేనీ రన్వాహ సప్తదశః ప్రజాపతిః ప్రజాపతేరాప్త్యై [3]సప్తదశాన్వాహ ద్వాదశ మాసాః పఞ్చర్తవః స సంవత్సరః సంవత్సరం ప్రజా అను ప్ర జాయన్తే ప్రజానాం ప్రజననాయ [4]దేవా వై సామిధేనీ రనూచ్య యజ్ఞం నాన్వపశ్యన్త్స ప్రజాపతి స్తూష్ణీ మాఘా రమ్(౧)ఆఽఘారయత్తతో వై దేవా యజ్ఞమన్వపశ్య న్యత్తూష్ణీ మాఘార మాఘారయతి యజ్ఞస్యా నుఖ్యాత్యా [5]అసురేషు వై యజ్ఞ ఆసీత్తం దేవాస్తూష్ణీగ్ం హోమేనావృఞ్జత యత్తూష్ణీ మాఘార మాఘారయతి భ్రాతృవ్యస్యైవ తద్యజ్ఞం వృఙ్క్తే [6]పరిధీన్త్సం మార్ష్టి పునాత్యేవైనా న్త్రిస్త్రిః సం మార్ష్టి త్ర్యావృద్ధి యజ్ఞోఽథో రక్షసా మపహత్యై ద్వాదశ సం పద్యన్తే ద్వాదశ(౨) మాసాః సంవ త్సరః సంవత్స రమేవ ప్రీణాత్యథో సంవత్సరమేవాస్మా ఉప దధాతి సువర్గస్య లోకస్య సమష్ట్యై [7]శిరో వా ఏతద్యజ్ఞస్య యదాఘారోఽగ్నిః సర్వా దేవతా యదాఘార మాఘారయతి శీర్షత ఏవ యజ్ఞస్య యజమానః సర్వా దేవతా అవ రున్ధే [8]శిరో వా ఏతద్యజ్ఞస్య యదాఘార ఆత్మా పశు రాఘార మాఘార్య పశుగ్ం సమనక్త్యాత్మన్నేవ యజ్ఞస్య (3)శిరః ప్రతి దధాతి [9]సం తే ప్రాణో వాయునా గచ్ఛతా మిత్యాహ వాయుదేవత్యో వై ప్రాణో వాయావేవాస్య ప్రాణం జుహోతి [10]సం యజత్రై రఙ్గాని సం యజ్ఞపతి రాశిషేత్యాహ యజ్ఞపతి మేవాస్యాఽఽశిషం గమయతి

[11]విశ్వరూపో వై త్వాష్ట్ర ఉపరిష్టాత్పశు మభ్యవమీ త్తస్మాదుపరిష్టా త్పశోర్నావ ద్యన్తి యదుప

రిష్టా త్పశుగ్ం సమనక్తి మేధ్యమేవ(४) ఏనం కరో [12]త్యృత్విజో వృణీతే ఛన్దాగ్ంస్యేవ వృణీతే

[13]సప్త వృణీతే సప్త గ్రామ్యాః పశవః సప్తాఽఽరణ్యాః సప్త ఛన్దాగ్ంస్యుభయస్యావరుధ్యా [14]ఏకాదశ

ప్రయాజా న్యజతి దశ వై పశోః ప్రాణా ఆత్మైకాదశో యావానేవ పశుస్తం ప్ర యజతి [15]వపామేకః

పరి శయ ఆత్మైవాఽఽత్మానం పరి శయే [16]వజ్రో వై స్వధితిర్వజ్రో యూపశకలో ఘృతం ఖలు

వై దేవా వజ్రం కృత్వా సోమ మఘ్నన్ఘృతేనాక్తౌ పశుం త్రాయేథా మిత్యాహ వజ్రేణైవైనం వశే

కృత్వాఽఽలభతే(൨)||

(ఆఘారం పద్యన్తే ద్వాదశాఽఽత్మన్నేవ యజ్ఞస్య మేధ్యమేవ ఖలు వా అష్టాదశ చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠకే సప్తమోఽనువాకః|| ౭ ||

## వేదార్థదీపిక

అవతారిక: షష్ఠానువాకమునందు అగ్నిష్టోమయాగ పశు నియోజనము విహిత మైనది. దానికి సంబంధించిన సామిధేనీ ఋక్పఠనము, ప్రయాజాదులును ఈ సప్తమానువాకమునందు విధింపఁబడుచున్నవి.

1. అర్థము: దేవాః=దేవతలు, హోత్రా అగ్నినా వై=(తమ యజ్ఞమునందు) హోతయైన అగ్నిచేతనే, అసురాన్=రాక్షసులను, అభ్యభవన్=పరాభవించిరి. (తత్=ఆ కారణమువలన, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) భ్రాతృవ్యాభిభూత్యై=శత్రుపరాభవముకొఱకు, సమిధ్యమానాయ=ప్రజ్వలించుచున్న, అగ్నయే=అగ్నికొఱకు, అనుబ్రూహి=సామిధేనీ ఋక్కులను పఠించుము, ఇతి=అని, ఆహ=(హోతతో)పలికెను.

తాత్పర్యము: పూర్వము దేవతలు తాము అనుష్ఠించిన యజ్ఞమునందు హోతృత్వము వహించిన అగ్నిచేతనే శత్రువులను పరాభవించిరి. ఆ కారణమువలన అధ్వర్యుఁడు శత్రుపరాభవమునకై ప్రజ్వలించుచున్న అగ్నికొఱకు సామిధేనీ ఋక్కులను వెంటనే పఠింపుము, అని హోతతో పలికెను. "అగ్నయే సమిధ్యమానాయాను బ్రూహి" అను మంత్రము ప్రైషమంత్రము.

2. అర్థము: సప్తదశ సామిధేనీః=పదునేడు సామిధేనీ ఋక్కులను, అన్వాహ=పఠించవలెను. ప్రజాపతిః=ప్రజాపతి, సప్తదశః=సప్తదశాక్షరాత్మకుఁడు. ప్రజాపతేః=ప్రజాపతియొక్క, ఆప్త్యై=ప్రాప్తికొఱకు, (ఏతత్=ఈ సప్తదశ సామిధేనీ ఋక్పఠనము, భవతి=అగుచున్నది.)

తాత్పర్యము: [అగ్ని సమింధనమునకై హోత పదునైదు సామిధేనీ ఋక్కులను పఠించవలె ననెడి చోదక ప్రాప్తమైన పంచదశ సంఖ్యను త్రోసిపుచ్చి యిచట సప్తదశ సంఖ్య విధింపఁబడుచున్నది.] హోత పదునేడు సామిధేనీ ఋక్కులను పఠించవలెను. ప్రజాపతి సప్తదశాక్షర స్వరూపుఁడు. (ప్రజాపతికి సప్తదశాక్షర స్వరూపత్వము పూర్వము చెప్పఁబడినది.) ఈ సప్తదశ సామిధేనీ ఋక్పఠనము ప్రజాపతిని పొందుటకు సాధన మగును.

3. అర్థము: సప్తదశ=సప్తదశ సామిధేనీ ఋక్కులను, అన్వాహ=పఠించవలెను. ద్వాదశ మాసాః=పంన్రెండు మాసములు, పఞ్చ ఋతవః=అయిదు ఋతువులు, సః సంవత్సరః=అది సంవత్సరము. ప్రజాః=ప్రజలు, సంవత్సరమ్ అను=సంవత్సరకాలము గర్భమునం దుండి పిమ్మట, ప్రజాయన్తే=జనించుచున్నారు. (ఏతత్=ఈ సప్తదశ సామిధేనీ ఋక్పఠనము,) ప్రజానామ్=ప్రజలయొక్క, ప్రజననాయ=జనించుటకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: (సప్తదశ సామిధేనీ ఋక్కుల పఠనము ననువదించి తత్ప్రశంస చేయఁబడుచున్నది.) పదునేడు సామిధేనీ ఋక్కులను పఠించవలెను. సంవత్సరమునందు సప్తదశ సంఖ్య కలదు. ఎట్లనఁగా సంవత్సరమునకు మాసములు పంన్రెండు. ఋతువులు అయిదు. (12+5=17.) ఈ విధముగ సంవత్సరమునందు సప్తదశ సంఖ్య ఉండుటచే తత్సామ్యము సంవత్సరమునకు ఏర్పడుచున్నది. ప్రజ (సంతానము) మాతృగర్భమునందు సంవత్సరకాలము ఉండి పిమ్మట జనించును. కావున ఈ సామిధేనీ ఋక్పఠనము సంతానోత్పత్తికి కారణ మగును.

4. అర్థము: దేవాః=దేవతలు, సామిధేనీః=సామిధేనీ ఋక్కులను, అనూచ్య=పఠించి, యజ్ఞమ్=యజ్ఞమును, న అన్వపశ్యన్ వై=కనుఁగొనరైరి. సః ప్రజాపతిః=ఆ ప్రజాపతి, తూష్ణీమ్=మంత్రోచ్చారణము లేకుండ, (అమంత్రకముగ) ఆఘారమ్ ఆఘారయత్=ఆఘార హోమము చేయించెను. తతః వై=అమంత్రకమైన ఆ ఆఘారహోమమువలననే, దేవాః=దేవతలు, యజ్ఞమ్=యజ్ఞమును, అపశ్యన్=కనుఁగొనిరి. తూష్ణీమ్=అమంత్రకముగ, ఆఘారమ్ ఆఘారయతి యత్=ఆఘార హోమము చేయుచో, (అయమ్=అమంత్రకమైన ఈ యాఘార హోమము,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, అనుఖ్యాత్యై=తెలిసికొనుటకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: (ఇచట అమంత్రక ప్రథమాఘార హోమము విధించఁబడుచున్నది.) పూర్వము దేవతలు సామిధేనీ ఋక్కులను పఠించి నేతితో ఆఘారహోమము చేసిరి. బహునియమములతోఁ గూడిన సామిధేనీ ఋక్పఠనమునందు వ్యాపృతమైన దేవతల బుద్ధి శ్రాంతమై తరువాత చేయవలసిన యజ్ఞమును తెలిసికొనలేకపోయెను. ఈ విషయమును గ్రహించిన యా ప్రజాపతి దేవతలచే అమంత్రకముగ (సామిధేనీ ఋక్పఠన రహితముగ) ఆజ్యములో ఆఘార హోమమును చేయించెను. అనఁగా ప్రజాపతి ఈ మంత్ర పఠన రహితమైన ఆఘార హోమముచే మంత్రవిషయ వ్యాపార జన్యమైన బుద్ధియొక్క శ్రమను తొలఁగించెను. దానివలననే దేవతలు పశ్చాత్కర్తవ్యమైన యజ్ఞమును తెలిసికొనిరి. కావున మంత్రపఠన రహితముగ ఆఘార హోమము చేయవలయును. ఇట్లు చేయుటవలన పశ్చాత్కర్తవ్య యజ్ఞవిషయక జ్ఞానము కలుగును. ఆఘార హోమానంతరము చేయవలసిన యజ్ఞవిధానమును తెలిసికొనఁగలుగునని భావము.

5. అర్థము: అసురేషు వై=రాక్షసులయందే, యజ్ఞః=యజ్ఞము, ఆసీత్=ఉండెను. దేవాః=దేవతలు, తమ్=ఆ యజ్ఞమును, తూష్ణీం హోమేన=మంత్ర పఠన రహితమైన ఆఘార హోమముచేత, అవృఞ్జత=నశింపఁజేసిరి. తూష్ణీమ్ ఆఘారమ్ ఆఘారయతి యత్=మంత్ర రహితముగ ఆఘార హోమము చేసినచో, తత్=ఆ తూష్ణీంహోమమువలన, భ్రాతృవ్యస్య=శత్రువుయొక్క, యజ్ఞమేవ=యజ్ఞమునే, వృఙ్క్తే=నశింపఁజేయును.

తాత్పర్యము: పూర్వము అసురులు గూఢచారులుగా నుండి దేవతలు చేసిన యజ్ఞమును చూచి తాము కూడ నా విధముగ యజ్ఞమును చేయుచుండిరి. దేవత లా విషయమును గ్రహించి గూఢచారుల సమీపమున మొదటి ఆఘార హోమమును అమంత్రకముగ చేసిరి. గూఢచారులవలన ఆ విధానమును తెలిసికొని అసురులు

సర్వయజ్ఞమును అమంత్రకముగనే చేసి నశించిరి. ఈ విషయమే "దేవా స్తూష్ణీం హోమేనావృఞ్జత" అను వాక్యమువలన వ్యక్త మగుచున్నది. కనుక అమంత్రకముగ ప్రథమాఘార హోమము చేయు నతఁడు శత్రువుయొక్క యజ్ఞమును నశింపఁజేయును.(ఇచట తూష్ణీంహోమము ప్రశంసింపఁబడినది.)

6. అర్థము: పరిధీన్=పరిధులను, సం మార్ష్టి=బాగుగ మార్జనము చేయవలయును. ఏనాన్=ఈ పరిధులను, పునాతి ఏవ=పరిశుద్ధములనుగానే చేయుచున్నాఁడు. త్రిః=మూఁడు మారులు, సం మార్ష్టి=సమ్మార్జనము చేయ వలెను. యజ్ఞః=యజ్ఞము, త్ర్యావృత్ హి=మూఁడు ఆవృత్తులు కలది కదా! (త్రిసః ఆవృత్తయః యస్యాసౌ=త్ర్యావృత్. యజ్ఞము మూఁడు ఆవృత్తులు కలిగియుండుట "త్రిః ప్రథమ మన్వాహ" ఇత్యాదు లందు ప్రసిద్ధము.) అథో=అందువలన, (ఏతత్ =ఈ మూఁడు మారులు సమ్మార్జనము,) రక్షసామ్=రాక్ష సులయొక్క, అపహత్యై=నాశముకొఱకు, భవతి=అగుచున్నది. ద్వాదశ=పంట్రెండు (సమ్మార్జనములు,) సంపద్యన్తే=సంపన్నము లగుచున్నవి. ద్వాదశ మాసాః=పంట్రెండు మాసములు, సంవత్సరః=సంవత్స రము. సంవత్సరమ్ ఏవ=సంవత్సరదేవతనే, ప్రీణాతి=సంతోష పెట్టుచున్నాఁడు. అథో=మఱియు,(అందు వలన,) సంవత్సరమ్ ఏవ=సంవత్సర దేవతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, ఉపదధాతి=(అధ్వర్యుఁడు) సమీపమునందు పొందించువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: (ఇచట మూఁడు పరిధులపైని సమ్మార్జనము, సమ్మార్జనావృత్తియు విధింపఁబడుచున్నవి.) పరిధులను ఉద కములతో సమ్మార్జనము చేయవలయును. ఈ సమ్మార్జనమువలన, అధ్వర్యుఁడు పరిధులపైని పడిన భస్మాదికమును తొలఁగించుటచే ఆ పరిధులను పరిశుద్ధములనుగా చేసినవాఁ డగుచున్నాఁడు. మూఁడు మారులు సమ్మార్జనము చేయవలెను. ఒక్కొక్క పరిధిపైని మూఁడు మారులు సమ్మార్జనము చేయుటచే మూఁడు పరిధులపైని సమ్మార్జనము తొమ్మిది మారులు మార్జనము చేసినవాఁ డగును. అగ్నిపైని మూఁడు మారులు సమ్మార్జనము చేయవలె నని దర్శపూర్ణమాస బ్రాహ్మణమునందు చెప్పఁబడినది. దానితో కలసి పంట్రెండు మారులు సమ్మార్జనము చేసిన ట్లగును. పంట్రెండు మాసములు సంవత్సర మగును. సంవ త్సర గత మాసముల సంఖ్య, పరిధుల సమ్మార్జన సంఖ్య సమాన మగుటచే సంఖ్యాసామ్యమును బట్టి పంట్రెండు మారులు పరిధి సమ్మార్జనము చేసిన యధ్వర్యుఁడు సంవత్సర దేవతనే సంతోషపఱచినవాఁ డగును. మఱియు నా యధ్వర్యుఁడు సంవత్సర దేవతనే ఈ యజమానుని సమీపమునకు తీసికొనివచ్చి నవాఁ డగును. ఇది స్వర్గలోక ప్రాప్తి కగును.

7. అర్థము: ఆఘారః యత్=ఆఘార హోమ మేది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, శిరః వై=శిరస్సే (శిరస్సు వంటిదే) అగ్నిః=అగ్ని, సర్వాః దేవతాః=సర్వదేవతా స్వరూపుఁడు. ఆఘారమ్ ఆఘారయతి యత్=ఆఘార హోమమును చేయుచో, యజమానః=యజమానుఁడు, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, శీర్షతః ఏవ=శిరస్సునుండియే, సర్వాః దేవతాః=సర్వదేవతలను, అవ రున్ద్ధే=పొందును.

తాత్పర్యము: పూర్వ మంత్రమున స్రౌవాఘార హోమము (స్రువముతో ఆఘారహోమము చేయుట) విహిత మైనది. ఇచట స్రుక్కుతో ఆఘార హోమము చేయుట విధింపఁబడుచున్నది. ఇది స్రుచ్యాఘారము. ఆఘార హోమ మనునది యజ్ఞమునకు శిరస్సువంటిది. అగ్ని సర్వదేవతా స్వరూపుఁడు. కనుక ఆఘార హోమమును చేసినచో అతఁడు యజ్ఞముయొక్క శిరస్సునుండియే సర్వదేవతలను పొందును. (ఆఘార శబ్దము పుంలిఙ్గ మైనను విధేయమైన శిర శ్శబ్దము నపుంసక మగుటచే 'ఏతత్ అనునది నపుంసకముగా ప్రయుక్త మైనది.) హోమములలో ఆఘార హోమము మొదటి దగుటచే అది యజ్ఞమునకు శిరోరూపముగ వర్ణింపఁబడినది.

8. అర్థము: ఆఘారః యత్=ఆఘారము ఏది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు శిరః వై=శిరస్సు(వంటిదే). పశుః=యజ్ఞపశువు, ఆత్మా=యజ్ఞమునకు ఆత్మ (వంటిది). ఆఘారమ్ ఆఘార్య=ఆఘార హోమము

చేసి, (ఆ ఆఘార శేషముచే,) పశుమ్=పశువును, సమనక్తి=బాగుగ తడుపవలెను. (తదా=అప్పుడు,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, ఆత్మన్నేవ=దేహమునందే, శిరః=శిరస్సును, ప్రతి దధాతి=ప్రతిష్ఠించినవాఁడగును. (ఆత్మా=కంఠమునకు అధోవర్తియగు దేహము.)

తాత్పర్యము: ఆఘార హోమము యజ్ఞమునకు శిరస్సువంటిది. యజ్ఞపశువు యజ్ఞమునకు దేహమువంటిది. ఆఘార హోమము చేసి యజమానుఁడు ఆ ఆఘార(ఆజ్య)శేషముచే యజ్ఞపశువును తడుపవలెను. అనఁగా పశువుపైని ఆ ఆజ్యమును పోయవలెను. అట్లు చేసిన యజమానుఁడు యజ్ఞముయొక్క దేహముపైని శిరస్సునుంచినవాఁ డగును. (ఇచట స్రుక్కుచేత ఆఘార శేషముతో పశ్వంజనము చేయుట విహిత మైనది.)

9. అర్థము: "సం తే ప్రాణో వాయునా గచ్ఛతామ్" ఇతి ఆహ='ఓ పశూ! నీ ప్రాణము వాయువుతో కలియుఁగాక' అని వేదము చెప్పినది. ప్రాణః=ప్రాణము, వాయుదేవత్యః వై=వాయు దేవతాకమే. (తత్=ఆ కారణమువలన, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అస్య=ఈ పశువుయొక్క, ప్రాణమ్=ప్రాణమును, వాయౌ ఏవ=వాయువునందే, జుహోతి=హోమము చేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ("సం తే ప్రాణో వాయునా గచ్ఛతామ్" ఇత్యాది మంత్రములు 1.కాం. 3.ప్ర. 8. అనువాకములోనివి. ఆ మంత్రములు ఈ 9,10 బ్రాహ్మణ వాక్యములచే వివరింపఁబడుచున్నవి. ప్రాణమునకు బాహ్యవాయు సంగమము యుక్త మని ఈ బ్రాహ్మణము వివరించినది.) "ఓ యజ్ఞపశూ! నీ ప్రాణము వాయువుతో కలియుఁగాక" అని వేదము చెప్పినది. ప్రాణము వాయుదేవతాకమే కావున అధ్వర్యుఁడు ఈ యజ్ఞపశువుయొక్క ప్రాణమును వాయువునందే హోమము చేసినవాఁ డగుచున్నాఁడు.

10. అర్థము: "సం యజత్రై రఙ్గాని సం యజ్ఞపతి రాశిషా" ఇతి ఆహ='ఓ యజ్ఞపశూ! నీ హృదయాద్యంగములు యాగ విశేషములతో కలియుఁగాక. యజ్ఞకర్త యజ్ఞఫలమైన ఆశీస్సుతో కలియుఁగాక' అని వేదము చెప్పినది. (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అస్య= ఈ మంత్రముయొక్క, ఆశిషమ్=ఆశీస్సును, యజ్ఞపతిమ్ ఏవ=యజ్ఞకర్తనే, గమయతి=పొందించును.

తాత్పర్యము: ఓ యజ్ఞపశూ! నీ హృదయాద్యంగములు యాగవిశేషములతో కలియుఁగాక. యజ్ఞకర్త యాగఫలమైన ఆశీస్సుతో కలియుఁగాక అని అధ్వర్యుఁడు కోరుటచేత అతఁడు యజమానునకు ఆశీస్సును కలుగఁజేయునని భావము.

11. అర్థము: త్వాష్ట్రః=త్వష్టృప్రజాపతి కుమారుఁడైన, విశ్వరూపః=విశ్వరూపుఁడు, పశుమ్ అభి=పశువు నభిముఖముగ పొంది, ఉపరిష్టాత్=పైభాగమున, అవమీత్ వై=వమనము చేసెనఁట! తస్మాత్=ఆ కారణమువలన, పశోః=పశువుయొక్క, ఉపరిష్టాత్=పైభాగమునుండి, న అవద్యన్తి=వపాదిక హవిర్ద్రవ్యమును అవదానము చేయుట లేదు. పశుమ్=పశువును, ఉపరిష్టాత్=పైభాగమున, సమనక్తి యత్=ఆఘార శేషముతో తడిపినచో, ఏనమ్=ఈ యాగపశువును, మేధ్యమేవ=పరిశుద్ధమునుగానే, కరోతి=చేయుచున్నవాఁ డగును. (ఉపరిష్టాత్=ఉపరిభాగము. అనఁగా పశువుయొక్క పృష్ఠభాగము.)

తాత్పర్యము: త్వష్టృప్రజాపతి కుమారుఁడైన విశ్వరూపుఁడు యజ్ఞపశువునొద్దకు వచ్చి దాని పృష్ఠభాగమునందు వమనము చేసెను. కావున యాజ్ఞికులు హోమార్థము యజ్ఞపశువుయొక్క పృష్ఠభాగమునుండి వపాది హవిర్ద్రవ్యమును అవదానము చేయుట లేదు. కనుక అధ్వర్యుఁడు ఆఘార శేషముచే యజ్ఞపశువును పృష్ఠభాగమున తడిపినచో ఆ పశువును పరిశుద్ధముగానే చేసినవాఁ డగును. [పూర్వము పశు శిరస్సునందు ఆఘార శేషముచే అంజనము విహిత మైనది. ఇచట పశువుయొక్క మూఁపునందు, శ్రోణియందును అంజనము విధింపఁబడినది. పూర్వోక్త కారణముచే పశు పృష్ఠ భాగము మలిన మైనది. కావున ఆ భాగమునుండి అవదానము

చేయరాదు. ఆఘార శేషముచే ఆ పృష్ఠభాగమును తడిపినచో ఆ భాగము పరిశుద్ధమునుగాఁ జేసినవాఁడగునని భావము.]

12. అర్థము: (యజమానః=యజమానుఁడు,) ఋత్విజః=ఋత్విజులను, వృణీతే=వరించవలయును(ఎన్నుకొనవలెను). ఛన్దాంస్యేవ=ఛందస్సులనే, వృణీతే=వరించినవాఁ డగును.

తాత్పర్యము: యజ్ఞకర్త యజ్ఞమునందు తనకు సహాయకులనుగా ఋత్విజులను వరించవలెను. (ఎన్నిక చేసికొనవలెను). అట్లు చేసినచో యజ్ఞకర్త ఛందస్సులనే (వక్ష్యమాణ సంఖ్యా సాదృశ్యముచే) వరించినవాఁ డగును.

13. అర్థము: సప్త=ఏడుగురు ఋత్విజులను, వృణీతే=ఎన్నిక చేసికొనవలెను. గ్రామ్యాః పశవః=గ్రామ్య పశువులు, సప్త=సప్త సంఖ్యాకములు. ఆరణ్యాః=ఆరణ్య పశువులు, సప్త=సప్తసంఖ్యాకములు, ఛన్దాంసి=గాయత్ర్యాది ఛందస్సులు, సప్త=ఏడు. (ఏతత్=ఈ సప్త సంఖ్యాక ఋత్విగ్వరణము,) ఉభయస్య=ఉభయవిధ పశుజాతి యొక్క, అవరుద్ధ్యై=ప్రాప్తికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: యజ్ఞకర్త ఏడుగురు ఋత్విజులను ఎన్నిక చేసికొనవలెను. గ్రామ్య పశువులు సప్త సంఖ్యాకములు. ఆరణ్య పశువులు సప్త సంఖ్యాకములు. గాయత్ర్యాది ఛందస్సులు ఏడు. కావున ఏడుగురు ఋత్విజులను ఎన్నిక చేసికొనిన యజ్ఞకర్త సప్త సంఖ్యా సాదృశ్యముచే ఉభయ విధము లయిన పశువులను పొందును. ఈ సప్తత్వ సంఖ్యా సాదృశ్యముచే ఋత్విజులకు ఛందస్త్వము చెప్పబడినది. ఇదిసంఖ్యా విధాయక మంత్రము. హోత, ఆగ్నీధ్రుఁడు, అధ్వర్యుఁడు, మైత్రావరుణుఁడు, బ్రాహ్మణాచ్ఛంసి, పోత, నేష్ట, అను ఈ యేడుగురు యజ్ఞకర్తచే వరింపఁబడు ఋత్విజులు.

14. అర్థము: ఏకాదశ ప్రయాజాన్ యజతి=పదునొకండు ప్రయాజలను యజింపవలెను. పశోః=పశువుయొక్క, ప్రాణాః=ప్రాణములు, దశ వై=పదియే. ఆత్మా=ఆత్మ, ఏకాదశః=పదునొకండవది. పశుః=పశువు, యావాన్ ఏవ=ప్రాణాది సంఖ్య ఏ మాత్రము కలదో, తమ్=తావత్సంఖ్యాక ప్రాణములు కల పశువును, ప్ర యజతి=యజింపవలెను.

తాత్పర్యము: పదునొకండు ప్రయాజలను యజింపవలెను. పశువుయొక్క ప్రాణములు సంచరించు రంధ్రములు పది. ఆత్మ పదునొకండవది. ఆ సర్వ పశువును యజింపవలెను. (ఇచట చోదక ప్రాప్తము లయిన ప్రయాజలందు సంఖ్య విధింపఁబడినది.)

15. అర్థము: వపాం పరి=వపా హోమ సమీపమునందు, శయే=శయన కాలమునందు, యజేత్=అంతిమ ప్రయాజేష్టిని చేయవలెను. (తథా కృతే సతి=అట్లు చేయఁగా,) ఆత్మైవ=పశువుయొక్క శరీరమే, ఆత్మానం పరి=ఆత్మసమీపమునందు, శయే=శయనించుచున్న దగుచున్నది.

తాత్పర్యము: (ఇచట అంతిమ ప్రయాజేష్టికి కాలనిర్ణయము చేయఁబడినది.) వపాహోమ సమీపమునందు శయన కాలమునందు అంతిమ ప్రయాజమును యజింపవలెను. అంతిమ ప్రయాజము దేహముగా నిరూపిత మగుటచే అది పశువుయొక్క ఆత్మ యగుచున్నది. వప కూడ ముఖ్యావయవము కావున ఆత్మయగుచున్నది. కావున ఆ రెండింటికి సామీప్యము యుక్తమని భావము.

16. అర్థము: స్వధితిః=స్వధితి, (యూపచ్ఛేదన సాధనమైన ఖడ్గవిశేషము,) వజ్రః వై=వజ్రమే. (వజ్రమువంటిదే). యూపశకలః=యూప శకలము (స్వరువు), వజ్రః=వజ్రము(వంటిది). దేవాః=దేవతలు, ఘృతం వై=ఆజ్యమునే, వజ్రమ్=వజ్రమునుగా, కృత్వా=చేసి, సోమమ్=సోమమును, అఘ్నన్ ఖలు=హత మొనర్చిరి కదా! (హే స్వరు స్వధితీ!=ఓ స్వరు స్వధితులారా!) "ఘృతేన=ఆజ్యముచే, అక్తౌ=తడిసినవారై, పశుం త్రాయేథామ్=పశువును రక్షింపుఁడు," ఇతి=అని, ఆహ=వేదము చెప్పినది. (తత్=ఆ కారణముచే, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) వజ్రేణైవ=వజ్రమువంటి ఘృతముచేతనే, ఏనమ్=ఈ పశువును, వశీ

కృత్వా=స్వాధీనము చేసికొని, ఆ లభతే=ఆలంభనము చేయును. (స్వరువు=యూపమును ఛేదించినపుడు తెగి పడిన రెండవ శకలము.)

**తాత్పర్యము:** స్వధితి వజ్రమువంటిదే. యూపశకలము (స్వరువు)వజ్రమువంటిది. దేవతలు ఘృతమునే వజ్రమునుగాఁ జేసి సోమమును ఛేదించిరి కదా! "ఓ స్వరు స్వధితులారా! మీరు ఈ యజ్ఞ పశువును రక్షింపుఁడు" అని వేదము చెప్పటచే అధ్వర్యుఁడు వజ్రమువంటి ఆజ్యముచేతనే యీ యజ్ఞపశువును స్వాధీనము చేసికొని ఆలంభనము చేయును. (ఇచట స్వరు స్వధితి ఘృతముల ఉపయోగము చూపఁబడినది).

సప్తమానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే ఽష్టమోఽనువాకః

మూలము: [1]పర్యగ్ని కరోతి సర్వహుతమేవైనం కరోత్యస్కన్దాయాస్కన్నగ్ం హి తద్యద్ధుతస్య స్కన్దతి [2]త్రిః పర్యగ్ని కరోతి త్ర్యావృద్ధి యజ్ఞోఽథో రక్షసా మపహత్యై [3]బ్రహ్మవాదినో వదన్త్యన్వారభ్యః పశూ3ర్నాన్వారభ్యా3 ఇతి [4]మృత్యవే వా ఏష నీయతే యత్పశుస్తం యదన్వారభేత ప్రమాయుకో యజమానః స్యా [5]దథో ఖల్వాహుః సువర్గాయ వా ఏష లోకాయ నీయతే యత్ (౧)పశురితి యన్నాన్వారభేత సువర్గా ల్లోకాద్యజమానో హీయేత [6]వపాశ్రపణీభ్యా మన్వారభతే తన్నేవాన్వారబ్ధం నేవానన్వారబ్ధ [7]ముప ప్రేష్య హోతర్హవ్యా దేవేభ్య ఇత్యాహేషితగ్ం హి కర్మ క్రియతే [8]రేవతీ ర్యజ్ఞపతిం ప్రియధాఽఽవిశతేత్యాహ యథాయజురేవైత [9]దగ్నినా పురస్తాదేతి రక్షసా మపహత్యై [10]పృథివ్యాః సంపృచః పాహీతి బర్హిః (౨) ఉపాస్యత్యస్కన్దాయాస్కన్నగ్ం హి తద్యద్బర్హిషి స్కన్దత్యథో బర్హిషద మేవైనం కరోతి [11] పరాఙావర్తతేఽధ్వర్యుః పశోః సంజ్ఞప్యమానాత్పశుభ్య ఏవ తన్ని హ్నుత ఆత్మనోఽనావ్రస్కాయ [12] గచ్ఛతి శ్రియం ప్ర పశూనాప్నోతి య ఏవం వేద [13] పశ్చా ల్లోకా వా ఏషా ప్రాచ్యుదానీయతే యత్పత్నీ నమస్త ఆతానేత్యాహాఽఽదిత్యస్య వై రశ్మయః ( 3) ఆతానాస్తేభ్య ఏవ నమస్కరో[14] త్యనర్వా ప్రేహీత్యాహ భ్రాతృవ్యో వా అర్వా భ్రాతృవ్యాపనుత్త్యై ఘృతస్య కుల్యామను సహ ప్రజయా సహ రాయస్పోషేణేత్యాహాఽఽశిష మేవైతామా శాస్త ఆపో దేవీః శుద్ధాయువ ఇత్యాహ యథాయజురేవైతత్.(౪)

(లోకాయ నీయతే యద్బర్హి రక్ష్మయః సప్తత్రిగ్ంశచ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠకేఽష్టమోఽనువాకః|| ౮ ||

## వేదార్థ దీపిక

అవతారిక: సప్తమానువాకమునందు సామిధేనీ బుదక్వరనాదికమును గుఱించి చెప్పఁబడినది. అగ్నీషోమీయ పశుహింసనాదికము ఈ యష్టమానువాకమునందు చెప్పఁబడుచున్నది. ప్రథమ కాండమునందలి తృతీయ ప్రపాఠకములోని అష్టమానువాకమునఁగల "రేవతి ర్యజ్ఞపతిం ప్రియధా" ఇత్యాది మంత్రముల కీ యనువాకము వివరణాత్మకము కూడ.

(1) అర్థము: పర్యగ్ని కరోతి=ఆగ్నీధ్రుఁడు ఆహవనీయమునుండి కొఱవిని (నిప్పుఁరవ్వను) తీసికొని యజ్ఞపశువునకు, అగ్నికి, యూపము మొదలగువానికి చుట్టు ప్రదక్షిణముగ త్రిప్పవలెను. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁగా, అధ్వర్యుః= అధ్వర్యుఁడు) ఏనమ్=ఈ పశువును, సర్వహుతమ్ ఏవ=సర్వము హుతమైనదిగానే, కరోతి=చేసినవాఁ డగుచున్నాఁడు. (ఏతత్=ఇది,) అస్కన్దాయ=క్రింద పడుటవలన కలుగు దోషము లేకుండుటకై, భవతి=అగుచున్నది. హుతస్య=హుతమైన హవిస్సుయొక్క, యత్=ఏది, స్కన్దతి=క్రింద పడుచున్నదో, తత్=అది, అస్కన్నం హి=స్కందన దోషము లేనిదే యగును.

తాత్పర్యము: విశసనము చేయఁబడిన యజ్ఞపశువునకు చుట్టు ఆగ్నీధ్రుఁడు ఆహవనీయమునుండి తీసిన కొఱవిని ప్రదక్షిణముగ త్రిప్పవలెను. అట్లు చేసినచో పశువును సర్వమును హుతము చేసినవాఁడే యగును. ఈ పర్యగ్నికరణము వలన ఏర్పడునట్టి హుతత్వము స్కందన దోష పరిహారముకొఱ కగును. హుతముయొక్క అంశము ఏదియైనను దోష రహితమే యగును. (హోమము చేయునప్పుడు క్రింద పడిన హవిస్సు స్కన్నమనఁబడును. అది దోషావహ మగును. హుతమైనదానిలో ఏ యంశమైనను స్కన్న మైనచో పర్యగ్నికరణమువలన స్కందన దోషము కలుగదు. ఈ పర్యగ్నికరణమువలన పశురూప హవిస్సు సర్వము హోమమునకు పూర్వమే హుతమైనదిగా పరిగణింపఁబడును.)

(2) అర్థము: త్రిః=మూఁడు మారులు, పర్యగ్ని కరోతి= పూర్వోక్త విధముగ కొఱవిని ప్రదక్షిణముగ యజ్ఞపశువునకు చుట్టు త్రిప్పవలయును. యజ్ఞః=యజ్ఞము, త్ర్యావృత్ హి=మూఁడు అవృత్తులు కలది కదా! అథో=మఱియు, (ఏతత్=ఈ త్ర్యావృత్తైన పర్యగ్నికరణము,) రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=నాశముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: పూర్వోక్తమైన పర్యగ్నికరణము మూఁడు మారులు చేయువలయును. యజ్ఞము మూఁడు అవృత్తులు కలది కదా! మఱియు నిది రాక్షస నాశముకొఱ కగును. (ఇచట పర్యగ్నికరణముయొక్క ఆవృత్తి విధింపఁబడినది.)

(3.) అర్థము: పశుః=యాగ పశువు, అన్వారభ్యః?=వధింపఁదగినదియా? న అన్వారభ్యః?=వధింపఁదగనిదియా? ఇతి=అని, బ్రహ్మవాదినః=బ్రహ్మవిచారజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు (ప్రశ్నించుచున్నారు).

తాత్పర్యము: యాగపశువు వధింపఁదగినదా? వధింపఁదగనదియా? అని వేదార్థ విదులు ప్రశ్నించుచున్నారు. (ఇచట

'పశుః' అను పదము చివరను 'నాన్వారభ్యః' అను చోటను ప్రయుక్తమైన ప్లుతము ప్రశ్నార్థకము.)

(4) అర్థము: పశుః యత్=యాగ పశువు ఏది కలదో, తమ్=ఆ పశువును, అన్వారభేత యత్=అన్వారభము చేసినచో, (వధించినచో) ఏషః=ఈ పశువు, మృత్యవే=మృత్యువుకొఱకు, నీయతే వై=పొందింపఁబడుచున్నదే యగుచున్నది. తథా సతి=అట్లు కాఁగా, యజమానః=యజమానుఁడు, ప్రమాయుకః=మరణించువాఁడు, స్యాత్=అగును.

తాత్పర్యము: యజ్ఞ పశువును అన్వారభము చేసినచో దానిని మృత్యువు నొద్దకు పంపిన ట్లగును. అట్లు చేసినచో యజమానుఁడు మరణించువాఁ డగును. ( ఇచట అన్వారభ షక్షమున దోషము చూపఁబడినది.)

(5) అర్థము: అథో=మఱియు, పశుః ఇతి యత్=యాగ పశువు ఏది కలదో, ఏషః=ఇది, సువర్గాయ లోకాయ=స్వర్గ లోకము కొఱకు, నీయతే వై= పొందింపఁబడుచున్నదే యగును. న అన్వారభేత యత్=అన్వారభము చేయనిచో, యజమానః=యజమానుఁడు, సువర్గాత్ లోకాత్=స్వర్గలోకమునుండి, హీయేత=హీనుఁడగును. (స్వర్గమును పొందఁడు.) ఇతి=అని, ఆహుః ఖలు=చెప్పుచున్నారఁట!

తాత్పర్యము: యాగపశువు నన్వారభము చేసినచో అది స్వర్గలోకమునకుఁ గొనిపోఁబడును. అన్వారభము చేయనిచో అది స్వర్గమునకుఁగొనిపోఁబడదు. కావున యజమానుఁడు స్వర్గమునుండి హీనుఁడగును. అనఁగా స్వర్గమును పొందలేఁడు అనియు చెప్పుచున్నారఁట! (ఇచట రెండవ షక్షమున దోషము చూపఁబడినది.)

(6.) అర్థము: వపాశ్రపణీభ్యామ్=(వపను పక్వము చేయుటకు సాధనములైన) వపాశ్రపణులచే, అన్వారభతే=యాగపశువు నన్వారభము చేయవలెను. తత్=అది, న అన్వారబ్ధమ్ ఇవ=అన్వారభము చేయఁబడినదివలె నుండదు. న అనన్వారబ్ధమ్ ఇవ=అన్వారభము చేయఁబడనిదివలెను ఉండదు.

తాత్పర్యము: (ఇచట పూర్వోక్త దోషద్వయ పరిహారమునకై ప్రకారాంతరము విహిత మైనది). వపాశ్రపణులు దారుమయములై యుండును. వపాశ్రపణులచే యాగపశువును అన్వారభము చేయవలెను. ఇట్లు చేసినచో యాగపశువు అన్వారబ్ధమైనది వలె నుండదు. అన్వారబ్ధము కానిదివలెను ఉండదు. కావున పూర్వోక్త దోషద్వయము ఈ షక్షమున ఉండదు.

(7.) అర్థము: "ఉప ప్రేష్య హోత ర్హవ్యా దేవేభ్యః" ఇతి ఆహ='ఓ హోతా! దేవతలకొఱకు వపాదులైన హవిస్సులను చేయుటకు పశుసమీపమునందు శమితలను ప్రేరణ చేయుము' అని అధ్వర్యుఁడు ప్రైష మంత్రమును చెప్పవలెను. ఉషితం కర్మ=(ప్రభువుచే) ఆజ్ఞాపించఁబడిన కర్మ, క్రియతే హి=శీఘ్రముగా చేయఁబడుచున్నది కదా!

తాత్పర్యము: (ఇచట ప్రైష మంత్రము అధ్వర్యునిచే ఉత్పాదింపఁబడినది. మంత్రార్థము చెప్పఁబడినది.) లోకమునందు ప్రభువుచే నాజ్ఞాపించఁబడిన కర్మ శీఘ్రముగా చేయఁబడును కదా! కావున హోతయొక్క ఆజ్ఞననుసరించి శమితలు ( పశువపను హవిస్సుగా చేయువారు) వపను హవిస్సునుగా చేయుట అను కర్మను శీఘ్రముగా చేయుదురని భావము.

(8.) అర్థము: హే రేవతీః! ధనవత్తులైన ఓ పశ్వవయవములారా! యజ్ఞపతిమ్=యజ్ఞకర్తను గూర్చి, ప్రియధాః=ప్రియమును కలుగఁజేయువారు, భవత=కండు, ఆవిశత=హవిస్సుగా యజ్ఞము నావహించుఁడు, ఇతి= అని, ఆహ="రేవతీ ర్యజ్ఞపతిమ్" ఇత్యాది మంత్రము చెప్పినది. ఏతత్ యథాయజుః ఏవ=ఈ మంత్రార్థము స్పష్టమే.

తాత్పర్యము: 'ధనవత్తులైన ఓ పశ్వవయవములారా! యజ్ఞపతికి ప్రియమును కలుగఁజేయుఁడు. హవిస్సుగా యజ్ఞము నావహించుఁడు' అని మంత్రార్థము స్పష్టమైనదే.

(9.) అర్థము: రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=తొలఁగించుటకై (నాశమునకై), అగ్నినా=అగ్నితోఁగూడ, (ఆగ్నీధ్రః=ఆగ్నీధ్రుఁడు) పురస్తాత్=యాగపశువునకు ఎదుట, ఏతి=పోవలెను.

తాత్పర్యము: ఒకటవ మంత్రమున కొఱవితో పర్యగ్నికరణము చేయవలెనని చెప్పఁబడినది. ఆగ్నీధ్రుఁడు ఆ కొఱవితో కూడ యజ్ఞపశువునకు ముందర నడువవలెను.

(10.) అర్థము: (హే బర్హిః!=ఓ బర్హిస్సూ! త్వమ్=నీవు, ఏతత్= ఈ పశ్వంగ జాతమును) పృథివ్యాః=భూమియొక్క, సంపృచః=సంపర్కమునుండి, పాహి రక్షించుము. ఇతి=అని, బర్హిః=బర్హిస్సును, ఉపాస్యతి=సేవించవలెను. యత్=ఏది, బర్హిషి=బర్హిస్సునందు, స్కన్దతి=జాఱిపడునో, తత్=అది, అస్కన్నంహి=నేలపైని పడినది కాదు కదా! అథో=మఱియు, ఏనమ్=ఈ పశువును, బర్హిషదమ్ ఏవ=బర్హిస్సునందున్నదిగానే, కరోతి=చేసినవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము: 'ఓ బర్హిస్సూ! నీవు ఈ పశువును భూ సంపర్కమునుండి రక్షించుము' అని బర్హిస్సును సేవించవలెను. (ప్రార్థించవలెను.) ఇట్లు ఉపాసించుట పశువునకు స్కందన దోషము కలుగకుండుట కగును. మఱియు ఏ విధముగనైన క్రింద పడినను ఈ పశువును బర్హిషదముగానే (బహిర్హిస్సుపైని ఉన్నదానినిగానే) చేసిన వాఁడగును. (శామిత్రుఁడు పర్యగ్నికరణము చేయఁబడిన ప్రదేశమున కెదుట కొఱవి నుంచి దానికి దక్షిణ భాగమున పశువునుంచి ఈ పశువును భూసంపర్కమునుండి రక్షించుమని బర్హిస్సును ఉపాసించవలెను.)

(11.) అర్థము: అధ్వర్యుః=అధ్వర్యుఁడు, సంజ్ఞప్యమానాత్= చంపఁబడుచున్న, పశోః=పశువునుండి, పరాఙ్=పరాఙ్ముఖుఁడై, ఆవర్తతే=మఱలవలెను. తత్=దానివలన, పశుభ్యః ఏవ=పశువులనుండియే, నిహ్నుతే=(తనను) నిగరణము చేసికొనినవాఁ డగును. (తత్=ఆ నిగరణము,) ఆత్మనః అనావ్రస్కాయ=తనకు దోషము లేకుండుటకై, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: అధ్వర్యుఁడు యాగపశువు చంపఁబడుచుండఁగా దానిని చూడక పరాఙ్ముఖుఁడై వెనుకకు మఱలవలెను. 'నేను పశువును చంపుటలేదు' అని పశువులకొఱకు అపలాపము చేయవలెను. ఆ యపలాపము తనకు దోషము లేకుండుట కగును.

(12.) అర్థము: యః=ఎవఁడు, ఏవమ్=ఈ పూర్వోక్తవిధముగా, వేద=తెలిసికొనునో, (సః=అతఁడు,) శ్రియమ్= సంపదను, గచ్ఛతి=పొందుచున్నాఁడు. పశూన్=పశువులను, ప్రాప్నోతి= పొందుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్త విధముగ తెలిసికొనిన యతఁడు సంపదను, పశువులను పొందును. (ఇచట వేదనము ప్రశంసింపఁబడినది.)

(13.) అర్థము: పత్నీ యత్=యజమాన పత్ని ఏ స్త్రీ కలదో, ఏషా= ఈమె, పశ్చాల్లోకా=పశ్చిమ దిక్కునందు నిర్మితమైన నివాస స్థానము కలదై, ప్రాచి= తూర్పుదిక్కునందు, ఉదానీయతే వై=తీసికొనిపోఁబడుచున్నది కదా! "నమ స్త ఆతాన" ఇతి ఆహ='ఓ సూర్యరశ్మీ! నీకొఱకు నమస్కారము' అని యజమానపత్ని పలుకవలెను. ఆదిత్యస్య=సూర్యునియొక్క, రశ్మయః వై=కిరణములే, ఆతానాః=అంతటను వ్యాపించునవి. (పత్నీ=యజమాన పత్ని), తేభ్యః ఏవ=ఆ కిరణములకొఱకే, నమస్కరోతి=నమస్కరించుచున్నది.

తాత్పర్యము: ప్రతిప్రస్థాత యను ఋత్విజుఁడు పశ్చిమ దిక్కునందున్నటువంటి యజమానపత్నిని తూర్పుదిక్కునందు కొని పోవలెను. అప్పుడు ఆ యజమానపత్ని, 'ఓ సూర్యరశ్మీ! నీకు నమస్కారము' అని పలుకవలెను. ఆదిత్యుని కిరణములే అంతటను వ్యాపించునవి. కావున ఆమె ఆ సూర్యకిరణములకు నమస్కరించును. (పశ్చిమ దిక్కునందు నివాసము గల యజమానపత్నిని తూర్పుదిక్కునందు తీసికొనిపోఁగానే ఆమెకు సూర్యరశ్మి అభిముఖముగ నుండును. అప్పుడామె ఆ సూర్యరశ్మికి నమస్కరించుట యుక్తమే. సూర్యరశ్మి ఆతానము అను విషయము ఇచట చూపఁబడినది.

(14.) అర్థము: "అనర్వా ప్రేహి" ఇతి ఆహ=ఓ యజమాన పత్నీ! నీవు శత్రురహితవై, "ఘృతస్య కుల్యామను సహ ప్రజయా సహ రాయస్పోషేణ" ఇతి ఆహ= ఆజ్యముయొక్క ప్రవాహము ననుసరించి సంతానముతో కూడను,

ధనసమృద్ధితో కూడను పయనించుము' అని అధ్వర్యుఁడు యజమానపత్నితో పలికినట్లుగా ఈ రెండు మంత్రములు చెప్పినవి. భ్రాతృవ్యః=శత్రువు, అర్వా వై=అర్వన్ శబ్దార్థము కదా! (ఏతత్=ఇది,) భ్రాతృవ్యాపనుత్త్యై=శత్రునిష్కాసనముకొఱకు, భవతి=అగుచున్నది. ఏతామ్= సంతానముతోడను ధనసమృద్ధితోడను పయనించుము అను ఈ ప్రార్థనను, ఆశిషమ్ ఏవ= ఆశీస్సుగానే, ఆశాస్తే=కోరుచున్నాఁడు. "ఆపో దేవీః శుద్ధాయువః" ఇతి ఆహ= "ఓ యుదకదేవతలారా! మీరు మా శుద్ధిని కోరుచున్నవారై, (దేవతలను యాగప్రదేశమునందు పొందించుఁడు.)" అని అధ్వర్యుఁడు ప్రార్థించినట్లు ఈ మంత్రభాగము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ=మంత్రార్థము ననుసరించియే యున్నది.

**తాత్పర్యము:** "అనర్వా ప్రేహి", "ఘృతస్య కుల్యామను సహ ప్రజయా సహ రాయస్పోషేణ", "ఆపో దేవీః శుద్ధాయువః" అను నీ మంత్రభాగములు మూఁడును ఈ బ్రాహ్మణ భాగముచే వివరింపఁబడినవి. తాత్పర్యము అర్థమునందే వివరించఁబడినది.

అష్టమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే నవమోఽనువాకః

మూలము: [1] పశోర్వా ఆలబ్ధస్య ప్రాణాఞ్ఛుగృచ్ఛతి వాక్త ఆప్యాయతాం ప్రాణస్త ఆప్యాయతా మిత్యాహ ప్రాణేభ్య ఏవాస్య శుచగ్ం శమయతి [2] సా ప్రాణేభ్యోఽధి పృథివీగ్ం శుక్ప్ర విశతి శమహోభ్యామితి ని నయత్యహోరాత్రాభ్యామేవ పృథివ్యై శుచగ్ం శమయ [3] త్యోషధే త్రాయస్వైనగ్ం స్వధితే మైనగ్ం హిగ్ంసీ రిత్యాహ వజ్రో వై స్వధితిః (౧) శాన్త్యై [4] పార్శ్వత ఆ చ్ఛ్యతి మధ్యతో హి మనుష్యా ఆ చ్ఛ్యన్తి తిరశ్చీనమా చ్ఛ్యత్యనూచీనగ్ం హి మనుష్యా ఆ చ్ఛ్యన్తి వ్యావృత్త్యై [5] రక్షసాం భాగోఽసీతి స్థవిమతో బర్హి రక్త్వాఽపాస్యత్యస్నైవ రక్షాగ్ంసి నిరవదయత [6] ఇద మహగ్ం రక్షోఽధమం తమో నయామి యోఽస్మా న్ద్వేష్టి యం చ వయం ద్విష్మ ఇత్యాహ ద్వౌ వావ పురుషౌ యం చైవ (౨) ద్వేష్టి యశ్చైనం ద్వేష్టి తావుభా వధమం తమో నయతి [7] షే త్వేతి వపా ముత్ఖిద తీచ్ఛత ఇవ హ్యేష యో యజతే [8] యదుపతృన్ద్యా ద్రుద్రోఽస్య పశూ న్ఘాతుకః స్యాద్యన్నోప తృన్ద్యాదయతా స్యా [9] దన్యయోపతృణత్యన్యయా న ధృత్యై [10] ఘృతేన ద్యావాపృథివీ ప్రోర్ణ్వాథా మిత్యాహ ద్యావాపృథివీ ఏవ రసేనానక్త్య [11] చ్ఛిన్నః (౩) రాయః సువీర ఇత్యాహ యథాయజు రేవైత [12] త్క్రూరమివ వా ఏతత్కరోతి యద్వపా ముత్ఖిదత్యుర్వన్తరిక్ష మన్విహీత్యాహ శాన్త్యై [13] ప్ర వా ఏషోఽస్మాల్లోకాచ్చ్యవతే యః పశుం మృత్యవే నీయమాన మన్వారభతే వపాశ్రపణీ పున రన్వారభతేఽస్మిన్నేవ లోకే ప్రతి తిష్ఠ [14] త్యగ్నినా పురస్తాదేతి రక్షసామపహత్యా అథో దేవతా

ఏవ హావ్యేన (౪) అన్వేతి [15] నాన్తమ మఙ్గారమతి హారేద్యదన్తమ మఙ్గారమతి హారేద్దేవతా అతి మన్యేత [16] వాయో వీహి స్తోకానా మిత్యాహ తస్మాద్విభక్తాః స్తోకా అవపద్యన్తే [17] ఽగ్రం వా ఏతత్ప శూనాం యద్వపాఽగ్ర మోషధీనాం బర్హి రగ్రేణైవాగ్రగ్ం సమర్ధయత్యథో ఓషధీష్వేవ పశూన్ప్రతి ష్ఠాపయతి [18] స్వాహాకృతిభ్యః ప్రేష్యేత్యాహ (౫) యజ్ఞస్య సమిష్ట్యై [19] ప్రాణాపానౌ వా ఏతౌ పశూనాం యత్పృషదాజ్య మాత్మా వపా పృషదాజ్య మభిఘార్య వపా మభి ఘారయత్యాత్మ న్నేవ పశూనాం ప్రాణాపానౌ దధాతి [20] స్వాహోర్ధ్వనభసం మారుతం గచ్ఛత మిత్యాహోర్ధ్వనభా హ స్మ వై మారుతో దేవానాం వపాశ్రపణీ ప్ర హరతి తేనైవైనే ప్ర హరతి [21] విషూచీ ప్ర హరతి తస్మాద్విష్వఞ్చౌ ప్రాణాపానౌ(౬)॥

[స్వధితి శ్చైవాఘ్నిన్నో హావ్యేనేష్యేత్యాహ షట్చత్వారిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠకే నవమోఽనువాకః ॥ ౯

## వేదార్థదీపిక

అవతారిక: అష్టమానువాకమునందు అగ్నీషోమీయ పశుహింసనాదికమును గుఱించి వివరించఁబడినది. ఈ నవమానువాకమునందు విశసనము చేయఁబడిన యజ్ఞపశువునుండి వపోద్ధరనము చేయుటను గుఱించి వివరింపఁబడు చున్నది. ప్రథమ కాండస్థ తృతీయ ప్రపాఠక గత నవమానువాకములోని మంత్రములకు ఈ బ్రాహ్మణ భాగము వివరణాత్మకము. "వాక్త ఆప్యాయతామ్" ఇత్యాది మంత్రములు ప్రథమ కాండ గత తృతీయ ప్రపాఠకములోనివి.

1. అర్థము: ఆలబ్ధస్య=ఆలంభనము చేయఁబడిన, (హింసింపఁబడిన), పశోః=పశువుయొక్క, ప్రాణాన్=ప్రాణములను, శుక్=శోకము, గచ్ఛతి వై=పొందుచున్నది కదా! అతః ఏవ=కనుకనే, "వాక్త ఆప్యాయతాం ప్రాణ స్త ఆప్యాయతామ్" ఇతి ఆహ='ఓ పశూ! నీ వాగింద్రియము (గోలక పరిత్యాగ శోకమును త్యజించి స్వీక

రించఁబోవు దేవతా దేహమునందు సుఖముగా) వర్ధిల్లుఁగాక. నీ ప్రాణము వృద్ధి నొందుఁగాక.' అని వేదము చెప్పినది. (ఇది యజ్ఞకర్తృ పక్షమున అధ్వర్యుని ప్రార్థన). అస్య=ఈ పశువుయొక్క, ప్రాణేభ్యః ఏవ=ప్రాణములనుండియే, శుచమ్=శోకమును, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు), శమయతి=శాంతింపఁజేయుచున్నాఁడు.

తాత్పర్యము: యజ్ఞమునందు పశువును వధించి ఆ పశువుయొక్క శరీరమునుండి వపాదికమును తీయుటను గూర్చి వివరింపఁబడుచున్నది. ఆ యాలబ్ధమైన పశువుయొక్క వాగాది ఇంద్రియములకు శోకము కలుగును. ఆ శోకమును శమింపఁజేయుటకై అధ్వర్యుఁడు 'ఓ పశూ! నీ వాగింద్రియము ప్రాణము గోలక పరిత్యాగమువలన కలిగిన శోకమును పరిత్యజించి స్వీకరించఁబోవు దేవతా దేహమునందు వృద్ధి నొందుఁగాక' అని ప్రార్థించుటచే అధ్వర్యుఁడు పశువుయొక్క ప్రాణములనుండి శోకమును శమింపఁజేయు నని ఈ బ్రాహ్మణ భాగము వివరించుచున్నది. (శోక ప్రసక్తి ప్రదర్శన పూర్వకముగ "వాక్త ఆప్యాయతామ్" ఇత్యాది మంత్రము నీ బ్రాహ్మణము వాఖ్యానించినది.)

2. అర్థము: సా శుక్=ఆ శోకము, ప్రాణేభ్యః=(పశువుయొక్క) ప్రాణములనుండి, పృథివీమ్=భూమిని, అధి=అధిష్ఠించి, (తతః=పిమ్మట), ప్ర విశతి=దేవతా దేహమునందు ప్రవేశించుచున్నది. "శమహోభ్యామ్" ఇతి= 'అహోరాత్రములకొఱకు సుఖము కలుగుఁగాక' అను మంత్రముచే, ని నయతి= శాంతిని పొందించుచున్నాఁడు. అహోరాత్రాభ్యామ్ ఏవ=అహోరాత్రములకొఱకే, పృథివ్యై=పృథివినుండి, శుచమ్=శోకమును, శమయతి=శాంతింపఁజేయుచున్నాఁడు.

తాత్పర్యము: ప్రాణములనుండి తొలఁగించఁబడిన శోకము పృథివియం దధిష్ఠించి పిమ్మట ఆ పశువునకు సంబంధించిన దేవతా శరీరమునందు ప్రవేశించును. అధ్వర్యుఁడు "శమహోభ్యామ్" అను మంత్రభాగముచే శోకమును అహోరాత్రములనుండి నినయనము చేయవలెను. ఈ విధముగ చేయుటచే అహోరాత్రములకొఱకే పృథివి నుండి శోకమును శమింపఁజేసినవాఁడగును. (నినయనము=నిశ్శేషముగ పొందించుట).

3. అర్థము: "ఓషధే త్రాయస్వైనగ్ం స్వధితే మైనగ్ం హిగ్ంసీః" ఇతి ఆహ='ఓ యోషధీ! ఈ పశువును రక్షించుము. ఓ స్వధితి యను ఖడ్గవిశేషమా! ఈ పశువును హింసింపకుము' అని అధ్వర్యుఁడు ప్రార్థించుచున్నట్లు వేదము చెప్పినది. స్వధితిః=స్వధితి యను నాయుధ విశేషము, వజ్రః వై=వజ్రాయుధమే. (ఇయమ్=ఈ ప్రార్థన), శాన్త్యై =శాంతికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ఓ యోషధీ! ఈ పశువును రక్షించుము. ఓ స్వధితీ! దీనిని హింసింపకుము.' అని యధ్వర్యుఁడు ప్రార్థించుటవలన పశువునకు శాంతి కలుగును. ('మా హింసీః' అను మంత్ర భాగముయొక్క అభిప్రాయమిచట వివరింపఁబడినది. పశుమారణ కాలమున పశువునకు క్రింద పఱచఁబడిన బర్హిస్సు ఇచట ఓషధిగా చెప్పఁబడినది.)

4. అర్థము: పార్శ్వతః=(పశువుయొక్క) పార్శ్వభాగమునందు, ఆచ్ఛృతి=అంతటను ఛేదించవలెను. మనుష్యాః=మనుష్యులు, మధ్యతః= మధ్యభాగమునందు, ఆ చ్ఛ్యన్తి వై=ఛేదించుచున్నారు కదా! తిరశ్చీనమ్=అడ్డముగా, ఆ చ్ఛృతి=ఛేదించవలెను. మనుష్యాః=మనుష్యులు, అనూచీనమ్=నిలువుగా ( పొడవుగా), ఆ చ్ఛ్యన్తి హి=ఛేదించుచున్నారు కదా! (ఏతత్=ఈ అనుష్ఠానము, వ్యావృత్త్యై=లోకాచార వ్యావృత్తికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: లోకమునందు మాంసాహారులైన మనుష్యులు పశువును నాభిదేశమునందు నిలువుగా కోయుచున్నారు. ఆ పద్ధతిని నివారించుటకై వపను తీయుటకై యజ్ఞపశువును నాభికి దక్షిణ పార్శ్వమునందు అడ్డముగ ఛేదించవలయును. (ఇచట వపను తీయుటకై పశుచ్ఛేదన విధానము విహిత మైనది. పార్శ్వతః=సప్తమ్యర్థమున తసిల్ ప్రత్యయము.)

5\. అర్థము: "రక్షసాం భాగోఽసి" ఇతి='రక్త సిక్తమైన ఓ బర్హిస్సా! నీవు రాక్షసుల భాగ మగుచున్నావు' అను మంత్రముచే, స్థవిమతః=స్థూలమైన మూలభాగము యొక్క, బర్హిః=బర్హిస్సును, అక్త్వా=రక్తముతో తడిపి, ప్రాస్యతి= విడువవలెను. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁబడఁగా,) రక్షాంసి= రాక్షసులను, అస్నైవ=రక్తము చేతనే, నిరవదయతే=నిశ్శేషముగ భాగము కలవారినిగా చేసి పోఁగొట్టినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: అధ్వర్యుఁడు "రక్షసాం భాగోఽసి" అను మంత్రమును పఠించుచు పశురక్తముతో బర్హిస్సుయొక్క మూల భాగమును తడిపి దానిని పాఱవేయవలెను. ఆ విధముగ చేయుటవలన అతఁడు రాక్షసులను రక్తమునందు సంపూర్ణ భాగము కలవారినిగా చేసి పోఁగొట్టినవాఁ డగును.

6\. అర్థము: "ఇద మహగ్ం రక్షోఽధమం తమో నయామి యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః" ఇతి ఆహ='మమ్ము ద్వేషించుచున్నవాఁడును, మాచే ద్వేషింపఁబడుచున్నవాఁడును అగు శత్రువునకు ఇదిగో వెంటనే నేను మహాదుఃఖమును కలిగించుదును' అని అధ్వర్యుఁడు పలికినట్లుగ వేదము చెప్పినది. అయమ్=ఇతఁడు, యం చైవ=ఎవనినైతే, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడో, యం చ=ఎవనిని, వయమ్=మేము, ద్విష్మః=ద్వేషించుచున్నామో, ఏతౌ=ఈ ద్వేషించువాఁడు, ద్వేషింపఁబడువాడును, ఉభౌ పురుషౌ వావ=ఇద్దఱు పురుషులే కదా! తౌ ఉభౌ=ఆ ఉభయులను, అధమం తమః=గొప్ప దుఃఖమును, నయతి=పొందించుచున్నాఁడు.

తాత్పర్యము: "ఇద మహగ్ం రక్షః" అను మంత్రమున ఇద్దఱు శత్రువులు చెప్పఁబడినారు. వీరిలో ఒకఁడు యజ్ఞకర్తను ద్వేషించువాఁడు. మఱి యొకఁడు యజ్ఞకర్తచే ద్వేషింపబడువాడు. ఆ యుభయులకు కూడ ఈ మంత్రమును పఠించు అధ్వర్యుఁడు మహాదుఃఖమును కలిగించుచున్నాఁడని ఈ బ్రాహ్మణ భాగము వ్యాఖ్యానించినది.

7\. అర్థము: "ఇషే త్వా"='ఓ వపా! నిన్ను యజమానుఁడు, దేవతయు కోరుచున్న అన్నముకొఱకు పశుశరీరమునుండి వెల్లగించుచున్నాను' అను మంత్రముచే (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) వపామ్=వపను, ఉత్ఖిదతి=పైకి తీయవలెను. యః=ఏ యజమానుఁడు, యజతే=యాగము చేయుచున్నాఁడో, ఏష,=ఈ యజమానుఁడు, ఇచ్ఛత ఇవ హి=కోరుచున్నట్లు ఉన్నాఁడు కదా!

తాత్పర్యము: 'ఓ వపా! కోరఁబడుచున్న అన్నముకొఱకు నిన్ను పశు శరీరమునుండి పైకి తీయుచున్నాను!' అని చెప్పుటచే యజ్ఞకర్త అన్నమును కోరుచున్నవాఁడువలెనున్నాఁడు కదా! అని స్పష్టమగుచున్నది. (ఇచట వపోత్ఖేదనము విహిత మైనది.)'

8\. అర్థము: ఉపతృన్ద్యాత్ యత్ =శూలాగ్రముచే వపను భేదించుచో, (గుచ్చినచో,) రుద్రః=రుద్రుఁడు, అస్య=ఈ యజమానునియొక్క, పశూన్=పశువులను గూర్చి, ఘాతుకః=హింసకుఁడు, స్యాత్=అగును. న ఉపతృన్ద్యాత్ యత్=శూలాగ్రముచే వపను భేదించనిచో, అయతా=నియతము కానిది, స్యాత్=అగును.

తాత్పర్యము: (వపను వెలికి తీయునపుడు దానిని శూలాగ్రముచే భేదించవలెనా? భేదించ నవసరము లేదా? పక్షద్వయమునందును ఇచట దోషము చూపఁబడుచున్నది.) వపను వెలికి తీయునపుడు దానిని శూలముతో గ్రుచ్చి తీసినచో క్రూర దేవుఁడు ఈ యజమానునిపశువులకు హింసకుఁ డగును. భేదించనిచో వప అనియతమై తీయునపుడు ఇటు నటు పడును.

9\. అర్థము: ధృత్యై=ధృతికొఱకు, అన్యయా=వపాశ్రపణులలోని ఒక శూలముచే, ఉపతృణతి=భేదించవలెను. అన్యయా=మఱియొక శూలముచే, న తృణతి=భేదించరాదు.

తాత్పర్యము: వపను తీయుటకు సాధనములైన వపాశ్రపణులు రెండు శూలములు కలిగి యుండును. తీయునపుడు వప ఇటు నటు పడక స్థిరముగ నుండుటకై ఆ వపాశ్రపణులలోని ఒక శూలముతో వపను గ్రుచ్చవలెను. క్రూరదేవుఁడు యజమానుని యొక్క పశువులను హింసింపకుండుటకై రెండవ శూలముతో భేదించరాదు. (ఇచట పూర్వోక్త దోషద్వయము లేని పక్షాంతరము చెప్పఁబడినది.)

10. అర్థము: "ఘృతేన ద్యావాపృథివీ ప్రోర్ణ్వాథామ్" ఇతి ఆహ ='ద్యావాపృథివీ తుల్యములైన ఓ వపాశ్రపణులారా! ఘృత సమానమైన వపచే మీస్వరూపమును ఆచ్ఛాదించుకొనుఁడు' అని అధ్వర్యుఁడు ప్రార్థించినట్లు వేదము చెప్పుటచే, ద్యావాపృథివీ ఏవ=ద్యావాభూములనే, (అధ్వర్యుః=అధ్వర్యు ఁడు,) రసేన=వపారూపమైన రస ముచేత, అనక్తి=తడిపినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: 'ద్యావాపృథివీ తుల్యములైన ఓ వపాశ్రపణులారా! ఘృత సమానమైన వపచే మీ స్వరూపము నాచ్ఛా దించుకొనుఁడు' అని చెప్పుటచే అధ్వర్యుఁడు ద్యావాభూములనే వపారూప రసముచే తడుపుచున్నాఁడని భావము. (ఇచట మంత్రగతములైన ఘృత శబ్ద ద్యావాపృథివీ శబ్దముల ప్రయోగముయొక్క తాత్పర్యము చెప్పఁబడినది.)

11. అర్థము: "అచ్ఛిన్నో రాయ స్సువీరః" ఇతి ఆహ='అచ్ఛిన్నమైన వపాభాగము శోభన వీరులు కలది. అది ధనముల నొసఁగు గాక' అని వేదము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ=మంత్రము ననుసరించినదియే.

తాత్పర్యము: వపాభాగము ఛేదించఁబడిన దైనను మంత్ర సామర్థ్యముచే అచ్ఛిన్నమే. ఆ వపాభాగము యజమానునియొక్క పుత్ర పౌత్రాది రూప శోభన వీరులు కలది. అట్టి వపాభాగము యజమానునకు ధనముల నొసఁగుఁ గాక. ఇదియే మంత్రార్థము. (ఈ మంత్రము స్పష్టార్థమే యని ఈ బ్రాహ్మణము చెప్పినది.)

12. అర్థము: "క్రూరమివ వా ఏతత్కరోతి యద్వపా ముత్ఖిదత్యుర్వన్తరిక్ష మన్విహి" ఇతి ఆహ='వపను వెలికి తీయుట యనఁగా క్రూరకర్మను చేయుచున్నా ఁ డనియే కదా!' (కావున) శాన్త్యై=వపోత్ఖేదనరూప క్రౌర్యముయొక్క శాంతికై, "ఉర్వన్తరిక్ష మన్విహి" ఇతి ఆహ='ఓ వపా! విస్తీర్ణమైన అంతరిక్షమును ప్రవేశించి ఆహవనీయ దేశమును గూర్చి పొమ్ము' అని అధ్వర్యుఁడు చెప్పినట్లు వేదము చెప్పినది.

తాత్పర్యము: యజ్ఞ పశువునుండి వపను తీయుట అనునది క్రూర కర్మ కనుక, ఆ క్రౌర్యము శాంతించుటకై వపను అంతరిక్షమును ప్రవేశించి ఆహవనీయ దేశమునకు పొమ్మని అధ్వర్యుఁడు వపను ప్రార్థించినట్లు వేదము చెప్పినది.

13. అర్థము: యః=ఏ యజ్ఞకర్త, మృత్యవే=మృత్యువుకొఱకు, నీయమానమ్=పొందింపఁబడుచున్న, పశుమ్=పశువును, అన్వారభతే= అన్వారభము చేయుచున్నాఁడో, ఇషః=వపారూపమైన అన్నము, అస్మాత్ లోకాత్ వై=ఈ లోకమునుండియే, ప్ర చ్యవతే=ప్రకృష్టముగ జారిపోవుచున్నది. (తత్= ఆ కారణమువలన,) వపాశ్రపణీ=వపా శ్రపణులను, పునః=మఱల, అన్వారభతే= స్పృశించవలెను. (ఏవం సతి=ఇట్లు కాఁగా,) అస్మిన్ లోకే ఏవ=ఈ లోకమునందే, ప్రతి తిష్ఠతి=ప్రతిష్ఠిత మగుచున్నది.

తాత్పర్యము: మృత్యువుకొఱకు కొనిపోఁబడుచున్న పశువును యజ్ఞకర్త అన్వారభము చేయుచున్నాఁ డనఁగా, వపారూప మైన అన్నము ఈ లోకమునుండియే పోవుచున్నదని యర్థము. కనుక యజ్ఞకర్త వపాశ్రపణులను మఱల స్పృశించవలెను. ఇట్లు చేసినచో వపారూపమైన అన్నము ఈ లోకమునందే ప్రతిష్ఠిత మగును. (ఇచట వపాశ్రపణుల స్పర్శము విహిత మైనది.)

14. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=నాశముకొఱకు, పురస్తాత్=వపకు పురో భాగమునందు, అగ్నినా=అగ్నితోఁ గూడ, ఏతి=పోవలయును. అథో=అప్పుడు, దేవతా ఏవ=దేవతయే, హవ్యేన=హవిస్సుతో, అన్వేతి=అనుసరించి పోవున ట్లగును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు రాక్షస నాశమునకై వపకు ముందు భాగమున అగ్నితోఁ గూడ పోవలెను. అనఁగా అగ్నికి వెనుక భాగమునందు వపను కొనిపోవలయును. ఇట్లు చేసినచో అగ్ని సర్వదేవతాత్మకుఁడు కావున సర్వదే వతలు వపారూపమైన హవిస్సు ననుసరించి పోవుదురు. (ఇచట వపకు పురోభాగమున వహ్నిని కొనిపోవుట విధింపఁబడినది.)

15. అర్థము: అన్తమమ్=చివరిదైన, అఙ్గారమ్=అగ్నిని, న అతిహరేత్=తీసికొని పోరాదు. అన్తమమ్ అఙ్గారమ్=అంతమమైన అగ్నిని, అతిహరేత్ యత్=(వపాశ్రపణమునకై) తీసికొనిపోయినచో, దేవతాః=దేవతలను, అతిమన్యేత=అవమానించినవాఁ డగును.

తాత్పర్యము: (అగ్నియందు వపను పక్వము చేయుటకై ముందు అగ్నిని, వెనుక వపను తీసికొనిపోవలెనని పూర్వమంత్రమున చెప్పఁబడినది. ఆహవనీయమునకు ఉత్తర పార్శ్వమునందున్న అంగారములయందు (అగ్నులందు) వపను పక్వము చేయవలయునని చెప్పవలసియున్నది. అట్లుగాక వ్యతిరేక ముఖముగ వపాశ్రపణము ఇచట విధింపఁబడుచున్నది. అంతమమైన అంగార మనఁగా ఆహవనీయమునకు సమీప పార్శ్వమునందలి అంగారముగాక, దూరవర్తియైన అంగార మని యర్థము.) వపా శ్రపణమునకై అంతిమమైన అంగారమును వపతోఁగూడ పురోభాగమున కొనిపోరాదు. అట్లు చేసినచో అంగారము సర్వదేవతా స్వరూపము కావున సమీప పార్శ్వవర్తియైన అంగారమును అతిక్రమించుటవలన సర్వదేవతలను అవమానించిన ట్లగునని తాత్పర్యము.

16. అర్థము: "వాయో వీహి స్తోకానామ్" ఇతి ఆహ='ఓ వాయూ! స్తోకములను (బిందువులను) విభక్తములను చేయుము' (త్రాగుము.) అని వేద మంత్రము చెప్పినది. తస్మాత్=ఆ కారణమువలన, విభక్తాః=విభక్తములైన, స్తోకాః= బిందువులు, అవపద్యన్తే=పతితము లగును.

తాత్పర్యము: ద్విశూలమైన వపాశ్రపణిచే వహింపఁబడిన వపకు పైభాగమునందు "త్వాము తే దధిరే" అను మంత్రముచే ఆజ్యము హోమము చేయఁబడుచుండఁగా తత్సమీపమునుండి పడిన ఆజ్య బిందువులు స్తోకము లనఁబడును. 'ఓ వాయూ! నీవు ఆ స్తోకములను విభక్తములను చేయుము.' (త్రాగుము) అని చెప్పుటవలన స్తోకములు విభక్తములై పడిపోవును. అనఁగా ఇచట మంత్రగతమైన 'వీహి'అను చోటఁ గల వి శబ్దార్థము చూపఁబడినది.

17. అర్థము: వపా యత్—వప యనునది యేది కలదో, ఏతత్=ఇది, పశూనామ్=పశువుల సంబంధియైన, అగ్రం వై=శ్రేష్ఠమే. ఓషధీనామ్= ఓషధులలో, బర్హిః=బర్హిస్సు, అగ్రమ్=శ్రేష్ఠము. [అతః=ఈ కారణమువలన, అయమ్=ఈ యధ్వర్యుఁడు,] అగ్రేణైవ=ఓషధ్యగ్రమైన బర్హిస్సుచేతనే, అగ్రమ్=పశ్వగ్రరూపమైన వపను, సమర్ధయతి=సమృద్ధముగఁ జేయుచున్నవాఁ డగుచున్నాఁడు. అథో=మఱియు, ఓషధీష్వేవ=ఓషధులయందే, పశూన్=పశువులను, ప్రతిష్ఠాపయతి=ప్రతిష్ఠింపఁజేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: వప యనునది పశువుల సంబంధియైన శ్రేష్ఠమే. బర్హిస్సు ఓషధులలో శ్రేష్ఠము. కనుక ఓషధులందు వపనుంచిన యధ్వర్యుఁడు ఓషధిశ్రేష్ఠముచేతనే పశు సంబంధియైన వపా రూప శ్రేష్ఠమును సమృద్ధముగఁజేసినవాడగును. మఱియు నోషధులందే పశువులను ప్రతిష్ఠఁజేసినవాఁ డగును. అనగా ఓషధ్యగ్రమైన బర్హిస్సుచే పశ్వగ్ర రూప వపయొక్క సమృద్ధికొఱకు, ఓషధులందు పశు ప్రతిష్ఠాపనముకొఱకును బర్హిరగ్రమును వపయొక్క అధోభాగమున స్థాపించవలెనని యర్థము. ఇచట వపయొక్క యధోభాగమునందు బర్హిరగ్రస్థాపనవిధి అర్థవాదముచే తెలుపఁ బడినది.

18. అర్థము: 'హే మైత్రావరుణ!=ఓ మైత్రావరుణుఁడా! (ఇది యొక ఋత్విజునకు పేరు), స్వాహాకృతిభ్యః=స్వాహాకృతి దేవతలకొఱకు, ప్రేష్య=హోతను ప్రేరణ చేయుము.' ఇతి=అని, ఆహ=అధ్వర్యుఁడు పలికెను. (అయమ్= ఈ ప్రైషము,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, సమిష్ట్యై=మంచి యిష్టికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: స్వాహాకృతి దేవత లనఁగా అంతిమ ప్రయాజ దేవతలు. 'స్వాహా శబ్ద బహులా కృతిః=మన్త్రప్రయోగః యాసా మన్తిమ ప్రయాజ దేవతానాం తాః స్వాహాకృతయః' అని సమాసార్థము. అంతిమ ప్రయాజేష్టి హోమములందు స్వాహాశబ్దము బహుళముగా ప్రయోగింపఁబడును. ఈ దేవతలకు స్వాహాకృతులని వ్యవహారమేర్పడినది. "హోతా యక్షదగ్నిం స్వాహాఽఽజ్యస్య" అను మంత్రముచే మైత్రావరుణుఁడు హోతను ప్రేరణ చేయును. అప్పుడు హోత "సద్యో జాతో వ్యమిమీత యజ్ఞమ్" అను యాజ్యను పఠించును. పిమ్మట

అధ్వర్యుఁడు అంతిమ ప్రయాజను యజించును. ఈ విధముగ ఈ ప్రైషము యజ్ఞముయొక్క సమ్యగిష్టికొఱకు సంపన్న మగుచున్నది. (ఇచట అంతిమ ప్రయాజకొఱకు మైత్రావరుణుని గూర్చి అధ్వర్యునకు ప్రైషమంత్ర ముత్పాదిత మైనది.)

19. అర్థము: పృషదాజ్యం యత్=పృషదాజ్య మేది కలదో, ఏతౌ =ఈ పృషదాజ్యము, పశూనామ్=పశువులకు, ప్రాణాపానౌ వై=ప్రాణాపానములే. వపా= వప, ఆత్మా=పశువులకు ఆత్మ. పృషదాజ్యమ్=పృషదాజ్యమును, అభిఘార్య= అభిఘరించి, వపామ్=వపను, అభిఘారయతి=అభిఘరించవలెను. (ఏవం కృతవాన్ =ఇట్లు చేసినట్టి, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) పశూనామ్=పశువులయొక్క, ఆత్మన్నేవ=ఆత్మయందే, ప్రాణాపానౌ=ప్రాణాపానములను, దధాతి=స్థాపించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: దధిమిశ్రిత మైన ఆజ్యము పృషదాజ్య మనఁబడును. పృషదాజ్యము పశువులకు ప్రాణాపానములవంటిది. వప ఆత్మవంటిది. పృషదాజ్యమును అభిఘరించి పిమ్మట వపను అభిఘరించవలెను. ఇట్లు చేసిన యధ్వర్యుఁడు పశువులయొక్క ప్రాణములను ఆత్మయందు స్థాపించినవాఁ డగును. (విధేయ ప్రాధాన్యముచే 'ఏతౌ'అని ద్వివచనాంతముగ ప్రయుక్త మైనది. ఇచట ప్రయాజశేషముచే హవిరభిఘారము విహిత మైనది.

20. అర్థము: "స్వాహోర్ధ్వనభసం మారుతం గచ్ఛతమ్" ఇతి ఆహ='ఓ వపాశ్రపణులారా! మీరు స్వయముగ హుతములై ఊర్ధ్వనభస నామకుఁడైన మరుత్పుత్రుని పొందుఁడు.' అని అధ్వర్యుఁడు ప్రార్థించినట్లు వేదము చెప్పినది. దేవానామ్=దేవతలలో, మారుతః=మరుత్పుత్రుఁడు, ఊర్ధ్వనభాః స్మ వై=ఊర్ధ్వనభస నామకుఁడే కదా! (ఊర్ధ్వ నభోభాగమున ఈ మరుత్పుత్రుఁడు విహరించునని యర్థము.) వపాశ్రపణీ=వపాశ్రపణులను, ప్ర హరతి=అగ్నియందు పడవేయవలెను. ఏనే=ఈ వపాశ్రపణులను, తేనైవ=ఆ హోమముతోనే, ప్ర హరతి=పడవేయవలెను.

తాత్పర్యము: దేవతలలో మరుత్పుత్రుఁడు ఊర్ధ్వనభస నామకుఁడు. పైని చెప్పిన విధముగ అధ్వర్యుఁడు వపాశ్రపణులను ప్రార్థించి హోమము చేయుచునే అగ్నియందు పడవేయవలెను.

21. అర్థము: విషూచీ=వపాశ్రపణులను వ్యత్యస్తములైన అగ్రభాగములు కలవిగా, ప్ర హరతి=అగ్నియందు పడవేయవలెను. తస్మాత్= వ్యత్యస్తాగ్రములుగా పడవేయుటవలన, ప్రాణాపానౌ=ప్రాణాపానములు, విష్వఞ్చౌ =విభిన్న వృత్తులు కలవి.

తాత్పర్యము: వపాశ్రపణులను వ్యత్యస్తము లయిన కొనలు కలవిగా అగ్నియందు పడవేయవలెను. ఆ కారణమువలన ప్రాణాపానములు విభిన్న వృత్తులు కలవి. అనఁగా ప్రాణము ఊర్ధ్వ వృత్తి కలది. అపానము అధో వృత్తి కలది యని యర్థము.

నవమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠకే దశమోఽనువాకః

మూలము: [1]పశుమాలభ్య పురోడాశం నిర్వపతి సమేధ మేవైనమా లభతే [2]వపయా ప్రచర్య పురోడాశేన ప్రచరత్యూర్జై పురోడాశ ఊర్జమేవ పశూనాం మధ్యతో దధాత్యథో పశోరేవ ఛిద్రమపి దధాతి [3]పృషదాజ్యస్యోపహత్య త్రిః పృచ్ఛతి శృతగ్ంహవీ౩ః శమితరితి త్రిషత్యా హి దేవా [4]యోఽశృతగ్ం శృతమాహ స ఏనసా [5]ప్రాణాపానౌ వా ఏతౌ పశూనామ్ (౧) యత్పృషదాజ్యం పశోః ఖలు వా ఆలబ్ధస్య హృదయ మాత్మాఽభి సమేతి యత్పృషదాజ్యేన హృదయ మభిఘారయత్యాత్మన్నేవ పశూనాం ప్రాణాపానౌ దధాతి [6]పశునా వై దేవాః సువర్గం లోకమాయన్తేఽమన్యన్త మనుష్యా నోఽన్వాభవిష్యన్తీతి తస్య శిరశ్ఛిత్త్వా మేధం ప్రాక్షారయన్త్స ప్లక్షోఽభవ త్తత్ప్లక్షస్య ప్లక్షత్వం యత్ప్లక్షశాఖోత్తరబర్హి ర్భవతి సమేధస్యైవ (౨) పశోరవ ద్యతి [7]పశుం వై హ్రియమాణగ్ం రక్షాగ్ంస్యను సచన్తేఽన్తరా యూపం చాఽఽహవనీయం చ హరతి రక్షసా మపహత్యై [8]పశోర్వా ఆలబ్ధస్య మనోఽపక్రామతి మనోతాయై హవిషోఽవదీయమానస్యాను బ్రూహీత్యాహ మన ఏవాస్యావ రున్ధే [9] ఏకాదశావదానాన్యవ ద్యతి దశ వై పశోః ప్రాణా ఆత్మైకాదశో యావానేవ పశుస్తస్యావ (౩) ద్యతి [10]హృదయస్యాగ్రేఽవ ద్యత్యథ జిహ్వాయా అథ వక్షసో యద్వై హృదయేనాభిగచ్ఛతి తజ్జిహ్వయా వదతి యజ్జిహ్వయా వదతి తదురసోఽధి నిర్వదత్యేతద్వై పశోర్యథాపూర్వం [11]యస్యైవ మవదాయ యథాకామ ముత్తరేషా మవద్యతి యథాపూర్వ మేవాస్య పశోరవత్తం భవతి [12]మధ్యతో గుదస్యావ

ద్యతి మధ్యతో హి ప్రాణ ఉత్తమస్యైవ ద్యతి (౪) ఉత్తమో హి ప్రాణో యదీతరం యదీతర ముభయ

మేవాజామి [13]జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభి ర్ఋణవా జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన

దేవేభ్యః ప్రజయా పితృభ్య ఏష వా అనృణో యః పుత్రీ యజ్వా బ్రహ్మచారివాసీ తదవదానై రేవావ

దయతే తదవదానానా మవదానత్వం [14]దేవాసురాః సంయత్తా ఆసన్తే దేవా అగ్ని మబ్రువన్త్వయా

వీరేణాసురానభి భవామేతి (౫) సోఽబ్రవీద్వరం వృణై పశో రుద్ధార ముద్ధరా ఇతి స ఏత ముద్ధార

ముదహరత దోః పూర్వార్ధస్య గుదం మధ్యతః శ్రోణిం జఘనార్ధస్య తతో దేవా అభవ న్పరాఽ

సురా యత్త్ర్యఙ్గాణాగ్ం సమవద్యతి భ్రాతృవ్యాభిభూత్యై భవత్యాత్మనా పరాఽస్య భ్రాతృవ్యో భవ

[15]త్యక్ష్ణయాఽవ ద్యతి తస్మాదక్ష్ణయా పశవో ఽఙ్గాని ప్ర హరన్తి ప్రతిష్ఠిత్యై (౬) ||

(ఏతా పశూనాగ్ం సమేధస్యైవ తస్యావోత్తమస్యావ ద్యతీతి పఞ్చచత్వారిగ్ంశచ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠకే దశమోఽనువాకః || ౧౦ ||

## వేదార్థదీపిక

అవతారిక: యజ్ఞపశువునుండి వపను తీయువిధానములోఁ బాటు వపాహోమము కూడ నవమానువాకమునం దభిహిత మైనది. ఈ దశమానువాకమునందు జుహ్వాది హోమ సాధన పాత్రములనుండి గ్రహించు విధానము చెప్పఁబడుచున్నది. ఈ యనువాకము 1. 3. ప్రపాఠకము 10వ అనువాకమునందలి "సం తే మనసా" ఇత్యాది మంత్రములకు వ్యాఖ్యానము.

1. అర్థము: పశుమ్=పశువును, ఆలభ్య=ఆలంభనము చేసి, పురోడాశమ్=పురోడాశమును, నిర్వపతి=నిర్వాపము చేయవలెను. తథా సతి= అట్లు కాఁగా, ఏనమ్=ఈ పశువును, సమేధమ్ ఏవ=సారసహితముగానే, ఆ లభతే=ఆలంభించినవాఁ డగును.

తాత్పర్యము: యజ్ఞ పశువు నాలంభనము చేసినయనంతరము పురోడాశమును నిర్వాపము చేయవలెను. పురోడాశము వ్రీహిసారము కనుక పురోడాశ నిర్వాపము చేసిన యధ్వర్యుఁడు సారవంతమైన పశువునే ఆలంభనము చేసినవాఁ డగును. (అభిఘారమును విధించుటకు ముందు వపోత్ఖేద ప్రయుక్త చ్ఛిద్రాపిధాన రూపమైన పశ్వంగ పురోడాశము ఇచట విధింపఁబడినది. మేధ మనఁగా సారము.)

2. అర్థము: వపయా=వపచే, ప్రచర్య=హోమ రూపమైన చర్యను చేసి, పురోడాశేన=పురోడాశముచే, ప్ర చరతి=హోమ రూపమైన చర్యను చేయవలెను. పురోడాశః=పురోడాశము, ఊర్క్ వై=సారమే. (తత్=అ కారణముచే,)

ఊర్జమేవ=సారమునే, పశూనామ్=పశువులయొక్క, మధ్యతః= మధ్యభాగమునందు, దధాతి=స్థాపించినవాఁడగుచున్నాఁడు. అథో= మఱియు, పశోః=పశువుయొక్క, ఛిద్రమేవ=ఛిద్రమునే, (రంధ్రమునే,) అపి దధాతి=కప్పినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: అధ్వర్యుఁడు ప్రథమమున వపను హోమముచేసి అనంతరము పురోడాశమును హోమము చేయవలెను. పురోడాశము సారరూపమే. అప్పుడు అధ్వర్యుఁడు పశువులయొక్క మధ్యభాగమైన ఉదరస్థానమునందు సారమును, పురోడాశరూపమునైన అన్నమును స్థాపించినవాఁ డగును. మఱియు పశువునుండి వపను తీయుటవలన ఏర్పడిన రంధ్రమును పూడ్చినవాఁ డగును. (ఇచట నిర్వాపము చేయఁ బడిన పురోడాశమునకు హోమము చేయుకాలము విహిత మైనది. "జాతవేదో వపయా గచ్ఛ దేవాన్' ' అను మంత్రముచే వపను హోమము చేసి పిమ్మట పురోడాశమును హోమము చేయవలయునని గ్రహించవలయును.)

3. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) పృషదాజ్యస్య= పాత్రమునందలి పృషదాజ్యముయొక్క, (అంశమ్=అంశమును,) ఉపహత్య= స్రువముతో వేరుగా తీసికొని, 'హే శమితః!=ఓ శమితా! హవిః శ్రుతమ్?=హవిస్సు పక్వ మైనదా?, ఇతి=అని, త్రిః పృచ్ఛతి=(శమితను) మూఁడు మారులు ప్రశ్నించవలెను. దేవాః=దేవతలు, త్రిషత్యాః, హి=మూఁడు మారులు చెప్పఁబడినది సత్య మనెడి బుద్ధి కలవారు కదా!'

తాత్పర్యము: పశువుయొక్క హృదయాది రూపమైన హవిస్సును పక్వము చేయుచున్న శమితను గూర్చి ప్రశ్నమంత్ర మిచట ఉత్పాదిత మైనది. పశువుయొక్క హృదయాది హవిస్సును పక్వముచేయు నతఁడు శమిత యనఁబడును.) ప్రతిప్రస్థాత పాత్రమునందలి పృషదాజ్యమును స్రువముతో వేరుచేసి "శృతగ్ం హవీ౩: శమితః" 'ఓ శమితా! హవిస్సు పక్వమైనదా?' అను మంత్రముచే శమితను మూఁడు మారులు ప్రశ్నించవలెను. దేవతలు మూఁడు మారులు చెప్పినది సత్యమనెడి బుద్ధి కలవారు కదా! (కావున ప్రతిప్రస్థాత మూఁడు మారులు శమితను ప్రశ్నించవలెను.)

4. అర్థము: యః=ఎవఁడు, అశృతమ్=పక్వము కానిదానిని, శృతమ్=పక్వమైనదిగా, ఆహ=చెప్పెనో, సః=అతఁడు, ఏనసా= పాపముతో, (యుజ్యతే=కూడియుండును.)

తాత్పర్యము: (పూర్వపు ప్రశ్నకు వ్యతిరేక ముఖముగ సమాధాన మంత్ర మిచట ఉత్పాదిత మైనది.) పక్వము కాని దానిని పక్వ మైనదిగా చెప్పు నతఁడు పాపి యగునని శమిత వ్యతిరేకముఖముగ సమాధానము చెప్పెను. (పక్వ మైనప్పుడే సమాధానము చెప్పవలెనని తాత్పర్యము. ప్రతిప్రస్థాత పృషదాజ్యమును పాత్రమునుండి జుహూవులోనికి తీసికొని, చాత్వాలోత్కర ప్రదేశముల మధ్యమునుండి వెలుపలికి వచ్చి "శృతగ్ం హవీ౩: శమితః" అని మూఁడు మారులు ఆ ప్రదేశమునకు ఉత్తర దిశయందు హృదయాది రూప హవిస్సును పక్వము చేయుచున్న శమితను ప్రశ్నించును. 'పక్వ మైనది' అని శమిత సమాధానము చెప్పును. ఇది కల్ప సూత్రార్థము.)

5. అర్థము: పృష దాజ్యం యత్=పృషదాజ్య మేది కలదో, ఏతౌ=ఇది (ఇవి,) పశూనామ్=పశువులయొక్క, ప్రాణాపానౌ=ప్రాణాపానములు. పృషదాజ్యేన=పృషదాజ్యముతో, హృదయమ్=(పశు) హృదయమును, అభి ఘారయతి యత్= అభిఘారము చేయుచో, ఆలబ్ధస్య=ఆలంభనము చేయఁబడిన, పశోః=పశువుయొక్క, ఆత్మా=ఆత్మ, హృదయమ్ అభి సమేతి=హృదయమున కభిముఖముగ వచ్చును. (తథా సతి=అట్లు కాఁగా, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) పశూనామ్=పశువులయొక్క, ఆత్మన్ ఏవ=ఆత్మయందే, ప్రాణాపానౌ=ప్రాణాపానములను, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: నవమానువాకమునందలి 18 వ మంత్ర తాత్పర్యమును చూడుఁడు. అచట 'వపా' అని యుండఁగా ఇచట 'హృదయమ్' అని యున్నది.

6. అర్థము: దేవాః=దేవతలు, పశునా వై=పశువుతోడనే, సువర్గం లోకమ్=స్వర్గ లోకమును గూర్చి, ఆయన్=వెళ్లిరి. 'మనుష్యాః=మనుష్యులు, నః=మమ్ము, అన్వాభవిష్యన్తీతి=అనుసరించి రాఁగలరు' అని, తే=ఆ దేవతలు, అమన్యన్త=తలఁచిరి. (మత్వా=తలఁచి) తస్య=ఆ పశువుయొక్క, శిరః=శిరస్సును, ఛిత్త్వా=ఛేదించి, మేధమ్=సారమును, ప్రాక్షారయన్=స్రవింపఁజేసిరి. సః=ఆ సారము, ప్లక్షః=ప్లక్ష వృక్షము, అభవత్=ఆయెను, తత్=ఆ క్షరణము (స్రవించుట) వలన ఉత్పన్న మగుటచే, ప్లక్షస్య=ప్లక్షవృక్షమునకు, ప్లక్షత్వమ్='ప్లక్ష' మను పేరు ఏర్పడినది. ప్లక్షశాఖా=ప్లక్ష వృక్షముయొక్క, కొమ్మ, ఉత్తర బర్హిః=ఉత్తర బర్హిస్సుగా, భవతి యత్= అయినచో, సమేధస్య=సార సహితమైన, పశోః ఏవ=పశువునుండియే, అవద్యతి= అవదానము చేయుచున్నవాఁడగును.

తాత్పర్యము: దేవతలు పశువుతోఁ గూడ స్వర్గమునకు పోవుచు, మనుష్యులు తమతోఁ గూడ వత్తురని భావించి, పశు శిరస్సును ఛేదించి దానిసారమును స్రవింపఁజేసిరి. ఆ స్రవించిన సారము ప్లక్ష వృక్ష మాయెను. క్షరణమునుండి పుట్టిన దగుటచే ఆ వృక్షమునకు 'ప్లక్ష' నామ మేర్పడినది. ప్లక్షశాఖ ఉత్తర బర్హిస్సు అయినచో, సార సహిత పశువునుండియే హవిస్సును అవదానము చేసిన ట్లగును. ఆ శాఖను బర్హిస్సునకు పైని ఉంచుటచే 'ఉత్తర బర్హిస్సు' అని వ్యవహరింపఁబడుచున్నది. ఇచట ప్లక్షశాఖ అవదానాధారముగ విధింపఁబడినది.)

7. అర్థము: రక్షాంసి=రాక్షసులు, హ్రియమాణం పశుం వై= తీసికొని పోఁబడుచున్న పశువునే, అను సచన్తే=అనుసరింతురు. రక్షసామ్ అపహత్యై=రాక్షస నాశమునకై, యూపం చ ఆహవనీయం చ అన్తరా=యూపము ఆహవనీయముల మధ్యమున, హరతి=తీసికొని పోవలెను.

తాత్పర్యము: తీసికొనిపోఁబడుచున్న పశువునే రాక్షసు లనుసరింతురు. కావున రాక్షస నాశముకొఱకు ఆ పశువును యూపాహవనీయముల మధ్య ప్రదేశమునుండి తీసికొనిపోవలెను. (యూపము, ఆహవనీయమును రక్షోనాశకములు కావున ఆ రెండింటి మధ్యప్రదేశమున పశుహృదయాది హవిస్సును తీసికొని పోవలెనని యిచట మార్గవిశేషము చెప్పఁబడినది.)

8. అర్థము: ఆలబ్ధస్య=ఆలంభనము చేయఁబడిన, పశోః= పశువుయొక్క, మనః=మనస్సు, అప క్రామతి=తొలఁగిపోవును. "అవదీయమానస్య=అవదానము చేయఁబడుచున్న, హవిషః=హవిస్సునకు, మనోతాయై=అగ్నిదేవతకొఱకు, అను బ్రూహి=వెంటనే పలుకుము." ఇతి=అని, ఆహ=అధ్వర్యుఁడు హోతను గూర్చి ప్రైషమంత్రమును చెప్పెను. ( అతః=ఈ ప్రైష మంత్ర పఠనమువలన, మనోతా=మనోతయైన యగ్నిదేవత, అస్య= ఈ పశువుయొక్క, మనః ఏవ=మనస్సునే, అవరున్ద్ధే=పొందును.

తాత్పర్యము: (ఇచట హోతను గూర్చి ప్రైష మంత్ర ముత్పన్న మైనది.) ఆలంభనము చేయఁబడిన పశువుయొక్క మనస్సు పశువునుండి తొలఁగి పోవును. కనుక 'మనస్సునందు సంబద్ధమైయుండు మనోత (అగ్నిదేవత)కొఱకు అవదానముచేయఁబడుచున్న హవిస్సును గూర్చి పలుకుము' అని అధ్వర్యుఁడు హోతతో అనును. ఇట్లు ప్రైష మంత్రమును పఠించుటచే మనోతయైన అగ్నిదేవత ఈ పశువుయొక్క మనస్సును పొందును. ("త్వం హ్యగ్నే ప్రథమో మనోతా" అను శ్రుతివలన అగ్నిదేవత మనోత యనఁబడును. మనసి ఊతా=సంబద్ధేతి, మనోతా. మనస్సునందు సంబద్ధమై యుండునట్టి దేవత అగ్ని యని తాత్పర్యము.)

9. అర్థము: ఏకాదశావదానాని అవ ద్యతి=పదునొకండు అవదానములు చేయవలెను. పశోః=పశువుయొక్క, ప్రాణాః=ప్రాణములు, దశ వై=పదియే. ఆత్మా=ఆత్మ, ఏకాదశః=పదునొకండవది. పశుః=పశువు, యావాన్ ఏవ= ఆత్మతో కూడ ఎన్ని ప్రాణములు కలదో, తస్య అవ ద్యతి=ఆ సర్వ పశువును అవదానము చేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: (ఇచట సంఖ్యావిశిష్టములైన అవదానములు విధింపఁబడినవి.) పశువుయొక్క హృదయాది హవిర్ద్రవ్యమును పదునొకండు మారులు అవదానము చేయవలెను. నాభిసహిత దశ చ్ఛిద్రములందు ప్రాణము సంచరించును. కనుక ప్రాణములు పది. ఆత్మ పదునొకండవది. కావున ఆత్మతో కూడ ప్రాణముల సంఖ్య పదునొకండు అగుచున్నది. అందువలన పదునొకండు మారులు హృదయాది హవిస్సును పాత్రమునుండి జుహువులోనికి అవదానము చేయవలెను. అప్పుడు అధ్వర్యుఁడు సమస్తమైన పశుహవిస్సును అవదానము చేసినవాఁ డగును. ("హృదయం జిహ్వా వక్షో యకృద్వృక్కౌ సవ్యం దోరుభే పార్శ్వే దక్షిణా శ్రోణి ర్గుదతృతీయ మితి దైవతాని" అని సూత్రకారుఁడు ఆ యేకాదశాంగములను సూత్రీకరించినాఁడు.)

10. అర్థము: అగ్రే=ప్రథమమున, హృదయస్య=హృదయ రూపమైన హవిస్సును, (ద్వితీయార్థే షష్ఠీ.) అవ ద్యతి=అవదానము చేయవలెను. అథ=పిమ్మట, జిహ్వాయాః=జిహ్వారూపమైన హవిస్సును, అథ=అనంతరము, వక్షసః=వక్షోరూపమైన హవిస్సును, అవ ద్యతి=అవదానము చేయవలెను. యత్=దేనిని, హృదయేనైవ=మనస్సుచేతనే, అభిగచ్ఛతి=పొందుచున్నాఁడో, (సంకల్పించుచున్నాఁడో,) తత్=దానిని, జిహ్వాయా=జిహ్వా (నాలుక)చే, వదతి=మాటాడుచున్నాఁడు. యత్=దేనిని, జిహ్వాయా=నాలుకతో, వదతి= మాటాడుచున్నాఁడో, తత్=దానిని, ఉరసః=వక్షస్సునుండి, అధి నిర్వదతి= నిశ్శేషముగ (మఱల) ఊర్ధ్వదేశగత బలముతో మాటాడుచున్నాఁడు. ఏతత్ వై= ఇదియే, పశోః=పశువునకు సంబంధించిన, యథాపూర్వమ్=పూర్వోక్తమైన క్రమము.

తాత్పర్యము: (అవదాన క్రమము ఇచట విధించఁబడుచున్నది.) పశువుయొక్క హృదయాది హవిస్సుల నవదానము చేయునపుడు అధ్వర్యుఁడు ప్రథమమున హృదయ రూపమైన హవిస్సును, పిమ్మట జిహ్వారూప హవిస్సును, అనంతరము వక్షోరూప హవిస్సును అవదానము చేయవలెను. లోకమునందు మనుజుఁడు ప్రథమమున హృదయముతో దేనిని నిశ్చయించునో, పిమ్మట దానిని నాలుకతో మాటాడుచున్నాఁడు. మఱల దానినే నిశ్శేషముగ ఉచ్చధ్వనితో ఎప్పుడు మాటాడునో, అప్పుడు వక్షస్సునుండి ఊర్ధ్వదేశగత బలముచే మాటాడుచున్నాఁడు. కావున హృదయాదుల మూఁడింటనుండి అంశక్రమముతో అవదానము చేయవలెను. ఈ క్రమావదానమే పశ్వంగములయందు యథాపూర్వము కావలెను. లోకమునందు అభివదన వ్యవహారము జరుగు క్రమము ననుసరించియే పశ్వంగములైన హృదయాది హవిస్సుల యవదానము విషయమునఁ గూడ ఈ క్రమమే చెప్పఁబడినది.

11. అర్థము: యస్య=ఏ పశువుయొక్క, (హృదయాదీని త్రీణ్యఙ్గాని= హృదయాదులైన మూఁడు అంగములను,) ఏవమ్=ఈ పూర్వోక్తక్రమముగ, అవదాయ=అవదానము చేసి, ఉత్తరేషామ్=ఉత్తరాంగములను, (ద్వితీయార్థే షష్ఠీ.) యథాకామమ్=ఐచ్ఛికక్రమముగ, అవద్యతి=అవదానము చేయునో, అస్య పశోః= ఈ పశువునకు, యథా పూర్వమ్ ఏవ=పూర్వపుదైన హృదయాద్యంగము దోషకారి కాని విధముగనే, అవత్తమ్=అవదానము చేయఁబడినది, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: పశువునకు హృదయభాగము, జిహ్వాభాగము, వక్షోభాగము పూర్వాంగములు. మిగిలినవి ఉత్తరాంగములు. హృదయాది పూర్వాంగములు మూఁడును పైని చెప్పినక్రమమున అవదానము చేయవలెను. ఉత్తరాంగములు పూర్వోక్త క్రమము లేకుండనే యథేష్టముగ అవదానము చేయవచ్చును. పూర్వమైన హృదయాద్యంగము దోషకారి కానివిధముగనే ఉత్తరాంగము ఐచ్ఛిక క్రమమున అవదానము చేసినను దోషకారి కాదు. (ఉత్తరాంగములందు కూడ హృదయాదులందువలె ప్రసక్తమైన అవదాన క్రమము ఇచట వారింపఁ బడినది.)

12. అర్థము: గుదస్య=గుదకాండముయొక్క, మధ్యతః= మధ్యభాగమును, అవ ద్యతి=అవదానము చేయవలెను. ప్రాణః=ప్రాణవాయువు, మధ్యతః హి=ముఖమధ్యమునం దుండునది కదా! ఉత్తమస్య=గుదసుయొక్క

ఉత్తమ భాగమును, అవద్యతి=అవదానము చేయవలెను. ప్రాణః=ప్రాణము, ఉత్తమః హి= (జీవన హేతు వగుటవలన చక్షురాది సర్వేంద్రియములందు) ఉత్తమ మైనది కదా! ఇతరం యది=ఇతరమైన మధ్యభాగ మును అవదానము చేసినను, ఉభయమ్= ఉభయవిధము, అజామి ఏవ=దోషరహిత మైనదే.

తాత్పర్యము: పశువుయొక్క పదునొకండు అంగములలో గుదకాండ (పాయు) రూపమైన అంగమును ఉత్తమ మధ్యమాధమ భేదములచే మూఁడు భాగములుగ విభజించి ఆ భాగములలో ఉత్తమ మధ్యమ భాగములను క్రమనియమము లేకుండ అవదానము చేయవచ్చును. ప్రాణము ముఖమధ్యమువం దుండును. కావున మధ్య భాగమును ప్రథమమున అవదానము చేయవచ్చును. జీవన హేతు వగుటచే ప్రాణము సర్వేంద్రియములందును ఉత్తమ మైనది. కావున గుదకాండముయొక్క ఉత్తమభాగమునైనను ప్రథమమున అవదానము చేయవచ్చును. (ఇచట గుదకాండముయొక్క మధ్యమోత్తమ భాగముల యవదాన క్రమము వికల్పముగ విధించఁబడినది.)

13. అర్థము: బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, జాయమానః వై= పుట్టుచున్నవాఁడేయై, త్రిభిః ఋణవా=మూఁడు ఋణములతో, జాయతే= పుట్టుచున్నాఁడు. బ్రహ్మచర్యేణ=వేదాభ్యాసముచే, ఋషిభ్యః=ఋషులకొఱకు, యజ్ఞేన=యజ్ఞ ముచేత, దేవేభ్యః=దేవతలకొఱకు, ప్రజయా=సంతానముచే, పితృభ్యః=పితృదేవతలకొఱకు, (ఋణీ భవతి=ఋణము కలవాఁ డగుచున్నాఁడు.) యః=ఏ బ్రాహ్మణుఁడు, పుత్రీ=పుత్రవంతుఁడు, యజ్వా= యజ్ఞము చేసినవాఁడు, బ్రహ్మచారివాసీ=వేదాభ్యాసముచే బ్రహ్మచారిగా గురుగృహమునందు నివసించువాఁడు నగునో, ఏషః వై=ఇతఁడే, అనృణీ=ఋణ విహీనుఁడు, భవతి=అగుచున్నాఁడు. తత్=ఆ ఋణమును, అవదానైః ఏవ=పశు హృదయా ద్యవదానములచేతనే, అవ దయతే=పోఁగొట్టుకొనుచున్నాఁడు. తత్=ఆ కారణమువలన, అవదానానామ్= అవదానములకు, అవదానత్వమ్=అవదానసంజ్ఞ.

తాత్పర్యము: (ఇచట హృదయాద్యవదానములు ప్రశంసింపఁబడుచున్నవి. ) బ్రాహ్మణుఁడు పుట్టుచునే ఋషి దేవ పితౄ ణములను అనఁగా బ్రహ్మచర్యము ( వేదాభ్యాసము)చే ఋషి ఋణమును, యజ్ఞముచే దేవ ఋణమును, సంతానముచే పితౄణమును కలిగియుండును. పుత్రవంతుఁడు, యజ్వ, బ్రహ్మచారివాసియు నైన యతఁడు ఈ ఋణమునుండి విముక్తుఁడు (అనృణి) అగును. ఆ మూఁడు విధములైన ఋణమును బ్రాహ్మణుఁడు హృదయాద్యవదానములచేతనే పోఁగొట్టును. ఋణ మవదయతే ఏభిరితి=అవదానత్వమ్. ఈ హృదయాద్య వదానములచే ఋణము పోఁగొట్టఁ బడుచున్నది. కావున అవదానములకు అవదాన సంజ్ఞ సార్థక మైనది. బ్రహ్మచర్యము= వేదాభ్యాసము. ఆ బ్రహ్మచర్యముచే గురుగృహమునందు వసించువాఁడు బ్రహ్మచారివాసి యని యర్థము.

14. అర్థము: దేవాసురాః=దేవతలు అసురులు, సంయత్తాః=యుద్ధ సన్నద్ధులు, ఆసన్=ఐరి. (హే అగ్నే!=ఓ యగ్నీ!,) వీరేణ=వీరుఁడవైన, త్వయా=నీచేత, అసురాన్=రాక్షసులను, అభిభవామ ఇతి=తిరస్కరించెదము, (జయించెదము,) అని, తే దేవాః=ఆ దేవతలు, అగ్నిమ్=అగ్నిని గూర్చి, అబ్రువన్= పలికిరి. పశోః=పశు వుయొక్క, ఉద్ధారమ్=ఉత్కృష్టముగా ధరించఁబడుచున్న ఉత్తమ భాగమును, ఉద్ధరై=స్వీకరింతును. వరమ్=(ఈ) వరమును, వృణై= కోరుదును, ఇతి=అని, సః=ఆ యగ్ని, అబ్రవీత్=పలికెను. సః=ఆ యగ్ని, పూర్వార్ధస్య=పశువుయొక్క పూర్వార్ధ సంబంధియగు, దోః=హస్తమును, మధ్యతః=మధ్యప్రదేశ మునుండి, గుదమ్=గుదకాండమును, జఘనార్ధస్య= జఘన భాగముయొక్క, శ్రోణిమ్=పిఱుఁదును, ఏతమ్ ఉద్ధారమ్=ఈ ఉత్తమ భాగముగా, ఉదహరత=(ఉత్ అహరత) పైకి తీసికొనెను. తతః=అనంతరము, దేవాః=దేవతలు, అభవన్=విజయులైరి. అసురాః=రాక్షసులు, పరాఽభవన్= తిరస్కృతు లైరి. భ్రాతృవ్యాభి భూత్యై=శత్రుపరాభవముకొఱకు, త్ర్యఙ్గాణామ్= పూర్వోక్తములైన మూఁడు అంగములయొక్క అంశములను,

సమవద్యతి యత్= బాగుగ అవదానము చేయునెడల, ఆత్మనా=స్వయముగా, భవతి=విజయుఁ డగును. అస్య=ఈ యజమానునియొక్క, భ్రాతృవ్యః=శత్రువు, పరాభవతి= తిరస్కృతుఁ డగును.

తాత్పర్యము: దేవతలు రాక్షసులు యుద్ధము చేయుటకు సిద్ధపడిరి. అప్పుడు దేవతలు వీరుఁడైన అగ్నివలన రాక్షసులను జయించెదమని అగ్ని నడిగిరి. దానికి ప్రతిఫలముగ అగ్ని పశువునుండి తీయఁబడునట్టి ఉత్తమ హవిస్సును వరముగా కోరుకొనెను. పిమ్మట ఆ యగ్ని పశు పూర్వార్ధమునుండి దోర్భాగమును, మధ్యభాగమునుండి గుదకాండమును, ఉత్తరార్ధమైన జఘన భాగమునుండి పిఱుఁదును తాను కోరుకొనిన ఉత్తమ భాగముగా తీసికొనెను. దానివలన దేవతలు విజయులైరి. రాక్షసులు పరాభూతు లైరి. ఈ మూఁడు అంగములను శత్రు పరాభవముకొఱకు బాగుగ అవదానము చేసిన యజ్ఞకర్త స్వయముగ విజయవంతుఁ డగును. ఇతని శత్రువు పరాభూతుఁ డగును. (ఇచట స్విష్టకృదగ్నికొఱకు త్ర్యంగావదానము విధించఁబడినది. సుష్ఠుగ ఇష్టమును చేయువాఁడు స్విష్టకృత్తు. అట్టి అగ్ని స్విష్టకృదగ్ని.)

15. అర్థము: అక్ష్ణయా=వక్రముగ, అవ ద్యతి=పూర్వోక్తమైన అవదానమును చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, పశవః=పశువులు, ప్రతిష్ఠిత్యై=మంచిస్థితికొఱకు, అఙ్గాని=పాదాద్యవయవములను, అక్ష్ణయా= వక్రపద్ధతిగ, ప్ర హరన్తి=ఉంచుకొనుచున్నవి.

తాత్పర్యము: వక్రముగ అవదానము చేయవలెను. ఆ కారణమువలన పశువులు శయన సమయమునందు పాదాద్యవయవములను కదలకుండ ఉండుటకై వక్రముగ ఉంచుకొనుచున్నవి. (ఇచట అవదానమున వక్రగతి విహితమైనది.)

దశమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే తృతీయ ప్రపాఠక ఏకాదశోఽనువాకః

మూలము: [1]మేదసా స్రుచౌ ప్రోర్ణోతి మేదోరూపా వై పశవో రూపమేవ పశుషు దధాతి [2]యూషన్నవధాయ ప్రోర్ణోతి రసో వా ఏష పశూనాం యద్యూ రసమేవ పశుషు దధాతి [3]పార్శ్వేన వసాహోమం ప్రయౌతి మధ్యం వా ఏతత్పశూనాం యత్పార్శ్వగ్ం రస ఏష పశూనాం యద్వసా యత్పార్శ్వేన వసాహోమం ప్రయౌతి మధ్యత ఏవ పశూనాగ్ం రసం దధాతి[4] ఘ్నన్తి (౧) వా ఏతత్పశుం యత్సం జ్ఞపయన్త్యైన్ద్రః ఖలు వై దేవతయా ప్రాణ ఐన్ద్రోఽపాన ఐన్ద్రః ప్రాణో అఙ్గే అఙ్గే ని దేధ్యది త్యాహ ప్రాణాపానావేవ పశుషు దధాతి [5]దేవ త్వష్టర్భూరి తే సగ్ం సమేత్విత్యాహ త్వాష్ట్రా హి దేవతయా పశవో [6]విషురూపా యత్సలక్ష్మాణో భవథేత్యాహ విషురూపా హ్యేతే సన్తః సలక్ష్మాణ ఏతర్హి భవన్తి [7]దేవత్రా యన్తమ్ (౨) అవసే సఖాయోఽను త్వా మాతా పితరో మదన్త్విత్యా హానుమత మేవైనం మాత్రా పిత్రా సువర్గం లోకం గమయ [8] త్యర్ధర్చే వసాహోమం జుహోత్యసౌ వా అర్ధర్చ ఇయ మర్ధర్చ ఇమే ఏవ రసేనానక్తి దిశో జుహోతి దిశ ఏవ రసేనానక్త్యథో దిగ్భ్య ఏవోర్జగ్ం రసమవ రున్ధే [9]ప్రాణాపానౌ వా ఏతౌ పశూనాం యత్పృషదాజ్యం వానస్పత్యాః ఖలు (౩) వై దేవతయా పశవో యత్పృషదాజ్యస్యోపహత్యాఽఽహ వనస్పతయేఽను బ్రూహి వనస్పతయే ప్రేష్యేతి ప్రాణాపానావేవ పశుషు దధా [10]త్యన్యస్యాన్యస్య సమవత్తగ్ం సమవద్యతి తస్మా న్నానారూపాః పశవో [11]యూష్ణోప సిఞ్చతి రసో వా ఏష పశూనాం యద్యూ రసమేవ పశుషు

దధా [12]తీడాముప హ్వాయతే పశవో వా ఇడా పశూనేవోప హ్వాయతే చతురుప హ్వాయతే (४)

చతుష్పాదో హి పశవో [13]యం కామయేతాపశుః స్యాదిత్యమేదస్కం తస్మా ఆ దధ్యాన్మేదోరూపా

వై పశవో రూపేణైవైనం పశుభ్యో నిర్భజత్యపశురేవ భవతి [14]యం కామయేత పశుమాన్త్స్యాదితి

మేదస్వత్తస్మా ఆ దధ్యాన్మేదోరూపా వై పశవో రూపేణైవాస్మై పశూనవ రుంద్ధే పశుమానేవ భవతి

[15]ప్రజాపతి ర్యజ్ఞ మసృజత స ఆజ్యమ్ (౫)పురస్తా దసృజత పశుం మధ్యతః పృషదాజ్యం పశ్చా

త్తస్మా దాజ్యేన ప్రయాజా ఇజ్యన్తే పశునా మధ్యతః పృషదాజ్యేనానూయాజా స్తస్మాదేతన్మిశ్రమివ

పశ్చాత్సృష్టగ్ం హ్యే[16]కాదశానూయాజా న్యజతి దశ వై పశోః ప్రాణా ఆత్మైకాదశో యావా

నేవ పశు స్తమను యజతి [17] ఘ్నన్తి వా ఏతత్పశుం యత్సంజ్ఞపయన్తి ప్రాణాపానౌ ఖలు వా

ఏతౌ పశూనాం యత్పృషదాజ్యం యత్పృషదాజ్యేనానూయాజా న్యజతి ప్రాణాపానావేవ పశుషు

దధాతి (౬) ||

(ఘ్నన్తి యన్తం ఖలు చతురుప హ్వాయత ఆజ్యం యత్పృషదాజ్యేన షట్చ||)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయ ప్రపాఠక ఏకాదశోఽనువాకః|| ౧౧ ||

చాత్వాలాత్సువర్గాయ వై సర్జనాని వైష్ణవ్యర్చా పృథివ్యై సాధ్యా ఇషేత్వేత్యగ్నినా పర్యగ్ని పశోః పశు

మాలభ్య మేదసా స్రుచావేకాదశ || ౧౧ ||

చాత్వాలా ద్దేవానుపైతి ముఞ్చతి ప్రహ్రియమాణాయ పర్యగ్ని పశుమాలభ్య చతుష్పాదో

ద్విషష్టిః || ౭ ||

హరిః ఓమ్

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే తృతీయః ప్రపాఠకః || 3 ||

# వేదార్థదీపిక

అవతారిక: దశమానువాకమునందు అవదానమును గుఱించి వివరించఁబడినది. ఈ యేకాదశానువాకమునందు అనూయాజేష్టి వివరించఁబడుచున్నది. ప్రథమ కాండమునందలి తృతీయ ప్రపాఠకములోని దశమానువాకగత మంత్రములకు ఈ యేకాదశానువాకము వివరణాత్మకము.

1. అర్థము: మేదసా=మేదస్సుచే, స్రుచౌ=జుహూపభృత్తులను, ప్రోర్ణోతి=ఆచ్ఛాదించవలెను. పశవః=పశువులు, మేదోరూపాః వై=మేదోరూపములే. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁగా,) పశుషు=పశువులయందు, రూపమేవ=రూపమునే, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: హృదయమును చుట్టుకొనియుండు నదియు, జీర్ణ పట సదృశ మైనదియునగు పదార్థ విశేషము మేద స్సనఁబడును. హోమ సాధనములైన జుహూపభృత్తులను ఆ మేదస్సుచే ఆచ్ఛాదించవలెను. పశువులు మేదోరూపములే. జుహూపభృత్తులను మేదస్సుచే ఆచ్ఛాదించుటవలన యజ్ఞకర్త పశువులయందు రూపమును స్థాపించినవాఁ డగును. అనఁగా మేదోబాహుళ్య మేర్పడుటవలన పశువులు రూపవంతము లగును.

2. అర్థము: యూషన్=మాంసముతో కూడ పక్వమైన జలమునందు, అవధాయ=మేదస్సు నుంచి, ప్రోర్ణోతి=ఆచ్ఛాదించవలెను. యూః యత్= యూషశబ్దార్థ మేది కలదో, ఏషః=ఇది, పశూనామ్=పశువులయొక్క, రసః వై= రసమే. (ఏవం కృతవాన్=ఈ విధముగ చేసిన యజమానుఁడు, పశుషు= పశువులయందు, రసమేవ=రసమునే, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: (మేదస్సు నాచ్ఛాదించుటయందు ఇచట ఒక విశేషము విధించఁ బడినది.) మాంసముతో కూడ పక్వమైన జలము యూషశబ్దార్థము. మేదస్సును ఆ జలమునందు ఉంచి పిమ్మట ఆ మేదస్సుచే జుహూపభృత్తుల నాచ్ఛాదించవలెను. మాంసముతో కూడ పక్వమైన ఈ జలము పశువుల సారమే. కనుక యజ్ఞకర్త పశువులయందు రసమునే స్థాపించినవాఁ డగును.

3. అర్థము: పార్శ్వేన=అస్థి (యెముక) చేత, వసాహోమమ్= హోమద్రవ్యమైన వసను, ప్రయౌతి=కలయపెట్టవలెను. పార్శ్వం యత్=అస్థి యేది కలదో, ఏతత్=ఇది, పశూనామ్=పశువులయొక్క, మధ్యం వై=మధ్యభాగమే. వసా యత్=వస యేది కలదో, ఏషః=ఇది, పశూనామ్=పశువులయొక్క, రసః ఏవ= రసమే. పార్శ్వేన=అస్థిచే, వసాహోమమ్=హోమ ద్రవ్యమైన వసను, ప్రయౌతి యత్=ఆలోడనము (కలయపెట్టుట) చేసినచో, పశూనామ్=పశువులయొక్క, మధ్యతః ఏవ= మధ్యభాగమునందే, రసమ్=రసమును, దధాతి=స్థాపించిన ట్లగును.

తాత్పర్యము: మాంస పాక భాండమునం దున్నట్టి స్నేహాత్మకమైన ద్రవవిశేషము వస యనఁబడును. ఆ వస హోమము చేయఁబడును. కనుక వసాహోమ మనఁగా హోమ ద్రవ్యమైన వస యని యర్థము. అచట ఉన్నట్టి యెముక పార్శ్వ శబ్దముచే వివక్షిత మైనది. ఆ యస్థిచేత వసను ఆలోడనము చేయవలెను. అస్థి పశువుల మధ్యభాగము. వస పశువులయొక్క రసము. అస్థిచేత వసను కలయఁబెట్టిన యధ్వర్యుఁడు పశువుల మధ్యమందు రసమును స్థాపించినవాఁ డగును.

4. అర్థము: పశుమ్=పశువును, సంజ్ఞపయన్తి యత్= కంఠనిరోధాది రూపమైన సంజ్ఞపనము చేయుట యేది కలదో, ఏతత్=ఇది, ఘ్నన్తి వై= పశువును చంపుచున్నారనియే అర్థము, ప్రాణః=ప్రాణము, దేవతయా=దేవతచే, ఐన్ద్రః ఖలు వై=ఇంద్రుని సంబంధియే కదా! అపానః=అపానము, ఐన్ద్రః=ఇంద్ర సంబంధి. "ఐన్ద్రః ప్రాణో అఙ్గే అఙ్గే నిదేధ్యత్" ఇతి ఆహ="ఇంద్ర దేవతాకమైన (ఈ పశువుయొక్క) ప్రాణము ఆ యా హృదయాద్యంగములందు బాగుగ స్థాపించఁబడవలెను". (అపానము కూడ ఈ విధముగానే ఆ యా స్థాన

మునందు విశేషముగ నుండుఁ గాక.) అని ఆదాన సంమర్శన మంత్రముయొక్క పూర్వభాగమైన "ఐన్ద్రః ప్రాణో అఙ్గే అఙ్గే ని దేధ్యత్" అను మంత్రము చెప్పుటచే (యజమానః=యజమానుఁడు,) పశుషు= పశువులయందు, ప్రాణాపానావేవ=ప్రాణాపానములన్నే దధాతి=స్థాపించినవాఁ డగును.

**తాత్పర్యము:** సంజ్ఞపన మనఁగా కంఠమును నిరోధించుట మున్నగు ఉపఘాతములచే చంపుట యని అర్థము. పశు సంజ్ఞపనము అష్టమానువాకము నందు విహితమైనది. పశు సంజ్ఞపన మైనపుడు పశు ప్రాణాపానములు వాని స్థానమునుండి వెడలిపోవును. ప్రాణాపానములు ఇంద్ర దేవతాకములు. కనుక ఇంద్ర దేవతాకములైన ప్రాణాపానములను మఱల ఆ స్థానములందు స్థాపించవలయును. (ఈ మంత్రమునందలి 'ఐన్ద్రి' పదము తద్ధిత ప్రత్యయాంతము. ఆ తద్ధిత ప్రత్యయము దేవతా వాచకమని ఇచట వివరింపఁబడినది.)

5. **అర్థము:** "దేవ త్వష్ట ర్భూరి తే సగ్ం సమేతు" ఇతి ఆహ=ఓ త్వష్ట్ర దేవ! నీ యనుగ్రహముచేత సమస్తమైన అంగజాతము (ఛేదనముచే విశ్లిష్టమైనను) కలిసి కొనుఁగాక అని "దేవ త్వష్టః ఇత్యాది మంత్రభాగము చెప్పినది. పశవః= పశువులు, దేవతయా=దేవతచే, త్వాష్ట్రాః హి=త్వష్ట్ర దేవునకు సంబంధించినవి కదా!

**తాత్పర్యము:** పశువులు త్వష్ట్రదేవునకు సంబంధించినవి. కావున ఇచట పశుశరీరమునుండి తీసిన వస హోమము చేయఁబడు టచే ఆ హవిర్ద్రవ్యమైన వస అధికముగా దేవతలలోని త్వష్ట్రదేవునకు చెందుఁగాక, అని చెప్పఁబడినది.

6. **అర్థము:** "విషురూపా యత్సలక్ష్మాణో భవథ" ఇతి ఆహ='ఓ హృదయాద్యవయమలారా! మీరు విలక్షణ రూపులైనను హవీరూపమున (హవిస్సుగా) సమాన లక్షణము కలవారు కండు' అని "విషురూపాః" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. ఏతే=పశువుయొక్క ఈ హృదయాద్యవయవములు, విషురూపాః సన్తః హి=పూర్వము విలక్షణ రూపములు కలవై యున్నను, ఏతర్హి=ఈ హవిస్సు అగుటవలన (ఇప్పుడు), సలక్ష్మాణః=సమాన లక్షణము కలవిగా, భవన్తి=అగుచున్నవి.

**తాత్పర్యము:** పశువులోని హృదయాద్యవయవములు హవిస్సుగా నేర్పడక పూర్వము విలక్షణములుగా నుండుట ప్రసిద్ధము. ఇప్పుడు ఆ అవయవము లన్నియు హవీరూపమున సమాన లక్షణము కలవిగా అయినవి.

7. **అర్థము:** "దేవత్రా యన్త మవసే సఖాయోఽను త్వా మాతా పితరో మదన్తు" ఇతి ఆహ="ఓ పశువా! దేవతల యందు (దేవతలలోనికి) వెళ్లుచున్న నిన్ను నీమూలమున స్వర్గము లభించుటచే స్వకులమును సేవించుటకై నీకు మిత్రములైన ఇతర పశువులు, తల్లిదండ్రులును అనుమతించుదురు గాక" అని "దేవత్రా" ఇత్యాది మంత్ర భాగము చెప్పినది. మాత్రా=తల్లిచేత, పిత్రా=తండ్రిచేత, అనుమతమ్ ఏవ ఏనమ్= అనుమ తించఁబడినదియే అయిన ఈ పశువును, (యజమానః=యాగకర్త) సువర్గం లోకమ్=స్వర్గలోకమును, గమయతి=పొందించుచున్నాఁడు.

**తాత్పర్యము:** యాగకర్త పశువుయొక్క తల్లిదండ్రులచే అనుమతించఁబడినప్పుడే దానిని యాగమునందు ఆ పశుహవిస్సును హోమము చేయుటవలన స్వర్గమును పొందించినవాఁ డగును. యాగపశువు అనుమతించఁబడిన దనియే అర్థము. ( "ఐన్ద్రః ప్రాణో అఙ్గే అఙ్గే ని దేధ్యత్" అను మంత్రముయొక్క చతుర్థ భాగమునందలి 'అనుమదన్తు' అను శబ్దముయొక్క అభిప్రాయము ఇచట వివరింపఁబడినది.)

8. **అర్థము:** అర్ధర్చే=యాజ్యయొక్క పూర్వోత్తర భాగాభిమానులైన ద్యావాపృథివీ దేవతల నుద్దేశించి, వసాహోమం జుహోతి=హోమార్థమైన వసను హోమము చేయవలెను. అసౌ వై=ఈ యంతరిక్షమే, అర్ధర్చః=యాజ్యా రూపమైన ఋక్కుయొక్క యర్థభాగము నభిమానించు దేవత. ఇయమ్=ఈ భూమి, అర్ధర్చః=ఋక్కుయొక్క అర్థభాగము నభిమానించు దేవత. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁబడఁగా,) ఇమే ఏవ=ఈ ద్యావా పృథివీ

దేవతలనే, రసేన=వసా రూప రసముచే, అనక్తి= తడిపినవాఁ డగును. దిశః ఏవ=దిక్కులనే, రసేన=వసా రసముచే, అనక్తి= తడిపినవాఁ డగును. అథో=ఆ కారణమువలన, (యజమానః=యజమానుఁడు,) దిగ్భ్యః ఏవ=దిక్కులనుండియే, ఊర్జం రసమ్=బలకరమైన అన్నరసమును, అవరున్ధే=పొందును.

తాత్పర్యము: ప్రతిప్రస్థాత యాజ్యయొక్క పూర్వోత్తరములైన అర్ధ ఋక్కుల నభిమానించియుండు దేవతల నుద్దేశించి వసా హోమము చేయవలెను. ఇట్లు చేసిన ప్రతిప్రస్థాత ఈ ద్యావా పృథివీ దేవతలనే వసా రసముచే తృప్తిపఱచినవాఁ డగును. ఈ యంతరిక్షము ఒక అర్ధ ఋక్కు. ఈ భూమి ఒక అర్ధ ఋక్కు. శేషించిన వసచే దిగ్దేవతల నుద్దేశించి హోమము చేయవలెను. దీనిచే దిగ్దేవతలను తృప్తి పఱచినవాఁ డగును. ఈ విధముగ హోమము చేయుటవలన యజమానుఁడు దిక్కులనుండియే బలకరమైన యన్నరసమును పొందును. "యాజ్యాయా అర్ధర్చే ప్రతిప్రస్థాతా వసాహోమం జుహోతి" ఇత్యాదికము ఆపస్తంబ కల్పసూత్రము. "సోఽర్ధర్చే యాజ్యాయై వసాహోమం జుహోతి" ఇత్యాదికము బోధాయన కల్పసూత్రము. "ఘృతం ఘృతపావానః పిబత వసాం వసాపావానః పిబత" అననది హోమమంత్రము.

9. అర్థము: పృషదాజ్యం యత్=పృషదాజ్యము ఏది కలదో, ఏతౌ=ఈ పృషదాజ్య రూపములైనవి. పశూనామ్=పశువుల యొక్క, ప్రాణాపానౌ వై= ప్రాణాపానములే. పశవః=పశువులు, దేవతయా=దేవతచే, వానస్పత్యాః ఖలు వై= వనస్పతి సంబంధులే కదా! పృషదాజ్యస్య ఉపహత్య=పాత్ర గతమైన పృషదాజ్యమును స్రువముతో జుహువులోనికి తీసికొని, (హే మైత్రావరుణ!=ఓ మైత్రావరుణుఁడా!) వనస్పతయే=వనస్పతి దేవతకొఱకు, (త్వమ్=నీవు), అను బ్రూహి= పురోనువాక్యను పఠించుము. (తతః=పిమ్మట, యాజ్యాం పఠితుమ్=యాజ్యను పఠించుటకై, హోతారమ్=హోతను,) ప్రేష్య ఇతి=ప్రేరణ చేయుమని, ఆహ యత్=( అధ్వర్యుఁడు) చెప్పినచో, ప్రాణాపానౌ ఏవ=ప్రాణాపానములనే, పశుషు= పశువులయందు, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: (ఇచట అవదాన పూర్వకముగ రెండు ప్రైషమంత్రములను మైత్రావరుణుని గూర్చి శ్రుతి కల్పించుచున్నది. మైత్రావరుణుఁడు=ఋత్విజులలో నొకఁడు.) పృషదాజ్య మనునది పశువుల యొక్క ప్రాణాపాన స్వరూపమే. పశువులు వనస్పతి దేవతాకములు. అధ్వర్యుఁడు పాత్రములోని పృషదాజ్యమును స్రువముతో జుహువులోనికి గ్రహించి "ఓ మైత్రావరుణా! నీవు వనస్పతిదేవతకై పురోనువాక్యను పఠించుము. పిమ్మట యాజ్యను పఠించుటకై హోతను ప్రేరణ చేయుము" అని మైత్రావరుణునితో చెప్పవలెను. ఈ విధముగ చేసినప్పుడు వనస్పతి దేవతాకములైన పశువులయందు పృషదాజ్య రూపములైన ప్రాణాపానములను స్థాపించిన ట్లగును.

10. అర్థము: పృషదాజ్యము=పెరుఁగులో కలపఁబడిన నేయి, అన్యస్య అన్యస్య=ఇతరేతరమైన హృదయాద్యంగముయొక్క, సమవత్తమ్= అవదేయ శేషమును, (అవదానము చేయఁగా మిగిలినదానిని,) సమవద్యతి=ఒకచోట బాగుగా అవదానము చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, పశవః=పశువులు, నానారూపాః=బహువిధములు.

తాత్పర్యము: ఇతరేతరములైన హృదయాద్యంగముల యొక్క అంశములను ( అవదానము చేయఁగా శేషించిన వానిని) ఒకచోట బాగుగ అవదానము చేయవలయును. కావున పశువులు బహువిధములు. (ఇచట ఇడానిమిత్తము ఆ యా హృదయాద్యంగముల యొక్క అంశముల నొకచోట అవదానము చేయుట విధింపఁబడినది.)

11. అర్థము: యూష్ణా=మాంస నిస్స్రుత జలముచే, ఉప సిఞ్చతి= (పూర్వోక్తములైన సర్వావదానములందు), ఉపసేచనము (తడుపుట) చేయవలయును. యూః యత్=మాంస నిస్స్రుత జల మేది కలదో, ఏషః=ఇది, పశూనామ్=పశువులయొక్క, రసః వై=రసమే. (తథా సతి=అట్లు కాఁగా,) పశుషు=పశువులయందు, రసమేవ=రసమునే, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: (ఇచట పూర్వోక్త సర్వావదానములందు మాంస నిస్స్రుత జలోపసేచనము విధింపఁబడినది. యూః=మాంస

మునుండి స్రవించిన జలము.) పూర్వోక్త సర్వావదానములందు మాంస నిస్స్రుత జలముచే ఉపసేచనము చేయవలెను. ఈ మాంస నిస్స్రుత జలము పశువుల రసమే. కావున పశువులందు రసమునే స్థాపించిన ట్లగును.

12. అర్థము: ఇడామ్=ఇడను, ఉప హ్వాయతే=ఉపాహ్వానము చేయవలెను. పశవః వై=పశువులే, ఇడా=ఇడాశబ్దార్థము. (తత్=ఆ కారణమువలన,) పశూనేవ=పశువులనే, ఉపహ్వాయతే=ఉపాహ్వానము చేసినవాఁ డగును. చతుః=నాలుగు పర్యాయములు, ఉప హ్వాయతే=ఉపాహ్వానము చేయవలయును. పశవః=పశువులు, చతుష్పాదః హి=నాలుగు పాదములు కలవి కదా!

తాత్పర్యము: (ఇచట హవిశ్శేషమైన ఇడాభాగమును భక్షించుటకై హోత ఇడోపాహ్వానము చేయవలయు నను విషయము విధింపఁబడుచున్నది.) హోత ఇడను ఆహ్వానించవలెను. పశువులే ఇడ. కావున పశువులనే ఆహ్వానించినవాఁ డగును. ఇడా దేవత గో రూపిణి కనుక పశువులు ఇడ యని చెప్పఁబడినది. పశువులు నాలుగు పాదములు కలవి కావున నాలుగు పర్యాయములు ఇడను ఆ హోత ఆహ్వానించవలెను. (ఇడోపాహ్వానము చోదక ప్రాప్తమైనను ఆఘారమువలె ఇష్టి వికృతిత్వమును సూచించుటకై మఱల విధింపఁబడినది.)

13. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమానుని ఉద్దేశించి, అపశుః=ఈ యజమానుఁడు పశు విహీనుఁడు, స్యాత్ ఇతి=కావలయునని, కామయేత=కోరునో, తస్మై=ఆ యజమానునికొఱకు, అమేదస్కమ్=మేదో రహితమైన అవదానమును, ఆ దధ్యాత్=ఉంచవలెను. పశవః= పశువులు, మేదోరూపాః వై=మేదోరూపములే. (తదా=అప్పుడు, అధ్వర్యుః= అధ్వర్యుఁడు,) రూపేణైవ=మేదో రూపముచేతనే, ఏనమ్=ఈ యజమానుని, పశుభ్యః=పశువులనుండి, నిర్భజతి=తొలఁగించినవాఁ డగును. (సః= ఆ యజమానుఁడు,) అపశుః ఏవ=పశు రహితుఁడే, భవతి=అగును. ( స్నిగ్ధమైన ద్రవ విశేషము మేదస్సు. తద్రహితము అమేదస్కము.)

తాత్పర్యము: ఏ యజమానుఁడు పశు రహితుఁడు కావలయునని అధ్వర్యుఁడు తలఁచునో, అతఁడు ఆ యజమానునికొఱకు మేదో రహితమైన అవదానము చేయవలెను. పశువులు మేదో రూపములే కనుక అప్పు డా యధ్వర్యుఁ డీ యజమానుని పశువులనుండి తొలఁగించినవాఁ డగును. అప్పుడు యజమానుఁడు పశు రహితుఁ డగును. (ఇచట ఇడయొక్క యవదానమునందు మేదస్సుచే ఉపస్తరణాభిఘారములను విధించుటకు ముందు తద్వ్యతిరేక పద్ధతి నిందించఁబడినది.)

14. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, పశుమాన్ స్యాత్ ఇతి=ఈ యజమానుఁడు పశువులు కలవాఁడు కావలెనని, కామయేత=కోరునో, తస్మై=ఆ యజమానునికొఱకు, మేదస్వత్=మేదస్సు కల అవదానమును, ఆ దధ్యాత్=ఉంచవలెను. పశవః= పశువులు, మేదోరూపాః వై=మేదో రూపములే. (తదా=అప్పుడు, అధ్వర్యుః= అధ్వర్యుఁడు,) అస్మై=ఈ యజమానునికొఱకు, రూపేణైవ= మేదోరూపముచేతనే, పశూన్=పశువులను, అవ రున్ధే=పొందును. (అయమ్=ఈ యజమానుఁడు,) పశుమానేవ=పశువులు కలవాఁడే యగును.

తాత్పర్యము: ఏ యజమానుఁడు పశుమంతుఁడు కావలయునని అధ్వర్యుఁడు తలఁచునో, ఆ యజమానునికొఱకు అధ్వర్యుఁడు మేదస్కమైన అవదానమును ఉంచవలెను. పశువులు మేదోరూపములే కనుక అధ్వర్యుఁడు ఈ యజమానునికై మేదోరూపముచేతనే పశువులను పొందును. యజమానుఁడు పశుమంతుఁడే యగును. (ఇచట అవదానమునందు మేదస్కత్వము విధింపఁబడినది.)

15. అర్థము: ప్రజాపతిః=ప్రజాపతి, యజ్ఞమ్=యజ్ఞమును, అసృజత=సృజించెను. సః=ఆ ప్రజాపతి, పురస్తాత్=ప్రథమమున, ఆజ్యమ్= ఆజ్యమును, (నేతిని), అసృజత=సృజించెను. మధ్యతః=మధ్యకాలమునందు, పశుమ్=పశు

వును, పశ్చాత్=పిమ్మట, (అంతమున) పృషదాజ్యమ్= పృషదాజ్యమును, అసృజత=సృజించెను. తస్మాత్=ఆ కారణమువలన, ఆజ్యేన= ఆజ్యముచే, ప్రయాజాః ఇజ్యన్తే=ప్రయాజ హోమములు చేయఁబడుచున్నవి. మధ్యతః=ప్రయాజానూయాజేష్వుల మధ్యమున, పశునా (యజతే)=పశువుచే ఇష్టి చేయఁబడుచున్నది. పశ్చాత్=అనంతరము, పృషదాజ్యేన=పృషదాజ్యముచే, అనూయాజాః ఇజ్యన్తే=అనూయాజ హోమములు చేయఁబడుచున్నవి. హి=ఏ కారణమువలన, (ఒక ద్రవ్యము పర్యాప్తము కాదను బుద్ధితో,) పశ్చాత్ సృష్టమ్=తుదకు ద్రవ్యాంతరముతో కూడ ఇది విహిత మైనదో, తస్మాత్=ఆ కారణమువలన, ఏతత్=ఇది, మిశ్రమివ=దధి మిశ్ర మైనదే.

తాత్పర్యము: ప్రజాపతి యజ్ఞమును సృష్టించెను. అతఁడు ప్రథమమున ఆజ్యమును, పిమ్మట పశువును, అనంతరము పృషదాజ్యమును సృజించెను. ఆ కారణమువలన మొదటివైన ప్రయాజ హోమములు ప్రథమమున సృజింపఁబడిన ఆజ్యముచే చేయఁబడుచున్నవి. ప్రయాజానూయాజల మధ్యకాలమున ఉత్పన్నమైన పశువుచే ఇష్టిని చేయుచున్నారు. చివరిదైన పృషదాజ్యముచే అనూయాజ హోమములు చేయవలయును. ఒక ద్రవ్యము సమర్థము కాదను భావముచే చివరకు ద్రవ్యాంతరముతో కూడ సృష్టమైనది కావున ఈ పృషదాజ్యము దధిమిశ్రమైనది. (ఇచట పృషదాజ్యముచే అనూయాజ హోమము విహిత మైనది.)

16. అర్థము: ఏకాదశ అనూయాజాన్ యజతి=పదునొకండు అనూయాజ హోమములు చేయవలెను. పశోః ప్రాణాః=పశువు యొక్క ప్రాణములు, దశ వై=పదియే. ఆత్మా=ఆత్మ, ఏకాదశః=పదునొకండవది. పశుః=పశువు, యావాన్ ఏవ=ఏ మాత్రము సంఖ్యా పరిమితి కలదో, తమ్ అను=దాని ననుసరించి, యజతి=యాగము చేయవలెను.

తాత్పర్యము: పదునొకండు అనూయాజ హోమములు చేయవలెను. కారణ మేమనఁగా-- పశువు యాగమునందు హోమ ద్రవ్యముగా విహితమై యున్నది. పశువునకు పది ప్రాణములు కలవు. పదునొకండవది ఆత్మ. (ప్రాణము ఒక్కటియే యైనను పది ఇంద్రియములందు సంచరించుటచే పది ప్రాణములని చెప్పఁబడినది. ఆత్మ యనఁగా జీవుఁడు.) మొత్తము ఏకాదశ సంఖ్య పశువునకు ఏర్పడుచున్నది. అందువలన పదునొకండు అనూయాజ హోమములు చేయవలెను. (మఱియొకచోట మూఁడు అనూయాజ హోమములు చేయవలెనని చెప్పఁబడి యున్నది. ఆ త్రిత్వ సంఖ్యను అపవదించి శ్రుతి యిచట ఏకాదశ సంఖ్యను విధించినది.)

17. అర్థము: పశుం సంజ్ఞపయన్తి యత్=పశువును గళ నిరోధాద్యుపఘాతాత్మక సంజ్ఞపనము చేయుట యేది కలదో, ఏతత్=ఈ ఉపఘాతమువలన, ఘ్నన్తి వై=పశువును చంపుచున్నారు కదా! పృషదాజ్యం యత్=పృష దాజ్యము ఏది కలదో, ఏతౌ పశూనాం ప్రాణాపానౌ ఖలు వై=ఈ పృషదాజ్యాత్మకములు పశువుల యొక్క ప్రాణాపానములే కదా! పృషదాజ్యేన=పృషదాజ్యముచే, అనూయాజాన్ యజతి యత్= అను యాజ హోమములు చేయుచో(తదా=అప్పుడు,) పశుషు=పశువులందు, ప్రాణాపానావేవ=ప్రాణాపానములనే, దధాతి=స్థాపించి నట్లగును.

తాత్పర్యము: పశువును సంజ్ఞపనము చేయుట అనఁగా కంఠాదులను నిరోధించి పశువును చంపుట యనియే అర్థము. పృషదాజ్య మనునది పశువులయొక్క , ప్రాణాపానాత్మకమే. పృషదాజ్యముతో అనూయాజ హోమములు చేయుచో ఆ యజ్వ పశువులందు ప్రాణాపానములనే ఉంచినవాఁ డగును. (ఇచట పృషదాజ్యము ప్రశం సింపఁబడినది.)

ఏకాదశానువాకము సమాప్తము

షష్ఠకాండమునందు తృతీయ ప్రపాఠకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే చతుర్థః ప్రపాఠకః

## తత్ర ప్రథమోఽనువాకః

## హరిః ఓమ్

మూలము : [1] యజ్ఞేన వై ప్రజాపతిః ప్రజా అసృజత తా ఉపయడ్భి రేవాసృజత యదుప యజ ఉపయజతి ప్రజా ఏవ తద్యజమానః సృజతే [2] జఘనార్ధా దవ ద్యతి జఘనార్ధాద్ధి ప్రజాః ప్రజాయన్తే [3] స్థవిమతోఽవ ద్యతి స్థవిమతో హి ప్రజాః ప్రజాయన్తే [4] ఽసంభిన్దన్నవ ద్యతి ప్రాణానా మసంభేదాయ [5] న పర్యావర్తయతి యత్పర్యావర్తయే దుదావర్తః ప్రజా గ్రాహుకః స్యా [6] త్సముద్రం గచ్ఛ స్వాహేత్యాహ రేతః (౧) ఏవ తద్దధా [7] త్యన్తరిక్షం గచ్ఛ స్వాహేత్యాహాన్తరిక్షేణైవాస్మై ప్రజాః ప్ర జనయత్యన్తరిక్షగ్ంహ్యను ప్రజాః ప్రజాయన్తే [8] దేవగ్ం సవితారం గచ్ఛ స్వాహేత్యాహ సవితృప్రసూత ఏవాస్మై ప్రజాః ప్ర జనయ [9] త్యహోరాత్రే గచ్ఛ స్వాహేత్యా హాహోరాత్రాభ్యా మేవాస్మై ప్రజాః ప్ర జనయత్యహోరాత్రే హ్యను ప్రజాః ప్రజాయన్తే [10] మిత్రావరుణౌ గచ్ఛ స్వాహా (౨) ఇత్యాహ ప్రజాస్వేవ ప్రజాతాసు ప్రాణాపానౌ దధాతి [11] సోమం గచ్ఛ స్వాహేత్యాహ సౌమ్యా హి దేవతయా ప్రజా [12] యజ్ఞం గచ్ఛ స్వాహేత్యాహ ప్రజా ఏవ యజ్ఞియాః కరోతి [13] ఛన్దాగ్ంసి గచ్ఛ స్వాహేత్యాహ పశవో వై ఛన్దాగ్ంసి పశూనేవావ రున్ద్ధే [14] ద్యావాపృథివీ గచ్ఛ స్వాహేత్యాహ ప్రజా ఏవ ప్రజాతా ద్యావాపృథివీభ్యా ముభయతః పరి గృహ్ణాతి [15] నభః (3) దివ్యం గచ్ఛ స్వాహేత్యాహ ప్రజాభ్య ఏవ ప్రజాతాభ్యో వృష్టిం ని యచ్ఛ [16] త్యగ్నిం వైశ్వానరం గచ్ఛ స్వాహేత్యాహ ప్రజా ఏవ ప్రజాతా అస్యాం ప్రతి ష్ఠాపయతి [17] ప్రాణానాం వా ఏషోఽవ ద్యతి యోఽవద్యతి గుదస్య మనో మే హార్ది యచ్ఛేత్యాహ

ప్రాణానేవ యథాస్థానముప హ్వయతే [18] పశోర్వా ఆలబ్ధస్య హృదయగ్ం శుగృచ్ఛతి సా హృదయశూలమ్

(४) అభి సమేతి యత్పృథివ్యాగ్ం హృదయశూల ముద్వాసయే త్పృథివీగ్ం శుచాఽర్పయే ద్యదప్స్వపః

శుచాఽర్పయే చ్ఛుష్కస్య చాఽఽర్ద్రస్య చ సంధా వుద్వాసయత్యుభయస్య శాన్త్యై [19] యం ద్విష్యాత్తం

ధ్యాయేచ్ఛుచైవైన మర్పయతి ||(౫)||

(రేతో మిత్రావరుణౌ గచ్ఛ స్వాహో నభో హృదయశూలం ద్వాత్రిగ్ంశచ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థప్రపాఠకే ప్రథమోఽనువాకః ||౧||

## వేదార్థ దీపిక

అవతారిక : ప్రథమ కాండము తృతీయ ప్రపాఠకములోని యేకాదశానువాకమునందు 'ఉపయట్' సంజ్ఞకములైన హోమములు విహితములైనవి. ఆ హోమములు ఆలబ్ధమైన యజ్ఞపశువుయొక్క గుదభాగము (పాశ్చాత్యభాగము)ను మూడుభాగములనుగా విభజించి ఆ భాగములను హోమము చేయవలయును. ఈ హోమ మంత్రములు పైని చెప్పఁబడిన అనువాకమునందు అభిహితము లైనవి. ఆ మంత్రములకు ఈ ప్రథమానువాకము వివరణాత్మకము. పూర్వము అనూయాజ హోమములు పృషదాజ్యముచే చేయవలెనని చెప్పఁబడినది. ఆ అనూయాజ సమీపమున చేయఁబడు హోమములు కనుక ఇవి 'ఉపయట్' సంజ్ఞచే వ్యవహరింపఁబడుచున్నవి. ఉప=అనూయాజ సమీపే, ఇజ్యన్తే ఇతి 'ఉపయజః' అని వ్యుత్పత్తి. "ఇత్యాహ" అను పదమునకు పూర్వము గల మంత్రభాగము లన్నియు ప్రథమ కాండము తృతీయ ప్రపాఠకములోని యేకాదశానువాకమందున్నవి.

1. అర్థము : ప్రజాపతిః=ప్రజాపతి, యజ్ఞేన వై=యజ్ఞముచేతనే, ప్రజాః=ప్రజలను, అసృజత=,సృజించెను. తాః=ఆ ప్రజలను, ఉపయడ్భిః ఏవ='ఉపయట్' అను పేరు కల హోమములచేతనే, అసృజత=సృజించెను. ఉపయజః ఉపయజతి యత్='ఉపయట్' అను యాగము చేసినచో, తత్=అప్పుడు, యజమానః=యజమానుఁడు, ప్రజాః=ప్రజలను, సృజతే ఏవ=నిశ్చయముగ సృజించును.

తాత్పర్యము : పూర్వము ప్రజాపతి 'ఉపయట్' అను హోమములు (యాగము) చేసి తత్ప్రభావమువలన ప్రజలను సృష్టించెను. జ్యోతిష్టోమయాగమును చేయుచున్న యజమానుఁడు ఉపయట్ హోమములను (యాగమును) చేయవలెను. చేసినచో అతఁడు ప్రజలను తప్పక సృజించును. ఇచట 'ఉపయట్' హోమములు విధింపఁబడినవి. జ్యోతిష్టోమయజ్ఞము సృష్టిసాధన మైనను సాక్షాత్సాధనత్వము 'ఉపయట్' హోమములకే కలదు. అనూయాజ సమీపమున యజింపఁబడుచున్నవి కనుక ఈ హోమములకు ఉపయట్టులని పేరు వచ్చినది.

2. అర్థము : జఘనార్ధాత్=పశువుయొక్క పాశ్చాత్య భాగమునుండి, అవ ద్యతి=హవిర్ద్రవ్యమును అవదానము చేయవలెను. జఘనార్ధాత్= జఘనభాగమునుండి, ప్రజాః=ప్రజలు, ప్రజాయన్తే హి=పుట్టుచున్నారు కదా!

తాత్పర్యము : ఉపయట్ హోమద్రవ్యమైన హవిస్సును పశువుయొక్క గుదకాండమునుండి అవదానము చేయవలెను. ఈ హోమములు సృష్టిసాధనము లగుటచేతను, లోకమునందు ప్రజోత్పత్తి తల్లియొక్క జఘనభాగమునుండియే కలుగుచుండుటచేతను జఘనభాగమునుండి హవిస్సు నవదానము చేయవలయునని చెప్పఁబడినది. పశువు యొక్క పాశ్చాత్యభాగము హవిర్ద్రవ్యముగ ఇచట విధింపఁబడినది.

3. అర్థము : స్థవిమతః=గుదకాండమునందలి స్థూలభాగమునుండి, అవ ద్యతి=అవదానము చేయవలెను. ప్రజాః=ప్రజలు (సంతానము), స్థవిమతః= స్థూలభాగమునుండి, ప్రజాయన్తే హి=పుట్టుచున్నారు కదా!

తాత్పర్యము : గర్భమునుండి సంతానము వెలుపలకు స్థూలరంధ్రమునుండియే వచ్చుచున్నది. కనుక పశువుయొక్క గుద కాండమునందలి స్థూలభాగమునుండి అవదానము చేయవలెను. మూఁడు విధములుగా విభజింపఁబడిన గుదకాండమునందలి స్థూలభాగము అవదేయముగా విధింపఁబడినది.

4. అర్థము : ప్రాణానామ్=ప్రాణములయొక్క, అసంభేదాయ= సాంకర్యము లేకుండుటకై, అసంభిన్దన్=ఛిన్నములైన గుద కాండ భాగములు సాంకర్యము కలుగకుండ చేయుచు, అవ ద్యతి=అవదానము చేయవలయును.

తాత్పర్యము : ప్రాణములు సంకీర్ణములు కాకుండుటకై ఛిన్నములైన పశు గుదకాండ భాగములు పరస్పరము సంకీర్ణములు కాకుండ నవదానము చేయవలెను. ఇచట ఛిన్న భాగముల సాంకర్యము నివారించఁబడినది.

5. అర్థము : న పర్యావర్తయతి=విపర్యాసము చేయరాదు. పర్యావర్తయేత్ యత్=విపర్యాసము చేయుచో, ప్రజాః=ప్రజ లను (సంతానమును), ఉదావర్తః='ఉదావర్తము' అనెడి రోగవిశేషము, గ్రాహుకః స్యాత్=గ్రహించునది అగును.

తాత్పర్యము : 'ప్రథమమున అగ్రభాగము, పిమ్మట మధ్యభాగము' అనెడి విపర్యాసము చేయకుండ నవదానము చేయవలెను. విపర్యాసము చేయుచో ప్రజలకు (సంతానమునకు) 'ఉదావర్తము' అనెడి రోగవిశేషము సంక్రమించును. ఇచట విపర్యాసము నిషేధించఁబడినది.

6. అర్థము : "సముద్రం గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు సముద్ర నామక దేవతను (సముద్రుని) పొందుము. నీవు హుత మగుదువు గాక." అని "సముద్రం గచ్ఛ" ఇత్యాది మంత్రభాగము చెప్పినది. తత్=దానివలన, (యజమానః= యజమానుఁడు), రేతః ఏవ=రేతస్సునే, దధాతి=ఉంచినవాఁడగును.

తాత్పర్యము : "సముద్రం గచ్ఛ స్వాహా" ఇత్యాది మంత్రములు ప్రథమకాండగత తృతీయ ప్రపాఠకములోని యేకాదశాను వాకమునందున్నవి. వేదియొక్క ఉత్తరశ్రోణియందు ఆలబ్ధ పశువుయొక్క గుదకాండమును పదునొకండు భాగములుగా అడ్డముగా ఛేదించి అనూయాజ హోమములు చేయునపుడు విపర్యాసము చేయకుండ "సముద్రం గచ్ఛ స్వాహా" ఇత్యాదులైన పదునొకండు మంత్రములలో ఒక్కొక్క మంత్రము నుచ్చరించుచు ప్రతి వషట్కారమునందు ఒక్కొక్క గుదకాండమును హోమము చేయవలెనని కల్పసూత్రము వివరించి నది. ప్రతి మంత్రము నుచ్చరించు నపుడు 'వౌషట్' అని పలుకవలెను. దానినే వషట్కార మందురు. సముద్రాది మంత్రముల కన్నింటికి ప్రజోత్పత్తియందు ఉపయోగమును వివక్షింపఁదలఁచి సముద్ర జలమునకు రేతస్సామ్యమును బ్రాహ్మణభాగము చూపుచున్నది. హోమము చేయఁబడుచున్న హవిస్సు నుద్దేశించి "ఓ హవిస్సా! నీవు సముద్రుని పొందుము. నీవు హుత మగుదువు గాక" అని శ్రుతి చెప్పుటచే యజమానుఁడు రేతస్సు నుంచినవాఁడగును.

7. అర్థము : "అన్తరిక్షం గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు అంతరిక్షమును పొందుము. నీవు హుత మగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. అన్తరిక్షేణైవ=అవకాశము (రంధ్రము) చేతనే, ప్రజాః=ప్రజ లను, అస్మై=ఈ యజమానుఁడు, (ప్రథమార్థే చతుర్థీ) ప్రజనయతి=పుట్టించుచున్నాఁడు. అన్తరిక్షమ్ అను=అంతరిక్షము ననుసరించి, ప్రజాః=ప్రజలు, ప్రజాయన్తే హి= ఎక్కువగా పుట్టుచున్నారు కదా!

తాత్పర్యము : "ఓ హవిస్సా! నీవు అంతరిక్షమును పొందుము. నీవు హుతమగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. ఈ యజమానుఁడు అంతరిక్షము ( అవకాశము) ద్వారా ప్రజలను పుట్టించుచున్నాఁడు. ప్రజలు అంతరిక్షము ననుసరించి పుట్టుచున్నారు కదా! మంత్రమునందలి అంతరిక్ష పదమును అవకాశార్థకముగ ఈ బ్రాహ్మణ భాగము చెప్పినది.

8. అర్థము : "దేవగ్ం సవితారం గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు ప్రేరకుఁడగు దేవుని పొందుము. నీవు హుతమగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. సవితృప్రసూతే ఏవ=ప్రేరకుఁడగు దేవుని ప్రేరణ ఉన్నప్పుడే, అస్మై=యజమానుఁడు, ప్రజాః=ప్రజలను, ప్రజనయతి= పుట్టించును.

తాత్పర్యము : సవిత యనఁగా ప్రేరకుఁడు అను నర్థమున పై మంత్రమును ఈ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది. తాత్పర్యము స్పష్టము.

9. అర్థము : "అహోరాత్రే గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు అహోరాత్రములను పొందుము. నీవు హుతమగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. అస్మై= ఈ యజమానుఁడు, అహోరాత్రాభ్యామ్ ఏవ=అహోరాత్రములనుండియే, (అహోరాత్రములందే) ప్రజాః=ప్రజలను, ప్రజనయతి=పుట్టించును. అహోరాత్రే అను=అహోరాత్రముల ననుసరించి, ప్రజాః=ప్రజలు, ప్రజాయన్తే హి= పుట్టుచున్నారు కదా!

తాత్పర్యము : ఇచట అహోరాత్రములకు ఉత్పత్తికాలములుగా ఉపయోగము చూపఁబడినది. ప్రజలు పగలు గాని, రాత్రి గాని పుట్టుట సహజమని భావము.

10. అర్థము : "మిత్రావరుణౌ గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు మిత్రావరుణ దేవతలను పొందుము. నీవు హుత మగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. ప్రజాతాసు=పుట్టిన, ప్రజాసు ఏవ=ప్రజలయందే, ప్రాణాపానౌ=ప్రాణాపానములను, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము : మిత్రావరుణ దేవతలను ప్రాణాపానప్రదులుగా వారి ఉపయోగము ఇచట చెప్పఁబడినది. హవిస్సును మిత్రావరుణ దేవతలకు సమర్పించుటచే యజమానుఁడు ఆ మిత్రావరుణుల యనుగ్రహముచే పుట్టిన ప్రజలకు ప్రాణాపానములను సమకూర్చినవాఁ డగును.

11. అర్థము : "సోమం గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు సోమదేవతను పొందుము. నీవు హుతమగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. ప్రజాః= ప్రజలు, దేవతయా=దేవతచే, సౌమ్యాః హి=సోమ సంబంధులు కదా!

తాత్పర్యము : ఇచట ప్రజలు సోమదేవతాకులుగా చెప్పఁబడినారు. ఈ మంత్రముచే హవిస్సు సోమదేవత కర్పించఁబడినది.

12. అర్థము : "యజ్ఞం గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు యజ్ఞమును (యజ్ఞపురుషుని) పొందుము. నీవు హుత మగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. ప్రజాః=ప్రజలను, యజ్ఞియాః ఏవ=యజ్ఞ సంబంధులనుగానే, కరోతి=( యజమానుడు) చేసినవాఁ డగును.

తాత్పర్యము : ఇచట యజ్ఞము ప్రజాప్రదాయిగా చెప్పఁబడినది. అట్టి యజ్ఞమునకు హవిస్సు నర్పించుటచే యజమానుఁడు యజ్ఞమువలన ప్రజలను పుట్టించునని చెప్పఁబడినది.

13. అర్థము : "ఛన్దాంసి గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు ఛందస్సులను పొందుము. నీవు హుత మగుదువు గాక." అని శ్రుతి చెప్పినది. ఛన్దాంసి= ఛందస్సులు, పశవః వై=పశువులే. (తత్=ఆ కారణమువలన, యజమానః= యజమానుఁడు,) పశూన్=పశువులను, అవ రున్ధే ఏవ=తప్పక పొందును.

తాత్పర్యము : ఇచట పశుప్రదములుగా ఛందస్సుల ఉపయోగము చెప్పఁబడినది. యజమానుఁడు హవిస్సును ఛందో దేవతల నుద్దేశించి హవిస్సును హోమము చేయుటచే ఛందోరూపములే యగుటవలన పశువులను తప్పక పొందును.

14. అర్థము : "ద్యావాపృథివీ గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు ద్యావాపృథువులను పొందుము. నీవు హుత మగుదువు గాక." అని శ్రుతి చెప్పినది. ప్రజాతాః=పుట్టిన, ప్రజాః=ప్రజలను, ద్యావాపృథివీభ్యామ్ ఉభయతః ఏవ= ద్యావాభూముల రెండింటిచేతనే, పరి గృహ్ణాతి=యజమానుఁడు పరిగ్రహించును.

తాత్పర్యము : ఇచట ధారణకొఱకు ద్యావాభూముల ఉపయోగము చెప్పఁబడినది. పుట్టుచునే ప్రతి ప్రాణియు ద్యావా భూముల నాశ్రయించును. కనుక ప్రజాతులైన ప్రజలను ద్యావాభూములు ధరించుచుండునని చెప్పఁబడినది.

15. అర్థము : "నభో దివ్యం గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు దివ్యమైన నభమును (ఆకాశమును) పొందుము. నీవు హుత మగుదువు గాక" అని శ్రుతి చెప్పినది. ప్రజాతాభ్యః ప్రజాభ్యః ఏవ=పుట్టిన ప్రజలకొఱకే, వృష్టిమ్=వర్షమును, ని యచ్ఛతి=ఇచ్చుచున్నాఁడు.

తాత్పర్యము : హవిస్సు దివ్యమైన నభమును పొందుఁగాక యని శ్రుతి చెప్పినది. అనఁగా యజమానుఁడు హవిస్సును ఆకాశము నుద్దేశించి హోమము చేయుటచే ఆకాశమునుండి వర్షమును పుట్టిన ప్రజలకొఱకే కురియించు చున్నాఁడు. యజ్ఞమువలన దేవతలు సంతుష్టులై ఆకాశమునుండి వర్షమును కురియించుచుందురని ప్రసిద్ధి. వృష్టిప్రదానముచే ఆకాశమునకు ఉపయోగము చెప్పఁబడినది.

16. అర్థము : "అగ్నిం వైశ్వానరం గచ్ఛ స్వాహా" ఇతి ఆహ="ఓ హవిస్సా! నీవు వైశ్వానరాగ్నిని పొందుము. నీవు హుతమగుదువు గాక." అని శ్రుతి చెప్పినది. (అనేన=ఈ హోమముచే, యజ్వా=యాగకర్త,) ప్రజాతాః ప్రజాః ఏవ=పుట్టిన ప్రజలనే, అస్యామ్=ఈ భూమియందు, ప్రతిష్ఠాపయతి= ప్రతిష్ఠింపఁజేయుచున్నాఁడు.

తాత్పర్యము : ఇచట వైశ్వానరాగ్ని ప్రతిష్ఠాప్రదాతగా ఉపయోగించునని చెప్పఁబడినది. యజమానుఁడు వైశ్వానరాగ్నికి హవిస్సు నిచ్చుటచే పుట్టిన ప్రజల నీ భూమియందు ప్రతిష్ఠించుచున్నాఁడు.

17. అర్థము : యః=ఏ యజ్వ, (లేక అధ్వర్యుఁడు,) గుదస్య= గుదకాండముయొక్క భాగమును, అవ ద్యతి=అవదానము చేయుచున్నాఁడో, ఏషః=ఇతఁడు, ప్రాణానాం వై=ప్రాణములయొక్క భాగమునే, అవ ద్యతి= అవదానము చేయుచున్నాఁడు. (తత్=ఆ కారణమువలన,) "మనో మే హార్ది యచ్ఛ" ఇతి ఆహ="ఓ సముద్రాది దేవతా సమూహమా! నాకు హార్దవంతమైన మనస్సు నొసఁగుము" అని శ్రుతి చెప్పుటచే, (యజ మానుఁడు దేవతలను ప్రార్థించుటచే,) ప్రాణానేవ=ప్రాణములనే, యథాస్థానమ్=పూర్వపు స్వస్థానమునందే, ఉప హ్వయతే=ఉపాహ్వానము చేసినవాఁ డగుచున్నాఁడు (స్థాపించినవాఁ డగుచున్నాఁడు).

తాత్పర్యము : గుదకాండము ప్రాణముల కాధార మగుటచే ఆ గుదకాండమును హోమము చేయుటకు అవదానము (ఆ స్థానమునుండి తీయుట) చేయుటవలన, ప్రాణముల స్థానమునుండి ప్రాణములనే అవదానము చేసినట్లగును. అందువలన "మనో మే హార్ది యచ్ఛ"= సముద్రాది దేవతా సమూహమా! హార్దవంతమైన మనస్సును మా కొసఁగుము" అని యజమానుఁడు ప్రార్థించినాఁడు. ఈ ప్రార్థనచే యజమానుఁడు ప్రాణములను యథాస్థానమున స్థాపించినట్లే యగును.("మనో మే హార్ది యచ్ఛ" అను ప్రార్థనకు ప్రసంగముగ ఈ విషయము చెప్పఁబడినది. హృది భవః హార్దః హార్దః. సః అస్తీతి హార్ది. ఇది మనస్సునకు విశేషణము.)

18. అర్థము : ఆలబ్ధస్య=ఆలంభము చేయఁబడిన, పశోః= పశువుయొక్క, హృదయం వై=హృదయమునే, శుక్=దుఃఖము, ఋచ్ఛతి= పొందుచున్నది. సా=ఆ శోకము, హృదయశూలమ్ అభి=పశువుయొక్క హృదయశూలము నంతటను, సమేతి=పొందుచున్నది. హృదయశూలమ్=ఆలబ్ధ పశువుయొక్క హృదయ శూలమును, పృథి వ్యామ్=భూమియందు, ఉద్వాసయేత్ యత్= ఉద్వాసనము చేసినచో (విడిచినచో), పృథివీమ్=భూమిని, శుచా=శోకముతో, అర్పయేత్=అర్పించినవాఁడగును. అప్సు యత్=ఉదకములయందు విడిచినచో, అపః= ఉదకములను, శుచా=శోకముతో, అర్పయేత్=అర్పించినవాఁడగును. (తత్=ఆ కారణమువలన,) శుష్కస్య చ=(యూపముయొక్క) ఎండిన భాగముయొక్కయు, ఆర్ద్రస్య చ=తడిసిన భాగముయొక్కయు,

సంధౌ=సంధియందు, ఉద్వాసయతి=ఉద్వాసనము చేయవలెను. (ఏతత్=ఇది,) ఉభయస్య=(పృథివి ఉదకములు) ఉభయముయొక్క, శాన్త్యై=శాంతికొఱకు, భవతి=అగును.

తాత్పర్యము : యజ్ఞమునం దాలబ్ధమైన పశువుయొక్క హృదయశూలము నంతటను శోకము పొందును. పశువులోని హవిస్సును తీసిన పిమ్మట ఆ హృదయశూలమును అధ్వర్యుఁడు పృథివియందు పడవైచినచో ఆ హృదయశూలగతమైన శోకమును పృథివికి అర్పించినవాఁ డగును. ఉదకములందు పడవైచినచో ఆ శోకమును ఉదకముల కర్పించినవాఁ డగును. కావున ఆ ఉభయమునకు శాంతి కలుగుటకై యూపముయొక్క అగ్రభాగమును 'స్వ' మను సాధనము చే ఛేదించి ఎండిన భాగముయొక్కయు, తడిసిన భాగముయొక్కయు సంధియందు ఆ హృదయశూలము నుంచవలయును. (ఇచట శూలోద్వాసనము విధింపఁబడినది.) "అగ్రేణ యూపం స్వైనోద్ధత్యావోక్ష్య శుష్కస్య చార్ద్రస్య చ సంధౌ హృదయశూల ముద్వాసయతి" అని కల్ప సూత్రము.

19. అర్థము : (యజమానః=యజమానుఁడు, యమ్=ఎవనిని, ద్విష్యాత్=ద్వేషించునో, తమ్=అతనిని, ధ్యాయేత్=తలఁచవలెను. ఏనమ్=ఈ శత్రువును, శుచైవ=శోకముతోనే, అర్పయతి=అర్పించినవాఁడగును.

తాత్పర్యము : యజమానుఁడు పశువుయొక్క హృదయశూలమును ఉద్వాసనము చేయునపుడు తాను ద్వేషించిన శత్రువును తలఁచవలెను. అట్లు తలఁచుటవలన నతఁడు ఆ శత్రువును శోకవంతునిగా చేసినవాఁడగును. (ఇచట హృదయ శూలోద్వాసనము విధింపఁబడినది.)

ప్రథమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే చతుర్థ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః

మూలము : [1]దేవా వై యజ్ఞ మాగ్నీధ్రే వ్యభజన్త తతో యదత్యశిష్యత తదబ్రువ న్వసతు ను న ఇదమితి తద్వ
సతీవరీణాం వసతీవరిత్వం తస్మిన్నాపిత్వర్న సమశక్నువ న్తదప్సు ప్రావేశయన్తా వసతీవరీ రభవ న్వస
తీవరీ ర్గృహ్ణాతి యజ్ఞో వై వసతీవరీ ర్యజ్ఞమేవా ఽఽరభ్య గృహీత్వోప వసతి [2]యస్యాగృహీతా అభి
నిమ్రోచేదనారబ్ధోఽస్య యజ్ఞః స్యాత్ (౧) యజ్ఞం వి చ్ఛిన్ద్యా [3]జ్జ్యోతిష్యా వా గృహ్ణీయా ద్ధిరణ్యం
వా ఽవధాయ సశుక్రాణామేవ గృహ్ణాతి యో వా బ్రాహ్మణో బహుయాజీ తస్య కుమ్భ్యానాం గృహ్ణీ
యాత్స హి గృహీతవసతీవరీకో [4] వసతీవరీ ర్గృహ్ణాతి పశవో వై వసతీవరీః పశూనేవాఽఽరభ్య
గృహీత్వోప వసతి [5] యదన్వీపం తిష్ఠన్గృహ్ణీయా న్నిర్మార్గుకా అస్మాత్పశవః స్యుః ప్రతీపం తిష్ఠన్గృ
హ్ణాతి ప్రతిరుధ్యైవాస్మై పశూన్గృహ్ణాతి [6]న్ద్రః (౨) వృత్రమహన్త్సో? ఽపో? ఽభ్యమ్రియత తాసాం
యన్మేధ్యం యజ్ఞియగ్ం సదేవ మాసీత్తదత్యముచ్యత తా వహన్తీ రభవ న్వహన్తీనాం గృహ్ణాతి యా
ఏవ మేధ్యా యజ్ఞియాః సదేవా ఆపస్తాసామేవ గృహ్ణాతి [7] నాన్తమా వహన్తీ రతీయా దన్తమా
వహన్తీ రతీయా ద్యజ్ఞమతి మన్యేత [8]న స్థావరాణాం గృహ్ణీయా ద్వరుణ గృహీతా వై స్థావరా యత్స్థా
వరాణాం గృహ్ణీయాత్ (౩) వరుణేనాస్య యజ్ఞం గ్రాహయే [9]ద్యద్వై దివా భవత్యపో రాత్రిః ప్ర విశతి
తస్మాత్తామ్రా ఆపో దివా దదృశ్రే యన్నక్తం భవత్యపోఽహః ప్ర విశతి తస్మాచ్చన్ద్రా ఆపో నక్తం
దదృశ్రే ఛాయాయై చాఽఽతపతశ్చ సంధౌ గృహ్ణాత్యహోరాత్రయో రేవాస్మై వర్ణం గృహ్ణాతి [10]హవి

ష్మతీరిమా అప ఇత్యాహ హవిష్కృతానామేవ గృహ్ణాతి [11]హవిష్మాగ్ం అస్తు (౪) సూర్య ఇత్యాహ సశుక్రాణామేవ గృహ్ణా[12]త్యనుష్టుభా గృహ్ణాతి వాగ్వా అనుష్టు గ్వాచైవైనాః సర్వయా గృహ్ణాతి [13] చతుష్పదయర్చా గృహ్ణాతి త్రిః సాదయతి సప్త సంపద్యన్తే సప్త పదా శక్వరీ పశవః శక్వరీ పశూ నేవావ రున్ధే [14]ఽస్మై వై లోకాయ గార్హపత్య ఆ ధీయతేఽముష్మా ఆహవనీయో యద్గార్హపత్య ఉపసాదయే దస్మిం ల్లోకే పశుమాన్త్స్యా ద్యదాహవనీయేఽ ముష్మిన్ (౫) లోకే పశుమాన్త్స్యా దుభ యోరుప సాదయత్యుభయో రేవైనం లోకయోః పశుమన్తం కరోతి [15] సర్వతః పరిహరతి రక్షసా మపహత్యా [16]ఇన్ద్రాగ్నియో ర్భాగధేయీః స్థేత్యాహ యథాయజు రేవైత [17]దాగ్నీధ్ర ఉప వాసయ త్యేతద్వై యజ్ఞస్యాపరాజితం యదాగ్నీధ్రం యదేవ యజ్ఞస్యాపరాజితం తదేవైనా ఉప వాసయతి [18]యతః ఖలు వై యజ్ఞస్య వితతస్య న క్రియతే తదను యజ్ఞగ్ం రక్షాగ్ంస్యవ చరన్తి యద్వహన్తీనాం గృహ్ణాతి క్రియమాణమేవ తద్యజ్ఞస్య శయే రక్షసా మనన్వవచారాయ [19] న హ్యేతా ఈళయన్త్యా తృతీయసవనాత్పరి శేరే యజ్ఞస్య సంతత్యై (౬)||

(స్యాదిన్ద్రాగ్నియో గృహ్ణీయా దస్త్వముష్మి న్క్రియతే షడ్విగ్ంశతిశ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః ||౨||

# వేదార్థదీపిక

అవతారిక : ప్రథమానువాకమున యజ్ఞపశువుయొక్క గుదకాండ హోమము ( గుదయాగము) చెప్పఁబడినది. దీనితో అగ్నీషోమీయ పశువిషయము సమాప్త మైనది. ఇఁక సోమాభిషవమునందు ఉపయోగింపఁబడు వసతీవరీ సంజ్ఞకములైన ఉదకములకు ఆ సంజ్ఞ ఏర్పడిన విధమును వివరించుచు ప్రథమకాండమునందలి తృతీయ ప్రపాఠక గత ద్వాదశానువాకమునందలి "హవిష్మతీ రిమా ఆపః" ఇత్యాది మంత్రములకు వివరణము ఈ ద్వితీయానువాకమునందు చేయఁబడుచున్నది.

1. అర్థము : దేవాః=దేవతలు, ఆగ్నీధ్రే=ఆగ్నీధ్ర మండపమునందు, (స్థిత్వా=ఉండి), యజ్ఞమ్=యజ్ఞశాలను, వ్యభజన్త=(ఇదం మమ, ఇదం మమ=ఈ అంశము నాకు, ఈ అంశము నాకు, ఇతి=అని,) విభజించిరి. తతః=ఆ విభాగమువలన, యత్=ఏ అంశము, అత్యాశిష్యత=అదనముగ మిగిలినదో, నః= మనకు, ఇదమ్=ఇది, వసతు ను=సాధారణముగ నుండుఁగాక, ఇతి=అని, తత్=దానిని గూర్చి, అబ్రువన్=పరస్పరము మాటలాడుకొనిరి. తత్='వసతు' అని దేవతలు చెప్పుటచే, వసతీవరీణామ్=వసతీవరీ సంజ్ఞకములైన ఉదకములకు, వసతీవరిత్వమ్='వసతీ వరీ' అను సంజ్ఞ (నిష్పన్నమ్=ఏర్పడినది.) ప్రాతః= ప్రాతఃకాలమున, తస్మిన్=ఆ అవశిష్ట భాగమునందు, న సమశక్నువన్=విభాగము చేయుటకు సమర్థులు కాలేక పోయిరి. తత్=ఆ అవశిష్టభాగమును, అప్సు =ఉదకములందు, ప్రావేశయన్=ప్రవేశపెట్టిరి. తాః=ఆ ఉదకములు, వసతీవరీః= వసతీవరీ సంజ్ఞకములు, అభవన్=అయినవి. (యజమానః= యజమానుఁడు), వసతీవరీః=వసతీవరీ సంజ్ఞకములైన ఉదకములను, గృహ్ణాతి=గ్రహించవలెను. వసతీవరీః=వసతీవరీ సంజ్ఞకములైన ఉదకములు, యజ్ఞః వై= యజ్ఞ స్వరూపములే. తేన=ఆ వసతీవర్యుదకములను గ్రహించుటచేత, యజమానః= యజమానుఁడు,) యజ్ఞమేవ=యజ్ఞమునే, ఆరభ్య=ఆరంభించి, గృహీత్వా=దృఢముగ ధరింపఁజేసి, ఉప వసతి=తత్సమీపమున ఉన్నవాఁ డగును.

తాత్పర్యము : పూర్వ మొకప్పుడు దేవతలు ఆగ్నీధ్ర మండపమునందు ఉండి యజ్ఞశాలను కొన్ని అంశములనుగా విభజించి 'ఈ అంశము నాకు, ఈ అంశము నాకు' అని తమలో తాము నిర్ణయించుకొనఁగా మిగిలిన అంశము ఈ నాటికి మన కందఱికి సాధారణముగా (ఉమ్మడిగా) ఉండుఁగాక, మరునాఁడు ప్రాతః కాలమున దానిని విభజించుకొందము', అని అనుకొనిరి. 'ఉండుఁగాక' (వసతు) అని ఆ అంశమునకు దేవోక్తి లభించుటచే ఆ అంశము 'వసతీవరీ' సంజ్ఞక మైనది. ఆ దేవతలు ప్రాతఃకాలమున మఱల సమావిష్టులై ఆ యవశిష్టాంశము నొకదానిని తమ కందఱికి సమానముగ విభజించుకొనుట కసమర్థులై ఉదకములందు పరిత్యజించిరి. 'ఉండుఁగాక' ('వసతు') అని చెప్పుటచే మిగిలిన ఆ యంశము కలవి కావున ఆ యుదకములు 'వసతీవరీ' సంజ్ఞకము లైనవి. యజ్ఞాంశము లగుటచే యజమానుఁడు వసతీవరీ సంజ్ఞకములైన యుదకములను గ్రహించవలెను. ఆ వసతీవర్యుదకములను గ్రహించుటచే యజమానుఁడు యజ్ఞమును ప్రారంభించి దృఢముగ గ్రహించి తత్సమీపమున ఉన్నవాఁడగును. (ఇది వసతీవరీ గ్రహణ విధాయక మంత్రము.)

2. అర్థము : యస్య=ఏ యజమానునియొక్క, అగృహీతాః అభి= గ్రహింపఁబడని వసతీవర్యుదకముల నభిలక్షించి, నిమ్రోచేత్ యత్=సూర్యుఁ డస్తమించుచో, అస్య=ఈ యజమానునియొక్క, యజ్ఞః=యజ్ఞము, అనారబ్ధః స్యాత్=ఆరంభింపఁబడని దగును. (తదా=అప్పుడు, సః=ఆ యజమానుఁడు,) యజ్ఞమ్=యజ్ఞమును, విచ్ఛిన్ద్యాత్=విచ్ఛిన్నము చేసినవాఁ డగును.

తాత్పర్యము : యాగకర్త సూర్యాస్తమయమునకు పూర్వము వసతీవర్యుదకములను గ్రహించనిచో, అతని యజ్ఞ మారంభింపఁబడని దగును. అప్పు డతఁడు యజ్ఞమును విచ్ఛిన్నము చేసినవాఁ డగును. (ఇచట పూర్వోక్త వసతీవర్యుదక గ్రహణము సూర్యాస్తమయమునకు పూర్వము చేయవలెనను విషయము వ్యతిరేక ముఖముగ విధించఁబడినది.)

3. అర్థము : జ్యోతిష్యాః వా=(బొగ్గునిప్పుచే) ఉల్కచే ప్రకాశింపఁజేయఁబడిన ఉదకములనైనను, గృహ్ణీయాత్=గ్రహించవలెను. వా=లేదా, ( కుమ్భే=పాత్రమునందు,) హిరణ్యమ్=బంగారమును, అవధాయ=ఉంచి, సశుక్రాణామేవ=తేజస్వంతములైన ఉదకములనే, గృహ్ణాతి=గ్రహించవలెను. వా= లేదా, యః బ్రాహ్మణః=ఏ బ్రాహ్మణుఁడు,

బహుయాజీ=బహుయాగములను చేసినవాఁడో, తస్య=అతని సంబంధములైన, కుమ్భ్యానామ్=కుంభ గతములైన ఉదకములను, గృహ్ణీయాత్=గ్రహించవలెను. సః=ఆ బహుయాజి, గృహీత వసతీవరీకః హి=(తాను అనుష్ఠించిన యజ్ఞములందు) వసతీవర్యుదకములను గ్రహించినవాఁడు కదా!

తాత్పర్యము : (వసతీవర్యుదకములను గ్రహించు సమయమున సూర్యుఁ డస్తమించినచో మూఁడు విధములుగ ప్రత్యామ్నాయ పద్ధతి ఇచట చెప్పఁబడినది.) (1) సూర్యుఁ డస్తమించుచో, వసతీవర్యుదకములను బొగ్గునిప్పుచే ప్రకాశింపఁజేసి గ్రహించవలెను. (2) లేదా, పాత్రమునందలి ఉదకములలో బంగారము నుంచి ఆ బంగారముచే ప్రకాశితములైన ఉదకములనే గ్రహించవలెను. (3) లేదా, బహుయాజియైన బ్రాహ్మణుఁడు తాను చేసిన యనేక యజ్ఞములందు వసతీవర్యుదకములను గ్రహించినవాఁ డగుటచే ఆ బహుయాజికి సంబంధించిన కుంభ గత వసతీవర్యుదకములను గ్రహించవలెను.

4. అర్థము : వసతీవరీః=వసతీవర్యుదకములను, గృహ్ణాతి= గ్రహించవలెను. వసతీవరీః=వసతీవర్యుదకములు, పశవః వై=పశువులే (పశురూపములే). (తదా=అప్పుడు, యజమానః=యజమానుఁడు,) పశూనేవ=పశువులనే, ఆరభ్య=ఆరంభించి, గృహీత్వా=దృఢముగ గ్రహింపఁజేసి, ఉప వసతి=తత్సమీపమునందు ఉన్నవాఁడగును.

తాత్పర్యము : (శ్రుతి పూర్వోక్తవిధినే అనువదించి ప్రశంసించుచున్నది.) యజ్ఞకర్త వసతీవర్యుదకములను గ్రహించవలెను. వసతీవర్యుదకములు పశుప్రాప్తి హేతువు లగుటచే పశు స్వరూపములే. అప్పుడు యజ్ఞకర్త పశువులనే ఆరంభించి దృఢముగ ధరింపఁజేసి తత్సమీపమున ఉన్నవాఁడగును.

5. అర్థము : అన్వీపమ్=ప్రవాహమున కభిముఖముగ, తిష్ఠన్= నిలుచుండుచు, గృహ్ణీయాత్ యత్=వసతీవర్యుదకములను గృహించుచో, అస్మాత్= ఇతనివలన, పశవః=పశువులు, నిర్మార్గుకాః=వినశ్వరములు, స్యుః=అగును. ప్రతీపమ్=ప్రవాహ ప్రతికూలముగ, గృహ్ణాతి=గ్రహించవలెను. (తదా=అప్పుడు, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ప్రతిరుధ్య=వినాశమును నివారించి, పశూన్= పశువులను, అస్మై= ఈ యజమానునికొఱకు, గృహ్ణాతి=గ్రహించినవాడగును.

తాత్పర్యము : ప్రవాహాభిముఖముగ వసతీవర్యుదకములను గ్రహించుచో, ఇతని వలన పశువులు వినశ్వరము లగును. ప్రవాహమున కభిముఖముగ గ్రహించవలెను. అప్పు డధ్వర్యుఁ డీ యజమానునికొఱకు పశువులను గ్రహించినవాఁడగును.. (గ్రహణకాలమునందు ప్రవాహ ప్రాతికూల్య మిచట విధింపఁబడినది.)

6. అర్థము : ఇన్ద్రః=ఇంద్రుడు, వృత్రమ్=వృత్రాసురుని, అహనత్=సంహరించెను. సః=ఆ వృత్రుఁడు, అపః అభి=ఉదకముల కభిముఖముగ, అమ్రియత=మరణించెను. తాసామ్=ఆ ఉదకములకు, మేధ్యమ్= పవిత్రము, యజ్ఞియమ్=యజ్ఞ సంబంధియు, సదేవమ్=దేవతాసహితమునైన, యత్=ఏది, ఆసీత్=ఉండెనో, తత్ అత్యముచ్యత=అది అతిక్రమించిపోయెను. తాః=ఆ అతిక్రమించిపోయిన పవిత్రాంశములు, వహన్తీః= ప్రవాహోదకములుగా, అభవన్=అయినవి. వహన్తీ నామ్=ప్రవహించు నుదకములను, గృహ్ణాతి=గ్రహించవలెను. యాః ఏవ=ఏవియైతే, మేధ్యాః=పవిత్రములు, యజ్ఞియాః=యజ్ఞమునకు సంబంధించినవియు, సదేవాః=దేవతాసహితములును (దేవత్వము కలవియు) నగు, ఆపః=ఉదకములో, తాసామేవ=ఆ యుదకములనే, గృహ్ణాతి=గ్రహించినవాఁ డగును.

తాత్పర్యము : పూర్వము ఇంద్రుఁడు వృత్రాసురుని సంహరించెను. ఆ వృత్రుఁడు ఉదకముల కభిముగ మరణించెను. ఆ ఉదకములకు పవిత్రమును, యజ్ఞసంబంధియు, దేవతాత్వ సహితమునైన యంశ మేది కలదో, ఆ యంశము ప్రవహించు నుదకముగా నాయెను. కావున యజమానుఁడు ప్రవహించు నుదకములను గ్రహించవలెను. అప్పుఁ డతఁడు పవిత్రములును, యజ్ఞమునకు సంబంధించినవియు, దేవతాత్వ సహితములునైన ఉదకములనే గ్రహించినవాఁ డగును. (ఇచట ప్రవాహోదకములు గ్రాహ్యములుగా విధించఁబడినవి.)

7. అర్థము : అన్తమాః=అతి సమీపస్థములైన, వహన్తీః= ప్రవాహజలములను, న అతీయాత్=అతిక్రమించరాదు. అన్తమాః వహన్తీః=అతి సమీపస్థములైన ప్రవాహజలములను, అతీయాత్ యత్=అతిక్రమించుచో, యజ్ఞమ్=యజ్ఞమును, అతిమన్యేత=అవమానించినవాఁ డగును.

తాత్పర్యము : యజమానుఁడు అతి సమీపమునందలి ప్రవాహజలములను గ్రహింపక విడువరాదు. ప్రవాహజలములలోఁ గూడ సమీపస్థ జలములనే గ్రహించవలెనని భావము. సమీపస్థ ప్రవాహజలములను గ్రహింపక అతిక్రమించినచో ఆ యజమానుఁడు యజ్ఞము నవమానించినవాఁ డగును. ఇచట అత్యంత సమీపస్థ జలగ్రహణము వ్యతిరేకముఖమున విహితమైనది.

8. అర్థము : స్థావరాణామ్=(హ్రద తటాకాదులందలి) స్థావరములైన యుదకములను, (ద్వితీయార్థే షష్ఠీ) న గృహ్ణీయాత్=గ్రహింపరాదు. స్థావరాః= స్థావరములైన యుదకములు, వరుణ గృహీతాః వై=వరుణునిచే గ్రహింపఁబడినవియే. స్థావరాణామ్=స్థావరోదకములను, గృహ్ణీయాత్ యత్=గ్రహించినచో, ( సః=ఆ యధ్వర్యుఁడు,) అస్య=ఈ యజమానునియొక్క, యజ్ఞమ్= యజ్ఞమును, వరుణేన=వరుణునిచే, గ్రాహయేత్=గ్రహింపఁజేసినవాఁ డగును.

తాత్పర్యము : హ్రద తటాకాదులందలి స్థావరములైన ఉదకములను గ్రహించరాదు. ఆ స్థావరోదకములు వరుణునిచే గ్రహింపఁబడి యుండునవి. అధ్వర్యుఁడు స్థావరోదకములను గ్రహించినచో ఈ యజమానునియొక్క యజ్ఞమును వరుణునిచే గ్రహింపఁజేసినవాఁ డగును. (ఇచట స్థావరోదక గ్రహణము నిషేధింపఁబడినది. హ్రద తటాకాదులందలి యుదకములు ప్రవహించకపోవుటచే కదలిక లేక స్థావరములుగా నుండును.

9. అర్థము : యత్ వై=ఎప్పుడైతే, దివా=పగలు (అహస్సు), భవతి=ఉంటున్నదో, (తదానీమ్=అప్పుడు,) రాత్రిః=రాత్రి, అపః= ఉదకములను, ప్రవిశతి=ప్రవేశించుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, దివా= పగటియందు, ఆపః=ఉదకములు, తామ్రాః=(కొంచెము) తామ్రవర్ణము కలవిగా, దదృశే=కనఁబడుచున్నవి. యత్=ఎప్పుడు, నక్తమ్=రాత్రి, భవతి= వర్తించుచున్నదో, (తదానీమ్=అప్పుడు), అహః=అహస్సు, అపః= ఉదకములను, ప్రవిశతి=ప్రవేశించుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, నక్తమ్=రాత్రియందు, ఆపః=ఉదకములు, చన్ద్రాః=చంద్రునివలె తెల్లనివిగా, దదృశే=కనఁబడుచున్నవి. ఛాయాయై చ ఆతపతః చ=ఛాయాతపముల రెండింటియొక్కయు, సంధౌ=సంధి యందు, గృహ్ణాతి=గ్రహించవలెను. (తదా= అప్పుడు, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అస్మై=ఈ యజమానునికొఱకు, అహోరాత్రయోః=అహోరాత్రములయొక్క, వర్ణమ్ ఏవ=వర్ణమునే, గృహ్ణాతి= గ్రహించినవాఁ డగును.

తాత్పర్యము : పగలు జరుగుచుండఁగా రాత్రి నీటియందు ప్రవేశించును. కావున పగలు ఉదకములు కొంచెము తామ్రవర్ణము కలవివలె (అనఁగా రాహుగ్రస్తుఁడైన చంద్రునియందలి తామ్రవర్ణమువంటి వర్ణము కలవివలె) కనఁబడుచున్నవి. రాత్రి జరుగుచుండఁగా అహస్సు (పగలు) నీటియందు ప్రవేశించును. కావున రాత్రియందు ఉదకములు చంద్రునివలె అతిశ్వేతములై కనఁబడుచున్నవి. కావున ఛాయతపముల సంధిసమయమునందు వసతీవర్యుదకములను గ్రహించవలెను. అప్పు డధ్వర్యుఁ డీ యజమానునికొఱకు అహోరాత్రముల వర్ణమునే గ్రహించినవాఁడగును. (ఇచట వసతీవర్యుదక గ్రహణమునకై ఛాయాతపముల సంధిదేశము విహితమైనది.)

10. అర్థము : "హవిష్మతీః ఇమాః ఆపః" ఇతి ఆహ="ఈ వసతీవర్యుదకములు స్వసంస్కారముచే సోమముచేత హవిస్సు కలవియని" శ్రుతి చెప్పినది. హవిష్కృతానామ్ ఏవ=హవిస్సంపాదకములైన ఉదకములనే, గృహ్ణాతి= గ్రహించవలెను.

తాత్పర్యము : వసతీవర్యుదకములు సోమాభిషవమునందు ప్రోక్షణ రూపమున ఉపయుక్తము లగుటచే హవిస్సంపాదకములుగా వివక్ష చేయఁబడినది. హవిస్సంపాదకములయిన వసతీవర్యుదకములనే గ్రహించవలెనని భావము.

11. అర్థము : "హవిష్మాన్ అస్తు సూర్యః" ఇతి ఆహ="సూర్యుఁడు హవిష్మంతుఁడగుఁగాక" అని శ్రుతి చెప్పినది. సశుక్రాణామ్ ఏవ= ప్రకాశవంతములైన యుదకములనే, గృహ్ణాతి=గ్రహించవలెను.

తాత్పర్యము : సూర్యుఁడు ఉదకములను ప్రకాశింపఁజేయును. కావున హవిష్మంతుఁ డగుఁగాక, అని శ్రుతి చెప్పినది. అందువలన ప్రకాశవంతములైన యుదకములనే గ్రహించవలెనని చెప్పఁబడినది. ఇచట సూర్య శబ్దముచే ఉదక ప్రకాశకత్వము వివక్షింపఁబడినది.

12. అర్థము : అనుష్టుభా=అనుష్టుప్ ఛందస్సు గల "హవిష్మతీ రిమా ఆపః" అను మంత్రముచేత, గృహ్ణాతి=వసతీవర్యుదకములను గ్రహించవలయును. అనుష్టుక్=అనుష్టుప్ ఛందస్సు, వాక్ వై=వాగ్రూపమే. (తతః=అందువలన, ఏషః=ఈ యజమానుఁడు,) సర్వయా వాచైవ=సమస్తమైన వాక్కుచేతనే, ఏనాః=ఈ ఉదకములను, గృహ్ణాతి=గ్రహించినవాఁ డగును.

తాత్పర్యము : అనుష్టుప్ఛందోయుతమైన "హవిష్మతీ రిమా ఆపః" అను మంత్రము నుచ్చరించుచు వసతీవర్యుదకములను గ్రహించవలెను. అనుష్టుప్ ఛందస్సు వాక్స్వరూపమే కావున ఈ యజమానుఁడు సమస్తమైన వాక్కుచేతనే ఈ యుదకములను గ్రహించినవాఁ డగును. (ఇచట మంత్రగతమైన ఛందస్సుయొక్క ఉపయోగము చెప్పఁబడినది.)

13. అర్థము : చతుష్పదయా ఋచా=నాలుగు పాదములు గల "హవిష్మతీ రిమా ఆపః" ఇత్యాదికమైన ఋక్కుచేత, గృహ్ణాతి=గ్రహించవలెను. త్రిః= మూఁడు పర్యాయములు, సాదయతి=ఆగ్నీధ్రీయాది స్థానములందు ఉదకములను ఉంచవలెను. ఏవం కృతే సతి=ఈ విధముగ చేయఁబడఁగా) సప్త సంపద్యన్తే= ఏడు పర్యాయములగుచున్నవి. శక్వరీ=శక్వరీ ఛ్ఛందస్సు, సప్తపదా=ఏడు పాదములు కలది. పశవః=పశువులు, శక్వరీ=(శక్వరీ ఛ్ఛందోయుత మంత్రముచే పొందఁదగినవి కావున) శక్వరీ రూపములు. (తత్=ఆ కారణమువలన, అయమ్=ఈ యజమానుఁడు,) పశూన్ ఏవ=పశువులనే, అవరున్ద్ధే=పొందును.

తాత్పర్యము : ఉదకగ్రహణ సమయమున పఠింపఁబడునట్టి ఋక్కు నాలుగు పాదములు కలదగుటచే చతుస్సంఖ్య ఏర్పడుచున్నది. గ్రహింపఁబడిన ఉదకములను ఉత్తరవేదియొక్క దక్షిణ శ్రోణియందు, ఉత్తర శ్రోణియందు, ఆగ్నీధ్రీయ ధిష్ణియ సమీపమునందును ఆసాదనము చేయుటవలన త్రిత్వసంఖ్య యేర్పడుచున్నది. మొత్తము సప్తత్వసంఖ్య సిద్ధించుచున్నది. శక్వరీ ఛ్ఛందస్సు ఏడు పాదములు కలిగియుండుటచే సప్త సంఖ్యాకమైనది. శక్వరీ ఛ్ఛందోయుత మంత్రముచే పశువులు లభ్యము లగును. ఈ విధముగ సప్తత్వ సంఖ్యా సామ్యముచే యజమానుఁడు పశువులను తప్పక పొందును. (ఇచట ఋక్కుయొక్క నాలుగు పాదములందలి చతుస్సంఖ్యయు, శాలాముఖీయోత్తరవేద్యాగ్నీధ్రీయ స్థానత్రయ విశిష్టమైన సాదన సంఖ్యయు కలసి ఈ యుభయము ప్రశంసింపఁబడినది.)

14. అర్థము : అస్మై లోకాయ వై=ఈ భూలోకము కొఱకే, గార్హపత్యః=గార్హపత్యాగ్ని, ఆ ధీయతే=ఆ ధానము చేయఁబడుచున్నాఁడు. అముష్మై=స్వర్గలోకముకొఱకు, ఆహవనీయః=ఆహవనీయాగ్ని, ఆ ధీయతే=ఆధానము చేయఁబడుచున్నాఁడు. గార్హపత్యే ఉప సాదయేత్ యత్= గార్హపత్యాగ్ని సమీపమున వసతీవర్యుదకముల సాదనము చేయుచో, ( యజమానః=యజమానుఁడు,) అస్మిన్ లోకే=ఈ భూలోకమునందు, పశుమాన్=పశువులు కలవాఁడు, స్యాత్=అగును. ఆహవనీయే యత్= ఆహవనీయాగ్నిసమీపమున ఉదకసాదనము చేయుచో, అముష్మిన్ లోకే= స్వర్గలోకమునందు, పశుమాన్=పశుమంతుఁడు, స్యాత్=అగును. ఉభయోః ఉపసాదయేత్ యత్=ఉభయాగ్నుల సమీపమున ఉదకసాదనము చేయుచో, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఉభయోః లోకయోః ఏవ=రెండు లోకములయందును, ఏనమ్=ఈ యజమానుని, పశుమన్తమ్=పశువులు కలవానినిగా, కరోతి=చేసినవాఁ డగును.

తాత్పర్యము : శాలాముఖీయోత్తరవేదులందు సాదనము విధించఁబడుచున్నది. ఈ లోకముకొఱకు గార్హపత్యాగ్నిని, స్వర్గ లోకముకొఱకు ఆహవనీయాగ్నిని ఆధానము చేయవలెను. గార్హపత్యాగ్నిసమీపమున వసతీవర్యుదకముల నుంచినచో యజమానుఁడు భూలోకమునందు పశుమంతుఁ డగును. ఆహవనీయాగ్నిసమీపమున సాదనము చేసినచో స్వర్గలోకమునందు పశుమంతుఁ డగును. ఉభయాగ్నుల సమీపమున సాదనము చేసినచో ఉభయ లోకములందును పశుమంతుఁ డగును.

15. అర్థము : రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=పోఁగొట్టుట కొఱకు, సర్వతః=పూర్వోక్త స్థానత్రయ మంతటను, పరి హరతి= వసతీవర్యుదకములను త్రిప్పవలెను.

తాత్పర్యము : రాక్షసులు తొలఁగిపోవుటకై ఉదకములను పూర్వోక్త స్థానత్రయ మంతటను త్రిప్పవలెను.

16. అర్థము : "ఇన్ద్రాగ్నియోః భాగధేయీః స్థ" ఇతి ఆపః=ఓ యుదకములారా! మీరు ఇంద్రాది దేవతలకు భాగ రూపములు కండు." అని శ్రుతి చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుః ఏవ=మంత్రము ననుసరించియే ఉన్నది.

తాత్పర్యము : "ఓ వసతీవర్యుదకములారా! మీరు యక్ష్యమాణ దేవేంద్రాదులకు భాగ రూపములు కండు" అని "ఇన్ద్రాగ్నియోః" ఇత్యాది మంత్రము చెప్పినది. ఈ యర్థము మంత్రము ననుసరించియే యున్నది. అనఁగా ఇంక వివరించి వ్యాఖ్యానించ నవసరము లేదని భావము.

17. అర్థము : ఆగ్నీధ్రే ఉప వాసయతి=వసతీవర్యుదకములను ఆగ్నీధ్రస్థాన సమీపమున వసింపఁజేయవలెను. ఆగ్నీధ్రం యత్=ఆగ్నీధ్రస్థాన మేది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, అపరాజితమ్ ఏవ= ముఖ్యమైనదే. యదేవ=ఏదియైతే, యజ్ఞస్య=యజ్ఞమునకు, అపరాజితమ్= ముఖ్య మైనదో, తదేవ=దానియందే, ఏనాః=ఈ యుదకములను, ఉప వాసయతి= ఉపవసింపఁజేయవలెను (ఉంచవలెను).

తాత్పర్యము : ఆగ్నీధ్రస్థాన సమీపమున వసతీవర్యుదకముల నుంచవలెను. ఆగ్నీధ్రస్థానము యజ్ఞమునకు ముఖ్యమై నది. కావున దానియందే ఈ యుదకముల నుపవసింపఁజేయవలెను. (ఇచట వసతీవర్యుదక స్థాపనము విధింపఁబడినది.)

18. అర్థము : వితతస్య=విస్తీర్ణమైన, యజ్ఞస్య= యజ్ఞముయొక్క, యత్=ఏ యంగము, యతః ఖలు వై=ఏ కారణము వలననైతే, న క్రియతే= విమర్శించి చేయఁబడదో, తత్ అను=ఆ లోపము ననుసరించి, రక్షాంసి= రాక్షసులు, అవ చరన్తి=అపకారము చేయుదురు. వహన్తీనామ్= వసతీవర్యుదకములను, గృహ్ణాతి యత్=గ్రహించు చున్నచో, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, తత్=ఆ యంగము, క్రియమాణమేవ శయే=చేయఁబడినదియే అగుచున్నది. ఏతత్=ఇది, రక్షసామ్=రాక్షసులయొక్క, అనన్వచారాయ= అపకారము లేకుండుటకై, భవతి=అగుచున్నది.

తాత్పర్యము : యజ్ఞము బహువిస్తీర్ణ మైనది. అట్టి యజ్ఞముయొక్క ప్రతి యంగమును విమర్శించి యనుష్ఠించవలయును. ఏ యంగముయొక్క అనుష్ఠానమున లోపము జరుగునో, ఆ లోపము నాధారముగఁ జేసికొని రాక్షసులు అపకారము చేయుదురు. వసతీవర్యుదకగ్రహణము చేసినచో యజ్ఞముయొక్క ప్రతి యంగము సంపూర్ణ ముగఁ జేయఁబడినదియే యగును. అప్పుడు రాక్షసు లపకారము చేయఁజాలరు. ఇచట పూర్వోక్తమైన వహన్తీగ్రహణము ప్రశంసింపఁబడినది.

19. అర్థము : ఏతాః=ఈ పూర్వోక్తములైన యుదకములను, న ఈలయన్తి=తొలఁగించరాదు. ఆ తృతీయసవనాత్=తృతీయ సవనమునందలి సోమాభిషవ పర్యంతము, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, సంతత్యై=సంతతి (అవిచ్ఛిత్తి) కొఱకు, పరిశేరే=స్థాపించవలెను.

తాత్పర్యము : ఈ పూర్వోక్తములైన వసతీవర్యుదకములను ప్రథమసవనమునందలి సోమాభిషవానంతరము తీసివేయరాదు. యజ్ఞము విచ్ఛిన్నము కాకుండుటకై తృతీయసవనమందలి సోమాభిషవ పర్యంతము ఆగ్నీధ్రమునం దుంచవ

లెను. ఆగ్నీధ్రమునందు సాదితములైన యుదకములకు తృతీయసవనగత సోమాసవ పర్యంతము ధారణము ఇచట విహితమైనది.

ద్వితీయానువాకము సమాప్తము.

# అథ షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే తృతీయోఽనువాకః

మూలము : [1]బ్రహ్మవాదినో వదన్తి స త్వా అధ్వర్యుః స్యాద్యః సోమ ముపావహర న్సర్వాభ్యో దేవతాభ్య
ఉపావహరేదితి హృదే త్వేత్యాహ మనుష్యేభ్య ఏవైతేన కరోతి మనసే త్వేత్యాహ పితృభ్య ఏవై
తేన కరోతి దివే త్వా సూర్యాయ త్వేత్యాహ దేవేభ్య ఏవైతేన కరోత్యేతావతీర్వై దేవతా స్తాభ్య
ఏవైనగ్ం సర్వాభ్య ఉపావహరతి [2]పురా వాచః (౧) ప్రవదితోః ప్రాతరనువాక ముపాకరోతి యావ
త్యేవ వాక్తామవ రున్ధే[3] ఽపో ఽగ్రేఽభి వ్యాహరతి యజ్ఞో వా ఆపో యజ్ఞమేవాభి వాచం వి సృజతి
[4]సర్వాణి ఛన్దాగ్ంస్యన్వాహ పశవో వై ఛన్దాగ్ంసి పశూనేవావ రున్ధే [5]గాయత్రియా తేజస్కామస్య
పరి దధ్యాత్త్రిష్టుభేన్ద్రియకామస్య జగత్యా పశుకామస్యానుష్టుభా ప్రతిష్ఠా కామస్య పఙ్క్త్యా యజ్ఞకా
మస్య విరాజాఽన్నకామస్య [6]శృణోత్వగ్నిః సమిధా హవమ్ (౨) మ ఇత్యాహ సవితృప్రసూత ఏవ
దేవతాభ్యో నివేద్యాపో ఽచ్ఛై [7]త్యప ఇష్య హోత రిత్యాహేషితగ్ం హి కర్మ క్రియతే [8]మైత్రావరు
ణస్య చమసాధ్వర్యవా ద్రవేత్యాహ మిత్రావరుణౌ వా అపాం నేతారౌ తాభ్యా మేవైనా అచ్ఛైతి
[9]దేవీ రాపో అపాంనపాదిత్యాహ ఽఽహుత్యైవైనా నిష్క్రీయ గృహ్ణాత్యథో హవిష్కృతానా మేవాభి
ఘృతానాం గృహ్ణాతి (3) కార్షిరసీత్యాహ శమలమేవా ఽఽసా మప ప్లావయతి [11]సముద్రస్య వోఽ
క్షిత్యా ఉన్నయ ఇత్యాహ తస్మాదద్యమానాః పీయమానా ఆపో న క్షీయన్తే [12]యోనిర్వై యజ్ఞస్య
చాత్వాలం యజ్ఞో వసతీవరీ ర్హోతృచమసం చ మైత్రావరుణచమసం చ సగ్ంస్పర్శ్య వసతీవరీ ర్వ్యాన

యతి యజ్ఞస్య సమోనిత్వాయాథో హృదే త్వైనా మనసే ప్ర జనయ [13]త్యా ధ్రువో౽వేరపా 3

ఇత్యాహో తే మనన్మమురుతేమా పశ్యేతి వాపైతదాహ [14]యద్యగ్నిష్టోమో జుహోతి యద్యుక్థ్యః పరిధీ

ని మార్ష్టి యద్యతిరాత్రో యజుర్వద న్ప్రపద్యతే యజ్ఞక్రతూనాం వ్యావృత్త్యై(४)||

[వాచో హవ మధిషూతానాం గృహ్ణాత్యుత పఞ్చవిꣳశతిశ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే తృతీయో౽నువాకః ||3||

# వేదార్థదీపిక

అవతారిక : సోమాభిషవార్థములైన వసతీవరీ సంజ్ఞకములైన యుదకములకు సంబంధించిన విశేషములు ద్వితీయానువాకమునందు వివరించఁబడినవి. సోమాభిషవము నిమిత్తము శకటముమీఁద హవిర్ధానమునకు తీసికొనిరాఁబడిన సోమలతను శకటమునుండి దించుట మున్నగు విషయము లీ తృతీయానువాకమున వివరింపఁబడుచున్నవి. ఈ సందర్భమున ప్రథమ కాండమునందలి తృతీయ ప్రపాఠకములోని త్రయోదశానువాక గత మంత్రములను ఈ తృతీయానువాక గత బ్రాహ్మణభాగము వివరించుచున్నది. "హృదే త్వా మనసే త్వా" ఇత్యాది మంత్రములు ఆ త్రయోదశానువాకములోనివి.

1. అర్థము : యః=ఏ యధ్వర్యుఁడు, సోమమ్=సోమమును, ఉపావహరన్=శకటమునుండి దగ్గఱకు తీసికొనుచు, సర్వాభ్యః దేవతాభ్యః= సర్వదేవతలకొఱకు, ఉపావహరేత్=శకటమునుండి తీసికొనవలెనని (తెలిసికొనునో), సః త్వా=అతఁడే, అధ్వర్యుః=ముఖ్యుఁడైన యధ్వర్యుఁడు, (ఇతి= అని,) బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు. "హృదే త్వా" ఇతి ఆహ="ఓ సోమమా! నిన్ను హృదయము కలిగిన మనుష్యులకొఱకు ఉపావహరణము (సమీపమునకు తీసికొనుట) చేయుచున్నాను." అని శ్రుతి చెప్పినది. ఏతేన=ఈ సోమముచే, మనుష్యేభ్యః ఏవ=మనుష్యులకొఱకే, కరోతి= చేయుచున్నాఁడు. "మనసే త్వా ఇతి" ఆహ=ఓ సోమమా! మనస్సు కల పితృదేవతలకొఱకు నిన్ను సమీపమునకు తీసికొనుచున్నాను." అని శ్రుతి చెప్పినది. (యజమానః=యజమానుఁడు,) ఏతేన=ఈ సోమముచే, పితృభ్యః ఏవ=పితృదేవతలకొఱకే, కరోతి=చేయుచున్నాఁడు. "దివే త్వా సూర్యాయ త్వా" ఇతి ఆహ="ఓ సోమమా! ద్యులోకనివాసులైన దేవతలకొఱకు, విశేషముగ సూర్యునికొఱకు నిన్ను సమీపమునకు గ్రహించుచున్నాను" అని శ్రుతి చెప్పినది. దేవతాః ఏతావతీః వై=ఈ శ్రుతియందు చెప్పఁబడిన దేవతలు వీరే. తాభ్యః సర్వాభ్యః ఏవ=ఆ సర్వదేవతలకొఱకే, ఏనమ్=ఈ సోమమును, ఉపావహరతి=సమీపమునకు తీసికొనినవాఁడగుచున్నాఁడు.

తాత్పర్యము : ఇచట శకటమునుండి సోమమును తీసికొనవలెనను విధిని సూచించుచు మంత్రగతములైన హృదయాది శబ్దములకు యథోక్తార్థమును ఈ బ్రాహ్మణము తెలియఁజేయుచున్నది. సర్వదేవతలకొఱకు సోమమును శకటమునుండి తీసికొనుచు సర్వదేవతలకొఱకు సోమమును శకటమునుండి తీసికొనవలెనని తెలిసికొనునట్టి యధ్వర్యుఁడే ముఖ్యుఁడైన యధ్వర్యుఁడని మంత్రజ్ఞులు చెప్పుచున్నారు. శేషము అర్థమునందే వివరింపఁబడినది.

2. అర్థము : వాచః ప్రవదితోః పురా=మనుష్యులు రాత్రి నిద్రనుండి మేల్కొని పరస్పరము మాటలాడుకొనుటకు పూర్వము, (ఇదియే వాచః ప్రవదనము) ప్రాతరనువాకమ్=ప్రాతరనువాకమును, ఉపాకరోతి=అధ్వర్యుఁడు ఉపాకరణము చేయవలెను. వాక్=వాక్కు, యావతీ=ఏమాత్రము పరిమితి కలదో, తామేవ=ఆ వాక్కునే, (యజమానః=యజమానుఁడు,) అవరున్డే= పొందును.

తాత్పర్యము : రాత్రియందు నిద్రించుచున్న మనుష్యులు ఉషఃకాలమున మేల్కొని పరస్పరము మాటలాడుకొనుచుందురు. పక్షులు శబ్దము చేయుచుండును. దీనిని వాచఃప్రవదన మందురు. ప్రాతఃకాలమునకు పూర్వము హోత పఠించవలసిన ఋక్సమూహము ప్రాతరనువాక మనఁబడును. ఇచట ఉపాకరణ మనఁగా అధ్వర్యుఁడు హోతను గూర్చి ప్రైషను పలుకుట. అనఁగా వాచఃప్రవదనమునకంటె పూర్వము అధ్వర్యుఁడు హోతను గూర్చి "ప్రాతరనువాకమ్ అను బ్రూహి" అని పలుకవలెను. దీనివలన యజమానుఁడు సర్వవాక్కును పొందును.

3. అర్థము : అగ్రే=ప్రథమమున, అపః అభి= అప్పుబ్దవాచ్యములైన యుదకముల నభిలక్షించి చెప్పినట్టి ఋక్కును, వ్యాహరతి=పఠించవలెను. యజ్ఞః=యజ్ఞము, ఆపః వై=ఉదక స్వరూపమే. (తదా=అప్పుడు, హోతా= హోత,) యజ్ఞమ్ ఏవ అభి=యజ్ఞము నభిలక్షించియే, వాచం వి స్పజతి=వాక్కును విడిచినవాఁ డగును. (పఠించి నవాఁ డగును.)

తాత్పర్యము : హోత ప్రాతరనువాకమును పఠించవలెనని పూర్వమంత్రమున చెప్పఁబడినది. ప్రాతరనువాక మనఁగా హోత పఠించవలసిన ఋక్సమూహము. హోత ప్రథమమున ఆ ఋక్సమూహములోని యుదకముల నభిలక్షించి తత్ప్రతిపాదకమైన "ఆపో రేవతీః క్షయథా హి వస్వః" ఇత్యాది ఋక్కును పఠించవలెను. యజ్ఞము ఉదక స్వరూపమే కావున ప్రథమమున ఈ ఋక్కును పఠించిన హోత యజ్ఞము నభిలక్షించియే ఋక్కును పఠించినవాఁ డగును. (ఇచట ప్రాతరనువాకములోని ప్రథమ ఋక్పఠనము విహిత మైనది).

4. అర్థము : సర్వాణి ఛన్దాంసి=ఆ యా ఛందస్సులతోఁ గూడిన సర్వ ఋక్కులను, అన్వాహ=అనువచనము (పఠనము) చేయవలెను. పశవః= పశువులు, చన్దాంసి వై=ఛంద స్స్వరూపములే. (తదా సతి=అట్లు కాఁగా, యజమానః=యజమానుఁడు,) పశూన్=పశువులను, అవ రున్డే ఏవ= నిశ్చయముగ పొందును.

తాత్పర్యము : (పూర్వోక్త ఋక్పఠనానంతరము పఠించఁదగిన ఋక్కు లిచట విధించఁబడుచున్నవి.) అనంతరము ఆ యా ఛందస్సులతోఁ గూడిన సర్వఋక్కులను హోత పఠించవలెను. పశువులు ఛందోరూపములే. కావున యజమానుఁడు హోతృ ఋక్పఠనముచేత నిశ్చయముగ పశువులను పొందును.

5. అర్థము : తేజస్కామస్య=తేజస్సును కోరునట్టి యజమానుని నిమిత్తము, గాయత్రియా=గాయత్రీ చ్ఛందోయుక్తమైన ఋక్కుచేత, పరిదధ్యాత్= పఠనమును సమాప్తి చేయవలెను. ఇన్ద్రియకామస్య=ఇంద్రియ బలమును కోరునట్టి యజమానుని నిమిత్తము, త్రిష్టుభా=త్రిష్టుప్ఛందోయుక్తమైన ఋక్కుచే, పరిదధ్యాత్. పశుకామస్య=పశుకాముని నిమిత్తము, జగత్యా=జగతీచ్ఛందోయుక్తమైన ఋక్కుచే, పరిదధ్యాత్. ప్రతిష్ఠాకామస్య=ప్రతిష్ఠను కోరు యజమానుని నిమిత్తము, అనుష్టుభా=అనుష్టుప్ఛందోయుక్తమైన ఋక్కుచేత, పరిదధ్యాత్. యజ్ఞకామస్య=యజ్ఞకాముని నిమిత్తము, పజ్క్త్యా=పంక్తిచ్ఛందోయుక్తమైన ఋక్కుచే, పరిదధ్యాత్. అన్నకామస్య= అన్నకాముని నిమిత్తము, విరాజా=విరాట్ఛందోయుక్తమైన ఋక్కుచే, పరిదధ్యాత్= సమాప్తి చేయవలెను.

తాత్పర్యము : ప్రాతరనువాక సమాప్తియందు కామనాభేదముచే ఛందస్సులతోఁగూడిన ఋక్కులతో సమాప్తి చేయుట యిచట విధించఁబడినది. హోత తేజస్కాముని నిమిత్తము గాయత్రిచ్ఛందోయుక్త ఋక్కుచే ప్రాతరనువాక పఠనము సమాప్తి చేయవలెను. ఈ విధముగనే ఇంద్రియాదులను కోరువారికై జగత్యాది ఛందస్సులతోఁ గూడిన ఋక్కులచే సమాప్తి చేయవలెను.

6. అర్థము :"శృణోత్వగ్నిః సమిధా హవం మే" ఇతి ఆహ= "సమిదాహుతిచే బాగుగ ప్రజ్వలించిన అగ్నిదేవుఁడు నా యాహ్వానమును వినుఁగాక" అని యజ్ఞకర్త సోమాభిషవ సమయమున అవసరములైన యుదక విశేషములను తీసికొనివచ్చుటకై అగ్న్యాది దేవతల నాహ్వానించినట్లు ఈ శ్రుతి చెప్పినది. సవితృప్రసూతః ఏవ=సవితృ దేవునిచే ప్రేరితుఁడు అయియే, దేవతాభ్యః=దేవతలకొఱకు, నివేద్య= తెలియపఱచి, అపః=ఉదకములను, అచ్ఛైతి=(పొందుటకు) వెళ్లవలెను.

తాత్పర్యము :"శృణోత్వగ్నిః" ఇత్యాది మంత్రమునందు యజ్వ అగ్న్యాది శ్రవణమును కోరినట్లు చెప్పఁబడినది. ఆ శ్రవణమునకు ప్రయోజన మిచట చెప్పఁ బడుచున్నది. సోమయాగకర్త సోమాభిషవ సమయమున ఏక ధన సంజ్ఞకములు, వసతీవరీ సంజ్ఞకములునైన ఉదకములను తీసికొని రావలయును. ఇందువలన యజ్వ "శృణోత్వగ్నిః" అను ఈ మంత్రముచేత అగ్న్యాదిదేవతలకు విజ్ఞాపనము చేసి యుదకములను పొందుటకు వెళ్లవలెను. మంత్రతాత్పర్యము అర్థవివరణమునందే స్పష్టమైనది.

7. అర్థము :"అప ఇష్య హోతః" ఇతి ఆహ="ఓ హోతా! ఆనేతవ్యములైన యుదకముల నుద్దేశించి 'ప్ర దేవత్రా బ్రహ్మణే గాతు రేతు' ఇత్యాది ఋక్కులను పఠించుము" అని యధ్వర్యుఁడు హోతతో పలుకవలెను. (ఇది ప్రైషమంత్రము) ఇషితమ్=అభీష్టమైన, కర్మ=కర్మ, క్రియతేహి=చేయఁబడుచున్నది కదా!

తాత్పర్యము :లోకమునందు అభీష్టమైన కర్మ బాగుగ చేయఁబడుచున్నది. కావున ఓ హోతా! తీసికొనిరాఁదగిన ఉదకముల నుద్దేశించి 'ప్ర దేవత్రా బ్రహ్మణే గాతు రేతు' ఇత్యాది ఋక్కులను పఠించుమని అధ్వర్యుఁడు హోతతో పలుకవలెను. "అప ఇష్య హోతః" అనునది అధ్వర్యుఁడు పలుకవలసిన ప్రైషమంత్రము.

9. అర్థము :"మైత్రావరుణస్య చమసాధ్వర్యవా ద్రవ" ఇతి ఆహ= మైత్రావరుణ నామకుఁడైన ఋత్విజునియొక్క పరి చారకుఁడవైన ఓ చమసాధ్వర్యూ! రమ్ము" అని అధ్వర్యుఁడు ఆ చమసాధ్వర్యుని పిలువవలెను. (ఇది మఱియొక ప్రైషమంత్రము). మిత్రావరుణౌ=మిత్రావరుణ దేవతలు, అపాం నేతారౌ వై= ఉదకములకు నేతలే. తాభ్యామ్ ఏవ=ఆ మిత్రావరుణులతోడనే, ఏనాః=ఈ పూర్వోక్తములైన యుదకములను, అచ్ఛ=పొందుటకు, ఏతి=వెళ్లినవాఁ డగును.

తాత్పర్యము :ఇచట మఱియొక ప్రైష మంత్ర ముత్పాదిత మైనది. చమసినామ్=ఋత్విజాం, పరిచారకాః చమసాధ్వ ర్యవః. యజ్ఞమునందు యజ్వకు సహాయులైన ఋత్విజులలో మైత్రావరుణ నామకుఁడు ఒకఁడు కలఁడు. అతని సంబంధియగు పరిచారకునితో చమసాధ్వర్యుని రమ్మని అధ్వర్యుఁడు పిలువవలెను. మిత్రావరుణ దేవతలు ఉదకనేతలు. కనుక ఉదకానయనమునకై పరిచారకుని పిలుచుటచేత అధ్వర్యుఁడు ఆ మిత్రావ రుణ దేవతలతో కూడనే ఈ యుదకములను తెచ్చుటకు వెళ్లినవాఁ డగును. (ఋత్విజులయొద్ద గల పరిచారకులకు చమసాధ్వర్యులని వ్యవహారము. ఒక్కొక్క ఋత్విజునకు ఒక్కొక్క చమసాధ్వర్యుఁ డుండును.)

9. అర్థము :"దేవీరాపో అపాంనపాత్" ఇతి ఆహ="దేవతా స్వరూపులైన ఓ యుదకములారా!, ఓ యగ్నీ! మీరు మీ యలను (తరంగమును) దేవతలందు స్థాపించుఁడు," అని శ్రుతి చెప్పినది. ఆహుత్యైవ= ఆహుతిచేతనే, ఏనాః=ఈ ఉదకములను, నిష్క్రియ=నిష్క్రయణము చేసి, గృహ్ణాతి=గ్రహించవలెను. అథో=మఱియు, హవిష్కృతానామ్ ఏవ=హవిస్సుగానే చేయఁబడినవియు, అభిఘృతానామ్=అభిఘారము చేయఁబడినవియునైన, ఉదకములను, గృహ్ణాతి=గ్రహించవలెను.

తాత్పర్యము :న పాతయతి ఉదకమధ్యే గూఢతయా స్థితోఽపి తదుదకం న వినాశయతీతి నపాత్. అపాం నపాదితి వహ్నివిశేషస్య సంజ్ఞా. ఉదకముల మధ్యమందు గూఢముగ నున్నను ఆ యుదకములను నశింపఁజేయనట్టి యగ్నికి 'అపాంనపాత్' అను పేరు ఏర్పడినది. దేవతా స్వరూపులైన ఓ యుదకములారా! ఓ అపాంనపా దగ్నీ! మేము దేవతలనుద్దేశించి హోమము చేయుటకు సోమరూప హవిస్సుకొఱకు హితమైన మీ అలను

(ఊర్మి) దేవతలయందు స్థాపించుఁడు. ఈ ఆజ్యము దేవతలకొఱకు హుత మగుఁ గాక; అని దేవీ రాపః ఇత్యాది మంత్రముయొక్క భావము. కావున ఈ యుదకములను ఆహుతిచేత నిష్క్రియణము చేసి అధి ఘరింపఁబడినవియు, హవిస్సుగాఁ జేయఁబడినవియునైన ఉదకములనే గ్రహించవలెను. ఇచట సోమాభిషవ సమయమున గ్రహింపఁబడఁబోవు నుదకములకు మూల్యముగ హవిష్యమును సంపాదింపఁజేయుటకు ఈ యాహుతి ఉపయోగింపఁబడుచున్నదను విషయము చెప్పఁబడినది.

10. అర్థము : "కార్షి రసి" ఇతి ఆహ="ఓ ఆజ్యమా! నీవు (హుత మగుచు) కర్షణీయము (తొలఁగింపఁదగినదానవు) అగు చున్నావు. హోమలక్షితమైన అనిష్ట రూపమైన నిన్ను తొలఁగించుచున్నానని ఆ మంత్రముయొక్క యర్థము. అపామ్=ఈ యుదకములయొక్క, శమలమేవ=మలినాంశమునే, అపప్లావయతి=తొలఁగించవలెను. తాత్ప ర్యము అర్థమునందే వివరింపఁబడినది.

11. అర్థము : "సముద్రస్య వోఽక్షిత్యా ఉన్నయే" ఇతి ఆహ="ఓ యుదకములారా! సముద్రమునకువలె మీయొక్క అక్షీణత్వముకొఱకు (మీరు క్షీణింపకుండుటకై) పైకి ఎత్తుచున్నాను. (గ్రహించుచున్నాను.) తస్మాత్=ఆ కారణమువలన, అద్యమానాః=భక్షింపఁబడుచున్నవియు, పీయమానాః=త్రాగఁబడుచున్నవియునైన, ఆపః=ఉద కములు, న క్షీయన్తే=క్షీణించుట లేదు.

తాత్పర్యము : ఉదకములు క్షీణింపకుండుట ఇచట విశదీకరింపఁబడినది. ఓ యుదకములారా! సముద్రమువలె మీరు క్షీణింపకుండుటకై పూర్వదినమున వసతీవర్యుదకములను గ్రహించినను మఱల ఇప్పుడు గ్రహించుచున్నాను; అని "సముద్రస్య వోఽక్షిత్యై" ఇత్యాది శ్రుతి చెప్పినది. కావున త్రాగఁబడుచున్నపైనను ఉదకములు క్షీణిం చవు. చమసపాత్రముచేత జలము గ్రహింపఁబడిన విధముగనే మూఁడు కడవలతో ఏకధన సంజ్ఞకములైన యుదకములను, పన్నేజనీ సంజ్ఞకములైన ఉదకములను గ్రహింపవలయును. అప్పుడు ఉదకములు క్షీణించవని భావము.

12. అర్థము : చాత్వాలమ్=చాత్వాలము, యజ్ఞస్య=యజ్ఞమునకు, యోనిః వై=యోనియే (కారణ మైనదే). వసతీవరీః=వస తీవర్యుదకములు, యజ్ఞః= యజ్ఞ స్వరూపములు. హోతృ చమసం చ=హోతయొక్క చమస పాత్రమును మైత్రావరుణ చమసం చ=మైత్రావరుణ నామక ఋత్విక్కుయొక్క చమస పాత్రమును, సంస్పర్శ్య=బాగుగ తాఁకించి, వసతీవరీః=వసతీవర్యుదకములను, యజ్ఞస్య సయోనిత్వాయ=యజ్ఞము మూలకారణములతో కూడి యుండుటకై, వ్యానయతి=వ్యాప్తములు (అధికములు)గా చేయవలెను. అథో=అందువలన, ఏనాః=ఈ యుదకములను, స్వాత్ యోనేః ఏవ=స్వీయ యోనినుండియే, ప్ర జనయతి= అధికముగ పుట్టించినవాఁ డగును.

తాత్పర్యము : చాత్వాలము ఉత్తరవేదినిష్పాదక మగుటచే యజ్ఞయోని యగుచున్నది. వసతీవర్యుదకములు యజ్ఞాంశములుగా ద్వితీయానువాకమున వివరింపఁబడినవి. యజ్ఞమునకు యోనియైన చాత్వాల సాహిత్యముకొఱకు హోతృ చమసపాత్రమునందు వసతీవర్యుదకముల నుంచి చాత్వాలమునకు పైని హోతృ చమసమును, మైత్రావరుణ చమసమును బాగుగ తాఁకించి ఆ యుదకముల నధికముగా చేయవలెను. అనఁగా హోతృ చమసమునుండి మైత్రావరుణ చమసమునందును, మైత్రావరుణ చమసమునుండి హోతృ చమసమునందును ఆ యుదకము లను పోయవలెను. అప్పుడు యజ్ఞమునకు సయోనిత్వము సిద్ధించును. (ఇది విధి వాక్యము).

13. అర్థము : హే అధ్వర్యో!=ఓ యధ్వర్యుఁడా! (త్వమ్=నీవు, ) అపః అపేః=ఉదకములను పొందితివా?, ఇతి=అని, ఆహ=హోత అధ్వర్యు నడిగెను. ఉత ఈమన్నముః=పొందితి ననుటయే కాదు; మరేమనఁగా ఉదక ములు ఉపసంప్రాప్తము లైనవి. ఉత ఇమాః పశ్య=ఓ హోతా! నామాట చేతనే విశ్వసించ నవసరము లేదు.

మరేమనఁగా, ఈ యెదుట ఉన్న ఉదకములను చూడుము, ఇతి వావ ఏతత్ ఆహ= అని ఈ విధముగనే సర్వమంత్రముచేత అధ్వర్యుఁడు సమాధానము చెప్పెను.

తాత్పర్యము: 'అపాః' అను స్థలమున ఉన్నట్టి ప్లుతము ప్రశ్నార్థకము. ఓ అధ్వర్యూ! నీవు ఉదకములను పొందితివా? అని హోత అధ్వర్యుని ప్రశ్నించెను. "ఉతేమనన్నముః' అనునది అధ్వర్యుని సమాధాన మంత్రము. ఉత ఈమ్ అనన్నముః=పొందితినని మాత్రమే చెప్పుట కాదు. ఉదకములు ఉపసంప్రాప్తము లైనవి. దూరమందున్నను ఉదకములు సత్త్వమాత్రముచే ఉపసంప్రాప్తము లైనవి. సామాన్య లాభముకంటె అధికమైనది ఉపసంప్రాప్తి యని భావము. ఇది నేను చెప్పుటచేతనే విశ్వసించనవసరము లేదు. ఈ యెదుట ఉన్నట్టి ఉదకములను ప్రత్యక్షముగా చూడుమని అధ్వర్యుఁడు సర్వమంత్రముచేత హోతకు సమాధానము చెప్పెను. ఇవి ప్రశ్నోత్తర రూపములైన రెండు మంత్రములు.

14. అర్థము : యజ్ఞక్రతూనాం వ్యావృత్త్యై=అనుష్ఠించఁబడుచున్న అగ్నిష్టోమాదులకు పరస్పర వ్యావృత్తికై, అగ్నిష్టోమః యది= అనుష్ఠించఁబడుచున్న కర్మ అగ్నిష్టోమ మైనచో, జుహోతి="యమగ్నే పృత్సు మర్త్యమ్" ఇత్యాది మంత్రముచే క్రతుకరణ నామక హోమము చేయవలెను. ఉక్థ్యః యది=ఉక్థ్య నామక కర్మ యైనచో, పరిధౌ=పరిధి యందు, నిమార్ష్టి=ఆజ్యమును పూయవలెను. అతిరాత్రః యది=అతిరాత్ర నామక కర్మ యైనచో, యజుః వదన్="యమగ్నే పృత్సు మర్త్యమ్" అను మంత్రమును పఠించుచు, ప్రపద్యతే=హావిర్ధానమును పొందవలెను.

తాత్పర్యము : ఇచట క్రతుకరణ నామక హోమమునకు విషయ విశేష వ్యవస్థితి విధింపబడినది. అనుష్ఠించఁబడుచున్న యజ్ఞకర్మ అగ్నిష్టోమ మైనచో "యమగ్నే పృత్సు మర్త్యమ్" అను మంత్రముచే క్రతుకరణ నామక హోమము చేయవలెను. అది ఉక్థ్య నామక యజ్ఞ మైనచో పైని చెప్పఁబడిన మంత్రముచే పరిధియందు ఆజ్యమును పూయవలెను. అది అతిరాత్ర నామక యజ్ఞ మైనచో పూర్వోక్త మంత్రమునే పఠించుచు హావిర్ధానమును పొందవలెను. ఈ విధముగ చేయుటవలన అనుష్ఠింపఁబడుచున్న అగ్నిష్టోమాది యజ్ఞక్రతువులకు పరస్పర వ్యావృత్తి ఏర్పడును. 'యజ్ఞము' 'క్రతువు' అను పదములు సమానార్థకములు కనుక "క్రతూనాం వ్యావృత్త్యై" అని కాని, "యజ్ఞానాం వ్యావృత్త్యై" అని కాని మంత్రమునందున్నయెడల చాలును. కాని "స క్రతుం కుర్వీత మనోమయః ప్రాణశరీరో భారూపః" అని ఉపనిషత్తునందు ఉపాసనా పరముగ క్రతుశబ్దము వైయాసిక సూత్రమునం దుపాత్త మైనది. ఇట్లే "ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే" అని యజ్ఞశబ్దము తపోవాచకముగ ప్రయుక్త మగుటచేతను తద్వ్యావృత్తికై మంత్రమునందు 'యజ్ఞక్రతూనామ్' అని ఉపాత్త మైనది.

తృతీయానువాకము సమాప్తము.

## అథ షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే చతుర్థోఽనువాకః

మూలము : [1]దేవస్య త్వా సవితుః ప్రసవ ఇతి గ్రావాణమా దత్తే ప్రసూత్యా అశ్వినో ర్బాహుభ్యా మిత్యాహాశ్వినౌ హి దేవానా మధ్వర్యూ ఆస్తాం పూష్ణో హస్తాభ్యా మిత్యాహ యత్యై [2]పశవో వై సోమో వ్యాన ఉపాగ్ంశుసవనో యదుపాగ్ంశుసవనమభి మిమీతే వ్యానమేవ పశుషు దధాతి[3]ఇన్ద్రాయ త్వేన్ద్రాయ త్వేతి మిమీత ఇన్ద్రాయ హి సోమ ఆహ్రియతే [4]పఞ్చ కృత్వో యజుషా మిమీతే (౧) పఞ్చాక్షరా పఙ్క్తిః పాఙ్క్తో యజ్ఞో యజ్ఞమేవావ రున్ధే పఞ్చ కృత్వస్తూష్ణీం దశ సంపద్యన్తే దశాక్షరా విరాడన్నం విరాడ్విరాజైవాన్నాద్యమవ రున్ధే [5]శ్వాత్రాః స్థ వృత్రతుర ఇత్యాహైష వా అపాగ్ం సోమపీథో [6] య ఏవం వేద నాప్స్వార్తి మార్ఛతి యత్తే సోమ దివి జ్యోతిరిత్యాహైభ్య ఏవైనమ్ (౨) లోకేభ్యః సం భరతి [8]సోమో వై రాజా దిశోఽభ్యధ్యాయత్స దిశోఽను ప్రావిశ త్ప్రాగపాగుదగధరాగిత్యాహ దిగ్భ్య ఏవైనగ్ం సం భరత్యథో దిశ ఏవాస్మా అవ రున్ధే [9]అమ్బ నిష్వరేత్యాహ [10]కాముకా ఏనగ్ం స్త్రియో భవన్తి య ఏవం వేద [11]యత్తే సోమాదాభ్యం నామ జాగృవీతి (3) ఆహైష వై సోమస్య సోమపీథో [12]య ఏవం వేద న సౌమ్యా మార్తి మార్ఛతి [13]ఘ్నన్తి వా ఏతత్సోమం యదభిషుణ్వన్త్యగ్ంశూనప గృహ్ణాతి త్రాయత ఏవైనం [14]ప్రాణా వా అగ్ంశవః పశవః సోమోఽగ్ంశూ న్పునరపి సృజతి ప్రాణానేవ పశుషు దధాతి [15]ద్వౌద్వావపి సృజతి తస్మాద్ద్వౌద్వౌ ప్రాణాః (౪) (యజుషా మిమీత ఏనం జాగృవీతి చతుశ్చత్వారిగ్ంశచ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థప్రపాఠకే చతుర్థోఽనువాకః || ౪||

# వేదార్థ దీపిక

అవతారిక : శకటమునుండి సోమలతను సమీపమునకు తీసికొనుట తృతీయానువాకమునం దభిహిత మైనది. ఆ సోమము నభిషవము చేయుటకు ముందు దానిని ఉన్మానము చేయుట ఈ చతుర్థానువాకమునందు చెప్పఁబడుచున్నది. ఉన్మానము=కొలుచుట, లెక్క తూఁచుట. ప్రథమ కాండము నందలి చతుర్థ ప్రపాఠక గత ప్రథమానువాకమునకు ఇది వివరణాత్మకము.

1. అర్థము : "దేవస్య త్వా సవితుః ప్రసవే" ఇతి="ఓ పాషాణమా! సవితృ దేవుని ప్రేరణము కలుగుచుండఁగా నిన్ను తీసికొనుచున్నాను" అను ఈ మంత్రముచేత, ప్రసూత్యై=సోమాభిషవము కొఱకు, గ్రావాణమ్=పాషాణమును (రాతిని) ఆ దత్తే=తీసికొనవలెను. "అశ్వినో ర్బాహుభ్యామ్" ఇతి ఆహ="అశ్వినీ దేవతల యొక్క బాహువులచేత" అని శ్రుతి చెప్పినది. అశ్వినౌ=అశ్వినీ దేవతలు, దేవానామ్=దేవతలకు, అధ్వర్యూ= అధ్వర్యులుగా, ఆస్తాం హి=ఉండిరి కదా! యత్యై=నియతికొఱకు, "పూష్ణో హస్తాభ్యామ్" ఇతి ఆహ='పూషదేవునియొక్క హస్తములచేత' అని మంత్రము చెప్పెను.

తాత్పర్యము: సోమయాగమునందు సోమలతను నలఁగఁగొట్టి దాని నుండి రసమును తీసి ఆ రసమును హోమాదుల కుపయోగింతురు. అందుకై సోమలతను శకటముపై నుంచి యజ్ఞశాలయొద్దకు తెచ్చి దానిని క్రిందికి దింపి తీసికొనుట వఱకుఁగల ప్రక్రియ పూర్వానువాకములందు వివరింపఁబడినది. ఆ సోమలతను నలఁగఁగొట్టుటకు సాధనముగా పాషాణమును చేతులలోనికి తీసికొనవలెను. ఆ పాషాణమును హస్తములలోనికి తీసికొను సమయమున "దేవస్య త్వా సవితుః ప్రసవే" ఇత్యాది మంత్రమును అధ్వర్యుఁడు పఠించవలెను. సవితృ దేవుని ప్రేరణము కలుగుచుండఁగా అశ్వినీ దేవతల బాహువులతోడను, పూష దేవుని హస్తముల తోడను ఆ పాషాణమును తీసికొనుచున్నానని ఆ మంత్రము యొక్క అర్థము. అనఁగా అశ్విని దేవతలు దేవతలకు అధ్వర్యులు కావున అధ్వర్యుఁడు తన బాహువులను అట్టి అశ్వినీ దేవతల బాహువులుగాను, తన హస్తములను పూషదేవుని హస్తములుగాను భావించుకొని పాషాణమును తీసికొనుచున్నాఁడని భావము. మఱియు పూషదేవుని హస్తములుగా భావించుటచేత పాషాణమును దృఢముగా పట్టుకొనుటకు వీలు కలుగునని వ్యక్తమగుచున్నది. (ఇచట పాషాణ గ్రహణము విహిత మైనది. అధ్వర్యుఁడు తన బాహువులకు హస్తములకు పవిత్రత నాపాదించుకొనుటకై అశ్వినుల బాహువులుగాను, పూషదేవుని హస్తములుగాను ఆరోపించుకొనెను.)

2. అర్థము: సోమః=సోమము, పశవః వై=(పశుప్రాప్తి హేతు వగుటచే) పశు స్వరూపమే. ఉపాంశు సవనః=ఉపాంశు గ్రహము నిమిత్తము సోమమును నలఁగఁజేయునట్టి పాషాణము, వ్యానః=వ్యాన వాయు స్వరూపము. ఉపాంశు సవనమ్ అభి=ఉపాంశు సవనము నభిలక్షించి, మిమీతే యత్=సోమమును కొలుచుచో, పశుషు=పశువులందు, వ్యానమ్ ఏవ=వ్యాన వాయువునే, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: సోమము పశు ప్రాప్తి హేతు వగుటచే పశువులుగా నారోపించఁబడినది. "ప్రాణాపానౌ వా ఏతౌ యదు పాంశ్వన్తర్యామౌ వ్యాన ఉపాంశు సవనః" అని శ్రుతి. ఈ శ్రుతియందు ఉపాంశుగ్రహము ప్రాణముగాను, అంతర్యామగ్రహము అపానముగాను, ఉపాంశుసవనము వ్యానముగాను నారోపింపఁబడినవి. కనుక ఈ మంత్రమునందు ఉపాంశుసవనము (సోమాభిషవ సాధన పాషాణము) వ్యానముగా నారోపించఁబడినది. అధ్వర్యుఁడు ఉపాంశుసవనము నభిలక్షించి సోమమును ఉన్మానము (కొలుచుట) చేయువలెను. ఇట్లు చేసిన యధ్వర్యుఁడు పశువులయందు వ్యానమునే స్థాపించినవాఁ డగును. ఇది సోమోన్మాన విధి వాక్యము.

3. అర్థము: "ఇన్ద్రాయ త్వేన్ద్రాయ త్వా" ఇతి మిమీతే="ఓ సోమమా! నిన్ను ఇంద్రునికొఱకు నిన్ను ఇంద్రునికొఱకు గ్రహించుచున్నాను" అనెడి ఈ మంత్రము నుచ్చరించుచు ఉన్మానము చేయువలెను. సోమః=సోమము, ఇన్ద్రాయ=ఇంద్రునికొఱకు, అహ్రియతే హి=గ్రహించఁబడుచున్నది కదా!

తాత్పర్యము: సోమయాగమునకు సంబంధించిన దేవతలలో ఇంద్రునకు ప్రాధాన్యమును "ఇన్ద్రాయ త్వా" ఇత్యాది సర్వ మంత్రములందలి ఇంద్ర శబ్ద ప్రయోగము సూచించుచున్నది. ఇంద్రునికొఱకు సోమము గ్రహించఁబడుచున్నది. కనుక "ఇన్ద్రాయ త్వే న్ద్రాయ త్వా" అను మంత్రము నుచ్చరించుచు సోమోన్మానము చేయవలెను. "ఇన్ద్రాయ త్వా" ఇత్యాది సర్వమంత్రములందలి ఇంద్ర శబ్ద ప్రయోగముయొక్క తాత్పర్య మిచట చెప్పఁబడినది.

4. అర్థము: యజుషా=మంత్రముచే, పఞ్చకృత్వః=అయిదు పర్యాయములు, మిమీతే=ఉన్మానము చేయవలెను. పఙ్క్తిః=పంక్తి ఛ్ఛందస్సు, పఞ్చాక్షరా=అయిదు అక్షరములు కలది. యజ్ఞః=యజ్ఞము, పాఙ్క్తః=పంచ ద్రవ్య సాధ్య మైనది. (ఏవం సతి=ఇట్లు కాఁగా, యజమానః= యజమానుఁడు) యజ్ఞమ్=యజ్ఞమును, అవ రున్ద్ధే ఏవ=తప్పక పొందును. పఞ్చకృత్వః= అయిదు పర్యాయములు, తూష్ణీమ్=మంత్రరహిత ముగ, మిమీతే=ఉన్మానము చేయవలెను. దశ సంపద్యన్తే=మొత్తము పది పర్యాయములు అగుచున్నవి. విరాట్=విరాట్ఛందస్సు, దశాక్షరా=పది అక్షరములు కలది. విరాట్= విరాట్ఛందస్సు, అన్నమ్=అన్న స్వరూపము. (ఏవం సతి=ఇట్లు కాఁగా,) విరాజైవ=విరాట్ఛందస్సుచేతనే, (యజ్వా=యాగ కర్త,) అన్నా ద్యమ్=శ్రేష్ఠమైన యన్నమును, అవ రున్ద్ధే=పొందును.

తాత్పర్యము: మంత్రోచ్చారణము చేయుచు అయిదు పర్యాయములు సోమమును తూఁచవలెను. పంక్తి ఛ్ఛందస్సు అయి దక్షరములు కలది. యజ్ఞము పంచద్రవ్య సాధ్య మైనది. ఇట్లు చేయుటవలన యజ్వ యజ్ఞ ఫలమును పొందును. పిమ్మట మంత్రోచ్చారణము లేకుండ అయిదు పర్యాయములు సోమమును తూఁచవలెను. ఈ విధముగ చేయుటచే సోమోన్మానము పది పర్యాయములు చేసిన ట్లగును. విరాట్ ఛందస్సు పది యక్షరములు కలది. విరాట్ఛందస్సు అన్నప్రాప్తి హేతు వగుటచే అన్న స్వరూప మగుచున్నది. అప్పుడు యజమానుఁడు శ్రేష్ఠమైన అన్నమును పొందును. ఇచట దశవారము సోమోన్మానము చేయవలయునని సోమోన్మాన దశవార విధి చెప్పఁబడినది.

5. అర్థము: "శ్వాత్రాః స్థ వృత్రతురః" ఇతి ఆహ="ఓ ఉదకములారా! మీరు శీఘ్రముగ చేయువారు. వృత్రాసురుని సంహరించినవారు. అట్టి మీరు అనుజ్ఞాతులై సోమముయొక్క అంశమును త్రాగుఁడు" అని ఈ మంత్రము చెప్పినది. ఏషః వై=ఇదియే, అపామ్=అబ్దేవతలయొక్క, సోమపీథః= సోమపానము.

తాత్పర్యము: "ఉపహూతాః సోమస్య పిబత" ఇత్యాది మంత్రముయొక్క అభిప్రాయమును ఈ బ్రాహ్మణ వాక్యము వివ రించుచున్నది. "ఓ యుదకములారా! మీరు శీఘ్రముగ చేయువారును, వృత్రుని సంహరించినవారును, అన్నమును సంపాదించుటకై ఉద్యతులును, సోమమును పాలించువారు నగుచున్నారు. అటువంటి మీరు దేవతారూపులై దేవతలయందు మా యీ యజ్ఞమును స్థాపించుఁడు. మఱియు అనుజ్ఞాతులై సోమము యొక్క అంశమును త్రావుడు. సోమము కూడ అనుజ్ఞాతమై మీయంశమును త్రావుఁ గాక" అని ఈ సర్వమంత్రముయొక్క తాత్పర్యము. ఇదియే అబ్దేవతలు చేయునట్టి సోమపానము.

6. అర్థము: యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, వేద=తెలిసికొనునో, (సః=అతఁడు,) అప్సు=ఉద కములందు, ఆర్తిమ్=బాధను, (మరణమును), న ఋచ్ఛతి=పొందఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్త విధమును తెలిసికొనిన యతఁడు నీటియందు మరణమును పొందఁడు.

7. అర్థము: "యత్తే సోమ దివి జ్యోతిః" ఇతి ఆహ="ఓ సోమమా! నీకు ద్యులోకమునందు ఏ తేజస్సు కలదో, ఆ తేజస్సుచే ఈ యజమానునికై ధనముచే విస్తీర్ణమైన స్థానమును కల్పించుము. మఱియు ఈ యజ మానుఁడు భక్తిచేత అధికుఁడని ఫల ప్రదాతయగు నింద్రునితో చెప్పుము." అని ఈ మంత్రము చెప్పినది. ఏభ్యః లోకేభ్యః ఏవ= ఈ ముల్లోకముల చేతనే, (తృతీయార్థే చతుర్థీ) ఏనమ్=ఈ సోమమును, సంభరతి= బాగుగ పోషించుచున్నాఁడు.

తాత్పర్యము: "యత్తే సోమ దివి" అను మంత్రమునందలి దివీత్యాదికముయొక్క తాత్పర్యము ఇచట వివరించఁబడినది. ఈ విధముగ చెప్పుటచే ఈ ముల్లోకములచేత ఈ సోమమును పోషించుచున్న ట్లగుచున్నది.

8. అర్థము: సోమః రాజా=ఓషధులకు రాజైన సోమము దిశః అభి= దిక్కుల నభిలక్షించి, అధ్యాయత్ వై=ధ్యానించెనఁట! సః=ఆ సోమము, దిశః అను=దిక్కుల ననుసరించి, ప్రావిశత్=ప్రవేశించెను. "ప్రాగపాగుదగధరాక్ ఇతి ఆహ=ఓ సోమమా! ప్రాగాది దిశలు నిన్నుఁగూర్చి అభిముఖముగ పరుగెత్తుఁగాక" అని ఈ "ప్రాగపాగుదగధరాక్" ఇత్యాది మంత్రము చెప్పెను. దిగ్భ్యః ఏవ= దిక్కులకొఱకే, ఏనమ్=ఈ సోమమును, సంభరతి=బాగుగ పోషించవలెను. అథో=అందువలన, దిశః=దిక్కులను, అస్మై=ఈ యజమానునికొఱకు, అవ రున్ద్ధే ఏవ=తప్పక పొందును.

తాత్పర్యము: ఓషధులలో సోమము రాజు. ఆ సోమము దిక్కులను గుఱించి ధ్యానించి అనంతర మా దిక్కులలో ప్రవేశించెను. "ఓ సోమమా! ప్రాగాది దిక్కులు నీ కభిముఖముగ పరుగెత్తి వచ్చుఁగాక" అని వేదము చెప్పినది. దిక్కులకొఱకే ఈ సోమమును పోషించవలెను. అందుఁవలన అధ్వర్యుఁడు ఈ యజమానునికొఱకు దిక్కులను తప్పక పొందును. ప్రాగాది దిక్కులు సోమమును గూర్చి పరుగెత్తి వచ్చుఁగాక యని చెప్పిన మంత్రముయొక్క తాత్పర్య మిచట వివరించఁబడినది.

9. అర్థము: "అమ్బ నిష్వర" ఇతి ఆహ="మాతృస్థానీయుమైన ఓ సోమమా! నీ యంశువులనుండి రసరూపమున బయలువెడలుము", అని ఈ మంత్రము చెప్పెను.

తాత్పర్యము: ఇచట సోమము అంబ శబ్దముచే సంబోధింపఁబడినది. 'మాతః' 'అమ్బ' ఇత్యాది శబ్దములు ఉపలాలనముకొఱకు ప్రయోగింపఁబడుచుండును. కావున ఇచట అమ్బ శబ్ద ప్రయోగముచేత ధ్యానవిధి సూచిత మగుచున్నది.

10. అర్థము: యః=ఏ పురుషుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్తవిధముగ, వేద=తెలిసికొనునో, ఏనమ్=ఇతనిని గూర్చి, స్త్రియః= స్త్రీలు, కాముకాః=కోరిక గలవారు, భవన్తి=అగుదురు.

తాత్పర్యము: ఈ పూర్వోక్తవిధముగ తెలిసికొనిన వానిని స్త్రీలు అపేక్షింతురు. ఇచట వేదనము ప్రశంసింపఁబడినది.

11. అర్థము: "యత్తే సోమాదాభ్యం నామ జాగృవి" ఇతి ఆహ="ఓ సోమమా! శత్రువులచే తిరస్కరింప సాధ్యము కానట్టి ఏ పేరు నీకు జాగరూకమై యున్నదో, అట్టి నామధేయమును ధరించిన నీకొఱకు ఈ సోమాంశుద్వయము హుత మగుఁగాక". ఏషః వై=ఇదియే, సోమస్య=సోమముయొక్క, సోమపీథః=సోమపానము.

తాత్పర్యము: సోమమును నలఁగఁగొట్టుటకై ఒక ఱాతిపైని సోమము నుంచి మఱియొక ఱాతితో నలఁగఁగొట్టుదురు. ఆ సోమము నుంచిన అధోభాగమున ఉన్నట్టి ఱాతిని ఉపర మందురు. ఉపాంశుగ్రహమునకు సరిపోవునంతటి సోమమును ఉపరమందు ఉంచి దానిని వసతీవర్యుదకములచే తడుపఁబడిన ఆ సోమమునుండి ఆఱు అంశువులను విడివిడిగా చర్మమునం దుంచవలెను. జ్యోతిష్టోమయాగమునందలి మూఁడు సవనములందును మహాభిషవమునందు ఆ ఆఱు అంశములలో రెండేసి అంశువులను ఉంచుచు ఈ మంత్రమును పఠించవలెను. అగ్నియందు హోమము చేయకయే పూర్వము ఉదకములకు సోమపానము చెప్పఁబడిన విధముగనే, ఈ మంత్రముచేత అంశుద్వయ ప్రక్షేపము సోమమునకు సోమపానముగా ఇచట చెప్పఁబడినది. "యత్తే సోమ" ఇత్యాది మంత్రమునందలి 'సోమాయ' అను పదప్రయోగమునకు తాత్పర్య మిచట వివరింపఁబడినది.

12. అర్థము: యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, వేద=తెలిసికొనునో, (సః=అతఁడు,) సౌమ్యామ్ ఆర్తిమ్=సోమయాగ వినాశమును, నార్ఛతి=పొందఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్తవిధముగ తెలిసికొనిన సోమయాగ కర్త సోమయాగ వినాశము నొందఁడు. (ఇచట సోమపాన వేదనము ప్రశంసింపఁబడినది.)

13. అర్థము: అంశూన్=సోమముయొక్క అంశువులను, అభిషుణ్వన్తి యత్=అభిషవము (నలఁగఁగొట్టుట) చేయుచో, ఏత త్సోమమ్=ఈ సోమమును, ఘ్నన్తి వై=నశింపఁజేసినవారే యగుదురు. (అతః=ఈ కారణమువలన) అంశూన్=అంశువులను, అప గృహ్ణాతి=(సోమ సంఘాతమునుండి) తొలఁగించవలెను. (తదా=అప్పుడు) ఏనమ్=ఈ సోమమును, త్రాయతే ఏవ= అభిషవ రూపమైన ఘాతమునుండి రక్షించినవాఁడే యగును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు సోమము నభిషవము చేయునపుడు అంశువులను వేఱుచేయవలెను. వేఱుచేయక అంశువులను కూడ అభిషవము చేసినచో సోమమును నశింపఁజేసినవాఁ డగును. వేఱుచేసినచో అభిషవరూపమైన ఘాతమునుండి ఈ సోమమును రక్షించినవాఁ డగును.

14. అర్థము: అంశవః=అంశువులు, ప్రాణాః వై=ప్రాణ రూపములే. సోమః=సోమము, పశవః=పశుస్వరూపము (పశు స్థానీయ మైనది). అంశూ= రెండు అంశువులను, పునః అపి=మఱల, సృజతి=(మహాభిషవమునందు) సోమ సంఘాతముతో కలుపవలెను. (ఏవం సతి=ఇట్లు కాఁగా,) పశుషు= పశువులయందు, ప్రాణానేవ=ప్రాణములనే, దధాతి=స్థాపించినవాఁడగును.

తాత్పర్యము: సోమముయొక్క అంశువులు ప్రాణములవంటివి. సోమము పశువుల వంటిది. మహాభిషవ సమయము నందు అంశువులను సోమముతో కలుపవలెను. ఇట్లు చేసినచో అధ్వర్యుఁడు పశువులయందు ప్రాణములనే స్థాపించినవాఁ డగును. ఇచట మహాభిషవమునందు అంశు సంసర్గము చేయవలెనని చెప్పఁబడినది.

15. అర్థము: ద్వౌ ద్వౌ అపి=రెండు రెండు అంశువులను కూడ, సృజతి=కలుపవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ద్వౌ ద్వౌ ప్రాణాః= ప్రాణములు ప్రత్యేకముగ రెండు రెండుగా, (భూత్వా=అయి, తత్తచ్ఛిద్రేషు=ఆ యా ఛిద్రములందు, వర్తన్తే=ఉంటున్నవి.)

తాత్పర్యము: మూఁడు సవనములందును రెండు రెండు అంశువులను సోమ సంఘాతముతో కలిపి అభిషవము చేయవలెను. కనుకనే చక్షు శ్శోత్ర ఘ్రాణేంద్రియ రూపములైన ప్రాణములు ప్రత్యేకముగ రెండు రెండుగా అయి ఆ యా ఛిద్రములందు వర్తించుచున్నవి. ఇచట మూఁడు సవనములందు ప్రత్యేకముగ అంశు సంసర్గము విధించఁబడినది.

చతుర్థానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే చతుర్థప్రపాఠకే పఞ్చమోఽనువాకః

మూలము: [1] ప్రాణో వా ఏష యదుపాగ్ంశుర్యదుపాగ్ంశ్వగ్రా గ్రహా గృహ్యన్తే ప్రాణమేవాను ప్ర యన్త్య [2] రుణో హ స్మా ఽఽగహౌపవేశిః ప్రాతఃసవన ఏవాహం యజ్ఞగ్ం సగ్ంస్థాపయామి తేన తతః సగ్ంస్థితేన చరామీత్యష్టౌ కృత్వోఽగ్రేఽభి షుణోత్యష్టాక్షరా గాయత్రీ గాయత్రం ప్రాతఃసవనం ప్రాతఃసవన మేవ తేనాఽఽప్నోత్యేకాదశ కృత్వో ద్వితీయ మేకాదశాక్షరా త్రిష్టుప్త్రైష్టుభం మాధ్యందినం (౧) సవనం మాధ్యం దినమేవ సవనం తేనా ఽఽప్నోతి ద్వాదశ కృత్వస్తృతీయం ద్వాదశాక్షరా జగతీ జాగతం తృతీయసవనం తృతీయసవనమేవ తేనాఽఽప్నోత్యే తాగ్ంహ వావ స యజ్ఞస్య సగ్ంస్థితి మువాచాస్కన్దాయాస్కన్నగ్ంహి తద్యద్యజ్ఞస్య సగ్ంస్థితస్య స్కన్ద [3] త్యథో ఖల్వాహు ర్గాయత్రీ వావ ప్రాతఃసవనే నాతివాద ఇత్యనతివాదుక ఏనం భ్రాతృవ్యో భవతి య ఏవం వేద తస్మా దష్టావష్టౌ(౨) కృత్వోఽభిషుత్యం [4] బ్రహ్మవాదినో వదన్తి పవిత్రవన్తోఽన్యే గ్రహా గృహ్యన్తే కింపవిత్ర ఉపాగ్ంశురితి వాక్పవిత్ర ఇతి బ్రూయా ద్వాచస్పతయే పవస్వ వాజిన్నిత్యాహ వాచైవైనం పవ యతి [5] వృష్ణో అగ్ంశుభ్యా మిత్యాహ వృష్ణో హ్యేతావగ్ంశూ యౌ సోమస్య గభస్తిపూత ఇత్యాహ గభస్తినా హ్యేనం పవయతి దేవో దేవానాం పవిత్రమసీత్యాహ దేవో హ్యేషః(౩) సన్దేవానాం పవిత్రం యేషాం భాగోఽసి తేభ్య స్త్వేత్యాహ యేషాగ్ంహ్యేష భాగస్తేభ్య ఏనం గృహ్ణాతి [6] స్వాంకృతోఽసీత్యాహ ప్రాణమేవ స్వమకృత మధుమతీర్న ఇషస్కృధీత్యాహ సర్వమేవాస్మా ఇదగ్ం స్వదయతి విశ్వేభ్య స్త్వేన్ద్రియేభ్యో దివ్యేభ్యః పార్థివేభ్య ఇత్యాహోభయేష్వేవ దేవమనుష్యేషు ప్రాణాన్దధాతి [7] మనస్త్వా (౪)అష్టిత్యాహ మన ఏవాశ్నుత ఉర్వన్తరిక్ష మన్విహీత్యాహాన్తరిక్షదేవత్యో హి ప్రాణః స్వాహా త్వా సుభవః సూర్యాయేత్యాహ ప్రాణా వై స్వభవసో దేవా స్తేష్వేవ పరోక్షం జుహోతి

దేవేభ్యస్త్వా మరీచిపేభ్య ఇత్యాహాఽఽదిత్యస్య వై రశ్మయో దేవా మరీచిపా స్తేషాం తద్భాగధేయం తానేవ తేన ప్రీణాతి [8]యది కామయేత వర్షుకః పర్జన్యః (౫) స్యాదితి నీచా హస్తేన ని మృజ్యాద్వృష్టి మేవ ని యచ్ఛతి యది కామయేతావర్షుకః స్యాదిత్యుత్తానేన ని మృజ్యాద్వృష్టి మేవోద్యచ్ఛతి [9]యద్యభిచరేదముం జహ్యథ త్వా హోష్యామీతి బ్రూయా దాహుతి మేవైనం ప్రేప్సన్హన్తి [10]యది దూరే స్యాదా తమితోస్తిష్ఠే త్ప్రాణ మేవాస్యానుగత్య హన్తి [11]యద్యభిచరే దముష్య (౫) త్వా ప్రాణే సాదయామీతి సాదయే దసన్నో వై ప్రాణః ప్రాణ మేవాస్య సాదయతి [12]షడ్భి రగ్ంశుభిః పవయతి షడ్వా ఋతవ ఋతుభిరేవైనం పవయతి [13]త్రిః పవయతి త్రయ ఇమే లోకా ఏభి రేవైనం లోకైః పవయతి [14]బ్రహ్మవాదినో వదన్తి కస్మాత్సత్యాత్త్రయః పశూనాగ్ం హస్తాదానా ఇతి యత్త్రిరుపాగ్ంశుగ్ం హస్తేన విగృహ్ణాతి తస్మాత్త్రయః పశూనాగ్ం హస్తాదానాః పురుషో హస్తీ మర్కటః(౬)||

(మాధ్యందిన మష్టావష్టావేష మనస్త్వా పర్జన్యోఽముష్య పురుషో ద్వే చ|

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః || ౫ ||

## వేదార్థదీపిక

అవతారిక: చతుర్థానువాకమునందు సోమోన్మానమును గురించి వివరించఁబడినది. ఆ సోమమునుండి రసమును తీసి ఆ రసమును కొన్ని పాత్రములం దుంచి ఆ యా దేవతల కర్పించుటకై ఆ పాత్రములను ప్రత్యేక స్థానములం దుంచుదురు. ఆ పాత్రములకే గ్రహములని యాజ్ఞిక (వైదిక) వ్యవహారము. ఆ గ్రహములలో 'ఉపాంశు' నామక గ్రహమును గూర్చి ఈ యనువాకమునందు వివరించఁబడినది. ప్రథమ కాండస్థ చతుర్థ ప్రపాఠకమునందలి ద్వితీయానువాక మంత్రముల కీ యనువాకము వివరణాత్మకము.

1. మంత్రము: ఉపాంశుః యత్='ఉపాంశు' నామక గ్రహము ఏది కలదో, ఏషః=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, ప్రాణః వై=ప్రాణ స్థానీయమే. ఉపాంశ్వగ్రాః గ్రహాః=ఉపాంశు గ్రహము ప్రథమమునఁగల గ్రహములు, గృహ్యన్తే యత్=గ్రహింపఁబడినచో, ప్రాణమ్ ఏవ అను=ప్రాణము ననుసరించియే, ప్రయన్తి=అపాన వాగాది స్థానీయములైన అంతర్యామాది గ్రహములు గ్రహించఁబడును.

తాత్పర్యము: సోమరసమును ఉంచుట కాధారములైన ఉపాంశ్వాది గ్రహములలో ఉపాంశు గ్రహము యజ్ఞమునకు ప్రాణ స్థానీయ మైనది. కనుక సోమరసము నుంచుటకై ప్రథమమున ఉపాంశు గ్రహమును గ్రహించవలెను. అప్పుడు ప్రాణము ననుసరించియే యితరములు గ్రహించఁబడిన వగును. ఇచట ఉపాంశు గ్రహణ విధి చెప్పఁబడినది.

2. అర్థము: ప్రాతఃసవనే ఏవ=ప్రాతస్సవనమునందే, అహమ్=నేను, యజ్ఞమ్=యజ్ఞమును, సంస్థాపయామి=సమాప్తి చేయుచున్నాను. తేన సంస్థితేన=ఆ సమాప్తిచేత, తతః=దానివలన, చరామి=ఆచరించుచున్నాను, ఇతి=అని, అరుణః=అరుణ నామకుఁడైన, ఔపవేశిః=ఉపవేశుని పుత్రుఁడు, ఆహ స్మ హ=చెప్పెనఁట!. అగ్రే=ప్రథమ మున, అష్టౌ కృత్వః= ఎనిమిది మారులు, అభిషుణోతి=సోమము నభిషవము చేయవలెను. గాయత్రీ= గాయత్రీ చ్ఛందస్సు, అష్టాక్షరా=ఎనిమిది అక్షరములు కలది. ప్రాతఃసవనమ్= ప్రాతస్సవనము, గాయత్రమ్=గాయత్రీ చ్ఛందోమంత్రముచే ప్రయోక్తవ్య మైనది. తేన= ఆ యెనిమిది మారులు అభిషవము చేయుటచే, యజ మానః=యజమానుఁడు, ప్రాతఃసవనమేవ=ప్రాతస్సవనమునే, ఆప్నోతి=పొందును.

ద్వితీయమ్=ద్వితీయ పర్యాయము, ఏకాదశ కృత్వః=పదునొకండు మారులు, అభిషుణోతి=అభిషవము చేయ వలెను. త్రిష్టుప్=త్రిష్టుప్ ఛందస్సు, ఏకాదశాక్షరా=పదునొకండు అక్షరములు కలది. మాధ్యం దినం సవ నమ్=మాధ్యందిన (ద్వితీయ) సవనము, త్రైష్టుభమ్=త్రిష్టుప్ ఛందోమంత్ర ప్రయోక్తవ్య మైనది. తేన=ఆ పదునొకండు మారు లభిషవము చేయుటచే, మాధ్యందినం సవనమ్ ఏవ=మాధ్యందిన సవనమునే, ఆప్నోతి=పొందును. తృతీయమ్=తృతీయ పర్యాయము, ద్వాదశ కృత్వః=పంద్రెండు మారులు, అభిషు ణోతి=అభిషవము చేయవలెను. జగతీ=జగతీ చ్ఛందస్సు, ద్వాదశాక్షరా=పంద్రెండు అక్షరములు కలది. తృతీయసవనమ్=తృతీయసవనము, జాగతమ్=జగతీ చ్ఛందోమంత్ర ప్రయోక్తవ్య మైనది. తేన=ఆ పంద్రెండు మారులు సోమాభిషవము చేయుటచే, తృతీయసవనమ్ ఏవ=తృతీయసవనమునే, ఆప్నోతి=పొందును. సః=ఉప వేశుని పుత్రుఁడైన ఆ యరుణుఁడు, సంస్థితస్య యజ్ఞస్య=సమాప్తమైన యజ్ఞమునకు, ఏతాం వావ=యథోక్త త్రివిధ రూపమైన అభిషవమునే, ఉవాచ హ=చెప్పెనఁట! (ఏతత్=ఇది,) స్కన్నాయ= వినాశాభావ ముకొఱకు, (సంపద్యతే=సంపన్నమగుచున్నది.) సంస్థితస్య యజ్ఞస్య= సమాప్తమైన యజ్ఞమునకు సంబంధిం చిన, యత్=ఏ వస్తువు, స్కన్దతి= నశించుచున్నదో, తత్=అది, అస్కన్నం హి=నశించనిదియే యగుచున్నది కదా!

తాత్పర్యము: సోమయాగమునందు గల ప్రాతస్సవనమునందు, పైని చెప్పఁబడిన విధముగ సోమము నభిషవము చేయవలెను. ఈ విధముగ నభిషవము చేసిన యజమానుఁడు ప్రాతస్సవనాది కర్మలను యథావిధిగ ననుష్ఠించినవాఁ డగును. ప్రాతస్సవన కర్మానుష్ఠానము ఎనిమిది అక్షరములు గల గాయత్రీమంత్రముచే చేయఁబడును. కనుక అక్షర సంఖ్యా సామ్యముచే అభిషవము ఎనిమిది మారులు చేయవలెను. మాధ్యందిన సవన కర్మానుష్ఠానము త్రిష్టుప్ ఛందోమంత్రముచే చేయఁబడును. త్రిష్టుప్పు పదునొకండు అక్షరములు కలది. కనుక అక్షర సంఖ్యా సామ్యముచే ద్వితీయ భాగమును పదునొకండు మారులు అభిషవము చేయవలెను. తృతీయ సవనమున పంద్రెండు అక్షరములు గల జగతీ చ్ఛందోమంత్రముచే కర్మానుష్ఠానము చేయఁబడును. కనుక అక్షర సంఖ్యా సామ్యముచే పంద్రెండు మారులు అభిషవము చేయవలెను. అరుణుఁడు ఈ విధముగనే చెప్పెనఁట! ఇట్లు చేయుటవలన సమాప్త యజ్ఞ సంబంధి వస్తువు ఏదియైన నశించినను అది నశించనట్లే యగును. ఇచట మూఁడు పర్యాయములందు విలక్షణ సంఖ్యా విశిష్టమైన అభిషవము విహిత మైనది.

3. అర్థము: అథో=మఱియు, గాయత్రీ వావ=గాయత్రియే, ప్రాతఃసవనే=ప్రాతస్సవనమునందు, (వర్తతే=అభిమాని దేవతగా ఉంటున్నది.) అతివాదే=అతివాదమున, న=వర్తించుట లేదు. ఇతి=అని, ఆహుః ఖలు=మంత్రజ్ఞులు చెప్పుచు న్నారు కదా! యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, వేద=తెలిసికొనునో, ఏనమ్=ఈ

యజమానుని గూర్చి, భ్రాతృవ్యః=శత్రువు, అనతివాదుకః భవతి=అనిందకుఁ డగును. (నిందకుఁడు కాఁడు). **తస్మాత్**=గాయత్రి ప్రాతస్సవనాభిమానిదేవత కావున, **అష్టౌ అష్టౌ** కృత్వః=ఎనిమిది ఎనిమిది మారులే, **అభిషుత్యమ్**=సోమము అభిషవము చేయఁదగినది.

తాత్పర్యము: మఱియు గాయత్రియే ప్రాతస్సవనమునం దుంటున్నది. అతివాదము నం దుండుటలేదని అభిజ్ఞులు చెప్పు చున్నారు. అతివాద మనఁగా అధికాక్షరములు కలదిగా పఠింపఁబడుట. గాయత్రి ఛ్ఛందస్సు ఎనిమిది అక్షరములు కలదియే కావున త్రిష్టుభాది ఛందస్సులవలె అధికాక్షరములు కలది కాదు. కనుక ఈ యతివా దము గాయత్రియందు లేదు. ప్రాతస్సవనమునందు ఇతర ఛందో మంత్రములు పఠించఁబడినను గాయత్రియే ప్రాతస్సవనాభిమాని దేవత కనుక ఆ గాయత్ర్యక్షర సంఖ్యచేతనే ప్రాతస్సవనము నందు మూఁడు పర్యాయ ములందును ఎనిమిదేసి మారులు సోమము నభిషవము చేయవలెను. ఈ విధముగ తెలిసికొనిన యజమానుని శత్రువు నిందించఁడు. ఇచట ప్రాతస్సవనమునందు మూఁడు పర్యాయములందును సోమాభిషవమునకు అష్ట సంఖ్యయే యను షక్షాంతరము విహితమైనది.

4. అర్థము: అన్యే గ్రహాః=ఉపాంశు గ్రహ భిన్నములైన గ్రహములు, పవిత్రవన్తః=(దశాపవిత్ర నామక వస్త్రముచే) శోధి తములై, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవి. ఉపాంశుః=ఉపాంశు గ్రహము, కింపవిత్రః=ఏది శోధకముగాఁ గలది? ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=ప్రశ్నించుచున్నారు. వాక్పవిత్రః ఇతి=మంత్రమే శోధకముగాఁ గల దని, బ్రూయాత్=సమాధానము చెప్పవలెను. "వాచస్పతయే పవస్వ వాజిన్" ఇతి ఆహ="అన్నము నొసఁగునట్టి సోమమా! నీవు పాలకుఁడైన దేవునికొఱకు, వాక్కునకు సంబంధించిన మంత్ర ముచే పవిత్రము కమ్ము" అని "వాచస్పతయే" ఇత్యాది మంత్రము చెప్పినది. (తత్=ఆ కారణము వలన, యజమానః=యజమానుఁడు), ఏనమ్=ఈ యుపాంశు గ్రహమును, వాచైవ=మంత్రము చేతనే, పవయతి=పవిత్రము చేయుచున్నాఁడు.

తాత్పర్యము: ఉపాంశు గ్రహ వ్యతిరిక్తములైన గ్రహములు దశాపవిత్ర నామక వస్త్రముచే శోధితములై గ్రహించఁబడుచున్నవి. ఉపాంశు గ్రహమునకు శోధకము ఏది? అని మంత్రజ్ఞులు ప్రశ్నించుచున్నారు. ఉపాంశు గ్రహమునకు మంత్రమే శోధకమని ఈ ప్రశ్నకు సమాధానము చెప్పవలెను. కనుకనే "వాచస్పతయే పవస్వ వాజిన్"=అన్నము నొసఁగునట్టి ఓ సోమమా! పాలించునట్టి దేవునికొఱకు వాక్సంబంధియగు మంత్రముచే పవిత్రము కమ్ము." అని వేదము చెప్పినది. కనుక యజమానుఁడు ఈ యుపాంశు గ్రహమును మంత్రముచేతనే పవిత్రము చేయుచున్నాఁడు. ఇచట "వాచస్పతయే" ఇత్యాది మంత్రముయొక్క పూర్వభాగమునందలి "వాచః" అను శబ్దముయొక్క తాత్పర్యము చెప్పఁబడినది.

5. అర్థము: "వృష్ణో అగ్ంశుభ్యామ్" ఇతి ఆహ= "రసమును వర్షించునట్టి సోమముయొక్క అంశువులచేత" అని ఈ మంత్రభాగము చెప్పినది. యౌ=ఏ అంశువులు, సోమస్య=సోమమునకు సంబంధించినవియో, ఏతౌ=ఇవి, వృష్ణః అంశూ హి=రసమును వర్షించునట్టి సోమముయొక్క అంశువులు కదా! "గభస్తిపూతః" ఇతి ఆహ="పూర్వము అరణ్యమునందు సోమము (సోమలత) సూర్య కిరణముల స్పర్శచే పవిత్రమైనది" అని ఈ మంత్ర భాగము చెప్పినది. గభస్తినా= సూర్యకిరణముచే, ఏనమ్=ఈ సోమమును, పవయతి హి=పవిత్రము చేయును కదా! "దేవో దేవానాం పవిత్ర మసి" ఇతి ఆహ="ఓ సోమమా! నీవు కూడ దేవుఁడ వగుచు ( సోమపానము చేయు) దేవతలకు శుద్ధి హేతు వగుచున్నావు" అని యీ మంత్ర భాగము చెప్పినది. ఏషః=ఈ సోమము దేవః సన్ హి=దేవుఁ డగుచునే కదా! దేవానామ్= దేవతలకు, పవిత్రమ్=శుద్ధిహేతువు, భవతి=అగుచున్నది. "యేషాం భాగోఽసి తేభ్య స్త్వా" ఇతి ఆహ="ఓ సోమమా!

నీవు ఏ దేవతలకు భాగ మగుచున్నావో, వారికొఱకు నిన్ను గ్రహించుచున్నాను" అని ఈ మంత్ర భాగము చెప్పినది. తేభ్యః=ఆ దేవతలకొఱకు, ఏనమ్=ఈ సోమమును, గృహ్ణాతి=గ్రహించవలెను.

తాత్పర్యము: "వాచస్పతయే పవస్వ" ఇత్యాది మంత్రముయొక్క ఇతర భాగముల యర్థము ప్రసిద్ధమే యని ఈ బ్రాహ్మణము స్పష్టపఱచినది. ఈ మంత్రములన్నియు ప్రథమ కాండ చతుర్థ ప్రపాఠక ద్వితీయానువాకమునందు వ్యాఖ్యానించఁబడినవి.

6. అర్థము: "స్వాంకృతోఽసి" ఇతి ఆహ="ఓ యుపాంశు గ్రహమా! నీవు నాచే స్వీకరించఁ బడినదాన వగుచున్నావు" అని ఈ మంత్ర భాగము చెప్పినది. ( అనేన=ఈ చెప్పుటచే, యజమానః=యజమానుఁడు,) ప్రాణమేవ=ప్రాణమునే, స్వమ్ అకృత=స్వీయముగా చేసినవాఁ డాయెను. "మధుమతీర్న ఇషస్కృధి" ఇతి ఆహ="ఓ ఉపాంశు గ్రహమా! మాకొఱకు మధురములైన అన్నములను చేయుము (కల్పింపుము)." అని ఈ మంత్ర భాగము చెప్పినది. అస్మై=ఈ యజమానునికొఱకు, ఇదం సర్వమ్, ఏవ=ఈ సమస్తమైన అన్నమునే, స్వదయతి= స్వాదువుగా చేయును. "విశ్వేభ్య స్త్వేన్ద్రియేభ్యో దేవేభ్యః పార్థివేభ్యః" ఇతి ఆహ=ఓ ఉపాంశు గ్రహమా! దేవ జన్మమునందు మనుష్య జన్మమునందునను ఉన్నటువంటి సర్వేంద్రియముల హితముకొఱకు నిన్ను స్వీకరించుచున్నాను" అని ఈ మంత్ర భాగము చెప్పినది. (అనేన=ఈ చెప్పుటచే, యజమానః=యజమానుఁడు), ఉభయేషు దేవ మనుష్యేషు=దేవ మనుష్యులయందు ఉభయులందును, ప్రాణాన్=ప్రాణములను, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: ఉపాంశు గ్రహము యజ్ఞమునకు ప్రాణమువంటిది కావున, ఈ విధముగ చెప్పఁబడినది. తాత్పర్యము అర్థమునందే వివరించఁబడినది. ఇచట మంత్రమునందలి దేవ పార్థివ శబ్దములచే జన్మద్వయము సూచితమైనదని యీ బ్రాహ్మణము స్పష్టపఱచినది.

7. అర్థము: "మనస్త్వాఽష్టు" ఇతి ఆహ="ఓ ప్రాణరూపమైన ఉపాంశు గ్రహమా! నిన్ను మనస్సు వ్యాపించుఁగాక." అని ఈ మంత్రము చెప్పినది. మనః ఏవ=మనస్సే, అశ్నుతే=వ్యాపించును (పొందును). "ఉర్వన్తరిక్ష మన్విహి" ఇతి ఆహ="విస్తీర్ణమైన అంతరిక్షము ననుసరించి నీవు ఆహవనీయ దేశమునందు పొమ్ము." అని ఈ మంత్ర భాగము చెప్పినది. ప్రాణః=ప్రాణము, అన్తరిక్ష దేవత్యః హి= అంతరిక్షము దేవతగాఁగలది కదా! (ఉపాంశు గ్రహము ప్రాణరూపముగా వర్ణించఁబడినది. కావున అది అంతరిక్ష దేవత్యము). ఇది మఱియొక పేరు. "స్వాహా త్వా సుభవః సూర్యాయ" ఇతి ఆహ="మధ్యావస్థితి లక్షణమైన సద్భావము కల ఓ ప్రాణమా! త్వద్రూపమైన గ్రహమును బహిఃప్రాణ రూపుఁడైన సూర్యునికొఱకు హోమము చేయుచున్నాను. ["ఆదిత్యో హ వై బాహ్యః ప్రాణ ఉదయత్యేష హ్యేనం చాక్షుషం ప్రాణ మను గృహ్ణాతి నః" సూర్యునకు ప్రాణ రూపత్వ మీ శ్రుతియందు చెప్పఁబడినది. ఆదిత్యుఁడు బాహ్య ప్రాణ మనియు, అతఁడు ఉదయించి మన చక్షు స్సంబంధియైన ప్రాణమును అనుగ్రహించుననియు ఈ శ్రుతి వక్కాణించుచున్నది.] ప్రాణాః వై=ప్రాణములే, స్వభవసః దేవాః=స్వశరీరమునందు అవస్థితులైన దేవతలు. తేష్వేవ=ఆ దేవతలయందే, పరోక్షమ్=పరోక్షముగా, జుహోతి=హోమము చేయుచున్నవాఁ డగుచున్నాఁడు. "ప్రాణేభ్యః స్వాహా" అని చెప్పినచో దేవతల కిది ప్రత్యక్ష హోమ మగును. ఆ విధముగ చెప్పక "సూర్యాయ" అని చెప్పుటవలన ఇది పరోక్ష హోమ మగును.

"దేవేభ్య స్త్వా మరీచిపేభ్యః" ఇతి ఆహ="మరీచి నామక కిరణములకు పాలకులైన దేవతలకొఱకు నిన్ను హోమము చేయుచున్నాను." అని యీ మంత్ర భాగము చెప్పినది. ఆదిత్యస్య=సూర్యునియొక్క, రశ్మయః వై=రశ్ములే (రశ్మినామక కిరణములే), మరీచిపాః=మరీచి నామక కిరణములను పాలించునట్టి, దేవాః=దేవతలు. [రశ్మి నామక కిరణములు చేతనములు. ఆ రశ్ములే దేవతలు. మరీచి నామక కిరణములు

అచేతనములు. ఈ మరీచి నామక కిరణములకు రశ్మి రూప దేవతలు పాలకులని భావము.] తత్=ఆ హోమము చేయఁబడిన హవిస్సు, తేషామ్=ఆ రశ్మి రూప దేవతలయొక్క, భాగధేయమ్=భాగము. (యజమానః=యజమానుఁడు,) తేన=ఆ హవీ రూప భాగధేయముచే, తాన్ ఏవ=ఆ రశ్మి రూప దేవతలనే, ప్రీణాతి=సంతోషపఱచును.

తాత్పర్యము: అర్థమునందే వివరించఁబడినది. ఇచట క్రమముగ -"మనస్త్వాఽష్టు" ఇత్యాది మంత్రములన్నియు వ్యాఖ్యానించఁబడినవి. ఈ మంత్రమును పఠించుచు మరీచి పాలక దేవతలకొఱకు మధ్యమ పరిధియందు లేపమును పూయవలెను.

8. అర్థము: పర్జన్యః=మేఘుఁడు, వర్షుకః=వర్షించువాఁడు, స్యాత్=అగుఁగాక, ఇతి=అని, కామయేత యది=అభిలషించుచో, నీచా హస్తేన=హస్తముయొక్క అధో భాగముచే, ని మృజ్యాత్=మరీచి పాలక దేవతలకొఱకు మధ్యమ పరిధియందు లేపమును పూయవలెను. [తదా=అప్పుడు, పర్జన్యః=మేఘుఁడు,] వృష్టిమ్=వర్షమును, ని యచ్ఛతి ఏవ=తప్పక క్రిందికి కురియును. అవర్షుకః స్యాత్ ఇతి=మేఘుఁడు వర్షించనివాఁడు కావలెనని, కామయేత యది=అభిలషించుచో, ఉత్తానేన=హస్తముయొక్క పై భాగముచే, ని మృజ్యాత్=మధ్యమ పరిధియందు లేపమును పూయవలెను. [తదా= అప్పుడు, పర్జన్యః=మేఘుఁడు,] వృష్టిమ్=వర్షమును, ఉద్యచ్ఛతి= ఊర్ధ్వభాగమునందు కురియును.

తాత్పర్యము: మేఘుఁడు వర్షమును వర్షించవలెనని అధ్వర్యుఁడు కోరినచో మధ్యమ పరిధియందు హస్తముయొక్క క్రిందిభాగముచే లేపమును పూయవలెను. అప్పుడు మేఘుఁడు తప్పక క్రిందికి వర్షమును కురియును. వర్షించరాదని కోరుచో హస్తముయొక్క పైభాగముచే లేపమును పూయవలెను. అప్పుడు పైభాగమున వర్షమును కురియును. ఇచట లేప మార్జనమునందు ఫలభేదము ననుసరించి హస్తమునకు అధోముఖత్వము ఊర్ధ్వముఖత్వము విహితములైనవి.

9. అర్థము: అభిచరేత్ యది=శత్రువును గూర్చి అభిచార హోమము చేయుచో, హే ప్రాణరూప సూర్య!=ఓ ప్రాణ రూప సూర్యుఁడా!, "అముమ్=ఈ శత్రువును, జహి=చంపుము. అథ=పిమ్మట, త్వా=నిన్ను గూర్చి, హోష్యామి= హోమము చేయుదును." ఇతి=అని, బ్రూయాత్=అభిచార హోమ కర్త పలుకవలెను. (తదా=అప్పుడు, దేవః=సూర్యదేవుఁడు, ఏతన్మన్త్రమ్=ఈ మంత్రమును, శ్రుత్వా=విని,) ఆహుతిం ప్రేప్సన్=ఆహుతిని అపేక్షించుచు, ఏనమ్=ఈ శత్రువును, హన్తి ఏవ=తప్పక చంపును.

తాత్పర్యము: వైరిని సంహరించవలెనని కోరునట్టి పురుషుఁడు తత్సాధనమైన అభిచార హోమము చేయవలెను. ఆ హోమము చేయుటకు ముందుగా "అముం జహ్యథ త్వా హోష్యామి" = "ఓ ప్రాణ రూప సూర్యుఁడా! నీవు ఈ నా శత్రువును చంపుము. అనంతరము నిన్ను ఉద్దేశించి హోమము చేయుదును" అను మంత్రమును అభిచార హోమకర్త పఠించవలెను. అప్పుడు సూర్య దేవుఁడు ఈ మంత్రమును విని ఆహుతి నపేక్షించినవాఁడై ఈ శత్రువును తప్పక సంహరించును. హోమమునకు పూర్వము పఠింపవలసిన మంత్రమిచ్చట చెప్పఁబడినది.

10. అర్థము: (శత్రుః=శత్రువు,) దూరే=దూరమునందు, స్యాత్ యది=ఉండుచో, ఆ తమితోః=ఉచ్ఛ్వాస రహితముగ నుండుటకు వీలగునంతవఱకు, తిష్ఠేత్=ఉండవలెను. [అయమ్=ఈ ఉచ్ఛ్వాస నిరోధము] అస్య=ఈ శత్రువుయొక్క, ప్రాణమ్=ప్రాణమును, అనుగత్య=అనుసరించి వెళ్లి, హన్తి ఏవ=తప్పక సంహరించును.

తాత్పర్యము: శత్రువు దూరమునం దున్నచో అభిచార హోమకర్త ఉచ్ఛ్వాసమును నిరోధించి ఉండఁగలిగినంతవఱకు ఉండవలెను. అప్పుడు ఆ ఉచ్ఛ్వాస నిరోధము ఈ శత్రువుయొక్క ప్రాణము ననుసరించి పోయి శత్రువును

సంహరించును. శత్రువు దూరదేశమునం దున్నప్పుడు అభిచార హోమకర్త చేయవలసిన అనుష్ఠాన విశేష మిచట విహిత మైనది.

11. అర్థము: అభిచరేత్ యది=అభిచార హోమము చేయుచో, [హే ఉపాంశుగ్రహ! ఓ ఉపాంశు పాత్రమా!] "అముష్య=ఈ శత్రువుయొక్క, ప్రాణే= ప్రాణమునందు, త్వా=ప్రాణరూపమైన నిన్ను, సాదయామి=ఉంచుచున్నాను." ఇతి=అని, [తథా కృతే సతి=అట్లు చేయఁగా,] అనన్నః=వినాశరహితమైన, ప్రాణః వై=యజమాన ప్రాణమే, అన్య=ఈ శత్రువుయొక్క, ప్రాణమ్= ప్రాణమును, సాదయత్యేవ=నిశ్చయముగ నశింపఁజేయును.

తాత్పర్యము: అభిచార హోమము చేయుచో నతఁడు "అముష్య త్వా ప్రాణే సాదయామి" = "ఓ ఉపాంశు పాత్రమా! ప్రాణ రూపమైన నిన్ను శత్రువుయొక్క ప్రాణమునం దుంచుచున్నాను" అని (ఈ మంత్రమును) చెప్పి నిర్దిష్ట స్థానమునందు ఉపాంశు గ్రహము నుంచవలెను. అప్పుడు నశించని యజమాన ప్రాణము శత్రు ప్రాణమును తప్పక నశింపఁజేయును. ఇచట అభిచార హోమకర్త పాత్రము నుంచుటకై మంత్రాంతర మభిహిత మైనది.

12. అర్థము: షడ్భిః=ఆఱు అంశువులచేత, పవయతి=ఉపాంశు గ్రహమును పవిత్రము చేయవలెను. ఋతవః=ఋతువులు, షట్ వై=ఆఱే (ఏవం కృతవాన్=ఈ విధముగ చేసిన యతఁడు) ఋతుభిః ఏవ=ఋతువులచేతనే, ఏనమ్=ఈ ఉపాంశు పాత్రమును, పవయతి=పవిత్రము చేయుచున్నవాఁ డగును.

తాత్పర్యము: అభిషుతమై ప్రతిప్రస్థాతయొక్క హస్తమునందున్న సోమరసమును ఉపాంశు పాత్రములోనికి గ్రహించునపుడు ఆ పాత్రమును ఆఱు సోమాంశువులచే పవిత్రము చేయవలెను, అను విషయము ఇచట చెప్పఁబడుచున్నది. ఆఱు సోమాంశువులచే ఉపాంశు పాత్రమును శోధించవలెను. ఋతువులు ఆఱే కనుక ఋతువులచేతనే ఈ యుపాంశు పాత్రమును శోధించినవాఁ డగును. ఇతర పాత్రములను వస్త్రముచే శుద్ధి చేయవలెను. ఉపాంశు పాత్రమును సోమాంశువులచే శుద్ధి చేయవలెనని భావము.

13. అర్థము: త్రిః=మూఁడు మారులు, పవయతి=ఉపాంశు గ్రహమును శుద్ధి చేయవలెను. ఇమే లోకాః=ఈ లోకములు, త్రయః=మూఁడు. ఏభిః ఏవ=ఈ లోకములచేతనే, ఏనమ్=ఈ యుపాంశు పాత్రమును, పవయతి= పవిత్రము చేయుచున్నవాఁ డగును.

తాత్పర్యము: ఉపాంశు గ్రహమును శుద్ధి చేయుటయందు ఆఱు అంశువులను ఒకమారు ఉపయోగించరాదని, మూఁడు మారులు ఉపయోగించవలెనని ఇచట చెప్పఁబడుచున్నది. ఉపాంశు పాత్రమును అంశువులచే శుద్ధి చేయవలెను. అనఁగా ఒక్కొక్క పర్యాయము రెండేసి అంశువులచే శుద్ధి చేయవలెను. ఈ భూరాది లోకములు మూఁడు. త్రిత్వ సంఖ్యాసామ్యముచే యజమానుఁడు ఈ ముల్లోకములచేతనే ఈ యుపాంశుపాత్రమును శోధించినవాఁ డగును.

14. అర్థము: పశూనామ్=పశువులలో, త్రయః=మూఁడు రకములైన పశువులు, కస్మాత్ సత్యాత్=ఏ కారణము వలన, హస్తాదానాః=పదార్థమును హస్తముతో తీసికొనునవి? ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు (ప్రశ్నించుచున్నారు). యత్=ఏ కారణమువలన, త్రిః= మూఁడు మారులు, ఉపాంశుమ్=ఉపాంశు పాత్రమును, హస్తేన=హస్తముతో, విగృహ్ణాతి=(అధ్వర్యుఁడు) విశేషముగ గ్రహించుచున్నాఁడో, తస్మాత్=ఆ కారణమువలన, పశూనామ్=పశువులలో, పురుషః=పురుషుఁడు, హస్తీ=గజము, మర్కటః=వానరము, త్రయః=ఈ మూఁడు, హస్తాదానాః=హస్తముతో పదార్థమును గ్రహించునవి.

తాత్పర్యము: పశువులలో మూఁడు ఏ కారణమువలన హస్తాదానములు (హస్తముతో పదార్థమును తీసుకొనునవి); అని బ్రహ్మవాదులు ప్రశ్నించుచున్నారు. అధ్వర్యుఁడు ఉపాంశు గ్రహము మూఁడు పర్యాయములు అంజలితో స్వీకరించుచున్నాఁడు. కావున పశువులలో పురుషుఁడు, ఏనుఁగు, కోతి అను మూఁడు పశువులు హస్తా

దానము లైనవి అని సమాధానము. "బ్రహ్మణే బ్రాహ్మణమాలభతే" అనుచోట పురుషుఁడు కూడ అలభ్యుఁడుగా చెప్పఁబడుటచే పురుషుఁడు కూడ పశువుగా పేర్కొనఁబడినాడు. ఇచట మూఁడు పర్యాయములందును అధ్వర్యుడు అంజలిచే ఉపాంశు గ్రహమును గ్రహింపవలెనని చెప్పఁబడినది. ఇతర గ్రహములకు ఇట్లు కాదు.

పంచమానువాకము సమాప్తము

## అథ షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే షష్ఠో౽నువాకః

మూలము: [1]దేవా వై యద్యజ్ఞే౽కుర్వత తదసురా అకుర్వత తే దేవా ఉపాగ్ంశౌ యజ్ఞగ్ం సగ్ంస్థాప్య మపశ్య న్త ముపాగ్ంశౌ సమస్థాపయన్తే౽సురా వజ్రముద్యత్య దేవానభ్యాయన్త తే దేవా బిభ్యత ఇన్ద్ర ముపాధావ న్తానిన్ద్రో౽న్తర్యామేణాన్త రధత్త తదన్తర్యామస్యాన్తర్యామత్వం యదన్తర్యామో గృహ్యతే భ్రాతృవ్యా నేవ తద్యజమానో౽న్తర్ధత్తే [2]౽న్తస్తే (౧)దధామీతి ద్యావాపృథివీ అన్తరుర్వన్తరిక్ష మిత్యాహైభిరేవ లోకై ర్యజమానో భ్రాతృవ్యా నన్తర్ధత్తే [3]తే దేవా అమన్యన్తేన్ద్రో వా ఇద మభూద్యద్వయగ్ం స్మ ఇతి తే౽బ్రువ న్మఘవన్నను న ఆ భజేతి సజోషా దేవై రవరైః పరైశ్చేత్యబ్రవీద్యే చైవ దేవాః పరే యే చావరే తానుభయాన్ (౨) అన్వాభజ త్సజోషా దేవై రవరైః పరైశ్చేత్యాహ యే చైవ దేవాః పరే యే చావరే తానుభయా నన్వాభజ[4]త్యన్తర్యామే మఘవ న్మాదయస్వేత్యాహ యజ్ఞాదేవ యజ మానం నాన్తరే[5]త్యుపయామగృహీతో౽సీత్యాహాపానస్య ధృత్యై[6]యదుభావపవిత్రౌ గృహ్యేయాతాం ప్రాణ మపానో౽ను న్యృచ్ఛేత్ప్రమాయుకః స్యాత్పవిత్రవా నన్తర్యామో గృహ్యతే (౩)ప్రాణాపా నయో ర్విధృత్యై [7]ప్రాణాపానౌ వా ఏతౌ యదుపాగ్ంశ్వన్తర్యామౌ వ్యాన ఉపాగ్ంశుసవనో యం కామయేత ప్రమాయుకః స్యాదిత్యసగ్ంస్పృష్టౌ తస్య సాదయే ద్వ్యానేనైవాస్య ప్రాణాపానౌ విచ్ఛి నత్తి తాజక్ప్ర మీయతే యం కామయేత సర్వమాయు రియాదితి సగ్ంస్పృష్టౌ తస్య సాదయే ద్వ్యానేనైవాస్య ప్రాణాపానౌ సం తనోతి సర్వమాయు రేతి (౪)||

[త ఉభయా న్గృహ్యతే చతుశ్చత్వారిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే షష్ఠో౽నువాకః|| ౬ ||

# వేదార్థదీపిక

అవతారిక: సోమరసము నుంచుటకు ఉపాంశు పాత్రాదులను యజ్ఞమునం దుపయోగింతురు. వానిలో ఉపాంశు గ్రహమును గూర్చి వివరణ పూర్వకముగ తన్మంత్రములు పంచమానువాకమునందు వ్యాఖ్యానింపఁబడినవి. ఈ షష్ఠానువాకమునందు అంతర్యామ గ్రహమును గూర్చి వివరింపఁబడుచున్నది. అంతర్యామ గ్రహమునకు సంబంధించిన మంత్రములు ప్రథమ కాండ చతుర్థ ప్రపాఠక తృతీయానువాకమునం దభిహితము లైనవి. ఆ మంత్రములకు ఈ యనువాకము వివరణాత్మకము. గ్రహము=పాత్రము. 'ఉపాంశువు' 'అంతర్యామము' ఇత్యాదులు ఆ యా గ్రహముల నామములు.

1. అర్థము: దేవాః=దేవతలు, యజ్ఞే=యజ్ఞమునందు, యత్ వై=ఏదియైతే, అకుర్వత=చేసిరో, అసురాః=అసురులు, తత్=దానిని, అకుర్వత=చేసిరి. తే దేవాః=ఆ దేవతలు, ఉపాంశౌ=ఉపాంశు గ్రహమునందు యజ్ఞమ్=యజ్ఞమును, సంస్థాప్యమ్=సమాపనీయముగ (సమాప్తి చేయఁదగినదిగ), అపశ్యన్=చూచిరి (తెలిసికొనిరి). తమ్= ఆ యజ్ఞమును, ఉపాంశౌ=ఉపాంశు గ్రహమునందు, సమస్థాపయన్=సమాప్తి చేసిరి. తే అసురాః=ఆ రాక్షసులు, (క్రుద్ధాః=కోపించినవారై). వజ్రమ్=వజ్రమువంటి ఆయుధమును, ఉద్యత్య=పైకెత్తి, దేవాన్=దేవతలను, అభ్యాయన్త=ఎదుర్కొనిరి. తే దేవాః=ఆ దేవతలు, బిభ్యత=భయపడిరి. ఇన్ద్రమ్ ఉపాధావన్=ఇంద్రుని దగ్గఱకు పరువెత్తిరి. ఇన్ద్రః=ఇంద్రుఁడు, తాన్=ఆ దేవతలను, అన్తర్యామేణ=అంతర్యామ గ్రహముచేత, అన్తరధత్త=అంతర్ధానులను చేసెను (దాఁచెను). తత్=ఆ కారణమువలన, అన్తర్యామస్య=అంతర్యామగ్రహమునకు, అన్తర్యామత్వమ్='అంతర్యామము' అను పేరు, (అభవత్=ఆయెను). అన్తర్యామః= అంతర్యామ గ్రహము, గృహ్యతే -యత్=గ్రహింపఁబడినచో, తత్=అప్పుడు, యజమానః=యజమానుఁడు, భ్రాతృవ్యాన్ ఏవ=శత్రువులనే, అన్తర్ధత్తే= అంతర్హితులను చేయును.

తాత్పర్యము: దేవతలవలె యజ్ఞము చేయుచున్న రాక్షసులకు వ్యామోహమును కలిగించుటకై ఉపాంశు గ్రహమునందు యజ్ఞమును సమాపనీయమునుగా తలఁచి రహస్యముగ ఆ విధముగ చేసిరి. ఆ ప్రకారమును తెలిసికొనలేక అసురులు క్రుద్ధులై ఆయుధముల నెత్తికొని దేవతల నెదుర్కొనిరి. అప్పుడు దేవతలు భయపడి యింద్రుని దగ్గఱకు చేరఁగా ఇంద్రుఁడు వారిని అంతర్యామ గ్రహముచే అంతర్హితులనుగాఁ జేసెను. "లోపల నుంచుట" అను నర్థము కలిగియుండుటచే ఆ పాత్రమునకు 'అంతర్యామము' అను పేరు ఏర్పడినది. సోమరసమును నింపుటకై అంతర్యామ గ్రహమును గ్రహించవలెను. అట్లు గ్రహించిన యజమానుఁడు శత్రువులను అంతర్హితులనుగాఁ జేయును. ఇచట అంతర్యామ పాత్రమునందు సోమరస గ్రహణము విధించఁబడినది.

2. అర్థము: "అన్తస్తే దధామి ద్యావాపృథివీ అన్తరుర్వన్తరిక్షమ్" ఇతి ఆహ="ఓ యింద్రా! నీయనుగ్రహమువలన ద్యావాపృథువులను వ్యవధానము కలదిగాఁ జేయుచున్నాను. విస్తీర్ణమైన యంతరిక్షము నంతర్ధానము చేయుచున్నాను." అని యీ మంత్ర భాగము చెప్పినది. యజమానః=యజమానుఁడు, ఏభిః లోకైః ఏవ=ఈ పృథివ్యాది లోకములచేతనే, భ్రాతృవ్యాన్=శత్రువులను, అన్తర్ధత్తే=అంతర్ధానము చేయుచున్నాఁడు.

తాత్పర్యము: యాగకర్త తన శత్రువులను ఈ పృథివ్యాది లోకములచేతనే అంతర్హితులనుగా చేయునని "అన్తస్తే దధామి" ఇత్యాది మంత్రభాగముయొక్క తాత్పర్యము. మంత్రభాగమునందలి "ద్యావాపృథివీ" పదమునకు ప్రయోజనమిచట చెప్పఁబడినది.

3. అర్థము: "వయమ్=మనము, యత్=ఏ ఐశ్వర్యమును, (ప్రాప్తుమ్=పొందుటకు), స్మ=కోరిక కలవార మైతిమో, ఇదమ్=ఈ సర్వైశ్వర్యమును, ఇన్ద్రః వై=ఇంద్రుఁడే, అభూత్=పొందినవాఁ డాయెను." ఇతి=అని, తే దేవాః=ఆ దేవతలు, అమన్యన్త=తలఁచిరి. హే మఘవన్! =ఓ యింద్రా!, అను=నిన్ననుసరించి, నః

(అపి)=మమ్ము కూడ, ఆ భజ= భాగస్వాములమగా చేయుము; ఇతి=అని, తే=ఆ దేవతలు, అబ్రువన్=పలికిరి. ( తదా=అప్పుడు, ఇన్ద్రః=ఇంద్రుఁడు,) "సజోషా దేవై రవరైః పరైశ్చ" ఇతి అబ్రవీత్="సజోషాః" ఇత్యాది వాక్యమును పలికెను. (అనుజ్ఞ నొసఁగెను. ఆ యనుజ్ఞచే,) యే చ దేవాః=ఏ దేవతలైతే, పరే=ఉత్కృష్టులో, యే చ=ఎవరైతే, అవరే=నికృష్టులో, తాన్ ఉభయాన్=ఆ ఉభయులను, అన్వాభజత్= భాగస్వాములనుగా చేసెను. "సజోషా దేవై రవరైః పరైశ్చ" ఇతి ఆహ="ఓ యింద్రా! ఉత్కృష్టులు నికృష్టులనగు సర్వదేవతలతో కూడ సంతోషించినవాఁడవై" అని చెప్పెను. ఇచట కూడ, యే చైవ దేవాః పరే=ఏ దేవతలైతే ఉత్కృష్టులో, యేచ అవరే=ఏ దేవతలు నికృష్టులనో, తాన్ ఉభయాన్=ఆ ఉభయులను, అన్వాభజతి=భాగస్వాములనుగా చేయవలెను.

తాత్పర్యము: దేవతలు తాము పొందవలెనని కోరిన ఐశ్వర్యమును ఇంద్రుఁడు పొందెనని తలఁచి "ఓ యింద్రా! నీవు పొందిన ఐశ్వర్యములో మమ్ము కూడ భాగస్వాములనుగాఁ జేయుము" అని పలికిరి. అప్పు డింద్రుఁడు "సజోషా దేవై రవరైః పరైశ్చ" అను వాక్యముచే అనుజ్ఞ నొసఁగెను. ఆ యనుజ్ఞచే ఇంద్రుఁడు ఉత్కృష్టులు నికృష్టులనగు సర్వదేవతలను ఐశ్వర్యప్రాప్తియందు భాగస్వాములనుగాఁ జేసెను. కనుక ఇచట ఉత్కృష్టులు నికృష్టులనగు సర్వదేవతలను భాగస్వాములనుగా చేయవలెను. ఇచట "సజోషాః" ఇత్యాది మంత్రమునకు ప్రయోజనము చెప్పఁబడినది.

4. అర్థము: "అన్తర్యామే మఘవ న్మాదయస్వ" ఇతి ఆహ="ఓ యింద్రా! అంతర్యామ పాత్రమునందు నీవు సంతుష్టుఁడవై ఇతరులను కూడ సంతోషపఱచుము" అని యీ మంత్రము చెప్పినది. యజ్ఞాత్=యజ్ఞమునుండి, యజమానమ్= యజమానుని, న అన్తరేతి ఏవ=అంతర్హితుని చేయుటయే లేదు.

తాత్పర్యము: "ఓ యింద్రా! అంతర్యామ గ్రహమునందు నీవు సంతుష్టుఁడవై ఇతరులను కూడ సంతోషింపఁజేయుము" అని యజమానుఁడు ప్రార్థించినట్లు వేదము చెప్పుటచే యజమానుని యజ్ఞమునుండి అంతర్హితుని చేయుట లేదు. "మాదయస్వ" అని యుండుటచే యజ్ఞ హవిర్లాభముచే దేవతలకు హర్షము కలుగువిధముగ యజ్ఞమునకు విఘ్నము కలుగకుండుటచే యజమానునకు కూడ సంతోషము కలుగునని ఇచట సూచిత మైనది.

5. అర్థము: "ఉపయామ గృహీతోఽసి" ఇతి ఆహ="ఓ సోమరసమా! నీవు పృథివీ వికారమైన దారుపాత్రముచే గ్రహింపఁబడినదాన వగుచున్నావు" అని యీ మంత్రము చెప్పినది. (ఇయమ్ ఉక్తిః=ఈ చెప్పుట,) అపానస్య=అపాన వాయువుయొక్క, ధృత్యై=ధారణముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: "ఓ సోమరసమా! నీవు పృథివీ వికారమైన దారుమయ పాత్రము ( అంతర్యామ గ్రహము) చే గ్రహించఁబడినదాన వగుచున్నావు." అని "ఉపయామ గృహీతోఽసి" అను మంత్రము చెప్పినది. అపాన వాయు దేవత అంతర్యామ గ్రహాభిమాని యగుటచే ఆ పాత్రమునందు సోమరసమును గ్రహించుటవలన ప్రాణులు అపానవాయువును ధరించినవా రగుదురు. ఇచట "గృహీతః" అను పదముయొక్క ప్రయోజనము చెప్పఁబడినది.

6. అర్థము: ఉభౌ అపవిత్రౌ గృహ్యేయేతాం యది=ఉపాంశ్వంతర్యామ పాత్రములను రెండు అపవిత్రములుగా గ్రహింపఁబడుచో, ప్రాణమ్ అను=ప్రాణము ననుసరించి, అపానః=అపాన వాయువు, న్యుచ్చేత్ (నిర్గచ్ఛేత్)=వెలుపలకు పోవును. ( యజమానః=యజమానుఁడు,) ప్రమాయుకః=మరణ శీలుఁడు, స్యాత్=అగును. (తత్=ఆ కారణము వలన,) అన్తర్యామః=అంతర్యామ పాత్రము, పవిత్రవాన్=పవిత్రమైనదిగా, గృహ్యతే=గ్రహింపఁబడవలయును. (ఏతత్= ఇది,) ప్రాణాపానయోః=ప్రాణాపానములయొక్క, విధృత్యై=విశేష ధారణముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: సోమలతనుండి తీయఁబడిన రసమును ఉంచుటకై 'ఉపాంశు' మొదలగు పాత్రములను గ్రహింతు రనియు, వానిలో ఉపాంశు గ్రహము ప్రాణమువంటిదనియు పూర్వము చెప్పఁబడినది. ఇచట అంతర్యామ గ్రహము

అపానమువంటిదని చెప్పఁబడినది. అధ్వర్యుఁడు సోమరసమును దోసిలితో గ్రహించి ఉపాంశు గ్రహమునం దుంచవలెననియు చెప్పబడినది. అంతర్యామ గ్రహమును దశాపవిత్రము ద్వారా గ్రహింపఁబడిన సోమరసముచే నింపవలయును. ప్రాణ వృత్తి స్వాభావికముగ వెలుపల సంచరించుచుండును. కావున దానికి దశాపవిత్రముచే నియమనము చెప్పఁబడలేదు. అపాన వాయురూపమైన అంతర్యామ గ్రహమును కూడ ప్రాణ రూపమైన ఉపాంశుగ్రహమువలె అపానరూపమైన అంతర్యామ గ్రహమునందు దశాపవిత్రముచే గ్రహింపబడనిచో అదియు నపవిత్ర మగును. అప్పుడు అనియమితమైన అంతర్యామ గ్రహము కూడ బహిర్గమనము కలదగును. అనఁగా ప్రాణము ననుసరించి అపానము కూడ వెలుపల సంచరించును. యజ్ఞమునకు ఉపాంశ్వంతర్యామ గ్రహములు ప్రాణాపానములవంటివి కదా! అపానము కూడ వెలుపల సంచరించినచో ప్రాణాపానవృత్తులు రెండును దేహమునందు లేకుండుటచే దేహము పతన మగును. అనఁగా యజమానుఁడు మరణించును.

కావున దశాపవిత్రముచే అంతర్యామ గ్రహము నియమితము కావలయును. అపానము దేహము లోపల సంచరించును. అపానముతో అవినాభూతమైన ప్రాణము బహిర్గత మగుచున్నను దేహము నత్యంతము పరిత్యజింపదు. అందువలన ఆ రెండింటియొక్క ధారణమునకై దశాపవిత్రముచే అంతర్యామ పాత్రమును గ్రహించవలెను. అనఁగా అంతర్యామ పాత్రమునందు యజమానుఁడు దశాపవిత్రమును నాధిగాజేసి దాని యందు సోమరసమును సంతత ధారగా పోయవలెను. ఆ విధముగ సంతతధారచే నిండుచున్న అంతర్యామ గ్రహమును గ్రహించవలెను. ధ్రువ పాత్రము వఱకు ఇట్లే చేయవలెను.

7. అర్థము: ఉపాంశ్వన్తర్యామౌ యత్=ఉపాంశు గ్రహము అంతర్యామ గ్రహము అనునవి యేవి కలవో, ఏతౌ=ఇవి, ప్రాణాపానౌ వై=యజ్ఞమునకు ప్రాణాపాన స్థానీయములే. ఉపాంశు సవనః=ఉపాంశు సవనము, వ్యానః=వ్యాన వాయు స్థానీయ మైనది. (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమానుని ఉద్దేశించి, ప్రమాయుకః స్యాత్ ఇతి=మరణించువాఁడు కావలెనని కోరునో, తస్య=ఆ యజమానుని నిమిత్తము, అసంస్పృష్టౌ=ఉపాంశు సవనముతో స్పృశించఁబడనివిగా, సాదయేత్=ఉపాంశ్వంతర్యామ గ్రహముల నాసాదనము చేయవలెను. (నిర్దిష్ట స్థానమునం దుంచవలెను. తదా=అప్పుడు, సః=ఆ అధ్వర్యుఁడు,) అస్య= ఈ ఉద్దేశ భూతుఁడైన యజమానునియొక్క, ప్రాణాపానౌ=ప్రాణాపానములను, విచ్ఛినత్తి=నశింపఁజేసినవాఁ డగును. (సః=ఆ యజమానుఁడు,) తాజక్=వెంటనే, ప్రమీయతే=మరణించును. యమ్=ఏ యజమాను నుద్దేశించి, సర్వమ్ ఆయుః=సమస్తమైన ఆయువును, ఇయాత్ ఇతి= పొందుఁగాక అని, కామయేత=కోరునో, తస్య=ఆ యజమానుని నిమిత్తము, సంస్పృష్టౌ=ఉపాంశ్వంతర్యామ గ్రహములను ఉపాంశు సవనముతో స్పృశించఁబడినవిగా, సాదయేత్=ఉంచవలెను. (తదా=అప్పుడు, సః=ఆ యధ్వర్యుఁడు,) అస్య=ఈ యజమానునియొక్క, ప్రాణాపానౌ=ప్రాణాపానములను, వ్యానేనైవ=వ్యాన వాయువు చేతనే, సంతనోతి=బాగుగ వృద్ధి నొందించినవాఁ డగును. (తదా=అప్పుడు, సః=ఆ యజమానుఁడు,) సర్వమ్ ఆయుః= సమస్తమైన సంపూర్ణమైన ఆయువును, ఇయాత్=పొందును.

తాత్పర్యము: ఉపాంశ్వంతర్యామ పాత్రములు యజ్ఞమునకు ప్రాణాపాన స్థానీయములు. ఉపాంశు సవనము వ్యాన వాయు స్థానీయము. అధ్వర్యుఁడు తాను ఏ యజమానుని చంపవలెనని కోరుకొనునో, ఆ యజమానుని నిమిత్తము అతఁడు ఉపాంశ్వంతర్యామ పాత్రములను ఉపాంశు సవనముతో తాఁకించకుండ నిర్దిష్ట స్థానమునం దుంచవలెను. అప్పు డధ్వర్యుఁడు ఆ యజమానుని ప్రాణాపానములను వ్యానముచేతనే విచ్ఛిన్నములుగాఁ జేసినవాఁ డగును. అప్పుడు వెంటనే ఆ యజమానుఁడు మరణించును. అధ్వర్యుఁడు తన యజమానుఁడు సంపూర్ణమైన ఆయువు కలవాఁడు కావలెనని కోరుచో, అప్పు డధ్వర్యుఁడు ఆ యజమానుని నిమిత్తము ఉపాంశ్వంతర్యామ గ్రహములను ఉపాంశు సవనముతో స్పృశింపఁజేసి నిర్దిష్ట స్థానమునం దుంచవలెను. అప్పు

డతఁడు వ్యాన వృత్తిచేతనే ఈ యజమానుని ప్రాణాపానములను వృద్ధి నొందించినవాఁ డగును. యజమానుఁడు సంపూర్ణాయువును పొందును. ఉపాంశ్వంతర్యామ పాత్రములను మధ్యమునందున్న ఉపాంశు సవనముతో స్పర్శ మిచట విహిత మైనది.

షష్ఠానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే చతుర్థప్రపాఠకే సప్తమోఽనువాకః

మూలము: [1]వాగ్వా ఏషా యదైన్ద్రవాయవో యదైన్ద్రవాయవాగ్రా గ్రహా గృహ్యన్తే వాచమేవాను ప్ర యన్తి
[2]వాయుం దేవా అబ్రువన్త్సోమగ్ం రాజానగ్ం హనామేతి సోఽబ్రవీ ద్వరం వృణై మదగ్రా ఏవ వో
గ్రహా గృహ్యాన్తా ఇతి తస్మాదైన్ద్రవాయవాగ్రా గ్రహా గృహ్యన్తే తమఘ్న [3]న్త్సోఽపూయత్తం దేవా
నోపాధృష్ణువన్తే వాయు మబ్రువన్నిమం నః స్వదయ (౧) ఇతి సోఽబ్రవీద్వరం వృణై మద్దేవత్యా
న్యేవ వః పాత్రాణ్యుచ్యాన్తా ఇతి తస్మాన్నానాదేవత్యాని సన్తి వాయవ్యా న్యుచ్యన్తే తమేభ్యో వాయు
రేవా స్వదయ త్తస్మాద్యత్పూయతి తత్ప్రవాతే వి షజన్తి వాయుర్హి తస్య పవయితా స్వదయితా
[4]తస్య విగ్రహణం నావిన్దన్త్సాఽదితి రబ్రవీద్వరం వృణా అథ మయా వి గృహ్ణీధ్వం మద్దేవత్యా
ఏవ వః సోమాః (౨) సన్నా అసన్నిత్యుపయామగృహీతో ఽసీత్యాహాదితిదేవత్యాస్తేన యాని హి
దారుమయాణి పాత్రాణ్యస్యై తాని యోనేః సంభూతాని యాని మృణ్మయాని సాక్షాత్తాన్యస్యై తస్మా
దేవమాహ [5]వాగ్వై పరాచ్యవ్యాకృతాఽవదత్తే దేవా ఇన్ద్ర మబ్రువన్నిమాం నో వాచం వ్యాకుర్వితి
సోఽబ్రవీద్వరం వృణై మహ్యం చైవైష వాయవే చ సహ గృహ్యాతా ఇతి తస్మాదైన్ద్రవాయవః సహ
గృహ్యతే తామిన్ద్రో మధ్యతోఽవక్రమ్య వ్యాకరో త్తస్మాదియం వ్యాకృతా వాగుద్యతే [6]తస్మా త్సకృ
దిన్ద్రాయ మధ్యతో గృహ్యతే ద్విర్వాయవే ద్వౌ హి స వరా వవృణీత(3)||

(స్వదయ సోమాః సహాష్టావిగ్ంశతిశ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే సప్తమోఽనువాకః||౭||

# వేదార్థదీపిక

అవతారిక: అంతర్యామ గ్రహమును గుఱించి షష్ఠానువాకమునందు చెప్పఁబడినది. ఈ సప్తమానువాకమునందు ఐన్ద్రవాయవ గ్రహమును గూర్చి చెప్పఁబడుచున్నది.

1. అర్థము: ఐన్ద్రవాయవః యత్=ఐన్ద్రవాయవ గ్రహ మేది కలదో, ఏషా= ఇది, వాక్ వై=వాగ్దేవతయే. ఐన్ద్రవాయవాగ్రాః=ఐన్ద్రవాయవ గ్రహము ప్రథమమునందు గల, గ్రహాః=మైత్రావరుణాది గ్రహములు, గృహ్యన్తే యత్= గ్రహింపఁబడు చున్నచో, వాచమ్ ఏవ=వాగ్దేవతనే, అను యన్తి=చక్షు శ్శ్రోత్రాది దేవతలు అనుసరింతురు.

తాత్పర్యము: పూర్వోక్తములైన గ్రహములలో కొన్ని ఏక దేవత్యములు, కొన్ని ద్వి దేవత్యములు కలవు. ద్వి దేవత్య గ్రహములను గ్రహించునపుడు ప్రథమమున ఐన్ద్రవాయవ గ్రహమును గ్రహించవలెను. ఐన్ద్రవాయవ మనఁగా ఇంద్రుఁడు వాయువు దేవతలుగాఁ గల గ్రహములు. ఈ ఐన్ద్రవాయవ గ్రహము వాక్స్వరూపమే. ఐంద్రవాయవ మైత్రావరుణాశ్విన గ్రహముల కధిమాని దేవతలు వాక్చక్షు శ్శ్రోత్రాఖ్యలు. ఐన్ద్రవాయవ గ్రహమునకు ప్రాథమ్య మున్నచో ముందు పోవుచున్న వాక్కు ననుసరించి చక్షురాదులు పోవుచుండును. ఇచట ద్వి దేవత్య గ్రహములలో ఐన్ద్ర వాయవ గ్రహమునకు పాథమ్యము విధించఁబడినది.

2. అర్థము: రాజానమ్=ఓషధులకు రాజైన, సోమమ్=సోమమును, హనామ ఇతి=అభిషవము చేయుదు మని, దేవాః=దేవతలు, వాయుమ్= వాయుదేవుని గూర్చి, అబ్రువన్=పలికిరి. వః గ్రహాః=మీ యొక్క గ్రహములు, మదగ్రాః ఏవ=నా గ్రహము ప్రథమమునఁ గలవిగానే, గృహ్యన్తే= గ్రహింపఁబడవలెను, ఇతి=అని, వరమ్=వరమును, వృణై=కోరుదును. ఇతి=అని, సః=ఆ వాయువు, అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణమువలన, ఐన్ద్రవాయవాగ్రాః గ్రహాః=ఐన్ద్రవాయవ గ్రహము ప్రథమమునఁ గల గ్రహములు, గృహ్యన్తే=గ్రహింపఁబడుచున్నవి. (దేవాః=దేవతలు,) తమ్= ఆ సోమమును, అఘ్నన్=హననము చేసిరి. ఇచట సోమమునకు హనన మనఁగా అభిషవమని యర్థము.

తాత్పర్యము: ఓషధి రాజైన సోమము నభిషవము చేయుదు మని దేవతలు వాయుదేవునితో పలికిరి. మీ గ్రహములను గ్రహించునపుడు నా గ్రహమును ప్రథమమున గ్రహించవలెనని వాయువు వరమును కోరుకొనెను. అందువలన యజ్ఞములందు ద్వి దేవత్య గ్రహములలో ఐన్ద్రవాయవ గ్రహము ప్రథమమున గ్రహింపఁబడి పిమ్మట మైత్రావరుణాది గ్రహములు గ్రహింపఁబడుచున్నవి. ఇచట మరొకవిధముగ ఐన్ద్రవాయవ గ్రహ ప్రాథమ్యము ప్రశంసింపఁబడినది.

3. అర్థము: సః=అభిషుతమైన యీ సోమము, అపూయత్= దుర్గంధోపేత మాయెను. దేవాః=దేవతలు, తమ్=దుర్గంధోపేతమైన యీ సోమమును, నోపాధృష్ణువన్=స్వాదువుగా చేయుటకు సమర్థులు కాలేక పోయిరి. (హే వాయో!=ఓ వాయూ! త్వమ్=నీవు,) ఇమమ్=ఈ అభిషుతమైన సోమమును, స్వదయ ఇతి= స్వాదువుగా చేయుమని, తే=ఆ దేవతలు, వాయుమ్=వాయువును గూర్చి, అబ్రువన్= పలికిరి. "వః=మీ యొక్క, పాత్రాణి=పాత్రములు, మద్దేవత్యాని ఏవ=వాయువ్యము లనియే, ఉచ్యన్తే=వ్యవహరింపఁబడవలెను. ఇతి =అని, సః=ఆ వాయువు, అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణమువలన, (యాని=ఏ పాత్రములు, నానాదేవత్యాని=అనేక దేవతలు కలవిగా, సన్తి=కలవో, తాని=ఆ పాత్రములు, వాయవ్యాని=వాయువ్యములుగా, ఉచ్యన్తే=చెప్పఁబడుచున్నవి. తమ్=ఆ దుర్గంధోపేతమైన సోమమును, వాయుః ఏవ=వాయువే, అస్వదయత్=స్వాదువుగాఁ జేసెను. తస్మాత్=ఆ కారణమువలన, (లోకే= లోకమునందు,) యత్=ఏది, పూయతి=దుర్గంధోపేతమై యుండునో, తత్=దానిని, ప్రవాతే=ప్రకృష్ట

మైన గాలియందు, వి షజన్తి=అటఁబెట్టుచున్నారు. తస్య= అటువంటి వస్తువునకు, వాయుః=వాయువు, పవయితా స్వదయితా హి=శోధయితయు, స్వాదుకర్తయు కదా!

తాత్పర్యము: హతమైన (అభిషుతమైన) సోమము దుర్గంధోపేతము కాఁగా దానిని దేవతలు స్వాదువుగా చేయలేకపోయిరి. అప్పుడు 'ఈ యభిషుతమైన సోమమును స్వాదువుగా చేయుమని' దేవతలు వాయువు నడిగిరి. 'నానా దేవత్యములైన మీ గ్రహములు నాకు సంబంధించినవిగా వ్యవహరింపఁబడవలెనవి వరమును కోరుదు' నని వాయువు దేవతలతో ననెను. అందువలన నానా దేవత్యములైన మైత్రావరుణాశ్వినాది గ్రహములు వాయవ్యములని చెప్పఁబడుచున్నవి. అనంతరము వాయువే ఆ దుర్గంధోపేతమైన సోమమును స్వాదువుగాఁ జేసెను. ఆ కారణమువలననే లోకమునందు దుర్గంధోపేతమైన వస్తువును గాలి బాగుగా వీఁచుచుండఁగా ఆ గాలియందు ఆటఁబెట్టుచున్నారు. వాయువు అటువంటి వస్తువును పరిశుద్ధము చేయువాఁడు, స్వాదువుగాఁ జేయువాఁడును కదా! పూర్వోక్త ప్రాథమ్యమును దృఢముగాఁ జేయుట కిచట మఱల వాయు ప్రశంస చేయఁబడినది. లేదా ఈ వాయుస్తుతిచేత "వాయవే గృహ్ణీయాత్" అను విధి ఊహింపఁదగినది.

4. అర్థము: తస్య=ఆ సోమ రసమునకు, విగ్రహణమ్=వివిధ దేవతలకొఱకు గ్రహింపఁజేయు మంత్రమును, న అవిన్దన్=దేవతలు తెలిసికొనలేక పోయిరి. అథ=అప్పుడు, "మయా=నా మంత్రముచేత, (భూమి ప్రతిపాదక మంత్రము చేత), వి గృహ్ణీధ్వమ్=సోమరసమును వివిధ దేవతలకొఱకు గ్రహించుఁడు. వః=మీయొక్క, సోమాః=సోమములు, మద్దేవత్యాః ఏవ=మద్దేవతాకములుగానే, (అదితి దేవత్యములు గానే) సన్తః= అసాదితములై, అసన్=ఉండుఁగాక. ఇతి=అని, వరమ్=వరమును, వృణై= కోరుదును," ఇతి=అని, సా=ఆ, అదితిః=భూమి, అబ్రవీత్=పలికెను. "ఉపయామ గృహీతోఽసి" ఇతి ఆహ="భూమి సంబంధమైన పాత్రముచే గ్రహింపఁబడినది" అను మంత్రమును భూమి చెప్పెను. తేన=ఆ కారణముచే, (తే=ఆ సోమ రసములు,) అదితి దేవత్యాః=అదితి దేవతగా కలవి. యాని=ఏవి, దారుమయాణి పాత్రాణి=దారుమయము లైన పాత్రములో, తాని=అవి, అస్యై యోనేః=ఈ భూమి సంబంధినియగు వృక్ష రూపమైన యోనినుండి, సంభూతాని హి=పుట్టినవి కదా! యాని= ఏవి, మృణ్మయాని=మట్టితోజేయఁబడినవో, తాని=ఆ మృణ్మయ పాత్రములు, సాక్షాత్=సాక్షాత్తుగా, అస్యై=ఈ భూమినుండి, సంభూతాని=పుట్టినవి. తస్మాత్=ఆ కారణ మువలన, ఏవమ్=ఈ విధముగ, ("ఉపయామ గృహీతోఽసి" అని,) ఆహ=అదితి పలికెను.

తాత్పర్యము: వివిధ దేవతలకొఱకు సోమ రసమును గ్రహింపఁజేయు సాధారణ మంత్రమును దేవతలు కనుఁగొన లేకపోయిరి. అప్పుడు భూ దేవత ఈ విధముగ దేవతలతో పలికెను. "భూమిప్రతిపాదకమైన నా మంత్రముచే వివిధ దేవతలకొఱకు సోమరసమును గ్రహించుఁడు. అయితే మీసోమములు నేను దేవతగాఁ గలవిగానే (అదితి దేవత్యములుగానే) ఉండవలెను, అని నేను వరమును కోరుకొనుచున్నాను" (అని భూమి పలికెను.) "ఉపయామ గృహీతోఽసి" "ఓ సోమమా! నీవు భూమి సంబంధమైన పాత్రముచే గ్రహింపఁబడినదాన వగుచున్నావు" అను ఈ మంత్రమును అదితి చెప్పెను. తన్మంత్ర ప్రయోగముచేత పూర్వోక్త వరముచే తను సోమరసములు అదితి దేవత్యము లైనవి. దారుమయములు, మృణ్మయములు నని సోమ పాత్ర ములు రెండు విధములుగా నున్నవి. వానిలో దారుమయ పాత్రములు భూమి సంబంధిని యగు వృక్షరూప యోనినుండి పుట్టినవి. ఇవి గ్రహాదులు. మృణ్మయ పాత్రములు సాక్షాత్తుగ భూమినుండియే పుట్టినవి. ఇవి ఆగ్రయణ స్థాల్యాదులు. అందువలన "ఉపయామ గృహీతోఽసి" అను మంత్రమును అదితి దేవత చెప్పినది. (సర్వ గ్రహ సాధారణమైన "ఉపయామ గృహీతోఽసి" అను మంత్ర మిచట వివరించఁబడినది).

5. అర్థము: వాక్ వై=వైదిక మంత్రరూప వాక్కు అయితే, (పురా= పూర్వము), పరాచీ=సముద్ర ఘోష మువలె ఐక్య రూపముతో దండాయమానమై, అవ్యాకృతా=వ్యాకరింపఁబడనిదియై, అవదత్=పలికెను.

ఇమామ్=ఈ, వాచమ్=వాక్కును, నః=మాకొఱకు, వ్యాకురు ఇతి=వ్యాకరించుమని, తే దేవాః=ఆ దేవతలు, ఇన్ద్రమ్=ఇంద్రుని గూర్చి, అబ్రువన్=పలికిరి. ఏషః= ఈ సోమరసము, మహ్యం చైవ=నాకొఱకును, వాయవే చ=వాయువుకొఱకును, సహ=ఏక పాత్రమునందు, గృహ్యాతై=గ్రహింపఁబడవలెను; ఇతి=అని, వరమ్=వరమును, వృణై=కోరుదును. ఇతి=అని, సః=ఆ యింద్రుఁడు, అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణమువలన, ఐన్ద్రవాయవః=ఇంద్ర వాయు దేవతాకమైన సోమరసము, సహ గృహ్యాతే=ఆ యుభయులకు ఏక పాత్రమునందు గ్రహింపఁబడుచున్నది. ఇన్ద్రః=ఇంద్రుఁడు, తస్మిన్=ఆ అవ్యాకృత వాక్కునందు, మధ్యతః=మధ్యముగా, అవక్రమ్య=వాక్య పదాది రూపమున విభాగము చేసి, వ్యాకరోత్=వ్యాకరించెను. తస్మాత్=ఆ కారణమువలన, ఇయమ్=ఈ వాక్కు, వ్యాకృతా వాక్=వ్యాకరించఁబడిన వాక్కుగా, ఉద్యతే=ఉద్యత మగుచున్నది.

తాత్పర్యము: పూర్వము వైదిక మంత్ర రూప వాక్కు వ్యాకరించఁబడక సముద్ర ఘోషమువలె ఐక్యరూపముతో దండాయమానమై ఉండెడిది. అప్పుడు దేవతలు "ఈ వాక్కును మాకొఱకు వ్యాకరించు" మని ఇంద్రు నడిగిరి. ఇంద్రుఁడు "తనకు, వాయువునకును ఈ సోమరసమును ఒక్క పాత్రమునందు గ్రహించవలయు"నని వరమును కోరెను. అందువలననే ఐన్ద్రవాయవమైన సోమరసము ఒక్కసారిగా గ్రహించఁబడుచున్నది. అనఁగా ఇంద్ర వాయు దేవతల కుభయులకు సమష్టిగా సోమరసము గ్రహింపఁబడుచున్నది. అనంతర మింద్రుఁడు ఆ మంత్ర రూప వాక్కును మధ్యమమునకు విభజించి, అనఁగా ఆ మంత్రమునందు 'ఇంతవఱకు వాక్యము, ఇంతవఱకు పదము, ఆ పదమునందు కూడ ఇది ప్రకృతి, ఇది ప్రత్యయము' అని విభాగము చేసి వ్యాకరించెను. ఆ వ్యాకృతమైన మంత్రవాక్కే ఇప్పుడు ప్రవృత్తమగుచున్నది. ఇంద్ర వాయువులకు ఏక పాత్రమునందు సోమరసముయొక్క సహ గ్రహణము ఇచట విధించఁబడినది.

6\. అర్థము: తస్మాత్=ఇంద్రుఁడు ఏక పాత్రమునందు సహగ్రహణ రూప వరమును కోరుటవలనను, మంత్ర వాక్కును మధ్యమున విభజించి వాక్యపదాది రూపమున వ్యాకరించుటవలనను, ఇన్ద్రాయ=ఇంద్రునికొఱకు, మధ్యతః=మధ్యమున, సకృత్=ఒక పర్యాయము, గృహ్యాతే=సోమరసము గ్రహింపఁబడుచున్నది. వాయవే=వాయువుకొఱకు, ద్విః=రెండు పర్యాయములు, గృహ్యాతే= గ్రహించఁబడుచున్నది. సః=ఆ వాయువు, ద్వౌ వరౌ=రెండు వరములను, అవృణీత హి=కోరెను కదా!

తాత్పర్యము: ఇంద్రుఁడు సహగ్రహణ రూపమైన ఒక వరమునే కోరెను. మఱియు వాక్కును మధ్యమున విభజించెను. వాయువు గ్రహాగ్రత్వమును ఒక వరముగాను, సర్వపాత్రములకు వాయవత్వమును రెండవ వరముగాను కోరెను. కనుక ప్రథమమున వాయువునకు ఒక మారు సోమరసమును గ్రహించవలెను. అనంతరము వాయువునకై రెండవ పర్యాయము గ్రహించవలెను. ఈ విధముగ గ్రహించుటవలన ఇంద్రునకు మధ్యమున స్థానమేర్పడుటయు, ఒకమారే గ్రహించుటయు సిద్ధించినవి. వాయువునకు ప్రథమమున ఒకమారు గ్రహణము, ఇంద్రానంతరము రెండవ మారు గ్రహణము లభించినవి. కనుకనే "ఆ వాయో భూష" అను మంత్రమునందు కేవల వాయువునకు ప్రథమ గ్రహణము లభించినది. "ఇన్ద్ర వాయూ ఇమే సుతాః" అను మంత్రమునందు వాయువునకు వాయు శబ్దము ఇంద్ర శబ్దానంతరము పఠింపఁబడినది. కనుక ఇంద్రునకు మధ్యస్థానము లభించినది. ఇచట ఐన్ద్రవాయవ గ్రహణము ముగించఁబడినది. 2,3 వాక్యముల వ్యాఖ్యానమునందు వాయువు రెండు వరములను కోరిన విధము వివరించఁబడినది.

సప్తమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే చతుర్థ ప్రపాఠకేఽష్టమోఽనువాకః

మూలము: [1]మిత్రం దేవా అబ్రువన్త్సోమగ్ం రాజానగ్ం హనామేతి సోఽబ్రవీన్నాహగ్ం సర్వస్య వా అహం మిత్ర
మస్మీతి తమబ్రువన్ హనామైవేతి సోఽబ్రవీద్వరం వృణై పయసైవ మే సోమగ్ం శ్రీణన్నితి తస్మా
న్మైత్రావరుణం పయసా శ్రీణన్తి తస్మాత్పశవో ఽ పాక్రామన్మిత్రః సన్క్రూర మకరితి [2]క్రూరమివ
ఖలు వా ఏషః (౧) కరోతి యః సోమేన యజతే తస్మాత్పశవో ఽప క్రామన్తి యన్మైత్రావరుణం
పయసా శ్రీణాతి పశుభిరేవ తన్మిత్రగ్ం సమర్ధయతి పశుభి ర్యజమానం [3]పురా ఖలు వావైవం
మిత్రో ఽవేదప మత్క్రూరం చక్రుషః పశవః క్రమిష్యన్తీతి తస్మాదేవ మవృణీత [4]వరుణం దేవా
అబ్రువన్త్వయా ఽ గ్ంశభువా సోమగ్ం రాజానగ్ం హనామేతి సోఽబ్రవీద్వరం వృణై మహ్యం చ
(౨) ఏవైష మిత్రాయ చ సహ గృహ్యాతా ఇతి తస్మాన్మైత్రావరుణః సహ గృహ్యతే తస్మాద్రాజ్ఞా
రాజాన మగ్ంశభువా ఘ్నన్తి వైశ్యేన వైశ్యగ్ం శూద్రేణ శూద్రం [5]న వా ఇదం దివా న నక్తమాసీ
దవ్యావృత్తం తే దేవా మిత్రావరుణా వబ్రువన్నిదం నో వి వాసయతమితి తావబ్రూతాం వరం
వృణావహా ఏక ఏవాఽఽవత్పూర్వో గ్రహో గృహ్యాతా ఇతి తస్మా దైన్ద్రవాయవః పూర్వో మైత్రా
వరుణా ద్గృహ్యతే [6]ప్రాణాపానౌ హ్యేతౌ యదుపాగ్ంశ్వన్తర్యామౌ [7]మిత్రోఽహరజనయ ద్వరుణో
రాత్రిం తతో వా ఇదం వ్యౌచ్ఛద్యన్మైత్రావరుణో గృహ్యతే వ్యుష్ట్యై (3)||

(ఏష వైన్ద్రవాయవో ద్వావిగ్ంశతిశ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠకాణ్డే చతుర్థ ప్రపాఠకేఽష్టమోఽనువాకః||౮||

# వేదార్థదీపిక

అవతారిక: సప్తమానువాకమునందు ఐంద్రవాయవ గ్రహమును గూర్చి వివరించఁబడినది. ఈ యష్టమానువాకమున మైత్రావరుణ గ్రహమును గుఱించి వివరింపఁబడుచున్నది. 'మిత్ర దేవుఁడు' 'వరుణ దేవుఁడు' అను ఇద్దఱు దేవతల నుద్దేశించి ఏక పాత్రమునందు సోమరసము గ్రహింపఁబడును. కావున ఈ గ్రహము (పాత్రము) మైత్రావరుణ గ్రహ మనఁబడుచున్నది.

1. అర్థము: హే మిత్ర!=ఓ మిత్ర దేవా! త్వయా సహితాః వయమ్= నీతో కూడినవారమై మేము, రాజానం సోమమ్=ఓషధి రాజైన సోమమును, హనామ ఇతి= అభిషవము చేయుదు మని, దేవాః=దేవతలు, మిత్రమ్=మిత్ర దేవుని గూర్చి, అబ్రువన్=పలికిరి. అహమ్=నేను, (సోమమ్=సోమమును), న=అభిష వము చేయను. అహమ్=నేను, సర్వస్య=సర్వ ప్రాణి సమూహమునకు, మిత్రం వై= మిత్రముగానే, అస్మి=అగుచున్నాను, ఇతి=అని, సః=ఆ మిత్ర దేవుఁడు, అబ్రవీత్=పలికెను. హనామైవ=తప్పక అభిష వము చేయుదుము, ఇతి=అని, తమ్=ఆ మిత్ర దేవుని గూర్చి, అబ్రువన్=పలికిరి. "మే=నా కొఱకు, సోమమ్=సోమరసమును, పయసైవ=క్షీరముతోనే, శ్రీణన్=మిశ్రణము చేయవలెను, ఇతి=అని, వరమ్=వర మును, వృణై=కోరుదును." ఇతి=అని, సః=ఆ మిత్ర దేవుఁడు, అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణమువలన, మైత్రా వరుణమ్=మిత్ర వరుణులు దేవతలుగాఁ గల సోమరసమును, పయసా= క్షీరముతో, శ్రీణన్తి=కలుపుచున్నారు. మిత్రః సన్=మిత్రుఁడగుచు, క్రూరమ్=సోమ హనన రూపమైన క్రూరకర్మను, అకః ఇతి=చేసెనని, పశవః= పశువులు, తస్మాత్=ఆ మిత్ర దేవునినుండి, అపాక్రామన్=(భయపడినవై) తొలఁగిపోయెను.

తాత్పర్యము: ఓషధి రాజమైన సోమమును హననము (అభిషవము) చేయుటకై దేవతలు మిత్ర దేవుని సాహాయ్యమును కోరఁగా మిత్ర దేవుఁడు తాను సర్వ ప్రాణి జాతమునకు మిత్రుఁడు కనుక సోమ హననము చేయనని బదులు పలికెను. అంతట వారు మరొక మారు గట్టిగా కోరుటచే తనకొఱకు "సోమరసమును క్షీరముతో మిశ్రణము చేయవలెనని" మిత్ర దేవుఁడు వరమును కోరుకొనెను. ఆ కారణమువలన మిత్ర వరుణుల సంబంధియైన సోమరసమును పయస్సుతో కలుపుచున్నారు. మిత్ర దేవుఁడు సోమ హనన రూప క్రూర కర్మను చేసెనని పశువులు ఆ మిత్ర దేవునివలన భయపడి తొలఁగి పోయినవి. గృహీతమైన సోమ రసమునకు క్షీరమేలనమును విధించుటకై ఇచట తత్ స్తుతి చేయఁబడినది.

2. అర్థము: యః=ఏ యజమానుఁడు, సోమేన యజతే= సోమయాగము చేయుచున్నాఁడో, ఏషః=ఇతఁడు, క్రూరమివ వై=(వధ రూపమైన) భయంకర కర్మను వలెనే, కరోతి ఖలు=చేయుచున్నాఁడు కదా! తస్మాత్=అట్టి యజమానునినుండి, పశవః=పశువులు, అప క్రామన్తి=(భయపడి) తొలఁగి పోవును. మైత్రావరుణమ్=మిత్ర వరుణులు దేవతలుగాఁ గల సోమరసమును, పయసా=క్షీరముతో, శ్రీణాతి యత్=మిశ్రణము చేయుచో, (అధ్వర్యుః= అధ్వర్యుఁడు,) పశుభిః ఏవ=పశువులచేతనే, తన్మిత్రమ్=ఆ మిత్ర దేవుని, సమర్ధయతి=సమృ ద్ధునిగాఁ జేయుచున్నవాఁ డగును. పశుభిః= పశువులచే, యజమానమ్=యజమానుని, సమర్ధయతి=సమృద్ధుని చేయును.

తాత్పర్యము: (ఇచట మైత్రావరుణ సోమరసమునకు క్షీర మిశ్రణము విధించఁబడినది. దీనిచే మిత్ర యజమానుల కుభ యులకు పశు సమృద్ధి కలుగుచున్నది.)

3. అర్థము: క్రూరమ్=సోమ వధ రూపమైన క్రూర కర్మను, చక్రుషః= చేయునట్టి, మత్=తన (నా) నుండి, పశవః=పశువులు, అప క్రమిష్యన్తి ఇతి= తొలఁగి పోఁగలవని, మిత్రః=మిత్ర దేవుఁడు, పురా వావ=సోమ

వధకు పూర్వమే, అవేత్ ఖలు=తెలిసికొనెనఁట. తస్మాత్=ఆ కారణమువలన, ఏవమ్=ఈ విధముగ, (సోమమును పయస్సుతో మిశ్రణము చేయవలెనని,) అవృణీత= వరమును కోరెను.

**తాత్పర్యము:** సోమ వధ రూప క్రూర కర్మను చేయునట్టి తననుండి పశువులు భయపడి తొలఁగి పోఁగలవని మిత్ర దేవుఁడు సోమవధకు పూర్వమే తెలిసికొనెను. కావున మిత్ర దేవుఁడు సోమమును క్షీరముతో మిశ్రణము చేయవలెనని వరమును కోరుకొనెను. [సోమమును క్షీర మిశ్రణము చేయుటవలన యజమానునకు పశు సమృద్ధి కలుగవచ్చును. కాని మిత్ర దేవునకు పశు సమృద్ధి ఎట్లు కలుగును? అను ప్రశ్న కిచట సమాధానము చెప్పఁబడినది. అనఁగా మిత్ర దేవుఁడు పశు సమృద్ధి హేతువైన క్షీర మిశ్రణమును వరముగా కోరెను. కనుక అతనికి కూడ పశు సమృద్ధి కలుగునని భావము.]

4. **అర్థము:** హే వరుణ!=ఓ వరుణుఁడా!, అంశభువా= (సోమమును పొందుటలో మిత్ర దేవునితో భాగస్వామివైన) దాయాదుఁడవైన, త్వయా= నీతో కూడ, సోమం రాజానమ్=ఓషధి రాజమైన సోమమును, హనామ=వధింతుము, ఇతి=అని, దేవాః=దేవతలు, వరుణమ్=వరుణుని గూర్చి, అబ్రువన్=పలికిరి. "మహ్యం చ ఏవ=నా కొఱకును, మిత్రాయ చ=మిత్రదేవునికొఱకును, ఏషః= ఈ సోమ రసము, సహ గృహ్యాతై=ఏక పాత్రమునందు గ్రహింపఁబడవలెను, ఇతి= అని, వరమ్=వరమును, వృణై=కోరుదును." ఇతి=అని, సః=ఆ వరుణుఁడు, అబ్రవీత్=పలికెను. తస్మాత్=ఆ కారణమువలన, మైత్రావరుణః=మిత్ర వరుణుల సోమరసము, సహ గృహ్యతే=ఏక పాత్రమునందు గ్రహింపఁబడుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, (లోకే=లోకమునందు,) అంశభువా=దాయాదుఁడైన, రాజ్ఞా=రాజుతో కూడినవాఁడై, రాజానమ్=రాజును, ఘ్నన్తి=చంపుచున్నారు. (ఏవమ్=ఈ విధముగ,) వైశ్యేన=దాయాదుఁడైన వైశ్యునితో కూడినవాఁడై, వైశ్యమ్=వైశ్యుని, శూద్రేణ=దాయాదుఁడైన శూద్రునితో కూడినవాఁడై, శూద్రమ్=శూద్రుని, ఘ్నన్తి=సంహరించుచున్నారు. [అంశమ్=ద్రవ్యభాగమ్, భవతే=ప్రాప్నోతీతి, అంశభువః=దాయాదః. ద్రవ్యమునందు భాగమును పొందువాఁడు దాయాదుఁడని వ్యుత్పత్త్యర్థము.]

**తాత్పర్యము:** సోమ భాగమునందు మిత్రునితో దాయాదుఁడైన వరుణునితో కూడ తాము సోమ హననము చేయుదుమని దేవతలు వరుణుని కోరఁగా, "తనతో కూడ మిత్రునకు కూడ ఏక పాత్రమునందు సోమమును గ్రహించవలెనని" వరుణుఁడు వరము కోరెను. అందువలననే మిత్ర వరుణుల సోమము ఏకపాత్రమునందు గ్రహించఁబడుచున్నది. ఇంద్రుఁడు, వరుణుఁడు, సోముఁడు, రుద్రుఁడు మున్నగువారు క్షత్త్రియులుగా బృహదారణ్యకోపనిషత్తునందు పేర్కొనఁబడినారు. అట్టి ఒక కులమునకు చెందినవారు పరస్పరము ఒకరికొకరు దాయాదులగుదురు. సోమరసమును పొందుటలో మిత్రవరుణులు పరస్పరము దాయుదులు. అందువలననే ఒక రాజును దాయాదుఁడైన మఱియొకరాజుతో కూడినవారై సంహరించుచున్నారు. రాముఁడు రావణునకు దాయాదుఁడైన విభీషణునితో కూడినవాఁడై రావణుని సంహరించెను. వైశ్య శూద్రుల విషయమున కూడ ఈ విధముగనే జరుగుచుండును. మిత్రావరుణులకు ఏక పాత్రమునందు సోమ రస గ్రహణ మిచట విహితమైనది.

5. **అర్థము:** ఇదమ్=ఈ కాల స్వరూపము, (పురా=పూర్వము) దివా న ఆసీత్=ఈ మాత్రము పరిమితి గల భాగము పగలు అని లేకుండెను. నక్తం న=ఈ మాత్రము పరిమితి గల భాగము రాత్రి అని లేకుండెను. అవ్యావృత్తమ్=అవిభక్తముగా, ఆసీత్=ఉండెను. "ఇదమ్=ఈ కాల స్వరూపమును, నః=మాకొఱకు, వివాసయుతమ్=విభజించి స్థాపించుఁడు," ఇతి=అని, తే దేవాః=ఆ దేవతలు, మిత్రావరుణౌ=మిత్ర వరుణులను గూర్చి, అబ్రువన్=పలికిరి. అవత్=మాకంటె, (మా గ్రహముకంటె) పూర్వః గ్రహః=పూర్వపుదైన గ్రహము, ఏకః ఏవ=ఒకటియే, గృహ్యాతై ఇతి=గ్రహించఁబడవలెనని, వరమ్=వరమును, వృణావహై=

కోరుదుము" ఇతి=అని, తౌ=ఆ మిత్ర వరుణులు, అబ్రూతామ్=పలికిరి. తస్మాత్=ఆ కారణమువలన, మైత్రావరుణాత్=మైత్రావరుణ గ్రహముకంటె, పూర్వః=పూర్వపుదైన, (పూర్వము) ఐన్ద్రవాయవః=ఇంద్ర వాయువులు దేవతలుగాఁ గల గ్రహము, గృహ్యతే=గ్రహించఁబడుచున్నది.

తాత్పర్యము: పూర్వము ఈ కాల స్వరూపము దివా రాత్రముల విభాగము లేకుండ అవిభక్తముగా నుండెను. అప్పుడు దేవతలు మిత్రావరుణులను చేరి ఈ యవిభక్తముగా ఉన్న కాల స్వరూపమును విభజించుఁడని అడిగిరి. "ఒక గ్రహము మాత్రము మా గ్రహములకంటె పూర్వము గ్రహించవలెనని" వారు వరము కోరుకొనిరి. వారు ఆ విధముగ వరము కోరుటచే మైత్రావరుణ గ్రహముకంటె ముందుగా ఐంద్రవాయవ గ్రహము గ్రహించఁబడుచున్నది. ఇచట మైత్రావరుణ గ్రహమునకు ఐంద్ర వాయవ గ్రహానంతర్యము విధించఁబడినది.

6. అర్థము: ఉపాంశ్వంతర్యామౌ యత్='ఉపాంశువు' 'అంతర్యామము' అను గ్రహములు ఏవి కలవో, ఏతౌ=ఇవి, ప్రాణాపానౌ హి=ప్రాణాపాన స్థానీయములు కదా!

తాత్పర్యము: ఉపాంశ్వంతర్యామ గ్రహములు మైత్రావరుణ గ్రహముకంటె పూర్వమే గ్రహించఁబడుచున్నవి కదా! అను ప్రశ్నకు ఇచట సమాధానము చెప్పఁబడినది. ఉపాంశ్వంతర్యామ గ్రహములు ప్రాణాపాన స్థానీయములు. ప్రాణాపానములు ఉన్నప్పుడే ఇతరేంద్రియముల స్థితి ఉండును. కావున ఉపాంశ్వంతర్యామ గ్రహములకు పూర్వ భావిత్వము నిర్వివాదమే.

7. అర్థము: మిత్రః=మిత్ర దేవుఁడు, (సూర్యుడు) అహః= దివా భాగమును, అజనయత్=కల్పించెను. వరుణః=వరుణ దేవుఁడు, రాత్రిమ్=రాత్రి భాగమును, అజనయత్=కల్పించెను. తతః వై=తదనంతరమే, ఇదమ్=ఈ ఉభయ కాల స్వరూపము, వ్యాచ్ఛత్=విభక్త మాయెను. మైత్రావరుణః= మైత్రావరుణ గ్రహము, గృహ్యతే యత్=గ్రహించఁబడినచో, (ఏతత్=ఈ మైత్రావరుణ గ్రహ గ్రహణము,) వ్యుష్ట్యై=అహోరాత్ర విభాగముకొఱకు, భవేత్= అగును.

తాత్పర్యము: మిత్ర (సూర్య) దేవుఁడు అహస్సును, వరుణ దేవుఁడు రాత్రిని కల్పించిరి. అనఁగా సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వఱకు గల కాలమును అహస్సుగాను, తదనంతరము మఱల సూర్యోదయము వఱకు గల కాలమును రాత్రిగాను మిత్ర వరుణులు వరుసగా కల్పించిరి. అప్పటినుండి ఉభయ కాల స్వరూపము విభక్త మైనది. ఈ విధముగ మైత్రావరుణ గ్రహ గ్రహణము అహోరాత్ర విభాగముకొఱ కగుచున్నది. వరమును పొంది మిత్ర వరుణులు అహోరాత్ర విభాగము చేసిరని యిచట చెప్పఁబడినది.

అష్టమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే చతుర్థ ప్రపాఠకే నవమోఽనువాకః (ఆశ్వినగ్రహ కథనము)

మూలము: [1] యజ్ఞస్య శిరోఽచ్ఛిద్యత తే దేవా అశ్వినా వబ్రువ న్భిషజౌ వై స్థ ఇదం యజ్ఞస్య శిరః ప్రతి ధత్త మితి తావబ్రూతాం వరం వృణావహై గ్రహ ఏవ నావత్రాపి గృహ్యతామితి తాభ్యా మేత మాశ్విన మగృహ్ణన్తతో వై తౌ యజ్ఞస్య శిరః ప్రత్యధత్తాం యదాశ్వినో గృహ్యతే యజ్ఞస్య నిష్కృత్యై [2] తౌ దేవా అబ్రువన్నపూతౌ వా ఇమౌ మనుష్యచరౌ (౧) భిషజావితి తస్మాద్బ్రాహ్మణేన భేషజం న కార్యమపూతో హ్యే౽షోఽమేధ్యో యో భిషక్తౌ బహిష్పవమానేన పవయిత్వా తాభ్యామేత మాశ్విన మగృహ్ణ న్తస్మాద్బహిష్పవమానే స్తుత ఆశ్వినో గృహ్యతే [3] తస్మాదేవం విదుషా బహిష్పవమాన ఉపసద్యః పవిత్రం వై బహిష్పవమాన ఆత్మానమేవ పవయతే [4] తయోస్త్రేధా భైషజ్యం వి న్యద ధురగ్నౌ తృతీయ మప్సు తృతీయం బ్రాహ్మణే తృతీయం తస్మాదుదపాత్రమ్ ( ౨) ఉప నిధాయ బ్రాహ్మణం దక్షిణతో నిషాద్య భేషజం కుర్యాద్యావదేవ భేషజం తేన కరోతి సమర్ధుకమస్య కృతం భవతి [5] బ్రహ్మవాదినో వదన్తి కస్మాత్సత్యాదేకపాత్రా ద్విదేవత్యా గృహ్యన్తే ద్విపాత్రా హూయన్త ఇతి [6] యదేకపాత్రా గృహ్యన్తే తస్మాదేకో ఽన్తరతః ప్రాణో ద్విపాత్రా హూయన్తే తస్మాద్ద్వాద్వౌ బహిష్టాత్ప్రాణాః [7] ప్రాణా వా ఏతే యద్ద్విదేవత్యాః పశవ ఇడా యదిడాం పూర్వాం ద్విదేవ త్యేభ్య ఉపహ్వయేత (3) పశుభిః ప్రాణానన్తర్దధీత ప్రమాయుకః స్యాద్ద్విదేవత్యా న్భక్షయిత్వేడా ముప హ్వయతే ప్రాణానేవాఽఽత్మన్ధిత్వా పశూనుప హ్వయతే [8] వాగ్వా ఐన్ద్రవాయవ శ్చక్షుర్మైత్రా

వరుణః శ్రోత్రమాశ్వినః పురస్తా దైన్ద్రవాయవం భక్షయతి తస్మాత్పురస్తాద్వాచా వదతి పురస్తా

న్మైత్రావరుణం తస్మాత్పురస్తా చ్చక్షుషా పశ్యతి సర్వతః పరిహార మాశ్వినం తస్మాత్సర్వతః శ్రోత్రేణ

శృణోతి [9] ప్రాణా వా ఏతే యద్ద్విదేవత్యాః (౪) అరిక్తాని పాత్రాణి సాదయతి తస్మాదరిక్తా అన్తరతః

ప్రాణా యతః ఖలు వై యజ్ఞస్య వితతస్య న క్రియతే తదను యజ్ఞగ్ం రక్షాగ్ంస్యవ చరన్తి యదరి

క్తాని పాత్రాణి సాదయతి క్రియమాణమేవ తద్యజ్ఞస్య శయే రక్షసా మనన్వచారాయ [10] దక్షిణస్య

హవిర్ధానస్యోత్తరస్యాం వర్తన్యాగ్ం సాదయతి వాచ్యేవ వాచం దధా త్యా తృతీయసవనాత్పరి శేరే

యజ్ఞస్య సంతత్యై(౫)||

(మనుష్యచరా ఏదపాత్ర ముపహ్వయేత ద్విదేవత్యాః షట్చత్వారిగ్ ంశచ్చ)
ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే నవమోఽనువాకః|| ౯||

# వేదార్థదీపిక

అవతారిక: అష్టమానువాకమునందు మైత్రావరుణ గ్రహమును గూర్చి చెప్పఁబడినది. ఈ నవమానువాకమునందు ఆశ్విన గ్రహమును గూర్చి చెప్పఁబడుచున్నది. ఈ యాశ్విన గ్రహ గ్రహణమునకు సంబంధించిన మంత్రములు ప్ర. కాం. చ. ప్ర. షష్ఠ సప్తమానువాకములం దభిహితము లైనవి. కాని ఆ మంత్రముల కీ యనువాకము వివరణాత్మకము కాదు. ఇది అశ్వినీ దేవతలకు సంబంధించిన గ్రహము కావున అశ్వినీ దేవతల కిచటగల ప్రాధాన్యము మున్నగు విషయములు వివరింపఁబడినవి.

1. అర్థము: (పురా=పూర్వము), యజ్ఞస్య= యజ్ఞపురుషునియొక్క, శిరః=శిరస్సు, అచ్ఛిద్యత=ఛేదించఁబడెను. తే దేవాః=ఆ దేవతలు, అశ్వినౌ=అశ్వినీ దేవతలను గూర్చి, అబ్రువన్=పలికిరి. "భిషజౌ వై=వైద్యులు గానే, స్థ=ఉంటున్నారు. (ఉండుఁడు.) యజ్ఞస్య= యజ్ఞపురుషునియొక్క, ఇదం శిరః=ఈ శిరస్సును, ప్రతి ధత్తమ్=(ఛేదించఁబడిన దానిని) మరల స్థాపించుఁడు." ఇతి=అని, (అబ్రువన్=పలికిరి) "నౌ=మా కొఱకు, అత్రాపి=ఈ అగ్నిష్టోమమునందు కూడ, గ్రహః ఏవ=(సోమ రస) గ్రహమే, గృహ్యతామ్=గ్రహింపఁబడవలెను, ఇతి=అని, వరమ్= వరమును, వృణామహై=కోరుదుము" ఇతి=అని, తౌ=ఆ యశ్వినీ దేవతలు, అబ్రూతామ్=పలికిరి. (తదా=అప్పుడు,) తాభ్యామ్=ఆ యశ్వినీ దేవతలకొఱకు, ఏతమ్ ఆశ్వినమ్=ఈ యాశ్విన గ్రహమును, అగృహ్ణన్=గ్రహించిరి. తతః వై=ఆ కారణమువలననే, తౌ=ఆ యశ్వినీ దేవతలు, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, శిరః= శిరస్సును, ప్రత్యధత్తామ్=మరల స్థాపించిరి. ఆశ్వినః=ఆశ్విన గ్రహము,

గృహ్యతే యత్=గ్రహింపఁబడినచో, (ఏతత్=ఈ ఆశ్విన గ్రహ గ్రహణము), యజ్ఞస్య= యజ్ఞముయొక్క, నిష్కృత్యై=నిష్కృతి (ప్రాయశ్చిత్తము) కొఱకు, భవతి= అగుచున్నది.

తాత్పర్యము: పూర్వ మొకప్పుడు యజ్ఞపురుషుఁడు దేవతల వస్తువును తీసికొని దేవతలతో యుద్ధము చేయుటకై ధనువును సజ్యము చేసి ఎడమ చేతితో పట్టుకొని ఆ ధనువుయొక్క ఒక అంచును భూమియం దానించి, రెండవ అంచును కంఠమునం దానించుకొని యుండెను. అప్పుడు ఉపదీకము లనెడి జంతువులు భూమియందలి ధనుష్కోటిని భక్షించఁగా కంఠమునందున్న రెండవ అంచు ఊర్ధ్వ భాగమునకు వెడలుచు యజ్ఞపురుషుని శిరస్సును కూడ ఛేదించి పైకి పోయెను. ఈ కథాభాగము "యజ్ఞస్య శిరః అచ్ఛిద్యత" అను మంత్ర భాగముచే వ్యక్త మగుచున్నది. ఈ వృత్తాంతము ప్రవర్గ్య బ్రాహ్మణమునందు "తస్య ధను ర్విప్రవమాణక్ం శిర ఉదవర్తయత్" అను చోట సమామ్నాత మైనది.

"ఓ యశ్వినులారా! మీరు వైద్యులుగానే ఉండుఁడు. ఈ యజ్ఞపురుషుని శిరస్సును మఱల స్థాపించుఁ"డని దేవతలు అశ్వినీ దేవతలను కోరిరి. "ఈ యగ్నిష్టోమమునందు కూడ మాకొఱకు సోమ రస గ్రహమును గ్రహించవలెనని" వారు వరమును కోరిరి. అప్పుడు దేవతలు వారికొఱకు ఈ యాశ్విన గ్రహమును గ్రహించిరి. ఆ కారణమువలననే వారు యజ్ఞపురుషుని శిరస్సును పునః ప్రతిష్ఠితము చేసిరి. కనుక ఆశ్విన గ్రహము గ్రహింపఁబడినచో అది యజ్ఞముయొక్క ప్రాయశ్చిత్తముకొఱ కగును. ఇచట ఆశ్విన గ్రహ గ్రహణము సోపపత్తికముగ విధింపఁబడినది. ఈ వృత్తాంతము జరుగుటకు పూర్వము అగ్నిష్టోమమునందు ఆశ్విన గ్రహ గ్రహణము లేదు. "ఆశ్వినం ద్వికపాల మాశ్వినం ధూమ్ర లలామ మా లభేత" అని అశ్వినీ దేవతలకు ఇష్టి పశువుల సంబంధమైన హవిస్సు కలదు. మఱియు లేపమార్జనాదికము కూడ కలదు. దానిచే తమకు పరితోషము లేదనియు, గ్రహ గ్రహణముచేతనే సంతోషము కలుగుననియు అశ్వినీ దేవతల యభిప్రాయమని యీ సన్నివేశమువలన వ్యక్త మగుచున్నది.

2. అర్థము: ఇమౌ=ఈ అశ్వినీ దేవతలు, మనుష్య చరౌ= మనుష్యులుగా (భూలోకమునందు) సంచరించుచున్న, భిషజౌ ఇతి=వైద్యులు కనుక, అపూతౌ వై=అపవిత్రులే. తస్మాత్=ఆ కారణమువలన, బ్రాహ్మణేన= బ్రాహ్మణునిచేత, భేషజమ్=వైద్యము, న కార్యమ్=చేయఁదగినది కాదు; ఇతి=అని, దేవాః=దేవతలు, తౌ=ఆ యశ్వినీ దేవతలను గూర్చి, అబ్రువన్= పలికిరి. యః భిషక్=ఏ వైద్యుఁడు, అపూతః=పవిత్రుఁడుగా చేయఁబడనివాఁడో, ఏషః=ఇతఁడు, అమేధ్యః హి=పొందఁదగనివాఁడు కదా!, (అతః=ఈ కారణము వలన), తౌ=ఆ అశ్వినీ దేవతలను, బహిష్పవమానేన=బహిష్పవమాన స్తోత్రముచేత, పవయిత్వా=పవిత్రులనుగాఁ జేసి, తాభ్యామ్=ఆ యశ్వినీ దేవతలకొఱకు, ఆశ్వినమ్=అశ్వినుల సంబంధియగు గ్రహమును, అగృహ్ణన్=గ్రహించిరి. తస్మాత్=ఆ కారణమువలన, బహిష్పవమానే=బహిష్పవమాన స్తోత్రము, స్తుతే=స్తుతింపఁబడినఁదగుచుండఁగా, ఆశ్వినః=ఆశ్విన గ్రహము, గృహ్యతే=గ్రహింపఁబడుచున్నది.

తాత్పర్యము: "ఈ యశ్వినీ దేవతలు భూలోకమునందు మనుష్యులుగా సంచరించుచున్న వైద్యులు కనుక, అపవిత్రులు. కావున బ్రాహ్మణుఁడు వైద్యము చేయరాదు" అని దేవతలు ఆ యశ్వినీ దేవతలను గూర్చి పలికిరి. పవిత్రుఁడుగా చేయఁబడని వైద్యుఁడు పొందఁదగనివాఁడు కదా! అందువలన దేవతలు ఆ యశ్వినీ దేవతలను బహిష్పవమాన స్తోత్రముచేత పవిత్రులనుగాఁ జేసి వారికొఱకు ఆశ్విన గ్రహమును గ్రహించిరి. ఆ కారణమువలన బహిష్పవమాన స్తోత్రము స్తుతింపఁబడిన పిమ్మట ఆశ్విన గ్రహము గ్రహింపఁబడుచున్నది. బహిష్పవమాన స్తోత్రానంతరము ఆశ్విన గ్రహము గ్రహింపవలయునను విధి యిచట చెప్పఁబడినది. ఇచట 'అపూతః', 'అమేధ్యః' అను రెండు పదములు సమానార్థకము లుపాత్తము లైనవి. "పూత శబ్దము" "పూఞ్= పవనే" అను ధాతువునుండి ఉత్పన్న మైనది. పరిశుద్ధముగాఁ జేయునది యని యర్థము. 'మేధ్య' శబ్దము

"మేధృ=సంగమే" అను ధాతువునుండి పుట్టినది. పొందఁదగినది యని యర్థము. పూతము కానిది అపూతము. మేధ్యము కానిది అమేధ్యము. కనుక వ్యుత్పత్త్యర్థమున రెండు శబ్దములకు కొంచెము భేదము కనఁబడుచున్నది.

3. అర్థము: తస్మాత్=ఆ కారణమువలన, ఏవం విదుషా= బహిష్పవమాన స్తోత్రము శుద్ధి హేతువని తెలిసికొనినవానిచే, బహిష్పవమానః= బహిష్పవమాన స్తోత్రము, ఉపసద్యః=అనుష్ఠించఁదగినది. బహిష్పవమానః= బహిష్పవమాన స్తోత్రము, పవిత్రం వై=పరిశుద్ధముగాఁ జేయునదియే. (తథా సతి=అట్లు కాఁగా, యజమానః=యజమానుఁడు), ఆత్మానమ్ ఏవ= తననే, పవయతే=పవిత్రునిగాఁ జేసికొనినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: బహిష్పవమాన స్తోత్రము శుద్ధిహేతు వగుటవలన, ఆ స్తోత్రము శుద్ధి చేయునదని తెలిసికొనిన యతఁడు తననే పవిత్రునిగాఁ జేసికొనినవాఁ డగును. ఇచట బహిష్పవమాన స్తోత్రానుష్ఠానము విహిత మైనది.

4. అర్థము: అగ్నౌ=అగ్నియందు, తృతీయమ్=భైషజ్యముయొక్క మూఁడవ భాగము, అస్తి=కలదు. అప్సు=ఉదకములందు, తృతీయమ్=భైషజ్యముయొక్క మూఁడవ భాగము, అస్తి=కలదు, బ్రాహ్మణే=బ్రాహ్మణునియందు, తృతీయమ్=భైషజ్యముయొక్క మూఁడవ భాగము, అస్తి=కలదు. తయోః= ఆ యశ్వినీ దేవతలందు, త్రేధా భైషజ్యమ్=ఆ మూఁడు విధములైన భైషజ్యమును, ( దేవాః=దేవతలు,) వి న్యదధుః=స్థాపించిరి. తస్మాత్=ఆ కారణమువలన, ( లౌకికః భిషక్=ఈ లోకమునందలి వైద్యుఁడు, తదనుగ్రహాయ=ఆ యశ్వినుల యనుగ్రహముకొఱకు,) ఉదపాత్రమ్=ఉదక పూర్ణమైన పాత్రమును, ఉప నిధాయ= సమీపమున ఉంచి, బ్రాహ్మణమ్=బ్రాహ్మణుని, దక్షిణతః= (తనకు) దక్షిణ దిక్కునందు, నిషాద్య=కూర్చుండఁజేసి, భేషజమ్=వైద్యమును, కుర్యాత్=చేయవలెను. భేషజం యావదేవ=వైద్య కలాపము ఏ మాత్రమైతే, అస్తి= కలదో, తేన కరోతి=ఆ సమస్తమైన అంగజాతములో వైద్యము చేసినవాఁ డగును. ( తదా=అప్పుడు) అస్య=ఈ లౌకిక వైద్యునియొక్క, (భైషజ్యమ్=వైద్యము,) సమధుపర్కమ్=సమృద్ధముగా, కృతమ్=చేయఁబడినది, భవతి=అగును.

తాత్పర్యము: వైద్యమునందు అదృష్టముద్వారా ఉపకారకమైన అంశము కలదు. అందు ఒక మూఁడవ భాగము అగ్నియందు, ఒక మూఁడవ భాగము ఉదకములందు, ఒక మూఁడవ భాగము బ్రాహ్మణుని యందు కలవు. దేవతలు ఆ మూఁడు భాగములను అశ్వినీ దేవతలయందు స్థాపించిరి. కావున ఆ యశ్వినీ దేవతల యనుగ్రహమును పొందుటకై లౌకికుఁడైన వైద్యుఁడు తాను వైద్యము చేయునపుడు ఉదక పూర్ణమైన పాత్రమును సమీపమున నుంచుకొని, బ్రాహ్మణుని దక్షిణ భాగమున కూర్చుండఁజేసి, అగ్నిని ప్రజ్వలింపఁజేసి వైద్యమును చేయవలెను. అట్లు చేయుటవలన ఆ వైద్యుఁడు సమస్తమైన అంగజాతములో (కార్యకలాపములో) కూడిన వైద్యమును చేసినవాఁ డగును. అప్ప డీ వైద్యుఁడు చేసిన వైద్యము సమృద్ధ మగును. ప్రసంగ వశమున లౌకిక చికిత్సయందు అదృష్టము ద్వారా ఉపకారకమైన అంశము కలదను విషయ మిచట చెప్పఁబడినది.

5. అర్థము: కస్మాత్ సత్యాత్=ఏ కారణమువలన, ఏకపాత్రాః=ఒక పాత్రమునం దుంచఁబడినవియు, ద్విదేవత్యాః=ఇద్దఱు దేవతలు కలవియునగు సోమరసములు, గృహ్యన్తే=గ్రహింపఁబడుచున్నవి? ద్విపాత్రాః=రెండు పాత్రములందు ఉంచఁబడిన సోమరసములు, హూయన్తే=హోమము చేయఁబడుచున్నవి? ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి= చెప్పుచున్నారు (ప్రశ్నించుచున్నారు).

తాత్పర్యము: ఒక్కొక్క పాత్రమునందు సోమరసము నుంచి ఆ పాత్రములు ఇద్దఱేసి (మిత్రావరుణులు, అగ్నివాయువులు అను విధమున) దేవతలకొఱకు గ్రహింపఁబడుచున్నవి. ద్విపాత్రములైన సోమరసములు హోమము చేయఁబడు చున్నవి. ఎందువలన ఈ విధముగ చేయఁబడుచున్నది? అని మంత్రజ్ఞులు పరస్పరము ప్రశ్నించుకొనుచున్నారు.

(గ్రహణ కాలమునందు ఏక పాత్రత్వము, హోమకాలమునందు ద్విపాత్రత్వము ఎందువలన? అని మంత్రజ్ఞుల ప్రశ్న.)

6. అర్థము: **యత్**=ఏకారణమువలన, ఏకపాత్రాః గృహ్యన్తే=ఏక పాత్రములు గ్రహింపఁబడుచున్నవో, **తస్మాత్**=ఆ కారణమువలన, **అన్తరతః**= చక్షురాదులైన ఇంద్రియముల లోపల, ప్రాణః=ప్రాణము, ఏకః=ఒక్కటియే. **యత్**=ఏ కారణమువలన, ద్విపాత్రాః=ద్విపాత్ర (సోమరస)ములు, హూయన్తే= హోమము చేయఁబడు చున్నవో, **తస్మాత్**=ఆ కారణమువలన, బహిష్టాత్= బహిర్భాగమున, ద్వౌ ద్వౌ ప్రాణాః=రెండేసి ప్రాణములు, విద్యన్తే=ఉంటున్నవి.

తాత్పర్యము: సోమరసము నుంచిన పాత్రములు (గ్రహములు) ఒక్కొక్కటిగా గ్రహింపఁబడుచున్నవి. కనుకనే చక్షురా దీంద్రియముల లోపలఁ గల ప్రాణము ఒక్కటిగా ఉన్నది. సోమరస పూర్ణములైన పాత్రములు రెండేసి చొప్పున హోమము చేయఁబడుచున్నవి. కనుకనే చక్షురాదీంద్రియముల బహిర్భాగమున రెండేసి ద్వారము లుండుటచే ద్వారభేదముచే 'కన్నులు రెండు, చెవులు రెండు' అని రెండు రెండు ప్రాణములుగా వ్యవహారము జరుగుచున్నది. (చక్షురాది ప్రాణములకు లోపల ఏకాత్మకత్వము, బహిర్ద్వార భేదముచే ద్విత్వము వ్యవహ రింపఁబడుచున్నది. కావున తత్సామ్యముకొఱకు ఇచట ఏక పాత్రత్వము ద్విపాత్రత్వము చేయవలయునని భావము. ఇది పూర్వోక్త ప్రశ్నకు సమాధానము.)

7. అర్థము: ద్వి దేవత్యాః యత్=ద్వి దేవతాక పురోడాశము లేవి కలవో, ఏతే=ఇవి, ప్రాణాః వై=యజ్ఞమునకు ప్రాణములే. పశవః=పశువులు, ఇడా= ఈడా స్వరూపములు. ద్వి దేవత్యేభ్యః=ద్వి దేవతాకములైన పురోడాశములకంటె, పూర్వామ్=పూర్వమైన దానినిగా, ఇడామ్=ఇడను, ఉపహ్వయేత యత్= ఉపాహ్వా నము చేయుచో, (తదా=అప్పుడు), పశుభిః=పశువులచే, ప్రాణాన్= ప్రాణములను, అన్తర్దధీత=అంతర్ధానము చేసినవాఁడగును. ప్రమాయుకః స్యాత్=యజమానుఁడు మరణశీలుఁడగును. (తత్=ఆ కారణమువలన), ద్వి దేవత్యాన్=ద్వి దేవతాకములైన పురోడాశములను, భక్షయిత్వా=భక్షించి, ఇడామ్=ఇడను, ఉపహ్వా యతే=ఉపాహ్వానము చేయవలెను. (తదా=అప్పుడు, సః=ఆ యజమానుఁడు,) ప్రాణాన్=ప్రాణములను, ఆత్మన్=తనయందు, ధిత్వైవ=ధరించియే, పశూన్=పశువులను, ఉపహ్వయతే=ఉపాహ్వానము చేసినవాఁడగను.

తాత్పర్యము: ద్వి దేవతాకములయిన పురోడాశములు యజ్ఞమునకు ప్రాణము వంటివి. ఇడ పశురూపము. ప్రాణ రూపములయిన ద్వి దేవత్య పురోడాశములను భక్షించుటకంటె ముందుగా ఇడ నాహ్వానము చేసినచో, పశువులచే ప్రాణము లంతర్హితము (తిరోహితము) లగును. అప్పుడు యజమానుఁడు మరణశీలుఁ డగును. కావున యజమానుఁడు ద్వి దేవతాక పురోడాశ భక్షణము చేసి అనంతరము ఇడ నాహ్వానము చేయవ లెను. అప్పుడతఁడు ఆత్మయందు ప్రాణములను ధరించియే ఇడ నాహ్వానించినవాఁ డగును. [అనఁగా ద్వి దేవత్య పురోడాశములను హోమము చేయఁగా శేషించిన దానిని భక్షించి తదనంతరము ఇడోపాహ్వానము చేయుటవలన యజమానునకు మరణ దోషము కలుగదు. భక్షణమునకు ముందే ఇడోపాహ్వానము చేసినచో ప్రాణములు వ్యవహితము లగుటచే నతఁడు మరణించును. ఇచట ద్వి దేవత్య శేష భక్షణానంతరము ఇడోపాహ్వానమునకు ఉత్కర్షము చెప్పఁబడినది.]

8. అర్థము: ఐన్ద్రవాయవః=ఇంద్ర వాయు దేవతాకమైన పురోడాశము, వాక్ వై=వాగ్రూపమే, మైత్రావరుణః=మిత్ర వరుణ దేవతాకమైన పురోడాశము, చక్షుః=చక్షూ రూపము. ఆశ్వినః=అశ్వినీదేవ దేవతాకమైన పురోడాశము, శ్రోత్రమ్=శ్రోత్ర రూపము. పురస్తాత్=ప్రథమమున, ఐన్ద్రవాయవమ్=ఇంద్ర వాయు దేవతాక పురోడాశ మును, భక్షయతి=భక్షించవలెను. **తస్మాత్**=ఆ కారణమువలన, పురస్తాత్=ప్రథమమున, వాచా=వాగిం ద్రియముచే, వదతి= మాటలాడుచున్నాఁడు. పురస్తాత్=ప్రథమమున (ఆశ్వినముకంటె ముందుగా), మైత్రా

వరుణమ్=మిత్రుఁడు వరుణుఁడు దేవతలుగాఁగల పురోడాశమును, భక్షయతి=భక్షించవలెను. తస్మాత్=ఆ కారణమువలన, పురస్తాత్=ముందుగా, చక్షుషా=చక్షురింద్రియముచే, పశ్యతి=చూచుచున్నాఁడు. సర్వతః పరిహారమ్=శిరః ప్రదక్షిణము చేసి, ఆశ్వినమ్=అశ్వినీ దేవతాక పురోడాశమును, భక్షయతి=భక్షించవలెను. తస్మాత్=ఆ కారణమువలన, సర్వతః=అంతటను, శ్రోత్రేణ=శ్రోత్రేంద్రియముచే, శృణోతి=వినుచున్నాఁడు.

తాత్పర్యము: ఐంద్ర వాయవాది దేవతాకములైన పురోడాశములను యథోక్త క్రమమున భక్షించవలెను. కనుకనే మానవుడు మాట్లాడుట, చూచుట అను క్రియలను యథాక్రమముగ చేయుచున్నాడు. (ఇచట భక్షణమునందలి విశేషము విహిత మైనది.

9\. అర్థము: ద్వి దేవత్యాః యత్=ద్వి దేవతాకములైనవి ఏవి కలవో, ఏతే=ఇవి, ప్రాణాః వై=యజ్ఞమునకు ప్రాణములే. అరిక్తాని=అరిక్తములైన, పాత్రాణి=పాత్రములను (ఐంద్ర వాయవాది గ్రహములను,) సాదయతి=ఉంచవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాణాః=ప్రాణములు, అన్తరతః=లోపల, అరిక్తాః=అరిక్తములు. విత్యా=విస్తీర్ణమైన (బహ్వాంగోపేతయైన), యజ్ఞస్య= యజ్ఞమునకు, యతః ఖలు వై=ఏ దిశనుండియైతే, న క్రియతే=అంగము చేయఁబడుటలేదో, తదను=అప్పుడు (ఆ దిశనుండి), రక్షాంసి=రాక్షసులు, అవ చరన్తి=సంచరించుచుందురు అరిక్తాని పాత్రాణి=అరిక్తములైన పాత్రము (గ్రహము) లను, సాదయతి యత్=సాదనము చేసినచో (ఉంచినచో), యజ్ఞస్య=యజ్ఞముయొక్క, తత్=ఆ యనుష్ఠించఁబడని యంగము, క్రియమాణమ్ ఏవ=చేయఁబడినదియే అయి, శయే=ఉంటున్నది. ఏతత్=ఇది, రక్షసామ్=రాక్షసులయొక్క, అనన్వవచారాయ=సంచారాభావముకొఱకు, భవతి=అగుచున్నది, అరిక్తాని= ఆర్ద్ర స్థానముతో కూడినవి.

తాత్పర్యము: ద్వి దేవత్యములయిన గ్రహములు యజ్ఞమునకు ప్రాణములవంటివి. ఆ కారణముచే ఆ గ్రహములను అరిక్తములుగా నుంచవలెను. సోమ రసమును నింపుటకై ఖర ప్రదేశమునందు ఉంచఁబడిన పాత్రములందు పురోడాశాది శకలముల నుంచి వానిని సాదనము చేయవలెను. యజ్ఞము బహ్వాంగోపేత మగుటచే విస్తృత మైనది. అట్టి విస్తృతమైన యజ్ఞము ననుష్ఠించుటలో యజమానుఁడు ప్రమాదవశమున ఏ యంగము నైనను అనుష్ఠించనిచో ఆ లోపమును పురస్కరించుకొని ఆ యజ్ఞమునందు రాక్షసులే సంచరింపఁగలరు. అరిక్త పాత్రములను సాదనము చేసినచో ఏ యంగమైన లోపించినను, ఆ యంగము అనుష్ఠిత మైనదిగానే యగును. అప్పుడు రాక్షసులు యజ్ఞమునందు సంచరింపలేరు. ఇచట పాత్రముల సాదనమున పురోడాశ శకలాది సహితత్వము విధించఁబడినది. ఐన్ద్రవాయవ గ్రహమునందు పురోడాశ శకలమును, మైత్రావరుణ గ్రహమునందు పయస్యను, ఆశ్విన గ్రహమునందు ధానములను ఉంచవలెనని కల్పసూత్రము వివరించినది.

10\. అర్థము: దక్షిణస్య హవిర్ధానస్య=దక్షిణపుదైన హవిర్ధానముయొక్క, ఉత్తరస్యాం వర్త్మన్యామ్=ఉత్తరపు చక్రముయొక్క మార్గమునందు, సాదయతి=గ్రహములను ఉంచవలెను. వాచ్యేవ=వర్త్మరూప వాక్కునందే, వాచమ్= గ్రహరూప వాక్కును, దధాతి=స్థాపించినవాఁడగును.

తాత్పర్యము: ఇచట గ్రహ సాదన స్థానము విధించఁబడుచున్నది. హవిర్ధానముల రెండింటిలో దక్షిణ దిశయందలి హవిర్ధానముయొక్క ఉత్తరపు చక్రముయొక్క మార్గమునందు పూర్వోక్తములయిన గ్రహముల నుంచవలెను. అట్లు సాదనము చేసిన యజమానుఁడు వర్త్మరూప వాక్కునందే గ్రహరూప వాక్కు నుంచినవాఁడగును. ఇచట వర్త్మయందు గ్రహమునందు కూడ వాక్త్వము ఆరోపించఁబడినది.

11\. అర్థము: యజ్ఞస్య=యజ్ఞమునకు, సంతత్యై=విచ్ఛిత్తి లేకుండుటకై, ఆ తృతీయసవనాత్=తృతీయ సవనము వఱకు, పరి శేరే=గ్రహములను ఉంచవలెను.

**తాత్పర్యము:** యజ్ఞము అవిచ్ఛిన్నముగ కొనసాగుటకై సాదనము చేసిన గ్రహములను తృతీయ సవనము పర్యంతము ఉంచవలెను. ఇచట సాదితములైన గ్రహములకు అవస్థానావధి విధించఁబడినది.

నవమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే చతుర్థ ప్రపాఠకే దశమోఽనువాకః

మూలము: [1]బృహస్పతి ర్దేవానాం పురోహిత ఆసీ చ్ఛణ్డామర్కా వసురాణాం బ్రహ్మణ్వన్తో దేవా ఆస న్బ్రహ్మ
ణ్వన్తోఽ సురాస్తే? ఽ న్యోన్యం నా శక్నువ న్నభిభవితుం తే దేవాః శణ్డామర్కా వుపామన్త్రయన్త
తావబ్రూతాం వరం వృణావహై గ్రహావేవ నావత్రాపి గృహ్యేతామితి తాభ్యామేతౌ శుక్రామన్థినా
వగృహ్ణన్తతో దేవా అభవ న్పరాఽసురా యస్యైవం విదుషః శుక్రామన్థినౌ గృహ్యేతే భవత్యాత్మనా
పరా (1)అస్య భ్రాతృవ్యో భవతి [2]తౌ దేవా అపనుద్యా ఽఽత్మన ఇన్ద్రాయా జుహవు రప
నుత్తౌ శణ్డామర్కా సహామునేతి బ్రూయాద్యం ద్విష్యాద్యమేవ ద్వేష్టి తేనైనౌ సహాప నుదతే [3]స
ప్రథమః సంకృతి ర్విశ్వకర్మేత్యేవైనా వాత్మన ఇన్ద్రాయాజుహవు రిన్ద్రో హ్యేతాని రూపాణి కరిక్రద
చ్చర [4] దసౌ వా ఆదిత్యః శుక్రశ్చన్ద్రమా మన్థ్యపిగృహ్య ప్రాఞ్చౌ నిః (2)క్రామత స్తస్మాత్ప్రాఞ్చౌ
యన్తౌ న పశ్యన్తి [5]ప్రత్యఞ్చావావృత్య జుహుత స్తస్మాత్ప్రత్యఞ్చౌ యన్తౌ పశ్యన్తి [6]చక్షుషీ వా
ఏతే యజ్ఞస్య యచ్ఛుక్రామన్థినౌ నాసికోత్తరవేది రభితః పరిక్రమ్య జుహుత స్తస్మాదభితో నాసికాం
చక్షుషీ తస్మాన్నాసికయా చక్షుషీ విధృతే సర్వతః పరిక్రామతో రక్షసా మపహత్యై [7]దేవా వై యాః
ప్రాచీరాహుతీ రజుహవుర్యే పురస్తాదసురా ఆసన్తాగ్ంస్తాభిః ప్ర (3)అనుదన్త యాః ప్రతీచీర్యే పశ్చా
దసురా ఆసన్తాగ్ంస్తాభి రపానుదన్త ప్రాచీరన్యా ఆహుతయో హూయన్తే ప్రత్యఞ్చౌ శుక్రామన్థినౌ
పశ్చాచ్చైవ పురస్తాచ్చ యజమానో భ్రాతృవ్యాన్ప్ర ణుదతే తస్మాత్పరాచీః ప్రజాః ప్ర వీయన్తే ప్రతీచీ

ర్జాయన్తే [8]శుక్రామన్థినౌ వా అను ప్రజాః ప్రజాయన్తే ఽత్రీశ్చాఽఽద్యాశ్చ సువీరాః ప్రజాః ప్రజనయ

న్పరీహి శుక్రః శుక్రశోచిషా (౪)సుప్రజాః ప్రజాః ప్రజనయ న్పరీహి మన్థీ మన్థిశోచిషేత్యాహైతా వై

సువీరా యా అత్రీరేతాః సుప్రజా యా ఆద్యా [9]య ఏవం వేదాత్ర్యస్య ప్రజా జాయతే నాఽఽద్యా

[10]ప్రజాపతే రక్ష్యశ్వయత్తత్పరా ఽపత త్తద్వికఙ్కతం ప్రావిశ త్తద్వికఙ్కతే నారమత తద్యవం ప్రావి

శత్తద్యవే ఽరమత తద్యవస్య (౫)యవత్వం యద్వైకఙ్కతం మన్థిపాత్రం భవతి సక్తుభిః శ్రీణాతి

ప్రజాపతేరేవ తచ్చక్షుః సం భరతి [11]బ్రహ్మవాదినో వదన్తి కస్మాత్సత్యా న్మన్థిపాత్రగ్ం సదో నాశ్నుత

ఇత్యార్తపాత్రగ్ం హీతి బ్రూయాద్యదశ్నువీతాన్ధోఽధ్వర్యుః స్యాదార్తి మార్ఛేత్తస్మా న్నాశ్నుతే(౬)

(ఆత్మనా పరా నిష్పి శుక్రశోచిషా యవస్య సప్తత్రిగ్ంశచ్చ।)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థ ప్రపాఠకే దశమోఽనువాకః ||౧౦||

## వేదార్థదీపిక

అవతారిక: ఆశ్విన గ్రహమునకు సంబంధించిన విషయము సవిశేషముగా నవమానువాకమునందు వివరించఁబడినది. ఈ దశమానువాకమునందు శుక్ర మంథి గ్రహములను గూర్చి వివరించఁబడుచున్నది.

1. అర్థము: బృహస్పతిః=బృహస్పతి, దేవానామ్=దేవతలకు, పురోహితః=పురోహితుఁడుగా, ఆసీత్=ఉండెను. అసు రాణామ్=రాక్షసులకు, శణ్డామర్కౌ=శండుఁడు మర్కుఁడు అను వారు, (పురోహితౌ= పురోహితులుగా, ఆస్తామ్=ఉండిరి.) దేవాః=దేవతలు, బ్రహ్మణ్వన్తః= పురోహితానుష్ఠిత మంత్ర సామర్థ్యము కలవారుగా, ఆసన్=ఉండిరి. అసురాః= రాక్షసులు, బ్రహ్మణ్వన్తః, ఆసన్. తే=ఆ దేవతలు, రాక్షసులు, అన్యోన్యమ్= పరస్పరము (ఒకరి నొకరు), అభిభవితుమ్=పరిభవించుటకొఱకు, న అశక్నువన్= సమర్థులు కారైరి. తే దేవాః=ఆ దేవతలు, శణ్డామర్కౌ=శండామర్కులను, ఉపామన్త్రయత=దగ్గఱకు ఆహ్వానించిరి. తౌ=ఆ శండామర్కులు, "నౌ=మాకు, అత్రాపి=ఈ జ్యోతిష్టోమ యాగమునందు కూడ, గ్రహావేవ=గ్రహములే, (సోమరసముతో నిండిన పాత్రములే) గృహ్యాతామ్=గ్రహించబడవలెను, ఇతి=అని, వరమ్=వరమును, వృణా వహై=కోరుకొందుము," ఇతి=అని, అబ్రూతామ్= పలికిరి. తాభ్యామ్=ఆ శండామర్కులకొఱకు, ఏతౌ శుక్రామన్థినౌ=ఈ శుక్ర మన్థి గ్రహములను, అగృహ్ణన్=(దేవతలు) గ్రహించిరి. తతః=ఆ విధముగ గ్రహములను గ్రహించుటవలన, దేవాః=దేవతలు, అభవన్=విజయులైరి. అసురాః=రాక్షసులు, పరాభవన్=తిరస్కృతులైరి. ఏవం విదుషః=ఈ విధముగ తెలిసికొనిన, యస్య= ఎవని నిమిత్తము, శుక్రామన్థినౌ=శుక్ర మంథి గ్రహ

ములు, గృహ్యేతే=గ్రహించఁ బడునో, (సః=అతడు), ఆత్మనా=స్వయముగ, భవతి=విజయవంతుఁ డగును. అస్య=ఇతనియొక్క, భ్రాతృవ్యః=శత్రువు, పరాభవతి=తిరస్కృతుఁ డగును.

తాత్పర్యము: బృహస్పతి దేవతలకు పురోహితుఁడుగా నుండెను. శండామర్కులు (శండుఁడు, మర్కుఁడు) అసురులకు పురోహితులుగా నుండిరి. వా రుభయులును పురోహితులుగా మంత్ర తంత్రముల ననుష్ఠించుటకు సమర్థులుగా నుండిరి. కావున వారిలో ఒకరు నొకరు పరిభవించుటకు సమర్థులుగా లేరు. అప్పుడు దేవతలు శండామర్కులను రహస్యముగ తమయొద్ద కాహ్వానించిరి. శండామర్కులు వచ్చి "తమకు యజ్ఞభాగము లేదనియు, అయినను అగ్నిష్టోమమునందు తమపేర్లతో ( సోమరసముతో నిండిన) గ్రహములను గ్రహించుఁడు. అదియే మాకు యజ్ఞభాగము" అని వరమును కోరుకొనిరి. సోమరస గ్రహములను "గృహ్యేతామ్" గ్రహించవలయు ననియే కోరిరి కాని "హూయేతామ్" హోమము చేయువలయునని కోరలేదు. కనుక దేవతలు విజయులైరి. అసురులు పరాజయము నొందిరి. అనఁగా దేవతలు శండామర్కులకు యజ్ఞమునందు గ్రహములను గ్రహించుట మాత్రముచే స్వకార్యమును సాధించుకొనిరి. ఈ విధముగ తెలిసికొనిన యజ్వకొఱకు శుక్రామంథి గ్రహములను గ్రహించినచో ఆ యజ్వ స్వయముగ విజయము నొందును. ఇతని శత్రువు పరాజయము నొందును. ఇచట శుక్రామంథి గ్రహ గ్రహణము విహిత మైనది.

2. అర్థము: దేవాః=దేవతలు, తౌ=ఆ శండామర్కులను, అపనుద్య=తొలఁగించి, ఆత్మనః=తమ సంబంధియగు, ఇన్ద్రాయ= ఇంద్రునికొఱకు, తౌ=ఆ శుక్రా మంథి గ్రహములను, అజుహవుః=హోమము చేసిరి. (తస్మాత్=ఆ కారణమువలన, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, గ్రహయోః= శుక్రా మంథి గ్రహములయొక్క, అధః=క్రింది భాగమున, లగ్నామ్=అంటుకొనిన, ధూలిమ్=దుమ్మును, అపధ్వంసయన్=పోఁగొట్టుచు,) "అపనుత్తౌ శణ్డామర్కౌ సహామునా" ఇతి='నేను ద్వేషించుచున్న, లేదా నన్ను ద్వేషించుచున్న ఈ శత్రువుతోఁ గూడ శండామర్కులు తొలఁగించఁబడిరి' అను నర్థము కల ఈ మంత్రమును, బ్రూయాత్=పలుకవలెను. (అనేన=ఈ పలుకుటచేత, యజమానః=యజమానుఁడు,) యమ్=ఏ శత్రువును, ద్విష్యాత్=ద్వేషించునో, యమేవ=ఎవనిని, ద్వేష్టి=యజమానుఁడు ద్వేషించుచున్నాఁడో, తేన=హోమసమయమున "అపనుత్తౌ శణ్డామర్కౌ సహామునా" అను ఆ మంత్రపాఠముచేత, ఏనౌ=ఈ శండామర్కులను, సహ=ద్వేష్టృ ద్వేష్యులతోఁ గూడ, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అపనుదతే=పోఁగొట్టుచున్నాఁడు.

తాత్పర్యము: దేవతలు స్వకార్యసిద్ధ్యనంతరము ఆ శండామర్కులను తొలఁగించి స్వకీయుఁడైన ఇంద్రునికొఱకు శండామర్క గ్రహములను హోమము చేసిరి. ఆ కారణమువలన అధ్వర్యుఁడు ఆ గ్రహములయొక్క యధో భాగమున అంటుకొనియున్న ధూళిని తొలఁగించుచు హోమసమయమున "అపనుత్తౌ శణ్డామర్కౌ సహామునా" అను మంత్రమును పఠించవలెను. హోమ సమయమున ఆ మంత్రమును పఠించుటచేత అధ్వర్యుఁడు యజమానునిచే ద్వేషింపఁబడువాఁడు, యజమానుని ద్వేషించువాఁడు అను ఉభయులతోఁ గూడ ఈ శండామర్కులను పోఁగొట్టినవాఁ డగును. 'అమునా'అని పలుకునప్పుడు ద్వేష్యునియొక్కయు, ద్వేష్టయొక్కయు నామముల నుచ్చరించవలెను. మంత్రోచ్చారణ సమయమున "అపనుత్తః శణ్డః"అని యధ్వర్యుఁడును, ద్వేష్యుని మన స్సున తలఁచుచు "అపనుత్తః మర్కః" అని ప్రతిప్రస్థాతయు పలుకవలెనని కల్పసూత్రము చెప్పినది. ఇది అర్థవాద విధి.

3. అర్థము: "స ప్రథమః సంకృతి ర్విశ్వకర్మా" ఇత్యేవ="స ప్రథమః" ఇత్యాది మంత్రముచేతనే, (దేవాః=దేవతలు,) ఏనౌ=ఈ శుక్రా మంథి గ్రహములను, ఆత్మనః ఇన్ద్రాయ=స్వకీయుఁడైన ఇంద్రునికొఱకు, అజుహవుః=హోమము చేసిరి. ఇన్ద్రః==ఇంద్రుఁడు, ఏతాని రూపాణి=ఈ విశ్వకర్మత్వాది రూపములను, కరిక్రత్=అత్యంతము చేయుచు, అచరత్ హి=జగత్తును ప్రవర్తింపఁజేసెను కదా!

తాత్పర్యము: (వేదమున మఱియొక స్థలమున ఆమ్నాతమైన మంత్రముచేత గ్రహ హోమవిధి అర్థవాదముచే ఇచట చెప్పఁబడినది.) దేవతలు "స ప్రథమః సంకృతి ర్విశ్వకర్మా" ఇత్యాది మంత్రము నుచ్చరించుచు తమ యింద్రునికై శుక్రామంథి గ్రహములను హోమము చేసిరి. ఇంద్రుఁడు ఈ విశ్వకర్మత్వాది రూపములను అత్యంతము ధరించుచు జగత్తును ప్రవర్తింపఁజేసెను. కావున దేవతలు పూర్వోక్త విధముగ హోమము చేయుట యుక్తమే. ఆ మంత్రపాఠము:-"స ప్రథమః సంకృతి ర్విశ్వకర్మా స ప్రథమో మిత్రో వరుణో అగ్నిః స ప్రథమో బృహస్పతి శ్చికిత్వాన్ తస్మా ఇన్ద్రాయ సుతమా జుహోమి" ఇతి| అర్థము:- సః=ఆ యింద్రుఁడు, ప్రథమః=(సర్వాధిపతి కావున) దేవతలలో ముఖ్యుఁడు. సంకృతిః=సమీచీనమైన నిర్మాణము కల, విశ్వకర్మా= 'విశ్వకర్మ' అను పేరు గల దేవుఁడు కూడ, సః ఏవ=ఆ యింద్రుఁడే. మిత్రః=సూర్యుఁడు, వరుణః=వరుణుఁడు, అగ్నిః=అగ్నియు, సః ఏవ=ఆ యింద్రుఁడే. చికిత్వాన్=అభిజ్ఞుఁడైన, బృహస్పతిః (అపి)= బృహస్పతియు, సః ప్రథమః=దేవతలలో ముఖ్యుఁడైన ఆ యింద్రుఁడే. తస్మై ఇన్ద్రాయ=అటువంటి యింద్రునికొఱకు, సుతమ్=అభిషుతమైన సోమరసమును, ఆ జుహోమి=అంతటను హోమము చేయుచున్నాను. విశ్వకర్మత్వాది రూపములను అత్యంతము ధరించుచు జగత్తును ప్రవర్తింపజేయుచున్నాఁడు కనుక ఆ యింద్రున కీ గ్రహ హోమము చేయుట యుక్తమే అని యర్థము.

4. అర్థము: శుక్రః=శుక్రగ్రహము, అసౌ ఆదిత్యః వై=ఈ ఆదిత్య స్వరూపమే. మన్థీ=మంథిగ్రహము, చన్ద్రమాః=చంద్ర స్వరూపము. అధ్వర్యు ప్రతిప్రస్థాతారౌ=అధ్వర్యు ప్రతిప్రస్థాతలు, అపిగృహ్య=శుక్ర మంథిగ్రహముల నాచ్ఛాదించి, ప్రాఞ్చౌ=ప్రాఙ్ముఖులై, నిష్క్రామతః=నిర్గమించవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాఞ్చౌ యన్తౌ=ప్రాఙ్ముఖులై వెళ్లుచున్న సూర్యచంద్రులను, న పశ్యన్తి=(ఎవ్వరును) చూచుట లేదు.

తాత్పర్యము: శుక్ర గ్రహము ఆదిత్య స్వరూపము. మంథి గ్రహము చంద్ర స్వరూపము. ఈ రెండు గ్రహములను హోమము చేయుటకు పూర్వము అధ్వర్యు ప్రతిప్రస్థాత లుభయులు ఆ రెండింటిని ఆచ్ఛాదించి నిర్గమించవలెను. సూర్యుఁడును చంద్రుఁడును పశ్చిమ దిక్కున అస్తమించి మఱల తూర్పు దిక్కున ఉదయించుటకై పోవునపుడు ఆ సూర్య చంద్రుల నెవ్వరును చూడలేకున్నారు కదా! కావున అధ్వర్యు ప్రతిప్రస్థాతలు శుక్ర మంథి గ్రహములను హోమమునకు పూర్వము ఆచ్ఛాదించి వెళ్లవలయును. ఇచట గ్రహముల యాచ్ఛాదనము విహితమైనది.

5. అర్థము: ప్రత్యఞ్చౌ ఆవృత్య=(అధ్వర్యు ప్రతిప్రస్థాతలు) గ్రహములను ప్రత్యఙ్ముఖములనుగా త్రిప్పి, జుహూతః=హోమము చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ప్రత్యఞ్చౌ యన్తౌ=ఉదయానంతరము పశ్చిమ ముఖులుగా పయనించుచున్న సూర్యచంద్రులను, పశ్యన్తి=(సర్వజనులు) చూచుచున్నారు.

తాత్పర్యము: అధ్వర్యు ప్రతిప్రస్థాతలు గ్రహములపైని ఆచ్ఛాదనమును తొలఁగించి పశ్చిమ ముఖములను గా త్రిప్పి హోమము చేయవలెను. కనుకనే పశ్చిమ ముఖులై పయనించుచున్న సూర్యచంద్రులను సర్వప్రజలు చూచుచున్నారు. (ఇచట హోమమునకై గ్రహములకు పశ్చిమ ముఖత్వము విహిత మైనది.)

6. అర్థము: శుక్రామన్థినౌ యత్=శుక్ర మంథి గ్రహములు ఏవి కలవో, ఏతే=ఇవి, యజ్ఞస్య=యజ్ఞమునకు, చక్షుషీ వై=నేత్రములవంటివే. ఉత్తరవేదిః=ఉత్తరవేది, నాసికా=నాసికవంటిది. అభితః=ఉత్తరవేదికి అంతటను, పరిక్రమ్య=చుట్టు తిరిగి (ప్రదక్షిణించి), జుహుతః=హోమము చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, నాసికామ్. అభితః=నాసికకు అంతటను (ఇరువైపులందు), చక్షుషీ=నేత్రములు, విధృతే=ధరించఁబడినవై యున్నవి. రక్షసామ్= రాక్షసులయొక్క, అపహత్యై=వినాశముకొఱకు, సర్వతః=ఉత్తరవేది కంతటను, పరిక్రామతః=పరిక్రమించవలెను (చుట్టు తిరుగవలెను). ఇచట ఉత్తరవేదికి చుట్టు తిరుగవలెనని విధింపఁబడినది.

7. అర్థము: దేవాః వై=దేవతలే, యాః=ఏ, ప్రాచీః ఆహుతీః= ప్రాగ్దిక్కునకు సంబంధించిన ఆహుతులను, అజుహవుః=హోమము చేసిరో, యే అసురాః=ఏ రాక్షసులు, పురస్తాత్=తూర్పు దిక్కునందు, ఆసన్=ఉండిరో, తాన్=ఆ ర్క్షసులు, పశ్చాత్=పశ్చిమ దిక్కునందు, ఆసన్=ఉండిరో, తాన్=ఆ రాక్షసులను, తాభిః=ఆ పశ్చిమాహుతులచేత, అపానుదన్త=పోఁ గొట్టిరి. అన్యాః ఆహుతయః=చమస పాత్ర హోమమునకు సంబంధించిన ఇతరములైన ఆహుతులు, ప్రాచీః=తూర్పుదిక్కునకు సంబంధించినవై, హూయన్తే=హోమము చేయఁబడుచున్నవి. శుక్రామన్థినౌ=శుక్ర మంథి గ్రహములు, ప్రత్యఞ్చౌ=పశ్చిమ దిక్కునకు సంబంధించినవై, (హూయేతే=హోమము చేయఁబడుచున్నవి. తథా కృతే సతి=అట్లు చేయఁబడఁగా,) యజమానః=యజ్ఞకర్త, పశ్చాత్ చ=పశ్చిమ దిక్కునందును, పురస్తాత్ చ= తూర్పు దిక్కునందును (ఉంటున్న), భ్రాతృవ్యాన్=శత్రువులను, ప్రణుదతే=పోఁగొట్టును. తస్మాత్=ఆ కారణమువలన, ప్రజాః=ప్రజలు, పరాచీః=వెడముఖము కలవారుగా (అడ్డముగా), ప్రవీయన్తే=గర్భస్థు లగుచున్నారు. ప్రతీచీః= పశ్చిమ ముఖులుగా, జాయన్తే=పుట్టుచున్నారు.

తాత్పర్యము: దేవతలు ఆహుతులను ప్రాగ్దిగభిముఖములుగా హోమము చేసి తూర్పు దిక్కునందలి రాక్షసులను పోఁదోలిరి. పశ్చిమ దిగభిముఖములుగా ఆహుతులను హోమము చేసి పశ్చిమ దిక్కునఁగల రాక్షసులను పోఁగొట్టిరి. కావున యజ్ఞకర్త ఇతరములైన (చమసపాత్ర హోమమునకు సంబంధించిన) ఆహుతులను ప్రాగభిములుగాను, శుక్ర మంథి గ్రహహోమమునకు సంబంధించిన ఆహుతులను పశ్చిమ దిగభిములుగాను హోమము చేయవలెను. అప్పు డా యజమానుఁడు ప్రాగ్దిక్కునను, పశ్చిమ దిక్కునను గల శత్రువులను పోఁగొట్టఁగలుగును. ఆ కారణమువలన ప్రజలు మాతృగర్భమునందు ప్రాఙ్ముఖలుగా నున్నవారై పశ్చిమ దిగభిముఖులై పుట్టుచున్నారు. ఇచట చమస హోమమునందు ప్రాఙ్ముఖత్వము, గ్రహ హోమమునందు పశ్చిమ ముఖత్వమును విధించఁబడినవి.

8. అర్థము: శుక్రామన్థినౌ అను=శుక్రమంథి గ్రహముల ననుసరించి, ప్రజాః=ప్రజలు, ప్ర జాయన్తే=ప్రకృష్టముగా పుట్టుచున్నారు. (హే! శుక్రగ్రహ!=ఓ శుక్రగ్రహమా!, త్వమ్=నీవు, యజమానస్య=యజమానునకు,) అత్రీః చ= భోక్తలతో కూడినట్టియు, సువీరాః=ఉత్తమ వీరులు కలవారునగు, ప్రజాః= ప్రజలను, ప్రజనయన్=అధికముగ పుట్టించుచు, పరీహి=ఉత్తరవేదినుండి దక్షిణముగా తొలఁగి పొమ్ము. శుక్రః=శుక్రగ్రహమైన నీవు, శుక్రశోచిషా= శుక్రదేవతా సంబంధియగు తేజస్సుచే, (రక్షసామ్=రాక్షసులయొక్క, అపఘాతమ్= నాశమును, కురు=చేయుము. హే మన్థిగ్రహ!=ఓ మంథి గ్రహమా! త్వమ్=నీవు, యజమానస్య=యజమానునకు,) ఆద్యాః=భోగ్యులును, సుప్రజాః= సేవాకుశలురైన పుత్రాదులు గల వారునగు, ప్రజాః=సేవకరూప ప్రజలను, ప్రజనయన్=అధికముగ పుట్టించుచు, పరీహి=ఉత్తరవేదికి ఉత్తరముగ తొలఁగి పొమ్ము. మన్థీ=మంథిగ్రహమైన నీవు, మన్థిశోచిషా=మంథిదేవతా సంబంధియగు తేజస్సుచే, (రక్షాంసి=రాక్షసులను, అపజహి=పోఁగొట్టుము). ఇతి ఆహ=అను ఈ మంత్రములను పఠించవలెను. యాః అత్త్రిః=ఎవరు భోక్తలో, ఏతాః వై=వీరే, సువీరాః=ఉత్తమ వీరులు కలవారు. (బ్రాహ్మణాదులు). యాః=ఎవరు, ఆద్యాః=భోగ్యులో (నీచజాతీయులైన భృత్య కర్మకరాదులో), ఏతాః= వీరు, సుప్రజాః=సేవాకుశలురైన పుత్రాది ప్రజలు కలవారు.

తాత్పర్యము: శుక్రమంథి గ్రహముల ననుసరించియే ప్రజలు ప్రకృష్టముగ పుట్టుచున్నారు. ఓ శుక్రగ్రహమా! నీవు యజమానునకు భోక్తృరూపులైన ఉత్తమ జాతీయులును, శోభన వీరులును గల ప్రజలను పుట్టించుము. ఓ మంథిగ్రహమా! నీవు యజమానునకు భోగ్యులైన నీచజాతీయులును, సేవాకుశలురైన పుత్రాదులు కలిగినవారును నగు ప్రజలను పుట్టించుము. ఓ శుక్రగ్రహమా! నీవు శుక్ర దేవతా సంబంధియగు తేజస్సుచే రాక్షస విఘాతము చేయుచు ఉత్తరవేదికి దక్షిణముగా తొలఁగి పొమ్ము. ఓ మంథిగ్రహమా! నీవు మంథిదేవతా

సంబంధియగు తేజస్సుచే రాక్షసులను పోఁగొట్టుచు ఉత్తరవేదికి ఉత్తరముగా తొలఁగి పొమ్ము. భోక్తలైన ఉత్తమజాతీయులే ఉత్తమ వీరులు కలవారు. నీచజాతీయులైన భోగ్యులే సేవాకుశలురైన పుత్రాది ప్రజలు కలవారు. ఈ మంత్రములను ఉత్తరవేదికి ప్రదక్షిణము చేయుచు పఠించవలెను. మఱియొక స్థలమున ఆమ్నాతములైన యీ మంత్రము లీ బ్రాహ్మణ భాగముచే వ్యాఖ్యాతము లైనవి. "ఏతా వై సువీరాః" ఇత్యాదికము వ్యాఖ్యానము.

9. అర్థము: యః=ఎవఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, వేద=తెలిసికొనెనో, అస్య=ఇతనికి, అత్రీ ప్రజా=భోక్తృరూపమైన ఉత్తమ జాతీయ సంతానము, జాయతే=పుట్టును. ఆద్యా=భోగ్యరూప నీచజాతీయ సంతానము, న జాయతే=పుట్టదు.

తాత్పర్యము: ఏడవ మంత్రమున చెప్పఁబడిన విషయమును తెలిసికొనినవానికి భోక్తృరూపమైన ఉత్తమ జాతీయ సంతానము కలుగును. భోగ్యరూపమైన నీచజాతీయ సంతానము కలుగదు. ఇచట వేదనము ప్రశంసించఁబడినది.

10. అర్థము: ప్రజాపతేః=ప్రజాపతియొక్క, అక్షి=నేత్రము, అశ్వయత్=రోగభూయిష్ఠ మాయెను. తత్=అది, పరాపతత్=పడెను. తత్ = అది, వికఙ్కతే=పుల్ల వెలఁగచెట్టునందు, న అరమత=విరమించలేదు. తత్= అది, యవమ్='యవ' అను ధాన్యవిశేషమును, ప్రావిశత్=ప్రవేశించెను. తత్= అది, యవే=యవ ధాన్యమునందు, అరమత=విశ్రమించెను. తత్=అందువలన, యవస్య=యవధాన్యమునకు, యవత్వమ్=(యౌతి తుషేణేతి యవః. తస్య ధర్మః యవత్వమ్=పొట్టుతోఁ గూడుకొని యుండునది. "యు=మిశ్రణే" అను ధాతువునుండి యవశబ్ద ముత్పన్నమైనది.) 'యవ' అను పేరు కలిగినది. మన్థిపాత్రమ్= మంథిగ్రహమనెడి పాత్రము, వైకఙ్కతం భవతి యత్=పుల్లవెలఁగ చెట్టునకు సంబంధించిన దైనచో, తత్=దానిని, సక్తుభిః=యవపిష్టములతో, శ్రీణాతి= మేళనము చేయవలెను. తత్=అది, ప్రజాపతేః==ప్రజాపతియొక్క, చక్షు రేవ=నేత్రమునే, సంభరతి=బాగుగ భరించును.

తాత్పర్యము: ప్రజాపతియొక్క నేత్రము రోగయుక్తమై పడి పుల్ల వెలఁగ చెట్టులో ప్రవేశించెను. అది పిమ్మట యవధాన్యమును పొందెను. దీనివలన 'కూడియుండినది' అను నర్థము కల యవ శబ్దమునకు సార్థక్యము కలిగినది. అది అచటనే విశ్రమించెను. కనుక మంథిగ్రహము అను పాత్రము పుల్లవెలఁగచెట్టునకు సంబంధించినది కావలెను. దానిని యవపిష్టముతో మిశ్రణము చేయవలెను. అట్లు చేయఁబడిన మంథిగ్రహము ప్రజాపతియొక్క నేత్రమును బాగుగ భరించును. ఇచట మంథిగ్రహమునకు వికంకత వృక్షత్వము సక్తుమేళనము విధించఁబడినవి.

10. అర్థము: కస్మాత్ సత్యాత్=ఏ కారణమువలన, మన్థిపాత్రమ్= మంథిగ్రహము, సదః=సదోమండపమును, న అశ్నుతే=పొందుటలేదు? ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు (ప్రశ్నించుచున్నారు). ఆర్తపాత్రం హి ఇతి బ్రూయాత్=మంథిపాత్రము రోగయుక్త చక్షుస్స్వరూపము కదా! అని సమాధానము చెప్పవలెను. అశ్నువీత యత్=మంథిపాత్రము సదోమండమున ప్రవేశపెట్టినచో, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అన్ధః=అంధుఁడు, స్యాత్=అగును. ఆర్తిమ్=మనోవ్యథను, ఆర్ఛేత్=పొందును. తస్మాత్=ఆ కారణము వలన, న అశ్నుతే=మంథి పాత్రము సదోమండపమును పొందుట లేదు.

తాత్పర్యము: ఇతరపాత్రములవలె మంథిపాత్రము సదోమండపమును ఎందుకు పొందుట లేదు? అని వేదజ్ఞులు ప్రశ్నించుచున్నారు. మంథిపాత్రము ప్రజాపతియొక్క రోగయుక్త చక్షుస్స్వరూప మైనది కనుక, ఆ పాత్రమును సదోమండమునందు ప్రవేశపెట్టరాదు అని ఆ ప్రశ్నకు సమాధానము. మంథిపాత్రమును సదోమండపమున ప్రవేశపెట్టినచో అధ్వర్యుఁ డంధుఁ డగును. మఱియు మనోవ్యథ నొందును. కావున మంథిగ్రహమును

సదోమండపమున నుంచరాదు. ఇతరపాత్రములకువలె మంథిపాత్రమునకుఁ గూడ సదఃప్రవేశము ప్రాప్తమగుచుండఁగా ఇచట ప్రశ్నోత్తర రూపమున తన్నిషేధము చెప్పఁబడినది.

దశమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే చతుర్థ ప్రపాఠక ఏకాదశోఽనువాకః

మూలము: [1]దేవా వై యద్యజ్ఞేఽకుర్వత తదసురా అకుర్వత తే దేవా ఆగ్రయణాగ్రా న్గ్రహానపశ్య న్తానగృహ్ణత తతో వై తేఽగ్రం పర్యాయన్యస్యైవం విదుష ఆగ్రయణాగ్రా గ్రహా గృహ్యన్తేఽగ్రమేవ సమానానాం పర్యేతి [2]రుగ్ణవత్యర్చా భ్రాతృవ్యవతో గృహ్ణీయా ద్భ్రాతృవ్యస్యైవ రుక్త్వాఽ గ్రగ్ం సమానానాం పర్యేతి [3]యే దేవా వ్యేకాదశ స్థేత్యాహ (౧)ఏతావతీర్వై దేవతా స్తాభ్య ఏవైనగ్ం సర్వాభ్యో గృహ్ణా [4]త్యేష తే యోని ర్విశ్వేభ్యస్త్వా దేవేభ్య ఇత్యాహ వైశ్వదేవో హ్యేష దేవతయా [5]వాగ్వై దేవేభ్యోఽపాక్రామ ద్యజ్ఞాయాతిష్ఠమానా తే దేవా వాచ్యపక్రాన్తాయాం తూష్ణీం గ్రహానగృహ్ణత సాఽమన్యత వాగన్తర్యన్తి వై మేతి సా ఽఽగ్రయణం ప్రత్యాగచ్ఛ త్తదాగ్రయణస్యా ఽఽగ్రయణ త్వమ్ (౨) తస్మా దాగ్రయణే వాగ్వి సృజ్యతే యత్తూష్ణీం పూర్వే గ్రహా గృహ్యన్తే [6]యథా త్సారీయతి మ ఆఖ ఇయతి నాప రాత్స్యామీత్యుపావ సృజత్యేవమేవ తదధ్వర్యు రాగ్రయణం గృహీత్వా యజ్ఞ మారభ్య వాచం వి సృజతే [7]త్రిర్హి కరోత్యుద్గాతౄనేవ తద్వృణీతే [8]ప్రజాపతిర్వా ఏష యదాగ్రయణో యదాగ్రయణం గృహీత్వా హిం కరోతి ప్రజాపతిరేవ (౩)తత్ప్రజా అభి జిఘ్రతి తస్మాద్వత్సం జాతం గౌరభి జిఘ్రత్యా[9]త్మా వా ఏష యజ్ఞస్య యదాగ్రయణః సవనే సవనేఽభి గృహ్ణాత్యాత్మన్నేవ యజ్ఞగ్ం సం తనో [10]త్యుపరిష్టాదా నయతి రేత ఏవ తద్దధా [11]త్యధస్తాదుప గృహ్ణాతి ప్ర జనయత్యేవ త [12]ద్బ్రహ్మవాదినో వదన్తి కస్మాత్సత్యా ద్గాయత్రీ కనిష్ఠా ఛన్దసాగ్ం సతీ

సర్వాణి సవనాని వహతీత్యేష వై గాయత్రియై వత్సో యదాగ్రయణస్తమేవ తదభినివర్తగ్ం సర్వాణి సవనాని వహతి తస్మాద్వత్స ముపాకృతం గౌరభి ని వర్తతే (౪)॥

(అహ్వ ఽఽగ్రయణత్వం ప్రజాపతి రేవేతి విగ్ంశతిశ్చ)।

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థప్రపాఠక ఏకాదశోఽనువాకః॥౧౧॥

యజ్ఞేన తా ఉపయడ్భిర్దేవా వై యజ్ఞమాగ్నీధ్రే బ్రహ్మవాదినః స త్వై దేవస్య గ్రావాణం ప్రాణో వా ఉపాగ్ంశ్వగ్రా దేవా వా ఉపాగ్ంశౌ వాగ్వై మిత్రం యజ్ఞస్య శిరో బృహస్పతిర్దేవా వా ఆగ్రయణా గ్రానేకాదశ॥౧౧॥

యజ్ఞేన లోకే పశుమాన్వ్యాత్సవనం మాధ్యందినం వాగ్వా అతిక్తాని ఏకపఞ్చాశత్॥౫౧॥

హరిః ఓమ్।

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే చతుర్థప్రపాఠకః ॥౪॥

# వేదార్థదీపిక

అవతారిక: దశమానువాకమునందు శుక్రగ్రహ మంథిగ్రహములను గురించి చెప్పఁ బడినది. ఈ యేకాదశానువాకము నందు ఆగ్రయణగ్రహమును గురించి వివరింపఁ బడుచున్నది.

1. అర్థము: దేవాః=దేవతలు, యజ్ఞే=యజ్ఞమునందు, యత్ వై=దేనినైతే, అకుర్వత=చేసిరో, అసురాః=రాక్షసులు, తత్=దానిని, అకుర్వత=చేసిరి. తే=ఆ దేవతలు, ఆగ్రయణాగ్రాన్=ప్రథమమున ఆగ్రయణ గ్రహము కలవి యగు, గ్రహాన్=గ్రహములను, అపశ్యన్=చూచిరి. తాన్=ఆ గ్రహములను, అగృహ్ణత=గ్రహించిరి. తతః వై=ఆ ఆగ్రయణాగ్ర గ్రహముల గ్రహణముచేతనే, తే=వారు, అగ్ర్యమ్=శ్రైష్ఠ్యమును, పర్యాయన్=పొందిరి. ఏవం విదుషః=ఈ విధముగ తెలిసికొనిన, యస్య=ఏ యజమానుని నిమిత్తము, ఆగ్రయణాగ్రాః గ్రహాః=ఆగ్రయణ గ్రహము ప్రథమముగాఁ గల గ్రహములు, గృహ్యన్తే=గ్రహింపఁ బడుచున్నవో, (సః=ఆ యజమానుఁడు,) సమానానామ్=సజాతీయులలో, అగ్రమేవ=శ్రేష్ఠత్వమునే, పర్యేతి=పొందును.

తాత్పర్యము: పూర్వము దేవతలు యజ్ఞము నే విధముగ చేసిరో, రాక్షసులు కూడ ఆ విధముగనే చేసిరి. అప్పుడు దేవతలు రాక్షసులకంటె ఆధిక్యమును సంపాదించుటకై 'ఆగ్రయణము' అనెడి గ్రహము ప్రథమమునఁ గల గ్రహములను తెలిసికొని వానిని యజ్ఞమునందు ఒక ప్రక్రియగా గ్రహించిరి. ఆ గ్రహణముచే ఆ దేవతలు శ్రేష్ఠత్వమును పొందిరి. కనుక ఈ విధముగ తెలిసికొని యజ్ఞము చేయుచున్న యజ్వనిమిత్తము ఆగ్రయణా గ్రములైన గ్రహములను గ్రహించవలెను. అప్పు డా యజ్వ సమానులలో శ్రేష్ఠుఁ డగును. ఇచట ఆగ్రయణ గ్రహ గ్రహణము విహిత మైనది. ఒక విశేషము:- సోమయాగమునందు రథంతర మనెడి సామము గానము చేయఁ బడుచో, అప్పుడు ఐన్ద్రి వాయవాగ్రములైన గ్రహములను గ్రహించవలెను. బృహత్సామము గానము చేయఁబడుచో శుక్రాగ్రములైన గ్రహములను గ్రహించవలెను. జగత్సామము గానము చేయఁ బడుచో ఆగ్రయణాగ్రములైన గ్రహములను గ్రహించవలెను. సోమయాగము ఉభయ సామము అయినచో అనఁగా-- సోమయాగమునందు ఒక భాగమున రథంతర సామము, మఱియొక భాగమున బృహత్సామము గానము చేయఁబడుచో, యజమానుఁడు తన యిష్టము ననుసరించి గ్రహములను గ్రహించవలెను అని కల్పసూత్రకా రులు నిర్ణయించిరి. సోమరసము నుంచునట్టి పాత్రములకు గ్రహములని పేరు. ఆగ్రయణాదులు ఆ యా గ్రహవిశేషములపేర్లు. కా.1, ప్ర.4, 10వ అనువాకమునకు ఇది వివరణాత్మకము. అచట సోమము ఆగ్ర యణ రూపముగానే వర్ణించఁబడినది.

2. అర్థము: భ్రాతృవ్యవతః=శత్రువులు కలిగియున్న యజ్వ నిమిత్తము, రుగ్ణవత్యర్చా='రుజి' ధాతువు కలిగియున్న "గణీనో రుజన్తో దివగ్ం రుద్రాః పృథివీం చ సచన్తే" అను మంత్రముచే, గృహ్ణీయాత్=గ్రహించవలెను. (తదా=అప్పుడు, యజ్వా=యాగకర్త,) భ్రాతృవ్యస్యైవ=శత్రువునకే, రుక్త్వా= రోగమును కలిగించి, సమానానామ్=సజాతీయు లలో, అగ్రమ్=శ్రేష్ఠత్వమును, పర్యేతి=పొందును.

తాత్పర్యము: శత్రుమంతుఁడైన యజ్వ చేయు యాగమునందు 'రుజి' ధాతువు కలిగియున్న "త్రింశత్త్రియశ్చ గణీనో రుజన్తో దివగ్ం రుద్రాః పృథివీం చ సచన్తే" (కా.1, ప్ర.4, అ.11) అను మంత్రమును పఠించుచు గ్రహములను గ్రహించవలెను. అప్పు డా యజమానుఁడు తన శత్రువునకు రోగమును పుట్టించి తాను సజాతీ యులలో శ్రేష్ఠుఁడుగా నుండును. ఇచట "త్రింశత్త్రియశ్చ" అను మంత్రమునకు విషయము చూపించఁబడినది.

3. అర్థము: "యే దేవా దివ్యేకాదశ స్థ" ఇతి ఆహ="ఓ దేవతలారా! ఏ మీరు మూఁడు లోకములందు ప్రత్యేకము పదునొకండుగురు చొప్పన ఉంటున్నారో" అని "యే దేవా" ఇత్యాది మంత్రము (కా.1,ప్ర.4, అ.10) చెప్పినది. (ఒక్కొక్క లోకమున పదునొకండుగురు చొప్పన మూఁడు లోకములందు మొత్తము ముప్పది ముగ్గురు దేవతలు కలరని యర్థము. కనుకనే ఆ యనువాకమునకు పిమ్మట 11వ అనువాకమున "త్రింశ త్త్రియశ్చ" అని ఆమ్నాత మైనది. దేవతాః=దేవతలు, ఏతావతీః వై=మొత్తము ఈ ముప్పది ముగ్గురే. తాభ్యః సర్వాభ్యః ఏవ=ఆ యందఱికొఱకే, ఏనమ్= ఈ ఆగ్రయణ గ్రహమును, గృహ్ణాతి=గ్రహించవలెను.

తాత్పర్యము: మూఁడు లోకములందును గల దేవతల సంఖ్య మొత్తము ముప్పదిమూఁడని "యే దేవా దివ్యేకాదశ స్థ" అను మంత్రము చెప్పినది. ఆ దేవతల కందఱికొఱకే ఈ యాగ్రయణగ్రహమును గ్రహించవలెను. (పూర్వ మంత్రోక్తు లయిన సర్వదేవతల నుద్దేశించి ఆగ్రయణ గ్రహ గ్రహణము చేయవలెనని యీ మంత్రభాగము చెప్పినది.)

4. అర్థము: "ఏష తే యోని ర్విశ్వేభ్య స్త్వా దేవేభ్యః" ఇతి ఆహ="ఓ ఆగ్రయణ పాత్ర గత సోమమా! ఈ ఖరప్రదేశము నీకు స్థానము. సర్వదేవతలకొఱకు నిన్ను ఈ ఖర ప్రదేశమునం దుంచుచున్నాను." అని "ఏష తే యోనిః" ఇత్యాది మంత్రము చెప్పినది. దేవతయా=దేవతచే, ఏషః=ఈ ఖరప్రదేశము, వైశ్వదేవః హి=విశ్వదేవతలకు సంబంధించినది కదా!

తాత్పర్యము: అగ్రయణ గ్రహమునందలి సోమమును సర్వ దేవతలకొఱకు ఈ ఖర ప్రదేశమునం దుంచుచున్నానని పై మంత్రము చెప్పుటచే ఇది సర్వదేవతలకు సంబంధించినదని స్పష్ట మైనది. "విశ్వేభ్య స్త్వా దేవేభ్యః" అను సాదన మంత్రమునందు 'విశ్వేభ్యః' అని చెప్పుట యుక్తమని ఈ మంత్రభాగము చెప్పినది.

5. అర్థము: వాక్ వై=వాగ్దేవతయే, యజ్ఞాయ=యజ్ఞముకొఱకు, అతిష్ఠమానా=స్వీయ రూపమును ప్రకాశింపఁ జేయ నిదియై, దేవేభ్యః=దేవతలనుండి, అపాక్రామత్=తొలఁగి పోయెను. వాచి=వాగ్దేవత, అపక్రాన్తాయామ్=తొలఁగిపోవుచుండఁగా, తే దేవాః=ఆ దేవతలు, తూష్ణీమ్ ఏవ=వాక్కు నుచ్చరించకయే, గ్రహాన్=గ్రహములను, అగృహ్ణత=గ్రహించిరి. "మా=నన్ను, అన్తర్యన్తి వై=దేవతలు నిశ్చయముగ పరిత్యజించుచున్నారు." ఇతి=అని, సా వాక్=ఆ వాగ్దేవత, అమన్యత=తలఁచెను. (అథ=అనంతరము,) సా=ఆ వాగ్దేవి, అగ్రయణం ప్రతి=అగ్రయణ గ్రహమును గూర్చి, అగచ్ఛత్=వచ్చెను. తత్=ఆ కారణమువలన, అగ్రయణస్య=అగ్రయణ గ్రహమునకు, అగ్రయణత్వమ్=అగ్రయణ మనెడి నామము. అగ్రమ్=అభిముఖమ్, ఏతి=గచ్ఛతి వాగితి, అగ్రాయణమ్. దీర్ఘవ్యత్యయాత్ అగ్రయణం నామ సంపన్నమ్. యత్ =ఏ కారణమువలన, పూర్వే గ్రహాః=అగ్రయణమునకంటె పూర్వగ్రహములు, తూష్ణీమ్=మంత్రోచ్చారణ రహితముగ, గృహ్యన్తే=గ్రహింపఁబడుచున్నవో, తస్మాత్=ఆ కారణమువలన, అగ్రయణే=అగ్రయణ గ్రహము, గృహీతే=గ్రహింపఁబడినదగుచుండఁగా, వాక్=మంత్రరూపవాక్కు, విసృజ్యతే= విడువఁబడవలెను.

తాత్పర్యము: ఏదియో ఒక కారణముచే వాగ్దేవత యజ్ఞముకొఱకు తన రూపమును ప్రకాశింపఁ జేయక దేవతలనుండి తొలఁగిపోయెను. అప్పుడు దేవతలు గ్రహములను మంత్ర రహితముగ గ్రహించుచుండఁగా ఆ వాగ్దేవత-- "ఈ దేవతలు వరదానాదికముచే నన్ను సమాధాన పఱచుట లేదు. మఱియు నా యపేక్ష లేకుండనే స్వకార్యమును చేసికొనుచు నన్ను పరిత్యజించుచున్నారు" అని యాలోచించి దేవతలు ఆహ్వానించకున్నను తానే స్వయముగ అగ్రయణమును గూర్చి వచ్చెను. అందువలన అగ్రయణమునకు పూర్వోక్త వ్యుత్పత్తి ననుసరించి 'అగ్రయణము' అను నామము సంపన్న మైనది. పూర్వ గ్రహములు మంత్రోచ్చారణ ( వాగుచ్చారణ) రహితముగ గ్రహింపఁ బడుచున్నవి కావున, అగ్రయణ గ్రహము గ్రహించఁ బడిన యనంతరము వాగ్రూప మంత్రము నుచ్చరించవలెను. ఇచట వాగ్విసర్గము విహిత మైనది.

6. అర్థము: త్సారీ=ఛద్మగతి కల వ్యాధుఁడు, (అరణ్యకములైన గజ వరాహాదులను వేటాడుటకై బాణములను విడుచుటకు ముందుగా) "ఇయతి=ఇంత దూరమునందు, అహమ్=నేను, వర్తే=ఉంటున్నాను. మే=నాకు, ఇయతి= ఇంతదూరమునందు, ఆఖః=(గజాదులను బంధించుటకై త్రవ్వఁ బడిన) గుంట, విద్యతే=ఉంటున్నది. ఇదానీం బాణాన్ విసృజ్య=ఇప్పుడు బాణములను విడిచి, న అపరాత్స్యామి=అపరాధము చేయను." ఇతి=అని, మనసి విచార్య= మనస్సునందు ఆలోచించి, పశ్చాత్=అనంతరము, బాణాన్=బాణములను, యథా= ఏ విధముగ, ఉపావసృజతి=తగిన సమయమునందు విడుచునో, ఏవమేవ=ఈ విధముగనే, తత్=ఆ వాగ్విసర్గము. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, అగ్రయణమ్= అగ్రయణ గ్రహమును, గృహీత్వా=గ్రహించి, యజ్ఞమ్=యజ్ఞమును, ఆరభ్య=అరంభించి, వాచమ్=వాక్కును, విసృజతి=విడుచుచున్నాఁడు.

తాత్పర్యము: (పూర్వగ్రహములయందు కూడ ప్రతిగ్రహమునకు మంత్రము లామ్నాతము లైనవి కావున పూర్వగ్రహములకు తూష్ణీంగ్రహణము లేదు కదా! అని ఒక ఆక్షేపము రాఁగా, దానికి సమాధానముగ ఇచట సమన్వయము చేయఁబడినది.) ఛద్మగతి కల వ్యాధుఁడు అరణ్యకము లయిన గజ వరాహాదులను బంధించుటకై ఒక విశాలమైన గర్తమును (గుంటను) త్రవ్వి ఆ యారణ్యకములను లక్ష్యముగాఁ జేసికొని వానిపైని బాణములను విడుచుటకు ముందుగా "నేను ఇంతదూరములో ఉన్నాను. ఈ గర్తము నాకు ఇంతదూరములో ఉన్నది. కనుక ఇప్పుడు బాణములను విడిచినచో అపరాధము చేసినవాఁడ నగుదును. అవసరమైన సమయమున

బాణములను విడుతును" అని మనస్సులో నాలోచించి తరువాత అవసర సమయమున బాణములను విడుచును. ఆ విధముగనే అధ్వర్యుఁడు కొన్ని గ్రహములను గ్రహించి యజ్ఞమును దృఢముగాఁ జేసికొని పిమ్మట మంత్రరూపమైన వాక్కును ప్రకటించును. (ఇచట ధ్వని ద్వయము సూచిత మైనది. మనస్సున నాలోచించుట గూడ ధ్వని యగును. ప్రకటించుట బహిర్గత ధ్వని యగును. ఈ ధ్వని ద్వయము లౌకిక దృష్టాంతముచే విశదీకరించఁబడినది.)

7. అర్థము: త్రిః=మూఁడు మాఱులు, హింకరోతి='హిమ్' అని ఉచ్చరించవలెను. తత్=ఆ హింకారముచేత, ఉద్గాతౄన్ ఏవ=ఉద్గాతలనే, వృణీతే=వరించినవాఁ డగును. ఉద్గాత=సామగానము చేయు ఋత్విజుఁడు.

తాత్పర్యము: సామములందు హింకారము ప్రసిద్ధ మైనదే. సామగానము చేయువారిని హింకారముచే వరించవలెను.

8. అర్థము: ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహ మేది కలదో, ఏషః= ఇది, ప్రజాపతిః వై=ప్రజాపతియే (ప్రజాపతివంటిదే). ఆగ్రయణం గృహీత్వా= ఆగ్రయణ గ్రహమును గ్రహించి, హింకరోతి యత్=హింకారము చేయుచో, తత్=ఆ హింకారముచేత, ప్రజాపతిః ఏవ=ప్రజాపతియే, ప్రజాః అభిజిఘ్రతి=ప్రజల నభిముఖముగ ఆఘ్రాణము చేసినవాఁ డగును. తస్మాత్=ఆ కారణమువలన, గౌః=ఆవు, జాతం వత్సమ్=(అప్పుడు) పుట్టిన దూడను, అభిజిఘ్రతి=అభిముఖముగ (అంతటను) ఆఘ్రాణము చేయుచున్నది.

తాత్పర్యము: ఆగ్రయణ గ్రహము ప్రజాపతి స్వరూపమే. కావున ఆగ్రయణ గ్రహమును గ్రహించి అనంతరము హింకారము చేయవలెను. ఇట్లు ఆగ్రయణ గ్రహ గ్రహణాంతరము హింకారము చేయుటచేత ప్రజాపతియే యజమానునియొక్క ప్రజల నాఘ్రాణము చేసిన ట్లగును. ఆ కారణమువలననే ఆవు దూడ పుట్టిన వెంటనే యా దూడ నంతట నాఘ్రాణము చేయుచున్నది. ఇచట హింకారము చేయుటకు కాలము విధించఁబడినది.

9. అర్థము: ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహ మేది కలదో, ఏషః= ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, ఆత్మా వై=ఆత్మ (వంటిది)యే. తత్=ఆ కారణమువలన, సవనే సవనే=ప్రతిసవనమునందు, (సవన త్రయమునందు) అభి గృహ్ణాతి=ఆగ్రయణ గ్రహమును అంతటను గ్రహించవలెను. తదా=అప్పుడు, ఆత్మన్నేవ=తనయందే, యజ్ఞమ్=యజ్ఞమును, సంతనోతి=బాగుగ విస్తరింపఁ జేసినవాఁ డగును.

తాత్పర్యము: ఆగ్రయణ గ్రహము యజ్ఞమునకు ఆత్మవంటిది. కనుక యజ్వ ఆ యాగ్రయణ గ్రహమును ప్రాతఃసవన మాధ్యందిన సవన సాయం సవనముల మూఁ డింటియందును గ్రహించవలెను. అప్పు డా యజ్వ తనయందే యజ్ఞమును బాగుగ విస్తరింపఁ జేసినవాఁ డగును. సవనత్రయమునందును ఆగ్రయణ గ్రహ గ్రహణము విధించఁ బడినది.

10. అర్థము: ఉపరిష్టాత్=దశాపవిత్రముయొక్క పైభాగమున, ఆ నయతి=సోమరసమును తీసికొని రావలయును (ఉంచవలెను). తత్=ఆ యానయనముచేత, రేతః ఏవ=రేతస్సునే, దధాతి=ఉంచినవాఁ డగుచున్నాఁడు. దశాపవిత్రముపైని సోమరసానయనము విధించఁబడినది.

తాత్పర్యము: సోమరసమును దశాపవిత్రముయొక్క పైని ఉంచవలెను. దానిచే యజమానుఁడు రేతస్సునే ఉంచినవాఁ డగును.

11. అర్థము: అధస్తాత్=దశాపవిత్రముయొక్క క్రిందిభాగమునుండి, ఉప గృహ్ణాతి=సోమరసమును గ్రహించవలెను. తత్=దానిచే, ప్ర జనయత్యేవ= సంతానమును పుట్టించినవాఁడే యగును.

తాత్పర్యము: దశాపవిత్రముయొక్క క్రిందిభాగమున స్రవించుచున్న సోమరసముయొక్క ధారచే గ్రహించినవాఁ డగును. దశాపవిత్రముయొక్క క్రిందిభాగమున స్రవించుచున్న సోమరసధారచే ఉపగ్రహణ మిచట విహిత మైనది.

12. అర్థము: కస్మాత్ సత్యాత్=ఏ కారణమువలన, గాయత్రీ= గాయత్రి, ఛన్దసామ్=ఛందస్సులలో, కనిష్ఠా సతీ=కనిష్ఠ యగుచు, సర్వాణి సవనాని=ప్రాతఃసవనాది మూఁడు సవనములను, వహతి=వహించుచున్నది?, ఇతి=అని,

బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=పలుకు (ప్రశ్నించు) చున్నారు. ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహము ఏది కలదో, ఏషః=ఇది, గాయత్రియై= గాయత్రియొక్క, వత్సః వై=వత్సమే (వత్సమువంటిదియే). తత్=ఆ కారణమువలన. అధినివర్తంతమేవ=అంతటను మఱల (తిరుగు) చున్న ఆ యాగ్రయణ గ్రహమునే, (అనుసృత్య=అనుసరించి,) సర్వాణి సవనాని=ప్రాతః సవనాది సర్వసవనములను, వహతి=వహించుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, అపాకృతం వత్సమ్=తొలఁగిపోవుచున్న దూడ ననుసరించి, గౌః=ఆవు, అధి నివర్తతే=అంతటను నివర్తించుచున్నది.

తాత్పర్యము: ఛందస్సులలో చిన్నదైన గాయత్రి ఏ కారణమువలన అన్ని సవనములను నిర్వహించుచున్నది? అని మంత్రజ్ఞులు ప్రశ్నించుచున్నారు. గాయత్రి అల్పాక్షర యగుటచే ఛందస్సులలో కనిష్ఠ యైనది. ప్రాతః సవనమునందలి బహిష్పవమాన సూక్తములు, మాధ్యందిన సవనమునందలి మాధ్యందిన పవమాన సూక్తము, సాయంసవనమునందలి ఆర్భవ పవమాన సూక్తము గాయత్రీ చ్ఛందస్కము లగుటచే గాయత్రి సర్వసవనములను వహించుచున్నదని భావము. ఈ విధముగనే ఆగ్రయణ గ్రహము మూఁడు సవనములందును గ్రహించఁ బడుచున్నది. ఇచట ఆగ్రయణ గ్రహము వత్సముగాను, గాయత్రి గోవుగాను వర్ణించఁ బడినవి. వత్సము ఏ దిశకు పోవునో, గోవు కూడ తినుచున్న తృణాదికమును కూడ విసర్జించి తన వత్సము ననుసరించియే పోవుచుండును. ఆ విధముగనే మూఁడు సవనములందును గ్రహింపఁబడుచున్న ఆగ్రయణ గ్రహము ననుసరించుచు గాయత్రీ ఛందస్కములైన పవమాన సూక్తవిశేషములు గ్రహింపఁ బడుచున్నవని భావము. ఇచట సవనత్రితయమందును ఆగ్రయణ గ్రహము గ్రహించఁబడుట ప్రశంసించఁబడినది.

ఏకాదశానువాకము సమాప్తము

## చతుర్థప్రపాఠకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే ప్రథమో௨నువాకః

హరిః ఓమ్

మూలము: [1]ఇన్ద్రో వృత్రాయ వజ్ర ముదయచ్ఛత్స వృత్రో వజ్రా దుద్యతా దబిభేత్సో௨బ్రవీన్మా మే ప్ర హారస్తి

వా ఇదం మయి వీర్యం తత్తే ప్ర దాస్యామీతి తస్మా ఉక్థ్యం ప్రాయచ్ఛత్తస్మై ద్వితీయ ముద

యచ్ఛత్సో௨బ్రవీన్మా మే ప్ర హారస్తి వా ఇదం మయి వీర్యం తత్తే ప్ర దాస్యామీతి (౧)తస్మా

ఉక్థ్యమేవ ప్రాయచ్ఛత్తస్మై తృతీయ ముదయచ్ఛత్తం విష్ణు రన్వతిష్ఠత జహీతి సో௨బ్రవీన్మా మే ప్ర

హారస్తి వా ఇదం మయి వీర్యం తత్తే ప్ర దాస్యామీతి తస్మా ఉక్థ్యమేవ ప్రాయచ్ఛత్తం నిర్మాయం

భూతమహన్యజ్ఞో హి తస్య మాయా௨௨సీ ద్యదుక్థ్యో గృహ్యత ఇన్ద్రియమేవ (౨)తద్వీర్యం యజ

మానో భ్రాతృవ్యస్య వృఙ్క్తే [2]ఇన్ద్రాయ త్వా బృహద్వతే వయస్వత ఇత్యాహేన్ద్రాయ హి స తం

ప్రాయచ్ఛ [3]త్తస్మై త్వా విష్ణవే త్వేత్యాహ యదేవ విష్ణు రన్వతిష్ఠత జహీతి తస్మాద్విష్ణు మన్వాభ

జతి [4]త్రిర్నిర్గృహ్ణాతి త్రిర్హి స తం తస్మై ప్రాయచ్ఛ [5]దేష తే యోనిః పున ర్హవిరసీత్యాహ పునః పునః

(౩)హ్యస్మాన్నిర్గృహ్ణాతి [6]చక్షుర్వా ఏతద్యజ్ఞస్య యదుక్థ్య స్తస్మాదుక్థ్యగ్ం హుతగ్ం సోమా అన్వా

యన్తి తస్మాదాత్మా చక్షురన్వేతి తస్మాదేకం యన్తం బహవో௨ను యన్తి తస్మాదేకో బహూనాం

భద్రో భవతి తస్మాదేకో బహ్వీర్జాయా విన్దతే యది కామయేతాధ్వర్యు రాత్మానం యజ్ఞయశసేనా

ర్పయేయ మిత్యన్తరా௨௨హవనీయం చ హవిర్ధానం చ తిష్ఠన్నవ నయేత్ (౪)ఆత్మానమేవ యజ్ఞయ

శసేనార్పయతి యది కామయేత యజమానం యజ్ఞయశసేనార్పయేయ మిత్యన్తరా సదోహవిర్ధానే

తిష్ఠన్నవ నయేద్యజమానమేవ యజ్ఞయశసేనార్పయతి ⁷యది కామయేత సదస్యా న్యజ్ఞయశసేనా

ర్పయేయమితి సద ఆలభ్యావ నయేత్సదస్యానేవ యజ్ఞయశసేనార్పయతి (౫)॥

[ఇతీన్ద్రియమేవ పునః పున ర్నయేత్త్రయస్త్రిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమ ప్రపాఠకే ప్రథమోఽనువాకః ॥౧॥

## వేదార్థదీపిక

అవతారిక: చతుర్థ ప్రపాఠకమునందు అభిషుతమైన సోమరసము నుంచుటకై ఉపయోగించునట్టి తత్తద్దేవతాకములైన ఉపాంశు గ్రహాదులను కొన్నింటిని గుఱించి వివరించఁబడినది. మిగిలినవానిలో ఉక్థ్యగ్రహమును గూర్చి ఈ పంచమ ప్రపాఠకములోని ప్రథమానువాకమునందు వివరించఁబడుచున్నది. ఈ గ్రహముల గ్రహణ సాధన మంత్రములు ప్రథమ కాండములోని నాల్గవ ప్రపాఠకమున ద్వాదశానువాకమునం దీ యుక్థ్యగ్రహ గ్రహణ సాదన మంత్రములు కలవు. సోమరసమును నింపిన ఆ గ్రహములను యజ్ఞమునందలి ఆ యా సన్నివేశ ములందు గ్రహించి నియమిత ప్రదేశమునందు ఉంచవలెనని ఆ ప్రపాఠకమునందు చెప్పఁబడినది.

1. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రాయ=వృత్రాసురునికొఱకు, వజ్రమ్=వజ్రాయుధమును, ఉదయచ్ఛత్=పైకి ఎత్తెను. సః వృత్రః=ఆ వృత్రాసురుఁడు, ఉద్యతాత్ వజ్రాత్=పైకి ఎత్తఁబడిన వజ్రాయుధమువలన, అబిభేత్=భయ పడెను. “మే=నన్ను, (కర్మణి షష్ఠీ.) మా ప్రహాః (ప్రహార్షీః)=చంపవలదు. మయి=నాయందు, ఇదం వీర్యమ్=ఉక్థ్యరూపమైన శ్రేష్ఠవస్తువు (ఉక్థ్యస్థాలియందు మంత్రపూర్వకముగ గ్రహించఁబడిన సోమరసము), అస్తి=ఉన్నది. తత్=దానిని, తే=నీకొఱకు, దాస్యామి వై=నిశ్చయముగ నీయఁగలను” ఇతి=అని, సః=ఆ వృత్రుఁడు, అబ్రవీత్=పలికెను. (తతః=అనంతరము,) తస్మై=ఆ యింద్రునికొఱకు, ఉక్థ్యమేవ=ఉక్థ్యమునే, ప్రాయచ్ఛత్=ఇచ్చెను. తస్మై=ఆ వృత్రునికొఱకు, ద్వితీయమ్=రెండవ పర్యాయము, ఉదయచ్ఛత్=వజ్రాయు ధమును పైకి ఎత్తెను. “మే, మా ప్రహాః. మయి, ఇదమ్, వీర్యమ్, అస్తి. తత్, తే, ప్రదాస్యామి వై” ఇతి సః, అబ్రవీత్. తస్మై, ఉక్థ్యమేవ, ప్రాయచ్ఛత్. తస్మై=ఆ వృత్రునికొఱకు, తృతీయమ్=మూఁడవ పర్యాయము, ఉదయచ్ఛత్=వజ్రాయుధమును పైకి ఎత్తెను. ‘జహీతి=చంపుమని’, (వదన్=చెప్పుచు,) విష్ణుః=విష్ణువు, తమ్ అన్వతిష్ఠత=ఆ యింద్రుని సహకరించుచు నుండెను. “మే, మా ప్రహాః. మే, ఇదమ్, వీర్యమ్, అస్తి. తత్, తే, ప్రదాస్యామి వై ఇతి, సః=ఆ వృత్రుఁడు, అబ్రవీత్=పలికెను. తస్మై=ఆ యింద్రు నికొఱకు, ఉక్థ్యమేవ, ప్రాయచ్ఛత్. నిర్మాయమ్=మాయాశూన్యుఁడుగా, భూతమ్=అయినట్టి, తమ్=ఆ వృత్రుని, (ఇన్ద్రః=ఇంద్రుఁడు,) అహనత్=సంహరించెను. ఉక్థ్యః=ఉక్థ్యగ్రహము, గృహ్యతే=గ్రహించఁబడవ లెను. (గృహీతే సతి=గ్రహించఁబడినదగుచుండఁగా,) యజమానః=యాగకర్త, భ్రాతృవ్యస్య=శత్రువుయొక్క, ఇన్ద్రియం వీర్యమేవ=ఇంద్రియగత సామర్థ్యమునే, వృఙ్క్తే=నశింపఁజేయును.

తాత్పర్యము: పూర్వ మింద్రుఁడు వృత్రాసురుని సంహరించుటకై వజ్రాయుధమును పైకి ఎత్తఁగా, ఆ వృత్రుడు భయపడి ‘నన్ను చంపవలదు. నాయొద్దనున్న ఉక్థ్యరూపమైన శ్రేష్ఠవస్తువును నీ కొసఁగెదను.’ అని ఆ వృత్రుఁడు పలికి ఆ యుక్థ్యమును ఆ యింద్రున కిచ్చెను. ఇట్లే రెండవ పర్యాయము కూడ ఇంద్రుఁడు వజ్రాయుధ

మును పైకెత్తఁగా వృత్తుఁడు ఆ విధముగనే రెండవ పర్యాయము కూడ ఉక్థ్యము నింద్రున కొసఁగెను. మూఁడవ పర్యాయము వజ్రాయుధమును పైకెత్తిన సమయమున విష్ణు వా యింద్రునకు తన సహకారము నిచ్చుచు వృత్రుని సంహరించుమని చెప్పెను. అయినను మూఁడవ పర్యాయము కూడ వృత్రుఁడు ఇంద్రునకు ఉక్థ్యము నొసఁగెను. ఉక్థ్యరూప యజ్ఞము వృత్రాసురుని మాయ యనియు, ఉక్థ్యస్థాలియందు మంత్రపూర్వకముగ గ్రహింపఁబడిన సోమరసము ఉక్థ్యమనియు అర్థము. ఆ యుక్థ్యమునందలి లోభముచే మోహితుఁడై ఇంద్రుఁడు వృత్రుని సంహరించలేదు. మూఁడు ఉక్థ్యములను ఇచ్చిన పిమ్మట మాయారహితుఁడైన వృత్రుఁడు ఇంద్రుని లోభింపఁజేయుట కసమర్థుఁ డగుటచే ఆ వృత్రుని ఇంద్రుఁడు సంహరించెను.

యాగమునందు యజ్వ ఉక్థ్య గ్రహమును గ్రహించవలెను. ఉక్థ్యగ్రహమును గ్రహించిన యజ్వ తన శత్రువుయొక్క ఇంద్రియ గత సామర్థ్యమును నశింపఁజేయును. ఈ యాఖ్యాయికయందు వృత్రుఁ డింద్రునకు ఉక్థ్యమును మూఁడు మారు లిచ్చినట్లు కలదు. యజ్ఞమునందలి మూఁడు సవనములందును ఉక్థ్యగ్రహమును గ్రహించవలయును కావున, సవన త్రయము ననుసరించి ' నట త్రిఃప్రదానము చెప్పఁబడినది. అగ్నిష్టోమ మునందు తృతీయ సవనమున ఉక్థ్యగ్రహము లేకున్నను సంస్థాంతరములందు కలదు కనుక, త్రిఃప్రదానము యుక్తమే. లేదా,- ప్రాతఃసవనమునందే ఉక్థ్యస్థాలియందు సోమరసమును మూఁడు మారులు గ్రహింపవల యునని చెప్పినచో తదనుసారముగ త్రిఃప్రదానము విహిత మైనదని విద్యారణ్యులు సమన్వయము చేసినారు. ఇంద్రునివలె వైరిగతమైన ఇంద్రియ సామర్థ్యమును నశింపఁజేయుటకై యజ్వ ఉక్థ్యగ్రహమును గ్రహించవలెనని ఈ యాఖ్యాయికవలన విదిత మగుచున్నది. ఇచట ఉక్థ్యగ్రహ గ్రహణము విధించఁబడినది.

2. అర్థము: "ఇన్ద్రాయ త్వా బృహద్వతే వయస్వతే" ఇతి ఆహ="ఓ సోమరసమా! బృహత్సామ ప్రియుఁడును, సోమరూపమైన యన్నము ఇష్టమైనవాఁడునగు ఇంద్రునికొఱకు నిన్ను గ్రహించుచున్నాను" అని 'ఇన్ద్రాయే' త్యాది మంత్రము చెప్పినది. సః=ఆ వృత్రుఁడు, తమ్=ఉక్థ్యస్థాలియందు మంత్రపూర్వకముగ గ్రహించఁబడిన ఆ సోమరసమును, ఇన్ద్రాయ=ఇంద్రునికొఱకు, ప్రాయచ్ఛద్=ఇచ్చెను కదా!

తాత్పర్యము: వృత్రుఁడు ఉక్థ్యమును ఇంద్రున కొసఁగెను. కావున 'ఇన్ద్రాయే'త్యాది మంత్రమునందు 'ఇన్ద్రాయ' అను పద మామ్నాత మగుట యుక్తమే.

3. అర్థము: "తస్మై త్వా విష్ణవే త్వా" ఇతి ఆహ="ఓ యింద్రుఁడా! నీకు సోమరూపమైన మహదన్నము ఏది కలదో, దానిని త్రావుటకై నిన్ను ప్రార్థించుచున్నాను. ఓ సోమరసమా! విష్ణువుకొఱకు నిన్ను గ్రహించుచు న్నాను." అని "తస్మై త్వా విష్ణవే త్వా" అను మంత్రభాగము చెప్పినది. యదేవ=ఏ కారణమువలననైతే, జహీతి=సంహరించుమని, విష్ణుః=విష్ణువు, అన్వతిష్ఠత=ఇంద్రునకు సహకారిగ నుండెనో, తస్మాత్=ఆ కారణమువలన, విష్ణుమ్=విష్ణు పదమును, అన్వాభజతి=పైమంత్రము పొందినది.

తాత్పర్యము: వృత్ర హనన విషయమున విష్ణువు కూడ ఇంద్రునకు సహకారిగ భాగస్వామి యగుటవలన "తస్మై త్వా విష్ణవే త్వా" అను మంత్రమునందు విష్ణుపద ప్రయోగము యుక్తమే యని యీ వాక్యము చెప్పినది.

4. అర్థము: త్రిః=మూఁడు మారులు, నిర్గృహ్ణాతి=ఉక్థ్య స్థాలీగత సోమరసమును నిష్కర్షించి గ్రహించవలెను. సః=ఆ వృత్రుఁడు, తమ్=ఆ ఉక్థ్యమును, తస్మై=ఆ యింద్రునకై, త్రిః=మూఁడు మారులు, ప్రాయచ్ఛద్=ఇచ్చెను కదా!

తాత్పర్యము: వృత్రుఁడు ఇంద్రునకు ఉక్థ్యమును మూఁడు మారు లొసఁగెను కావున, యజ్వ ఉక్థ్యగత సోమరసమును మూఁడు భాగములుగా నిష్కర్ష చేసి మూఁడు పర్యాయములు గ్రహించవలెను.

5. అర్థము: (దారుపాత్రే గృహీత హే సోమ!=దారుపాత్రమునందు గ్రహించఁబడిన ఓ సోమరసమా!,) తవ=నీకు, ఏషః=ఈ ఖరప్రదేశము, యోనిః=స్థానము. (ఈ మంత్రము చెప్పచు సోమరసమును ఖరప్రదేశమం దుంచవలెను. ఇది సాదనమంత్రము. సాదనము=ఉంచుట.

(హే స్థాలీగత సోమ!=స్థాలియందలి ఓ సోమరసమా! త్వమ్=నీవు, గృహీతశేషః అపి=గ్రహింపఁబడిన సోమ రసములో మిగిలినదానవైనను,) పునః=మఱల (గ్రహించఁబడుటవలన), హవిః అసి=హవిస్సు వగుచున్నావు. ఇతి=అని, ఆహ=వేదము చెప్పినది. పునః పునః=మఱల మఱల, అస్మాత్=ఈ స్థాలీగత సోమరసము నుండి, నిర్గృహ్ణాతి హి=గ్రహించుచున్నాఁడు కదా!

తాత్పర్యము: "ఏష తే యోనిః", "పున ర్హవి రసి" అనునవి రెండు మంత్రములు. వీనిలో మొదటి మంత్రమును దారుపాత్రమునందు గ్రహింపఁబడిన సోమరసమును ఖరప్రదేశమునందు ఉంచునప్పుడు (సాదనము చేయు నప్పుడు) పఠించవలెను. కనుక ఇది సాదనమంత్రము. రెండవ మంత్రమును సోమరసముతో నిండియున్న స్థాలిని అభిమర్శించుచు పఠించవలెను. కనుక ఇది అభిమర్శన మంత్రము. స్థాలినుండి సోమరసమును రెండు పర్యాయములు గ్రహించవలెను కావున, మంత్రమునందు 'పునః' పదము ద్విరుక్త మైనది. సాదనము, అభిమర్శనము అను రెండింటి నిమిత్తము ఈ మంత్రద్వయము ఇచట ఉత్పాదిత మైనది. స్థాలీగత సోమము గృహీత శేషమైనను మఱల గ్రహించఁబడుటవలన హవిస్సే అయినదని తాత్పర్యము.

6. అర్థము: ఉక్థ్యః యత్=ఉక్థ్య పాత్ర మేది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, చక్షుః వై=నేత్ర స్థానీ యమే. తస్మాత్=ఆ కారణమువలన, హుతమ్ ఉక్థ్యమ్=హుతమైన ఉక్థ్యమును, సోమాః=సోమరసముతో నిండియున్న చమసాదులైన ఇతరపాత్రములు, అన్వాయన్తి=అనుసరించి పోవుచున్నవి. తస్మాత్=ఆ కారణ మువలన, ఆత్మా=సర్వావయవ సంఘాతరూపుఁడైన పురుషుఁడు, చక్షుః=(అవయవములందు ముఖ్యమైన) చక్షుస్సును, అన్వేతి=అనుసరించి పోవుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన ఏకం యన్తమ్=పోవుచున్న ఒక ముఖ్యపురుషుని, బహవః=భృత్యాదు లనేకులు, అనుయన్తి=అనుసరించి పోవుచున్నారు. తస్మాత్=ఆ కారణమువలన, బహూనామ్=అనేక శిష్యులలో, ఏకః=ముఖ్య బోధకుఁడైన ఆచార్యుఁడు, భద్రః=పూజ్యుఁడు, భవతి=అగుచున్నాఁడు. తస్మాత్=ఆ కారణమువలన, ఏకః=ముఖ్యుఁడు, లేక- స్వతంత్రుఁడైన ఒకఁడు, బహ్వీః జాయాః=పరతంత్రలైన అనేక భార్యలను, విన్దతే=పొందుచున్నాఁడు. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, ఆత్మా నమ్=తనను, యజ్ఞయశసేన=యజ్ఞఫలముతో, అర్పయేయమ్ ఇతి=అర్పించెదనని, కామయేత యది=కోరు నెడల, ఆహవనీయం చ హవిర్ధానం చ అన్తరా=ఆహవనీయ హవిర్ధానముల మధ్యప్రదేశమునందు, తిష్ఠన్=నిలుచున్నవాఁ డగుచు, అవనయేత్=చమస పాత్రమునందలి సోమరస సంపాతమును వంచవ లెను. (తదా=అప్పుడు,)ఆత్మానమేవ=తననే, యజ్ఞయశసేన=యజ్ఞఫలముతో, అర్పయతి=అర్పించినవాఁడగు చున్నాఁడు.. యజ్ఞయశసేన=యజ్ఞఫలముతో, యజమానమ్=యజ్ఞకర్తను, అర్పయేయమ్ ఇతి=అర్పించెదనని, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, కామయేత యది=కోరునెడల, సదోహవిర్ధానే అన్తరా=సదోమండప హవిర్ధానముల మధ్యప్రదేశమున, తిష్ఠన్=నిలుచున్నవాఁ డగుచు, అవనయేత్=చమసమునందలి సోమరసమును వంచవలెను. (తదా=అప్పుడు,) యజమానమేవ=యజమానునే, యజ్ఞయశసేన=యజ్ఞఫలముతో, అర్పయతి=అర్పించినవాఁ డగును.

తాత్పర్యము: (ఇచట ఉక్థ్య చమసముల హోమము విధించఁబడినది.) ఉక్థ్య గ్రహము యజ్ఞమునకు చక్షుస్సువంటిది. యజ్ఞమునకు చక్షుస్స్థానీయమైన (ముఖ్యమైన) ఉక్థ్యము హోమము చేయఁబడిన యనంతరము ఇతర స్థానీయములైన సోమరసముతో నిండిన చమస పాత్రములను హోమము చేయవలెను. అవయవములలో ముఖ్యమైన చక్షుస్సు మార్గమునందు ముందు ప్రసరించును. అవయవ సంఘాతరూపుఁడైన పురుషుఁడు అనంతరము ఆ చక్షుఃప్రసారము ననుసరించును. ఉక్థ్యము యజ్ఞమునకు ముఖ్యమైనవిధముగనే చక్షుస్సు సర్వావయవములలో ముఖ్య మైనది. చక్షుస్సును అవయవ సంఘాతము (ఆత్మ) అనుసరించువిధముగ ప్రథ మమున ఉక్థ్యము హోమము చేయఁబడును. దాని ననుసరించి ఇతర చమసములు హోమము చేయఁబడును.

ఇట్లే ఒక ముఖ్యనాయకు ననుసరించి భృత్యాదులనేకులు పోవుచుందురు. అనేక శిష్యులలో బోధకుఁడైన ఒక యాచార్యుఁడు పూజ్యుఁడగుచున్నాఁడు. స్వతంత్రుఁడైన ఒక పురుషుఁడు పరాధీనలైన యనేక భార్యలను పొందుచుండును. ఇచట మూఁడు లౌకిక దృష్టాంతములు చూపఁబడినవి.

అధ్వర్యుఁడు యజ్ఞఫలము తనకు చెందవలయునని కోరునెడల ఆహవనీయ హవిర్ధానముల మధ్యప్రదేశమున నిలుచుండి హోమద్రవ్యమును అగ్నియందు పడవేయవలెను. అప్పుడు యజ్ఞఫలము తనకే చెందును. యజ్ఞఫలము యజ్ఞకర్తకు చెందవలయునని యధ్వర్యుఁడు కోరునెడల సదోమండప హవిర్ధానముల మధ్యప్రదేశమున నిలుచుండి హోమద్రవ్యమును అగ్నియందు వేయవలయును. అప్పుడు యజ్ఞఫలమును యజ్ఞకర్తకే చెందునట్లు చేసినవాఁ డగును. ఈ పూర్వోక్తములైన దృష్టాంతములచే ఉక్థ్య హోమానంతరమే చమస హోమము చేయుట యుక్తమని స్పష్ట మగుచున్నది.

7. అర్థము: సదస్యాన్=సదస్యులను, యజ్ఞయశసేన=యజ్ఞఫలముతో, అర్పయేయమ్ ఇతి=అర్పించెదనని, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, కామయేత యది=కోరునెడల, సదః=సదోమండపమును, ఆలభ్య=ప్రవేశించి, అపనయేత్=హోమద్రవ్యము నగ్నియందు వేయవలెను. తదా=అప్పుడు, సదస్యానేవ=సదస్యులనే, యజ్ఞయశసేన=యజ్ఞఫలముతో, అర్పయతి=అర్పించినవాఁ డగును.

తాత్పర్యము: యజ్ఞఫలము సదస్యులకు చెందవలెనని అధ్వర్యుఁడు కోరునెడల సదోమండపమునందు ప్రవేశించి హోమద్రవ్యమును అగ్నియందు వేయవలెను. ఇట్లు చేసిన యధ్వర్యుఁడు యజ్ఞఫలమును సదస్యులకే అర్పించినవాఁడగును. ముఖ్యచమసమునందలి సోమరస సంపాతముయొక్క అవనయనము ఇచట విధించఁబడినది.

ప్రథమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః

మూలము: [1]ఆయుర్వా ఏతద్యజ్ఞస్య యద్ధ్రువ ఉత్తమో గ్రహాణాం గృహ్యతే తస్మాదాయుః ప్రాణానా ముత్తమం [2]మూర్ధానం దివో అరతిం పృథివ్యా ఇత్యాహ మూర్ధాన మేవైనగ్ం సమానానాం కరోతి [3]వైశ్వానర మృతాయ జాత మగ్ని మిత్యాహ వైశ్వానరగ్ం హి దేవతయాఽఽయు [4]రుభయతో వైశ్వానరో గృహ్యతే తస్మాదుభయతః ప్రాణా అధస్తాచ్చోపరిష్టాచ్చా [5]ర్ధినోఽన్యే గ్రహా గృహ్యన్తేఽర్ధీ ధ్రువస్తస్మా (౧)దర్ధ్యవ్రాత్మనోఽన్యేషాం ప్రాణానా [6]ముపోప్తేఽన్యే గ్రహాః సాద్యన్తేఽనుపోప్తే ధ్రువ స్తస్మా దస్థ్నాఽన్యాః ప్రజాః ప్రతితిష్ఠన్తి మాగ్ంసేనాన్యా [7]అసురా వా ఉత్తరతః పృథివీం పర్యాచికీర్షన్తాం దేవా ధ్రువేణాదృగ్ంహ న్తద్ధ్రువస్య ధ్రువత్వం యద్ధ్రువ ఉత్తరతః సాద్యతే ధృత్యా [8]ఆయుర్వా ఏతద్యజ్ఞస్య యద్ధ్రువ ఆత్మా హోతా యద్ధోతృచమసే ధ్రువ మవనయత్యాత్మన్నేవ యజ్ఞస్య (౨)ఆయుర్దధాతి [9]పురస్తా దుక్థస్యావనీయ ఇత్యాహుః పురస్తాద్ధ్యాయుషో భుఙ్క్తే మధ్యతోఽవనీయ ఇత్యాహు ర్మధ్యమేన హ్యాయుషో భుఙ్క్త ఉత్తరార్ధేఽవనీయ ఇత్యాహు రుత్తమేన హ్యాయుషో భుఙ్క్తే [10]వైశ్వదేవ్యామృచి శస్యమానాయామవ నయతి వైశ్వదేవ్యో వై ప్రజాః ప్రజాస్వేవాఽఽయు ర్దధాతి (3)||

[అర్ధీ ధ్రువస్తస్మాదేవ యజ్ఞస్యైకాన్నచత్వారిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమప్రపాఠకే ద్వితీయోఽనువాకః ||౨||

# వేదార్థదీపిక

అవతారిక: ప్రథమానువాకమునందు ఉక్థ్యగ్రహమును గుఱించి వివరించఁబడినది. ఈ ద్వితీయానువాకమున ధ్రువగ్రహము చెప్పఁబడుచున్నది.

1. అర్థము: ధ్రువః యత్=ధ్రువగ్రహము ఏది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, ఆయుః వై=ఆయువే( ఆయుస్స్థానీయమే). గ్రహాణామ్=అంతర్యామైంద్రవాయవాది గ్రహములలో, ఉత్తమః=చివరిదిగా. గృహ్యతే=గ్రహించఁబడవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ఆయుః=ఆయువు, ప్రాణానామ్=వాగాది ప్రాణములలో, ఉత్తమమ్=ఉత్తమ మైనది.

తాత్పర్యము: ఐంద్రవాయవాది గ్రహములు యజ్ఞమునకు వాగాది ప్రాణరూపము లైనవిధముగ ధ్రువగ్రహము కూడ యజ్ఞమునకు ఆయుస్స్వరూప మైనది. ఆ ధ్రువగ్రహము ధారాగ్రహములైన అంతర్యామైంద్రవాయవాది గ్రహములలో ఉత్తమ(చరమ)మైనదిగా గ్రహించవలెను. ధ్రువగ్రహ ప్రస్తావమునందు "అత్ర ధారా విరమతి" అని సూత్రకారులు చెప్పినారు. అనఁగా ధ్రువగ్రహమునందలి సోమరసము హోతృచమసమునందు వంచఁబడును. సోమరస ధార ఈ పాత్రమునందు విరమించఁబడును. కావున ధారాగ్రహములయిన ఐంద్రవాయవాది గ్రహములలో ఇది ఉత్తమ (చరమ)మైనదిగా గ్రహించవలయునని యిచట ధ్రువగ్రహ గ్రహణము విధించఁబడినది.

2. అర్థము: "మూర్ధానం దివో అరతిం పృథివ్యాః" ఇతి ఆహ="శిరస్సువలె ఉన్నతదేశమునందు సూర్యరూపమున ఉండి ద్యులోకమును భాసింపఁజేయువాఁడును, పృథివియందు దాహ పాక ప్రకాశములచేత సర్వకాలములందు ఉండుటచే ఉపరతి లేనివాఁడునునగు వైశ్వానర నామకుఁడైన అగ్నిని స్తుతించుచున్నాము" అని "మూర్ధాన" మిత్యాది మంత్రము చెప్పినది. (ఈ మంత్రము కా. 1, ప్ర. 4, అ. 13 లోనిది. ఈ మంత్రమునందు 'మూర్ధాన' మిత్యాది శబ్దప్రయోగముచేత,) ఏనమ్=ఈ యజమానుని, సమానానామ్=సమానులలో, మూర్ధానమ్ ఏవ=శ్రేష్ఠునిగానే, కరోతి=(ఈ స్తుతింపఁబడిన యగ్ని) చేయును.

తాత్పర్యము: 'మూర్ధాన' మిత్యాది మంత్రమునందు ధ్రువగ్రహమునకు ఒక నిర్దిష్టప్రదేశమునందు వైశ్వానరాగ్ని కొఱకు ఆసాదనము చెప్పఁబడినది. కనుక ఆ వైశ్వానరాగ్ని తనకై ధ్రువగ్రహమును సాదనము చేసిన యజమానుని సమానులలో శ్రేష్ఠునిగా చేయునని ఇచట వివరించఁబడినది.

3. అర్థము: "వైశ్వానర మృతాయ జాత మగ్నిమ్" ఇతి ఆహ="పృథివియందు యజ్ఞముకొఱకు ఆహవనీయాది రూపమున పుట్టిన వైశ్వానరాగ్నిని స్తుతించుచున్నాము." అని ఈ మంత్రభాగము చెప్పినది. దేవతయా=దేవతచే, ఆయుః=ఆయువు, వైశ్వానరం హి=వైశ్వానరాగ్ని సంబంధి కదా!

తాత్పర్యము: ఆయువునకు వైశ్వానరాగ్ని అభిమాని దేవత కావున యజ్ఞమునకు ఆయుస్స్థానీయమైన ధ్రువగ్రహమును గ్రహించువిషయమున మంత్రమునందు వైశ్వానర శబ్దప్రయోగము యుక్త మైనది.

4. అర్థము: ఉభయతః=ఋగ్యజుస్సులందు రెండింటియందును, వైశ్వానరః='వైశ్వానర' శబ్దము, గృహ్యతే=గ్రహించఁబడుచున్నది (ఉపాత్త మైనది). తస్మాత్=ఆ కారణమువలన, అధస్తాత్ ఉపరిష్టాత్ చ ఉభయతః=నాభికి క్రింది భాగమున, ఉపరిభాగమున, రెండు భాగములందును, ప్రాణాః=ప్రాణములు, వర్తన్తే=ఉంటున్నవి.

తాత్పర్యము: "మూర్ధానం దివో అరతిం - - - - జనయన్త దేవాః" అనునది ఋక్కు. ఈ ఋక్కునకు అనంతరము "ఉపయామగృహీతోఽసి - - - -త్వా వైశ్వానరాయ" అనునది యజుస్సు. ఋగ్యజుస్సులందు రెండింటియందును వైశ్వానర శబ్దము ప్రయుక్త మైనది. నాభికి ఊర్ధ్వభాగమునను అధోభాగమునను ప్రాణములు వర్తించుచున్నవి కనుక వైశ్వానర శబ్దప్రయోగము ప్రాణసాదృశ్యముకొఱకు చేయఁబడినది. ఋక్కునందు,

దాని కుపరితన యజుస్సునందును వైశ్వానర శబ్దము ఉన్నవిధముగనే నాభికి క్రిందిభాగమున, ఉపరితన భాగమునను ప్రాణములు సంచరించుచుండుటచే వైశ్వానరశబ్దమునకు ప్రాణసాదృశ్య మేర్పడినదని భావము.

5. అర్థము: అర్థినః=యజ్ఞముయొక్క అర్థకృత్యమును నిర్వహించుచున్న, అన్యే గ్రహాః=ధ్రువగ్రహముకంటె నితరములైన గ్రహములు, గృహ్యన్తే=యజ్ఞమునందు గ్రహింపఁబడుచున్నవి. అర్థీ=యజ్ఞముయొక్క అర్థకృత్యమును నిర్వహించునట్టి, ధ్రువః=ధ్రువగ్రహము, గృహ్యతే=గ్రహింపఁబడుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, అర్వాఙ్=అధోభాగవర్తియైన ప్రాణః=ప్రాణము, అన్యేషాం ప్రాణానామ్=ఇతర ప్రాణములయొక్క, అర్థీ=అర్థ కృత్యమును నిర్వహించునది, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: వాక్చక్షురాదులు శరీరమునం దుపరితలమున నున్నవియై మూకతాంధత్వబధిరత్వాది కృతములైన వ్యాపార నిరోధములను నివారించుటచే దేహమునకు అర్థకృత్యమును నిర్వహించుచున్నవి. శరీరముయొక్క అధోభాగవర్తియైన ప్రాణము మలమూత్ర నిరోధమును నివారించుచు శరీరమునకు అర్థకృత్యమును నిర్వహించుచున్నది. ఈ విధముగనే ధ్రువగ్రహముకంటె నితరములైన అంతర్యామాది గ్రహములు యజ్ఞమునకు అర్థకృత్యమును నిర్వహించుచున్నవి. ఈ విధముగ ధ్రువగ్రహము ప్రశంసింపఁబడినది.

6. అర్థము: అన్యే గ్రహాః=ధ్రువగ్రహముకంటె నితరములైన గ్రహములు, ఉపోప్తే=భూమియందు మట్టిని పోసి ఖరీకృతమైన ప్రదేశమునందు, సాద్యన్తే=సాదనము చేయఁబడుచున్నవి. అనుపోప్తే=మట్టిని పోయని కేవల భూమియందు, ధ్రువః=ధ్రువగ్రహము, సాద్యతే=సాదనము చేయఁబడుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, అన్యాః ప్రజాః=మనుష్యులకంటె ఇతరములైన గవాది ప్రాణులు, అస్థ్నా=అస్థివలె కఠినమైన గొరిజతో, ప్రతితిష్ఠన్తి=(భూమియందు)నిలఁబడుచున్నవి. అన్యాః=ఇతరులయిన మనుష్యరూప ప్రజలు, మాంసేన=పాద తలమునందలి మాంసముతో, ప్రతితిష్ఠన్తి=నిలఁబడుచున్నారు.

తాత్పర్యము: ధ్రువగ్రహముకంటె ఇతరములైన గ్రహములను భూమియందు మట్టిని పోసి ఆ ప్రదేశమునందు సాదనము చేయవలెను. (ఉంచఁబడుచున్నవి.) ధ్రువగ్రహమును మట్టి పోయని కేవల భూమియందు సాదనము చేయవలయును. గవాది ప్రాణులు అస్థివలె కఠినమైన గొరిజలతో భూమియందు నిలఁబడుచున్నవి. మనుష్యరూప ప్రజలు మాంసముతో కూడియున్న పాదములతో నిలఁబడుచున్నారు. ఇచట ధ్రువగ్రహమునకు ఇతరగ్రహ విలక్షణమైన సాదనస్థానము విధింపఁబడినది.

7. అర్థము: అసురాః=రాక్షసులు, పృథివీమ్=భూమిని, ఉత్తరతః=ఉత్తరపు దిశకు, పర్యాచికీర్షన్ వై=ఆకర్షించుటకే యిచ్ఛయించిరి. తామ్=ఆ భూమిని, దేవాః=దేవతలు, ధ్రువేణ=ధ్రువగ్రహముచేత, అదృంహన్=దృఢపఱచిరి. తత్=ఆ కారణమువలన, ధ్రువస్య=ధ్రువగ్రహమునకు, ధ్రువత్వమ్=ధ్రువపఱచుట అను నర్థము, (సార్థకమ్=సార్థకమైనది.) ధ్రువ=ధ్రువగ్రహము, ఉత్తరతః=ఉత్తర హవిర్ధాన సమీప ప్రదేశమున, సాద్యతే యత్=సాదనము చేయఁబడుచున్నచో, తత్=అది, ధృత్యై=భూమియొక్క ధృతికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: అసురులు భూమిని ఉత్తరదిశగా ఆకర్షింపవలెనని తలంచిరఁట. దేవతలు ఆ భూమిని ధ్రువగ్రహముచేత దృఢపఱచిరి. కావున దృఢపఱచుట అను నర్థము ఆ పదమునకు సార్థక మైనది. ధ్రువగ్రహమును ఉత్తర హవిర్ధాన సమీప ప్రదేశమున సాదనము చేయఁబడవలెను. అట్లు చేయుటచే భూమి స్థిర యగును. భూమి యందు సాదనము చేయఁబడిన ధ్రువగ్రహమునకు ఉత్తర హవిర్ధాన సమీప ప్రదేశము ఇచట విధింపఁబడినది.

8. అర్థము: ధ్రువః యత్=ధ్రువగ్రహము ఏది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, ఆయుః వై=ఆయుస్థానీయమే. హోతా=హోత, ఆత్మా=యజ్ఞమునకు ఆత్మస్థానీయుఁడు. హోతృచమసే=హోతయొక్క చమస పాత్రమునందు, ధ్రువమ్=ధ్రువగ్రహములోని సోమరసమును, అవనయతి యత్=వంచినచో, యజ్ఞస్య ఆయుః=యజ్ఞముయొక్క ఆయువును, ఆత్మన్నేవ=ఆత్మయందే, దధాతి=ధరింపఁజేసినవాఁ డగును.

తాత్పర్యము: ధ్రువగ్రహము యజ్ఞమునకు ఆయుస్స్థానీయ మైనది. హోత యజ్ఞమునకు ఆత్మస్థానీయుఁడు. ధ్రువగ్రహ గత సోమరసమును హోతృచమసమునందు వంచినచో యజ్ఞముయొక్క ఆయువును ఆత్మయందే స్థాపించినట్లగును. ధ్రువగ్రహమునందలి సోమరసమునకు హోతృచమసమునందు అవనయనము ఇచట విధించఁబడినది.

9. అర్థము: ఉక్థస్య=శస్త్రముయొక్క, పురస్తాత్=పూర్వభాగమునందు, అవనీయః ఇతి=సోమరసము అవనయనము చేయఁదగినదని, ఆహుః=(కొందఱు) చెప్పిరి. ఆయుషః పురస్తాత్=ఆయువుయొక్క పూర్వభాగమునందు (బాల్యమునందు), భుఙ్క్తే హి=అనేక పర్యాయములు భుజించుచున్నాఁడు కదా! మధ్యతః=శస్త్రము యొక్క మధ్యమ భాగమునందు, అవనీయః ఇతి=అవనయనము చేయఁదగినదని, ఆహుః=(కొందఱు) చెప్పిరి. ఆయుషః=ఆయువుయొక్క, మధ్యమేన=మధ్యమభాగము(నందు)చేత, భుఙ్క్తే హి=బహ్వన్నమును భుజిం చుచున్నాఁడు కదా! ఉత్తరార్ధే=శస్త్రముయొక్క ఉత్తమ భాగమునందు, అవనీయః ఇతి=అవనయనము చేయఁదగినదని, ఆహుః=(కొందఱు) చెప్పిరి. ఆయుషః ఉత్తమేన=ఆయువుయొక్క ఉత్తమ భాగము(నందు) చేత, భుఙ్క్తే హి=అధికముగ భుజించుటకు ఇచ్ఛయించుచున్నాఁడు కదా!

తాత్పర్యము: ఉక్థ మనఁగా సామవిశేషము. ఆ సామమును మూఁడు భాగములు చేసి పూర్వభాగము గానము చేయఁబడు చుండఁగా హోతృచమసమునందు ధ్రువగ్రహమునందలి సోమరసమును అవనయనము(వంచుట)చేయవలెనని కొందఱు చెప్పిరి. మానవుఁడు తన ఆయువుయొక్క పూర్వభాగమునందు అనఁగా బాల్యమునందు అనేక పర్యాయములు భుజించుచున్నాఁడు కదా! అని పూర్వోక్త విషయము సమర్థించఁబడినది. ధ్రువగ్రహము యజ్ఞమునకు ఆయుస్స్థానీయ మైనదని పూర్వము వర్ణించఁబడినది. ఈ విధముగానే సామవిశేషము యొక్క మధ్యమ భాగము గానము చేయఁబడుచుండఁగా సోమరసము నవనయనము చేయవలయునని కొందఱు చెప్పినారు. మానవుఁడు తన మధ్యమ వయస్సునందు (యౌవనమునందు)బహ్వన్నమును భుజిం చుచున్నాఁడు కదా! అని వీరి సమర్థనము. శస్త్రముయొక్క చరమభాగము గానము చేయఁబడుచుండఁగా సోమరసము నవనయనము చేయవలెనని మఱికొందఱు చెప్పినారు. మానవుఁడు చరమ వయస్సునందు అధికముగ భుజించవలెనని కోరుచుండునే కాని అధికముగ భుజించలేఁడు. సోమరసావనయనమునకు కాలమును విధించుటకు ముందు ఇచట మతాంతరములు చూపఁబడినవి.

10. అర్థము: వైశ్వదేవ్యామ్ ఋచి=వైశ్వదేవి ఋక్కు, శస్యమానాయామ్=పఠించఁబడిన దగుచుండఁగా, అవన యతి=(పూర్వోక్త సోమరసమును హోతృచమసమునందు) అవనయనము చేయవలెను. ప్రజాః=ప్రజలు, వైశ్వదేవ్యః వై=వైశ్వదేవి ఋక్కునకు సంబంధించిన వారే. (ఏవం సతి=ఇట్లు కాఁగా,) ప్రజాస్వేవ=ప్రజ లయందే, ఆయుః=ఆయువును, దధాతి=ధరింపఁజేసినవాఁ డగును.

తాత్పర్యము: "ఉత నోఽహిర్బుధ్నియః శృణోతు" అను ఋక్కు వైశ్వదేవి ఋక్కు. ఆ ఋక్కును పఠించుచుండఁగా ధ్రువగ్రహమునందలి సోమరసమును హోతృచమసమునందు అవనయనము చేయవలయును. ఇట్లు చేసినచో ప్రజలు వైశ్వదేవి ఋక్కునకు సంబంధించినవారు కనుక యజమానుఁడు ప్రజలయందే ఆయువును స్థాపిం చినవాఁ డగును. ఇచట సోమరసావనయనము విధించఁబడినది.

ద్వితీయానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే తృతీయోఽనువాకః

మూలము: [1]యజ్ఞేన వై దేవాః సువర్గం లోకమాయన్తేఽమన్యన్త మనుష్యా నోఽన్వాభవిష్యన్తీతి తే సంవ
త్సరేణ యోపయిత్వా సువర్గం లోకమాయన్త మృషయ ఋతుగ్రహైరేవాను ప్రాజానన్యదృతుగ్రహా
గృహ్యన్తే సువర్గస్య లోకస్య ప్రజ్ఞాత్యై [2]ద్వాదశ గృహ్యన్తే ద్వాదశ మాసాః సంవత్సరః సంవత్సరస్య
ప్రజ్ఞాత్యై [3]సహ ప్రథమౌ గృహ్యేతే సహోత్తమౌ తస్మాద్ద్వాద్వావృతూ [4]ఉభయతోముఖ మృతు
పాత్రం భవతి కః (౧)హి తద్వేద యత ఋతూనాం ముఖ [5]మృతునా ప్రేష్యేతి షట్కృత్వ ఆహ
షడ్వా ఋతవ ఋతూనేవ ప్రీణాత్యృతుభిరితి చతుశ్చతుష్పద ఏవ పశూన్ప్రీణాతి ద్విః పునర్‌ఋ
తునాఽఽహ ద్విపద ఏవ ప్రీణా [6]త్యృతునా ప్రేష్యేతి షట్కృత్వ ఆహర్తుభిరితి చతుస్తస్మా చ్చతు
ష్పాదః పశవ ఋతూనుప జీవన్తి ద్విః (౨)పునర్‌ఋతునాఽఽహ తస్మాద్ద్విపాద శ్చతుష్పదః పశూ
నుప జీవ [7]న్త్యృతునా ప్రేష్యేతి షట్కృత్వ ఆహర్తుభిరితి చతుర్ద్విః పునర్‌ఋతునా ఽఽహాఽఽక్రమ
ణమేవ తత్సేతుం యజమానః కురుతే సువర్గస్య లోకస్య సమష్ట్యై [8]నాన్యోఽన్యమను ప్రపద్యేత
యదన్యోఽన్యమను ప్రపద్యేతర్తురృతుమను ప్రపద్యేతర్తవో మోహుకాః స్యుః (3) [9]ప్రసిద్ధ మేవా
ధ్వర్యు ర్దక్షిణేన ప్ర పద్యతే ప్రసిద్ధం ప్రతిప్రస్థాతోత్తరేణ తస్మాదాదిత్యః షణ్మాసో దక్షిణేనైతి షడు
త్తరేణో [10]పయామ గృహీతోఽసి సగ్ంసర్పోఽస్యగ్ంహస్పత్యాయ త్వేత్యాహాస్తి త్రయోదశో మాస
ఇత్యాహు స్తమేవ తత్ప్రీణాతి(౪)||

[కో జీవన్తి ద్విః స్యు శ్చతుస్త్రిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే తృతీయోఽనువాకః ||

# వేదార్థదీపిక

అవతారిక: ద్వితీయానువాకమునందు ధ్రువగ్రహము విహిత మైనది. దాని చరిత్రయు చెప్పఁబడినది. ఈ తృతీయానువాకమునందు ఋతుగ్రహము చెప్పఁబడుచున్నది.

1. అర్థము: దేవాః=దేవతలు, యజ్ఞేన వై=యజ్ఞముచేతనే, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, ఆయన్=పొందిరి. తే=వారు, 'మనుష్యాః=మనుష్యులు, నః=మమ్ము, అన్వాభవిష్యన్తి ఇతి=అనుసరించి రాఁగలరని,' అమన్యన్త=తలఁచిరి. తే=ఆ దేవతలు, సంవత్సరేణ యోపయిత్వా=సంవత్సర కాలము విలంబనము చేసి, సువర్గం లోకమ్ ఆయన్=స్వర్గలోకము నొందిరి. ఋషయః=ఋషులు, తమ్=ఆ స్వర్గమును, ఋతుగ్రహైరేవ=ఋతుగ్రహములచేతనే, అను ప్రాజానన్=వెంటనే బాగుగ తెలిసికొనిరి. ఋతుగ్రహాః=ఋతుగ్రహములు, గృహ్యన్తే యత్=గ్రహింపఁబడుచున్నచో, (తత్=ఆ ఋతుగ్రహ గ్రహణము,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, ప్రజ్ఞాత్యై=ప్రకృష్ట జ్ఞానముకొఱకు, (సంపద్యతే=సంపన్న మగుచున్నది.)

తాత్పర్యము: దేవతలు యజ్ఞము చేసి స్వర్గలోకమును పొందిరి. అప్పుడు వారు 'మనుష్యులు తమ్ము అనుసరించి స్వర్గమునకు వత్తురేమో' యని తలఁచి యజ్ఞము చేసిన పిమ్మట సంవత్సర కాలము విలంబనము చేసి అనంతరము స్వర్గమునకుఁ బోయిరి. మనుష్యులలో అభిజ్ఞులైన ఋషులు యజ్ఞమునందు ఋతుగ్రహములను గ్రహించి ఆ ఋతుగ్రహ గ్రహణముచేతనే స్వర్గమును బాగుగ తెలిసికొనిరి. కావున యజ్వ యజ్ఞమునందు ఋతుగ్రహములను గ్రహించవలెను. ఆ ఋతుగ్రహ గ్రహణము స్వర్గాభిజ్ఞానమునకు సంపన్న మగును. ఇచట ఋతుగ్రహ గ్రహణము విధించఁబడినది.

2. అర్థము: ద్వాదశ=పండ్రెండు ఋతుగ్రహములు, గృహ్యన్తే=గ్రహించఁబడవలెను. ద్వాదశ మాసాః=పండ్రెండు మాసములు, సంవత్సరః=సంవత్సరము, భవతి=అగుచున్నది. ఏతత్=ఈ ద్వాదశ గ్రహ గ్రహణము, సంవత్సరస్య=సంవత్సరముయొక్క, ప్రజ్ఞాత్యై=ప్రజ్ఞానముకొఱకు, సంపద్యతే=సంపన్న మగుచున్నది. ఈ సంఖ్య త్రయోదశ చతుర్దశ సంఖ్యలకు కూడ ఉపలక్షణము.

తాత్పర్యము: యజ్వ యజ్ఞమునందు పండ్రెండు ఋతు గ్రహములను గ్రహించవలెను. పండ్రెండు మాసములు ఒక సంవత్సరము కావున, దీనివలన సంవత్సరజ్ఞానము కలుగును. ఇచట ఋతుగ్రహ సంఖ్య విధించఁబడినది.

3. అర్థము: ప్రథమౌ=మొదటి రెండు గ్రహములు(మాసములు), సహ గృహ్యేతే=ఒకమారు (ఒకదానితో కూడ మఱియొక గ్రహము) గ్రహించఁబడవలెను. ఉత్తమౌ=చివరివి రెండును, సహ=ఒకమారు, గృహ్యేతే=గ్రహించఁబడవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ద్వౌ ద్వౌ=రెండు రెండు మాసములు, ఋతూ=ఒక్కొక్క ఋతువున కవయవములు.

తాత్పర్యము: మొదటి రెండు గ్రహములు, (మాసములు). చివరి రెండు గ్రహములు (మాసములు) ఒక్కొక్కమారుగా గ్రహించవలెను. కనుక రెండేసి మాసములు ఒక్కొక్క ఋతువున కవయవములు. (ప్రథమౌ=మధుశ్చ మాధవశ్చైతౌ ప్రథమౌ. తపశ్చ తపస్యశ్చైతావుత్తరౌ ఇచట ఆద్యంతములందు రెండింటికి గ్రహణము విధించఁబడినది. ఈ ఋతు గ్రహములకు గ్రహణమే చెప్పఁబడినది. కాని పూర్వగ్రహములకువలె సాదనము చెప్పఁబడలేదు.)

4. అర్థము: ఋతుపాత్రమ్=ఋతుగ్రహము, ఉభయతోముఖమ్=(సోమరసధార పడుటకు) రెండు ముఖములు కలదిగా నుండవలెను. ఋతూనామ్=ఋతువులయొక్క, ముఖమ్=ముఖము(ప్రారంభము), యతః=ఏ కాలమునుండి, భవతి=అగుచున్నదో, తత్=దానిని, కః=ఎవఁడు, వేద హి=తెలిసికొనెను?

తాత్పర్యము: ఋతుపాత్రమునుండి సోమరసము రెండు ధారలుగా వహ్నియందు స్రవించుటకై ఋతుగ్రహ బిలమున కిరుపార్శ్వములందు రెండు ముఖము లుండవలెను. ఋతుధర్మ ప్రవృత్తి యే కాలమునుండి ఆరంభమై జరుగుచున్నదో ఎవఁడెఱుంగును? కావున ఋతుగ్రహమునకు ముఖద్వయమును చేయవలెను. ఇచట ఋతు పాత్రమునకు ముఖద్వయము విధించఁబడినది.

5. అర్థము: "ఋతునా ప్రేష్య" ఇతి="ఋతునిమిత్తముగా హోతను గూర్చి ప్రైష మంత్రము చెప్పుము" అను ప్రైష మంత్రమును, షట్కృత్వః=ఆఱు మారులు, ఆహ=చెప్పవలెను. ఋతవః=ఋతువులు, షట్ వై=ఆఱే. ఋతూనేవ=ఋతువులనే, ప్రీణాతి=సంతోషపెట్టును. "ఋతుభిః ప్రేష్య" ఇతి="ఋతువుల నిమిత్తముగా ప్రైష మంత్రము చెప్పుము" అని, చతుః=నాలుగు పర్యాయములు, ఆహ=పలుకవలెను. చతుష్పదః పశూ నేవ=నాలుగు పాదములు గల పశువులనే, ప్రీణాతి=సంతోషపఱుచును. పునః=మఱల, "ఋతునా ప్రేష్య" ఇతి="ఋతువు నిమిత్తముగా ప్రైష మంత్రము చెప్పుము." అని, ద్విః=రెండు మారులు, ఆహ=పలుకవలెను. ద్విపదః ఏవ=రెండు పాదములు గల మనుష్యులను, పక్షులనే, ప్రీణాతి=సంతోషపఱుచును.

తాత్పర్యము: ఓ మైత్రావరుణుఁడా! "ఋతునా ప్రేష్య"="ఋతునిమిత్తముచే హోతను గూర్చి ప్రైష మంత్రము చెప్పుము" అని అధ్వర్యుఁడు ప్రథమ తృతీయ పంచమ ఋతుగ్రహముల విషయముననుు, ప్రతిప్రస్థాత ద్వితీయ చతుర్థ షష్ఠ ఋతుగ్రహముల విషయమునను "ఋతునా ప్రేష్య" అను ప్రైషమంత్రమును పలుకవలయును. ఇట్లు పలికినచో ఆఱు మారులు ప్రైషమంత్రము ఆవృత్త మగును. ఋతువులు ఆఱు కనుక దీనివలన యజమానుఁడు ఆఱు ఋతువులను సంతోషపఱచినవాఁ డగును. పిమ్మట "ఋతుభిః ప్రేష్య"="ఋతువుల నిమిత్తముగా హోతను గూర్చి ప్రైష మంత్రమును పలుకుము" అని అధ్వర్యుఁడు సప్తమ నవమ గ్రహముల విషయముననుు, ప్రతిప్రస్థాత అష్టమ దశమ గ్రహముల విషయమునను ప్రైష మంత్రమును చెప్పలెను. ఇట్లు చేసినచో ఈ ప్రైష మంత్రము చతురావృత్త మగును. పశువులు నాలుగు పాదములు కలవి కావున దీనిచేత పశువులను సంతోషపఱచినవాఁ డగును. అనంతరము "ఋతునా ప్రేష్య" అని అధ్వర్యుఁడు ఏకాదశ ఋతుగ్రహము విషయముననుు, ప్రతిప్రస్థాత ద్వాదశ ఋతుగ్రహ విషయమునను పలుకవలెను. ఇట్లు పలుకుటచే ప్రైష మంత్రము ద్విరావృత్త మగును. దీనిచే యజ్వ రెండు పాదములు కల మనుష్యులను పక్షులను సంతోషపెట్టినవాఁ డగును. ఇచట అధ్వర్యు ప్రతిప్రస్థాతలకు ప్రైష మంత్రము ఉత్పాదిత మైనది.

6. అర్థము: "ఋతునా ప్రేష్య" ఇతి షట్కృత్వః ఆహ="ఋతునా ప్రేష్య" అని ఆఱు మారులు పలుకవలెనని చెప్పెను. (ఇట్లే) "ఋతుభిః ప్రేష్య" ఇతి చతుః="ఋతుభిః ప్రేష్య" అని నాలుగు మారులు పలుకవలెనని చెప్పెను. తస్మాత్=ఆ కారణమువలన, చతుష్పాదః పశవః=నాలుగు పాదములు గల పశువులు, ఋతూన్ ఉప జీవన్తి=ఋతువుల నాశ్రయించి జీవించుచున్నవి. పునః=మఱల, "ఋతునా ప్రేష్య" ఇతి ద్విః ఆహ="ఋతునా ప్రేష్య" అని రెండు మారులు పలుకవలెనని చెప్పెను. తస్మాత్=ఆ కారణమువలన, ద్విపాదః=రెండు పాదములు గల పక్షులు మనుష్యులు, చతుష్పదః పశూన్=నాలుగు పాదములు గల పశువులను, ఉప జీవన్తి=ఆశ్రయించి జీవించుచున్నారు.

తాత్పర్యము: "ఋతునా ప్రేష్య" అను ప్రైష మంత్రము ఆఱు మారులు ఆవృత్తమగుటచేతను, "ఋతుభిః ప్రేష్య" అను ప్రైష మంత్రము నాలుగు మారులు ఆవృత్త మగుటచేతను నాలుగు పాదములు కల పశువులు శీతోష్ణాదులైన ఋతుధర్మముల నాశ్రయించి జీవించుచున్నవనియు, మఱల "ఋతునా ప్రేష్య" అను ప్రైష మంత్రము ద్విరావృత్త మగుటచేత ద్విపాదులైన పక్షులు, మనుష్యులును పశువుల సంబంధములైన క్షీరాదుల నాశ్రయించి జీవించుచున్నారనియు ఈ మంత్రము స్పష్టము చేసినది. ఇచట షట్ చతుర్ద్వి సంఖ్య ఉపజీవ్యోపజీవకభావముచే ప్రశంసించఁబడినది.

7. అర్థము: "ఋతునా ప్రేష్య" ఇతి షట్కృత్వః ఆహ="ఋతునా ప్రేష్య" అను ప్రైషమంత్రమును ఆఱు మారులు ఆవృత్తము చేయవలయునని వేదము చెప్పినది. "ఋతుభిః ప్రేష్య" అను ప్రైషమంత్రమును, చతుః ఆహ=నాలుగు మారులు ఆవృత్తము చేయవలెనని చెప్పెను. పునః=మఱల "ఋతునా ప్రేష్య" అను ప్రైష మంత్రమును, ద్విః ఆహ=రెండు మారులు ఆవృత్తము చేయవలెనని చెప్పెను. తత్=దానిని, యజమానః=యజమానుఁడు, ఆక్రమణం సేతుమేవ=ఆక్రమణ రూపమైన సేతువుగానే, కురుతే=చేయు చున్నాఁడు. (ఏతత్=ఇది,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, సమష్ట్యై=ప్రాప్తికొఱకు, భవతి=అగు చున్నది.

తాత్పర్యము: ప్రైష మంత్రము మొదట ఆఱు మారులు, అనంతరము నాలుగు మారులు పిమ్మట రెండు మారులు ఆవృత్త మగుటచే యజమానుఁడు దానిని ఆక్రమణ రూపమేయైన సేతువుగానే చేసినవాఁ డగుచున్నాఁడు. అది స్వర్గలోక ప్రాప్తికి సాధన మగును. ఆక్రమ్యతే=ప్రాప్యతే స్వర్గః అనేనేతి ఆక్రమణః=సేతుః. సేతు వనఁగా నీటికట్టు లేక-వారధి అని యర్థము. కాని యిచట సేతువనఁగా సోపాన మార్గమని యర్థము. స్వర్గమును ఆరోహించుటకు ఇది సోపానమార్గమని భావము. సేతువుయొక్క అధోభాగము విశాలముగాను, ఊర్ధ్వభాగము సంకుచితముగాను ఉండును. ఇచట ప్రారంభమున షట్సంఖ్య పెద్దది. దానితర్వాత చతు స్సంఖ్య అంతకంటె చిన్నది. అంతకంటెను ద్వి సంఖ్య చిన్నది. ఈ సామ్యముచే ప్రైషమంత్రముయొక్క షట్చతుర్ద్విసంఖ్య స్వర్గప్రాప్తికి సోపాన మార్గముగా వర్ణించఁబడినది.

8. అర్థము: అన్యః=అధ్వర్యు ప్రతిప్రస్థాతలలో ఇతరుఁడు, అన్యమ్=ఇతరుని, న అను ప్రపద్యేత=అనుసరించి వెళ్లఁగూడదు. అన్యః అన్యమ్ అను ప్రపద్యేత యత్=ఇతరుఁడు (ఒకఁడు) ఇతరుని(మఱియొకనిని) అనుసరించి వెళ్లినచో, ఋతుః=ఒక ఋతువు, ఋతుమ్=ఇంకొక ఋతువును, అను ప్రపద్యేత=ప్రవేశించును. (తదా=అప్పుడు,) ఋతవః=ఋతువులు, మోహుకాః స్యుః=మోహ హేతువు లగును.

తాత్పర్యము: అధ్వర్యు ప్రతిప్రస్థాతలు ప్రథమ ద్వితీయ గ్రహములను ఒక్కమారుగా గ్రహించవలెనని వెనుక చెప్పఁబడినది. అప్పుడు వారు హవిర్ధానమునుండి నిష్క్రమించి వెళ్లి ఆహవనీయమునందు హోమము చేసి మఱల వచ్చి హవిర్ధానమునందు మఱియొక గ్రహమును గ్రహించవలయును. అప్పుడు వారిలో ఒకరు ముందు ఇంకొకరు వెనుకను (ఒకరివెంట మరియొకరు) వెళ్లరాదు. ఒకరు వెళ్లి వచ్చిన తరువాత మఱియొకరు వెళ్లవలెను. ఒకేమారు ఒకరివెంట మఱియొకరు వెళ్లినచో ఒక ఋతువు మఱియొక ఋతువునందు ప్రవేశించి ఋతు సాంకర్య మేర్పడును. అప్పుడు ఋతువులు మోహహేతువు లగును. ఇచట అధ్వర్యు ప్రతిప్రస్థాతలకు యుగపద్గమనము నిషేధించఁబడినది. మోహము=చిత్తవైకల్యమని యిచట అర్థము.

9. అర్థము: ప్రసిద్ధమేవ=ఆదినుండి ఆరంభించియే, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, దక్షిణేన=దక్షిణ మార్గముచే, ప్ర పద్యేత=(హవిర్ధానమునకు)వెళ్లవలెను. ప్రసిద్ధమ్=ఆదినుండి ఆరంభించి, ప్రతిప్రస్థాతా=ప్రతిప్రస్థాత, ఉత్త రేణ=ఉత్తర మార్గముచే, ప్ర పద్యేత=(హవిర్ధానమునకు) వెళ్లవలెను. తస్మాత్=ఆ కారణమువలన, ఆదిత్యః=సూర్యుఁడు, షణ్మాసః=ఆఱు మాసములు, దక్షిణేన=దక్షిణ మార్గముచేతను, షట్=ఆఱు మాసములు, ఉత్తరేణ=ఉత్తర మార్గముచేతను, ఏతి=పోవుచున్నాఁడు.

తాత్పర్యము: కాలభేదమువలె అధ్వర్యు ప్రతిప్రస్థాతల కుభయుల కిచట మార్గభేదము విధించఁబడినది. హవిర్ధానమునకు పోవునపుడు అధ్వర్యుఁడు దక్షిణ మార్గముచేతను, ప్రతిప్రస్థాత ఉత్తర మార్గముచేతను వెళ్లవలెను. కను కనే సూర్యుఁడు ఆఱు మాసములు దక్షిణ మార్గముచేతను, ఆఱు మాసములు ఉత్తర మార్గముచేతను తూర్పు దిశనుండి పశ్చిమ దిశకు పయనించుచున్నాఁడు. అందువలన ఆ కాలమునకు వరుసగా దక్షిణాయనము

ఉత్తరాయణము అని వ్యవహార మేర్పడినది. ప్రతిప్రస్థాత హావిర్ధానమునుండి నిష్క్రమించినపుడు అధ్వర్యుఁడు హావిర్ధానమును ప్రవేశించవలెను. ఈ విధముగ వ్యత్యయముగ నుభయులకు గమనమని భావము.

10. అర్థము: "ఉపయామ గృహీతోఽసి సగ్ంసర్పోఽస్యగ్ంహస్పత్యాయ త్వా" ఇతి ఆహ="ఓ సోమరసమా! నీవు పార్థివ పాత్రముచే గ్రహించఁబడినదాన వగుచున్నావు. అధికమాస స్వరూప మగుచున్నావు. అటువంటి నిన్ను అంహస్పతికొఱకు గ్రహించుచున్నాను." అని ఈ మంత్రము చెప్పినది. త్రయోదశ మాసః=పదమూఁడవ మాసము, అస్తి ఇతి=ఉన్నదని, ఆహః=చెప్పిరి. తమేవ=ఆ త్రయోదశ మాసమునే, తత్=దానివలన, ప్రీణాతి=సంతోషపఱచుచున్నాఁడు.

తాత్పర్యము: ["మధుశ్చ మాధవశ్చ" ఇత్యాది మంత్రములచేతనే పండ్రెండు మాసములకు తృప్తి కలుగుచుండఁగా, సంస ర్పమంత్రము నిర్విషయ మగుచున్నదని శంక కలుగుచుండఁగా ఆ శంక ఇచట నివారించఁబడినది.] "సగ్ంసర్పోఽస్యగ్ంహస్పత్యాయ త్వా" అని చెప్పటచే ఈ మంత్రముచే సంసర్పమాసము అనఁగా అధికమా సమునకు(త్రయోదశమునకు)తృప్తి కలుగుచున్నది. త్రయోదశ(అధిక)మాసము కలదని అభిజ్ఞులు చెప్పుచున్నారు.

తృతీయానువాకము సమాప్తము.

## అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే చతుర్థోఽనువాకః

మూలము: [1]సువర్గాయ వా ఏతే లోకాయ గృహ్యన్తే యదృతుగ్రహా జ్యోతిరిన్ద్రాగ్నీ యదైన్ద్రాగ్న మృతుపా

త్రేణ గృహ్ణాతి జ్యోతిరేవాస్మా ఉపరిష్టా ద్దధాతి సువర్గస్య లోకస్యానుఖ్యాత్యా [2]ఓజోభృతౌ వా ఏతౌ

దేవానాం యదిన్ద్రాగ్నీ యదైన్ద్రాగ్నో గృహ్యత ఓజ ఏవావ రున్ధే [3]వైశ్వదేవగ్ం శుక్రపాత్రేణ గృహ్ణాతి

వైశ్వదేవ్యో వై ప్రజా అసావాదిత్యః శుక్రో యద్వైశ్వదేవగ్ం శుక్రపాత్రేణ గృహ్ణాతి తస్మాదసావా

దిత్యః (౧)సర్వాః ప్రజాః ప్రత్యఙ్ఙుదేతి తస్మాత్సర్వ ఏవ మన్యతే మాం ప్రత్యుదగాదితి [4]వైశ్వదే

వగ్ం శుక్రపాత్రేణ గృహ్ణాతి వైశ్వదేవ్యో వై ప్రజాస్తేజః శుక్రో యద్వైశ్వదేవగ్ం శుక్రపాత్రేణ గృహ్ణాతి

ప్రజాస్వేవ తేజో దధాతి (౨)॥

[తస్మాదసావాదిత్యస్త్రిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమ ప్రపాఠకే చతుర్థోనుఽవాకః ॥౪॥

## వేదార్థదీపిక

**అవతారిక:** తృతీయానువాకమునందు ఋతుగ్రహ గ్రహణము విధించఁబడినది. ఈ చతుర్థానువాకమునందు ఐంద్రాగ్న గ్రహ గ్రహణము విధించఁబడుచున్నది.

1. **అర్థము:** ఋతుగ్రహాః యత్=ఋతుగ్రహము లేవి కలవో, ఏతే=ఇవి, సువర్గాయ లోకాయ=స్వర్గలోకముకొఱకు, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవి. ఇన్ద్రాగ్నీ=ఇంద్రాగ్నులు, జ్యోతిః=జ్యోతిస్స్వరూపులు. ఐన్ద్రాగ్నమ్=ఐంద్రాగ్న గ్రహమును, ఋతుపాత్రేణ=ఋతుగ్రహ(పాత్ర)ముతో, గృహ్ణాతి యత్=గ్రహించినచో, అస్మై=ఈ ఋతుపాత్ర ముయొక్క, (షష్ఠ్యర్థే చతుర్థీ.) ఉపరిష్టాత్=పైభాగమునందు, జ్యోతిః ఏవ=తేజస్సునే, దధాతి=స్థాపించినవాఁ డగును. (ఏతత్=ఈ గ్రహణము,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, అనుఖ్యాత్యై=ప్రకాశముకొఱకు, భవతి=అగుచున్నది.

**తాత్పర్యము:** ఋతుగ్రహములు స్వర్గలోక ప్రాప్తికొఱకు గ్రహించఁబడుచున్నవి. ఇంద్రాగ్నులు జ్యోతిస్స్వరూపులు. ఐంద్రాగ్న గ్రహమును ఋతుపాత్రములోఁ గూడ గ్రహించినచో ఈ ఋతుపాత్రముపైని జ్యోతిస్సును స్థాపించినవాఁ డగును. ఋతుపాత్రముతో ఐంద్రాగ్న గ్రహ గ్రహణము స్వర్గలోక ప్రకాశముకొఱ కగును. అధ్వర్యు హస్త

మునందరి భక్షణీయమైన సోమరసముతో నిండియున్న ఋతుపాత్రముతోఁ గూడ ఐంద్రాగ్న గ్రహమును గ్రహించవలెను. ఆ విధముగ గ్రహించుటచేత ఋతుగ్రహములచే ప్రాప్తమైన స్వర్గము ఇంద్రాగ్నుల జ్యోతిస్సుచే ప్రకాశిత మగును. ఇచట ఐంద్రాగ్న గ్రహ గ్రహణము విధించఁబడినది. ఇంద్రుఁడు, అగ్నియు దేవతలుగాఁ గల గ్రహము (పాత్రము) ఐంద్రాగ్న మనఁబడును.

2. అర్థము: ఇన్ద్రాగ్నీ యత్=ఇంద్రాగ్ను లెవరు కలరో, ఏతౌ=వీరు, దేవానామ్=దేవతలలో, ఓజోభృతౌ వై=బలవంతులే. ఐన్ద్రాగ్నః గృహ్యతే యత్=ఐంద్రాగ్న గ్రహము గ్రహింపఁబడినచో, ఓజః ఏవ=బలమునే, అవ రున్ద్ధే=పొందును.

తాత్పర్యము: దేవతలలో ఇంద్రాగ్నులు బలవంతులు. అట్టి యింద్రాగ్నులు దేవతలుగాఁ గల ఐంద్రాగ్న గ్రహమును గ్రహించినచో ఆ యజమానుఁడు ఓజస్సును(బలమును) పొందును. ఇచట ఐంద్రాగ్న గ్రహము బలప్రదముగా ప్రశంసించఁబడినది.

3. అర్థము: వైశ్వదేవమ్=వైశ్వదేవ గ్రహమును, శుక్రగ్రహేణ=శుక్రగ్రహముతో, గృహ్ణాతి=గ్రహించవలెను. ప్రజాః=ప్రజలు, వైశ్వదేవ్యః వై=విశ్వేదేవ దేవతల సంబంధులే. అసౌ ఆదిత్యః=ఈ సూర్యుఁడు, శుక్రః=శుక్ర గ్రహ స్వరూపుఁడు. వైశ్వదేవమ్=వైశ్వదేవ గ్రహమును, శుక్రపాత్రేణ=శుక్రగ్రహముతోఁ గూడ, గృహ్ణాతి యత్=గ్రహించునెడల, తస్మాత్=ఆ గ్రహణమువలన, అసౌ ఆదిత్యః=ఈ సూర్యుఁడు, సర్వాః ప్రజాః ప్రత్యఙ్=సర్వప్రజల కభిముఖముగ, ఉదేతి=ఉదయించుచున్నాఁడు. తస్మాత్=ఆ యుదయము వలన, సర్వః=సర్వజనము, "ఆదిత్యః=సూర్యుఁడు, మాం ప్రత్యేవ=నా కభిముఖముగానే, ఉదగాత్ ఇతి=ఉదయించెనని," మన్యతే=తలఁచుచున్నది.

తాత్పర్యము: వైశ్వదేవ గ్రహమును శుక్రగ్రహముతోఁ గూడ గ్రహించవలెను. ప్రజలు విశ్వేదేవ దేవతా సంబంధులే. ఈ సూర్యుఁడు శుక్రగ్రహ స్వరూపుఁడు. వైశ్వదేవ గ్రహమును శుక్రగ్రహముతోఁ గూడ గ్రహించినచో, ఈ సూర్యుఁడు సర్వప్రజల కభిముఖముగ ఉదయించుచున్నాఁడు. కనుక, ప్రతి మనుజుఁడు 'సూర్యుఁడు తన కభిముఖముగానే ఉదయించుచున్నాఁడని' తలఁచుచున్నాఁడు. ఇచట గ్రహాంతరము విధించఁబడినది.

4. అర్థము: (యజమానః=యజమానుఁడు,) వైశ్వదేవమ్=వైశ్వదేవ గ్రహమును, శుక్రపాత్రేణ=శుక్రపాత్రముతోఁ గూడ, గృహ్ణాతి=గ్రహించవలెను. ప్రజాః=ప్రజలు, వైశ్వదేవ్యః వై=విశ్వేదేవ దేవతల సంబంధులే. శుక్రః=శుక్రుఁడు, తేజః=తేజస్స్వరూపుఁడు. వైశ్వదేవమ్=వైశ్వదేవ గ్రహమును, శుక్రపాత్రేణ=శుక్రగ్రహముతోఁ గూడ, గృహ్ణాతి యత్=గ్రహించుచో, (యజ్వా=యాగకర్త,) ప్రజాస్వేవ=ప్రజలయందే, తేజః=తేజస్సును, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: వైశ్వదేవ గ్రహమును శుక్రగ్రహముతోఁ గూడ గ్రహించవలెను. ప్రజలు విశ్వేదేవ దేవతల సంబంధులే. శుక్రుఁడు తేజస్స్వరూపుఁడు. కనుక వైశ్వదేవ గ్రహమును శుక్రగ్రహముతోఁ గూడ గ్రహించినచో ఆ యాగకర్త ప్రజలయందే తేజస్సును స్థాపించినవాఁ డగును. ఇచట వైశ్వదేవ గ్రహము తేజఃప్రదముగా ప్రశంసించఁబడినది.

చతుర్థానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః

మూలము: [1] ఇన్ద్రో మరుద్భిః సాంవిద్యేన మాధ్యందినే సవనే వృత్ర మహన్యన్మాధ్యందినే సవనే మరుత్వతీయా గృహ్యన్తే వార్త్రఘ్నా ఏవ తే యజమానస్య గృహ్యన్తే [2] తస్య వృత్రం జఘ్నుష ఋతవోఽముహ్యన్త్స ఋతుపాత్రేణ మరుత్వతీయా నగృహ్ణాత్తతో వై స ఋతూ న్ప్రాజానా ద్యదృతుపాత్రేణ మరుత్వతీయా గృహ్యన్త ఋతూనాం ప్రజ్ఞాత్యై [3] వజ్రం వా ఏతం యజమానో భ్రాతృవ్యాయ ప్ర హరతి యన్మరుత్వతీయా ఉదేవ ప్రథమేన (౧)యచ్ఛతి ప్ర హరతి ద్వితీయేన స్తృణుతే తృతీయేనా [4] ఽఽయుధం వా ఏతద్యజమానః సగ్ంస్కురుతే యన్మరుత్వతీయా ధనురేవ ప్రథమో జ్యా ద్వితీయ ఇషు స్తృతీయః [5] ప్రత్యేవ ప్రథమేన ధత్తే వి సృజతి ద్వితీయేన విధ్యతి తృతీయేనే [6] న్ద్రో వృత్రగ్ం హత్వా పరాం పరావత మగచ్ఛ దపారాధమితి మన్యమానః స హరితోఽభవత్స ఏతా న్మరుత్వతీయా నాత్మస్పరణా నపశ్య త్తానగృహ్ణీత (౨)ప్రాణమేవ ప్రథమేనాస్పృణుతాపానం ద్వితీయేనాఽఽత్మానం తృతీయేనా [7] ఽఽత్మస్పరణా వా ఏతే యజమానస్య గృహ్యన్తే యన్మరుత్వతీయాః ప్రాణమేవ ప్రథమేన స్పృణుతేఽపానం ద్వితీయేనాఽఽత్మానం తృతీయేనే [8] న్ద్రో వృత్రమహన్తం దేవా అబ్రువ న్మహాన్వా అయ మభూద్యో వృత్రమవధీదితి తన్మహేన్ద్రస్య మహేన్ద్రత్వగ్ం స ఏతం మాహేన్ద్ర ముద్ధార ముదహరత వృత్రగ్ం హత్వాఽఽన్యాసు దేవతాస్వధి యన్మాహేన్ద్రో గృహ్యత ఉద్ధారమేవ తం యజమాన ఉద్ధరతేఽన్యాసు ప్రజాస్వధి [9] శుక్రపాత్రేణ గృహ్ణాతి యజమానదేవత్యో వై మాహే

న్ద్రి స్తేజః శుక్రో యన్మాహేన్ద్రగ్ం శుక్రపాత్రేణ గృహ్ణాతి యజమాన ఏవ తేజో దధాతి (3)||
[ప్రథమేనాగృహ్ణీత దేవతాస్త్వష్టావిగ్ంశతిశ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః ||౫||

## వేదార్థదీపిక

అవతారిక: చతుర్థానువాకమునందు ఐంద్రాగ్న గ్రహ గ్రహణము విధించఁబడినది. ఈ పంచమానువాకమునందు మరుత్వతీయ గ్రహముల గ్రహణము, మాహేంద్ర గ్రహ గ్రహణము విధించఁబడుచున్నవి.

1. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, మరుద్భిః=మరుద్గణములచే, సాంవిద్యేన=ఐకమత్యముతో, మాధ్యందినే సవనే=మాధ్యందిన సవనమునందు, వృత్రమ్=వృత్రుని, అహన్=చంపెను. మాధ్యందినే సవనే=మాధ్యందిన సవనమునందు, మరుత్వతీయాః=మరుత్వతీయ గ్రహములు, గృహ్యన్తే యత్=గ్రహించఁబడినచో, తే=ఆ మరుత్వతీయ గ్రహములు, యజమానస్య=యజమానునినిమిత్తము, వార్త్రఘ్నాః ఏవ=శత్రు సంహారకములుగానే, గృహ్యన్తే=గ్రహించఁబడిన వగును.

తాత్పర్యము: ఇంద్రుఁడు మరుద్గణముల యైకమత్యముతో మాధ్యందిన సవనమునందు వృత్రుని సంహరించెను. కనుక మాధ్యందిన సవనమునందు మరుత్వతీయ గ్రహములు గ్రహించఁబడినచో అవి యజమానుని నిమిత్తము శత్రు సంహారకములుగానే గ్రహించఁబడిన వగును. మరుత్వతీయములు=మరుద్గణములు దేవతలుగాఁ గల గ్రహములు. ఇచట మూఁడు మూఁడు మరుత్వతీయ గ్రహములు విధించఁబడినవి.

2. అర్థము: వృత్రమ్=వృత్రుని, జఘ్నుషః=సంహరించిన, తస్య=ఆ యింద్రునకు, ఋతవః=ఋతుగ్రహమును, అముహ్యన్=మోహకము లైనవి. సః=ఆ యింద్రుఁడు, ఋతుపాత్రేణ=ఋతుపాత్రముతోఁ గూడ, మరుత్వతీయాన్=మరుత్వతీయ గ్రహములను, అగృహ్ణాత్=గ్రహించెను. తతః వై=ఆ ఋతుపాత్రముతోఁ గూడ మరుత్వతీయ గ్రహములను గ్రహించుటవలననే, సః=ఆ యింద్రుఁడు, ఋతూన్=ఋతువులను, ప్రాజానాత్=ప్రకృష్టముగ తెలిసికొనెను. ఋతుపాత్రేణ=ఋతుపాత్రముతోఁ గూడ, మరుత్వతీయాః=మరుత్వతీయ గ్రహములు, గృహ్యన్తే యత్=గ్రహించఁబడినచో, తత్=ఆ గ్రహణము, ఋతూనామ్=ఋతువులయొక్క, ప్రజ్ఞాత్యై=ప్రకృష్ట జ్ఞానముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: వృత్రుని సంహరించిన యింద్రునకు ఋతువులు మోహకము లైనవి (ఋతు విషయక జ్ఞానము పోయినది). అప్పు డతఁడు ఋతుపాత్రముతో మరుత్వతీయ గ్రహములను గ్రహించెను. దానివలన అతఁడు ఋతువులను బాగుగ తెలిసికొనెను. కావున ఋతుపాత్రముతో మరుత్వతీయ గ్రహములు గ్రహించఁబడినచో అది ఋతువుల పరిజ్ఞానముకొఱ కగును. ఇచట మరుత్వతీయగ్రహములకు ఋతుపాత్రము విధించఁబడినది.

3. అర్థము: మరుత్వతీయాః=మరుత్వతీయ గ్రహము లేవి కలవో, యజమానః=యాగకర్త, ఏతమ్=ఈ మరుత్వతీయ గ్రహత్రయమును, వజ్రం వై=వజ్రాయుధముగానే, భ్రాతృవ్యాయ=(తన)శత్రువుకొఱకు, ప్ర హరతి=ప్రహరించినవాఁ డగుచున్నాఁడు. ప్రథమేన=మొదటి గ్రహముతో, ఉద్గచ్ఛతి=శత్రువుమీఁదకు ఉద్యమించును. ద్వితీయేన=రెండవ గ్రహముతో, ప్ర హరతి=కొట్టును. తృతీయేన=మూఁడవ గ్రహముతో, స్తృణుతే=హింసించును.

తాత్పర్యము: యజ్వ మరుత్వతీయ గ్రహ త్రయమును వజ్రాయుధముగానే శత్రువుమీఁద ప్రయోగించినవాఁ డగును. ఆ మూఁడు గ్రహములలో వజ్రాయుధమువంటి ప్రథమ గ్రహముతో శత్రువుమీఁద కుద్యమించిన ట్లగును. ద్వితీయ గ్రహముతో శత్రువును కొట్టిన ట్లగును. తృతీయ గ్రహముతో శత్రువును సంహరించిన ట్లగును. ఇచట గ్రహత్రయము వజ్రాయుధముగా ప్రశంసించఁబడినది.

4. అర్థము: మరుత్వతీయాః=మరుత్వతీయ గ్రహము లేవి కలవో, ఏతత్=ఈ గ్రహత్రయమును, యజమానః=యజమానుఁడు, ఆయుధం వై=(ఆయుధముగానే) ధనువుగానే, సంస్కురుతే=సంస్కరించినవాఁ డగును. ప్రథమః=మొదటి గ్రహము, ధనురేవ=ధనువే (ధనువువంటిదియే). ద్వితీయః=రెండవ గ్రహము, జ్యా=అల్లె త్రాడు(వింటినారి). తృతీయః=మూఁడవ గ్రహము, ఇషుః=బాణము. 'ఏతత్'=ఇది విధేయమైన ఆయుధ మునకు విశేషణము కనుక నపుంసకముగా ప్రయుక్త మైనది. ఆయుధ శబ్దము నపుంసకము.

తాత్పర్యము: మరుత్వతీయ గ్రహముల త్రయమును యజ్వ ఆయుధముగానే సంస్కరించినవాఁ డగును. ఆయుధ మనఁగా ఇచట ధనువు. ఆ మూఁడు గ్రహములలో ప్రథమ గ్రహము ధనువుగాను, రెండవ గ్రహము వింటినారిగాను, మూఁడవ గ్రహము బాణముగాను ఆరోపించి ప్రశంసించఁబడినవి.

5. అర్థము: ప్రథమేన=ప్రథమ గ్రహముచే, ప్రతి ధత్తే ఏవ=సంధానము చేయువాఁడగును. ద్వితీయేన=రెండవ గ్రహముచే, వి సృజతి=విడిచిన ట్లగును. తృతీయేన=మూఁడవ గ్రహముచే, విధ్యతి=గ్రుచ్చువాఁ డగును.

తాత్పర్యము: మరుత్వతీయ గ్రహ త్రయము పూర్వమంత్రమున ధనువుగా నారోపించఁబడినది. ఆ ధనువు ఇచట ప్రయోగ రూపమున ప్రశంసించఁబడినది. ప్రథమ గ్రహ మనెడి బాణమును ధనువునందు సంధానించుట, ద్వితీయ గ్రహ మనెడి బాణమును ధనువునుండి విడుచుట, తృతీయ గ్రహ మనెడి బాణమును శత్రు శరీరమునందు గ్రుచ్చుట అను ప్రయోగాంశము లిచట వర్ణించఁబడినవి.

6. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రమ్=వృత్రుని, హత్వా=చంపి, అపారాధమ్ ఇతి=ప్రబలమైన శత్రుకులముతో విరోధరూపమైన అపరాధమును చేసితినని, మన్యమానః=తలఁచుచున్నవాఁడై, పరాం పరావతమ్=అత్యంతదూరమును, అగచ్ఛత్=పొందెను. (చాలదూరము పారిపోయెను.) సః=ఆ యింద్రుఁడు, హరితః=వివర్ణుఁడు, అభవత్=అయెను. సః=ఆ యింద్రుఁడు, ఆత్మస్పరణాన్=తనకు భీతినివారకములుగా ప్రీతిని కలుగఁజేయునట్టి, ఏతాన్ మరుత్వతీయాన్=ఈ పూర్వోక్తములైన మరుత్వతీయ గ్రహములను, అపశ్యత్=చూచెను. తాన్=ఆ గ్రహములను, అగృహ్ణీత=గ్రహించెను ప్రథమేన=ప్రథమ గ్రహముచే, ప్రాణమేవ=ప్రాణమునే, అస్పృణుత=తృప్తిపఱచెను. ద్వితీయేన=రెండవ గ్రహముచేత, అపానమ్=అపానమును, తృతీయేన=మూఁడవ గ్రహముచేత, ఆత్మానమ్=తనను(క్షేత్రజ్ఞుని), అస్పృణుత=తృప్తిపఱచెను.

తాత్పర్యము: ప్రాణాది ప్రీణయితృత్వ రూపమున మరుత్వతీయ గ్రహములను మఱల ప్రశంసించుటకై ముందుగా ఇచట ఆఖ్యాయిక చెప్పఁబడినది. ఇంద్రుఁడు వృత్రుని చంపి యనంతరము ప్రబల శత్రుకులముతో విరోధమును కల్పించుకొంటినని ఆలోచించి చాలదూరము పరుగెత్తి పోయి వివర్ణుఁ డయ్యెను. పిమ్మట నతఁడు భీతినివారణ రూపమున తనకు ప్రీతిని కలుగఁజేయునట్టి మరుత్వతీయ గ్రహములను కనుఁగొని, యా గ్రహములను గ్రహించెను. వానిలో ప్రథము గ్రహముచే ప్రాణమును, ద్వితీయ గ్రహముచే అపానమును, తృతీయ గ్రహముచే ఆత్మను(క్షేత్రజ్ఞుని)తృప్తిపఱచెను.

7. అర్థము: మరుత్వతీయాః యత్=మరుత్వతీయ గ్రహము లేవి కలవో, ఏతే=ఇవి, యజమానస్య=యాగకర్తకు, ఆత్మస్పరణాః వై=తనకు భీతిని నివారించుట ద్వారా తృప్తిని కలుగఁజేయునవిగా, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవి. (సః=ఆ యజమానుఁడు,) ప్రథమేన=ప్రథమ గ్రహముచే, ప్రాణమేవ=ప్రాణమునే, స్పృణుతే=తృప్తిపఱ

చును. ద్వితీయేన=రెండవ గ్రహముచే, **అపానమ్=అపానమును**, **తృతీయేన**=మూఁడవ గ్రహముచే, **ఆత్మా నమ్**=ఆత్మను(క్షేత్రజ్ఞుని), స్పృణుతే=తృప్తిపఱచును. ఇచట మరుత్వతీయ గ్రహ ప్రశంస చేయఁబడినది.

తాత్పర్యము: తాత్పర్యము 6 వ మంత్రవ్యాఖ్యానమున చెప్పఁబడినది.

8. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రమ్=వృత్రుని, అహన్=సంహరించెను. యః=ఏ యింద్రుఁడు, వృత్రమ్=వృత్రుని, **అవధీత్**=వధించెనో, అయమ్=ఈ యింద్రుఁడు, మహాన్ వై=గొప్పవాఁడే, అభూత్=ఆయెను. తత్=వృత్ర వధ యనెడి ఆ మహాకార్యము చేయుటవలన, మహేన్ద్రస్య=మహేంద్రునకు, మహేన్ద్రత్వమ్='మహేంద్ర' అను పేరు, సార్థకమ్ అభవత్=సార్థక మైనది. సః=ఆ యింద్రుఁడు, ఏతమ్=ఈ, మాహేన్ద్రమ్ ఉద్ధారమ్=మాహేంద్ర నామకమైన గ్రహమును, ఉదహరత (**ఉత్ అహరత**)=గ్రహించెను. మాహేన్ద్రః=మాహేంద్ర గ్రహము, గృహ్యతే యత్=గ్రహించఁబడుటవలన, (ఇన్ద్రః=ఇంద్రుఁడు,) వృత్రమ్=వృత్రుని, హత్వా=చంపి, అన్యాసు దేవతాసు=ఇతర దేవతలలో, అధి=అధికుఁడు, అభవత్=ఆయెను. యజమానః=యాగకర్త, తమ్ ఉద్ధారమేవ=ఆ మాహేంద్ర గ్రహమునే, ఉద్ధరతే=గ్రహించవలెను. (తదా=అప్పుడు, సః=ఆ యాగకర్త,) అన్యాసు ప్రజాసు=ఇతర ప్రజలయందు, అధి=అధికుఁడు, భవేత్=అగును.

తాత్పర్యము: ఇచట మాహేంద్ర గ్రహము విధించఁబడినది. ఇంద్రుఁడు వృత్రుని సంహరించెను. అతఁడు వృత్రుని వధించుటవలన గొప్పవాఁ డయ్యెనని దేవతలు పలికిరి. వృత్రహనన రూప మహాకార్యమును చేయుటవలన ఇంద్రునకు మహేంద్రుఁడను పేరు సార్థక మైనది. ఆ యింద్రుఁడు ఈ మాహేంద్ర గ్రహమును గ్రహించెను. అందువలన అతఁడు దేవతలలో అధికుఁ డయ్యెను. కనుక యజ్ఞకర్త మాహేంద్ర గ్రహమును గ్రహించవలెను. తద్గ్రహణమువలన అతఁడు ప్రజలలో నధికుఁ డగును.

9. అర్థము: శుక్రపాత్రేణ=శుక్రపాత్రముతో, గృహ్ణాతి=మాహేంద్ర గ్రహమును గ్రహించవలెను. మాహేన్ద్రః=మాహేంద్ర గ్రహము, యజమాన దేవత్యః వై=యజమాన దేవత్యమే. (యజమానుఁడు దేవతగాఁ గలది). శుక్రః=శుక్ర గ్రహము, తేజః=తేజోరూపము. మాహేన్ద్రమ్=మాహేంద్ర గ్రహమును, శుక్రపాత్రేణ=శుక్రపాత్రముతో, గృహ్ణాతి యత్=గ్రహించునెడల, యజమానే ఏవ=యజమానునియందే, తేజః=తేజస్సును, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: ఇచట మాహేంద్ర గ్రహమునకు శుక్రపాత్రము విధించఁబడినది. మాహేంద్ర గ్రహమును శుక్రపాత్రముతో గ్రహించవలెను. మాహేంద్ర గ్రహము యజమాన దేవత్యమే. శుక్రగ్రహము తేజోరూపము. కనుక మాహేంద్ర గ్రహమును శుక్రపాత్రముతో గ్రహించునెడల యజమానునియందే తేజస్సును స్థాపించిన ట్లగును.

పంచమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే షష్ఠోఽనువాకః

మూలము: అదితిః పుత్రకామా సాధ్యేభ్యో దేవేభ్యో బ్రహ్మౌదన మపచత్తస్యా ఉచ్ఛేషణ మదదు స్తత్ప్రాశ్నాత్సా
రేతోఽధత్త తస్యై చత్వార ఆదిత్యా అజాయన్త [2]సా ద్వితీయ మపచత్సాఽమన్యతోచ్ఛేషణాన్మ
ఇమేఽజ్ఞత యదగ్రే ప్రాశిష్యామీతో మే వసీయాగ్ంసో జనిష్యన్త ఇతి సాఽగ్రే ప్రాశ్నాత్సా రేతోఽ
ధత్త తస్యై వ్యృద్ధమాణ్డ మజాయత [3]సాఽఽదిత్యేభ్య ఏవ (౧)తృతీయ మపచద్భోగాయ మ ఇదగ్ం
శ్రాన్తమస్త్వితి తేఽబ్రువన్వరం వృణామహై యోఽతో జాయాతా అస్మాకగ్ం స ఏకోఽసద్యోఽస్య
ప్రజాయా మృధ్యాతా అస్మాకం భోగాయ భవాదితి తతో వివస్వా నాదిత్యోఽజాయత తస్య వా
ఇయం ప్రజా యన్మనుష్యా స్తాస్వేక ఏవర్ధో యో యజతే స దేవానాం భోగాయ భవతి [4]దేవా వై
యజ్ఞాత్ (౨)రుద్ర మన్తరాయన్త్స ఆదిత్యా నన్వాక్రమత తే ద్విదేవత్యా న్ప్రాపద్యన్త తాన్న ప్రతి
ప్రాయచ్ఛ న్తస్మాదపి వధ్యం ప్రపన్నం న ప్రతి ప్ర యచ్ఛన్తి [5]తస్మా ద్ద్విదేవత్యేభ్య ఆదిత్యో నిర్గృ
హ్యతే [6]యదుచ్ఛేషణా దజాయన్త తస్మాదుచ్ఛేషణా ద్గృహ్యతే [7]తిసృభి రృగ్భిర్గృహ్ణాతి మాతా పితా
పుత్ర స్తదేవ తన్మిథున ముల్బం గర్భో జరాయు తదేవ తత్ (౩)మిథునం [8]పశవో వా ఏతే యదా
దిత్య ఊర్గ్దధి దధ్నా మధ్యతః శ్రీణాత్యూర్జమేవ పశూనాం మధ్యతో దధాతి [9]శృతాతఙ్క్యేన
మేధ్యత్వాయ తస్మాదామా పక్వం దుహే [10]పశవో వా ఏతే యదాదిత్యః పరిశ్రిత్య గృహ్ణాతి ప్రతి
రుధ్యైవాస్మై పశూన్గృహ్ణాతి [11]పశవో వా ఏతే యదాదిత్య ఏష రుద్రో యదగ్నిః పరిశ్రిత్య గృహ్ణాతి

రుద్రాదేవ పశూ నన్తర్దధాతి (౪) [12]ఏష వై వివస్వా నాదిత్యో యదుపాగ్ంశుసవనః స ఏతమేవ సోమపీథం పరి శయ ఆ తృతీయసవనా ద్వివస్వ ఆదిత్యైష తే సోమపీథ ఇత్యాహ వివస్వన్త మేవాఽఽదిత్యగ్ం సోమపీథేన సమర్ధయతి [13]యా దివ్యా వృష్టిస్తయా త్వా శ్రీణామీతి వృష్టికామస్య శ్రీణీయా ద్వృష్టిమేవావ రున్ధే యది తాజక్ప్రభిన్ద్యా ద్వర్షుకః పర్జన్యః స్యా [14]ద్యది చిరమవ ర్షుకో న సాదయత్యసన్నాద్ధి ప్రజాః ప్రజాయన్తే నాను వషట్కరోతి యదనువషట్కుర్యాద్రుద్రం ప్రజా అన్వవసృజేన్న హుత్వాఽన్వీక్షేత యదన్వీక్షేత చక్షురస్య ప్రమాయుకగ్ం స్యాత్తస్మాన్నాన్వీక్ష్యః (౫)||

[ఏవ యజ్ఞాజ్ఞరాయు తదేవ తదన్తర్దధాతి న సప్తవిగ్ంశతిశ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమ ప్రపాఠకే షష్ఠోఽనువాకః ||౬||

## వేదార్థదీపిక

అవతారిక: పంచమానువాకమునందు మరుత్వతీయ మాహేంద్ర గ్రహముల గ్రహణము చెప్పఁబడినది. ఈ షష్ఠాను వాకమునందు ఆదిత్య గ్రహ గ్రహణము చెప్పఁబడుచున్నది.

1. అర్థము: అదితిః=అదితిదేవి, పుత్రకామా=పుత్రేచ్ఛ కలదియై, సాధ్యేభ్యః=సాధ్యనామకులైన, దేవేభ్యః=దేవతలకొఱకు, బ్రహ్మౌదనమ్=ఆధాన ప్రకరణోక్త విధముగ సంపాదితమైన అన్నమును, అపచత్=వండెను. తస్యై=ఆ యదితికొఱకు, ఉచ్ఛేషణమ్=హుతము కాఁగా మిగిలిన అన్నమును, అదదుః=(సాధ్యనామక దేవతలు) ఇచ్చిరి. సా=ఆ యదితి, తత్=ఆ హుత శిష్టాన్నమును, ప్రాశ్నాత్=భక్షించెను. రేతః=రేతస్సును, అధత్త=ధరించెను. తస్యై=ఆమెకొఱకు(ఆమెకు), చత్వారః=నలుగురు, ఆదిత్యాః=ఆదిత్యులు, అజాయన్త=పుట్టిరి.

తాత్పర్యము: అదితిదేవి పుత్రులను కోరుకొనినదియై సాధ్యులనెడి దేవతలకొఱకు ఆధాన ప్రకరణోక్త విధముగ సంపాదితమైన అన్నమును(బ్రహ్మౌదనమును)పచనము చేసెను. ఆమె హుతము కాఁగా మిగిలిన (హుతశిష్టమైన)అన్నమును తిని రేతస్సును ధరించెను. అనంతరము ఆమెకు నలుగురు ఆదిత్యులు పుట్టిరి. ఆదిత్య గ్రహమును విధించుటకు ముందు ఇచట తత్సంబంధినియైన ఆఖ్యాయిక చెప్పఁబడుచున్నది.

2. అర్థము: సా=ఆ యదితి, ద్వితీయమ్=రెండవ పర్యాయము, అపచత్=బ్రహ్మౌదనమును వండెను. సా=ఆ యదితి, అమన్యత=తలఁచెను. "ఉచ్ఛేషణాత్=హుతశిష్టమువలన, మే=నాకు, ఇమే=ఈ నలుగురు ఆదిత్యులు,

అజ్ఞత=కలిగిరి. అగ్రే=హూత మగుటకు ముందు, ప్రాశిష్యామి యది=భక్షించఁగలిగితినేని, మే=నాకు, ఇతః=ఇంతకంటె, వసీయాం సః=శ్రేష్ఠులు(ధనవంతులు), జనిష్యన్తే=పుట్టఁగలరు" ఇతి=అని, సా=ఆ యదితి, అగ్రే=హూత మగుటకంటె ముందుగా, ప్రాశ్నాత్=భక్షించెను. సా=ఆమె, రేతః=రేతస్సును, అధత్త=ధరించెను. తస్యై=ఆమె(కు)కొఱకు, వ్యృద్ధమ్ అణ్డమ్=గర్భస్థానము గర్భశూన్యముగా, అజాయత=అయెను.

తాత్పర్యము: అదితి తనకు పుట్టిన నలుగురు ఆదిత్యులవలన పుత్రేచ్ఛ తీరక రెండవ పర్యాయము బ్రహ్మౌదనమును వండెను. "ప్రథమమున హూతశిష్టమును భుజించుటవలన ఈ నలుగురు ఆదిత్యులు పుట్టిరి. హూతమగుటకు ముందుగానే భక్షింతునేని ఇంతకంటె ధనికులైన కుమారులు పుట్టఁగలరని" యాలోచించి, హూత మగుటకు ముందుగానే భుజించినది. వెంటనే ఆమె రేతస్సును ధరించినది కాని, హోమముకంటె ముందుగా భుజించుట అను అపరాధముచే, ఆమెకు గర్భస్థానము గర్భశూన్యముగానే అయినది.

2. అర్థము: సా=ఆ యదితి, ఆదిత్యేభ్యః ఏవ=ఆదిత్యులకొఱకే, తృతీయమ్=మూఁడవ పర్యాయము, అపచత్=వండెను. "శ్రాన్తమ్=గర్భాభావముచే పూర్వము సంతప్తమైయున్న, ఇదమ్=ఈ గర్భస్థానము, మే=నాయొక్క, భోగాయ=భోగముకొఱకు, అస్తు=అగుఁగాక," ఇతి=అని, అజుహోత్=బ్రహ్మౌదనమును ఆదిత్యులకొఱకు హోమము చేసెను. "యః=ఎవఁడు, అతః=ఈ గర్భస్థానమునుండి, జాయాతై=పుట్టునో, సః=అతఁడు, అస్మాకమ్=మాలో, ఏకః=ఒక ఆదిత్యుఁడు, అసత్=అగుఁగాక. యః=ఎవఁడు, అస్య=ఈ ఆదిత్యుని సంబంధియగు, ప్రజాయామ్=ప్రజయందు, ఋధ్యాతై=సమృద్ధుఁ డగునో, సః=అతఁడు, అస్మాకమ్=మాయొక్క, భోగాయ=భోగముకొఱకు, భవాత్=అగుఁగాక." ఇతి=అని, వరమ్=వరమును, వృణామహై=కోరుకొనుచున్నాము. ఇతి=అని, తే=ఆ ఆదిత్యులు, అబ్రువన్=పలికిరి. తతః=ఆ అండము(గర్భస్థానము)నుండి, వివస్వాన్=వివస్వంతుఁ డను పేరు కల, ఆదిత్యః=ఆదిత్యుఁడు, అజాయత=పుట్టెను. మనుష్యాః యత్=మనుష్యులెవరు కలరో, ఇయం ప్రజా=ఈ మనుష్యరూప ప్రజ, తస్య వై=ఆ యాదిత్యుని సంబంధినియే. తాసు=వారిలో, ఏకః ఏవ=ఒక్కఁడే, ఋద్ధః=సమృద్ధుఁడు. యః=ఎవఁడు, యజతే=యాగము చేయుచున్నాఁడో, సః=అతఁడు, దేవానామ్=దేవతలయొక్క, భోగాయ=భోగముకొఱకు, భవతి=అగుచున్నాఁడు.

తాత్పర్యము: అదితి శూన్యగర్భ నివారణమునకై మూఁడవ పర్యాయము ఆదిత్యులకొఱకే బ్రహ్మౌదనమును వండినది. "పూర్వము గర్భశూన్య మగుటచే సంతప్తమైన యీ గర్భస్థానము నాయొక్క భోగముకొఱకు అగుఁగాక." అని ఆ బ్రహ్మౌదనము నాదిత్యులకొఱకు హోమము చేసెను. అప్పు డా దేవతలు "ఈ గర్భస్థానమునుండి పుట్టునతఁడు మాలో ఒక ఆదిత్యుఁడు కావలెను. ఈ యాదిత్యుని సంబంధులయిన ప్రజలలో సమృద్ధి కల యతఁడు మాయొక్క భోగముకొఱకు కావలెనని" వరమును కోరుకొనుచున్నామని పలికిరి. పిమ్మట ఆ యదితి గర్భస్థానమునుండి 'వివస్వంతుఁడు' అను పేరు కల ఆదిత్యుఁ డుద్భవించెను. ఈ మనుష్యులు ఆ యాదిత్యుని సంబంధులే. వీరిలో సమృద్ధి కలవాఁడును, యాగము చేయువాఁడును అగు నతఁడు దేవతల భోగమునకు అయెను. వ్యృద్ధ నివారణమునకై అదితి ఇచట మఱల ప్రయోగము చేసినది.

4. అర్థము: దేవాః=దేవతలు, యజ్ఞాత్=యజ్ఞమునుండి, రుద్రమ్=రుద్రుని, అన్తరాయన్=అంతర్హితుని చేసిరి. సః=ఆ రుద్రుఁడు, ఆదిత్యాన్=ఆదిత్యులను, అను ఆక్రమత=అనుసరించి బాధించెను. తే=ఆ యాదిత్యులు, ద్విదేవత్యాన్=ద్విదేవతాకములయిన ఐన్ద్రవాయవాది గ్రహములకు సంబంధించిన దేవతలను (గ్రహదేవతలను), ప్రాపద్యన్త=శరణము పొందిరి. (తే దేవాః=ఆ గ్రహదేవతలు,) తాన్=ఆ యాదిత్యులను, న ప్రతి ప్రాయచ్ఛన్=రుద్రునకు తిరిగి అర్పించలేదు. తస్మాత్=ఆ కారణమువలన, వధ్యమపి=వధార్హుఁడైనను, ప్రపన్నమ్=శరణము పొందినవానిని, న ప్రతి ప్ర యచ్ఛన్తి=తిరిగి ఇచ్చుట లేదు.

తాత్పర్యము: దేవతలు యజ్ఞమును చేయుచు ఆ యజ్ఞమునందు రుద్రుని విస్మరించిరి. రుద్రుఁడు ఆ యాదిత్యులను వెన్నంటి బాధించెను. రుద్రునిచే బాధితులైన యాదిత్యులు ఐంద్రవాయవాది ద్విదేవత్య గ్రహదేవతలను శరణుచొచ్చిరి. గ్రహదేవతలు తమ్ము శరణుచొచ్చిన యాదిత్యులను రుద్రునకు తిరిగి అర్పించలేదు. అందువలననే లోకమునందు దోషము చేయుటచే దోషులైన చోరాదులు పరులచే వధ్యులైనను శరణుచొచ్చినచో వారిని తిరిగి పరుల కప్పగించుట లేదు (పరుల కధీనులనుగా చేయుట లేదు). పూర్వమంత్రమున ఆఖ్యాయికా మూలమున గ్రహదేవత నిరూపించఁబడినది. ఇచట గ్రహణాపాదానమును నిరూపించుటకై మఱియొక ఆఖ్యాయిక చెప్పఁబడినది.

5. అర్థము: తస్మాత్=ఆ కారణమువలన, ద్విదేవత్యేభ్యః=ద్విదేవత్య గ్రహములకొఱకు, ఆదిత్యః=ఆదిత్య గ్రహము, నిర్గృహ్యతే=ఉంచి గ్రహించఁబడవలెను.

తాత్పర్యము: ఆదిత్యులు ద్విదేవత్యగ్రహములను శరణుచొచ్చుటవలన ఆదిత్య గ్రహమును ద్విదేవత్య(ఐంద్రవాయవాది)గ్రహదేవతలకొఱకు ఉంచి గ్రహించవలెను.

6. అర్థము: యత్=ఏ కారణమువలన, ఉచ్ఛేషణాత్=హుతశేషమునుండి, అజాయన్త=ఆదిత్యులు పుట్టిరో, తస్మాత్=ఆ కారణమువలన, ఉచ్ఛేషణాత్=ద్విదేవత్య గ్రహదేవతల ఉచ్ఛేషమునుండి, గృహ్యతే=ఆదిత్య గ్రహము గ్రహించఁబడుచున్నది.

తాత్పర్యము: ఆదిత్యులు హుతశేషమైన బ్రహ్మౌదనముచే జన్మించుటవలన ఆదిత్య గ్రహమును ద్విదేవత్య గ్రహదేవతలకొఱకు ఉంచి తచ్ఛేషమునుండి గ్రహించుట యుక్తము.

7. అర్థము: తిసృభిః ఋగ్భిః="కదాచన స్తరీరసి" ఇత్యాదులైన మూఁడు ఋక్కులచే, గృహ్ణాతి=గ్రహించవలెను. మాతా=తల్లి, పితా=తండ్రి, పుత్రః=పుత్రుఁడు, తదేవ=ఆ త్రయాత్మకమే, తత్ మిథునమ్=మాతాపితృ రూపమైన యా మిథునము. ఉల్బమ్=గర్భము నావరించియుండు నుదకము, గర్భః=కడుపులోని పిండము, జరాయు=గర్భము నావరించియుండు పట సదృశమైన మావి, తదేవ=ఉల్బ జరాయు రూపమైన (ఉభయరూపమైన) ఆ మిథునమే, తన్మిథునమ్=గర్భస్థ పిండముతోఁ గూడిన త్రయాత్మకము. త్రయాత్మకములైన యా మిథునముతో నీ మంత్రత్రయాత్మకము సమానమైనదని భావము.

తాత్పర్యము: "కదాచన స్తరీరసి" ఇత్యాదులైన మూఁడు ఋక్కులను పఠించుచు ఆదిత్య గ్రహమును గ్రహించవలెను. ఈ మంత్రత్రయమునకు ఇచట రెండు ఉపమానములు చూపఁబడినవి. ఒకటి మాతా పిత్రాది మిథునము త్రయాత్మకము. రెండవది ఉల్బ జరాయ్వాది మిథునము త్రయాత్మకము. ఆదిత్య గ్రహ గ్రహణమున 'కదాచనే'త్యాది మంత్ర త్రయ వినియోగ మిచట చెప్పఁబడినది. "కదా చన స్తరీరసి" ఇత్యాది మంత్రములు కా. 1, ప్ర. 4, అ. 22 లోనివి. ఈ మంత్రములు అచటనే వ్యాఖ్యానించఁబడినవి.

8. అర్థము: ఆదిత్యః యత్=ఆదిత్యుఁడు అను ఏ దేవుఁడు కలఁడో, సః=అతఁడు, ఏతే పశవః వై=ఈ పశు స్వరూపుఁడే. దధి=పెరుఁగు, ఊర్క్=బలస్వరూపము. దధ్నా=పెరుఁగుతో, మధ్యతః=సోమమును మధ్యభాగమునందు, శ్రీణాతి=కలుపవలెను. (తదా=అప్పుడు,) పశూనామ్=పశువులయొక్క, మధ్యతః=మధ్యమందు, ఊర్జమేవ=బలమునే, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: ఆదిత్యుఁడు వృష్టిమూలమున పశూపకారి యగుటచే ఇచట పశు స్వరూపుఁడుగా వర్ణించఁబడెను. దధి భోజ్యము కావున ఊర్క్ స్వరూపముగా వర్ణించఁబడినది. సోమమును మధ్యభాగమున దధితో మిశ్రణము చేయవలెను. ఆ మేళనము చేయుటవలన పశువులయందు బలమును స్థాపించిన ట్లగును. ఇచట ఆదిత్య గ్రహమునందు (గ్రహమునందలి సోమమునందు) దధిమేలనము విధించఁబడినది.

9. అర్థము: శృతాతఙ్క్యేన=వేఁడిపాలయందు తోడుపెట్టుటవలన, (నిష్పన్నం దధి=ఏర్పడిన పెరుఁగు,) మేధ్య త్వాయ=పవిత్రతకొఱకు, భవతి=అగుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, అమా=పాకరహితమైన గోవు, పక్వమ్=ఉష్ణధారారూపమైన క్షీరమును, దుహే=ఇచ్చుచున్నది.

తాత్పర్యము: సాంనాయ్య భాండమునందలి క్షీరమును శీతలముచేసి పిమ్మట తోడుపెట్టవలెనని శ్రుత్యంతరమున కలదు. కాని యిచట వేఁడిపాలయందు తోడుపెట్టుటవలన ఏర్పడిన పెరుఁగు పవిత్ర మైనదిగా విహిత మైనది. అందువలననే లోకమునందు గోవు ఉష్ణధారారూపమున క్షీరము నిచ్చుచున్నది. మంత్రమునందలి 'దుహే' అను క్రియకు 'దుగ్ధే'=పితుకుచున్నాను. అని యర్థము. కర్తృవాచక పదము 'గౌః' అని యుండుటవలన ఈ యర్థము సమన్వయము కాదు కనుక "దుహే దుగ్ధే=ప్రయచ్ఛతి" అను విద్యారణ్యము ననుసరించి 'ఇచ్చుచున్నది' అని యిచట అర్థము వ్రాయఁబడినది. "గాం దోగ్ధి పక్వమ్" అని కాని, "గోః పక్వం దుహే" అని కాని యున్నచో పితుకుచున్నానని చెప్పవలెను.

10. అర్థము: ఆదిత్యః యత్=ఆదిత్య గ్రహ మేది కలదో, ఏతే పశవః వై=ఈ ఆదిత్యగ్రహము పశు స్వరూపమే. పరి శ్రిత్య=గ్రహమును ఆచ్ఛాదించి, గృహ్ణాతి=గ్రహించవలెను. (తదా=అప్పుడు,)ప్రతిరుధ్య=(పశువులను) బంధించి, అస్మై ఏవ=ఈ యజమానునికొఱకే, పశూన్=పశువులను, గృహ్ణాతి=గ్రహించినవాఁ డగును.

తాత్పర్యము: ఆదిత్య గ్రహము పశు స్వరూపమే కనుక అధ్వర్యుఁడు ఆదిత్య గ్రహము నాచ్ఛాదించి గ్రహించవలెను. ఆ విధముగ చేసిన యధ్వర్యుఁడు పశువులను మఱియొక స్థలమున కట్టివైచి పిమ్మట ఈ యజమానునికొఱకు గ్రహించినవాఁ డగును. ఇచట గ్రహమునకు ఆచ్ఛాదనము విధించఁబడినది.

11. అర్థము: ఆదిత్యః యత్, ఏతే, పశవః వై.(అర్థము పూర్వోక్తమే.) అగ్నిః యత్=ఏ యగ్నిదేవుఁడు కలఁడో, ఏషః=ఇతఁడు, రుద్రః=రుద్రరూపుఁడు(ఘాతకుఁడు). పరిశ్రిత్య=గ్రహము నాచ్ఛాదించి, గృహ్ణాతి=గ్రహించవలెను. (తదా=అప్పుడు,) రుద్రాదేవ=ఘాతకుఁడైన రుద్రదేవునినుండియే, పశూన్=పశువులను, అన్తః దధాతి=అంతర్ధానము చేసినవాఁ డగును.

తాత్పర్యము: ఆదిత్య గ్రహము పశు స్వరూపము. అగ్ని రుద్రరూపుఁడు. కనుక గ్రహము నాచ్ఛాదించవలెను. అప్పుడు ఈ విధముగ నాచ్ఛాదించిన యధ్వర్యుఁడు గ్రహరూప పశువులకు ఘాతకుఁడైన రుద్రునినుండి వ్యవధానము చేసినవాఁ డగును. పూర్వోక్తమయిన గ్రహ పరిశ్రయము నిచట అనువదించి, ప్రశంస చేయఁబడినది.

12. అర్థము.: ఉపాంశుసవనః యత్=ఉపాంశుసవన మేది కలదో, ఏషః=ఇది, వివస్వాన్ ఆదిత్యః వై=వివస్వ న్నామకుఁడైన ఆదిత్యుఁడే. సః=ఆ యుపాంశుసవనము, ఆ తృతీయ సవనాత్=తృతీయ సవనము పర్యంతము, ఏతం సోమ పీథమేవ=ఆదిత్య గ్రహగత సోమమునే, పరిశయే=అంతటను కలసి యుండును. "వివస్వ ఆదిత్యైష తే సోమపీథః" ఇతి ఆహ="విశిష్ట నివాసము కలిగి వివస్వన్నామకుఁడవైన ఓ యాదిత్యుఁడా! ఈ తృతీయ సవన సంబంధియైన సోమరసము నీది" అని ఈ మంత్రము చెప్పుటచే, (అయమ్=ఈ యజమానుఁడు,) వివస్వన్తమేవ, ఆదిత్యమ్=వివస్వన్నామకుఁడైన ఆదిత్యునే, సమర్ధయతి=సమృద్ధునిగా చేసినవాఁ డగుచున్నాఁడు. ఉపాంశుసవనము=సోమలతనుండి రసమును తీయుటకు సాధనమైన ఱాయి.

తాత్పర్యము: ఉపాంశుసవనము తృతీయ సవన పరిసమాప్తివఱకు సోమరసమును కలసియే యుండును. కనుక అది వివస్వన్నామకుఁడైన ఆదిత్య స్వరూపమే యని వర్ణించఁబడినది. "వివస్వ ఆదిత్యైష తే సోమపీథః" (కా. 1, ప్ర. 4, అ. 22.) అని చెప్పుటచే యాగకర్త వివస్వన్నామకుఁడైన యాదిత్యునే సమృద్ధునిగాఁ జేసినవాఁ డగుచున్నాఁడు.

13. అర్థము: "యా దివ్యా వృష్టి స్తయా త్వా శ్రీణామి" ఇతి="ఓ సోమమా! దివ్యవృష్టి యేది కలదో ఆ దివ్యవృష్టికి హేతువైన దధితో నిన్ను కలుపుచున్నాను" అను మంత్రముచే, వృష్టికామస్య=వర్షమును కోరునట్టి

యాగకర్త నిమిత్తము, శ్రీణీయాత్=ఆదిత్య గ్రహగత సోమమును దధితో కలుపవలెను. (తదా=అప్పుడు, నః=ఆ యాగకర్త,) వృష్టిమ్=వర్షమును, అవ రున్ధే ఏవ=తప్పక పొందును. తాజక్=వెంటనే, ప్రస్కన్దేత్ యది=సోమరసబిందువు జారిపడినచో, పర్జన్యః=మేఘము, వర్షుకః=వర్షించునది, స్యాత్=అగును.

తాత్పర్యము: వర్షమును కోరునట్టి యజ్ఞకర్త నిమిత్తము "యా దివ్యా వృష్టిః" అను మంత్రమును పఠించుచు ఆదిత్య గ్రహమునందలి సోమరసమునందు దధిని కలుపవలెను. అప్పుడు యాగకర్త వర్షమును పొందును. ఒకవేళ వెంటనే సోమరస బిందువు జారి పడినచో మేఘము వర్షించున దగును. చాలకాలము మేఘము వర్షము కురియునది కానిచో ఆదిత్య గ్రహమును సాదనము చేయరాదు. ఇచట కామ్యమైన దధిశ్రయణము సమంత్రకముగ విధించఁబడినది.

14. అర్థము: చిరమ్=చాలకాలము, అవర్షుకః యది=మేఘము వర్షించనిచో, న సాదయతి=ఆదిత్యగ్రహమును గ్రహాంతరము వలె సాదనము చేయరాదు. అనన్నాత్=గర్భాశయ వ్యతిరిక్త స్థానమునందు పతితము కాని రేతస్సునుండి, ప్రజాః=ప్రజలు, ప్రజాయన్తే హి=పుట్టుచున్నారు కదా! న అను వషట్ కరోతి=ఒక మారు 'వషట్' అని చెప్పి మఱల 'వషట్' అని చెప్పరాదు. అను వషట్ కుర్యాత్ యత్=అనువషట్కారము చెప్పినచో, ప్రజాః అను=ప్రజలను అనులక్షించి, రుద్రమ్=క్రూరదేవుఁడైన రుద్రుని, అవసృజేత్=ప్రేరించినవాఁ డగును. హుత్వా=ఆదిత్య గ్రహమును హోమము చేసి, న అన్వీక్షేత=చూడరాదు. అన్వీక్షేత యత్=చూచు నెడల, అస్య=ఈ యధ్వర్యునియొక్క, చక్షుః=చక్షుస్సు, ప్రమాయుకమ్=మరణశీలము, స్యాత్=అగును. తస్మాత్=ఆ కారణమువలన, న అన్వీక్ష్యః=హోమానంతరము ఆదిత్యగ్రహము చూడరానిది.

తాత్పర్యము: చాలకాలము మేఘము వర్షమును కురియనిచో నాదిత్య గ్రహమును సాదనము చేయరాదు. ఇంతకు పూర్వము విహితములైన గ్రహములకు గ్రహణ సాదనములు రెండును చెప్పఁబడినవి. ఆ గ్రహముల సాదనము మంత్రములందు "ఏష తే యోనిః" అను మంత్రభాగము ఉన్నవిధముగ "కదా చన స్తరీరసి" అను మంత్రమున లేదు కనుక ఆదిత్యగ్రహమును సాదనము చేయరాదు. గర్భాశయ వ్యతిరిక్త స్థానమునందు పతితము కాని రేతస్సునుండి ప్రజలు పుట్టుచున్నారు కదా! ఆ విధముగానే ఖరప్రదేశమునందు ఆదిత్యగ్రహము సాదితము కాకుండుటవలన ప్రజలు పుట్టుదురు. ఇతర గ్రహముల హోమవిషయమున వషట్కారానంతరము అనువషట్కారము చెప్పినవిధముగ ఈ యాదిత్యగ్రహ హోమము విషయమున సకృద్వషట్కారమే కాని, అనువషట్కారము చేయరాదు. అనువషట్కారము చేసినచో అధ్వర్యుఁడు ప్రజల కభిముఖముగ క్రూర దేవుఁడైన రుద్రుని ప్రేరణ చేసినవాఁ డగును. ఆదిత్య గ్రహమును హోమము చేసి దానిని చూడరాదు. చూచినచో అధ్వర్యుని చక్షుస్సు అంధ మగును. కావున చూడరాదు. ఇచట గ్రహాంతరములకువలె ప్రసక్తమైన సాదనాదికము నిషిద్ధ మైనది.

షష్ఠానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే సప్తమోఽనువాకః

మూలము: [1]అన్తర్యామపాత్రేణ సావిత్ర మాగ్రయణా ద్గృహ్ణాతి ప్రజాపతిర్వా ఏష యదాగ్రయణః ప్రజానాం ప్రజ
నానాయ [2]న సాదయత్యసన్నాద్ధి ప్రజాః ప్ర జాయన్తే నాను వషట్కరోతి యదను వషట్కుర్యా
ద్రుద్రం ప్రజా అన్వవసృజే [3]దేష వై గాయత్రో దేవానాం యత్సవితైష గాయత్రియై లోకే గృహ్యతే
యదాగ్రయణో యదన్తర్యామపాత్రేణ సావిత్ర మాగ్రయణా ద్గృహ్ణాతి స్వాదేవైనం యోనే ర్నిర్గృహ్ణాతి
[4]విశ్వే (౧) దేవా స్తృతీయగ్ం సవనం నోదయచ్ఛన్తే సవితారం ప్రాతఃసవనభాగగ్ంసన్తం తృతీయస
వనమభి పర్యణయన్తతో వై తే తృతీయగ్ం సవన ముదయచ్ఛ న్యత్తృతీయ సవనే సావిత్రో గృహ్యతే
తృతీయస్య సవనస్యోద్యత్యై [5]సవితృపాత్రేణ వైశ్వదేవం కలశాద్గృహ్ణాతి వైశ్వదేవ్యో వై ప్రజా వైశ్వ
దేవః కలశః సవితా ప్రసవానామీశే యత్సవితృపాత్రేణ వైశ్వదేవం కలశాద్గృహ్ణాతి సవితృప్రసూత
ఏవాస్మై ప్రజాః ప్ర(౨)జనయతి [6]సోమే సోమమభి గృహ్ణాతి రేత ఏవ తద్దధాతి [7]సుశర్మాఽసి సుప్ర
తిష్ఠాన ఇత్యాహ సోమే హి సోమమభి గృహ్ణాతి ప్రతిష్ఠిత్యా [8]ఏతస్మిన్వా అపి గ్రహే మనుష్యేభ్యో
దేవేభ్యః పితృభ్యః క్రియతే సుశర్మాఽసి సుప్రతిష్ఠాన ఇత్యాహ మనుష్యేభ్య ఏవైతేన కరోతి బృహ
దిత్యాహ దేవేభ్య ఏవైతేన కరోతి నమ ఇత్యాహ పితృభ్య ఏవైతేన కరోత్యేతావతీర్వై దేవతాస్తాభ్య
ఏవైనగ్ం సర్వాభ్యో గృహ్ణా[9]త్యేష తే యోని ర్విశ్వేభ్యస్త్వా దేవేభ్య ఇత్యాహ వైశ్వదేవో హ్యేషః (౩)||

[విశ్వే ప్ర పితృభ్య ఏవైతేన కరోత్యేకాన్నవిగ్ంశతిశ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయతైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమప్రపాఠకే సప్తమోఽనువాకః ||౭||

# వేదార్థదీపిక

అవతారిక: షష్ఠానువాకమునందు ఆదిత్య గ్రహ గ్రహణము విధించఁబడినది. ఈ సప్తమానువాకమునందు సావిత్ర వైశ్వ దేవ గ్రహములు విధించఁబడుచున్నవి.

1. అర్థము: ఆగ్రయణాత్=ఆగ్రయణ గ్రహమునుండి, అన్తర్యామ పాత్రేణ=అంతర్యామ పాత్రముతో, సావిత్రమ్=సావిత్ర గ్రహమును, గృహ్ణాతి=గ్రహించవలెను. ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహ మేది కలదో, ఏషః=ఇది, ప్రజాపతిః వై=ప్రజాపతి స్వరూపమే. ఏతత్=ఈ ఆగ్రయణ గ్రహమునుండి గ్రహించుట, ప్రజానాం ప్రజననాయ=ప్రజోత్పత్తికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ఆగ్రయణ గ్రహమునుండి అంతర్యామ పాత్రముతో సావిత్ర గ్రహమును గ్రహించవలెను. ఆగ్రయణ గ్రహము కర్మనిష్పత్తిద్వారా ప్రజాపాలక మగుటచేతను, ప్రజాపతి ప్రజాపాలకుఁ డగుటచేతను ఈ ఆగ్రయణ గ్రహము ప్రజాపతి స్వరూపమే యగును. ఆగ్రయణ గ్రహమునుండి యీ సావిత్ర గ్రహమును గ్రహించుట ప్రజో త్పత్తికి హేతు వగును. ఇచట సావిత్ర గ్రహము విధించఁబడినది.

2. అర్థము: "న సాదయత్యసన్నాద్ధి ప్రజాః ప్రజాయన్తే" అను నీ మంత్రభాగము షష్ఠానువాకమున (14 వ వాక్యము.) వ్యాఖ్యానించఁబడినది. అచట ఆదిత్య గ్రహము. ఇచట సావిత్ర గ్రహము.

3. అర్థము: లోకే=లోకమునందు, సవితైవ=సవితృ దేవుఁడే, గాయత్రియై=గాయత్రికొఱకు, గృహ్యతే యత్=గ్రహించఁబడు చుండుటవలన, ఏషః వై=ఈ సవితయే, గాయత్రః=గాయత్రీ సంబద్ధుఁడు. ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహ మేది కలదో, ఏషః=ఇది, [ప్రాతఃసవనే=ప్రాతఃసవనమునందు, గాయత్ర్యాః స్థానే=గాయత్రీ స్థానమునందు, గృహ్యతే=గ్రహించఁబడుచున్నది.] ఆగ్రయణాత్=ఆగ్రయణ గ్రహమునుండి, అన్తర్యామ పాత్రేణ=అంతర్యామ పాత్రముతో, సావిత్రమ్=సావిత్ర గ్రహమును, గృహ్ణాతి యత్=గ్రహించు నెడల, స్వాత్ యోనేః ఏవ=స్వీయ స్థానము నుండియే, ఏనమ్=ఈ సావిత్ర గ్రహమును, నిర్గృహ్ణాతి=నిర్దేశించి గ్రహించినవాఁ డగును.

తాత్పర్యము: "తత్సవితుర్వరేణ్యమ్" అని గాయత్రీ మంత్రమునం దామ్నాత మగుటవలన దేవతలలో సవితృ దేవుఁడు గాయత్రీ సంబద్ధుఁడని స్పష్ట మగుచున్నది. కనుకనే లోకమునందు గాయత్రికొఱకు సవితయే గ్రహించఁబడు చున్నాఁడు. ప్రాతఃసవనమునందు గాయత్రీ స్థానమునందు ఆగ్రయణ గ్రహము కూడ గ్రహించఁబడుచున్నది. కావున గాయత్రికి ఆగ్రయణము స్థాన మగుచున్నది. ఆగ్రయణ గ్రహమునుండి అంతర్యామ పాత్రముతో సావిత్ర గ్రహము గ్రహించఁబడుచున్నచో, స్వకీయయోనినుండియే ఈ సావిత్ర గ్రహమును నిర్దేశించి గ్రహిం చిన ట్లగును. (ఒకటవ మంత్రభాగమున విహితమైన సావిత్ర గ్రహము ఇచట ప్రశంసించఁబడినది.)

4. అర్థము: విశ్వే దేవాః=విశ్వేదేవతలు, తృతీయం సవనమ్=తృతీయ సవనమును, న ఉదయచ్ఛన్=నిర్వహించలేకపో యిరి. తే=వారు, ప్రాతః సవన భాగం సన్తమ్=ప్రాతఃసవనమునందు భాగము కలవాఁడుగా ఉంటున్న, సవితారమ్=సవితృ దేవుని, తృతీయ సవనమ్ అభి=తృతీయ సవనమున కభిముఖముగ, పర్యణయన్=సహ కారిగ పొందించిరి. (తీసికొనివచ్చిరి). తతః వై=ఆ సవితృదేవునివలననే, తే=ఆ విశ్వేదేవతలు, తృతీయం సవనమ్=తృతీయ సవనమును, ఉదయచ్ఛన్=నిర్వహించిరి. తృతీయ సవనే=తృతీయ సవన మునందు, సావిత్రః=సావిత్ర గ్రహము, గృహ్యతే యత్=గ్రహించఁబడుచున్నచో, (తత్=ఆ సావిత్ర గ్రహ గ్రహణము,) తృతీయస్య సవనస్య=తృతీయ సవనముయొక్క, ఉద్యత్యై=ప్రయత్నము(నిర్వహణము)కొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: విశ్వేదేవతలు తృతీయ సవనమును స్వయముగ నిర్వహించలేక ప్రాతఃసవనమునందు భాగస్వామిగా నుంటు న్నను ఆ సవితృదేవుని సహకారిగా తృతీయ సవనమునకు తీసికొనివచ్చిరి. సవితృ దేవుని సహకారముతో ఆ విశ్వేదేవతలు తృతీయ సవనమును నిర్వహించిరి. కావున సావిత్ర గ్రహమును తృతీయ సవనమునందు

గ్రహించినచో తృతీయ సవనము నిర్వహింపఁబడిన దగును. ఇచట సావిత్ర గ్రహమునకు తృతీయ సవన సంబంధము చెప్పఁబడినది.

5. **అర్థము:** సవితృ పాత్రేణ=సవితృ పాత్రముతో, వైశ్వదేవమ్=వైశ్వదేవ గ్రహమును, కలశాత్=ద్రోణకలశమునుండి, గృహ్ణాతి=గ్రహించవలెను. ప్రజాః=ప్రజలు, వైశ్వదేవ్యః వై=విశ్వేదేవతల సంబంధులే. కలశః=ద్రోణకలశము, వైశ్వదేవః=విశ్వే దేవతల సంబంధి. సవితా=సవితృ దేవుఁడు, ప్రసవానామ్=ప్రేరణములకు, ఈశే=సమర్థుఁడగుచున్నాఁడు. కలశాత్=ద్రోణకలశమునుండి, వైశ్వదేవమ్=వైశ్వదేవ గ్రహమును, సవితృ పాత్రేణ=సవితృ పాత్రముతో, గృహ్ణాతి యత్=గ్రహించునెడల, సవితృ ప్రసూతే ఏవ=సవితృ దేవుని ప్రేరణము కలుగునపుడే, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అస్మై=ఈ యాగకర్తకొఱకు, ప్రజాః=ప్రజలను, ప్రజనయతి=ప్రకర్షముగ పుట్టించును.

**తాత్పర్యము:** ద్రోణకలశము వైశ్వదేవ గ్రహమును సవితృ పాత్రముతో గ్రహించవలెను. ప్రజలు సర్వదేవతలచే పాలించఁబడువారు కావున, ప్రజలు విశ్వదేవ సంబంధు లగుచున్నారు. ద్రోణకలశము సర్వదేవ సాధారణ సోమరసమున కాధార మగుటచే ఆ కలశము విశ్వదేవ సంబంధి యగుచున్నది. కనుక అధ్వర్యుఁడు ద్రోణకలశమునుండి సవితృపాత్రముతో వైశ్వదేవ గ్రహమును గ్రహించనెడల సవితృ ప్రేరణమునందే అధ్వర్యుఁడు ఈ యజమానునికొఱకు ప్రజలను పుట్టించువాఁ డగును. ఇచట వైశ్వదేవ గ్రహము విధించఁబడినది.

6. అర్థము: సోమే=సావిత్ర గ్రహ శేషమైన సోమమునందు, సోమమ్=వైశ్వదేవ గ్రహ సోమమును, అభి గృహ్ణాతి=అంతటను గ్రహించవలెను. తత్=ఆ గ్రహణమువలన, రేతః ఏవ=రేతస్సునే, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: సావిత్ర గ్రహ శేషమైన సోమమునందు వైశ్వదేవ గ్రహ సోమమును గ్రహించవలెను. అట్లు చేసిన యధ్వర్యుఁడు రేతస్సునే స్థాపించినవాఁ డగును. ఇచట సావిత్ర గ్రహశేషమైన వైశ్వదేవ గ్రహ సోమము విధించఁబడినది.

7. అర్థము: "సుశర్మాఽసి సుప్రతిష్ఠానః" ఇతి ఆహ="ఓ వైశ్వదేవ గ్రహమా! నీవు శోభనమైన సుఖము కలదానవు, పాత్రమునందు మంచి స్థితి కలదానవు నగుచున్నావు" అని పై మంత్రము చెప్పినది. (కా. 1, ప్ర. 4, అ. 26.)ప్రతిష్ఠిత్యై హి=ప్రతిష్ఠకొఱకు కదా!, సోమే=సావిత్ర గ్రహశేషమైన సోమమునందు, సోమమ్=వైశ్వదేవ గ్రహ సోమమును, అభిగృహ్ణాతి=అంతటను గ్రహించవలెను.

తాత్పర్యము: సావిత్రగ్రహ శేషమైన సోమమునందు వైశ్వదేవ గ్రహ సోమమును గ్రహించుటవలన వైశ్వదేవ సోమమునకు మంచిస్థితియు, మంచిసుఖమును కలుగును కనుకనే, "సుశర్మాఽసి సుప్రతిష్ఠానః" అని శ్రుతి చెప్పినది. "సుశర్మాఽసి" అను మంత్రమునందు "సుప్రతిష్ఠానః" అను పదప్రయోగము యుక్తమని ఇచ్చట చెప్పఁబడినది.

8. **అర్థము:** ఏతస్మిన్ గ్రహే అపి వై=ఈ వైశ్వదేవ గ్రహమునందే, మనుష్యేభ్యః=మనుష్యులకొఱకు, దేవేభ్యః=దేవతలకొఱకు, పితృభ్యః=పితృదేవతలకొఱకు, క్రియతే=చేయఁబడుచున్నది. "సుశర్మాఽసి సుప్రతిష్ఠానః" ఇతి ఆహ="ఓ వైశ్వదేవ గ్రహమా! నీవు సమీచీన సుఖము కలదానవు, సుప్రతిష్ఠ కలదానవు నగుచున్నావు" అని చెప్పుటచే, మనుష్యేభ్యః ఏవ=మనుష్యులకొఱకే, ఏతేన=ఈ మంత్రభాగముచేత, కరోతి=చేయుచున్నాఁడు. "బృహత్" ఇతి ఆహ="శస్త్రము(సామము)నందు స్తోత్రము చేయఁబడుచున్న నీకొఱకు "బృహత్ నమః అస్తు" గొప్ప నమస్కారము అగుఁగాక" అని ఆ మంత్రమే చెప్పినది. ఏతేన=దీనిచే, దేవేభ్యః ఏవ=దేవతలకొఱకే, కరోతి=చేయుచున్నాఁడు. "నమః" ఇతి ఆహ= ఆ మంత్రమే నమస్కారము అని చెప్పినది. ఏతేన=దీనిచే, పితృభ్యః ఏవ=పితృదేవతలకొఱకే, కరోతి=చేయుచున్నాఁడు. దేవతాః=దేవతలు, ఏతావతీః వై=ఇంతమందియే. తాభ్యః సర్వాభ్యః ఏవ=ఆ సర్వ దేవతలకొఱకే, గృహ్ణాతి=వైశ్వదేవ గ్రహమును గ్రహించవలెను.

తాత్పర్యము: "సుశర్మాఽసి సుప్రతిష్ఠానో బృహదుక్షే నమః" ఈ మంత్రమునందలి 'సుశర్మా' 'బృహత్' 'నమః' అను పదములచే మనుష్యులు, దేవతలు, పితృదేవతలు సూచింపఁబడినారు. కావున ఆ యందఱికొఱకు వైశ్వదేవ గ్రహమును గ్రహించవలెనని యర్థము. ఆ మంత్రమునందలి 'సుశర్మ' శబ్దముచేత మనుష్యులు సమీచీన సుఖార్థులని సూచింపఁబడినారు. బృహచ్ఛబ్దముచేత దేవతలు అధిక మహిమోపేతులుగా సూచింపఁబడినారు. నమశ్శబ్దముచేత పితృదేవతలు నమస్కారప్రియులుగా సూచింపఁబడినారు. ఇచట "సుశర్మాఽసి" అను మంత్రమునందలి సుశర్మేత్యాది పదములు విశేష విషయ సూచకములని చెప్పఁబడినది.

9. అర్థము: "ఏష తే యోని ర్విశ్వేభ్య స్త్వా దేవేభ్యః" ఇతి ఆహ="ఓ వైశ్వదేవ గ్రహమా! ఈ ఖరప్రదేశము నీకు స్థానము. సర్వదేవతలకొఱకు నిన్ను ఇచట ఉంచుచున్నాను." (కా. 1, ప్ర. 4, అ. 26) అని శ్రుతి చెప్పినది. ఏషః=ఈ వైశ్వదేవ గ్రహము, వైశ్వదేవః హి=విశ్వదేవతల సంబంధి కదా!

తాత్పర్యము: "సుశర్మాఽసి" అను మంత్రముయొక్క చరమ భాగమునందు వైశ్వదేవ గ్రహమునకు ఈ ఖర ప్రదేశము స్థానమనియు, సర్వదేవతలకొఱకు ఆగ్రహము నచట ఉంచుచున్నాననియు చెప్పఁబడినది. వైశ్వదేవ గ్రహము సర్వదేవతలకు సంబంధి కావున అట్లు చెప్పుట యుక్తమే యని భావము. ["ఏష తే యోనిః" ఇత్యాది సాదన మంత్రమునందలి 'విశ్వేభ్యః' అను పదము సర్వార్థకము కనుక సర్వదేవతలకొఱకు వైశ్వదేవగ్రహమును సాదనము చేయుట(ఉంచుట) యుక్తమని ఇచట చెప్పఁబడినది.]

సప్తమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే అష్టమోఽనువాకః

మూలము: [1]ప్రాణో వా ఏష యదుపాగ్ంశు ర్యదుపాగ్ంశుపాత్రేణ ప్రథమశ్చోత్తమశ్చ గ్రహౌ గృహ్యేతే ప్రాణమే వాను ప్రయన్తి ప్రాణమనూద్యన్తి [2]ప్రజాపతిర్వా ఏష యదాగ్రయణః ప్రాణ ఉపాగ్ంశుః పత్నీః ప్రజాః ప్రజనయన్తి యదుపాగ్ంశుపాత్రేణ పాత్నీవత మాగ్రయణా ద్గృహ్ణాతి ప్రజానాం ప్రజననాయ తస్మా త్ప్రాణం ప్రజా అను ప్ర జాయన్తే [3]దేవా వా ఇత ఇతః పత్నీః సువర్గమ్ (౧)లోక మజిగాగ్ంసన్తే సువర్గం లోకం న ప్రాజానన్త ఏతం పాత్నీవత మపశ్యన్త మగృహ్ణత తతో వై సువర్గం లోకం ప్రాజాన న్యత్పాత్నీవతో గృహ్యతే సువర్గస్య లోకస్య ప్రజ్ఞాత్యై [4]స సోమో నాతిష్ఠత స్త్రీభ్యో గృహ్యమాణస్తం ఘృతం వజ్రం కృత్వాఽఘ్నన్తం నిరిన్ద్రియం భూత మగృహ్ణ న్తస్మాత్స్త్రియో నిరిన్ద్రియా అదాయా దీరపి పాపాత్పుగ్ంస ఉపస్తిరమ్ (౨)వదన్తి యద్ఘృతేన పాత్నీవతగ్ం శ్రీణాతి వజ్రేణై వైనం వశే కృత్వా గృహ్ణా [5]త్యుపయామగృహీతోఽసీత్యాహేయం వా ఉపయామ స్తస్మాదిమాం ప్రజా అను ప్ర జాయన్తే [6]బృహస్పతిసుతస్య త ఇత్యాహ బ్రహ్మ వై దేవానాం బృహస్పతి ర్బ్రహ్మణై వాస్మై ప్రజాః ప్ర జనయతి [7]న్దో ఇత్యాహ రేతో వా ఇన్దూ రేత ఏవ తద్దధాతి [8]న్ద్రియావ ఇతి (౩)ఆహ ప్రజా వా ఇన్ద్రియం ప్రజా ఏవాస్మై ప్ర జనయ[9]త్యగ్నా౩ ఇత్యాహాగ్నిర్వై రేతోధాః పత్నీవ ఇత్యాహ మిథు నత్వాయ [10]సజూర్దేవేన త్వష్ట్రా సోమం పిబేత్యాహ త్వష్టా వై పశూనాం మిథునానాగ్ం రూప కృద్రూపమేవ పశుషు దధాతి [11]దేవా వై త్వష్టార మజిఘాగ్ంసన్స పత్నీః ప్రాపద్యత తం న

ప్రతి ప్రాయచ్ఛ న్తస్మాదపి (४)వధ్యం ప్రపన్నం న ప్రతి ప్ర యచ్ఛన్తి తస్మాత్పాత్నీవతే త్వష్ట్రేఽపి గృహ్యతే [12]న సాదయత్యసన్నాద్ధి ప్రజాః ప్రజాయన్తే [13]నాను వషట్కరోతి యదను వషట్కుర్యాద్రుద్రం ప్రజా అన్వవసృజే ద్యన్నానువషట్కుర్యా దశాన్త మగ్నీత్సోమం భక్షయే దుపాగ్ంశ్వను వషట్కరోతి న రుద్రం ప్రజా అన్వవసృజతి శాన్తమగ్నీత్సోమం భక్షయత్య [14]గ్నీన్నేష్టు రుపస్థమా సీద (५)నేష్టః పత్నీముదానయేత్యాహాగ్నీదేవ నేష్టరి రేతో దధాతి నేష్టా పత్నియా [15]ముద్గాత్రా సం ఖ్యాపయతి ప్రజాపతిర్వా ఏష యదుద్గాతా ప్రజానాం ప్రజననాయా [16]ప ఉప ప్ర వర్తయతి రేత ఏవ తత్సిఞ్చ [17]త్యూరుణోప ప్ర వర్తయత్యూరుణా హి రేతః సిచ్యతే [18]నగ్నంకృత్యోరుముప ప్ర వర్తయతి యదా హి నగ్న ఊరు ర్భవత్యథ మిథునీ భవతోఽథ రేతః సిచ్యతేఽథ ప్రజాః ప్ర జాయన్తే (६)||

[పత్నీః సువక్ష ముపస్తితర మిన్ద్రియావ ఇత్యపి సీద మిథున్యష్టౌ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమ ప్రపాఠకే ఽష్టమోఽనువాకః ||· ||

## వేదార్థదీపిక

అవతారిక: సప్తమానువాకమునందు సావిత్ర వైశ్వదేవ గ్రహము లభిహితము లైనవి. ఈ యష్టమానువాకమునందు పాత్నీవత గ్రహము చెప్పఁబడుచున్నది.

1. అర్థము: ఉపాంశుః యత్=ఉపాంశు గ్రహ మేది కలదో, ఏషః=ఇది, ప్రాణః వై=యజ్ఞమునకు ప్రాణస్వరూపమే. ఉపాంశు పాత్రేణ=ఉపాంశు పాత్రములో, ప్రథమశ్చ ఉత్తమశ్చ గ్రహౌ=ప్రథమోత్తమ గ్రహములు రెండును, గృహ్యేతే=గ్రహించఁబడవలెను. (తథా సతి=అట్లు కాఁగా,) ప్రాణమేవ=ప్రాణమునే, అను=అనుసరించి, ప్రయన్తి=ప్రారంభించుచున్నవా రగుచున్నారు. ప్రాణమ్ అను ఉద్యన్తి=ప్రాణము ననుసరించి సమాప్తి చేయువా రగుచున్నారు.

తాత్పర్యము: ఉపాంశు గ్రహము యజ్ఞమునకు ప్రాణమువంటిది. "వాచస్పతయే పవస్వ" అను మంత్రముచే గ్రహించఁబడిన గ్రహము ప్రథమ గ్రహము. "బృహస్పతి సుతస్య" అను మంత్రముచే గ్రహించఁబడిన గ్రహము ఉత్తమము

(అంత్యము). ఆ ప్రథమోత్తమ గ్రహములను రెండింటిని యజ్ఞమునకు ప్రాణ స్థానీయమైన ఉపాంశు పాత్రముతో గ్రహించవలెను. అట్లు చేయుటవలన ప్రాణము ననుసరించియే ప్రారంభించువా రగుచున్నారు. ప్రాణము ననుసరించి సమాప్తిచేయువా రగుచున్నారు. ఉపాంశు గ్రహమునకు ప్రాణత్వము పూర్వము చెప్పఁబడినది. ఇచట పాత్నీవత గ్రహమునకు పాత్రము విధించఁబడినది.

2. అర్థము: ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహము ఏది కలదో, ఏషః=ఇది, ప్రజాపతిః వై=ప్రజాపతి స్వరూపమే. ఉపాంశుః=ఉపాంశు గ్రహము, ప్రాణః=ప్రాణము. పత్నీః=పత్నులు, ప్రజాః=ప్రజలను, ప్ర జనయన్తి=అధిక ముగ పుట్టించుచున్నారు. ఆగ్రయణాత్=ఆగ్రయణ గ్రహమునుండి, ఉపాంశు పాత్రేణ=ఉపాంశు పాత్రముతో, పాత్నీవతమ్=పాత్నీవత గ్రహమును, గృహ్ణాతి యత్=గ్రహించు నెడల, (గ్రహించవలెను.) (ఏతత్=ఈ గ్రహణము,) ప్రజానాం ప్రజననాయ=ప్రజోత్పత్తికొఱకు, భవతి=అగుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, ప్రాణమను=ప్రాణము ననుసరించి, ప్రజాః=ప్రజలు, ప్ర జాయన్తే=అధికముగ పుట్టుచున్నారు.

తాత్పర్యము: ఆగ్రయణము ప్రజాపతి స్వరూపము. ఉపాంశు గ్రహము యజ్ఞమునకు ప్రాణ స్థానీయ మైనది. పత్నులు ప్రజలను పుట్టించుదురు. కావున ప్రాణరూపమైన ఉపాంశు పాత్రముతో ప్రజాపతి రూపమైన ఆగ్రయణ గ్రహమునుండి పాత్నీవత గ్రహమును గ్రహించినచో, ప్రజోత్పత్తి కలుగును. కావున ప్రాణము ననుసరించి ప్రాణయుక్తులైన ప్రజలు పుట్టుచున్నారు. ఇచట పాత్నీవత గ్రహము విధించఁబడినది.

3. అర్థము: దేవాః=దేవతలు, పత్నీః=పాత్నీవత గ్రహమును, ఇతఇతః=ఉపేక్షించినవారై, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, అజిగాంసన్ వై=తెలిసికొన నిచ్ఛయించినవారైనను, తే=వారు, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, న ప్రాజానన్త=తెలిసికొనలేకపోయిరి. ఏతం పాత్నీవతమ్=ఈ పాత్నీవత గ్రహమును, అపశ్యన్=(స్వర్గప్రాప్తి సాధనముగా) చూచిరి. తమ్ అగృహ్ణత=ఆ పాత్నీవతమును గ్రహించిరి. తతః వై=ఆ పాత్నీవత గ్రహ గ్రహణమువలననే, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, ప్రాజానన్=తెలిసికొనిరి. పాత్నీవతః=పాత్నీవత గ్రహము, గృహ్యతే యత్=గ్రహించఁబడినచో, (ఏతత్=ఈ పాత్నీవత గ్రహ గ్రహణము,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, ప్రజ్ఞాత్యై=ప్రజ్ఞానము కొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: దేవతలు పాత్నీవత గ్రహము నుపేక్షించి ఇతర గ్రహమువలన స్వర్గము నెఱుఁగఁ గోరిరి. కాని వారు స్వర్గమును తెలిసికొనలేరైరి. అప్పుడు వారు స్వర్గమును తెలిసికొనుటకు సాధనముగా పాత్నీవత గ్రహమును జూచి దానిని గ్రహించిరి. దానివలన వారు స్వర్గమును తెలిసికొనిరి. కనుక పాత్నీవత గ్రహ గ్రహణము స్వర్గలోకమును బాగుగ తెలిసికొనుటకు సాధన మగును. ఇచట పాత్నీవత గ్రహము ప్రశంసించఁబడినది.

4. అర్థము: స్త్రీభ్యః=స్త్రీదేవతలకొఱకు, గృహ్యమాణః=గ్రహించఁబడుచున్న, సః సోమః=ఆ పాత్నీవత గ్రహమునందలి సోమము, న అతిష్ఠత=తనను ప్రకాశితము చేసికొనలేదు. ఘృతమ్=ఆజ్యమును, వజ్రమ్=వజ్రమునుగా, కృత్వా=చేసి, తమ్=ఆ సోమమును అఘ్నన్=కొట్టిరి. నిరిన్ద్రియం భూతం తమ్=వీర్యరహితమైన ఆ సోమమును, అగృహ్ణన్=గ్రహించిరి. తస్మాత్=ఆ కారణమువలన, స్త్రియః=స్త్రీలు, నిరిన్ద్రియాః=వీర్యరహితలై, అదాయాదీః=దాయభాగమున కనర్హులైరి. పాపాత్ పుంసః అపి=పతితుఁడైన పురుషునికంటె, ఉపస్తితరమ్=స్త్రీస్వరూపమును మిక్కిలి క్షీణమైనదిగా, వదన్తి=చెప్పుచున్నారు. పాత్నీవతమ్=పాత్నీవత గత సోమమును, ఘృతేన=నేతితో, శ్రీణాతి యత్=మేలనము చేసినచో, ఏనమ్=ఈ పాత్నీవతమును, వజ్రేణ=వజ్రరూపమైన ఆజ్యముచే, వశే=స్వాధీనమునందు, కృత్వా=చేసి, గృహ్ణాతి=గ్రహించవలెను.

తాత్పర్యము: పాత్నీవత గ్రహము స్త్రీదేవతాకము. కనుక ఆ పాత్రమునందలి సోమము స్త్రీదేవతాక మగుచున్నది. స్త్రీదేవతలకై గ్రహించఁబడిన సోమము తన స్వరూపమును ప్రకాశితము చేయలేదు. అనఁగా ఆ పాత్రము నందలి సోమము ప్రకాశితము కాలేదు. అప్పుడు దేవతలు నేతిని వజ్రముగాఁ జేసి వజ్రాత్మకమైన నేతితో

ఆ సోమమును కొట్టిరి. (సోమమునందు ఘృతమును కలిపిరి). ప్పుడు ఆ సోమము వీర్యరహిత మయ్యెను. వీర్యరహితమైన సోమరసమునే వారు గ్రహించిరి. ఆ కారణమువలననే నిర్వీర్యలైన స్త్రీలు పంచుకొనఁదగిన తండ్రి సొత్తునందు అర్హులు కారైరి. ఈ విధముగ నిర్వీర్య లగుటచేతనే పతితుఁడైన పురుషునికంటెను స్త్రీస్వరూపము హీనతరమని లోకమునందు చెప్పఁచున్నారు. పాత్నీవత సోమమును ఘృతముతో కలుపవలెను. వజ్రరూపమైన ఘృతముతో మిలితము చేసిన సోమము కల పాత్నీవతమును గ్రహించవలెను. (పాత్నీవత గ్రహమునందు ఘృతమేలనము ఇచట విహిత మైనది.)

5. అర్థము: "ఉపయామగృహీతః" ఇతి ఆహ="ఓ సోమమా! నీవు ఈ భూభాగవిశేషమునందు గ్రహింపఁబడినదానవు" అని శ్రుతి చెప్పినది. ఇయం వై=ఈ భూమియే, ఉపయామః=ఉపయామము. ఇమామ్ అను=ఈ భూమి ననుసరించి, ప్రజాః=ప్రజలు, ప్ర జాయన్తే=అధికముగ పుట్టుచున్నారు.

తాత్పర్యము: ఉపేతాః ప్రజాః యచ్ఛతి ఉత్పాదన ధారణాదినా వ్యవస్థాపయతి 'ఉపయామః'. తనను ప్రజలను ఉత్పాదన ధారణాదికములచే వ్యవస్థీకరించునది భూభాగమని వ్యుత్పత్త్యర్థము. ఈ యర్థము కల ఉపయామమునందు సోమము గ్రహించఁబడినదని శ్రుతి చెప్పినది. కనుక ఇట్టి భూమి ననుసరించి ప్రజలు అధికముగా పుట్టుచున్నారు. వేదమునందు ఆమ్నాతమైన "బృహస్పతిసుతస్య" అను మంత్రమునకు "ఉపయామగృహీతోఽసి" అను శేషభాగమును పూరించి ఈ బ్రాహ్మణభాగము వ్యాఖ్యానించినది.

6. అర్థము: "బృహస్పతి సుతస్య తే" ఇతి ఆహ="ఓ సోమమా! బృహస్పతి స్వరూపుఁడైన యజమానునిచే అభిషుతమైన నీకు సంబంధించిన పాత్నీవత గ్రహమును గ్రహించుచున్నాను." అని ఈ వేద భాగము చెప్పినది. దేవానామ్=దేవతలలో, బృహస్పతిః=బృహస్పతి, బ్రహ్మ వై=బ్రహ్మయే. బ్రహ్మణైవ=బ్రహ్మ చేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, ప్రజాః=ప్రజలను, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ప్ర జనయతి=అధికముగ పుట్టించుచున్నాఁడు.

తాత్పర్యము: మంత్రమునందలి 'బృహస్పతి' శబ్దప్రయోగమునఁ గల అభిప్రాయ మిచట వివరించఁబడుచున్నది. "బృహస్పతి సుతస్య" అని వేదము చెప్పినది. దేవతలలో బృహస్పతి బ్రహ్మ స్వరూపుఁడు. యజమానునికై పాత్నీవత గ్రహమును గ్రహించిన యధ్వర్యుఁడు ఈ యజమానునికొఱకు బ్రహ్మచేతనే ప్రజలను పుట్టించునని భావము.

7. అర్థము: "ఇన్దో" ఇతి ఆహ="ఇన్దో!=ఓ సోమమా" అని ఇందు శబ్దమును సోమార్థకముగా మంత్రము చెప్పినది. ఇన్దుః=సోమము, రేతః వై=ద్రవత్వ సామ్యముచే రేతస్సే. తత్=ఆ భూమియందు రేతః ఏవ=రేతస్సునే, దధాతి=స్థాపించువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: "బృహస్పతి సుతస్య" అను మంత్రమునందు "ఇన్దో" అని ప్రయుక్త మైనది. ఇన్దు వనఁగా సోమము. ద్రవత్వ సామ్యముచే ఇందుశబ్దము రేతస్సునకు ఉపలక్షకమని ఈ బ్రాహ్మణ వాక్యము చెప్పఁచున్నది. కనుక అధ్వర్యుఁడు అచట రేతస్సును ఉంచుచున్నాఁడు అని ఇచట వ్యాఖ్యానించఁబడినది.

8. అర్థము: "ఇన్ద్రియావ" ఇతి ఆహ='వీర్యవంతమైన' అను నర్థము కల "ఇన్ద్రియావతః" అని వేదము చెప్పినది. ఇన్ద్రియమ్=వీర్యము, ప్రజాః వై=ప్రజలే. (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అస్మై=ఈ యజమానునికొఱకు, ప్రజాః ఏవ=ప్రజలనే, ప్ర జనయతి=ప్రకృష్టముగ పుట్టించును.

తాత్పర్యము: "మంత్రమునందలి ఇంద్రియ శబ్దముచే తత్కార్యభూత ప్రజలు ఉపలక్షింపఁబడుచున్నారని ఈ బ్రాహ్మణము చెప్పఁచున్నది. మంత్రమునందు "ఇన్ద్రియావ" అని చెప్పఁబడినది. ప్రజలు ఇంద్రియ కార్యము కనుక ఇంద్రియము ప్రజలే. అధ్వర్యుఁడు ఈ యజమానునికై ప్రజలనే పుట్టించును.

9. అర్థము: "అగ్నా౩" ఇతి ఆహ="ఓ యగ్నీ!" అని ఆ మంత్రము చెప్పినది. అగ్నిః వై=అగ్నియే, రేతోధాః=రేతస్సును ధరింపఁజేయువాఁడు. "పత్నీవః" ఇతి ఆహ="పత్నీవంతుఁడవైన ఓ యగ్నీ!" అని ఆ మంత్రము చెప్పినది. (ఏతత్=ఈ చెప్పుట,) మిథునత్వాయ=మిథునభావముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: "బృహస్పతి సుతస్య" అను మంత్రమునందు (కా. 1, ప్ర. 4, అ. 27.) 'అగ్నా3' అనియు, "పత్నీవా3ః" అనియు సంబుద్ధ్యంతములైన రెండు శబ్దములు ఉపాత్తము లైనవి. అగ్ని రేతస్సును ధరింపఁజేయువాఁడనియు, పత్నీవంతుఁ డనియుఁ జెప్పుట మిథునత్వ సిద్ధికొఱకనియు నర్థము. రెండు శబ్దముల చివరిభాగమునందు '3' అను త్రిత్వ సంఖ్యావాచకము ప్లుత సూచకముగా ఆమ్నాతమైనది. ప్లుతము సంబోధనార్థకము. కనుక పత్నీవంతుఁడవైన ఓ యగ్నీ! అని యర్థ మేర్పడినది.

10. అర్థము: "సజూర్దేవేన త్వష్ట్రా సోమం పిబ" ఇతి ఆహ="ఓ పత్నీవంతుఁడవైన అగ్నీ! త్వష్టృ దేవునితో కూడ సోమమును త్రాగుము" అని ఈ మంత్ర భాగము చెప్పినది. మిథునానాం పశూనామ్=స్త్రీ పుంసాత్మక మిథునములైన పశువులకు, రూపకృత్=రూపమును చేయువాఁడైన, త్వష్టా వై=త్వష్టృ దేవుఁడే, పశుషు=పశువులయందు, రూపమేవ=రూపమునే, దధాతి=స్థాపించును.

తాత్పర్యము: 'పత్నీవంతుఁడవైన ఓ యగ్నీ! నీవు త్వష్టృ దేవునితో కూడ సోమమును త్రాగుము' అని "బృహస్పతి సుతస్య" అను మంత్రముయొక్క చరమ భాగము చెప్పినది. కనుక మిథునములైన పశువుల రేతస్సునకు రూపకల్పనము చేయునట్టి త్వష్టయే పశువులయందు రూపమును స్థాపించును. "బృహస్పతినుతస్య--- -- త్వష్ట్రా దేవేన సోమం పిబ స్వాహా" అను నీ మంత్రము ప్రథమ కాండమునందు ఆమ్నాత మైనది.

11. అర్థము: దేవాః=దేవతలు, త్వష్టారమ్=త్వష్టను, అజిఘాంసన్ వై=చంప నిచ్చయించినారఁట! సః=ఆ త్వష్ట, పత్నీః=పత్నీ దేవతలను, ప్రాపద్యత=శరణుచొచ్చెను. తమ్=ఆ త్వష్టను, న ప్రతి ప్రాయచ్ఛన్=పత్నీదేవతలు దేవతలకు తిరిగి అప్పగించలేదు. తస్మాత్=ఆ కారణమువలన, వధ్యమపి=వధార్హుఁడైనను, ప్రపన్నమ్=శరణుచొచ్చినవానిని, న ప్రతి ప్రయచ్ఛన్తి=ప్రత్యర్పణము చేయుట లేదు. తస్మాత్=ఆ కారణమువలన, పాత్నీవతే=పాత్నీవత గ్రహమును, త్వష్ట్రే అపి=త్వష్ట కొఱకు కూడ, గృహ్యతే=గ్రహించఁబడుచున్నది. (పాత్నీవతే=పాత్నీవతమ్.)

తాత్పర్యము: పాత్నీవత గ్రహమునకు సంబంధించిన "సజూర్దేవేన త్వష్ట్రా సోమం పిబ స్వాహా" అను హోమ మంత్రమునందు త్వష్టృ శబ్ద ప్రయోగము యుక్తము కాదను శంకను ఈ బ్రాహ్మణ భాగము నివారించుచున్నది. దేవతలు త్వష్టను సంహరింప నుద్యుక్తులు కాఁగా అతఁడు పత్నీ దేవతలను శరణుచొచ్చెను. పత్నీదేవతలు తమ్ము శరణుచొచ్చిన త్వష్టను దేవతలకు తిరిగి ఈయలేదు. అందువలననే లోకమునందు తమ్మశరణు చొచ్చినవాఁడు నేరము చేయుటచే వధార్హుఁడైనను, వారు అతనిని తిరిగి అప్పగించుట లేదు. ఈ విధముగ త్వష్టకు పత్నీదేవతలతో సంబంధ ముండుటచే పాత్నీవత గ్రహ హోమమంత్రమునందు త్వష్టృ శబ్ద ముపాత్త మగుట యుక్తమే యని భావము.

12. అర్థము: "న సాదయత్యసన్నాద్ధి ప్రజాః ప్ర జాయన్తే" ఇది కా. 1, ప్ర. 4, అ. 22 నందు వ్యాఖ్యానించఁబడినది.

13. అర్థము: న అను వషట్ కరోతి=పాత్నీవత గ్రహమును హోమము చేయునప్పుడు మొదటి వషట్కారము ననుసరించి మఱల 'వషట్' అని చెప్పరాదు. అను వషట్ కుర్యాత్ యత్=అను వషట్కారము చేయునెడల, రుద్రం ప్రజాః అన్వవ సృజేత్=రుద్రుని పొంది ప్రజాసృష్టిని వారించినవాఁ డగును. న అను వషట్ కుర్యాత్ యత్=అను వషట్కారము చేయనిచో, అగ్నీత్ సోమమ్=ఆగ్నీధ్రుఁడు సోమమును, శాన్తమ్=అనిష్టకరముగా, భక్షయేత్=భక్షించును. (తత్=ఆ కారణమువలన, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,)ఉపాంశు అను వషట్ కరోతి=ఉపాంశువుగా అనువషట్కారమును చేయవలెను. (తదా=అప్పుడు,) రుద్రం ప్రజాః అన్వవసృజతి=రుద్రుని పొంది ప్రజాసృష్టిని వారించఁడు. అగ్నీత్ సోమమ్=ఆగ్నీధ్రుఁడు సోమమును, శాన్తమ్=ప్రశాంతమైనదిగా, భక్షయతి=భక్షించును.

తాత్పర్యము: పాత్నీవతమును హోమము చేయునపుడు అనువషట్కారము చేయరాదు. అనువషట్కారము చేయుచో నా యధ్వర్యుఁడు రుద్రుని పొంది ప్రజాసృష్టిని వారించినవాఁ డగును. అను వషట్కారము చేయనిచో ఆగ్నీధ్రుఁడు సోమమును అనిష్టముగ భక్షించును. కనుక ఉపాంశువుగా అను వషట్కారము చేయవలెను. అప్పుడు అధ్వర్యుఁడు రుద్రుని పొంది ప్రజా సృష్టిని వారించఁడు. ఆగ్నీధ్రుఁడు ప్రశాంతముగ సోమమును భక్షించును అగ్నీత్=ఆగ్నీధ్రుఁడు. ఇతఁడు ఒక ఋత్విజుఁడు.

14. అర్థము: "అగ్నీన్నేష్టు రుపస్థమా సీద నేష్టః పత్నీ ముదానయ" ఇతి ఆహ="ఓ ఆగ్నీధ్రుఁడా! నేష్టయొక్క సమీపమునకు వచ్చి కూర్చుండుము. ఓ నేష్టా! యజమాన పత్నిని లేపి తీసికొని రమ్ము." అని యధ్వర్యుఁడు ప్రైషమంత్ర మును చెప్పవలెను. అగ్నీదేవ=ఆగ్నీధ్రుఁడే, నేష్టరి =నేష్టయందు, రేతః=రేతస్సును, దధాతి=స్థాపించినవాఁ డగును. నేష్టా=నేష్ట, పత్నియామ్=యజమాన పత్నియందు, (రేతః దధాతి=రేతస్సును స్థాపించినవాఁ డగును. నేష్టా=నేష్ట ఒక ఋత్విజుఁడు.)

తాత్పర్యము: "అగ్నీన్నేష్టు రుపస్థమా సీద" "నేష్టః పత్నీ ముదానయ" అను ప్రైషమంత్ర ద్వయము నధ్వర్యుఁడు పలుకవలెను. ఈ ప్రైష మంత్ర ద్వయముచేత ప్రజోత్పాదన సామర్థ్యోపేతమైన రేతస్సు స్థాపించఁబడిన దగుచున్నది. ఇచట అగ్నీన్నేష్టలను గూర్చి అధ్వర్యునకు ప్రైష మంత్ర ద్వయము ఉత్పాదిత మైనది.

15. అర్థము: ఉద్గాత్రా=ఉద్గాతచేత, సం ఖ్యాపయతి=యజమాన పత్నిని దర్శింపఁజేయవలసినది. ఉద్గాతా యత్=ఉద్గాత యను ఏ ఋత్విజుఁడు కలఁడో, ఏషః=ఇతఁడు, ప్రజాపతిః వై=ప్రజాపతియే. ఏతత్=ఈ దర్శనము చేయించుట, ప్రజానామ్=ప్రజలయొక్క, ప్రజననాయ=ప్రకృష్టమైన ఉత్పత్తికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: నేష్ట యజమానపత్నిని ఉద్గాత యను ఋత్విజునిచే దర్శింపఁజేయవలెను. ఇది ప్రజోత్పత్తికి కారణ మగును. ఇచట నేష్టృ కారయితృకము, ఉద్గాతృ కర్తృకమునైన పత్నీవిషయ దర్శనము విధించఁబడినది.

16. అర్థము: (పత్నీ=యజమాన పత్ని,) అపః='పన్నేజనీ' సంజ్ఞకములైన జలములను, ఉప ప్ర వర్తయతి=సమీపమునకు తీసికొనిరావలెను. తత్=అప్పుడు, రేతః ఏవ=రేతస్సునే, సిఞ్చతి=సేచనము చేసిన దగును.

తాత్పర్యము: యజమాన పత్ని 'పన్నేజనీ' సంజ్ఞకములైన ఉదకములను సమీపమునకు తీసికొనిరావలెను. అట్లు చేసిన యజమాన పత్ని రేతస్సును సేచనము చేసిన ట్లగును. ఇచట పత్నీకర్తృకమైన పన్నేజనీ సంజ్ఞక జలకర్మక ప్రవర్తనము విధించఁబడినది.

17. అర్థము: ఊరుణా ఉప ప్రవర్తయతి=యజమాన పత్ని పన్నేజనీ సంజ్ఞకములైన ఉదకములను ఊరువుల సమీపమున ప్రవర్తింపఁజేయవలయును. ఊరుణా=ఊరువుచేత (ఊరుప్రదేశమునందు), రేతః=రేతస్సు, సిచ్యతే హి=సేచనము చేయఁబడుచున్నది కదా!

తాత్పర్యము: ఊరు ప్రదేశమునందు స్రవింపఁజేయఁబడిన రేతస్సు గుహ్య ప్రదేశ పర్యంతము ప్రవర్తించును. లోకమునందు కూడ ఊరు సహిత ప్రజననముచేత రేతస్సు ఉంచఁబడుచున్నది కదా! ఊరువు=తొడ. ప్రజననము=జననేంద్రియము. ఇచట 'పన్నేజనీ' సంజ్ఞక జలప్రక్షేపము చేయుటకు స్థానము విధించఁబడినది.

18. అర్థము: ఊరుమ్=ఊరువును, నగ్నంకృత్య=నగ్నముగా (వస్త్రాచ్ఛాదన రహితముగా)చేసి, ఉప ప్ర వర్తయతి=పన్నేజనీ జలమును ప్రవర్తింపఁజేయవలెను. యదా హి=ఎప్పుడైతే, ఊరుః=ఊరువు, నగ్నః భవతి=నగ్న మగునో, అథ=అనంతరము, మిథునీభవతి=దాంపత్యక్రియ అగుచున్నది. అథ=అనంతరము, రేతః=రేతస్సు, సిచ్యతే=సేచనము చేయఁబడుచున్నది. అథ=పిమ్మట, ప్రజాః=ప్రజలు, ప్ర జాయన్తే=పుట్టుచున్నారు.

**తాత్పర్యము:** ఊరువును నగ్నముగా చేసి అచట పన్నేజనీ జలమును ప్రవర్తింపఁజేయవలెను. ఊరువు నగ్నముగా అయినపిమ్మట మిథున కృత్యము జరుగును. అనంతరము రేతస్సు ఉంచఁబడును. అటుపిమ్మట ప్రజలు (సంతానము) పుట్టుదురు. ఇచట ఊరుప్రదేశమునందు వస్త్రాపనయనము విధించఁబడినది.

అష్టమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే నవమోఽనువాకః

మూలము: [1] ఇన్ద్రో వృత్ర మహన్తస్య శీర్షకపాల ముదౌబ్జత్స ద్రోణకలశోఽభవ త్తస్మాత్సోమః సమస్రవత్స హారి

యోజనోఽభవ [2] త్తం వ్యచికిత్సజ్జుహవానీ3 మా హౌషా3మితి సోఽమన్యత యద్ధోష్యామ్యామగ్ం

హోష్యామి యన్నహోష్యామి యజ్ఞవేశసం కరిష్యామీతి తమధ్రియత హోతుగ్ం సోఽగ్నిరబ్రవీన్న

మయ్యామగ్ం హోష్యసీతి తం ధానాభి రశ్రీణాత్ (౧)తగ్ం శృతం భూత మజుహో ద్యద్ధానాభి

ర్హారియోజనగ్ం శ్రీణాతి శృతత్వాయ శృతమేవైనం భూతం జుహోతి [3] బహ్వీభిః శ్రీణాత్యేతా

వతీ రేవాస్యాముష్మింల్లోకే కామదుఘా భవన్త్యథో ఖల్వాహురేతా వా ఇన్ద్రస్య పృశ్నయః కామదుఘా

యద్ధారియోజనీరితి తస్మాద్బహ్వీభిః శ్రీణీయా [4] దృక్సామే వా ఇన్ద్రస్య హారీ సోమపానౌ తయోః

పరిధయ ఆధానం యదప్రహృత్య పరిధీ ఞ్జుహుయా దన్తరాధానాభ్యామ్ (౨)ఘాసం ప్ర యచ్ఛేత్ప్ర

హృత్య పరిధీఞ్జుహోతి నిరాధానాభ్యామేవ ఘాసం ప్ర యచ్ఛ [5] త్యున్నేతా జుహోతి యాతయా

మేవ హ్యేతర్హ్యధ్వర్యుః స్వగాకృతో యదధ్వర్యు ర్జుహుయాద్యథా విముక్తం పునర్యునక్తి తాదృగేవ

త [6] చ్ఛీర్షన్నధినిధాయ జుహోతి శీర్షతో హి స సమభవ [7] ద్విక్రమ్య జుహోతి విక్రమ్య హీన్ద్రో వృత్ర

మహన్త్సమృద్ధ్యై [8] పశవో వై హారియోజనీ ర్యత్సంభిన్ద్యాదల్పాః (3)ఏనం పశవో భుఞ్జన్త ఉప తిష్ఠేర

న్యన్న సంభిన్ద్యా ద్బహవ ఏనం పశవో ఽభుఞ్జన్త ఉప తిష్ఠేరన్మనసా సం బాధత ఉభయం కరోతి

బహవ ఏవైనం పశవో భుఞ్జన్త ఉప తిష్ఠన్త [9] ఉన్నేతర్యుపహవ మిచ్ఛన్తే య ఏవ తత్ర సోమపీథ

స్త్రమేవావ రున్ధత 10 ఉత్తరవేద్యాం ని వపతి పశవో వా ఉత్తరవేదిః పశవో హారియోజనీః పశుష్వేవ

పశూన్ప్రతి ష్ఠాపయన్తి (౪)||

[అశ్రీణా దన్తరాధానాభ్యా మల్పాః స్థాపయన్తి||]

ఇతి కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమ ప్రపాఠకే నవమోఽనువాకః ||౯||

## వేదార్థదీపిక

అవతారిక: అష్టమానువాకమునందు పాత్నీవత గ్రహ మభిహిత మైనది. ఈ నవమానువాకమునందు హారియోజన గ్రహము విధించఁబడుచున్నది.

1. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రమ్=వృత్రుని, అహనత్=సంహరించెను. తస్య=ఆ వృత్రునియొక్క, శీర్షకపాలమ్=తలయందలి యెముక తునుక, ఉదౌబ్జత్=పైకి లేచెను. సః=అది, ద్రోణకలశః=ద్రోణకలశముగా, అభవత్=అయినది. తస్మాత్=దానినుండి, సోమః=సోమరసము, సమస్రవత్=స్రవించెను. సః=ఆ సోమరసము, హారియోజనః=హారియోజనము, అభవత్=ఆయెను.

తాత్పర్యము: పూర్వము ఇంద్రుఁడు వృత్రుని సంహరించెను. అప్పు డా వృత్రుని శిరస్సునందలి యెముక తునుక పైకి లేచి ద్రోణకలశ మాయెను. దానినుండి సోమరసము స్రవించెను. స్రవించిన సోమరసము హారియోజన మైనది. హారియోజన గ్రహ విధి యిచట అర్థవాదముచే ఉన్నయనము చేయఁబడినది. కావున ద్రోణకలశముచే హారియోజన గ్రహమును గ్రహించవలెనని యర్థము.

2. అర్థము: (ఇన్ద్రః=ఇంద్రుఁడు,) తమ్=ఆ హారియోజన గ్రహమును, జుహవాని3=హోమము చేయుదునా?, మా హౌషామ్=హోమము చేయకుందునా? ఇతి=అని, వ్యచికిత్సత్=సంశయించెను. "హోష్యామి యత్=హోమము చేయఁగలుగుచో, అమమ్=అపక్వమైన హారియోజనమును, హోష్యామి=హోమము చేయువాఁడను కాఁగలను. న హోష్యామి యత్=హోమము చేయకపోవుచో, యజ్ఞవేశసమ్=యజ్ఞవిఘాతమును, కరిష్యామి=చేయువాఁడ నగుదును. ఇతి=అని, సః=ఆ యింద్రుఁడు, అమన్యత=తలఁచెను." తమ్=ఆ గ్రహమును, హోతుమ్=హోమము చేయుటకై, అధ్రియత=నిశ్చయించెను. సః=ఆ, అగ్నిః=అగ్ని, అబ్రవీత్=పలికెను. "మయి=నాయందు, అమమ్=అపక్వమైనదానిని, న హోష్యసి=హోమము చేయవలదు, ఇతి=అని." తమ్=ఆ గ్రహమును, ధానాభిః=బొరుగులచే(వేఁపుడుబియ్యముచే), అశ్రీణాత్=వండెను. శ్రుతం భూతమ్=పక్వముగా అయిన, తమ్=ఆ గ్రహమును, అజుహోత్=హోమము చేసెను. ధానాభిః=బొరుగులచే, హారియోజనమ్=హారియోజనమును, శ్రీణాతి యత్=పక్వము చేసినచో, (తత్=ఆ ధానల మేళనము,) శ్రుతత్వాయ=పక్వమగుటకొఱకు, భవతి=అగుచున్నది. శ్రుతమ్ ఏవ భూతమ్ ఏనమ్=పక్వముగానే అయిన ఈ హారియోజన గ్రహమును, జుహోతి=హోమము చేయవలెను.

తాత్పర్యము: "ఈ హారియోజన గ్రహమును హోమము చేయుదునా? చేయకుందునా? హోమము చేయుదునేని అపక్వమైన గ్రహమును హోమము చేయువాఁడను కాఁగలను. హోమము చేయనిచో యజ్ఞవిఘాతము చేయువాఁడ నగుదును." అని యింద్రుడు విచికిత్స చేసి, హోమము చేయుటకై నిశ్చయించెను. అప్పు డగ్ని తనయందు

అపక్వ గ్రహమును హోమము చేయవలదని వారించఁగా, ఇంద్రుడు ఆ గ్రహమును (పేఁపుడు బియ్యముచే) బొరుగులచే పక్వము చేసి హోమము చేసెను. గ్రహమును బొరుగులతో పక్వము చేసినచో, అది పక్వము చేయుటకొఱకు కగును. కనుక పక్వమేయైన గ్రహమును హోమము చేయవలెను. ఇచట ధానల మేలనము విధించఁబడినది.

3. అర్థము: బహ్వీభిః=బహుధానలచే, శ్రీణాతి=పక్వము చేయవలెను. ఏతావతీధిరేవ=ఈ పక్వ ధానల సంఖ్యలచేతనే, అస్య=ఈ యజమానునకు, అముష్మిన్ లోకే=స్వర్గలోకమునందు, కామదుఘాః=కామధేనువులు, భవన్తి=అగుచున్నవి. అథో=మఱియు, హారియోజనీః యత్=హారియోజని ధానములు ఏవి కలవో, ఏతాః వై=ఇవియే, ఇన్ద్రస్య=ఇంద్రునకు, పృశ్నయః కామదుఘాః=అల్పతనువులైన కామధేనువులు, ఇతి=అని, ఆహుః ఖలు=మంత్రజ్ఞులు చెప్పుచున్నారు కదా! తస్మాత్=అ కారణమువలన, బహ్వీభిః=బహుధానలతో, శ్రీణీయాత్=పక్వము చేయవలెను.

తాత్పర్యము: బహుధానలచే హారియోజన గ్రహమును పక్వము చేయవలెను. ఎన్ని బొరుగులతో పక్వము చేయునో, ఈ యజమానునకు స్వర్గలోకమునందు అవి అన్ని(తావత్సంఖ్యాకములైన) కామధేనువు లగును. మఱియు ఈ హారియోజని ధానలే ఇంద్రునకు అల్పతనువులైన కామధేనువులని మంత్రజ్ఞులు చెప్పుచున్నారఁట. ఇచట ధానలయొక్క సంఖ్యాబాహుల్యము విధించఁబడినది. ఈ ధానలే యజమానునకు స్వర్గమున కామధేనువు లగునని భావము.

4. అర్థము: ఋక్సామే వై=ఋక్సామములే, ఇన్ద్రస్య=ఇంద్రునకు, సోమపానౌ=సోమమును త్రాగునటువంటి, హరీ=అశ్వములు. తయోః=ఆ యశ్వములకు, పరిధయః=పరిధులు, ఆధానమ్=కళ్లెము. పరిధీన్=పరిధులను, అప్రహృత్య=తీయక, జుహుయాత్ యత్=హోమము చేయుచో, అన్తరాధానాభ్యామ్=లోపల కళ్లెము కల అశ్వములకొఱకు, ఘాసమ్=లేఁతగడ్డిని, ప్రయచ్ఛేత్=ఇచ్చినవాఁ డగును. ప్రహృత్య=పరిధులను తీసివైచి, జుహోతి=హోమము చేయవలెను. నిరాధానాభ్యామేవ=కళ్లెములేని అశ్వములకొఱకే, ఘాసమ్=లేఁతగడ్డిని, ప్రయచ్ఛతి=ఇచ్చినవాఁడగును.

తాత్పర్యము: ఋక్సామములే ఇంద్రునకు సోమపానము చేయు గుఱ్ఱములు. హోమాధారమైన అగ్నికి చుట్టు పఱచఁబడి యుండునట్టి పరిధులను తీసివేయక గ్రహమును హోమము చేయుచో, ముఖమునకు కళ్లెమును బిగించియున్న అశ్వములకు లేఁతగడ్డి నొసఁగినవాఁ డగును. కనుక అగ్నికి నలువైపులందు పఱచఁబడియున్న పరిధులను తీసివైచి హోమము చేయవలెను. అప్పుడు కళ్లెము లేని అశ్వములకే ఘాసము నొసఁగినవాఁ డగును. ఇచట సవనీయ పశువునకు అంగములైన పరిధులు అగ్నికి చుట్టు పఱచఁబడి యుండును. ఆ సవనీయ పశువునకు సంబంధించిన పరిధులు పరిహృతములైన పిమ్మట హోమము చేయవలయునని హోమకాలము విధించఁబడినది. పరిధి పరిహరణానంతరము హోమము చేయుచో అశ్వములు కళ్లెములు లేనివగుటచే అవి సుఖముగ ఘాసము భక్షించుటకు సాధ్య మగును.

5. అర్థము: ఉన్నేతా=ఉన్నేత యను ఋత్విజుఁడు, జుహోతి=హోమము చేయవలెను. ఏతర్హి=ఈ సమయమున, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, స్వగాకృతః హి=స్వాధీనగతి కలవాఁడు కనుక, యాతయామా ఇవ=గతసారరూపు నివంటివాఁడు. అధ్వర్యుః=అధ్వర్యుఁడు, జుహుయాత్ యత్=హోమము చేయుచో, విముక్తమ్=విడువఁబడిన ఎద్దును, పునః=మఱల, యునక్తి యథా=కట్టివేయుట ఎటువంటిదో, తత్=అది, తాదృగేవ=అటువంటిదియే.

తాత్పర్యము: హారియోజన గ్రహమును ఉన్నేత యను ఋత్విజుఁడు హోమము చేయవలెను. హారియోజన గ్రహ హోమ సమయమునకు పూర్వమే యధ్వర్యుఁడు ప్రధాన గ్రహములను హోమము చేసియుండుటచే పారతంత్ర్యము లేదు కనుక అతఁడు స్వతంత్రుఁ డగును. అంతియ కాక అతఁడు అనేక ప్రధానగ్రహములను హోమము

చేసియుండుటచే గతసారునివలె నుండును. ఇచట అధ్వర్యుఁడు హోమము చేసినచో, ఒకమారు శకటము నకు కట్టి విడువఁబడిన ఎద్దును మఱల కట్టివేయుట యెటువంటిదియో, ఇచట అధ్వర్యుఁడు హోమము చేయుట అటువంటి దగును. ఇచట అధ్వర్యుఁడు కాక, ఉన్నేత హోమము చేయవలెనని చెప్పఁబడినది.

6. అర్థము: శీర్షన్ అధి=శిరస్సునందు, నిధాయ=ఉంచి, (తతః=పిమ్మట) జుహోతి=హోమము చేయవలెను. సః=ఆ హారియోజన గ్రహము, శీర్షతః=శిరస్సునుండి, సమభవత్ హి=సంభవించెను కదా!

తాత్పర్యము: హారియోజన గ్రహము హతుఁడైన వృత్రుని శిరస్సునుండి సంభవించిన దగుటచే హోమమునకు పూర్వము హారియోజన గ్రహమును ఉన్నేత తన శిరస్సున దుంచుకొని అనంతరము హోమము చేయవలెను.

7. అర్థము: విక్రమ్య=(ఆత్మప్రదక్షిణముగ)తిరిగి, జుహోతి=హోమము చేయవలెను. ఇన్ద్రః=ఇంద్రుఁడు, విక్రమ్య=(ఆత్మ ప్రదక్షిణముగ)తిరిగి, వృత్రమ్=వృత్రుని, అహన్ హి=సంహారించెను కదా! (ఏతత్=ఇది,) సమృద్ధ్యై=సమృ ద్ధికొఱకు, భవతి=అగును.

తాత్పర్యము: ఉన్నేత హోమకాలమునందు ఆశ్రావణ ప్రదేశమునకు కొంచెము పురోభాగమున (ఆత్మప్రదక్షిణముగ)తిరిగి హోమము చేయవలెను. ఇంద్రుఁడు ఆ విధముగ తిరిగియే వృత్రుని సంహారించెను కదా! ఇట్లు చేయుటవలన సమృద్ధి కలుగును. ఆత్మప్రదక్షిణము చేసి హోమము చేయవలెనని యిచట చెప్పఁబడినది.

8. అర్థము: హారియోజనీః=ధానములు(బొరుగులు), పశవః వై=పశుస్వరూపములే. సంభిన్ద్యాత్ యత్=(ధానములను) దంతములతో ఖండించినచో, అల్పాః పశవః=కొన్నిపశువులు, ఏనమ్=ఈ యజమానుని, భుఞ్జన్తః=క్షీర దానా దులచే పాలించుచున్నవియై, ఉప తిష్ఠేరన్=సేవించుచు(పొందును). న సంభిన్ద్యాత్ యత్=ధానములను దంతములతో ఖండించనిచో, బహవః పశవః=బహు పశువులు, ఏనమ్=ఈ యజమానుని, అభుఞ్జన్తః=క్షీరదా నాదులచే పాలించనివియై, ఉపతిష్ఠేరన్=పొందును. మనసా=మనస్సుచే, సంబాధతే=ధానములను చర్వణము చేయవలెను. ఉభయం కరోతి=ధాన సంభేదనము, అసంభేదనము, ఉభయమును చేసినవాఁ డగుచున్నాఁడు. బహవః పశవః ఏవ=బహు పశువులే, ఏనమ్=ఈ యజమానుని, భుఞ్జన్తః=క్షీర దానాదులచే పాలించుచు న్నవియై, ఉప తిష్ఠన్తే=సేవించును(పొందును).

తాత్పర్యము: హారియోజన ధానములు పశుప్రాప్తి హేతువు లగుటచే పశుస్వరూపములే యగును. యజమానుఁ డా ధాన ములను దంతములచే కొఱికి భక్షించినచో, కొన్ని పశువులు మాత్రమే ఈ యజమానుని క్షీర దానాదికముచే పాలించుచు సేవించును. ధానములను భక్షించనిచో బహుపశువులు లభించినను అవి యజమానుని క్షీరదా నాదికముచే పాలించక యుండును. కావున ధానములను మానసికముగ చర్వణము చేయవలెను. మానసిక చర్వణము చేయుటవలన భక్షణము చేసినట్లును, చేయనట్లును అగును. అప్పుడు పశువులన్నియు యజమా నుని క్షీర దానాదికముచే పోషించుచు సేవించుచుండును. భక్షణ సమయమున హారియోజన ధానములకు మానస చర్వణము విధించఁబడినది.

9. అర్థము: (సర్వే=ఋత్విజు లందఱు,) ఉన్నేతరి (విద్యమానం హుతశేషమ్ ఉద్దిశ్య)=ఉన్నేతృ హస్త గతమైన హుతశేష మునుద్దేశించి, ఉపహవమ్=ఉన్నేతయొక్క అనుజ్ఞను, ఇచ్ఛన్తే=కోరవలయును. తత్ర=అచ్చట, యః ఏవ=ఏది యైతే, సోమపీథః=పానము చేయఁదగిన సోమము, (అస్తి=కలదో,) తమేవ=హుతశేషమైన యా సోమమునే, అవ రున్ధతే=పొందుదురు.

తాత్పర్యము: ఋత్విజు లందఱు ఉన్నేతయొక్క హస్తమునందలి హుతశేషమైన సోమమును భక్షించుటకు ఉన్నేతయొక్క అనుజ్ఞను కోరవలెను. అప్పుడు వారు భక్షింపఁదగిన హుతశేష సోమమును పొందుదురు. ఉన్నేతృ హస్తగత హుతశేష సోమమును భక్షించుటకు ఋత్విజులు ఉన్నేతయొక్క అనుజ్ఞను పొందవలెనని ఇచట విధించఁబడినది.

10. అర్థము: ఉత్తరవేద్యామ్=ఉత్తరవేదియందు, ని వపతి=సర్వభక్షిత శేషములైన ద్రోణకలశ గత సోమరసముల నుంచవలయును. ఉత్తరవేదిః=ఉత్తరవేది, పశవః వై=పశువులే(పశుస్వరూపమే). హారియోజనీః=హారియోజన సోమములు, పశవః=పశుస్వరూపములు. (తదా=అప్పుడు,) పశుష్వేవ=పశువులయందే, పశూన్=పశువులను, ప్రతి ష్ఠాపయతి=ప్రతిష్ఠింపఁజేసినవాఁ డగును.

తాత్పర్యము: ఋత్విజులు భక్షింపఁగా మిగిలినవియు, ద్రోణకలశమునం దున్నటువంటియునైన సోమములను ఉత్తరవేదియం దుంచవలెను. పశువులు ఉత్తరవేది స్వరూపములే. హారియోజన సోమములు కూడ పశుస్వరూపములు. కావున, ఆ సోమశేషములను ఉత్తరవేదియం దుంచుటవలన పశువులను పశువులయందే ప్రతిష్ఠింపఁజేసినట్లగును. భక్షిత శేష సోమరసములకు ఉత్తరవేదియందు నినయనము ఇచట విధించఁబడినది.

నవమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే దశమో౽నువాకః

మూలము: [1]గ్రహాన్వా అను ప్రజాః పశవః ప్ర జాయన్త [2]ఉపాగ్ంశ్వన్తర్యామావజావయః శుక్రామన్థినౌ పురుషా
ఋతుగ్రహాన్ ఏకశఫా ఆదిత్యగ్రహం గావ [3]ఆదిత్యగ్రహో భూయిష్ఠాభి ర్ఋగ్భిర్గృహ్యతే తస్మాద్గావః
పశూనాం భూయిష్ఠా [4]యత్త్రిరుపాగ్ంశుగ్ంహస్తేన విగృహ్ణాతి తస్మాద్ద్వౌ త్రీనజా జనయ [5]త్యథా
వయో భూయసీః [6]పితా వా ఏష యదాగ్రయణః పుత్రః కలశో యదాగ్రయణ ఉపదస్యే త్కలశా
ద్గృహ్ణీయాద్యథా పితా (౧)పుత్రం క్షిత ఉపధావతి తాదృగేవ త [7]ద్యత్కలశ ఉపదస్యే దాగ్రయణా
ద్గృహ్ణీయాద్యథా పుత్రః పితరం క్షిత ఉపధావతి తాదృగేవ త[8]దాత్మా వా ఏష యజ్ఞస్య యదాగ్ర
యణో యద్గ్రహో వా కలశో వోపదస్యే దాగ్రయణా ద్గృహ్ణీయా దాత్మన ఏవాధి యజ్ఞం నిష్కరో
[9]త్యవిజ్ఞాతో వా ఏష గృహ్యతే యదాగ్రయణః స్థాల్యా గృహ్ణాతి వాయవ్యేన జుహోతి తస్మాత్
(౨)గర్భేణావిజ్ఞాతేన బ్రహ్మహా [10]౽వభృథమవ యన్తి పరా స్థాలీ రస్యన్త్యుద్వాయవ్యాని హరన్తి తస్మా
త్స్త్రియం జాతాం పరా౽స్యన్త్యుత్పుమాగ్ంసగ్ం హరన్తి [11]యత్పురోరుచమాహ యథా వస్యస ఆహ
రతి తాదృగేవ తద్యద్గ్రహం గృహ్ణాతి యథా వస్యస ఆహృత్య ప్రా౽౽హ తాదృగేవ తద్యత్సాదయతి
యథా వస్యస ఉపనిధాయాపక్రామతి తాదృగేవ త [12]ద్యద్వై యజ్ఞస్య సామ్నా యజుషా క్రియతే
శిథిలం తద్యదృచా తద్దృఢం పురస్తా దుపయామా యజుషా గృహ్యన్త ఉపరిష్టా దుపయామా ఋచా
యజ్ఞస్య ధృత్యై (౩)||

[యథా పితా తస్మాదపక్రామతి తాదృగేవ తద్యదష్టాదశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమ ప్రపాఠకే దశమో౽నువాకః ||౧౦||

# వేదార్థదీపిక

అవతారిక: నవమానువాకమునందు హారియోజన గ్రహ గ్రహణము విపులముగ చెప్పఁబడినది. ఈ దశమానువాకమునందు పూర్వోక్తము లయిన ఆగ్రయణాది గ్రహముల ప్రశంస చేయఁబడుచున్నది.

1. అర్థము: గ్రహాన్ అను వై=పూర్వోక్తములయిన గ్రహముల ననుసరించియే, ప్రజాః పశవః=ప్రజలు, పశువులు, ప్ర జాయన్తే=పుట్టుచున్నారు.

తాత్పర్యము: గ్రహముల ననుసరించియే ప్రజలు, పశువులు పుట్టుచున్నారు. గ్రహ హోమము సమాప్తము కాఁగా, ఇచట గ్రహ ప్రశంస చేయఁబడినది.

2. అర్థము: ఉపాంశ్వన్తర్యామౌ=ఉపాంశు గ్రహమును, అంతర్యామ గ్రహమును అనుసరించి, అజావయః=మేఁకలు, గొఱ్ఱెలు, ప్ర జాయన్తే=అధికముగ పుట్టుచున్నవి. శుక్రామన్థినౌ=శుక్రగ్రహ, మంథిగ్రహముల ననుసరించి, మనుష్యాః=మనుష్యులు, ప్ర జాయన్తే=అధికముగ పుట్టుచున్నారు. ఋతుగ్రహాన్=ఋతుగ్రహముల ననుసరించి, ఏకశఫాః=ఒకగొరిజ కల పశువులు, ప్రజాయన్తే. ఆదిత్యగ్రహమ్=ఆదిత్యగ్రహమును అనుసరించి, గావః= గోవులు, ప్రజాయన్తే పూర్వోక్త ప్రశంస ఇచట వివరించఁబడినది. తాత్పర్యము స్పష్టము.

3. అర్థము: ఆదిత్య గ్రహః=ఆదిత్య గ్రహము, భూయిష్ఠాభిః ఋగ్భిః=అనేక ఋక్కులచే, గృహ్యతే=గ్రహించఁబడుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, గావః=గోవులు, పశూనామ్=పశువులలో, భూయిష్ఠాః=అనేకములుగా, సన్తి=కలవు.

తాత్పర్యము: ఆదిత్య గ్రహము "కదా చన స్తరీరసి" ఇత్యాదులైన మూఁడు ఋక్కులను పఠించుచు గ్రహించవలెనని (కా. 6, ప్ర. 5, అ. 6.) చెప్పఁబడినది. పశువులలో గోవులు బహు సంఖ్యాకములు. ఈ విధముగ ఆదిత్య గ్రహ(గ్రహణ)మునకు గోవులకు బహుత్వ సంఖ్యా సామ్య ముండుటవలన ఆదిత్య గ్రహము ననుసరించి గోవులు పుట్టుచున్నవని మూఁడవ మంత్రమున చెప్పఁబడినది. ఏకభిన్న మనేకము కనుక, ఆదిత్య గ్రహము మూఁడు ఋక్కులచే గ్రహింపఁబడినను అనేక ఋక్కులని చెప్పఁబడినది.

4. అర్థము: ఉపాంశుమ్=ఉపాంశు గ్రహమును, త్రిః=మూఁడు మారులు, హస్తేన=హస్తముచే, విగృహ్ణాతి యత్=విశేషముగ గ్రహించవలెననుట యేది కలదో, తస్మాత్=ఆ కారణమువలన, అజా=మేఁక, ద్వౌ త్రీన్=రెండు లేక మూఁడింటిని, జనయతి=ఒక్కసారిగా పుట్టించుచున్నది(కనుచున్నది.)

తాత్పర్యము: ఉపాంశు గ్రహమును హస్తముతో మూఁడు మారులు గ్రహించవలెను. (ఈ విషయమే "యత్త్రిరుపాగ్ంశుగ్ం హస్తేన విగృహ్ణాతి" (కా. 6, ప్ర. 4, 5 వ అ.) మేఁకకు ఒక కాన్పులో రెండు లేక, మూఁడు పిల్లలు మాత్రమే పుట్టుచున్నవి. ఈ విధముగ త్రిత్వ సంఖ్యా సామ్యముచే ఉపాంశు గ్రహము ననుసరించి మేఁకలు పుట్టుచున్నవని రెండవ మంత్రమున చెప్పఁబడినది. ఇచట మేఁకలకు గ్రహముతో త్రిత్వ సామ్యము చూపఁబడినది.

5. అర్థము: అథ=అనంతరము, అవయః=గొఱ్ఱెలు, భూయసీః=అనేకములుగా, ఉత్పద్యన్తే=పుట్టుచున్నవి.

తాత్పర్యము: రెండవ మంత్రమున అంతర్యామ గ్రహము ననుసరించి గొఱ్ఱెలు పుట్టుచున్నవని చెప్పఁబడినది. నాల్గవ ప్రపాఠకములోని ఆఱవ యనువాకమునందు అంతర్యామ గ్రహములోనికి సోమరసమును గ్రహించవలెనని చెప్పఁబడినది. కాని అంతర్యామ గ్రహమునందు సోమరసము నెన్ని మారులు గ్రహించవలెనో సంఖ్యానియమము విధించఁబడలేదు. కావున అంతర్యామ గ్రహము ననుసరించి పుట్టునట్టి గొఱ్ఱెలు భూయిష్ఠములని ఇచట చెప్పఁబడినది. అనఁగా గొఱ్ఱెలు ఒక్కొక్క కాన్పునందే అనేకములను ప్రసవించునని భావము.

6. అర్థము: ఆగ్రయణః యత్=ఆగ్రయణము ఏది కలదో, ఏషః=ఈ గ్రహము, యజ్ఞస్య=యజ్ఞమునకు, పితా వై=తండ్రియే. కలశః=ద్రోణకలశము, పుత్రః=పుత్రస్థానీయము. ఆగ్రయణః=ఆగ్రయణ గ్రహము (సోమ

రసము), ఉపదస్యేత్ యత్=క్షీణించునెడల, కలశాత్=ద్రోణకలశమునుండి, గృహ్ణీయాత్=గ్రహించవలెను. క్షితః పితా=క్షీణించిన వృత్తి గల తండ్రి, యథా=ఏ విధముగ, పుత్రమ్ ఉపధావతి=(జీవనమునకై)కుమారుని అనుసరించునో, తత్=అది, తాదృగేవ=అటువంటిదే.

తాత్పర్యము: ఆగ్రయణ గ్రహము యజ్ఞమునకు పితృస్థానీయము. ద్రోణకలశము పుత్రస్థానీయము. ఆగ్రయణ గ్రహమునందలి సోమరసము క్షీణించినచో ద్రోణకలశమునుండి సోమరసమును గ్రహించవలెను. లోకమునందు తండ్రి తన జీవనోపాధి క్షీణించినపుడు జీవనమునకై కుమారు ననుసరించు విధముగనే యిచట కూడ యజ్ఞమునకు తండ్రివంటి ఆగ్రయణ గ్రహములోని సోమము క్షీణించినపుడు పుత్రునివంటి ద్రోణకలశమునుండి సోమరసమును గ్రహించవలెనని భావము. ఇచట ఆగ్రయణ సోమము క్షీణించినపుడు ద్రోణకలశమునుండి గ్రహణము విధించఁబడినది.

7. అర్థము: కలశః=ద్రోణకలశము(నందలి సోమరసము), ఉపదస్యేత్ యత్=క్షీణించునెడల, ఆగ్రయణాత్=ఆగ్రయణ గ్రహమునుండి, గృహ్ణీయాత్=గ్రహించవలెను. క్షితః=క్షీణవృత్తియైన, పుత్రః=కుమారుఁడు, యథా=ఏ విధముగ, పితరమ్=తండ్రిని, ఉపధావతి=(స్వజీవనమునకై)అనుసరించుచున్నాఁడో, తత్=అది, తాదృగేవ=అటువంటిదియే.

తాత్పర్యము: ద్రోణకలశమునందలి సోమరసము క్షీణించినచో, ఆగ్రయణ గ్రహమునుండి సోమరసమును గ్రహించవలెను. కుమారుఁడు తన జీవనోపాధి క్షీణించినపుడు తండ్రి నాశ్రయించి జీవించుచున్నాఁడు కదా! ఇది కూడ అటువంటిదే. ఇచట ద్రోణకలశ సోమక్షయము సంభవించినపుడు ఆగ్రయణమునుండి సోమరస గ్రహణము విధించఁబడినది.

8. అర్థము: ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహ మేది కలదో, ఏషః=ఇది, యజ్ఞస్య=యజ్ఞమునకు, ఆత్మా వై=ఆత్మస్థానీయ మైనదే. గ్రహః వా=గ్రహము కాని, కలశః వా=ద్రోణకలశము కాని, ఉపదస్యేత్ యత్=నశించునెడల, ఆగ్రయణాత్=ఆగ్రయణ గ్రహమునుండి, గృహ్ణీయాత్=సోమరసమును గ్రహించవలెను. (అనేన=ఈ గ్రహణముచేత) ఆత్మనః ఏవ అధి=ఆత్మకు పైభాగమునందే, యజ్ఞమ్=యజ్ఞమును, నిష్కరోతి=(మఱల) సంధానము చేసినవాఁ డగును.

తాత్పర్యము: ఆగ్రయణ గ్రహము యజ్ఞ మధ్యవర్తి యగుటచే యజ్ఞమునకు ఆత్మవంటి దగును. గ్రహమునందలి సోమరసము కాని, ద్రోణకలశమునందలి సోమరసము కాని, క్షీణించినచో, ఆగ్రయణ గ్రహమునుండి గ్రహించవలెను. నష్టమైన యజ్ఞమును ఏతద్గ్రహణముచే ఆత్మపైని మఱల సంధానము చేసినవాఁ డగును. ఇచట కలశ న్యాయము గ్రహమునందు కూడ చూపఁబడినది.

9. అర్థము: ఆగ్రయణః యత్=ఆగ్రయణ గ్రహ మేది కలదో, ఏషః=ఇది, అవిజ్ఞాతః వై=స్వదేవతానామవిశేషముచే తెలియఁబడనిదియేయై, గృహ్యతే=గ్రహించఁబడుచున్నది. స్థాల్యా=మృణ్మయ పాత్రముచే, గృహ్ణాతి=సోమరసమును గ్రహించవలెను. వాయవ్యేన=వాయుదేవతాకమైన దారుపాత్రముచే, జుహోతి=హోమము చేయవలెను. తస్మాత్=ఆ కారణమువలన, అవిజ్ఞాతేన గర్భేణ=అజ్ఞాత వ్యక్తిచే ఏర్పడిన గర్భముచే, బ్రహ్మహా=(పుట్టిన) సంతానమును విడచినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఆగ్రయణ గ్రహ గ్రహణము నాల్గవ ప్రపాఠకమునందలి పదునొకండవ యనువాకమునందు విహిత మైనది. అచట ఆగ్రయణ గ్రహమునకు ఏ దేవతయో, ఆ దేవతయొక్క నామము నిర్దేశించఁబడలేదు. "యే దేవా దివ్యేకాదశ స్థ" అను మంత్రమును పఠించుచు ఆగ్రయణ గ్రహమును గ్రహించవలెనని చెప్పఁబడినది. ఈ మంత్రమునందు దేవతల నామవిశేషము తెలియుట లేదు. "ఆ వాయో భూషా" ఇత్యాది మంత్రములందు వాయ్వాది దేవతల నామవిశేషములు తెలియబడుచున్నవి. కావున ఆగ్రయణము అవిజ్ఞాతము. మఱియు అది

మృణ్మయ పాత్రము. అందువలన మృణ్మయమైన ఆగ్రయణ గ్రహమునకు సాదనమే కాని, హోమము లేదు. వాయుదేవతాకమైన దారుపాత్రముచే హోమము విధించఁబడినది. అజ్ఞాత నామవిశేష దేవతాకము కావున ఆగ్రయణ గ్రహము హోమమున కర్హము కానిదగుటచే పరిత్యక్తమైనది. లోకమునందు భర్త పరవాసమున కేగినపుడు భార్యకు జారునివలన గర్భము కలుగఁగా ఆ గర్భమునుండి పుట్టిన బిడ్డకు తండ్రి యెవరో తెలియకుండుటచే భర్త ఆ బిడ్డను విడుచును. అప్పుడతఁడు 'బ్రహ్మాహ' అనఁబడుచున్నాఁడు. అట్టిదియే ఇది కూడ. (బ్రహ్మ జహాతి=పరిత్యజతీతి బ్రహ్మాహా. "ఓ హాక్=త్యాగే" అను ధాతువు. ఇచట శ్రుతి ఆగ్రయణ స్థాలికి హోమసాధనత్వము లేకుండుటచే దానిని నిందించుచు హోమసాధనమైన దారుపాత్రమును ప్రశంసించినది.)

10. అర్థము: (యదా=ఎప్పుడు,) అవభృథమ్=అవభృథమును గూర్చి, యన్తి=(యజమానుఁడు అధ్వర్యుఁడు మున్నగువారు) వెళ్లుచున్నారో, (తదా=అప్పుడు,) స్థాలీః=ఉక్థ్య ధ్రువాదిత్యాగ్రయణ స్థాలులను నాల్గింటిని, పరాస్యన్తి=వేది యందే పరిత్యజించుచున్నారు. వాయవ్యాని=వాయుదేవతాకములైన దారుపాత్రములను, ఉద్ధరన్తి=అవభృథ ప్రదేశమునకు తీసికొనిపోవుచున్నారు. తస్మాత్=ఆ కారణమువలన, జాతాం స్త్రియమ్=పుట్టిన స్త్రీసంతానమును, పరాస్యన్తి=(వివాహముచే వరునికులమునందు) పరిత్యజించుచున్నారు. పుమాంసమ్=పురుష సంతానమును, ఉద్ధరన్తి=బాగుగ పోషించుచున్నారు.

తాత్పర్యము: జ్యోతిష్టోమాది యాగముల సమాప్తియందు అవభృథ మనెడి ఒక కర్మవిశేషమును చేయుదురు. యజమానుఁడు, అధ్వర్యుఁడు మున్నగువారు ఆ అవభృథ ప్రదేశమునకు పోవునపుడు అంతకు పూర్వము ఉపయోగించిన పాత్రములలో ఆగ్రయణము, ఉక్థ్యము, ధ్రువ, ఆదిత్యము అనెడి స్థాలులను వేదియందే పరిత్యజించి వాయుదేవతాకములైన దారుపాత్రములను తీసికొని పోవుదురు. ఈ విషయమున ఒక లోకదృష్టాంతము చూపఁబడినది. లోకమున తల్లిదండ్రులు తమకు కలిగిన కుమార్తెలను వివాహము చేసి వరుని గృహమునందు విడిచిపెట్టుచున్నారు. కుమారులను బాగుగ పోషించుచున్నారు. ఇచట ప్రకారాంతరముగ దారుపాత్ర ప్రశంస చేయఁబడినది.

11. అర్థము: పురోరుచమ్ ఆహ యత్=పురోరుక్కును చెప్పె ననుట యేది కలదో, తత్=అది, 'వస్యసే=ధనవంతుఁడైన రాజుకొఱకు, యథా ఆహరతి=కానుకను ఏవిధముగ తీసికొనివచ్చుచున్నాఁడో;' తాదృగేవ=అటువంటిదియే. గ్రహమ్=సోమరస పూరితమైన పాత్రమును, గృహ్ణాతి యత్=గ్రహించుచున్నాఁ డనుట యేది కలదో, తత్=అది, 'వస్యసే=ధనవంతుఁడైన రాజుకొఱకు, ఆహృత్య=కానుకను తెచ్చి, యథా ప్రాహ=ఇదియే నేను ఈయఁగలిగిన కానుక అని యేవిధముగ చెప్పుచున్నాఁడో,' తాదృగేవ=అటువంటిదే. సాదయతి యత్=గ్రహమును సాదనము చేయుచున్నాఁ డనుట యేది కలదో, తత్=అది, 'వస్యసే=ధనవంతుఁడైన రాజుకొఱకు, ఉపనిధాయ=కానుకను తెచ్చి యెదుట ఉంచి, యథా అపక్రామతి=ఏ విధముగ తొలఁగి పోవుచున్నాఁడో,' తాదృగేవ=అటువంటిదే.

తాత్పర్యము: "ఆ వాయో భూష శుచిపా ఉప నః సహస్రం తే నియుతో విశ్వవార।—దేవ దధిషే పూర్వపేయమ్।," "ఉపయామగృహీతోఽసి వాయవే త్వేన్ద్రవాయూ ఇమే సుతాః ——వాముశన్తి హి" ఈ మంత్రములలో "ఉపయామగృహీతోఽసి" అను ఐంద్ర వాయవ గ్రహ గ్రహణ మంత్రమునకు పూర్వము "ఆ వాయో భూష" ఇత్యాదికమైన ఋక్కు ఉన్నది కావున ఇది పురోరుక్ అయినది. "ఉపయామగృహీతోఽసీన్ద్రవాయుభ్యాం త్వైష తే యోనిః సజోషాభ్యాం త్వా" ఇది గ్రహసాదనమంత్రము. లోకమునందు ధనికులైన రాజామాత్యాదులకు తత్పాలితులైన ప్రజలు కానుకను తెచ్చి, ఇదియే నేను ఈయఁగలిగినది అని చెప్పి దానిని ఆ రాజామాత్యాదుల యెదుట ఉంచి వెళ్లిపోవుదురు. ఈ లోకదృష్టాంతమే ఇచట చూపఁబడినది.

ఇచట పురోరుక్కు రాజుకొఱకు కానుకను తెచ్చుట వంటిది. గ్రహణ మంత్రము 'ఇదియే నేను ఈయఁగలిగిన కానుక' అని చెప్పుటవంటిది. సాదన మంత్రము రాజునెదుట కానుక నుంచుటవంటిది. ఈ పురోరుగాది మంత్ర త్రయము కా. 1, ప్ర. 4, చతుర్థానువాకమునందు కలదు. ఆ మంత్ర త్రయము అచటనే వ్యాఖ్యానించఁబడినది. ఇచట పురోరు గ్రహణ సాదనములు లౌకిక దృష్టాంత పూర్వకముగ ప్రశంసించఁబడినవి.

12. అర్థము: యజ్ఞస్య=యజ్ఞముయొక్క, యత్ వై=ఏ అంగమైతే, సామ్నా=సామముచేత, యజుషా=యజుస్సుచేత, క్రియతే=చేయఁబడుచున్నదో, తత్=అది, శిథిలమ్(ఇవ)=శిథిలమైనదివలె, భవతి=అగుచున్నది. ఋచా=ఋక్కుచేత, యత్=ఏ యంగము, క్రియతే=చేయఁబడుచున్నదో, తత్=అది, దృఢమ్=దృఢమైనది. పురస్తాత్ ఉపయామాః=పూర్వపు గ్రహములు, యజుషా=యజుస్సుచే, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవి. ఉపరిష్టాత్ ఉపయామాః=అనంతర గ్రహములు, ఋచా=ఋక్కుచే, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవి. (ఏతత్=ఈ ఉభయము,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, ధృత్యై=దార్ఢ్యముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: "ఆ వాయో భూష" ఇత్యాది ఋక్కు పురోరుక్కుగా పూర్వమంత్రమున చెప్పఁబడినది. ఈ ఋక్కునకు పూర్వము "ఉపయామ గృహీతో ఉన్తర్యచ్ఛ మఘవన్పాహి" (కా. 1, ప్ర. 4, అ. 3.) అను యజుస్సుచే అంతర్యామ గ్రహము గ్రహించఁబడుట చెప్పఁబడినది. ఈ అంతర్యామగ్రహము యజుస్సుచే గ్రహించఁబడును. కావున ఈ యజుస్సు శిథిలమైనదివలె నుండును. దీనికి దృఢత్వము కలుగుటకై ఉపరిభాగమున "ఆ వాయో భూష" ఇత్యాది ఋక్కుచే ఐంద్ర వాయవ గ్రహము చెప్పఁబడినది. ఋక్కు స్వయముగనే దృఢమైనది. ఉపయామ మనఁగా మృణ్మయ పాత్రము కాని, దారుమయపాత్రము కాని కావచ్చును. ఈ ఉభయము యజ్ఞముయొక్క దృఢత్వము కొఱకు అగును. ఇచట యజు స్సామములను నిందించుచున్నదివలె శ్రుతి పురోరుక్కును ప్రశంసించినది.

దశమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే పఞ్చమ ప్రపాఠకే ఏకాదశోఽనువాకః

మూలము: [1]ప్రాన్యాని పాత్రాణి యుజ్యన్తే నాన్యాని [2]యాని పరాచీనాని ప్రయుజ్యన్తేఽముమేవ తైర్లోకమభి జయతి పరాఙివ హ్యసౌ లోకో యాని పునః ప్రయుజ్యన్త ఇమమేవ తైర్లోకమభి జయతి పునః పునరివ హ్యయం లోకః [3]ప్రాన్యాని పాత్రాణి యుజ్యన్తే నాన్యాని యాని పరాచీనాని ప్రయుజ్యన్తే తాన్యన్వో షధయః పరా భవన్తి యాని పునః (౧)ప్రయుజ్యన్తే తాన్యన్వోషధయః పునరా భవన్తి [4]ప్రాన్యాని పాత్రాణి యుజ్యన్తే నాన్యాని యాని పరాచీనాని ప్రయుజ్యన్తే తాన్యన్వారణ్యాః పశవోఽరణ్యమప యన్తి యాని పునః ప్రయుజ్యన్తే తాన్యను గ్రామ్యాః పశవో గ్రామ ముపావయన్తి [5]యో వై గ్రహాణాం నిదానం వేద నిదానవా న్భవత్యాజ్యమిత్యుక్థం తద్వై గ్రహాణాం నిదానం యదుపాగ్ంశు శగ్ంసతి తత్ (౨)ఉపాగ్ంశ్వన్తర్యామయో ర్యదుచ్చై స్తదితరేషాం గ్రహాణా మేతద్వై గ్రహాణాం నిదానం య ఏవం వేద నిదానవాన్భవతి [6]యో వై గ్రహాణాం మిథునం వేద ప్ర ప్రజయా పశుభి ర్మిథునై ర్జాయతే స్థాలీభిరన్యే గ్రహా గృహ్యన్తే వాయవ్యైరన్య ఏతద్వై గ్రహాణాం మిథునం య ఏవం వేద ప్ర ప్రజయా పశుభి ర్మిథునై ర్జాయత [7]ఇన్ద్రి స్త్వష్టుః సోమ మభీషహాఽపిబత్స విష్వఙ్ (3)వ్యార్ఛత్స ఆత్మన్నారమణం నావిన్దత్స ఏతాననుసవనం పురోడాశా నపశ్య త్తాన్నిరవపత్తై ర్వై స ఆత్మన్నార మణ మకురుత తస్మాదనుసవనం పురోడాశా నిరుప్యన్తే తస్మాదనుసవనం పురోడాశానాం ప్రాశ్నీయా దాత్మన్నేవాఽఽరమణం కురుతే నైనగ్ం సోమోఽతిపవతే [8]బ్రహ్మవాదినో వదన్తి నర్చా న యజుషా

పఙ్క్తిరాప్యతేఽథ కిం యజ్ఞస్య పాఙ్క్తత్వమితి ధానాః కరమ్భః పరివాపః పురోడాశః పయస్యా తేన

పఙ్క్తిరాప్యతే తద్యజ్ఞస్య పాఙ్క్తత్వమ్ (౪)||

[భవన్తి యాని పునః శగ్ంసతి తద్విష్వఞ్చం చతుర్దశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమప్రపాఠక ఏకాదశోఽనువాకః ||౧౧||

ఇన్ద్రో వృత్రాయాఽఽయుర్వై యజ్ఞేన సువర్గాయేన్ద్రో మరుద్భిరదితిరన్తర్యామపాత్రేణ ప్రాణ ఉపాగ్ం

శుపాత్రేణేన్ద్రో వృత్రమహన్తస్య గ్రహాన్వై ప్రాన్యాని పాత్రాణ్యేకాదశ||౧౧||

ఇన్ద్రో వృత్రాయ పునరృతునాఽఽహ మిథునం పశవో నేష్టః పత్నీముపా గ్ంశ్వన్తర్యామయో ర్ద్విచ

త్వారిగ్ంశత్ ||౪౨||

హరిః ఓమ్|

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే పఞ్చమః ప్రపాఠకః||౬||

## వేదార్థదీపిక

అవతారిక: దశమానువాకమునందు ఆగ్రయణాది గ్రహములకు పునర్గ్రహత్వము చెప్పఁబడినది. ఈ యేకాదశానువాకము నందు సోమపాత్రస్తుతి చేయఁబడుచున్నది.

1. అర్థము: అన్యాని పాత్రాణి=ఇతరములైన(కొన్ని)సోమరసముతో నిండిన పాత్రములు, ప్ర యుజ్యన్తే=ప్రకర్షముగ నను ష్ఠించఁబడుచున్నవి. అన్యాని=ఇతరములైన (మఱికొన్ని) పాత్రములు, న యుజ్యన్తే=అనుష్ఠించఁబడుట లేదు.

తాత్పర్యము: ఉపాంశ్వంతర్యామాది పాత్రములు కొన్ని ప్రాతః సవనమునందు ప్రయోగించఁబడి, మఱల తృతీయ సవన మునందుఁ గూడ ప్రయోగించఁబడుచున్నవి. అనఁగా ఈ పాత్రముల ప్రయోగము ఆవృత్త మగుచున్నది. మఱికొన్ని పాత్రములు ఒక పర్యాయమే ప్రయోగించఁబడుచున్నవి. ఈ పాత్రముల ప్రయోగము ఆవృత్త మగుట లేదు. ఇవి ఐంద్రవాయవాది ద్విదేవత్య గ్రహములు. ఇచట సోమపాత్రములను ప్రశంసించుటకు అవి రెండు విధములుగా విభజింపఁబడినవి.

2. అర్థము: యాని=ఏ పాత్రములు, పరాచీనాని=ఆవృత్తములు కానివిగా, ప్రయుజ్యన్తే=ప్రయోగించఁబడుచున్నవో, తైః=ఆ సోమరస పాత్రములచే, అముమేవ=స్వర్గలోకమునే, అభిజయతి=అభిముఖముగ పొందుచున్నాఁడు. అసౌ లోకః=స్వర్గలోకము, పరాఙ్ ఇవ హి=అనావృత్తమువంటిది కదా! యాని=ఏ సోమ పాత్రములు, పునః ప్రయుజ్యన్తే=మఱల ప్రయోగించఁబడుచున్నవో, తైః=ఆ పాత్రములచే, ఇమం లోకమేవ=ఈ భూలో

కమునే, అభి జయతి=అభిముఖముగ పొందుచున్నాఁడు. అయం లోకః=ఈ భూలోకము, పునః పునః ఇవ హి=ఆవృత్తమువంటిది కదా!

తాత్పర్యము: యాగకర్త యజ్ఞమునందు సోమ పాత్రముల నొక్క పర్యాయము ప్రయోగించుటచేత స్వర్గమునే పొందును. స్వర్గము ఆవృత్తి లేనిది. అనఁగా స్వర్గమునందున్నవానికి జన్మాంతరమునందు కూడ స్వర్గము నొందుటకు ప్రయత్న ముండదని భావము. పౌనఃపున్యముగ పాత్రప్రయోగముచేత యజ్వ మఱల మఱల ఈ లోకమునే పొందును. మనుష్య లోకమునందున్నవానికి దీనికై మఱల ప్రయత్నము చేయుట యుండును. ఇచట పాత్ర ప్రయోగావృత్తిచే భూలోక జయము కలుగునని ప్రశంస చేయఁబడినది.

3. అర్థము: అన్యాని, పాత్రాణి, ప్రయుజ్యన్తే. అన్యాని, న ప్రయుజ్యన్తే. యాని పరాచీనాని, ప్రయుజ్యన్తే. (అర్థము పూర్వోక్తము.) తాని అను=అనావృత్తములైన యా పాత్రముల ననుసరించి, ఓషధయః=ఓషధులు, పరా భవన్తి=ఫలపాక సమయమునందు వినాశరూప పరాభవము నొందుచున్నవి. యాని=ఏ పాత్రములు, పునః ప్రయుజ్యన్తే=ఒకమారు ప్రయోగించిన పిమ్మట మఱల ప్రయోగించఁబడుచున్నవో, తాని అను=ఆ పునరా వృత్త ప్రయోగము గల పాత్రముల ననుసరించి, ఓషధయః=ఓషధులు, పునః ఆ భవన్తి=సంవత్సరాంతమున ఫలోత్పత్తి కలవగుచున్నవి.

తాత్పర్యము: యజ్ఞమునందు సోమ పాత్రములు కొన్ని సకృత్ప్రయోగము కలవి. మఱికొన్ని పునఃప్రయోగము కలవి. సకృత్ప్రయోగము కల పాత్రముల ననుసరించి ఓషధులు ఫలవంతములు కావలసిన సమయమున ఫలవం తము లగుట లేదు. పునరావృత్త ప్రయోగము కల పాత్రముల ననుసరించి సకాలమున ఫలోత్పత్తి కలవి యగుచున్నవి. (ఇచట మఱియొకరీతిలో సోమపాత్ర ప్రశంస చేయఁబడినది.)

4. అర్థము: అన్యాని, పాత్రాణి, ప్రయుజ్యన్తే. అన్యాని, న ప్రయుజ్యన్తే. యాని, పరాచీనాని, ప్రయుజ్యన్తే. (అర్థము పూర్వోక్తము.) తాని అను=అనావృత్తములయిన యా సోమ పాత్రముల ననుసరించి, ఆరణ్యాః పశవః=అరణ్యమున సంచరించు వ్యాఘ్రాది పశువులు, అరణ్యమ్=అరణ్యమును గూర్చి, అపయన్తి=పోవుచు న్నవి. యాని=ఏ పాత్రములు, పునః ప్రయుజ్యన్తే=మఱల ప్రయోగించఁబడుచున్నవో, తాని అను=ఆవృత్త ప్రయోగము గల యా పాత్రముల ననుసరించి, గ్రామ్యాః=గ్రామమున సంచరించు గవాది పశువులు, గ్రామమ్ ఉపావయన్తి=గ్రామమును గూర్చి తిరిగి వచ్చుచున్నవి.

తాత్పర్యము: పునరావృత్త ప్రయోగము లేని పాత్రముల ననుసరించి అరణ్యమున సంచరించునట్టి వ్యాఘ్రాది పశువులు అరణ్యముననే తిరుగుచుండును. పునరావృత్త ప్రయోగము గల పాత్రముల ననుసరించి గ్రామ్యములైన గవాది పశువులు తృణాదికమును తినుటకు అరణ్యమునకు పోయి మఱల గ్రామమునకు తిరిగి వచ్చుచున్నవి. ఇచట సోమపాత్రములు మఱియొకవిధమున ప్రశంసించఁబడినవి.

5. అర్థము: యః వై=ఎవఁడైతే, గ్రహాణామ్=గ్రహములయొక్క, నిదానమ్=మూలకారణమును, వేద=తెలిసికొనునో, (సః=అతఁడు,) నిదానవాన్=తనకు మూలహేతువులైన మాతాపిత్రాదులతో కూడియున్నవాఁడు, భవతి=అగును. ఆజ్యమితి ఉక్థమ్=ఆజ్యప్రఉగాదినామకమైన శస్త్రము, తత్ వై=అదియే, గ్రహాణామ్=గ్రహ ములయొక్క, నిదానమ్=(ప్రశంసాద్వారా గ్రహానుష్ఠాన ప్రయోజక మగుటచే) మూలకారణము. యత్=ఏ శస్త్రమును, ఉపాంశు=ఉపాంశు స్వరముగా, శంసతి=గానము చేయునో, తత్=అది, ఉపాంశ్వన్తర్యా మయోః=ఉపాంశు గ్రహ, అంతర్యామ గ్రహములకు, నిదానమ్=నిదానము, యత్=ఏ శస్త్రమును, ఉచ్చైః=ఉచ్చైస్స్వరముతో, శంసతి=గానముచేయునో, తత్=ఆ శస్త్రము, ఇతరేషాం గ్రహాణామ్=ఉపాంశ్వం

తర్యామ గ్రహములకంటె నితరములైన గ్రహములకు, నిదానమ్=మూలకారణము. ఏతత్ వై=ఇదియే, గ్రహాణామ్=గ్రహములకు, నిదానమ్=మూలకారణము. యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈవిధముగ, వేద=తెలిసికొనునో, సః=అతఁడు, నిదానవాన్=నిదానవంతుఁడు, భవతి=అగును.

తాత్పర్యము: పూర్వోక్తములైన గ్రహములకు మూలకారణమైన ఆజ్యప్రఉగాదినామక శస్త్రమును తెలిసికొనిన యతఁడు మూలహేతువులైన మాతా పితృ స్వాములతో కూడియుండినవాఁ డగును. శస్త్రములలో ఉపాంశు స్వరముతో గానము చేయఁబడు శస్త్రము ఉపాంశు గ్రహ, అంతర్యామ గ్రహములకు మూలకారణము. ఉచ్చై స్స్వరముతో గానము చేయఁబడు శస్త్రము తదితర గ్రహములకు మూలకారణము. ఈ విధముగ తెలిసికొనిన యతఁడు తనకు మూలహేతువులైన మాతా పితృ స్వాములతో కూడియున్నవాఁ డగును. (ఇచట శస్త్రము ప్రశంసించఁబడినది.)

6. అర్థము: యః వై=ఎవఁడైతే, గ్రహాణాం మిథునమ్=గ్రహములయొక్క జంటను, వేద=తెలిసికొనెనో, (సః=అతఁడు,) ప్రజయా=సంతానముచేతను, పశుభిః=పశువులచేతను, మిథునైః=జంటలతో, ప్ర జాయతే=ప్రకర్షముగా పుట్టును (కూడియుండును). స్థాలీభిః=స్త్రీరూపములైన మృణ్మయ స్థాలులచే, అన్యే గ్రహాః=ఇతరములైన(కొన్ని)ఆగ్రయణ ఉక్థ్యాది గ్రహములు, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవి. వాయవ్యైః=పురుష రూపములైన వాయవ్య పాత్రములచే, అన్యే=ఇతరములైన (కొన్ని)గ్రహములు, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవి. ఏతత్ వై=ఇదియే, గ్రహాణామ్=గ్రహముల జంట. యః=ఎవఁడు, ఏవమ్=ఈ విధముగ, వేద=తెలిసికొనెనో, (సః=అతఁడు,) ప్రజయా, పశుభిః, మిథునైఃప్రజాయతే.

తాత్పర్యము: పూర్వోక్తములైన గ్రహముల మిథునమును తెలిసికొనిన యతఁడు స్త్రీ పురుష రూప సంతానముతోను, ఆఁడు మగ పశువులతోను కూడియుండును. ఆగ్రయణ·ఉక్థ్యాది గ్రహముల సోమరసములు స్త్రీరూపములైన (స్త్రీలింగవాచకములైన) మృణ్మయ స్థాలులచే గ్రహించఁబడుచున్నవి. ఉపాంశ్వంతర్యామ గ్రహముల సోమరసములు పురుష రూపములైన వాయవ్య గ్రహములచే గ్రహించఁబడుచున్నవి. ఇదియే గ్రహముల మిథునము. ఈ విధముగ తెలిసికొనిన యతఁడు ప్రజామిథునముతోను, పశుమిథునముతోను కూడియుండును. "య ఏవం వేద' అను వాక్యము ఉపసంహారమును(ముగింపును)సూచించుటకై పునరుక్త మైనది. ఇచట స్థాలీ వాయవ్య రూప ద్వంద్వము ప్రశంసించఁబడినది.

7. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, త్వష్టుః=త్వష్టయొక్క (యజ్ఞమునందు), సోమమ్=సోమరసమును, అభీషహా=బలవంతముగ, అపిబత్=త్రాగెను. సః=ఆ యింద్రుఁడు, విష్వఙ్=వివిధములుగా తిరుగుటవలన, వ్యార్ఛత్=విశేషముగ బాధ నొందెను. సః=ఆ యింద్రుఁడు, ఆత్మన్=తనయందు, ఆరమణమ్=సుఖమును, న అవిన్దత్=పొందలేదు. సః=అతఁడు, అనుసవనమ్=సవనముల ననుసరించి, ఏతాన్ పురోడాశాన్=ఈ పురోడాశములను (నిర్వాపము చేయవలసినవిగా), అపశ్యత్=చూచెను (తెలిసికొనెను). తాన్=ఆ పురోడాశములను, నిరవపత్=నిర్వాపము చేసెను. తైః వై=ఆ పురోడాశములచేతనే, సః=ఆ యింద్రుఁడు, ఆత్మన్=తనయందు, ఆరమణమ్=సుఖమును, అకురుత=చేసెను(పొందెను). తస్మాత్=ఆ కారణమువలన, అనుసవనమ్=సవనముల ననుసరించి, పురోడాశాః=పురోడాశములు, నిరుప్యన్తే=నిర్వాపము చేయఁబడవలెను. తస్మాత్=ఆ కారణమువలన, అనుసవనమ్=ప్రతిసవనమునందు, పురోడాశానామ్=నిరుప్త శేషములైన పురోడాశములను, (కర్మణి షష్ఠీ.) ప్రాశ్నీయాత్=భక్షించవలెను. (తదా=అప్పుడు,) ఆత్మన్=తనయందు, ఆరమణమ్=సుఖమును, కురుతే=చేయును(పొందును). ఏనమ్=ఈ యజ్వను, సోమః=సోమము, న అతి పవతే=ఉదరమున ఇటునటు సంచారముచే బాధించదు.

తాత్పర్యము: ఇంద్రుఁడు త్వష్టృకుమారుఁడైన విశ్వరూపుని చంపుటవలన త్వష్ట ఇంద్రునాహ్వానించకుండ యజ్ఞము చేయ నారంభించెను. ఇంద్రుఁడు ఆ యజ్ఞమునకు వచ్చి బలాత్కారముగ సోమమును త్రాగెను. బలాత్కారముగ

త్రాగఁబడిన ఆ సోమము ఇంద్రుని యుదర మధ్యమం దిటునటు తిరుగుచు నతనిని వివిధముగ బాధించుటచే ఇంద్రుఁ డా సోమపానమువలన సుఖము నొందలేకపోయెను. అప్పు డా యింద్రుఁడు యజ్ఞమునందలి సవన త్రయమునందును పురోడాశములను నిర్వాపము చేసినచో సుఖము కలుగునని తెలిసికొని సవన త్రయమునం దును పురోడాశములను నిర్వాపము చేసెను. ఆ పురోడాశ నిర్వాపముచే నతఁడు సుఖము నొందెను. కావున సవన త్రయమునందు యజ్వ పురోడాశములను నిర్వాపము చేయవలెను. ప్రతిసవనమునందును నిర్వాపము చేయఁగా మిగిలిన పురోడాశమును భక్షించవలెను. అప్పు డతని యుదరమునందలి సోమము ఇటునటు తిరిగి బాధించదు. ఇచట సవనీయ పురోడాశములు విధింపఁబడినవి.

8. అర్థము: ఋచా=ఋక్కుచేత, పఙ్క్తిః=పంచసంఖ్య, న ఆప్యతే=పొందఁబడుట లేదు. యజుషా=యజుస్సుచే, న ఆప్యతే=పంచసంఖ్య పొందఁబడుట లేదు. అథ=అప్పుడు, యజ్ఞస్య=యజ్ఞమునకు, పాఙ్క్తత్వమ్=పాంక్త త్వము (పంచసంఖ్యావత్త్వము), కిమ్ ఇతి=ఏమిటి? అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచు న్నారు (ప్రశ్నించుచున్నారు). ధానాః=వేఁపుడుబియ్యము (బొరుగులు), కరమ్భః=నేతితో కలిపిన పేల పిండి, (పెరుఁగుతో కలిపిన పేలపిండి యని పక్షాంతరము.) పరివాపః=ధాన్యజన్యములైన పేలాలు, పురోడాశః=పిష్టవికారము, పయస్యా=క్షీరవికారము, తేన=ఆ ఐదింటి సముదాయముచే, పఙ్క్తిః=పంచసంఖ్య, ఆప్యతే=పొందఁబడుచున్నది. తత్=అది, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, పాఙ్క్తత్వమ్=పంచసంఖ్యావత్త్వము.

తాత్పర్యము: "పాఙ్క్తో యజ్ఞః" అని శ్రుతి. "పఞ్చాక్షరా పఙ్క్తిః" అని యామ్నాతమై యున్నది. ఋక్కుచేఁగాని, యజుస్సుచేఁగాని నియతముగ పంచసంఖ్య సిద్ధించుట లేదు. పంచసంఖ్య సిద్ధించనిచో "పాఙ్క్తో యజ్ఞః" యజ్ఞము పాంక్తము కానేరదు. యజ్ఞమునకు పాంక్తత్వము ఎట్లు? అని మంత్రజ్ఞులు ప్రశ్నించుచున్నారు. యజ్ఞమునందు హవిర్ద్రవ్యములుగా 'ధానములు, కరంభము, పరివాపము, పురోడాశము, పయస్య' అను ఈ అయిదు ద్రవ్యములు వినియోగించఁబడుచున్నవి. కావున ఈ అయిదింటిచేతనే "పాఙ్క్తో యజ్ఞః" అను శ్రుత్యుక్తి ప్రకారముగ యజ్ఞమునకు పాంక్తత్వము సిద్ధించుచున్నది. ఇచట సవనీయ పురోడాశములందు పంచద్రవ్యవిధి అర్థవాద రూపమున అభిహిత మైనది.

ఏకాదశానువాకము సమాప్తము

పఞ్చమ ప్రపాఠకము పరిసమాప్తము

# అథ షష్ఠకాణ్డే షష్ఠః ప్రపాఠకః

## తత్ర ప్రథమోఽనువాకః

### హరిః ఓమ్

మూలము: [1]సువర్గాయ వా ఏతాని లోకాయ హూయన్తే యద్దాక్షిణాని [2]ద్వాభ్యాం గార్హపత్యే జుహోతి ద్విపా ద్యజమానః ప్రతిష్ఠిత్యా అగ్నీధ్రే జుహోత్యన్తరిక్ష ఏవాఽఽక్రమతే [3]సదోఽభ్యైతి సువర్గమేవైనం లోకం గమయతి [4] సౌరీభ్యా మృగ్భ్యాం గార్హపత్యే జుహోత్యము మేవైనం లోకగ్ం సమారోహయతి నయ వత్యర్చాఽఽగ్నీధ్రే జుహోతి సువర్గస్య లోకస్యాభినీత్యై [5]దివం గచ్ఛ సువః పతేతి హిరణ్యమ్ (౧) హుత్వోద్గృహ్ణాతి సువర్గమేవైనం లోకం గమయతి [6]రూపేణ వో రూప మభ్యైమీత్యాహ రూపేణ హ్యేసాగ్ం రూప మభ్యైతి యద్ధిరణ్యేన [7]తుథోవో విశ్వవేదా వి భజత్విత్యాహ తుథో హ స్మ వై విశ్వ వేదా దేవానాం దక్షిణా వి భజతి తేనైవైనా వి భజ [8]త్యేతత్తే అగ్నే రాధః(౨) ఐతి సోమచ్యుత మిత్యాహ సోమచ్యుతగ్ం హ్యస్య రాధ ఐతి [9]తన్మిత్రస్య పథా నయేత్యాహ శాన్త్యా [10]ఋతస్య పథా ప్రేత చన్ద్రదక్షిణా ఇత్యాహ సత్యం వా ఋత గ్ం సత్యేనైవైనా ఋతేన వి భజతి [11]యజ్ఞస్య పథా సువితా నయన్తీరిత్యాహ యజ్ఞస్య హ్యేతాః పథా యన్తి యద్దక్షిణా [12] బ్రాహ్మణమద్య రాధ్యాసమ్ (3) ఋషిమార్షేయ మిత్యాహైష వై బ్రాహ్మణ ఋషి రార్షేయో యః శుశ్రువాన్ తస్మాదేవ మాహ [13]వి సువః పశ్య వ్యన్తరిక్ష మిత్యాహ సువర్గమేవైనం లోకం గమయతి [14]యతస్వ సదస్యై

రిత్యాహ మిత్రత్వాయా[15]స్మద్రాత్రా దేవత్రా గచ్ఛత మధుమతీః ప్రదాతారమా విశతేత్యాహ వయ

మిహ ప్రదాతారః స్మోఽస్మానముత్ర మధుమతీరా విశతేతి (౪) వావైతదాహ [16]హిరణ్యం దదాతి

జ్యోతిర్వై హిరణ్యం జ్యోతిరేవ పురస్తాద్ధత్తే సువర్గస్య లోకస్యానుఖ్యాత్యా [17]అగ్నీధే దదాత్యగ్నిముఖా

నేవర్తూ న్ప్రీణాతి [18]బ్రహ్మణే దదాతి ప్రసూత్యై హోత్రే దదాత్యాత్మా వా ఏష యజ్ఞస్య యద్ధోతా

ఽఽత్మానమేవ యజ్ఞస్య దక్షిణాభిః సమర్ధయతి (౬) ||

[హిరణ్యగ్ం రాధో రాధ్యాసం మధుమతీః విశతేత్యష్టాత్రిగ్ంశతిశ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే ప్రథమోఽనువాకః||౧||

## వేదార్థదీపిక

అవతారిక: పంచమ ప్రపాఠకమునందు జ్యోతిష్టోమమునందు అభిషుతమైన సోమరసముతో నిండియున్న ఉపాంశ్వాది గ్రహ (పాత్ర)ముల గ్రహణము మున్నగు నంశములు వివిధములు విధించఁ బడినవి. ఆ యా గ్రహముల గ్రహణము విషయమున వినియోగించవలసిన మంత్రములు ప్రథమ కాండమునందలి చతుర్థ ప్రపాఠకమునందు ఆమ్నాతము లైనవి. జ్యోతిష్టోమమునందు యజమానునకు సహాయకులుగానున్న ఋత్విజుల కీయవలసిన దక్షిణలను గూర్చి షష్ఠ ప్రపాఠకమునందలి యీ ప్రథమానువాకమున చెప్పఁ బడుచున్నది.

1. అర్థము: దక్షిణాని యత్=దక్షిణలు ఏవి కలవో, ఏతాని=ఇవి, సువర్గాయ లోకాయ వై=స్వర్గలోకముకొఱకే, హూయన్తే=హోమము చేయఁబడుచున్నవి.

తాత్పర్యము: ఋత్విజులకు స్వర్ణములు దక్షిణలుగా నీయవలసియున్నవి. దక్షిణలగా నిచ్చుటకు పూర్వము ఆ స్వర్ణములను హోమము చేయవలెను. ఆ హోమమువలన యజ్వకు స్వర్గము లభించును. ఇచట దక్షిణా హోమము విధించఁ బడినది.

2. అర్థము: ద్వాభ్యామ్=(వక్ష్యమాణములైన) రెండు ఋక్కులచేత, గార్హపత్యే=గార్హపత్యాగ్నియందు, జుహోతి=హోమము చేయవలెను. యజమానః= యజమానుఁడు, ద్విపాత్=రెండు పాదములు కలవాఁ డు. (అయమ్=ఈ హోమము,) ప్రతిష్ఠిత్యై=యజమానునియొక్క ప్రతిష్ఠకొఱకు, (భవతి=అగుచున్నది.) ఆగ్నీధ్రే=ఆగ్నీధ్ర స్థానీయమైన అగ్నియందు, జుహోతి= హోమము చేయవలెను. అన్తరిక్షే ఏవ=అంతరిక్షమునందే, ఆక్రమతే= ఆక్రమించినవాఁ డగును.

తాత్పర్యము: (వక్ష్యమాణములైన రెండు ఋక్కులను పఠించుచు దక్షణార్థములైన హిరణ్యములను గార్హపత్యాగ్నియందు హోమము చేయవలెను. యజమానుఁడు రెండు పాదములు కలవాఁ డు కనుక ఈ ఋక్కులచే హోమము

చేయుటవలన అతనికి ప్రతిష్ఠ (గట్టి ఉనికి) లభించును. 'అగ్నే నయ' ఇత్యాది ఋక్కుచే ఆగ్నీధ్ర స్థానీయమైన అగ్నియందు హోమము చేయవలెను. ఈ హోమమువలన యజమానుఁడు అంతరిక్షము నాక్రమించినవాఁ డగును. ఇచట హోమాధికరణము విధించఁబడినది.

3. అర్థము: సదః=సదోమండపమును, అభ్యేతి=పొందవలెను. ( అయమ్=ఈ సదోమండప ప్రవేశము,) ఏనమ్=ఈ యజమానుని, సువర్గం లోకమ్= స్వర్గలోకమును, గమయతి ఏవ=తప్పక పొందించును.

తాత్పర్యము: ఆగ్నీధ్ర హోమానంతరము యజ్వ సదోమండపమున ప్రవేశించవలెను. ఈ సదోమండప ప్రవేశము యజమానునకు స్వర్గమును లభింపఁ జేయును. పూర్వమంత్రమున ఆగ్నీధ్ర హోమమువలన యజ్వ అంతరిక్షము నాక్రమించుననియు, ఇచట సదః ప్రవేశమువలన నతనికి స్వర్గప్రాప్తి కలుగుననియు, ఈ సదః ప్రవేశము ఆగ్నీధ్ర హోమానంతరము చేయవలెననియు జెప్పఁబడినది. అనఁగా యజ్వ ప్రథమమున అంతరిక్షము నాక్రమించి పిమ్మట స్వర్గమునకు పోవునని యర్థము. ఇచట సదః ప్రవేశము విహిత మైనది.

4. అర్థము: సౌరీభ్యామ్ ఋగ్భ్యామ్=సూర్య సంబంధములైన రెండు ఋక్కులచే, గార్హపత్యే=గార్హపత్యాగ్నియందు, జుహోతి=హోమము చేయవలెను. (అయమ్=ఈ హోమము,) ఏనమ్=ఈ యజమానుని, అముం లోకమేవ= స్వర్గలోకమునే, సమారోహయతి=బాగుగ ఆరోహింపఁజేయును. నయవత్యా ఋచా='నయ' శబ్ద ఘటితమైన ఋక్కుచేత, ఆగ్నీధ్రే=ఆగ్నీధ్ర స్థానీయమైన అగ్నియందు, జుహోతి=హోమము చేయవలెను. (అయమ్=ఈ హోమము,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, అభినీత్యై=పొందించుటకొఱకు, భవతి= అగుచున్నది.

తాత్పర్యము: ఈ దక్షిణా హోమమున వినియోగింపవలసిన మంత్రములు ప్రథమ కాండములోని చతుర్థప్రపాఠకమునఁ గల నలువది మూఁ డవ అనువాకమునం దామ్నాతము లైనవి. ఆ యనువాకమునందలి మొదటి రెండు ఋక్కులు సూర్యసంబంధము లైనవి. ఆ రెండు ఋక్కులను పఠించుచు దక్షిణా హిరణ్యములను గార్హపత్యాగ్ని యందు హోమము చేయవలెను. ఈ ఋక్కులచే చేసిన హోమము యజమానుని స్వర్గము నారోహింపఁ జేయును. ఆ రెండు ఋక్కుల యనంతరము 'నయ' శబ్ద ఘటిత ఋక్కు కలదు. దానిని పఠించుచు ఆగ్నీధ్ర స్థానీయమైన అగ్నియందు హోమము చేయవలెను. ఈ హోమము యజమానుని స్వర్గమునకుఁ గొనిపోవును.

సౌరిఋక్కులు: "(1) ఉదు త్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః। దృశే విశ్వాయ సూర్యమ్", (2) "చిత్రం దేవానాముదగాదనీకం చక్షు ర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆ ప్రా ద్యావాపృథివీ అన్తరిక్షగ్ం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ".

తాత్పర్యము: 1. సర్వ జగత్తును చూచుటకై కిరణము లగ్నిసదృశుఁ డైన యా సూర్యదేవుని ఊర్ధ్వప్రదేశమునందు గొనిపోవుచున్నవి. 2. అగ్ని మిత్ర వరుణాది ప్రాణి సమూహమునకు చక్షు స్థానీయ మైనదియు, సైన్య సదృశ మైనదియునగు కిరణ మండలము ఉదయించుచున్నది. ఆ మండలమునందలి సూర్యుఁడు స్థావర జంగమాత్మకమైన సర్వ ప్రపంచమునకు ఆత్మ యగుచు లోకత్రయమును పూరించెను.

నయవతి ఋక్కు: (1) "అగ్నే నయ సుపథా రాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్। యుయోధ్యస్మ జ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ"

తాత్పర్యము: ఓ యగ్నీ! నీవు పారలౌకిక ధన ప్రాప్తికై మమ్ము సన్మార్గమునఁ గొనిపొమ్ము. ఓ దేవా! నీవు సర్వమార్గములను తెలిసినవాఁడవు. కుటిలమైన పాపమును మానుండి తొలఁగించుము. నీకు గొప్పదియైన నమస్కారోక్తిని చేయుదుము. (నమస్కరించెదము). ఈ ఋక్కులన్నియు ప్రథమ కాండమున విపుల

ముగ వ్యాఖ్యానించఁబడినవి. ఆ ప్రథమ కాండమున ఆమ్నాతములైన మంత్రముల కిచట వినియోగము చెప్పఁబడినది.

5. అర్థము: "దివం గచ్ఛ సువః పత" ఇతి="ఓ హిరణ్యమా! నీవు ఆకాశమును గూర్చి పొమ్ము. పిమ్మట స్వర్గమును పొందుము." అను మంత్రముచేత, హిరణ్యమ్=సువర్ణమును, హుత్వా=హోమము చేసి, ఉత్ గృహ్ణాతి=అగ్ని నుండి పైకి తీయవలెను. (ఏతత్=ఇది,) ఏనమ్=ఈ యజమానుని, సువర్గం లోకమ్= స్వర్గలోకమును, గమయతి=పొందించును.

తాత్పర్యము: పూర్వోక్తములైన మూఁడు ఋక్కులకు పిమ్మట "దివం గచ్ఛ సువః పత" అను మంత్ర భాగము ఆమ్నాత మైనది. ఈ మంత్ర భాగమును చదువుచు హోమానంతరము అగ్నినుండి హోమము చేయఁబడిన స్వర్ణమును పైకి తీయవలెను. 'హిరణ్యమును మూట కట్టి ఆజ్యమునందుంచి హిరణ్య సహిత ఘృతమును హోమము చేయవలెనని యీ హోమము పూర్వము విహిత మైనది. ఆ హిరణ్యమును పైకి తీయవలెన నియు, ఇట్లు చేయుటవలన యజమానునకు స్వర్గప్రాప్తి కలుగుననియు నిచట చెప్పఁ బడినది'.

6. అర్థము: "రూపేణ వో రూప మభ్యైమి" ఇతి ఆహ="ఓ దక్షిణలారా! అగ్నినుండి ఉద్ధరించఁబడిన హిరణ్య రూప ముచేత వేదికి దక్షిణ భాగముననున్న మీయొక్క రూపము నభిముఖముగ పొందుచున్నాను." అని శ్రుతి చెప్పినది. హిరణ్యేన=హిరణ్యముచే, యత్=ఏ రూపమును, అభ్యైతి=పొందుచున్నాఁడో, రూపేణ=అ రూపముచే, ఆసామ్=వేదికి దక్షిణ భాగముననున్న ఈ హిరణ్యములయొక్క, రూపమ్=రూపమును, అభ్యైతి హి=పొందుచున్నాఁడు కదా! అని శ్రుతి చెప్పినదని సమన్వయము.

తాత్పర్యము: అగ్నినుండి తీయఁబడిన హిరణ్యరూపము వేదికి దక్షిణభాగమున హోమము చేయఁ బడక ఉన్నట్టి హిర ణ్యముల రూపముతో సమానముగానే యున్నదనియు ఆ హిరణ్యరూపమునే నేను పొందుచున్నాననియు భావము. ఇది యజమానోక్తి. ఈ మంత్రభాగమును పఠించుచు యజమానుఁడు దక్షిణార్థమైన హిరణ్య మును తీసికొనవలెను. ఇందు వినియోగించఁబడిన మంత్రము లన్నియు "ఉదుత్యం జాతవేదసమ్" అను అనువాకమునం దామ్నాతము లైనవే.

7. అర్థము: "తుథో వో విశ్వవేదా వి భజతు" ఇతి ఆహ="ఓ దక్షిణలారా! స్వర్గమునం దధివసించియున్న సర్వజ్ఞుఁ డైన 'తుథ' నామక దేవుఁడు మిమ్ము విభజించుఁగాక" అని శ్రుతి చెప్పినది. విశ్వవేదాః=సర్వజ్ఞుఁ డైన, తుథః=తుథుఁడను దేవుఁడు, దేవానామ్=దేవతలకు, దక్షిణాః=దక్షిణలను, విభజతి స్మ వై హ=విభజించియే యున్నాఁడఁట కదా! తేనైవ=ఆ తుథదేవునిచేతనే, ఏనాః=ఈ దక్షిణలను, విభజతి=విభజింపఁజేసినవాఁ డగును.

తాత్పర్యము: స్వర్గమునం దధివసించియున్న సర్వజ్ఞుఁడైన తుథ నామక దేవుఁడు దేవతల యజ్ఞమునందు దక్షిణలగా నీయవలసిన హిరణ్యములను విభజించెనఁట యని శ్రుతి చెప్పినది. యజమానుఁడు "తుథో వో విశ్వవేదా విభజతు" అను మంత్రమును పఠించుటచే ఆ తుథదేవుఁడే ఈ యజమానుని యజ్ఞమునందు ఋత్విజులలో ఎవరికెవరికి ఎంతెంత ఈయవలెనో, ఆ విధముగ దక్షిణార్థమైన హిరణ్యములను విభజించునని యిచట స్పష్టము చేయఁబడినది.

8. అర్థము: "ఏతత్తే అగ్నే రాధ ఐతి సోమచ్యుతమ్" ఇతి ఆహ="ఓ యగ్నీ! నీకు సమృద్ధి కారణమును, సోమయాగ మునందు ప్రాప్త మైనదియునగు ఈ దక్షిణాద్రవ్యము వచ్చుచున్నది" అని వేదము చెప్పినది. అస్య=ఈ యగ్నికి, రాధః= సమృద్ధి కారణమైన, సోమచ్యుతమ్=సోమయాగమునందు ప్రాప్తమైన దక్షిణాద్రవ్యము, ఐతి హి=వచ్చుచున్నది కదా!

తాత్పర్యము: ఓ యగ్నీ! నీకు సమృద్ధి కారణ మైనదియు, సోమయాగమునందు ప్రాప్త మైనదియునగు దక్షిణా ద్రవ్యము వచ్చుచున్నదని వేదము చెప్పినది. ఈ దక్షిణాద్రవ్యము సోమయాగమునందు ప్రాప్త మగుటచే పవిత్రమైనది. ఇచట సోమచ్యుతత్వము దక్షిణాద్రవ్యము ప్రశస్తమని చెప్పినది.

9. అర్థము: "తన్మిత్రస్య పథా నయ" ఇతి ఆహ="ఓ యగ్నీ! ఆ దక్షిణా ద్రవ్యమును శాంతుఁడవైన నీయొక్క మార్గముచే పొందించుము." అని వేదము చెప్పినది. ( ఏతత్=ఈ కథనము,) శాన్త్యై=శాంతికొఱకు, (భవతి=అగుచున్నది.)

తాత్పర్యము: "తన్మిత్రస్య" అను మంత్రభాగము "ఏతత్తే అగ్నే" అను మంత్రములోని శేషభాగము. "తుథో రుద్రోఽగ్నిః" అగ్ని రుద్రరూపుఁ డని ఈ శ్రుతి చెప్పుచున్నది. అగ్నికి శాంతరూపము రుద్రరూపము కూడ కలవు. అగ్ని తనరుద్రరూపముయొక్క మార్గముచే దక్షిణాద్రవ్యమును పొందించినచో అశాంతి యేర్పడును. ఆ విధముగ కాకుండుటకై శాంతరూపుఁ డైన యగ్నియొక్క మార్గముచే పొందించవలెనని యీ బ్రాహ్మణము చెప్పుచున్నది.

10. అర్థము: "ఋతస్య పథా ప్రేత చన్ద్రదక్షిణాః" ఇతి ఆహ="ఓ సువర్ణాది రూప దక్షిణలారా! సత్యముయొక్క మార్గముచే వెళ్లుఁ డు" అని వేదము చెప్పినది. ఋతమ్=ఋత శబ్దార్థము, సత్యం వై=సత్యమే. ( తత్=ఆ కారణముచే,) సత్యేనైవ=సత్యఫలకుఁడైన దేవునిచేతనే, ఏనాః=ఈ దక్షిణాద్రవ్యములను, ఋతేన=సత్యమార్గముచే, విభజతి=విభజించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: "ఋతస్య పథా" ఇత్యాది మంత్రమునందలి ఋత శబ్దము సత్యార్థకమే యని చెప్పుటచే, సత్యఫలకుఁ డైన దేవునిచేతనే యజమానుఁడు దక్షిణాద్రవ్యములను సత్యమార్గముచే విభజించినవాఁ డగును. మంత్రమునందలి 'ఋత' శబ్దము ఇచట యజ్ఞవాచకము కాదనియు, సత్యవాచక మనియు ఈ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది. ఋత్విజులలో ముఖ్యులైన అర్హులకు యథోచితముగ సువర్ణదక్షిణలను యజమానుఁ డు విభజించుచున్నాఁడని భావము.

11. అర్థము: "యజ్ఞస్య పథా సువితా నయన్తీః" ఇతి ఆహ="శోభన గమనము కల యజ్ఞపురుషునియొక్క మార్గముచే పొందించఁబడిన ఓ చంద్రదక్షిణలారా!" అని వేదము చెప్పినది. దక్షిణాః యత్=యజ్ఞమునందు ఋత్విజుల కీయవలసిన దక్షిణ లేవి కలవో, ఏతాః=ఈ దక్షిణాద్రవ్యములు, యజ్ఞస్య= యజ్ఞపురుషునియొక్క, పథా=మార్గముచేత, యన్తి హి=పోవుచున్నవి కదా!

తాత్పర్యము: సదోమండప గార్హపత్యాగ్నుల మధ్యమందలి మార్గము యజ్ఞపురుషుని మార్గము. దక్షిణలగా నీయవలసిన యీ పూర్వోక్తములైన హిరణ్యములను యజ్ఞపురుషుని మార్గముద్వారా దక్షిణ భాగమునుండి ఉత్తర భాగమునకు కొనిపోఁ బడునని యీ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది.

12. అర్థము: "బ్రాహ్మణమద్య రాధ్యాస మృషి మార్షేయమ్" ఇతి ఆహ= "నేను (యజ్వ) వేదార్థవేత్తయు, వేదార్థవిదుని కూమారుఁ డునగు బ్రాహ్మణుని ఈ దినమునందు హిరణ్యముచే సంతోషపఱచుదును" అని వేదము చెప్పినది. యః శుశ్రువాన్=ఎవఁడు వేద శాస్త్ర పారంగతుఁడో, ఏషః వై=ఇతఁడే, ఋషిః=వేదార్థవేత్తయు, ఆర్షేయః=వేదార్థవిదుని కుమారుఁడునగు, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు. తస్మాత్=ఆ కారణమువలన, ఏవమ్=ఈ విధముగ, ఆహ=చెప్పెను.

తాత్పర్యము: యజ్ఞకర్త యజ్ఞపరిసమాప్తి అయినపిమ్మట ఋషియు, ఆర్షేయుఁ డునగు బ్రాహ్మణుని హిరణ్యముచే సంతోషపరచుదునని చెప్పను. ఆ మంత్రమునందలి 'ఋషి' 'ఆర్షేయ' అను పదములకు వేదశాస్త్ర పారంగతుఁ డను అర్థము వివక్షింపఁబడినదని యీ బ్రాహ్మణము చెప్పినది.

13. అర్థము: "వి సువః పశ్య వ్యన్తరిక్షమ్" ఇతి ఆహ="ఓ యజమానుఁడా! స్వర్గమును, అంతరిక్షమును కూడ విశేష ముగ చూడుము." అని వేదము చెప్పుటచే, ఏనమ్=ఈ యజమానుని, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, గమయత్యేవ=తప్పక పొందించును.

తాత్పర్యము: "వి సువః పశ్య వ్యంతరిక్షమ్" అనుమంత్రమువలన దక్షిణ ఈ యజమానుని స్వర్గమును పొందించునని యీ బ్రాహ్మణము చెప్పుచున్నది.

14. అర్థము: "యతస్వ సదస్యైః" ఇతి ఆహ="ఓ యజమానుఁడా! సదస్సునందు ఉన్నటువంటి బ్రాహ్మణులతోఁ గూడ అనుసరించి ఉండుము" అని వేదము చెప్పినది. (ఏవమ్ ఉక్తిః=ఇట్లు చెప్పుట) మిత్రత్వాయ=మైత్రి కొఱకు, (భవతి= అగుచున్నది.)

తాత్పర్యము: సదస్సులతోడి మైత్రి సిద్ధించుటకై "ఓ యజమానుఁ డా! నీవు సదస్సునందున్న విప్రులతో ననుసరించి యుండుమని యతస్వేత్యాది మంత్రమున కర్థమని యీ బ్రాహ్మణము చెప్పినది."

15. అర్థము: "అస్మద్రాత్రా దేవత్రా గచ్ఛత మధుమతీః ప్రదాతారమా విశత" ఇతి ఆహ="ఓ దక్షిణలారా! మాచే ఈయఁబడినవారగుచు దేవఋత్విక్కులందు వెళ్లుఁడు. ఓ గోవులారా! మధుర క్షీరములు కలవారై పరలోకమునందు ప్రదాతయగు యజమానుని రూపాంతరమున ఆవహించుఁడు." అని వేదము చెప్పినది. ఓ గోవులారా! వయమ్=( యజమానులమైన) మేము, ఇహ=ఇచట (ఈ లోకమునందు,) ప్రదాతారః స్మ= ప్రకృష్టముగ దానము చేసినవారల మైతిమి. అస్మాన్=మమ్ము, అముత్ర= స్వర్గలోకమున, మధు మతీః=మధుర క్షీరములతోఁ గూడినవార లగుచు, ఆవిశత ఇతి (రూపాంతరముచే) ఆవహించుఁ డనియే, అయమ్=ఈ మంత్రము, ఆహ= చెప్పినది.

తాత్పర్యము: యజమానుఁడు ఋత్విజులకు హిరణ్యమును గోవులను కూడ దక్షిణగా నిచ్చినప్పుడు, "ఓ దక్షిణలారా! మీరు మాచే నొసఁగఁబడినవార లగుచు దేవఋత్విజులందు వెళ్లుఁడు. ఓ గోవులారా! మీరు మధుర క్షీరములు కలవారగుచు ఇచ్చట మిమ్ము దానము చేసిన మమ్ము స్వర్గలోకమున రూపాంతరమున ఆవేశించుఁడను నర్థమునే 'అస్మద్రాత్రాః' ఇత్యాది మంత్రమున కర్థమని యీ బ్రాహ్మణము చెప్పినది." మంత్రమునందలి "ప్రదాతారమా విశత" అను భాగముయొక్క అర్థమును ఈ బ్రాహ్మణము వివరించినది.

16. అర్థము: హిరణ్యమ్=సువర్ణమును, దదాతి=ఈయవలెను. హిరణ్యమ్=బంగారము, జ్యోతిః ఏవ=తేజస్స్వరూపమే. పుర స్తాత్=ప్రథమమున, దత్తే సతి=హిరణ్యము ఒసఁగఁబడగా, ఏతత్=ఈ జ్యోతి, సువర్గస్య లోకస్య=స్వర్గ లోకముయొక్క, అనుఖ్యాత్యై=ప్రకాశముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: యజ్ఞమునందు ఋత్విజుల కీయఁదగిన దక్షిణలలో హిరణ్యము, గోవులును కలవు. యజమానుఁడు ఆ దక్షిణా ద్రవ్యములలో ప్రథమమున ఋత్విజులకు హిరణ్యము నీయవలెను. హిరణ్యము జ్యోతిరూపమే కావున అది స్వర్గలోక ప్రకాశక మగును. ఇచట ప్రథమమున హిరణ్యము దాతవ్యమని విహిత మైనది.

17. అర్థము: అగ్నీధే=ఆగ్నీధ్రునికొఱకు, దదాతి=(ప్రథమమున) దక్షిణ నీయవలెను. అగ్నిముఖాన్=అగ్ని సహితములైన, ఋతూన్ ఏవ=వసంతాది ఋతువులనే, ప్రీణాతి=సంతోషపఱచినవాఁ డగును.

తాత్పర్యము: ఋత్విజులలో ప్రథమమున ఆగ్నీధ్రున కీయవలెను. అప్పు డా యజమానుఁడు అగ్నిసహితములైన వసంతాది, ఋతువులనే సంతోషపఱచినవాఁ డగును. ఇచట ప్రతిగ్రహీతృ సంబంధము విధించఁబడినది.

18. అర్థము: బ్రహ్మణే='బ్రహ్మ' అను ఋత్విజునికొఱకు, దదాతి= దక్షిణ నీయవలెను. (ఏతత్=ఈ దానము,) ప్రసూత్యై=అనుజ్ఞకొఱకు, భవతి= అగుచున్నది. హోత్రే=హోతకొఱకు, దదాతి=ఈయవలెను. హోతా యత్=హోత ఎవఁడు కలఁడో, ఏషః=ఇతఁడు, యజ్ఞస్య=యజ్ఞమునకు, ఆత్మా వై= ఆత్మయే.

(తదా=అప్పుడు,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, ఆత్మానమేవ=ఆత్మనే, దక్షిణాభిః=దక్షిణలచే, సమర్ధయతి=సమృద్ధముగాఁ జేసినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఆగ్నీధ్రునకు, పిమ్మట 'బ్రహ్మ' యను ఋత్విజునకు దక్షిణ నీయవలెను. ఇందువలన అనుజ్ఞను పొందిన ట్లగును. అనంతరము హోతకు దక్షిణ నీయవలెను. హోత బహుమంత్ర పాఠకుఁడగుటచే యజ్ఞమునకు ఆత్మవంటివాఁ డగును. అప్పుడు యజమానుడు యజ్ఞము యొక్క ఆత్మనే దక్షిణలచే సమృద్ధముగా చేసినవాఁ డగును. ఇచట బ్రహ్మ హోతలకు దానము విహిత మైనది. ఇతర ఋత్విజులకు కూడ దక్షిణా దానము నీవిధముగ నూహించుకొనవలెను.

## ప్రథమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః

మూలము: [1]సమిష్టయజూగ్ంషిజుహోతి యజ్ఞస్య సమిష్ట్యై యద్వై యజ్ఞస్య క్రూరం యద్విలిష్టం యదత్యేతి యన్నాత్యేతి యదతికరోతి యన్నాపి కరోతి తదేవ తైః ప్రీణాతి [2]నవ జుహోతి నవ వై పురుషే ప్రాణాః పురుషేణ యజ్ఞః సంమితో యావానేవ యజ్ఞస్తం ప్రీణాతి [3]షడృగ్మియాణి జుహోతి షడ్వా ఋతవ ఋతూనేవ ప్రీణాతి త్రీణి యజూగ్ంషి(౧) త్రయ ఇమే లోకా ఇమానేవ లోకాన్ప్రీణాతి [4] యజ్ఞ యజ్ఞం గచ్ఛ యజ్ఞపతిం గచ్ఛేత్యాహ యజ్ఞపతి మేవైనం గమయతి స్వాం యోనిం గచ్ఛేత్యాహ స్వామేవైనం యోనిం గమయ[5]త్యేష తే యజ్ఞో యజ్ఞపతే సహసూక్తవాకః సువీర ఇత్యాహ యజమాన ఏవ వీర్యం దధాతి [6]వాసిష్ఠో హ సాత్యహవ్యో దేవభాగం పప్రచ్ఛ యత్సృఞ్జయా స్బహుయాజినోఽయీయజో యజ్ఞే (౨)యజ్ఞం ప్రత్యతిష్ఠిపా౩ యజ్ఞపతా౩ ఇతి స హోవాచ యజ్ఞపతావితి సత్యాద్వై సృఞ్జయాః పరా బభూవురితి హోవాచ యజ్ఞే వావ యజ్ఞః ప్రతిష్ఠాప్య ఆసీద్యజమానస్యాపరాభావాయేతి దేవా గాతువిదో గాతుం విత్త్వా గాతు మితేత్యాహ యజ్ఞ ఏవ యజ్ఞం ప్రతిష్ఠాపయతి యజమానస్యాపరాభావాయ.(౩)||

[యజూగ్ంషి యజ్ఞ ఏకచత్వారిగ్ంశచ్చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠ ప్రపాఠకే ద్వితీయోఽనువాకః||౨||

## వేదార్థదీపిక

అవతారిక: ప్రథమానువాకమునందు దక్షిణా హోమము చెప్పఁబడినది. ఈ ద్వితీయానువాకమునందు సమిష్ట యజుర్హోమవిధి చెప్పఁబడుచున్నది. సమ్యక్ యజనము సమిష్టము. మంచి యనుష్ఠానమని యర్థము. సమిష్టార్థములైన

యజుస్సులు (మంత్రములు) సమిష్ట యజుస్సులు. ఆ సమిష్ట యజుస్సుల నుచ్చరించుచు చేయఁబడు హోమము సమిష్ట యజుర్హోమము. ఆ హోమము ఈ యనువాకమునందు విధించఁబడుచున్నది. ఈ సమిష్ట యజుర్హోమ మంత్రములు ప్రథమ కాండ చతుర్థప్రపాఠకమునందలి చతుశ్చత్వారింశానువాకమునందు ఆమ్నాతము లైనవి. అవి "ధాతా రాతిః" ఇత్యాదులు.

1. అర్థము: సమిష్ట యజూంషి=సమిష్టార్థములైన మంత్రములను, ( ఉచ్చార్య=ఉచ్చరించి,) జుహోతి=హోమము చేయవలెను. (అయమ్=ఈ హోమము,) సమిష్ట్యై=సమ్యగనుష్ఠానముకొఱకు, భవతి=అగుచున్నది. యత్ వై=ఏది యైతే, యజ్ఞస్య=యజ్ఞసంబంధియగు, క్రూరమ్=హింసాత్మకమైన క్రూరకర్మ కలదో, యత్ విలిష్టమ్=దక్షిణాది ద్రవ్యముయొక్క అల్పీభావరూప దోష మేది కలదో, యత్ అత్యేతి= అనుష్ఠానమున కాలాత్యయరూప దోష మేది కలదో, యత్ న అత్యేతి=అనుష్ఠానమున కాలానత్యయ రూప దోష మేది కలదో, యత్ అతి కరోతి=వేదోక్త నిషేధము నతిక్రమించి చేయుటవలన ఏ దోషము కలదో, యదపి న కరోతి=విహితమైన ఒకానొక యజ్ఞాంగమును విస్మరించి అనుష్ఠించుట యేది లేదో, తదేవ=ఆ క్రూరాదికమైన సర్వమునే, తైః=ఆ సమిష్ట యజుర్హోమములచే, ప్రీణాతి=సమాధాన పఱచినవాఁ డగును.

తాత్పర్యము: యజమానుఁడు యజ్ఞానుష్ఠానము నిర్దుష్టముగ సిద్ధించుటకై సమిష్టార్థములైన "ధాతా రాతిః సవితేదం జుషన్తామ్" ఇత్యాది మంత్రముల నుచ్చరించి హోమము చేయవలెను. ఈ హోమములవలన యజ్ఞానుష్ఠానమున సంభవించెడి క్రూరాది దోషములు పరిహృతము లగును. అప్పుడు యజమానుఁడు యజ్ఞమును నిర్దుష్టముగ ననుష్ఠించినవాఁ డగును. క్రూరాది దోషములు:– (1) క్రూరము= పశుహింసాదికము, (2) విలిష్టము=యజ్ఞమునందు ఋత్విజులకు ఇచ్చునట్టి దక్షిణాద్రవ్యము అల్పముగా నుండుట, (3) అత్యయము=హవిరాసాదనానంతరము పాశుకములైన ప్రయాజహోమముల యనుష్ఠానము చోదక ప్రాప్తమైనది. "తిష్ఠన్తం పశుం ప్రయజన్తి" అను వచనముచే ఆ యనుష్ఠానము పశువిశసనమునకు పూర్వము అపకర్షించఁబడినది. ఆ యపకర్షము నాదరించక చోదకప్రాప్తమైన హవిరాసాదనానంతర కాలమున ప్రయాజహోమములు చేయుట కాలాత్యయ దోషము. (4) అనత్యయము= తృతీయ సవనోపక్రమమునందు సవనీయ పశువునకు అంగప్రచారానంతరమే అనూయాజ హోమములు చోదక ప్రాప్తము లైనవి. "అగ్నిమారుతాదూర్ధ్వ మనూయాజైశ్చరన్తి" అను వచనముచే ఆ అనూయాజ హోమములు తృతీయ సవన సమాప్తి కాలమునందు ఉత్కృష్టము లైనవి. దీని నాదరించక తృతీయ సవనోపక్రమమునందే అనూయాజానుష్ఠానము అశాస్త్రీయము. ఇది కాలానత్యయ దోషము. (5) అతికరణము="అపబర్హిషః ప్రయాజా న్యజతి" అను వచనముచే అవభృథమునందు బర్హిర్నామకమైన చతుర్థ ప్రయాజ హోమము నిషిద్ధ మైనది. ఆ నిషేధము నతిక్రమించి ఆ చతుర్థ ప్రయాజానుష్ఠానము అతికరణ దోషము. (6) అకరణము=విహితములైన యజ్ఞాంగములలో ఏదేని యంగమును విస్మరించి అనుష్ఠించకుండుట అకరణ దోషము. యజ్ఞము చేయునప్పుడు సంభవించెడి ఈ దోషము లన్నియు సమిష్ట యజుర్హోమములు చేయుటచే తొలఁగి పోవును. అప్పుడు యజ్ఞానుష్ఠానము నిర్దుష్ట మగును. ఇచట సమిష్ట యజుర్హోమము విధించఁబడినది.

2. అర్థము: నవ=తొమ్మది, జుహోతి=హోమములు చేయవలెను. పురుషే=పురుషునియందు, ప్రాణాః=ప్రాణములు (ఆ యా ప్రాణముల కాధారములైన ఛిద్రములు,) నవ వై=తొమ్మిదియే. యజ్ఞః=యజ్ఞము, పురుషేణ=పురుషునితో, సమ్మితః=సమాన మైనది. యజ్ఞః=యజ్ఞము, యావాన్=ఎంత పరిమితి కలదియో, తమేవ=అంత పరిమితి కల యజ్ఞమునే, ప్రీణాతి=తృప్తి పఱచినవాఁ డగును.

తాత్పర్యము: పూర్వోక్తములైన సమిష్ట యజుర్హోమములు తొమ్మది చేయవలెను. పురుషునియందు ప్రాణములు నవ ఛిద్రములందు సంచరించుచుండుటచే తొమ్మదియే. యజ్ఞము పురుష సంమిత మైనది కావున యజ్ఞము

ఎంత సంఖ్య కలదిగా నున్నదో అంత సంఖ్య కల యజ్ఞమునే యజమానుఁడు తృప్తిపఱచినవాఁ డగును. ఇచట హోమసంఖ్య విధించఁబడినది.

3. అర్థము: షట్ ఋగ్భిర్యాజే జుహోతి=ఆఱు ఋగుచ్చారణ పూర్వకములైన హోమములు చేయవలెను. ఋతవః=ఋతువులు, షట్ వై=ఆఱే. ఋతూనేవ=ఋతువులనే, ప్రీణాతి=సంతోషపఱచినవాఁ డగుచున్నాఁడు. త్రిభి ర్యజుర్భి జుహోతి=మూఁడు యజురుచ్చారణ పూర్వకములైన హోమములు చేయవలెను. ఇమే లోకాః=ఈ లోకములు, త్రయః=మూడు. ఇమాన్ లోకానేవ=ఈ మూఁడు లోకములనే, ప్రీణాతి=సంతోషపఱచినవాఁ డగును.

తాత్పర్యము: "ధాతా రాతిః సవితేదమ్" ఇత్యాదులైన హోమ మంత్రములు మొత్తము తొమ్మిది కలవు. వానిలో ఆఱు ఋక్కులు. ఆ యాఱు ఋక్కుల నుచ్చరించి ఆఱు హోమములు చేయవలెను. మిగిలినవి మూఁడును యజుస్సులు. ఆ మూఁడు యజుస్సుల నుచ్చరించి మూఁడు హోమములు చేయవలెను. షడృగుచ్చారణ పూర్వకముగ చేసిన ఆఱు హోమములచేత యజమానుఁడు ఆఱు ఋతువులను సంతోషపఱచినవాఁడగును. ఋతువులు ఆఱే. ఈ విధముగనే ఈ లోకములు మూఁడు కావున మూఁడు యజుస్సులతో చేసిన హోమములచేత ముల్లోకములను సంతోషపఱచును. ఇచట తొమ్మిది హోమ మంత్రములలోని ఋగ్యజుస్సులయొక్క అవాంతర సంఖ్య విధించఁ బడినది.

4. అర్థము: "యజ్ఞ యజ్ఞం గచ్ఛ యజ్ఞపతిం గచ్ఛ" ఇతి ఆహ="ఓ యజ్ఞమా! నీవు స్వ ప్రతిష్ఠకై యజ్ఞనామకుఁడైన విష్ణువును పొందుము. ఫలప్రదానమునకై యజ్ఞపతియైన యజమానుని పొందుము" అని వేదము చెప్పినది. ఇవి అధ్వర్యుని పలుకులు. ఏనమ్=ఈ యజ్ఞమును, యజ్ఞపతిమేవ=యజమానునే, గమయతి=పొందించినవాఁడగును. "స్వాం యోనిం గచ్ఛ" ఇతి ఆహ=స్వనిష్పత్తికొఱకు స్వకారణభూత క్రియాశక్తిని పొందుము" అని వేదము చెప్పినది. ఇదియు అధ్వర్యుని మాటయే. స్వాం యోనిమేవ=స్వకారణభూత క్రియాశక్తినే, గమయతి=పొందించినవాఁ డగును.

తాత్పర్యము: 'ఓ యజ్ఞమా! నీవు స్వ ప్రతిష్ఠకొఱకు యజ్ఞనామకుఁ డైన విష్ణువును, ఫలప్రదానముకొఱకు యజ్ఞపతియైన యజమానుని పొందుము' అని చెప్పటచే అధ్వర్యుఁడు యజ్ఞమును యజ్ఞపతికే పొందించినవాఁ డగును. ఇట్లే 'స్వనిష్పత్తికొఱకు స్వ కారణభూత క్రియాశక్తిని పొందుము' అనుటచే స్వకారణమును పొందించినవాఁ డగును. ఇచట మంత్రపాఠమువలననే యజ్ఞమునకు యజమాన ప్రాప్తి, స్వకారణ ప్రాప్తియు సంపన్నము లగునని చెప్పఁబడినది.

5. అర్థము: "ఏష తే యజ్ఞో యజ్ఞపతే సహసూక్తవాకః సువీరః" ఇతి ఆహ="ఓ యజ్ఞస్వామీ! ఈ యనుష్ఠించఁబడుచున్న నీ యజ్ఞము స్తోత్రములతో కూడినదియు, కర్మకుశలురైన ఋత్విజులు కలదియు నైనది." అని వేదము చెప్పినది. (ఇది అధ్వర్యుని వచనము. కావున అధ్వర్యుఁడు) యజమానే ఏవ=యజమానుని యందే, వీర్యమ్=సామర్థ్యమును, దధాతి=స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: 'ఓ యజ్ఞస్వామీ! నీ యీ యజ్ఞము స్తోత్రములతో కూడియున్నది. మఱియు కర్మకుశలురైన ఋత్విజులు కలది.' అని చెప్పటచే అధ్వర్యుఁడు ఈ మంత్రపాఠముచే యజమానునందే సామర్థ్యమును కలుగఁజేసినవాఁ డగును. ఇచట మంత్రమునందలి 'సువీర' శబ్దముచేత యజమానునకు వీర్యప్రాప్తి సూచించఁబడినది.

6. అర్థము: వాసిష్ఠః=వసిష్ఠ గోత్రోత్పన్నుఁడగు, సాత్యహవ్యః=సత్యహవుని కుమారుఁడు, దేవభాగమ్=దేవభాగ నామకుఁడైన మునిని, పప్రచ్ఛ హ=అడిగె నఁట! "సృఞ్జయాన్=సృంజయ దేశస్థులైన, బహుయాజినః=బహువిధ సోమయాగముల ననుష్ఠించినవారిని, అయీయజః=యజింపఁజేసితివి. (తదా=అప్పుడు,) యజ్ఞే="యజ్ఞం స్వాహా" అనెడి యజ్ఞ లింగకమైన "దేవా గాతువిదః" అను మంత్రమునందు, యజ్ఞమ్=సమిష్ట యజ

ర్హోమమును, ప్రత్యతిష్ఠిపా3:=సమాప్తి చేయించితివా? (ఉత=లేక,) యజ్ఞపతౌ3="యజ్ఞపతిం గచ్ఛ" అనెడి యజ్ఞపతి లింగకమైన "యజ్ఞ యజ్ఞం గచ్ఛ" అను మంత్రమునందు, ప్రత్యతిష్ఠిపా3:=సమాప్తి నొందించితివా? ఇతి=అని, పప్రచ్ఛ=సత్యహవుని కుమారుఁడు దేవభాగ మునిని అడిగెను. యజ్ఞపతౌ ఇతి సత్యాత్ వై=యజ్ఞపతి లింగకమైన సత్యము (యజ్ఞము) నుండియే, సృఞ్జయాః= సృంజయ దేశస్థులు, పరా బభూవుః=పరాభూతులైరి, ఇతి=అని, సః=ఆ దేవభాగముని, ఉవాచ హ=పలికె నఁట! యజమానస్య=యజమానునకు, అపరాభావాయ=పరాభవము లేకుండుటకై, యజ్ఞే వావ="యజ్ఞం స్వాహా" అనెడి యజ్ఞలింగకమైన "దేవా గాతువిదః" అను మంత్రమునందే, యజ్ఞః=సమిష్ట యజుర్హోమము, ప్రతిష్ఠాప్యః ఆసీత్=సమాప్తి నొందింపఁబడిన దయ్యెను, ఇతి= అని, ఉవాచ హ=దేవభాగముని సమాధానము చెప్పెనఁట! "దేవా గాతువిదో గాతుం విత్త్వా గాతుమిత" ఇతి ఆహ="మార్గమును తెలిసిన ఓ దేవతలారా! భవదాగమన మార్గమును తెలిసికొని (గుర్తుంచుకొని) యజ్ఞము సమాప్తము కాఁగానే మఱల ఆ మార్గముననే వెళ్లుఁడు" అని యజమానుఁడు దేవతలను అడిగెనని ఈ మంత్రము చెప్పెను. యజమానస్య=యజమానునకు, అపరాభావాయ=పరాభవము లేకుండుటకై, యజ్ఞే ఏవ=యజ్ఞలింగకమైన "దేవా గాతువిదః" అను మంత్రమునందే, యజ్ఞమ్= సమిష్ట యజుర్హోమమును, ప్రతిష్ఠాపయతి=సమాప్తి నొందింపవలెను.

తాత్పర్యము: వసిష్ఠ గోత్రోత్పన్నుఁడైన సత్యహవుని కుమారుఁడు, 'ఓ దేవభాగమునీ! నీవు సృంజయ దేశస్థులైన బహువిధసోమయాగకర్తలచే యాగములను చేయించితివి కదా! అప్పుడు నీవు వారిచేత "యజ్ఞం స్వాహా" అనెడి యజ్ఞలింగకమైన "దేవా గాతువిదః" అను మంత్రమునందు సమిష్ట యజుర్హోమమును సమాప్తి నొందించితివా! లేక "యజ్ఞపతిం గచ్ఛ" అనెడి యజ్ఞపతి లింగకమైన "యజ్ఞ యజ్ఞం గచ్ఛ" అను మంత్రమునందు సమిష్ట యజుర్హోమమును సమాప్తి నొందించితివా?' అని దేవభాగముని నడిగెను. సృంజయ దేశస్థులైన సోమయాజులు యజ్ఞపతి లింగకమైన మంత్రమునందు సమాప్తి చేయుటలో పరాభూతులైరి. యజమానునకు పరాభవము కలుగకుండుటకై యజ్ఞలింగకమైన మంత్రమునందే సమాప్తి చేయఁబడినదని దేవభాగముని సిద్ధాంత పక్షమును చెప్పెను. కావున యజమానునకు పరాభవము కలుగకుండుటకై యజ్ఞలింగకమైన 'దేవా గాతువిద్యః' అను మంత్రమునందు సమిష్ట యజుర్హోమమును సమాప్తి చేయవలెను.

ద్వితీయానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే తృతీయోఽనువాకః

మూలము: [1]అవభృథయజూగ్ంషి జుహోతి యదేవార్వాచీన మేకహాయనాదేనః కరోతి తదేవ తైరవ యజతే [2] ఽపోఽవభృథ మవైత్యప్సు వై వరుణః సాక్షాదేవ వరుణమవ యజతే [3]వర్త్మనా వా అన్విత్య యజ్ఞగ్ం రక్షాగ్ంసి జిఘాగ్ంసన్తి సామ్నా ప్రస్తోతాఽన్వవైతి సామ వై రక్షోహా రక్షసా మపహత్యై [4]త్రిర్నిధన ముపైతి త్రయ ఇమే లోకా ఏభ్య ఏవ లోకేభ్యో రక్షాగ్ంసి (౧)అప హన్తి [5]పురుషః పురుషో నిధన ముపైతి పురుషః పురుషో హి రక్షస్వీ రక్షసా మపహత్యా [6]ఉరుగ్ం హి రాజా వరుణ శ్చకా రేత్యాహ ప్రతిష్ఠిత్యై [7]శతం తే రాజన్భిషజః సహస్రమిత్యాహ భేషజ మేవాస్మై కరో[8]త్యభిష్ఠితో వరుణస్య పాశ ఇత్యాహ వరుణపాశ మేవాభి తిష్ఠతి [9]బర్హిరభి జుహో త్యాహుతీనాం ప్రతిష్ఠిత్యా అథో అగ్నివత్యేవ జుహో [10]త్యపబర్హిషః ప్రయాజాన్ (౨) యజతి ప్రజా వై బర్హిః ప్రజా ఏవ వరుణపాశా న్ముఞ్చ[11] త్యాజ్యభాగౌ యజతి యజ్ఞస్యైవ చక్షుషీ నాన్తరేతి [12]వరుణం యజతి వరుణపాశాదేవైనం ముఞ్చ[13]త్యగ్నీవరుణౌ యజతి సాక్షాదేవైనం వరుణపాశా న్ముఞ్చ[14]త్యపబర్హిషా వనూయాజౌ యజతి ప్రజా వై బర్హిః ప్రజా ఏవ వరుణపాశా న్ముఞ్చతి [15]చతురః ప్రయాజాన్యజతి ద్వావనూయాజౌ షట్సంపద్యన్తే షడ్వా ఋతవః (౩)ఋతుష్వేవ ప్రతితిష్ఠ[16]త్యవభృథ నిచఙ్కు ణేత్యాహ యథోదితమేవ వరుణమవ యజతే [17]సముద్రే తే హృదయ మప్స్వన్తరిత్యాహ సముద్రే హ్యన్తర్వరుణః [18]సం త్వా విశన్త్వోషధీ రుతాఽఽప ఇత్యాహాద్భి రేవైన మోషధీభిః సమ్యఞ్చం

దధాతి [19]దేవీరాప ఏష వో గర్భ ఇత్యాహ యథాయజురేవైత [20]త్పశవో వై (४) సోమో యద్భి

న్దానాం భక్షయే త్పశుమాన్స్యా ద్వరుణ స్త్వేనం గృహ్ణీయాద్యన్న భక్షయే దపశుః స్యాన్నైనం

వరుణో గృహ్ణీయా దుపస్పృశ్యమేవ పశుమా న్భవతి నైనం వరుణో గృహ్ణాతి [21]ప్రతియుతో వరు

ణస్య పాశ ఇత్యాహ వరుణపాశాదేవ నిర్ముచ్యతే [22]ఽప్రతీక్షమా యన్తి వరుణస్యాన్తర్హిత్యా [23]ఏధోఽ

స్యేధిషీమహీత్యాహ సమిధైవాగ్నిం నమస్యన్త ఉపాయన్తి [24]తేజోఽసి తేజో మయి ధేహీత్యాహ తేజ

ఏవాత్మన్ధత్తే (५)

[రక్షాగ్ంసి ప్రయాజాన్త్సతవో వై నమస్యన్తో ద్వాదశ చ]

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే తృతీయోఽనువాకః||3||

## వేదార్థదీపిక

తాత్పర్యము: ద్వితీయానువాకమునందు సమిష్ట యజుర్హోమము విధించఁబడినది. ఈ తృతీయానువాకమునందు అవభృథ యజుర్హోమము చెప్పఁబడుచున్నది. యజ్ఞము చేయు దినములలో చివరి రోజున అవభృథ మనెడి కర్మ నొక దానిని చేయుదురు. ఆ యవభృథము ననుష్ఠించుటకై యజమానుఁడు, యజమానపత్ని, ఋత్విజులు ఉదక సమీపమునకు పోఁబోవుచు "ఆయుర్దా అగ్నే హవిషః" ఇత్యాది మంత్రముల నుచ్చరించుచు హోమము చేయవలెను. ఈ మంత్రములే అవభృథ యజుస్సులు.

1. అర్థము: అవభృథ యజూంషి జుహోతి=అవభృథార్థములైన "ఆయుర్దా అగ్నే" ఇత్యాది యజుస్సులను (మంత్రములను) ఉచ్చరించుచు యజమానుఁడు హోమము చేయవలెను. ఏకహాయనాత్=ఒక సంవత్సరముకంటె, అర్వాచీనమ్= అనంతరకాలపుదైన, యత్ ఏనః ఏవ=ఏ పాపమునైతే, కరోతి=చేయుచున్నాఁడో, తదేవ=ఆ పాపమునే, తైః=ఆ యవభృథ యజుర్హోమములచే, అవయజతే= నశింపఁజేయును.

1. అర్థము: యజ్ఞకర్త అవభృథ మనెడి కర్మను చేయుటకై ఉదక సమీపమునకు పోఁబోవుచు అవభృథ యజుర్హోమములు చేయవలెను. ఈ హోమములను చేసిన యజమానుఁడు ఒక సంవత్సరమున తాను చేసిన పాపమును అనంతరము ఈ హోమములచేత నశింపఁజేయును. అనఁగా ఇతః పూర్వము ఒక సంవత్సరములో చేసిన పాపమును ఈ హోమములచే నశింపఁజేయునని భావము.

2. అర్థము: అవభృథమ్=అవభృథము నుద్దేశించి, అపః= ఉదకములను, అవైతి=పొందవలెను. అప్సు వై=ఉదకములందే, వరుణః= వరుణదేవుఁడు, (అస్తి=కలఁడు). సాక్షాదేవ=ప్రత్యక్షముగానే, వరుణమ్=వరుణదేవుని, అవయజతే=పూజించినవాఁ డగును.

తాత్పర్యము: యజ్ఞకర్త అవభృథ కర్మానుష్ఠానము నిమిత్తము ఉదకము నొద్దకు పోవలెను. ఉదకములందే వరుణదేవుఁ డుండును కావున సాక్షాత్తుగ వరుణుని పూజించినవాఁ డగును. ఉదకమును పొందుటచే నుదకాధిమానియగు వరుణుని అవ్యవధానముగ పూజించినవాఁడగునని తాత్పర్యము. ఇచట ఉదక సమీప గమనము విహిత మైనది.

3. అర్థము: రక్షాంసి=రాక్షసులు, వర్త్మనా వై=మార్గముచేతనే, అన్విత్య=అనుసరించి వచ్చి, యజ్ఞమ్=యజ్ఞమును, జిఘాంసన్తి=ధ్వంసము చేయ నిచ్ఛయింతురు. (అతః=ఇందువలన,) ప్రస్తోతా=ప్రస్తోత యను ఋత్విజుఁడు, సామ్నా వై=సామముచేతనే, అన్వైతి=అనుసరించి పోవలెను. సామ= సామము, రక్షోహా వై=రక్షోహంతయే. (ఏతత్=ఈ అనుయానము,) రక్షసామ్= రాక్షసులయొక్క, అపహత్యై=తొలఁగింపునకై, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: యజమానాదులు ఉదక సమీపమునకు వెళ్లిన మార్గముననే రాక్షసులు వచ్చి యజ్ఞమును ధ్వంసము చేయ నాలోచింతురు. అందువలన ప్రస్తోత యను ఋత్విజుఁడు సామము నుచ్చరించుచు అనుసరించి వెళ్లవలెను. సామము రాక్షస నాశకము కనుక ప్రస్తోత సామోచ్చారణముతో అనుసరించి వెళ్లుట రాక్షస నివృత్తికి సాధన మగును. ప్రస్తోత సామముతో అనుగమనము చేయుట ఇచట విహిత మైనది.

4. అర్థము: త్రిః=మూఁడు మాఱులు, నిధనమ్=నిధనమును, ఉపైతి=పొందవలెను. ఇమే లోకాః=ఈ లోకములు, త్రయః=మూఁడు. ఏభ్యః లోకేభ్యః ఏవ=ఈ ముల్లోకములనుండియే, రక్షాంసి=రాక్షసులను, అప హన్తి=పోఁగొట్టును.

తాత్పర్యము: మూఁడు మాఱులు నిధనమును పొందవలెను. లోకములు మూఁడు. ఇట్లు చేసిన యజమానుఁడు ఈ ముల్లోకములనుండియే రాక్షసులను తొలఁగించినవాఁ డగును. ఇచట త్రిత్వసంఖ్య విధించఁబడినది. సామములో అంత్యభాగము నిధన నామకము. నిధన నామకమైన సామముయొక్క చరమ భాగమును మూఁడు మాఱు లుచ్చరించవలెను.

5. అర్థము: పురుషః పురుషః=ప్రతి పురుషుఁడు, నిధనమ్= నిధనమును, ఉపైతి=పొందవలెను. పురుషః పురుషః=ప్రతి పురుషుఁడు, రక్షస్వీ హి=స్వ స్వ బాధకమైన రక్షస్సు కలవాఁడు కదా! (ఏతత్=ఈ నిధనోచ్చారణము,) రక్షసామ్=రాక్షసులయొక్క, అపహత్యై=పోఁగొట్టుటకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ప్రతిపురుషుఁడు స్వ స్వ బాధకమైన రక్షస్సు కలవాఁడు కావున ప్రతి పురుషుఁడు రాక్షసులను పోఁగొట్టుటకై నిధన మంత్రము నుచ్చరించవలెను. ఇచట అందఱికి నిధన సామోచ్చారణము విధించఁబడినది.

6. అర్థము: "ఉరుగ్ం హి రాజా వరుణ శ్చకార" ఇతి ఆహ="వరుణరాజే నిరాలంబమైన అంతరిక్షమునందు సంచరించుటకై సూర్యునికొఱకు విస్తీర్ణమార్గమును చేసెను." అని వేదము చెప్పినది. (అయమ్=ఈ మార్గవిస్తారము,) ప్రతిష్ఠిత్యై=పాదప్రతిష్ఠకొఱకు, భవతి= అగుచున్నది.

తాత్పర్యము: సూర్యుఁడు నిరాలంబమైన అంతరిక్షమునందు సంచరించుటకై వరుణరాజే మార్గవిస్తారమును చేసెనని మంత్రము చెప్పుటవలన ఇది పాదము నుంచుటకు సాధన మగుచున్నది. మంత్రోక్తమైన మార్గవిస్తారము పాదము నుంచుటకొఱకని యీ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది. ఈ మంత్రములన్నియు ప్రథమ కాండము చతుర్థ ప్రపాఠకము నలువదియైదవ అనువాకమునం దామ్నాతము లైనవి.

7. అర్థము: "శతం తే రాజన్భిషజః సహస్రమ్ ఇతి ఆహ"="ఓ వరుణరాజా! మాయొక్క ఉపద్రవమును పోఁగొట్టువారు నీకు శత సహస్ర సంఖ్యాకులుగా నున్నారు." అని వేదము చెప్పుటచే, అస్మై=ఈ యజమానునికొఱకు, భేషజమేవ=ఉపద్రవ నివారణమునే, కరోతి=చేయున ట్లగుచున్నది.

తాత్పర్యము: అధ్వర్యు యజమానాదులు యజ్ఞవేదినుండి కాని, చాత్వాలమునుండి కాని, అవభృథమునకై ఉదక సమీపమునకు పోవుచు "ఉరుగ్ం హి రాజా వరుణ శ్చకార" "శతం తే రాజన్భిషజః" ఇత్యాది మంత్రములను

పఠింతురు. "శతం తే రాజన్" అని చెప్పుటవలన ఈ యజమానునకు ఉపద్రవ పరిహారమును చేసిన ట్లగును. ఈ మంత్రమునందలి భిషక్ శబ్దముచే యజమానునకు పాపోద్రవ పరిహారము సూచిత మగుచు న్నదని యీ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది.

8. అర్థము: "అభిష్ఠితో వరుణస్య పాశః" ఇతి ఆహ="వరుణునియొక్క పాశము పాదాక్రమణముచే తిరస్కృత మైనది." అని వేదము చెప్పుటచే, వరుణపాశమేవ= వరుణపాశమునే, అభితిష్ఠతి=తిరస్కరించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: అధ్వర్ప్యాది ఋత్విజు లందఱు అవభృథమునకై ఉదక సమీపము నాక్రమించుటచే యజమానుఁడు వరుణపాశమును తిరస్కరించినవాఁడగును. జలమధ్యవర్తియు, సూక్ష్మతంత్వాకారము, బంధన హేతువు నగు జీవవిశేషము వరుణునియొక్క పాశము. ఈ మంత్రముచేతనే వరుణపాశము పరిహృతమైనదని యీ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది.

9. అర్థము: ఆహుతీనాం ప్రతిష్ఠిత్యై=ఆహుతుల ప్రతిష్ఠకొఱకు, బర్హిః అభి జుహోతి=బర్హిస్సు నభిముఖముగ హోమము చేయవలెను. అథో=అందువలన, అగ్నివత్యేవ=అగ్ని కలిగియున్నదానియందే, జుహోతి=హోమము చేయుచు న్నవాఁ డగును.

తాత్పర్యము: ఆహుతుల కాధారముగా నుదకములందు బర్హిస్సు నుంచి ఆ బర్హిస్సుపైని హోమము చేయవలెను. దర్భస్తం బము అగ్నివత్తని శ్రుతి చెప్పుటచే బర్హిస్సుపైని హోమము చేయుటవలన అగ్నియందే హోమము చేసినవాఁ డగును. ఇచట ఉదకములందు బర్హిస్సును పఱచి యీ బర్హిస్సుపైని హోమము చేయవలెనని చెప్పఁబడినది.

10. అర్థము: అవబర్హిషః ప్రయాజాన్ యజతి=బర్హిర్నామక ప్రయాజమును విడిచి మిగిలిన ప్రయాజముల ననుష్ఠించవలెను. బర్హిః=బర్హి ర్నామక ప్రయాజము, ప్రజాః వై=ప్రజల స్వరూపమే. (తథా సతి=అట్లు కాఁగా,) ప్రజాః ఏవ=ప్రజలనే, వరుణపాశాత్=వరుణపాశమునుండి, ముఞ్చతి= విడిపించినవాఁ డగును.

తాత్పర్యము: చోదక ప్రాప్తములైన పంచ ప్రయాజములు ప్రాప్తములు కాఁగా, బర్హిర్నామక ప్రయాజమును విడిచి మిగిలిన ప్రయాజముల ననుష్ఠించవలెను. బర్హిర్నామక ప్రయాజము ప్రజాస్వరూపమే కనుక, దానిని పరిత్యజించుటవ లన వరుణపాశమునుండి ప్రజలను విముక్తులను చేసినవాఁ డగును.

11. అర్థము: ఆజ్యభాగౌ యజతి=ఆజ్యభాగ హోమములను చేయవలెను. ( ఇమౌ=ఇవి,) యజ్ఞస్యైవ=యజ్ఞమునకే, చక్షుషీ=నేత్రములు. (అతః= ఇందువలన,) నాన్తరేతి=అంతర్హితములను చేయరాదు.

తాత్పర్యము: ఆజ్యభాగ హోమములు యజ్ఞమునకే నేత్రములు కనుక, ఆ హోమములను చేయవలెను. వీనిని అంత ర్ధానము చేయరాదు (మానరాదు). మఱియొకచోట ఆజ్యభాగ హోమములు చోదక ప్రాప్తములైనను, మంత్రవిశేషము నుద్దేశించి యిచట ఆజ్యభాగహోమములు విధించఁబడినవి.

12. అర్థము: వరుణమ్=వరుణదేవు నుద్దేశించి, యజతి= హోమము చేయవలెను. (ఏవం సతి=ఇట్లు కాఁగా, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజమానుని, వరుణపాశాదేవ=వరుణపాశమునుండియే, ముఞ్చతి=విముక్తుని చేసినవాఁ డగును.

తాత్పర్యము: ఈ పూర్వోక్త హోమములు ప్రధానుఁడైన వరుణ దేవునుద్దేశించి చేయవలెను. ఇట్లు చేసిన యధ్వర్యుఁ డీ యజమానుని వరుణపాశమునుండియే విముక్తుని చేసినవాఁ డగును. ఇచట ప్రధాన దేవత విధించఁ బడినది.

13. అర్థము: అగ్నీవరుణౌ=అగ్నివరుణుల నుద్దేశించి, యజతి= యాగము (హోమము) చేయవలెను. సాక్షాదేవ=శీఘ్రము గానే, ఏనమ్=ఈ యజమానుని, వరుణపాశాత్=వరుణపాశమునుండి, ముఞ్చతి=విముక్తుని చేసినవాఁ డగును.

తాత్పర్యము: అగ్నివరుణోభయాత్మక స్విష్టకృద్దేవత నుద్దేశించి హోమము చేయవలెను. ఈ విధముగ చేసిన యధ్వర్యుఁడు శీఘ్రముగానే ఈ యజమానుని వరుణపాశమునుండి విముక్తుని చేసినవాఁ డగును. ఇచట స్విష్టకృద్దేవత విధించఁబడినది.

14. అర్థము: అవబర్హిషౌ=బర్హిర్నామక హోమ రహితములైన, అనూయాజౌ యజతి=అనూయాజ హోమములను చేయ వలెను. ప్రజాః వై బర్హిః. ప్రజాః ఏవ వరుణ పాశాత్ ముఞ్చతి. (వీని యర్థము 10వ మంత్ర వ్యాఖ్యానమున కలదు.)

తాత్పర్యము: అనూయాజ హోమములు మూఁడు కలవు. వానిలో మొదటిది బర్హిర్నామకము. దానిని విడిచి మిగిలిన రెండు అనూయాజ హోమములను చేయవలెను. శేషమును 10వ మంత్రవ్యాఖ్యానమున చూడవలెను. చోదక ప్రాప్తములైన మూఁడు అనూయాజ హోమములలో మొదటిదైన బర్హిర్నామకమైన అనూయాజ హోమము ఇచట నిషేధించఁబడినది.

15. అర్థము: చతురః ప్రయాజాన్=(బర్హిర్భిన్నములైన) నాలుగు ప్రయాజ హోమములను, ద్వౌ అనూయాజౌ=(బర్హిర్భి న్నములైన) రెండు అనూయాజ హోమములను, యజతి=అనుష్ఠించవలెను. షట్ సంపద్యన్తే=మొత్తము ఆఱు ప్రయాజానూయాజ హోమములు సంపన్నము లగుచున్నవి. షట్ వై ఋతవః=ఋతువులు ఆఱు కదా! ఋతేష్వేవ=ఆఱు ఋతువులందే, ప్రతితిష్ఠతి=ప్రతిష్ఠితుఁ డగును.

తాత్పర్యము: 13,14 మంత్రములచే విహితములైన ప్రయాజానూయాజ హోమములు మొత్తము ఆఱు అయినవి. ఈ ఆఱు హోమములు చేసిన యజమానుఁడు ఋతువులు ఆఱు కనుక ఆఱు ఋతువులందు ప్రతిష్ఠితుఁ డగును. అనఁగా ఋతువు లన్నియు యజమానునకు అనుకూలముగా నుండునని భావము. ఇచట ప్రయాజానూయాజ ప్రశంస చేయఁబడినది.

16. అర్థము: "అవభృథ నిచఙ్కుణ" ఇతి ఆహ="అవభృథాభిమానివైన ఓ వరుణ దేవ"! అని ఈ మంత్రభాగము చెప్పినది. యథోదితమ్ ఏవ వరుణమ్=నిచఙ్కుణ నిచేరు శబ్దములచే చెప్పఁబడిన వరుణునే, అవయజతే=సేవించవలెను.

తాత్పర్యము: ధాతువులు అనేకార్థములు కలవి కావున 'నిచఙ్కుణ' 'నిచేరు' శబ్దములు వరుణార్థకములుగా "అవభృథ నిచ ఙ్కుణ" ఇత్యాది మంత్రమున ఉపాత్తము లగుటచే తదుక్త విధముగ వరుణుని సేవించవలెను. "అవభృథ నిచఙ్కుణ" అను మంత్రము ఈ బ్రాహ్మణముచే వ్యాఖ్యానించబడినది.

17. అర్థము: "సముద్రే తే హృదయ మప్స్వన్తః" ఇతి ఆహ="ఓ వరుణ దేవా! నీహృదయము సముద్రములోని ఉదక ముల లోపల ప్రతిష్ఠితమై యున్నది." అని "సముద్రే తే" అను మంత్రము చెప్పినది. వరుణః=వరుణుఁడు, సముద్రే అన్తః హి= సముద్ర మధ్యమున ఉండును కదా!

తాత్పర్యము: "ఓ జుహూ! నీదిలము సముద్ర సమములైన ఉదకముల మధ్యమున ఉండుఁగాక" అని ఈ మంత్రమునకు అర్థము విద్యారణ్యమున కలదు. వరుణుని సంబోధించి కూడ వ్యాఖ్యానించవచ్చుననియు ఆ విద్యారణ్యము చెప్పినది. ఈ బ్రాహ్మణము వరుణ సంబోధన పక్షము నవలంబించి వ్యాఖ్యానించినది. వరుణుఁడు సముద్ర మధ్యమున నుండును కనుక ఈ విధముగ వ్యాఖ్యానించఁబడినది.

18. అర్థము: "సం త్వా విశన్త్వోషధీ రుతాఽఽపః" ఇతి ఆహ= "ఓ వరుణ దేవా! ఋజీష రూపములైన యోషధులు, మఱియు ఉదకములు నిన్ను బాగుగా ప్రవేశించుఁ గాక" అని ఈ మంత్రము చెప్పినది. అద్భిః=ఉదకము లచేతను, ఓషధీభిః ఏవ=ఓషధులచేతనే, (వరుణః=వరుణుఁడు,) ఏనమ్=ఈ యజమానుని, సమ్యఞ్చం దధాతి=సమృద్ధునిగా స్థాపించువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ మంత్రమునందలి 'సమ్' అను శబ్దము యజమానునకు ఉదకములచేత, ఓషధులచేతఁ గూడ సమృద్ధిని సూచించుచున్నదని ఈ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది. తాత్పర్యము స్పష్టము.

19. అర్థము: "దేవీరాప ఏష వో గర్భః" ఇతి ఆహ="దేవతారూపములైన ఓ యుదకములారా! ఈ వరుణుఁడు మీయొక్క గర్భమువలె లోపల నుండెను." అని ఈ మంత్రము చెప్పినది. ఏతత్=ఇది, యథాయజుఃరేవ=మంత్రోక్త విధముగానే ఉన్నది.

తాత్పర్యము: ఉదకములు దేవతా రూపములు. వరుణునకు ఉదకములు అధిష్ఠానము. అందువలన వరుణుఁడు దేవతా రూపములైన ఉదకములయొక్క గర్భమువలే లోపల నున్నవాఁడని యజుస్సు (మంత్రము) న కర్థము. ఇది స్పష్టమైన యర్థమే.

20. అర్థము: సోమః=సోమము, పశవః వై=పశుస్వరూపమే. భిన్దూనాం భక్షయేత్ యత్=(యజమానుఁడు) జలకణము లను భక్షించుచో, (యజమానః=యజమానుఁడు) పశుమాన్=పశుమంతుఁడు, స్యాత్= అగును. తు=కాని, వరుణః=వరుణుఁడు, ఏనమ్=ఈ యజమానుని, గృహ్ణీయాత్=గ్రహించును. న భక్షయేత్ యత్=భక్షిం చనిచో, అ పశుః= పశుహీనుఁడు, స్యాత్=అగును, ఏనమ్=ఈ యజమానుని, వరుణః= వరుణుఁడు, న గ్రహ్ణీయాత్=గ్రహించఁడు. (తత్=ఆ కారణమువలన,) ఉపస్పృశ్యమేవ=ఉదకములను స్పృశించవలసిన దియే. (ఏవంచేత్=ఇట్లైనచో,) పశుమాన్=యజమానుఁడు పశుమంతుఁడు, భవతి=అగును. ఏనమ్=ఈ యజమానుని, వరుణః=వరుణుఁడు, న గ్రహ్ణాతి= గ్రహించఁడు.

తాత్పర్యము: సోమయాగము పశుప్రాప్తి సాధన మగుటచే పశుస్వరూపముగ వర్ణించఁబడినది. భిన్ద్యన్తే ఇతి భిన్దవః=జల కణములు. యజమానుఁడు అవభృథానుష్ఠానమునకై ఉదకములను సమీపించి ఉదకములపైని తాడనము చేయఁగా జలబిందువులు చెదరును. యజమానుఁడు ఆ జలబిందువులను త్రాగినచో పశువులు కలవాఁ డగును. కాని వరుణుఁ డితనిని గ్రహించును. వరుణ గ్రహణ మనఁగా 'మహోదర' మనెడి రోగ విశేషము. ఆ రోగము కలవాఁ డగును. భక్షించనిచో సోమయాగాంగమైన యీ భక్షణము నాచరించకపోవుటవలన అతఁడు పశుహీనుఁ డగును. జలకణములను భక్షించనిచో వరుణుఁడు గ్రహించఁడు. అనఁగా మహోదర రోగ గ్రస్తుఁడు కాఁడు. అందువలన యజమానుఁడు ఆ జలకణములను స్పృశించవలెను. ఉపస్పర్శము భక్షణము కాదు కనుక వరుణుఁడు ఇతనిని గ్రహించఁడు. కేవలము భక్షణము కాకున్నను భక్షణమునకు ప్రత్యామ్నాయముగ ఉపస్పర్శమును చేయుటవలన పశుమంతుఁ డగును. ఇచట జలకణ భక్షణాభక్షణములు దోషావహము లగుటచే తత్పరిహారమునకై జలకణోపస్పర్శము విధించఁబడినది.

21. అర్థము: "ప్రతియుతో వరుణస్య పాశః" ఇతి ఆహ="బంధన హేతువైన వరుణునియొక్క పాశము పృథక్కృత మైనది" అని చెప్పుచు యజమానుఁడు ఉదక మధ్యమున ప్రవేశించుటవలన, (అయమ్=ఈ యజమానుఁడు, వరుణపాశాదేవ=వరుణపాశమునుండియే, నిర్ముచ్యతే=విడిపించఁబడువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: "ప్రతియుతో వరుణస్య పాశః ప్రత్యస్తో వరుణస్య పాశః" అను మంత్రమును పఠించుచు యజమానుఁడు ఉదక మధ్యమున ప్రవేశించవలెనని కల్పసూత్రము చెప్పినది. ఈ విధముగ చేయుటవలన యజమానుఁడు వరుణపాశమునుండి విముక్తుఁడగు ననెడి మంత్రార్థము ఆ విధముగనే ఫలించుచున్నదని ఈ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది.

22. అర్థము: అప్రతీక్షమ్=జలమును చూడకుండ, ఆ యన్తి=తిరిగి రావలెను. (ప్రతత్=ఈ యాగమనము,) వరు ణస్య=వరుణునియొక్క, అన్తర్హిత్యై=అదర్శనముకొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: యజమానాదులు ఉదకములనుండి వెలుపలకు వచ్చి ఆ జలములను చూడకుండ దేవయజన ప్రదేశమునకు రావలయును. ఇట్లు వచ్చుటవలన వరుణుఁడు అంతర్హితుఁ డగును. "యజమానాదులు జలమునుండి వెలుపలకు వచ్చి యా జలమును చూడకుండనే దేవయజన ప్రదేశమునకు రావలయునని యీ బ్రాహ్మణము విధించనది.

23. అర్థము: "ఏధోఽస్యేధిషీమహి" ఇతి ఆహ="ఓ సమిధా! నీవు అగ్నికి వృద్ధిహేతు వగుచున్నావు. కనుక మేము అభివృద్ధిని పొందితిమి." అని ఈ మంత్రము చెప్పినది. సమిధైవ=సమిధచేతనే, అగ్నిమ్=ఆహవనీయాగ్నిని, నమస్యన్తః= పూజించుచున్నవారై, ఉపాయన్తి=సమీపమును పొందవలెను.

తాత్పర్యము: 'ఓ సమిధా! నీవు అగ్నివృద్ధికి హేతు వగుచున్నావు. కనుక మేము వృద్ధిని పొందితిమి' అని మంత్రము చెప్పటచే యజమానాదులు అగ్నియందు సమిదాధానముచేత అగ్నిని పూజించుచున్నవారై అగ్ని సమీపమును పొందుచున్నారు. ఇచట సమిదాధానముచే అగ్నిదేవుఁడు పూజింపఁబడుచున్నాఁడని యీ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది.

24. అర్థము: "తేజోఽసి తేజో మయి ధేహి" ఇతి ఆహ="ఓ సమిధా! నీవు కాంతిసాధన మగుచున్నావు. నాయందు కాంతిని స్థాపించుము" అని ఈ మంత్రము చెప్పినది. (అతః=ఇందువలన,) తేజః ఏవ=కాంతినే, ఆత్మన్=తనయందు, ధత్తే= ధరించువాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: 'ఓ సమిధా! నీవు కాంతిసాధన మగుచున్నావు. నాయందు కాంతిని స్థాపించుము' అని యజమానుఁడు ప్రార్థించుటచే అతఁడు తనయందు కాంతినే స్థాపించుకొనువాఁ డగుచున్నాఁడు. ఇచట మంత్రమునందలి "మయి ధేహి" అను పదములయొక్క అభిప్రాయము విశదీకరించఁబడినది.

తృతీయానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే చతుర్థోఽనువాకః

మూలము: [1]స్ఫ్యేన వేదిముద్ధన్తి రథాక్షేణ వి మిమీతే యూపం మినోతి త్రివృతమేవ వజ్రగ్ం సంభృత్య
భ్రాతృవ్యాయ ప్రహరతి స్తృత్యై [2]యదన్తర్వేది మినుయా ద్దేవలోకమభి జయేద్యద్బహిర్వేది మనుష్య
లోకం వేద్యన్తస్య సంధౌ మినోత్యుభయో ర్లోకయో రభిజిత్యా [3]ఉపరసంమితాం మినుయా త్పితృ
లోకకామస్య రశనసంమితాం మనుష్యలోకకామస్య చషాలసంమితా మిన్ద్రియకామస్య సర్వాన్సమా
న్ప్రతిష్ఠాకామస్య యే త్రయో మధ్యమా స్తాన్సమా న్పశుకామ[4] స్యైతాన్వై (౧)అను పశవ ఉపతి
ష్ఠన్తే పశుమానేవ భవతి [5] వ్యతిషజే దితరా న్ప్రజయైవైనం పశుభి ర్వ్యతిషజతి [6]యం కామయేత
ప్రమాయుకః స్యాదితి గర్తమితం తస్య మినుయా దుత్తరార్ధ్యం వర్షిష్ఠమథ హ్రసీయాగ్ంసమేషా వై
గర్తమిద్యస్యైవం మినోతి తాజక్ప్ర మీయతే దక్షిణార్ధ్యం వర్షిష్ఠం మినుయా త్సువర్గకామస్యాథ
హ్రసీయాగ్ంస మాక్రమణమేవ తత్సేతుం యజమానః కురుతే సువర్గస్య లోకస్య సమష్ట్యై (౨)
[7]యదేకస్మిన్యూపే ద్వే రశనే పరివ్యయతి తస్మాదేకో ద్వే జాయే విన్దతే యన్నైకాగ్ంరశనాం
ద్వయోర్యూపయోః పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌ పతీ విన్దతే [8]యం కామయేత స్త్ర్యస్య జాయేతే
త్యుపాన్తే తస్య వ్యతిషజే త్స్త్ర్యేవాస్య జాయతే యం కామయేత పుమానస్య జాయేతేత్యాన్తం తస్య ప్ర
వేష్టయే త్పుమానేవాస్య (౩) జాయతే [9]ఽసురా వై దేవాన్దక్షిణత ఉపానయన్తాన్దేవా ఉపశయేనైవా
పానుదన్త తదుపశయస్యోపశయత్వం యద్దక్షిణత ఉపశయ ఉపశయే భ్రాతృవ్యాపనుత్త్యై [10]సర్వే వా

అన్యే యూపాః పశుమన్తోఽథోపశయ ఏవాపశుస్తస్య యజమానః పశుర్యన్న నిర్దిశేదార్తి మార్ఛేద్య

జమానోఽసౌ తే పశురితి నిర్దిశేద్యం ద్విష్యాద్యమేవ (౪) ద్వేష్టి తమస్మై పశుం నిర్దిశతి [11]యది

న ద్విష్యాదాఖుస్తే పశురితి బ్రూయాన్న గ్రామ్యాన్పశూన్హినస్తి నాఽఽరణ్యా [12]న్ప్రజాపతిః ప్రజా

అసృజత సోఽన్నాద్యేన వ్యార్ధ్యత స ఏతామేకాదశినీ మపశ్యత్తయా వై సోఽన్నాద్య మవారున్ధ యద్దశ

యూపా భవన్తి దశాక్షరా విరాడన్నం విరాడ్విరాజైవాన్నాద్యమవ రున్ధే (౫) య ఏకాదశః స్తన

ఏవాస్యై స దుహ ఏవైనాం తేన [13]వజ్రో వా ఏషా సం మీయతే యదేకాదశినీ సేశ్వరా పురస్తా

త్ప్రత్యఞ్చం యజ్ఞగ్ం సంమర్దితో ర్యత్పాత్నీవతం మినోతి యజ్ఞస్య ప్రత్యుత్తబ్ధ్యై సయత్వాయ(౬)॥

(వై సమష్ట్యై పుమానేవాస్య యమేవ రున్ధే త్రిగ్ంశచ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే చతుర్థోఽనువాకః ॥ ౪ ॥

## వేదార్థదీపిక

**అవతారిక:** ఇంతవఱకు సోమయాగ సంబంధియగు మంత్రకాండము, తద్వ్యాఖ్యాన రూపమైన బ్రాహ్మణము సమాప్తమైనవి. అయినను ఇంకను బ్రాహ్మణశేషములైన యెనిమి దనువాకములు కలవు. ఆ యనువాకములందు క్రమముగ యూపైకాదశిని, పశ్వైకాదశిని, పాత్నీవతపశువు, సౌమ్యచర్వాదికము, అతిగ్రాహ్యావిధి, అదాభ్యగ్రహవిధి అంశుగ్రహవిధి, షోడశిగ్రహవిధియు చెప్పఁబడుచున్నవి. వానిలో ప్రథమమున ఈ చతుర్థానువాకమునందు యూపైకాదశిని చెప్పఁబడుచున్నది. యూపముల పదునొకండు కల పంక్తి యూపైకాదశిని. యూపైకాదశ పంక్తి అని యర్థము.

1. **అర్థము:** స్ఫ్యేన='స్ఫ్యము' అను సాధనవిశేముచేత, వేదిమ్= వేదిని, ఉద్ధన్తి=త్రవ్వవలెను. రథాక్షేణ=బండికంటిలో, విమిమీతే=వేదిని కొలువవలెను. యూపమ్=యూపములను, (జాతావేకవచనమ్) మినోతి= అవటములందు స్థాపించవలెను. (తదా=అప్పుడు, యజమానః= యజమానుఁడు,) త్రివృతమ్=మూఁడు విధములుగా అయిన, వజ్రమేవ=వజ్రాయుధమునే, సంభృత్య=సంపాదించి, స్తృత్యై=నాశముకొఱకు, భ్రాతృవ్యాయ=శత్రువు(ను) కొఱకు, ప్రహరతి=కొట్టినవాఁడగును.

**తాత్పర్యము:** అగ్నిష్టోమమునందలి సవనీయ పశువుతోఁ గూడ అనంతరానువాకములందు పదునొకండు పశువులు వికల్పముగ విధింపఁబడ నున్నవి. ఆ పదునొకండు పశువులకై పదునొకండు యూప (స్తంభ)ములు ఆవశ్యకములై యున్నవి. ఆ యేకాదశ యూపములను స్థాపించుటకు తగినంతటి వేదిని త్రవ్వవలెను. అనఁగా భూమి

పైని గల కాలుష్యమును పోఁగొట్టుటకై వేదిస్థానమును పైపైని త్రవ్వవలెను. ఇచట యూపము ఒకటి యని, పదునొకండు యూపము లని పక్షద్వయము కలదు. ఒక యూపము అను పక్షమున వేదిని అడుగులతో కొలువవలెను. కనుకనే "త్రింశత్పదాని పశ్చాత్తిరశ్చీ" అని పూర్వము ఉదాహరించఁబడినది. యూపైకాదశిని అను పక్షమున రెండేసి అవటముల మధ్యదేశమును బండికంటితో (రథాక్షముతో) పరిమిత మైనదిగా ఉండునట్లు కొలువవలెను. అట్టి వేదికి దక్షిణపుటంచు మొదలు ఉత్తరపు టంచువఱకు పంక్తిరూపమున ఉన్నటువంటి పదునొకండు అవటములందు పదునొకండు యూపములను స్థాపించవలెను. అవటము=యూపమును పాఁతుటకు త్రవ్విన గొయ్యి. యూపైకాదశిని=యూపైకాదశపంక్తి.

పూర్వము ఇంద్రుఁడు వృత్రునిపైని ప్రయోగించిన వజ్రాయుధము మూఁడు భాగములుగా విఱిగి పడెను. అందు ఒకటి స్ఫ్యము. రెండవది రథాక్షము (బండికన్ను). మూఁడవది యూపము. ఇచట స్ఫ్యముచేత భూమి (వేది)ని త్రవ్వి ఆ ప్రదేశములను రథాక్ష పరిమితములుగా కొలిచి అందలి అవటములందు యూపములను స్థాపించుటవలన యజమానుఁడు ఏతత్త్రియాత్మకమైన వజ్రాయుధమును శత్రుహింసకై శత్రువుపైని ప్రయోగించినవాఁ డగును. స్ఫ్యము=దారుమయమైన ఖడ్గవిశేషము.

2. అర్థము: అన్తర్వేది=వేదిమధ్యమున, మినుయాత్ యత్= యూపమును స్థాపించినచో, దేవలోకమ్=దేవలోకమును, అభిజయేత్=అంతటను జయించును (పొందును). బహిర్వేది=వేదికి వెలుపల, మినుయాత్ యత్=స్థాపించినచో, మనుష్యలోకమ్=మనుష్య (భూ) లోకమును, అభిజయేత్=అంతటను జయించును. వేద్యన్తస్య సంధౌ=వేదియొక్కయు, వేది సమీపముయొక్కయు సంధియందు, మినుయాత్ యత్=స్థాపించుచో, (ఏతత్=ఇది,) ఉభయోః లోకయోః అభిజిత్యై=భూలోక స్వర్గలోకముల ప్రాప్తికొఱకు, భవతి= అగుచున్నది.

తాత్పర్యము: తాత్పర్యము స్పష్టము. యూపావటముయొక్క అర్ధభాగము, వేదియందర్ధభాగము, వేదిబహిర్భాగము, అను నీ మూఁడును యూపస్థాపనమునకు ప్రదేశములుగా నిచట విధించఁబడినవి.

3. అర్థము: పితృలోక కామస్య=పితృలోకమును కోరునట్టి యజమానుని నిమిత్తము, ఉపరసంమితామ్=ఉపరముతో సమానముగా, మినుయాత్= యూపైకాదశినిని స్థాపించవలెను. మనుష్యలోక కామస్య=మనుష్య లోకమును కోరునట్టి యజమానుని నిమిత్తము, రశనాసంమితామ్=రశనాదేశస్థౌల్యముతో సమానముగా, మినుయాత్. ఇన్ద్రియ కామస్య=ఇంద్రియ సామర్థ్యమును కోరునట్టి యజమానుని నిమిత్తము, చషాలసంమితామ్=చషాలవిస్తారముతో సమానముగా, మినుయాత్. ప్రతిష్ఠాకామస్య=ప్రతిష్ఠాకాముని నిమిత్తము, సర్వాన్ సమాన్= సమస్తములైన ఉపర రశనాదేశస్థౌల్య చషాల విస్తారములను, మినుయాత్. పశుకామస్య= పశుకాముని నిమిత్తము, యే త్రయః మధ్యమాః=అయిదు, ఆఱు, ఏడు, యూపములు ఏవి కలవో, తాన్=ఆ యూపములను, సమాన్=సమాములనుగా, మినుయాత్= స్థాపించవలెను.

తాత్పర్యము: తక్షణ రహితములైన (చెక్కఁబడని) యూపమూలములకు ఉపరములని వ్యవహారము, యూపైకాదశిని అనఁగా పదునొకండు యూపములు అని అర్థము. ఒక యూపముయొక్క ఉపరము ఎంత ఆయామము కలిగియుండునో, మిగిలిన పది యూపముల ఉపరములు అంతటి ఆయామము కలిగి యుండవలెను. ఇది పితృలోక కాముఁడైన యజమానుని నిమిత్తము చేయవలెను. యూపమునకు రశనను (త్రాటిని) బంధించునట్టి ప్రదేశము రశనాప్రదేశము. అది ఎంత స్థూలముగా నుండునో, ఏకాదశ యూపముల రశనాప్రదేశములు దానితో సమానములుగా నుండవలెను. ఇది మనుష్యలోక కాముని నిమిత్తము చేయవలెను. చషాల మనఁగా యూపమునకు పైని తొడుగునట్టి కడియము. ఒక యూపముయొక్క చషాలము ఎంత విస్తృతమై యుండునో, మిగిలిన పది యూపముల చషాలములు అంత విస్తృతములై యుండవలెను. ఇది ఇంద్రియ పాటవమును కోరునట్టి యజమానుని నిమిత్తము చేయవలెను. ఒక యూపముయొక్క ఉపర రశనాప్రదేశ

చషాలములు వరుసగా ఎంత ఆయామ స్థౌల్య విస్తారములు కలిగి యుండునో, మిగిలిన పది యూపముల ఉపరి రశనాప్రదేశ చషాలములు ప్రతిష్ఠాకాముని నిమిత్తము అంతటి ఆయామ స్థౌల్య విస్తారములు కలిగియుండవలెను. పదునొకండు యూపములలో అయిదవది, ఆఱవది, ఏడవది అయిన యూపములు మధ్యమములు. పశుకాముని నిమిత్తము ఆ మధ్యమ యూపములు సమానములుగా నుండవలెను. ఈ విధముగ ఆ యా యజమానుల కామనాభేదము ననుసరించి యూపముల నుంచవలెను. ఇచట ఉచ్ఛ్రియమునందు కొన్ని కామ్యవిశేషములు విధించఁబడినవి. ఉచ్ఛ్రియము=పొడవు.

4. అర్థము: ఏతాన్=ఈ పూర్వోక్తములైన యూపములను, అను ఏవ=అనుసరించియే, పశవః=పశువులు, ఉపతిష్ఠన్తే=యజమానుని సేవించును (పొందును). పశుమానేవ=(అప్పుడు యజమానుఁడు) పశుమంతుఁడే, భవతి=అగును.

తాత్పర్యము: పూర్వోక్తములైన యూపముల ననుసరించియే పశువులు యజమానుని పొందును. అప్పుడు యజమానుఁడు పశుమంతుఁ డగును.

5. అర్థము: ఇతరాన్=మొదటి మూఁడు యూపములకంటె ఇతరములైన యెనిమిది యూపములను, వ్యతిషజేత్=పరస్పర స్పర్శము కలవిగా చేయవలెను. (తదా=అప్పుడు, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) ఏనమ్=ఈ యజమానుని, ప్రజయా=సంతానముతోడను, పశుభిః=పశువులతోడను, వ్యతిషజత్యేవ=కలిపినవాఁడే యగును.

తాత్పర్యము: పదునొకండు యూపములలో మొదటి మూఁడు యూపములకంటె ఇతరములైన యెనిమిది యూపములను అధ్వర్యుఁడు అన్యోన్య స్పర్శము కలవిగా చేయవలెను. అప్పు డతఁడు ఈ యజమానుని సంతానముతోను పశువులతోను కలిపినవాఁ డే యగును.

6. అర్థము: (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, ప్రమాయుకః=మరణశీలుఁడు, స్యాత్=అగుఁగాక, ఇతి=అని, కామయేత=కోరునో, తస్య=ఆ యజమానుని నిమిత్తము, గర్తమితమ్=యూపైకాదశినిని గర్తమితముగా, మినుయాత్= స్థాపించవలెను. ఉత్తరార్ధ్యమ్=పదునొకండు యూపములలో మధ్యమమైన అగ్నిష్ఠ నామక యూపమునకు ఉత్తరభాగముననున్న యూపపంచకము, వర్షిష్ఠమ్= ఉన్నతమైనదిగాను, అథ=మిగిలిన దక్షిణ భాగమునందలి యూపపంచకము, హ్రాసీయాంసమ్=హ్రస్వమైనదిగాను (పొట్టిదిగా), మినుయాత్=ప్రతిష్ఠించవలెను. ఏషా=ఇటువంటి యూపైకాదశిని, గర్తమిత్ సమా=గర్తమిత్సమానమైనది. యస్య= ఏ యజమానుని నిమిత్తము, ఏవమ్=ఈ విధముగ, మినోతి=యూపైకాదశినిని ప్రతిష్ఠించునో, (సః=ఆ యజమానుఁడు,) తాజక్=వెంటనే, ప్రమీయతే=మరణించును. సువర్గకామస్య=స్వర్గమును కోరునట్టి యజమానుని నిమిత్తము, దక్షిణార్ధ్యమ్=మధ్యమమైన అగ్నిష్ఠ నామక యూపమునకు దక్షిణార్ధమైన యూపపంచకమును, వర్షిష్ఠమ్=ఉన్నత మైనదిగాను, అథ=మిగిలిన ఉత్తరార్ధమైన యూపపంచకమును, హ్రాసీయాంసమ్=హ్రస్వమైనదిగాను, మినుయాత్= ప్రతిష్ఠించవలెను. తత్=అప్పుడు, యజమానః=యజమానుఁడు, ఆక్రమణం సేతుమేవ=స్వర్గము నారోహించుటకు సాధనమైన సేతువుగానే, కురుతే=చేసినవాఁడగును. (ఏతత్=ఇది,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, అభిజిత్యై= ప్రాప్తికొఱకు, భవతి=అగును. ఇచట గర్త శబ్దమునకు దక్షిణదిశయం దుండునట్టి శ్మశానమని యర్థము. గర్తవత్ మీయన్తే యూపాః అస్యామ్ ఏకాదశిన్యామితి గర్తమిత్. తాదృశీ ముచ్ఛ్రియేత్. శ్మశానమునవలె యూపములు ప్రతిష్ఠించబడినచో అది 'గర్తమిత్' అని అనఁబడును. గర్తమిత్సదృశముగా యూపైకాదశినిని ప్రతిష్ఠించవలెను.

తాత్పర్యము: ఏ యజమానుఁడు మరణించవలెనని అధ్వర్యుఁడు కోరునో, ఆ యజమానుని నిమిత్తము అధ్వర్యుఁడు యూపైకాదశినిని (పదునొకండు యూపములను) గర్తమిత్సదృశముగా ప్రతిష్ఠించవలెను. అనఁగా మధ్యమవుదైన అగ్నిష్ఠ నామక యూపమునకు ఉత్తరవు యూపపంచకమును ఉన్నతముగాను, దక్షిణవుదైన

యూపపంచకమును హ్రస్వముగాను ప్రతిష్ఠించవలెను. అప్పుడు ఆ యజమానుఁడు వెంటనే మరణించును. స్వర్గమును కోరునట్టి యజమానుని నిమిత్తము పూర్వోక్తమునకు భిన్నముగా ప్రతిష్ఠించవలెను. అప్పుడు స్వర్గకాముఁడైన యజమానుఁడు స్వర్గమును పొందుటకు సాధనమైన సేతువునుగా దీనిని చేసినవాఁడగును. అప్పుడిది స్వర్గప్రాప్తికి కారణ మగును. ఇచట కామనాభేదముచే యూపైకాదశినికి దక్షిణ దేశ ప్రవణత్వమును నిందించి, ఉత్తరదేశ ప్రవణత్వము విధించఁబడినది. ప్రవణము= వాటపు పల్లము.

7. అర్థము: యత్=ఏ కారణమువలన, ఏకస్మిన్ యూపే=ఒక యూపమునందు, ద్వే రశనే=రెండు (త్రాళ్లను) రశనలను, పరివ్యయతి= చుట్టుచున్నాఁడో, (చుట్టవలెను అని విధి.) తస్మాత్=ఆ కారణమువలన, ఏకః= ఒక పురుషుఁడు, ద్వే జాయే=ఇద్దఱు భార్యలను, విన్దతే=పొందు చున్నాఁడు. యత్=ఏ కారణముపలన, ద్వయోః యూపయోః=రెండు యూపములందు, ఏకాం రశనామ్=ఒక రశనను (త్రాటిని), ని పరివ్యయతి=చుట్టుటలేదో, తస్మాత్= ఆ కారణమువలన, ఏకా=ఒక భార్య, ద్వౌ పతీ=ఇద్దఱు భర్తలను, న విన్దతే= పొందుటలేదు.

తాత్పర్యము: ఒక యూపమునందు రెండురశనలను చుట్టవలెను. (ఇది విధివాక్యము). కావుననే లోకమునందు ఒక భర్త ఇద్దఱు భార్యలను పొందుచున్నాఁడు ( వివాహము చేసికొనుచున్నాఁడు). రెండు యూపకములందు ఒక రశనను (త్రాటిని) చుట్టరాదు. (ఇది నిషేధవాక్యము). కనుకనే లోకమునందు ఒక స్త్రీ ఇద్దఱు భర్తలను పొందుటలేదు (వివాహమాడుటలేదు). (ఇచట లౌకిక దృష్టాంతముచే రశనాద్వయము విధించఁబడినది.)

8. అర్థము: అస్య=ఈ యజమానునకు, స్త్రీ=స్త్రీ సంతానము, జాయేత ఇతి=పుట్టవలెనని, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, కామయేత=కోరునో, తస్య=ఆ యజమానుని నిమిత్తము, ఉపాన్తే=రశనల యొక్క కొనల సమీపమునందు, వ్యతిషజేత్= కలువవలెను (మేళనము చేయువలెను.) అస్య=ఈ యజమానునకు, స్త్రీ ఏవ=స్త్రీ సంతానమే, జాయతే=పుట్టును. అస్య=ఈ యజమానునకు, పుమాన్=పురుష సంతానము, జాయేత ఇతి=పుట్టుఁగాక యని, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యమ్=ఏ యజమాను నుద్దేశించి, కామయేత=కోరునో, తస్య=ఆ యజమానునుని నిమిత్తము, ఆన్తమ్=అంతముతో కూడిన రశనాద్వయ భాగమును, ప్రవేష్టయేత్=యూపమునకు చుట్టవలెను. (తదా=అప్పుడు,) అస్య=ఈ యజమానునకు, పుమానేవ=పురుష సంతానమే, జాయతే=పుట్టును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు యజ్ఞకర్తకు స్త్రీ సంతానము కలుగవలెనని కోరినచో, యూపమునకు చుట్టునటువంటి రెండు రశనల కొనల సమీపములను మేళనము చేయువలెను (కలుపవలెను). అప్పుఁ డా యజమానునకు స్త్రీ సంతానము కలుగును. యజమానునకు పురుష సంతానము కలుగవలెనని కోరినచో, కొనలతో కూడిన రశనాద్వయమును యూపమునకు చుట్టవలెనను. అప్పుఁ డతనికి పురుష సంతానమే కలుగును. (ఇచట కామనాభేదముచే రశనాద్వయముయొక్క అంతముల మేళనము (ప్రవేష్టనము) విధించఁబడినది.)

9. అర్థము: అసురాః=అసురులు, దేవాన్=దేవతలను, దక్షిణతః=అగ్నిష్ఠ నామక యూపమునకు దక్షిణభాగమున, ఉపానయన్ వై= కొనిపోయిరఁట. దేవాః=దేవతలు, తాన్=ఆ యసురులను, ఉపశయేనైవ= ఉపశయ నామక యూపముచేతనే, అపానుదన్త=పోఁదోలిరి. ఉపశయః యత్= సమీపమున శయనమనునది ఏది కలదో, తత్=దానివలన, ఉపశయస్య=సమీప శయనము కలది అను నర్థము కల ఉపశయ నామక యూపమునకు, ఉపశయత్వమ్='ఉపశయము' అను పేరు (సంపన్నమ్= సిద్ధించినది.) భ్రాతృవ్యాపనుత్త్యై=శత్రువును తొలఁగించుటకై, ఉపశయే= యూపమును శయానముగా పడవేయవలెను.

తాత్పర్యము: పూర్వము రాక్షసులు దేవతలను అగ్నిష్ఠనామక మధ్యమ యూపమునకు దక్షిణ భాగమున కొనిపోయిరి. అప్పుడు దేవతలు ఆ యసురులను 'ఉపశయము' అనెడి, ఏకాదశాతిరిక్తమైన, ఏకాదశినీ సమీప శయానమై

యున్న యూపముచేత పోఁదోలిరి. యూపైకాదశినీ సమీపమున శయానమైయున్న యూపమేది కలదో, దానికి సమీపమున శయానమై యుండునది అను నర్థము కల యూపమునకు 'ఉపశయము' అను పేరు సార్థక మైనది. కావున శత్రువులను పోఁగొట్టుటకై మఱియొక యూపమును యూపైకాదశినీ సమీప మున శయానమైయున్న విధముగ పడవేయవలెను. శయానము= పండుకొనఁజేయుట. ఇచట పదునొకండు యూపములకంటె నధికముగ మఱియొక యూపము విధించఁబడినది. దీనిపేరు ఉపశయము.

10. అర్థము: అన్యే సర్వే యూపాః=ఉపశయ యూపముకంటె నితరములైన అగ్నిష్ఠాది యూపము లన్నియు, పశుమన్తః వై=అగ్నేయాది పశువులతో కూడినవియే. అథ=కాని, ఉపశయః ఏవ=ఉపశయ యూపమే, అపశుః=పశు రహిత మైనది. తస్య=ఆ ఉపశయ యూపమునకు, యజమానః=యజమానుఁడు, పశుః=పశువు. యజ మానః=యజమానుఁడు, న నిర్దిశేత్=ఉపశయ యూపమునకు పశువును నిర్దేశించనిచో, ఆర్తిమ్=దుఃఖ మును, ఆర్ఛేత్=పొందును. ( హే ఉపశయ!=ఓ ఉపశయ యూపమా!) "తే=నీకు, అసౌ=ఈ ద్వేష్యుఁ డైన శత్రువు, పశుః ఇతి=పశువని" యమ్=ఏ శత్రువును, ద్విష్యాత్= ద్వేషించునో, యమేవ=ఏ శత్రు వునే, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడో, తమ్=ఆ శత్రువును, అస్మై=ఈ ఉపశయ యూపముకొఱకు, పశుః ఇతి= పశువని, నిర్దిశతి=నిర్దేశించవలెను.

తాత్పర్యము: అగ్నిష్ఠాదులైన పదునొకండు యూపములు వక్ష్యమాణములైన ఆగ్నేయాది పశువులతో కూడియున్నవి. కాని పంౘ్రెండవదియైన ఉపశయ యూపము పశురహిత మైనది. కనుక ఆ ఉపశయ యూపమునకు యజ మానుఁడు పశు వగును. యజమానుఁడు ఉపశయముకొఱకు ఏదియేని ఒక పశువును నిర్దేశించనిచో, తాను దుఃఖమును పొందును. కనుక స్వదుఃఖ పరిహారమునకై తాను ఒకనిని ద్వేషించి ఆ ద్వేషించిన శత్రువును "ఉపశయమా! నీకు ఈ ద్వేష్యుఁడు పశువు" అని నిర్దేశించవలెను. అప్పుడు యజమానుఁడు దుఃఖ విముక్తుఁ డగును. ఇచట ద్వేష్యుని పశువుగా నిర్దేశించవలెనని విధించఁబడినది. యూపమనునది యజ్ఞము నందు ఆలంభనము చేయవలసిన పశువును కట్టివేయుట కుద్దేశించఁబడినది కనుక, ప్రతి యూపమునకు ఒక్కొక్క పశువు నిర్దేశించఁ బడియుండును. పూర్వోక్తములైన పదునొకండు యూపములకు ఆగ్నేయా దులైన పదునొకండు పశువులు నిర్దిష్టములై యున్నవి. అందువలన ఇచట పంౘ్రెండవదియైన ఉపశయ యూపమునకు ద్వేష్యుఁడు పశువుగా విధింపఁబడెను.

11. అర్థము: న ద్విష్యాత్ యది=యజమానుఁడు ఏ ఒకనిని కూడ ద్వేషించని యెడల, "తే ఆఖుః పశుః" "ఓ ఉపశయమా! నీకు ఎలుక పశువు" ఇతి= అని, బ్రూయాత్=యజమానుఁడు పలుకవలెను. (ఏవం కృతే సతి=ఇట్లు చేయఁబడఁగా,) గ్రామ్యాన్=గ్రామ్యములైన, పశూన్=పశువులను, న హినస్తి=హింసించినవాఁ డగుట లేదు. ఆరణ్యాన్=ఆరణ్య పశువులను, న హినస్తి=హింసించినవాఁ డగుట లేదు.

తాత్పర్యము: యజమానుఁడు ఏ యొకనిని కూడ ద్వేషించనిచో, ఉపశయ యూపమునకు ఎలుకను పశువుగా నిర్దేశించవ లెను. ఇట్లు చేసినచో యజమానుఁడు గ్రామ్య పశువులను కాని, ఆరణ్య పశువులను కాని హింసించినవాఁ డు కాఁడు. ద్వేష్యాభావ పక్షమున ఇచట మూషికము పశువుగా విధించఁ బడినది.

12. అర్థము: ప్రజాపతిః=ప్రజాపతి, ప్రజాః=ప్రజలను, అసృజత=సృష్టించెను. సః=అతఁడు, అన్నాద్యేన=శ్రేష్ఠమైన అన్న ముచే, వ్యార్ధ్యత=సమృద్ధి హీనుఁ డయ్యెను. సః=ఆ ప్రజాపతి, ఏతామ్ ఏకాదశినీమ్=ఈ యూపైకాదశినిని, అపశ్యత్=చూచెను (తెలిసికొనెను). తయా వై=ఆ యూపైకాదశినిచేతనే, సః=ఆ ప్రజాపతి, అన్నా ద్యమ్=రాజామాత్యాదులు భుజింప నర్హమైన అన్నమును, అవారున్ద=పొందెను. దశ యూపాః=యూపైకాదశి నిలోని పది యూపములు, భవన్తి యత్=ఉన్నవనుట యేది కలదో, విరాట్=విరాట్ఛందస్సు, దశాక్షరా=పది యక్షరములు కలది. విరాట్= విరాట్ఛందస్సు, అన్నమ్=అన్నస్వరూపము, విరాజైవ=విరాట్ఛందస్సుచేతనే,

అన్నాద్యమ్=శ్రేష్ఠమైన అన్నమును, అవరున్ధే=పొందును. యః ఏకాదశః= పదునొకండవ యూపము ఏది కలదో, సః=అది, అస్యై=ఈ యూపైకాదశిని అనెడి గోవునకు, (షష్ఠ్యర్థే చతుర్థీ.) స్తనః=స్తనమువంటిది. తేన=ఆ స్తనమువంటి పదునొకండవ యూపముచేత, ఏనామ్=గోవువంటి ఈ యూపైకాదశినిని, దుహే ఏవ= అన్నాద్యరూప పయస్సును నిశ్చయముగ పితికెను.

తాత్పర్యము: ప్రజాపతి ప్రజలను సృజించి అన్నాద్య సమృద్ధి లేనివాఁ డయ్యెను. అప్పు డతఁడు యూపైకాదశినిని అన్నాద్య ప్రాప్తి సాధనముగా కనుఁగొనెను. అతఁ డా యూపైకాదశినిచేతనే అన్నాద్యము నొందెను. యూపైకాదశినిలో దశ యూపములు కలవు. విరాట్ఛందస్సు పది యక్షరములు కలది. విరాట్ఛందస్సు అన్నప్రాప్తి సాధనమగుటచే అన్నస్వరూపము. దశసంఖ్యా సామ్యముచే యూపైకాదశిని విరాట్స్వరూపము. యూపైకాదశిని రూప గోవుచే అన్నాద్యము నొందెను. పదునొకండవ యూపము యూపైకాదశినీ రూప గోవునకు స్తనము వంటిది. ఆ ప్రజాపతి ఆ స్తనమువంటి పదునొకండవ యూపముచే యూపైకాదశిని రూప గోవునుండి అన్నాద్యరూప పయస్సును పితికెను (పొందెను). విహితమైన యూపైకాదశిని యిచట ప్రశంసించఁబడినది.

13. అర్థము: ఏకాదశినీ యత్=యూపైకాదశిని యేది కలదో, ఏషా=ఇది, వజ్రః వై=వజ్రాయుధమే (వజ్రాయుధమువంటిదే). సా=ఆ వజ్రరూపమైన యూపైకాదశిని, పురస్తాత్=పురోభాగమున, (అవస్థాయ=ఉండి,) ప్రత్యఞ్చమ్= ప్రత్యగవస్థితమైన, యజ్ఞమ్=యజ్ఞమును, సంమర్దితోః=బాగుగ అణఁచుటకు, ఈశ్వరా=సమర్థమైనది. (తత్=ఆ కారణమువలన,) పాత్నీవతమ్= పాత్నీవత మనెడి యూపమును, మినోతి=ప్రతిష్ఠించవలెను. (ఇదమ్=ఈ పాత్నీవత ప్రతిష్ఠాపనము,) యజ్ఞస్య=యజ్ఞముయొక్క, ప్రత్యుత్తబ్ధ్యై=ప్రత్యుత్తబ్ధికొఱకు, సయత్వాయ=దృఢత్వముకొఱకు, భవతి=అగును. సయః=బంధము. "షిఞ్=బన్ధనే" అను ధాతువు నుండి ఈ శబ్దము పుట్టినది.

తాత్పర్యము: యూపైకాదశిని వజ్రరూపమై యజ్ఞమునకు పురోభాగమున ఉన్నదై పశ్చిమమున నున్న యజ్ఞమును అణఁచుటకు సమర్థ మగును. అణఁచఁబడిన యజ్ఞమును మఱల సరిచేయుటకు, యజ్ఞముయొక్క దృఢత్వము కొఱకును. పాత్నీవత మనెడి పదమూఁడవ యూపమును ప్రతిష్ఠించవలెను. ప్రత్యుత్తబ్ధి=మర్దితమైనదానిని మఱల సరిచేయుట. ఇచట పాత్నీవతాఖ్య త్రయోదశ యూపము విధించఁ బడినది.

చతుర్థానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే పఞ్చమోఽనువాకః

మూలము: [1] ప్రజాపతిః ప్రజా అసృజత స రిరిచానోఽమన్యత స ఏతామేకాదశినీ మపశ్యత్తయా వై స ఆయు రిన్ద్రియం వీర్య మాత్మన్నధత్త ప్రజా ఇవ ఖలు వా ఏష సృజతే యో యజతే స ఏతర్హి రిరిచాన ఇవ యదేషైకాదశినీ భవత్యాయురేవ తయేన్ద్రియం వీర్యం యజమాన ఆత్మన్దత్తే [2] ప్రైవాఽఽగ్నేయేన వాపయతి మిథునగ్ం సారస్వత్యా కరోతి రేతః (౧) సౌమ్యేన దధాతి ప్ర జనయతి పౌష్ణేన బార్హ స్పత్యో భవతి బ్రహ్మ వై దేవానాం బృహస్పతి ర్బ్రహ్మణైవాస్మై ప్రజాః ప్ర జనయతి వైశ్వదేవో భవతి వైశ్వదేవ్యో వై ప్రజాః ప్రజా ఏవాస్మై ప్ర జనయతీన్ద్రియ మేవైన్ద్రేణావ రున్ధే విశం మారు తేనౌజో బలమైన్ద్రాగ్నేన ప్రసవాయ సావిత్రో నిర్వరుణత్వాయ వారుణో [3] మధ్యత ఐన్ద్రమా లభతే మధ్యత ఏవేన్ద్రియం యజమానే దధాతి (౨) పురస్తా దైన్ద్రస్య వైశ్వదేవమా లభతే వైశ్వదేవం వా అన్నమన్న మేవ పురస్తాద్ధత్తే తస్మాత్పురస్తాదన్న మద్యత ఐన్ద్రమాలభ్య మారుతమా లభతే విడ్వై మరుతో విశమేవాస్మా అను బధ్నాతి [4] యది కామయేత యోఽవగతః సోఽప రుధ్యతాం యోఽ పరుద్ధః సోఽవ గచ్ఛత్విత్యైన్ద్రస్య లోకే వారుణమా లభేత వారుణస్య లోక ఐన్ద్రమ్ (౩) య ఏవావగతః సోఽప రుధ్యతే యోఽపరుద్ధః సోఽవ గచ్ఛతి [5] యది కామయేత ప్రజా ముహ్యేయురితి పశూన్వ్యతిషజేత్ప్రజా ఏవ మోహయతి [6] యదభివాహతోఽపాం వారుణమా లభేత ప్రజా వరుణో గృహ్ణీయా ద్దక్షిణత ఉదఞ్చమా లభతే ఽపవాహతోఽపాం ప్రజానా మవరుణగ్రాహాయ (౪)॥

(రేతో యజమానే దధాతి లోక ఇన్ద్రియగ్ం సప్తత్రిగ్ంశచ్చ ।)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే పఞ్చమోఽనువాకః ॥ ౫ ॥

## వేదార్థదీపిక

అవతారిక: చతుర్థానువాకమునందు యూపైకాదశిని విధింపఁబడినది. ఈ పంచమానువాకమునందు పశ్వైకాదశిని విధింపఁబడుచున్నది. పశువులయొక్క ఏకాదశ సంఖ్య కల పంక్తి అని యర్థము. అనఁగా పదునొకండు పశువుల వరుస యని భావము. పూర్వానువాకమున విహితములైన పదునొకండు యూపములకు వరుసగా పదునొకండు పశువులను కట్టివైచి ఉపాకరణము చేసి పిమ్మట ఆ పశువుల నాలంభనము చేయుదురు. అశ్వమేధ యాగమునందు ఇరువదియొక్క పశువులు విహితము లైనవి. పశ్వైకాదశిని=పశ్వైకాదశపంక్తి.

1. అర్థము: ప్రజాపతిః=ప్రజాపతి, ప్రజాః=ప్రజలను, అసృజత=సృజించెను. సః=ఆ ప్రజాపతి, రిరిచానః=వీర్యాది క్షయముచే తాను శూన్యుఁడని, అమన్యత=తలఁచెను. సః=అతఁడు, ఏతామ్ ఏకాదశినీమ్= ఈ పశ్వేకాదశినిని, అపశ్యత్=వీర్యాది క్షయ నివారణ సాధనముగా కనుఁగొనెను. సః=అతఁడు, తయా వై=ఆ పశ్వైకాదశినిచేతనే, ఆయుః=ఆయువును, ఇన్ద్రియమ్=ఇంద్రియ పాటవమును, వీర్యమ్=సామర్థ్యమును, ఆత్మన్=తనయందు, అధత్త=ధరించెను. యః=ఏ యజమానుఁడు, యజతే= యాగము చేయునో, ఏషః=ఇతఁడు, ప్రజాః=ప్రజలను, సృజతే ఇవ ఖలు= సృజించుచున్నవానివలె నుండును కదా! సః=ఆ యజ్ఞకర్త, ఏతర్హి=ఈ సమయమున, రిరిచానః ఇవ=ఇంద్రియ పాటవాదులు క్షీణించినవానివలె నగుచున్నాఁడు కదా! ఏషా ఏకాదశినీ=ఈ పశ్వేకాదశిని, భవతి యది=ఉన్నయెడల, యజమానః= యజమానుఁడు, తయా=ఆ పశ్వేకాదశినిచేత, ఆయుః=ఆయువును, ఇన్ద్రియమ్=ఇంద్రియ పాటవమును, వీర్యమ్=సామర్థ్యమును, ఆత్మన్=తనయందు, ధత్తే ఏవ=తప్పక ధరించును.

తాత్పర్యము: ప్రజాపతి ప్రజలను సృజించి ఆ ప్రజాసృష్టిచే వీర్యాదికము క్షీణించుటవలన తాను శూన్యుఁడ నైతినని తలఁచి, పశ్వైకాదశినిని వీర్యాది క్షయ నివారణ సాధనముగా కనుఁగొనెను. పిమ్మట నతఁడు యజ్ఞమునందు పశ్వైకాదశినిని వినియోగించి దానిచే ఆయురాదికమును పొందెను. యజ్ఞము చేయుట కూడ ప్రజాసృష్టిని చేయుటవంటిదే కనుక, యజ్ఞము చేయుచున్న యజ్వ ఇంద్రియ పాటవాదులను కోల్పోయి శూన్యునివలె నగును. అప్పు డా యజ్వ తన యజ్ఞమునందు పశ్వేకాదశినిని (పదునొకండు పశువులను) ఉపాకరణము చేయుటచే తాను మఱల ఆయురాదికమును పొందును. ఇచట పశ్వైకాదశిని విధింపఁబడినది. ఆ పశువిశేషములు దేవతావిశేష సహితములుగా అశ్వమేధ ప్రకరణమునం దీ విధముగ ఆమ్నాతము లైనవి. (1) అగ్నిదేవతాకమైన కృష్ణగ్రీవ పశువు. (2) సరస్వతీదేవతాకమైన మేషి. (3) సోమదేవతాకమైన బభ్రువు (పింగళవర్ణముకల పశువు). (4) పూషదేవతాకమైన శ్యామ వర్ణము కల పశువు. (5) బృహస్పతిదేవతాకమైన శితిపృష్ఠము (పృష్ఠమున తెలుపురంగు కలది). (6) విశ్వేదేవదేవతాకమైన శిల్పపశువు. (7) ఇంద్రదేవతాకమైన అరుణ పశువు. (8) మరుద్దేవతాకమైన కల్మాష పశువు. (9) ఇంద్రాగ్నులు దేవతలుగాఁ గల సంహిత మనెడి పశువు. (10) సవితృదేవతాకమైన అధోరామ మనెడి పశువు. (11) వరుణదేవతాకమైన పేత్వ పశువు. ఏతత్సంబంధములైన విశేషాంశములు అచటనే వివరింపఁబడినవి. ఈ పశువులలో మేషి ఒక్కటి మాత్రము అన్యజాతీయ మైనది. కృష్ణగ్రీవాదులన్నియు అజ (మేఁక) జాతికి చెందినవియే.

2. అర్థము: (యుజ్యా=యుజ్య,) ఆగ్నేయేన=అగ్నిదేవతాక పశువుచేత, ప్రవాపయత్యేవ=సహజముగ బీజావాపము చేసినవాఁడగును. సారస్వత్యా= సరస్వతీదేవతాకమైన మేషిచేత, మిథునమ్=మిథునమును (స్త్రీపుంసాత్మకమును), కరోతి=చేసినవాఁ డగును. సౌమ్యేన=సోమదేవతాకమైన పశువుచేత, రేతః= రేతస్సును, దధాతి=ధరింపఁజేసినవాఁ డగును. పౌష్ణేన=పూషదేవతాక పశువుచే, ప్రజనయతి=ప్రజోత్పత్తిని కలుగఁ జేసినవాఁ డగును. బార్హస్పత్యః=బృహస్పతి సంబంధి, భవతి=అగుచున్నది. దేవానామ్=దేవతలకు, బృహస్పతిః=బృహస్పతి, బ్రహ్మ వై=బ్రహ్మయే. బ్రహ్మణైవ=బ్రహ్మచేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, ప్రజాః=ప్రజలను, ప్రజనయతి=ప్రకర్షముగా పుట్టించువాఁ డగును. వైశ్వదేవః భవతి= విశ్వేదేవదేవతా సంబంధి కావలెను. ప్రజాః=ప్రజలు, వైశ్వదేవ్యః వై= విశ్వేదేవదేవతానుగ్రహము కలవారే. ప్రజాః ఏవ=ప్రజలనే, అస్మై=ఈ యజమానునికొఱకు, ప్రజనయతి=పుట్టించువాఁ డగును. ఐన్ద్రేణ=ఇంద్ర దేవతాక పశువుచే, ఇన్ద్రియమేవ=ఇంద్రియ పాటవమునే, అవరున్ధే=పొందును. మారుతేన= మరుద్దేవతాక పశువుచే, విశమ్=జనపదమును, ఐన్ద్రాగ్నేన=ఐంద్రాగ్నిదేవతాక పశువుచే, ఓజః=పుష్టిని, బలమ్=బలమును, అవరున్ధే=పొందును. సావిత్రః=సవితృదేవతాక పశువు, ప్రసవాయ=అనుష్ఠాన ప్రేరణముకొఱకు, (భవతి). నిర్వరుణత్వాయ=ఉపద్రవ రాహిత్యముకొఱకు, వారుణః=వరుణదేవతాక పశువు (భవతి=అగుచున్నది).

తాత్పర్యము: ఇతట తత్తద్దేవతాక పశువులచే కలుగనట్టి విశేషములు వర్ణించుట మూలమున పశుప్రశంస చేయఁబడినది. ఆగ్నేయమైన పుంపశువుచే బీజావాపము కలుగును. ఆగ్నేయమైన పుంపశువునకు సరస్వతీదేవతాకమైన స్త్రీపశువుతో మిథునీకరణము, సోమదేవతాకముచే యోషిత్తునందు రేతోధారణము, పౌష్ణముచే ప్రజోత్పత్తి, బార్హస్పత్యముచే బ్రహ్మకు ఉత్పత్తిసాధనత్వము, వైశ్వదేవముచే ప్రజలకు విశ్వేదేవదేవతానుగ్రహము, ఐంద్రముచే ఇంద్రియ పాటవము, మారుతముచే జనపదప్రాప్తి, ఐన్ద్రాగ్నముచే పుష్టియు, బలమును, సావిత్రముచే అనుష్ఠానమునందు ప్రేరణము, వారుణముచే ఉపద్రవ రాహిత్యమును కలుగును.

3. అర్థము: మధ్యతః=వైశ్వదేవ మారుత పశువుల మధ్యమున, ఐన్ద్రమ్=ఇంద్రదేవతాక పశువును, ఆలభతే=ఆలంభనము చేయవలెను. (తథా సతి=అట్లు కాఁగా, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) యజమానే= యజమానునియందు, మధ్యతః ఏవ=మధ్యమ (నడి) వయస్సునందే, ఇన్ద్రియమ్= ఇంద్రియ పాటవమును, దధాతి=స్థాపించినవాఁ డగును. ఐన్ద్రస్య పురస్తాత్= ఐంద్ర పశువునకు పూర్వము, వైశ్వదేవమ్=వైశ్వదేవపశువును, ఆలభతే= ఆలంభనము చేయువలెను. అన్నమ్=అన్నము, వైశ్వదేవం వై=విశ్వేదేవదేవతాకము కదా! (అతః=ఈ కారణమువలన,) పురస్తాత్=ప్రథమమున, అన్నమేవ=అన్నమునే, ధత్తే=స్థాపించినవాఁ డగును. తస్మాత్=ఆ కారణమువలన, పురస్తాత్= ముందు, అన్నమ్=అన్నము, అద్యతే=భక్షించఁబడుచున్నది. ఐన్ద్రమ్= ఐంద్ర పశువు నాలంభించి, (తతః=పిమ్మట,) మారుతమ్=మారుత పశువును, ఆలభతే=ఆలంభించవలెను. మరుతః=మరుద్దేవతలు, విట్ వై=ప్రజయే. (తదా=అప్పుడు, అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) అస్మై=ఈ యజమానునికొఱకు, విశమ్ ఏవ=ప్రజనే, అను బధ్నాతి=అనుకూలురినిగా చేసినవాఁ డగును.

తాత్పర్యము: ఆగ్నేయాది పశువుల స్థాన క్రమము ఒకటవ మంత్రవ్యాఖ్యానమున వివరించఁబడినది. ఆక్రమము ననుసరించి యజ్ఞమునందు వైశ్వదేవ మారుత పశువుల మధ్యమునఁ గల ఐంద్ర పశువు నాలంభనము చేసినచో, యజమానునియందు, మధ్యమ వయస్సునందు ఇంద్రియ పాటవమును స్థాపించినవాఁ డగును. ఐంద్ర పశువుకంటె ముందు వైశ్వదేవ పశువు నాలంభనము చేసినచో, వైశ్వదేవ పశువు అన్నప్రాప్తి సాధన మగుటచే, యజమానునియందు ముందు అన్నమునే స్థాపించినవాఁ డగును. అందువలననే లోకమునందు ముందు ముఖముచే అన్నము భక్షించఁబడుచున్నది. ఐంద్ర పశువు నాలంభించి పిమ్మట మారుత పశువు నాలంభనము చేసినచో, మరుద్దేవతలు దేవలోకమున ప్రజలే కనుక అధ్వర్యుఁడు ప్రజలను యజమానున కనుకూలురినిగా

చేసినవాఁ డగును. ఇచట పూర్వోక్త పశువుల స్థానక్రమము ననుసరించి ఏతన్మంత్రోక్త విధముగ పశ్వాలంభ నము చేసినచో, అధ్వర్యుఁడు మంత్రోక్త ప్రకారముగ యజమానునకు లాభమును కలుగఁజేసినవాఁ డగునని ప్రశంసించఁ బడినది.

4. అర్థము: యః=ఏ పురుషుఁడు, అవగతః= ప్రాప్తైశ్వర్యుఁడో (ఐశ్వర్యమును పొందినవాఁడో), సః=అతఁడు, అపరుధ్యతామ్=ఐశ్వర్యమునుండి భ్రష్టుఁడగుఁ గాక. యః=ఏ పురుషుఁడు, అపరుద్ధః=ఐశ్వర్యమునుండి భ్రష్టుఁడైన వాఁడో, సః=అతఁడు, అవగచ్ఛతు=ఐశ్వర్యమును పొందుఁగాక. ఇతి=అని, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) కామయేత యది=కోరినచో, ఐన్ద్రస్య లోకే= ఐంద్ర పశువుయొక్క స్థానమునందు, వారుణమ్=వారుణ పశువును, ఆలభేత= ఆలంభనము చేయవలెను. వారుణస్య=వారుణ పశువుయొక్క, లోకే=స్థానము నందు, ఐన్ద్రమ్=ఐంద్ర పశువును, ఆలభేత=ఆలంభనము చేయవలెను. [ఏవఁ కృతే సతి= ఈ విధముగ చేయఁబడఁగా,] యః ఏవ=ఏ పురుషుఁడైతే, అవగతః= ప్రాప్తైశ్వర్యుఁడో, సః=అతఁడు, అపరుద్ధః=ఐశ్వర్య భ్రష్టుఁడగును. యః=ఏ పురుషుఁడు, అపరుద్ధః=ఐశ్వర్య భ్రష్టుఁడో, సః=అతఁడు, అవగచ్ఛతి=ఐశ్వర్యమును పొందును.

తాత్పర్యము: ఇచట కామనాభేదముచే పశువుల క్రమ వ్యత్యాసము విహిత మైనది. ఐశ్వర్యవంతుఁడు ఐశ్వర్య హీనుఁడు కావలెననియు, ఐశ్వర్యహీనుఁడు ఐశ్వర్యవంతుఁడు కావలెననియు కోరినచో, అధ్వర్యుఁడు పూర్వోక్త పశువుల క్రమమును వ్యత్యస్తము చేసి ఐంద్రపశు స్థానమున వారుణ పశువును, వారుణ పశుస్థానమున ఐంద్ర పశువును ఆలంభనము చేయవలెను. అప్పుడు ఐశ్వర్యవంతుఁడు ఐశ్వర్య హీనుఁడు, ఐశ్వర్య హీనుఁడు ఐశ్వర్యవంతుఁడు నగుదురు. ఇచట రెండు కోరికలు సూచింపఁబడినవి. పశువుల క్రమములో ఐంద్రపశువు సప్తమ స్థానమునను, వారుణ పశువు ఏకాదశ స్థానమునను ఉన్నవి.

5. అర్థము: ప్రజాః=ప్రజలు, ముహ్యేయుః ఇతి=వ్యాకులీభావము చెందవలయునని, కామయేత యది=(అధ్వర్యుఁడు) కోరుచో, పశూన్=సర్వ పశువులను, వ్యతిషజేత్=వ్యత్యస్త స్థానములు కలవిగా చేయవలెను. (తదా= అప్పుడు,) ప్రజాః ఏవ=ప్రజలనే, మోహయతి=వ్యాకులపఱచినవాఁ డగును.

తాత్పర్యము: ప్రజలు వ్యాకులీభావమును పొందవలెనని కోరిన యధ్వర్యుఁడు సర్వ పశువుల స్థానములను వ్యత్యస్తములుగా చేయవలెను. అప్పుడు ప్రజ లందఱు వ్యాకులీభావము నొందుదురు. ఇచట కామనాను గుణముగ పశువులకు క్రమసాంకర్యము విధించఁబడినది.

6. అర్థము: అపామ్ అధివాహతః=ఉదకముల ప్రవాహమునకు స్థానమైన నిమ్నప్రదేశమునందు (అచట ఉన్న ఉత్తర యూపమునందు), వారుణమ్=వారుణ పశువును, ఆలభేత యత్=ఆలంభనము చేయుచో, వరుణః=వరుణుఁడు, ప్రజాః= ప్రజలను, గృహ్ణీయాత్=గ్రహించును. ప్రజానామ్ అవరుణ గ్రాహాయ=ప్రజలను వరుణుఁడు గ్రహించ కుండుటకై, దక్షిణతః=దక్షిణ ప్రదేశమునందలి ఉత్తరయూపమునందు, ఉదఞ్చమ్=పశువును ఉత్తరముఖము కలదిగా చేసి, ఆలభతే= ఆలంభనము చేయవలెను.

తాత్పర్యము: ఉదకముల ప్రవాహమునకు స్థానమైన నిమ్నప్రదేశమునందలి ఉత్తరయూపమునందు పశువు నాలంభనము చేసినచో ప్రజలకు వరుణ గ్రహరూప రోగము కలుగును. ప్రజలకు వరుణగ్రహ రోగము కలుగకుండుటకై దక్షిణ యూపమునందు పశువును ఉత్తరదిఙ్ముఖముగా కట్టివైచి ఆలంభనము చేయవలెను. దక్షిణ యూపము ఉన్నతదేశమునందుండుటచే ప్రవాహ స్థానము కాదు కనుక రోగము కలుగదని భావము. ఉదక్ప్రవణముగా స్థాపితమైన ఏకాదశ యూపపంక్తి యొక్క దక్షిణ యూపమునందు వారుణ పశువున కాలంభన మిచట విధించఁబడినది.

పంచమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే షష్ఠోఽనువాకః

మూలము: [1] ఇన్ద్రః పత్నియా మనుమయాజయత్తాం పర్యగ్నికృతా ముదసృజత్తయా మను రార్ధ్నోద్యత్పర్యగ్నికృతం పాత్నీవత ముత్సృజతి యామేవ మనుర్వృద్ధి మార్ధ్నోత్తామేవ యజమాన ఋధ్నోతి [2] యజ్ఞస్య వా అప్రతిష్ఠితాద్యజ్ఞః పరా భవతి యజ్ఞం పరాభవన్తం యజమానోఽను పరా భవతి యదాజ్యేన పాత్నీవతగ్ం సగ్ంస్థాపయతి యజ్ఞస్య ప్రతిష్ఠిత్యై యజ్ఞం ప్రతితిష్ఠన్తం యజమానోఽను ప్రతి తిష్ఠ [3] తీష్టం వపయా (౧) భవత్యనిష్టం వశయాఽథ పాత్నీవతేన ప్ర చరతి తీర్థ ఏవ ప్ర చరత్యథో ఏతర్హ్యేవాస్య యామ [4] స్త్వాష్ట్రో భవతి త్వష్టా వై రేతసః సిక్తస్య రూపాణి వి కరోతి తమేవ వృషాణం పత్నీష్వపి సృజతి సోఽస్మై రూపాణి వి కరోతి (౨) ॥ (వపయా షట్త్రిగ్ంశచ్చ)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే షష్ఠోఽనువాకః ॥ ౬ ॥

## వేదార్థదీపిక

అవతారిక: పంచమానువాకమునందు పశ్వేకాదశిని విధించఁబడినది. ఈ షష్ఠానువాకమునందు పాత్నీవత పశువు విధించఁబడుచున్నది.

1. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, పత్నియా=పాత్నీవత సంజ్ఞక పశువుచే, మనుమ్=మనువును, అయాజయత్=యాగము చేయించెను. పర్యగ్నికృతామ్=అగ్నికి చుట్టు తిరుగఁజేయఁబడిన (పర్యగ్నికృతమైన), తామ్=ఆ పాత్నీవత పశువును, ఉదసృజత్=విడిచెను. తయా=దానిచేత, మనుః=మనువు, ఆర్ధ్నోత్=వృద్ధి నొందెను. పర్యగ్నికృతమ్=పర్యగ్నికృతమైన; పాత్నీవతమ్=పాత్నీవత పశువును, ఉత్సృజతి యత్=విడిచినచో, మనుః=మనువు, యాం వృద్ధిమేవ=ఏ వృద్ధినైతే, ఆర్ధ్నోత్=పొందెనో, తామేవ=ఆ వృద్ధినే, యజమానః=యజమానుఁడు, ఋధ్నోతి=పొందును.

తాత్పర్యము : ఇంద్రుఁడు పాత్నీవత నామక యూపమునందు నియుక్తమైన పశువుచే మనువును యజ్ఞము చేయించెను. దానిని అగ్నికి చుట్టు త్రిప్పి విడిచెను. దానిచే మనువు వృద్ధి నొందెను. పాత్నీవత పశువును అగ్నికి చుట్టు త్రిప్పి విడిచినచో, మనువు పొందిన వృద్ధినే యజమానుఁడు పొందును. ఇచట పాత్నీవత పశువు విధించఁబడినది. మంత్రమునందలి 'పత్నీ' శబ్దము పాత్నీవత సంజ్ఞక యూపమునందు ఉపాకృతమును, త్వష్టృదేవతాకమునైన పశువునకు ఉపలక్షకము.

2. అర్థము: యజ్ఞస్య=యజ్ఞముయొక్క, అప్రతిష్ఠితాత్= అసంస్థాపనమువలన, యజ్ఞః=యజ్ఞము, పరాభవతి=పరాభూత మగును. పరాభవన్తం యజ్ఞమ్=పరాభవము నొందుచున్న యజ్ఞము ననుసరించి, యజమానః= యజమానుఁడు, పరాభవతి=పరాభూతుఁ డగును. ఆజ్యేన=నేతితో, పాత్నీవతమ్=పాత్నీవత నామక పశువును, సంస్థాపయతి యత్=సంస్థాపనము చేసినచో, ఏతత్=ఈ సంస్థాపనము, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, ప్రతిష్ఠిత్యై= ప్రతిష్ఠ కొఱకు, భవతి=అగును. ప్రతితిష్ఠన్తం యజ్ఞమ్ అను=ప్రతిష్ఠిత మగుచున్న యజ్ఞము ననుసరించి, యజమానః=యజమానుఁడు, ప్రతితిష్ఠతి= ప్రతిష్ఠితుఁడగును.

తాత్పర్యము: ఆజ్యముచే సంస్థాపన మనఁగా పశువునుండి ఎన్ని మారులు వప అవదానము చేయఁబడునో, ఆజ్యమునుండి అన్నిమారులు అవదానము చేసినచో ఆజ్యముచే పాత్నీవత సంస్థాపన మగును. పర్యగ్నికృతమైన పశువు ఉత్సృ మగుటచే, యజ్ఞము సంస్థాపితము కానందువలన పరాభూత మగును. పరాభూతమైన యజ్ఞము ననుసరించి యజమానుఁడు పరాభూతుఁ డగును. కావున యజ్ఞప్రతిష్ఠకై పాత్నీవత పశువును ఆజ్యముచే సంస్థాపనము చేయవలెను. ఆ సంస్థాపనముచే యజ్ఞము ప్రతిష్ఠిత మగును. ప్రతిష్ఠిత యజ్ఞము ననుసరించి యజమానుఁడు ప్రతిష్ఠితుఁ డగును. పర్యగ్నికృత పశువు ఉత్సృష్టము కాఁగానే కర్మశేషము నాజ్యముచే సమాప్తము చేయవలెనని యిచట విధించఁ బడినది.

3. అర్థము: వపయా=వపచే, ఇష్టమ్=యజ్ఞకర్మము, భవతి= అగుచున్నది వశయా=వంధ్యపశువుచే, అనిష్టమ్=యజ్ఞ కర్మ మగుటలేదు. అథ=అనంతరము, పాత్నీవతేన=పాత్నీవత పశువుచే, ప్రచరతి=ప్రయోగము చేయవలెను. (తదా=అప్పుడు,) తీర్థే ఏవ=ఉచిత స్థానమునందే, ప్రచరతి= కర్మానుష్ఠానము చేసినవాఁ డగును. అథో=అందు వలన, ఏతర్హ్యేవ=ఈ కాలమునందే, అస్య=ఈ అనుబంధ్య పశువుయొక్క, యామః=సమాప్తి.

తాత్పర్యము: వంధ్య పశువు వశ యనఁబడును. యజ్ఞకర్మము వపాహోమముచే నగును. కాని వంధ్యపశువుచేత కాదు. అనూబంధ్య వపా హోమానంతరము హృదయాద్యంగ హోమమునకు పూర్వము పాత్నీవత పశువునకు తగిన కాలము. మఱియు ఈ కాలమునందే అనూబంధ్య పశువునకు సమాప్తి (ఉపరమము). అనూబంధ్య పశువు అంతిమ పశు వగుటవలన సమాప్తికి పూర్వమే పాత్నీవత ప్రచారము (ప్రయోగము) యుక్తము. ఇచట పాత్నీవత పశు ప్రచారమునకు కాలము విధించఁబడినది.

4. అర్థము: త్వాష్ట్రః భవతి=పాత్నీవత పశువు త్వష్టృదేవతాకము కావలెను. త్వష్టా వై=త్వష్టయే, సిక్తస్య రేతసః=యోని యందు ఉంచఁ బడిన రేతస్సునకు, రూపాణి=రూపములను, వి కరోతి=వివిధములుగా చేయును. వృషాణమ్=రేత స్సును వర్షించుచున్న, తమేవ=ఆ యజమానునే, పత్నీష్వపి= పత్నులయందు కూడ, సృజతి=కలుపుచున్నాఁడు. సః=ఆ త్వష్టృదేవుఁడు, అస్మై=ఈ యజమానునికొఱకు, రూపాణి=రూపములను, వికరోతి= వివిధములుగాఁ జేయును.

తాత్పర్యము: పూర్వ విహిత పాత్నీవత పశువు త్వష్టృదేవతాకము కావలెను. త్వష్టయే యోనియందు ఉంచఁబడిన రేతస్సునకు రూపములను కల్పించును. రేతస్సును వర్షించుచున్న ఆ యజమానునే పత్నులందు కలుపుచు ఆ త్వష్ట యీ యజమానునకై రూపములను వివిధములుగా చేయును. ఇచట దేవత విధించఁ బడినది.

షష్ఠానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే సప్తమోఽనువాకః

మూలము: [1]ఘ్నన్తి వా ఏతత్సోమం యదభిషుణ్వన్తి యత్సౌమ్యో భవతి యథా మృతాయానుస్తరణీం ఘ్నన్తి
తాదృగేవ త [2]ద్యదుత్తరార్ధే వా మధ్యే వా జుహుయా ద్దేవతాభ్యః సమదం దధ్యాద్దక్షిణార్ధే జుహో
త్యేషా వై పితృణాం దిక్స్వాయామేవ దిశి పితౄన్నిరవదయత [3] ఉద్గాతృభ్యో హరన్తి సామదేవత్యో
వై సౌమ్యో యదేవ సామ్నశ్ఛమ్బట్కుర్వన్తి తస్యైవ స శాన్తి [4]రవ (౧) ఈక్షన్తే పవిత్రం వై
సౌమ్య ఆత్మానమేవ పవయన్తే [5]య ఆత్మానం న పరిపశ్యే దితాసుః స్యాదభిదదిం కృత్వాఽవేక్షేత
తస్మి న్హ్యాత్మానం పరిపశ్యత్యథో ఆత్మానమేవ పవయతే [6]యో గతమనాః స్యాత్సోఽవేక్షేత యన్మే
మనః పరాగతం యద్వా మే అపరాగతమ్ రాజ్ఞా సోమేన తద్వయ మస్మాసు ధారయామసీతి
మన ఏవాఽఽత్మన్దాధార (౨) న గతమనా భవ [7]త్యప వై తృతీయసవనే యజ్ఞః క్రామతీజానా
దనీజాన మభ్యాగ్నావైష్ణవ్యర్చా ఘృతస్య యజత్యగ్నిః సర్వా దేవతా విష్ణుర్యజ్ఞో దేవతాశ్చైవ యజ్ఞం
చ దాధారో [8]పాగ్ంశు యజతి మిథునత్వాయ [9]బ్రహ్మవాదినో వదన్తి మిత్రో యజ్ఞస్య స్విష్టం
యువతే వరుణో దురిష్టం క్వ తర్హి యజ్ఞః క్వ యజమానో భవతీతి యన్మైత్రావరుణీం వశామా
లభతే మిత్రేణైవ (3) యజ్ఞస్య స్విష్టగ్ం శమయతి వరుణేన దురిష్టం నాఽఽర్తిమార్ఛతి యజ
మానో [10]యథా వై లాఙ్గలేనోర్వరాం ప్రభిన్దన్త్యేవ మృక్సామే యజ్ఞం ప్ర భిన్తో యన్మైత్రావరుణీం
వశామాలభతే యజ్ఞాయైవ ప్రభిన్నాయ మత్యమన్వవాస్యతి శాన్త్యై [11]యాతయామాని వా ఏతస్య

ఛన్దాగ్ంసి య ఈజాన శ్ఛన్దసామేష రసో యద్వశా యన్మైత్రావరుణీం వశామాలభతే ఛన్దాగ్ంస్యేవ పునరా ప్రీణాత్యయాతయామమత్వాయాథో ఛన్దః స్వేవ రసం దధాతి (౪)

(అవ దాధార మిత్రేత్యైవ ప్రీణాతి షట్చ ।)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే సప్తమోఽనువాకః ॥౭॥

## వేదార్థదీపిక

అవతారిక: షష్ఠానువాకమునందు పాత్నీవత పశువు విధించఁబడినది. ఈ సప్తమానువాకమునందు సౌమ్య చరువు విధించఁబడుచున్నది.

1. అర్థము: అభిషుణ్వన్తి యత్=సోమము నభిషవము చేయుచో, ఏతత్సోమమ్=ఈ సోమమును, ఘ్నన్తి వై=వధించుచున్నవారే యగుచున్నారు. ( చరుః=చరువు,) సౌమ్యో భవతి యత్=సోమసంబంధి యైనచో, మృతాయ=మరణించిన దీక్షితుని కొఱకు, అనుస్తరణీమ్=అనుస్తరణి యను ఒక గోవును, యథా ఘ్నన్తి=ఏ విధముగ వధించుచున్నారో, తత్=అది, తాదృగేవ=అటువంటిదే.

తాత్పర్యము: దీక్షితుఁడు మరణించినప్పుడు ఆ దీక్షితశవముయొక్క హృదయ హస్తాద్యవయములందు గో శవముయొక్క హృదయ హస్తాద్యవయవముల నుంచి ఆ దీక్షితశవమును దహనము చేయుదురు. అందుకై ఒక గోవు వధించఁబడును. ఆ గోవు అనుస్తరణి యనఁబడును. మృతం దీక్షితమను స్తీర్యతే=హన్యతే ఇతి, అనుస్తరణీ=కాచిద్గౌః. మరణించిన దీక్షితు ననుసరించి వధింపఁబడు గోవు కనుక అనుస్తరణి యనఁబడుచున్నది. సోమము నభిషవము చేయుచున్నా రనఁగా సోమమును వధించుచున్నారని యర్థము. కావున సౌమ్యచరువును అనుసరణీ స్థానీయముగా చేయవలెను. మృతుఁడైన దీక్షితునికొఱకు అనుస్తరణి గోవు ఎటువంటిదో, ఈ సౌమ్యచరువు అటువంటిదే. ఇచట సౌమ్యచరువు విధించఁబడినది.

2. అర్థము: ఉత్తరార్ధే వా=అగ్నియొక్క ఉత్తరార్ధ భాగమునందు కాని, మధ్యే వా=మధ్యభాగమునందు కాని, జుహుయాత్ యత్=హోమము చేయుచో, దేవతాభ్యః=దేవతలకొఱకు, సమదమ్=కలహమును, దధ్యాత్=ఉంచినవాఁడగును. దక్షిణార్ధే=అగ్నియొక్క దక్షిణార్ధ భాగమునందు, జుహోతి=హోమము చేయవలెను. ఏషా=ఇది, పితౄణామ్=పితృదేవతలయొక్క, దిక్ వై=దిక్కే. స్వాయాం దిశి ఏవ=స్వీయ దిక్కునందే, పితౄన్=పితృదేవతలను, నిరవదయతే= దేవదేశమునుండి నిష్కర్షించి యజించినవాఁ డగును.

తాత్పర్యము: పూర్వోక్తమైన సౌమ్యచరు హవిస్సును యజమానుఁ డగ్నియొక్క ఉత్తరార్ధ భాగమునందు కాని, మధ్య భాగమునందు కాని, హోమము చేయుచో దేవతలతో కూడ పితృదేవతలకు కలహమును చేయువాఁ డగును. దక్షిణదిక్కు పితృదేవతలది కనుక దక్షిణార్ధ భాగమునందు హోమము చేయవలెను. అప్పుడు స్వీయదిక్కునందే పితృదేవతలను దేవదేశమునుండి నిష్కర్షించి యజించినవాఁ డగును. ఇచట చరువునకు హోమస్థానము విధించఁబడినది.

3. అర్థము: ఉద్గాతృభ్యః=సామగాయకులైన ఉద్గాతలకొఱకు, హరన్తి=హోమశేషమైన చరువును దానము చేయవలెను. సౌమ్యః=సౌమ్యచరువు, సామదేవత్యః వై=సామము దేవతగాఁ గలదియే. సామ్నః=సామవేద సంబంధియైన, యదేవ=ఏ యంగమునైతే, ఛమ్బట్కుర్వన్తి=ఉద్గాతలు వ్యర్థము చేయుచున్నారో, తస్యైవ=ఆ దోషమునకే, సః=ఆ చరువు, శాన్తిః=ప్రతీకారము.

తాత్పర్యము: హోమము చేయఁగా మిగిలిన చరువును సామగాయకులైన ఉద్గాతల కీయవలెను. సౌమ్యచరువు సామము దేవతగాఁ గలదియే కావున ఉద్గాతలు సామవేద సంబంధియైన ఏ యంగమునైతే వినష్టము చేయుదురో, ఆ దోషమునకు ఆ చరువు ప్రతీకార మగును. ఇచట చరుష దానము విహిత మైనది.

4. అర్థము: అవేక్షన్తే=(ఆజ్యపూర్ణమైన చరువునందు ఉద్గాతలు స్వదేహమును) చూచుకొనవలెను. సౌమ్యః=సౌమ్యచరువు, పవిత్రం వై=పవిత్రమైనది కదా! (తేన=ఆ అవేక్షణముచేత,) ఆత్మానమేవ=స్వదేహమునే, పవయన్తే=శోధించుకొనినవా రగుదురు.

తాత్పర్యము: ఉద్గాతలు తమకొసఁగఁబడిన ఆజ్యపూర్ణ సౌమ్యచరువు పవిత్రమైనది కావున దానియందు తమదేహమును చూచుకొనవలెను. ఈ యవేక్షణముచేత ఉద్గాతలు తమదేహమును శోధించుకొనినవా రగుదురు. ఉద్గాతలు తమకొసఁగఁబడిన చరువునందు స్వదేహచ్ఛాయను చూచుకొనవలెనని విధించఁబడినది.

5. అర్థము: యః=ఏ ఉద్గాత, ఆత్మానమ్=తనను, న పరిపశ్యేత్=ఆజ్యపూర్ణచరువునందు అంతటను చూచుటలేదో, (సః=అతఁడు,) ఇతాసుః= గతప్రాణుఁ డగును. అభిదదిం కృత్వా=చరువును మఱికొంత ఆజ్యము కలదానినిగా ఁజేసి, అవేక్షేత=స్వదేహచ్ఛాయను చూచుకొనవలెను. తస్మిన్=అధికముగా ఆజ్యము నుంచిన యా చరువునందు, ఆత్మానమ్=స్వదేహమును, పరిపశ్యతి హి=అంతటను చూచుచున్నాఁడు కదా! అథో=అందువలన, ఆత్మానమేవ=స్వదేహమునే, పవయతే=పవిత్రముగా ఁజేసికొనినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ఆజ్యపూర్ణ సౌమ్యచరువునందు స్వదేహమును చూచుకొనని (చూచుకొనఁజాలని) ఉద్గాత గతప్రాణుఁ డగును (మరణించును). అందువలన ఆ చరువునందు మఱికొంత ఆజ్యము నధికముగా నుంచి దానియందు స్వదేహచ్ఛాయను చూచుకొనవలెను. ఆ యధికాజ్యముతో నిండిన చరువునందు స్వదేహమును చూచుచున్నాఁడు కదా! అందువలన స్వదేహమునే పవిత్రముగాఁ జేసికొనినవాఁ డగును. ఆజ్యము చాలనిపక్షమున మఱికొంత ఆజ్యము నుంచి దానియందు చూడవలెనని యిచట విధించఁ బడినది. అభితో దీయతే ప్రక్షిప్యతే ఆజ్యమస్మిన్ చరౌ ఇతి అభిదదిః=అంతటను ప్రక్షిప్తమైన ఆజ్యము కలిగిన చరువు అని యర్థము.

6. అర్థము: యః=ఏ ఉద్గాత, గతమనాః=అవ్యవస్థిత చిత్తము కలవాఁడు, స్యాత్=అగునో, సః=ఆ యుద్గాత, "యన్మే మనః పరాగతమ్.... దారయామసి ఇతి" అను మంత్రముచే, అవేక్షేత=పూర్వోక్త చరువునందు ఆత్మచ్ఛాయను చూడవలెను. (తదా=అప్పుడు,) మనః ఏవ=మనస్సునే, ఆత్మన్=తనయందు, దాధార=ధరించువాఁ డగును. (భవిష్యదర్థే భూతకాలిక ప్రయోగ శ్ఛాన్దసః). గతమనాః=అవ్యవస్థిత చిత్తుఁడు, న భవతి=కాఁడు. మంత్రార్థము-- "మే=నాయొక్క, యత్ మనః=ఏ మనస్సు, పరాగతమ్=నిష్క్రాంత మైనదో, యద్వా=లేదా, మే=నాయొక్క, యత్=ఏ మనస్సు, అపరాగతమ్= నిష్క్రమణోన్ముఖ మైనదో, తత్=దానిని, సోమేన రాజ్ఞా=సోమరాజు (యొక్క అనుగ్రహము) చేత, వయమ్=మేము, అస్మాసు=మాయందు, ధారయామసి=ధరించుచున్నాము." (ఈ మంత్రమున 'యః మే' అను పదములకు తచ్ఛబ్దార్థాపేక్షయందు 'సః అహమ్', 'మయి' అను ప్రయోగము లుండవలెను. 'వయమ్' 'అస్మాను' అను ప్రయోగములు ఛాందసములు.

తాత్పర్యము: అవ్యవస్థిత చిత్తుఁడైన ఉద్గాత "నా మనస్సు నానుండి నిష్క్రాంత మైనచో, లేదా నిష్క్రమణోన్ముఖ మైనచో, దానిని సోమరాజుయొక్క అనుగ్రహముచే నాయందే ధరింతును." అను నర్థము కల "యన్మే మనః" ఇత్యాది మంత్రమును పఠించుచు పూర్వోక్త చరువునందు ఆత్మచ్ఛాయను చూడవలెను. అప్పుడా

యుద్గాత అవ్యవస్థిత చిత్తుఁడు కాఁడు. ఇచట కామ్యమైన అవేక్షణమునందు మంత్రవిశేషము విహిత మైనది. మంత్రసామర్థ్యమువలన మనస్సమాధానము కలుగునని భావము.

7. అర్థము: ఈజానాత్=యజ్ఞము చేయుచున్న యజమానునినుండి, అనీజానమ్ అభి=యజ్ఞము చేయుచుండని పురుషు నభిలక్షించి, తృతీయసవనే= తృతీయసవనమునందు, యజ్ఞః=యజ్ఞము, అప క్రామతి వై=తొలఁగియే పోవును. (తదా=అప్పుడు, యజ్వా=యాగము చేయుచున్న యజమానుఁ డు,) ఆగ్నావైష్ణవ్యా ఋచా=అగ్ని, విష్ణు శబ్దములు కలిగియున్న ఋక్కుచే, ఘృతస్య యజతి=ఘృతయాగము చేయవలెను. అగ్నిః=అగ్ని, సర్వాః దేవతాః= సర్వ దేవతా స్వరూపుఁడు. విష్ణుః=విష్ణువు, యజ్ఞః=యజ్ఞస్వరూపుఁడు. (తత్=ఆ కారణము వలన, సః=ఘృతయాగము చేసిన యజమానుఁడు,) దేవతాః చ=దేవతలను, యజ్ఞం చ=యజ్ఞమును, దాధారైవ=తప్పక ధరించువాఁ డగును.

తాత్పర్యము: ఒక యజమానుఁడు యజ్ఞము చేయుచుండఁగా ఆ యజ్ఞము అచట ఉన్న యజ్ఞముచేయుచుండని పురుషుని చూచి తృతీయసవనమునందు తొలఁగిపోవును. అప్పు డా యజమానుఁడు "అగ్నావిష్ణూ మహి ధామ ప్రియం వామ్" అను అగ్ని విష్ణు పద ఘటితమైన ఋక్కు నుచ్చరించుచు ఘృతముతో యాగము చేయవలెను. అగ్ని సర్వ దేవతా స్వరూపుఁడు. విష్ణువు యజ్ఞ స్వరూపుఁడు. కనుక యజ్వ ఆ ఆగ్నావైష్ణవ మంత్రయాగము వలన దేవతలను, యజ్ఞమును నిశ్చయముగ పొందును. ఇచట ఆగ్నావైష్ణవ మంత్రముచేత ఘృతయాగము విధించఁబడినది.

8. అర్థము: ఉపాంశు=నీచ (అల్ప) ధ్వనితో, యజతి=యాగము చేయవలెను. ఏతత్=ఈ ఉపాంశువుగ నుచ్చరించుట, మిథునత్వాయ= మిథునత్వముకొఱకు, భవతి=అగును.

తాత్పర్యము: మిథునత్వ సిద్ధికై, తక్కువ ధ్వనితో ఈ ఘృతయాగము చేయవలెను. సౌమ్యచరుగతమైన ఉచ్చధ్వనితో కూడ ఉపాంశు ధ్వనికి మిథునత్వమని యర్థము. ఇచట ఉపాంశు ధ్వని విహిత మైనది.

9. అర్థము: మిత్రః=మిత్రదేవుఁడు, యజ్ఞస్య= యజ్ఞముయొక్క, స్విష్టమ్=స్విష్టమైన అంగమును, యువతే=దురిష్ట ముతో మిశ్రమము చేయుచున్నాఁడు. వరుణః=వరుణదేవుఁడు, దురిష్టమ్= యజ్ఞముయొక్క దురిష్టమైన అంగమును, యువతే=స్విష్టముతో మిశ్రమము చేయుచున్నాఁడు. తర్హి=అట్లైనచో, యజ్ఞః=యజ్ఞము, క్వ=ఎచ్చట, భవతి=ఉండును?, యజమానః=యజమానుఁడు, క్వ=ఎచ్చట, భవతి=ఉండును?, ఇతి=అని, బ్రహ్మవాదినః=మంత్రజ్ఞులు, వదన్తి= చెప్పుచున్నారు (ప్రశ్నించుచున్నారు). మైత్రావరుణీమ్=మిత్ర వరుణులు దేవతలుగాఁ గల, వశామ్=వంధ్యయైన గోవును, ఆలభేత యత్=ఆలంభనము చేయుచో, (సః= ఆ యజ మానుఁడు,) మిత్రేణైవ=మిత్రదేవతచేతనే, యజ్ఞస్య స్విష్టమ్= యజ్ఞసంబంధియైన సమ్యగనుష్ఠితాంగ మును, పాలయతి=రక్షింపఁజేయును. వరుణేన=వరుణునిచే, దురిష్టమ్=దురిష్టమును, శమయతి= నశింపఁ జేయును. యజమానః=యజమానుఁడు, ఆర్తిమ్=యజ్ఞముయొక్క నిష్ఫలత్వ రూపమైన ఆర్తిని, న ఆర్ఛతి=పొందఁడు.

తాత్పర్యము: యజ్ఞముయొక్క ఏ యంగము బాగుగ అనుష్ఠించఁ బడునో, దానికి అధిపతి మిత్రదేవుఁడు. అతఁడు ఆరా ధించఁబడనివాఁడై యజ్ఞముయొక్క దురిష్టాంగముతో మిశ్రమము చేయును. యజ్ఞముయొక్క ఏ యంగము సమ్యగనుష్ఠతము కాదో, దానికి వరుణ దేవుఁ డధిపతి. అతఁడు అనారాధితుఁడై ఆ దురిష్టమును సంపా దించి స్విష్టముతో మిశ్రమము చేయును. ఈ విధముగ ఉభయ దేవతలచే యజ్ఞముయొక్క స్విష్టాంగము నశింపఁ జేయఁబడఁగా, యజ్ఞము ఎచట ఉండును? యజ్ఞమే లేనిచో యజమానుఁడును ఎచట ఫలోపేతుఁ డగును? అని వేదార్థ వేత్తలు పరస్పరము ప్రశ్నించుకొనుచున్నారు. అందువలన మిత్రావరుణ దేవతాకమైన వంధ్యపశువును ఆలంభనము చేయవలయును. వశాలంభనముచే తుష్టుఁడైన మిత్రదేవుఁడు యజ్ఞముయొక్క స్విష్టాంగమును రక్షించును. వరుణుఁడు దురిష్టమును నశింపఁజేయును. అప్పుడు యజ్ఞము సుస్థిత మగు

టచే నిష్ఫల స్వరూపమైన బాధను యజమానుఁడు పొందఁడు. స్విష్టము=యథావిధి అనుష్ఠించఁబడిన యజ్ఞాంగము. దురిష్టము=దోష సహితముగ అనుష్ఠించఁబడిన యజ్ఞాంగము. ఇచట అనూబంధ్య పశువు విధించఁబడినది.

10. అర్థము: యథా వై=ఏ విధముగనైతే, ఉర్వరామ్= సర్వసస్యోపేతయైన భూమిని, లాఙ్గలేన=నాఁగలిచే, ప్రభిన్దన్తి=దున్ను చున్నారో, ఏవమ్=ఈ విధముగ, ఋక్సామే=ఋక్సామములు, యజ్ఞమ్=యజ్ఞమును, ప్రభిన్తః=దున్నుచున్నవి. మైత్రావరుణీమ్=మిత్రావరుణ దేవతాకమైన, వశామ్= వంధ్యగోవును, ఆలభతే యత్=ఆలంభనము చేయుచో, ప్రభిన్నాయ=బాగుగ కర్షితమైన, యజ్ఞాయైవ=యజ్ఞముకొఱకే, మత్యమ్=ఫలజననశక్తి రూపమైన మత్యమును, అన్వాస్యతి=వెంటనే ప్రక్షేపించినవాఁ డగును. ఏతత్=ఇది, శాన్త్యై=అశక్తి లక్షణ దోషము యొక్క శాంతికొఱకు, భవతి=అగుచున్నది. మత్యమ్=శక్త్యాధాన సాధనమైన గోమయాది ద్రవ్యము. ఇది భూమియందు వేయఁ బడినచో భూమి శక్తిసంపన్నయై ఫలించును. వశాలంభనము యజ్ఞమునకు మత్యము వంటిది. మతమ్ అభిమత ఫలమ్ అర్హతీతి మత్యమ్=అభిమత ఫలము నొసఁగుట కర్హమైనది.

తాత్పర్యము: లోకమునందు కర్షకులు సర్వసస్యశ్యామలయైన భూమిని ప్రథమమున నాఁగలిచే దున్ని మత్యమును చల్లి ఆ భూమిని ఫలవంతముగ చేయుదురు. ఆ విధముగనే ఋక్సామములచే యజ్ఞమును యజమానుఁడు దున్నుటచే దున్నుటవంటి యోగ్యతను సంపాదించి వశాలంభముచే మత్యప్రక్షేపమువలె ఫలజనన శక్తిని సంపాదించును. అప్పుడు అశక్తి లక్షణమైన దోషము నశించును. ఇచట పూర్వోక్తయైన అనూబంధ్య పశువు ప్రశంసించఁబడినది.

11. అర్థము: యః=ఏ యజమానుఁడు, ఈజానః= యజ్ఞమును చేసినవాఁడో, ఏతస్య=ఇతనియొక్క, ఛన్దాంసి=ఛందస్సులు, యాతయామాని వై=గతసారములే. వశా యత్=వంధ్య గోవు ఏది కలదో, ఏషః= ఇది, ఛన్దసామ్=ఛందస్సులయొక్క, రసః=రసము. మైత్రావరుణీమ్= మిత్రావరుణ దేవతాకమైన, వశామ్=వంధ్య గోవును, ఆలభతే యత్= ఆలంభనము చేయుచో, ఛన్దాంస్యేవ=ఛందస్సులనే, పునః=మఱల, ఆ ప్రీణాతి= అంతటను సంతోషపఱచినవాఁ డగును. ఏతత్=ఈ వశాలంభనము, అయాతయామత్వాయ=సారము పోకుండుటకై, భవతి=అగుచున్నది. అథో= మఱియు, ఛన్దస్స్వేవ=ఛందస్సులందే, రసమ్=రసమును, దధాతి= స్థాపించినవాఁ డగును.

తాత్పర్యము: యజ్ఞము చేసిన యజ్ఞకర్తయొక్క ఛందస్సులు గతసారములే యగును. వంధ్య గోవు ఛందస్సుల సారమే. కనుక యజ్ఞ మిత్రావరుణ దేవతాకమైన వంధ్య గోవు నాలంభము చేసినచో ఛందస్సులనే మఱల బాగుగ సంతోషపఱచినవాఁ డగును. మఱియు నతఁడు ఛందస్సులందే రసమును స్థాపించినవాఁ డగును. వశ ఛందస్సుల రసమైన విధము:- వషట్కారదేవతగాయత్రీ దేవతయొక్క శిరస్సును ఛేదింపఁగా రసము క్రింద పడెను. పడిన రసమునుండి వంధ్య గోవు పుట్టినది. అందువలన ఛందస్సుల రసము వశ అయినదని ఇచట వర్ణించఁ బడెను. ఈ విషయము కామ్యపశుకాండమునందు ఆమ్నాత మైనది. ఇచట మఱల వశ ప్రశంసించఁబడినది.

సప్తమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే ఽష్టమోఽనువాకః

మూలము: [1]దేవా వా ఇన్ద్రియం వీర్య౯ం వ్యభజన్త తతో యదత్యశిష్యత తదతిగ్రాహ్యో అభవ న్తదతిగ్రాహ్యాణా మతిగ్రాహ్యత్వం యదతిగ్రాహ్యో గృహ్యన్త ఇన్ద్రియమేవ తద్వీర్యం యజమాన ఆత్మన్దత్తే [2]తేజ ఆగ్నే యేనేన్ద్రియమైన్ద్రేణ బ్రహ్మవర్చసగ్ం సౌర్యే [3]ణోపస్తమ్భనం వా ఏతద్యజ్ఞస్య యదతిగ్రాహ్యో శ్చక్రే పృష్ఠాని యత్పృష్ఠ్యేన గృహ్ణీయాత్ప్రాఞ్చం యజ్ఞం పృష్ఠాని సగ్ంశృణీయు [4]ర్యదుక్థ్యే (౧) గృహ్ణీయా త్ప్రత్యఞ్చం యజ్ఞమతిగ్రాహ్యాః సగ్ంశృణీయు [5]ర్విశ్వజితి సర్వపృష్ఠే గ్రహీతవ్యా యజ్ఞస్య సవీర్య త్వాయ [6]ప్రజాపతి ర్దేవేభ్యో యజ్ఞాన్వ్యాదిశత్స ప్రియాస్తనూరప న్యధత్త తదతిగ్రాహ్యో అభవ న్వితనుస్తస్య యజ్ఞ ఇత్యాహు ర్యస్యాతిగ్రాహ్యో న గృహ్యన్త ఇత్యప్యగ్నిష్టోమే గ్రహీతవ్యా యజ్ఞస్య సతను త్వాయ [7]దేవతా వై సర్వాః సదృశీరాసన్తా న వ్యావృత మగచ్ఛన్తే దేవాః (౨) ఏత ఏతాన్గ్రహా నపశ్యన్తానగృహ్ణతాఽఽగ్నేయ మగ్నిరైన్ద్ర మిన్ద్రః సౌర్యగ్ం సూర్యస్తతో వై తేఽన్యాభి ర్దేవతాభి ర్వ్యావృత మగచ్ఛ న్యస్యైవం విదుష ఏతే గ్రహా గృహ్యన్తే వ్యావృతమేవ పాప్మనా భ్రాతృవ్యేణ గచ్ఛ [8]తీమే లోకా జ్యోతిష్మన్తః సమావద్వీర్యాః కార్యా ఇత్యాహు రాగ్నేయేనాస్మింల్లోకే జ్యోతిర్ధత్త ఐన్ద్రేణాన్తరిక్ష ఇన్ద్రవాయూ హి సయుజౌ సౌర్యేణాముష్మింల్లోకే (౩) జ్యోతిర్ధత్తే జ్యోతిష్మన్తోఽస్మా ఇమే లోకా భవన్తి సమావద్వీర్యానేనాన్కురుత [9]ఏతాన్వై గ్రహాన్బమ్బావిశ్వవయసా వవిత్తాం తాభ్యామిమే లోకాః పరాఞ్చశ్చార్వాఞ్చశ్చ ప్రాభుర్యస్యైవం విదుష ఏతే గ్రహా గృహ్యన్తే ప్రాస్మా

ఇమే లోకాః పరాఞ్చశ్చార్వాఞ్చశ్చ భాన్తి (౪) ||

(ఉక్థ్యం దేవా అముష్మింల్లోక ఏకాన్నచత్వారిగ్ంశచ్చ |)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే ఉష్టమోఽనువాకః || ౮ ||

# వేదార్థదీపిక

అవతారిక: సప్తమానువాకమున సౌమ్యచరువు విహిత మైనది. ఈ యష్టమానువాకమునందు అతిగ్రాహ్య గ్రహవిధి చెప్పఁబడుచున్నది.

1. అర్థము: దేవాః=దేవతలు, ఇన్ద్రియం వీర్యమ్=ఇంద్రియ గత సామర్థ్య హేతువైన సోమరసమును, వ్యభజన్త వై=విభజించిరఁట. తతః=ఆ సోమరసమునుండి, యత్ అత్యశిష్యత=అతిరిక్త మైనది ఏది కలదో, తత్=అది, అతిగ్రాహ్యాః=అతిగ్రాహ్య గ్రహములు, అభవన్=ఆయెను. తత్=ఆ కారణమువలన, అతిగ్రాహ్యాణామ్=అతిగ్రాహ్య గ్రహములకు, అతిగ్రాహ్యత్వమ్= అతిగ్రాహ్యమను పేరు, అభవత్=ఆయెను. అతిగ్రాహ్యాః=అతిగ్రాహ్య గ్రహములు, గృహ్యన్తే యత్=గ్రహింపఁబడినచో, యజమానః=యజమానుఁడు, తత్ ఇన్ద్రియం వీర్యమేవ=ఆ ఇంద్రియ గత సామర్థ్యమునే, ఆత్మన్=తనయందు, ధత్తే=ధరించును.

తాత్పర్యము: ఇంద్ర వాయు మిత్రావరుణాది దేవతలు ఇంద్రియ సామర్థ్య హేతువైన సోమరసమును విభజించుకొనిరఁట! విభక్తము కాఁగా అతిరిక్తమైన సోమరసము అతిగ్రాహ్య గ్రహము లయ్యెను. అతిరిక్త రసము అతిగ్రాహ్యము లగుటచే ఆ గ్రహములకు అతిగ్రాహ్య మను పేరు సిద్ధించినది. యజమానుఁడు యజ్ఞమునందు అతిగ్రాహ్య గ్రహములను గ్రహించినచో అతఁడు ఇంద్రియ సామర్థ్యమునే పొందును. ఇచట అతిగ్రాహ్య గ్రహ గ్రహణము విధింపఁబడినది.

2. అర్థము: (యజమానః=యజమానుఁడు), ఆగ్నేయేన= అగ్నిదేవతాకమైన అతిగ్రాహ్యముచేత, తేజః=కాంతిని, ఐన్ద్రేణ=ఇంద్రదేవతాకమైన అతిగ్రాహ్యముచే, ఇన్ద్రియమ్=బలమును, సౌర్యేణ=సూర్యదేవతాకమైన అతిగ్రాహ్యముచే, బ్రహ్మవర్చసమ్=శ్రుతాధ్యయన సంపత్తిని, ఆత్మన్=తనయందు, ధత్తే=ధరించును. (ఈ రెండు పదములు పూర్వమంత్రమునుండి అనువృత్తములు).

తాత్పర్యము: యజ్వ అతిగ్రాహ్య గ్రహములను గ్రహించుటవలన ఆ గ్రహములలోని అగ్నిదేవతాకమైన అతిగ్రాహ్యముచే కాంతిని, ఇంద్రదేవతాకముచే బలమును, సూర్యదేవతాకముచే శ్రుతాధ్యయన సంపత్తిని పొందును. ప్రాతఃసవనమునందు ఆగ్రయణ గ్రహ సాదనానంతరము ఈ మూఁడు గ్రహములను గ్రహింపవలెను. "ఏష తే యోని ర్విశ్వేభ్యస్త్వా దేవేభ్యః" అను మంత్రముచే ఆగ్రయణ గ్రహసాదనము చేసి అనంతరము ఆగ్నేయాదులైన మూఁడు అతిగ్రాహ్యములకు "అగ్న ఆయూగ్ంషి" ఇత్యాది మంత్రములచే గ్రహణ సాదనములను చేయవలెనని కల్పసూత్రము చెప్పినది. ఇచట పూర్వోక్తములైన అతిగ్రాహ్యములకు అగ్న్యాది దేవతా సంబంధము విధింపఁబడినది.

3. అర్థము: అతిగ్రాహ్యాః యత్=అతిగ్రాహ్యములు అనునది ఏది కలదో, ఏతత్=ఇది, యజ్ఞస్య=యజ్ఞము అను రథమునకు, ఉపస్తమ్భనం వై= ఉత్తంభనమే. పృష్ఠాని=పృష్ఠస్తోత్రములు, చక్రే=చక్రములు. పృష్ఠ్యే=పృష్ఠస్తోత్రములు గల అహస్సట్కమునందు, న గృహ్ణీయాత్ యత్=అతిగ్రాహ్యములను గ్రహించనచో, పాఞ్చం యజ్ఞమ్=మిక్కిలి ఒప్పుచున్నట్టి యజ్ఞ రథమును, పృష్ఠాని= పృష్ఠస్తోత్రములు, సంశృణీయుః=నశింపఁజేయును.

తాత్పర్యము: యజ్ఞము ఒక రథమువంటిది. అతిగ్రాహ్య గ్రహములు ఆ యజ్ఞరథమును నిలుపుటకు సాధనమైన కొయ్యవంటివి. పృష్ఠ స్తోత్రములు దానికి చక్రములవంటివి. ఆఱు దినములందు వరుసగా రథంతర బృహత్ వైరూప వైరాజ శాక్వర రైవతము లనెడి సామములచే చేయఁబడు స్తోత్రములు పృష్ఠము లనఁబడును. ఆ యాఱు దినములందు పృష్ఠస్తోత్రములను వినియోగించుటవలన ఆ యాఱు దినముల సముదాయమునకు పృష్ఠ్యషడహమని అర్థ మేర్పడినది. ఆ పృష్ఠ్యషడహమునందు, యజ్ఞరథమును నిలుపుటకు సాధనమైన కొయ్య (ఉత్తంభన కాష్ఠము) వంటి అతిగ్రాహ్యములను గ్రహించనిచో, అతిగ్రాహ్యరూపమైన ఉత్తంభనము (రథమును నిలుపు సాధనము) లేకుండుటచే, పృష్ఠరూప చక్రములు యజ్ఞరూప రథమును పడవైచి నశింపఁ జేయును. ఇచట వ్యతిరేక ముఖమున పృష్ఠ్య షడహమునందు అతిగ్రాహ్య గ్రహణము విహిత మైనది.

4. అర్థము: ఉక్థ్యే=ఉక్థ్యమునందు, గృహ్ణీయాత్ యత్= అతిగ్రాహ్యములను గ్రహించినచో, ప్రత్యఞ్చం యజ్ఞమ్=ప్రత్యంచమైన యజ్ఞమును, అతిగ్రాహ్యాః=అతిగ్రాహ్యములు, సంశృణీయుః=నశింపఁజేయును.

తాత్పర్యము: ఉత్తంభనము లేకయే యజ్ఞమునకు ముందు ఉన్నత సదృశమైన ఉక్థ్యము కలదు. ఆ ఉక్థ్యమునందు అతిగ్రాహ్యములను గ్రహించినచో, పురోభాగమునఁ గల ఉక్థ్యమునకు ఔన్నత్యము నాపాదించి అతిగ్రాహ్యములు ప్రత్యంచముగనున్న యజ్ఞరథమును పడవైచి నశింపఁజేయును. ఉక్థ్యమున చోదక ప్రాప్తములైన అతిగ్రాహ్యములు ఇచట నిషేధించఁబడినవి.

5. అర్థము: యజ్ఞస్య=యజ్ఞమునకు, సవీర్యత్వాయ= సామర్థ్యము కలుగుటకై, సర్వపృష్ఠే=రథంతరాదులైన ఆఱు (సర్వ) పృష్ఠస్తోత్రములు కలిగిన, విశ్వజితి=విశ్వజిద్యాగమునందు, గ్రహీతవ్యాః=అతిగ్రాహ్యములు గ్రహించఁబడవలసినవి కావలెను.

తాత్పర్యము: అతిగ్రాహ్యములు ఇంద్రియ సామర్థ్య హేతువైన సోమరసమునుండి యేర్పడినవనియు, ఆ యతిగ్రా[illegible] గ్రహించినచో యజమానుఁడు ఇంద్రియ సామర్థ్యమును పొందుననియు ఒకటవ మం[illegible]ఁబడినది. 'విశ్వజిత్' అను యజ్ఞమునందు రథంతరాది షట్సామ సాధ్యములైన పృష్ఠస్తోత్రములు వినియోగించఁబడును. అందువలన సర్వపృష్ఠ స్తోత్రములు గల 'విశ్వజిత్' యాగమునందు అతిగ్రాహ్యములను గ్రహించవలెను. గ్రహించినచో ఈ విశ్వజిత్తునకు సామర్థ్యము సిద్ధించును. పృష్ఠ్యషడహమునందు ఉక్థ్యము కలదు కనుక, నాల్గవమంత్రముచే ప్రాప్తమగునట్టి నిషేధమును వారించుటకై మూఁడవ మంత్రముచే పృష్ఠ్యషడహమునందు అతిగ్రాహ్యములు విధించఁబడినవి. ఆ విధముగనే విశ్వజిద్యాగమునకు కూడ ఉక్థ్య ముండుటవలన నాల్గవ మంత్రముచే ప్రాప్తించెడి నిషేధమును వారించుటకై యిచట అతిగ్రాహ్య గ్రహణము విధించఁబడినది.

6. అర్థము: ప్రజాపతిః=ప్రజాపతి, దేవేభ్యః=దేవతలకొఱకు, యజ్ఞాన్=యజ్ఞములను, వ్యాదిశత్=విభజించి యిచ్చెను. సః=ఆ ప్రజాపతి, ప్రియాః తనూః=యజ్ఞమునకు సంబంధించిన తనువులను, అపన్యధత్త=తొలఁగించి (ఒక చోట) దాఁచి యుంచెను. తత్ అతిగ్రాహ్యాః=అవి అతిగ్రాహ్యములుగా, అభవన్=అయినవి. యస్య=ఏ యజ్వనిమిత్తము అతిగ్రాహ్యాః=అతిగ్రాహ్యములు, న గృహ్యన్తే=గ్రహింపఁబడవో, తస్య=ఆ యజ్వయొక్క, యజ్ఞః= యజ్ఞము, వితనుః=తనూ రహితమైనది, ఇతి=అని, ఆహుః=వేదార్థ వేత్తలు చెప్పిరి. తత్=ఆ కారణమువలన, అగ్నిష్టోమేఽపి=అగ్నిష్టోమమునందు కూడ, యజ్ఞస్య సతనుత్వాయ=యజ్ఞము తనూ సహితమగుటకొఱకు, గ్రహీతవ్యాః= అతిగ్రాహ్యములు గ్రహింపఁబడవలసినవి, భవన్తి=కావలెను.

తాత్పర్యము: ప్రజాపతి దేవతలకు యజ్ఞములను విభజించి యిచ్చి ఆ యజ్ఞతనువులను ఒకచోట దాఁచి యుంచెను. ఆ తనువులు అతిగ్రాహ్యము లైనవి. యజ్వయొక్క యజ్ఞమునందు అతిగ్రాహ్యములను గ్రహించనిచో, ఆ యజ్ఞము తనూరహిత మగునని మంత్రజ్ఞులు చెప్పిరి. అందువలన యజ్ఞము తనూ (శరీర) సహిత మగుటకొఱకు అగ్నిష్టోమమునందు కూడ అతిగ్రాహ్యములను గ్రహించవలెను. అతిగ్రాహ్యములు పృష్ఠ్యషడహాది వికృతులకు సంబంధించినవని ప్రతీతి యుండుటవలన, ఇచట ప్రకృతియైన అగ్నిష్టోమమునందు అతిగ్రాహ్యములు విధించఁబడినవి.

7. అర్థము: దేవతాః=దేవతలు, సర్వాః=అందఱు, సదృశీః వై= తుల్యైశ్వర్యము కలవారే, ఆసన్=అయిరి. తాః=ఆ దేవతలు, వ్యావృతమ్= ఐశ్వర్యాధిక్య లక్షణమైన వ్యావృత్తమును, న అగచ్ఛన్=పొందరైరి. తే ఏతే దేవాః=ఆ యీ దేవతలు, ఏతాన్ గ్రహాన్=ఈ అతిగ్రాహ్య గ్రహములను, అపశ్యన్=ఐశ్వర్యాధిక్య ప్రాప్తి సాధనములనుగా చూచిరి. తాన్=ఆ గ్రహములను, అగృహ్ణత=గ్రహించిరి. అగ్నిః=అగ్ని, ఆగ్నేయమ్=అగ్నిదేవతాకమును, ఇన్ద్రః=ఇంద్రుఁడు, ఐన్ద్రమ్=ఇంద్రదేవతాకమును, సూర్యః=సూర్యుఁడు, సౌర్యమ్= సూర్యదేవతాకమును, (అగృహ్ణత=గ్రహించిరి). తతః వై=ఆ అతిగ్రాహ్యములను గ్రహించుటవలననే, తే=ఆ అగ్నీంద్రసూర్యులు, అన్యాభిః దేవతాభిః=ఇతర దేవతలచే, వ్యావృతమ్=ఐశ్వర్యాధిక్య రూప వ్యావృతమును, అగచ్ఛన్=పొందిరి. విదుషః యస్యైవ=ఈ విధమును తెలిసికొనిన ఎవని నిమిత్తమైతే, ఏతే గ్రహాః=ఈ అతిగ్రాహ్య గ్రహములు, గృహ్యన్తే=గ్రహించఁబడుచున్నవో, (సః=అతఁడు,) పాప్మనా భ్రాతృవ్యేణ=పాపరూపమైన శత్రువుచేత, వ్యావృతమ్=వ్యావృత్తిని ( వేఱగుటను), గచ్ఛతి=పొందుచున్నాఁడు.

తాత్పర్యము: దేవత లందఱు సమానైశ్వర్యవంతులై యుండిరి. ఐశ్వర్యాధిక్య రూప వైలక్షణ్యమును పొందరైరి. (అనఁగా ఒకరికంటె మఱియొకరు అధికైశ్వర్యము నొందరైరి.) ఆ దేవతలు ఈ అతిగ్రాహ్యములను ఐశ్వర్యాధిక్య ప్రాప్తి సాధనములనుగా కనుఁగొని ఆ గ్రహములను గ్రహించిరి. వారిలో అగ్ని కనుఁగొని గ్రహించిన గ్రహము ఆగ్నేయము. ఇంద్రుఁడు కనుఁగొని గ్రహించిన గ్రహము ఐంద్రము. సూర్యుఁడు కనుఁగొని గ్రహించిన గ్రహము సౌర్యము. ఆ అతిగ్రాహ్య గ్రహణమువలననే ఆ అగ్నీంద్రసూర్య దేవతలు ఇతర దేవతలకంటె అధికైశ్వర్యమును పొందిరి. ఈ విధముగ తెలిసికొనిన యజమానునినిమిత్తము అతిగ్రాహ్యములు గ్రహించఁబడినచో ఆ యజమానుఁడు పాపరూప శత్రువునుండి వేఱగును. ఇచట వ్యావృత్తికామునకు అతిగ్రాహ్య గ్రహ గ్రహణము విధించఁబడినది.

8. అర్థము: ఇమే లోకాః=ఈ పృథివ్యంతరిక్ష ద్యులోకములు, జ్యోతిష్మన్తః=కాంతిమంతములుగాను, సమావద్వీర్యాః=తుల్యసామర్థ్యము కలవిగాను, కార్యాః=చేయఁదగినవి, ఇతి=అని, ఆహుః=మంత్రజ్ఞులు చెప్పిరి. ఆగ్నేయేన=అగ్నిదేవతాకమైన అతిగ్రాహ్యముచేత, అస్మిన్=ఈ లోకమునందు, (అయమ్=ఈ యజ్వ) జ్యోతిః=కాంతిని, ధత్తే=స్థాపించుచున్నాఁడు. ఐన్ద్రేణ=ఇంద్రదేవతాకమైన అతిగ్రాహ్యముచేత, అన్తరిక్షే=అంతరిక్షమునందు, జ్యోతిః=కాంతిని, ధత్తే=స్థాపించుచున్నాఁడు. ఐన్ద్రవాయూ=ఇంద్ర వాయు దేవతలు, సయుజౌ హి=సహావస్థానము కలవారు కదా! సౌర్యేణ= సూర్యదేవతాకమైన అతిగ్రాహ్యముచేత, అముష్మిన్ లోకే=ద్యులోకమునందు, జ్యోతిః, ధత్తే. ఇమే లోకాః=ఈ లోకములు, అస్మై=ఈ యజమానునికొఱకు, జ్యోతిష్మన్తః= కాంతి కలవి, భవన్తి=అగుచున్నవి. (అయమ్=ఈ యజమానుఁడు,) ఏనాన్=ఈ లోకములను, సమావద్వీర్యాన్=తుల్యసామర్థ్యము కలవిగా, కురుతే= చేయుచున్నాఁడు.

తాత్పర్యము: ఈ లోకములు కాంతిమంతములుగాను, తుల్యసామర్థ్యము కలవిగాను చేయఁదగినవని మంత్రజ్ఞులు చెప్పిరి. కావున యజ్ఞకర్త అగ్నిదేవతాకమైన అతిగ్రాహ్యముచే ఈ భూలోకమునందును, ఇంద్రదేవతాకమైన అతిగ్రాహ్యముచే అంతరిక్షమునందును, సూర్యదేవతాకమైన అతిగ్రాహ్యముచే ద్యులోకమునందును, కాంతిని స్థాపిం

చును. అంతరిక్షమునందు వాయువు దేవత కదా! అనినచో, ఇంద్రవాయువులు ఉభయులు సహావస్థానము కలవారు. కనుక ఆక్షేపణము లేదు. ఈ విధముగ అతిగ్రాహ్య గ్రహ గ్రహణము చేయుటచేత ఈ పృథివ్యంతరిక్షద్యులోకములు ఈ యజమానునికొఱకు కాంతిమంతము లగును. ఈ యజమానుఁడు ఈ యతిగ్రాహ్య గ్రహణముచేత ఈ లోకములను తుల్య సామర్థ్యము కలవానినిగాఁ జేయును. ఇచట అతిగ్రాహ్య ప్రశంస చేయఁబడినది.

9. అర్థము: బమ్బావిశ్వవయసౌ=బంబావిశ్వవయసు లనువారు, ఏతాన్=ఈ అతిగ్రాహ్యములను (అతిగ్రాహ్య మహిమను), అవిత్తాం వై=తెలిసికొనిరి. తాభ్యామ్=వారికొఱకు, ఇమే లోకాః=ఈ లోకములు, పరాఞ్చః చ= ఉత్తమము లుగాను, అర్వాఞ్చః చ=అధమములుగాను, ప్రాభుః=ప్రాభవ సంపన్నము లైనవి. ఏవం విదుషః యస్య=ఈ పూర్వోక్త విధముగ అతిగ్రాహ్యముల మహిమను తెలిసికొనిన ఎవని నిమిత్తము, ఏతే గ్రహాః=ఈ గ్రహ ములు, గృహ్యన్తే=గ్రహించఁ బడుచున్నవో, అస్మై=ఈ యజమానునికొఱకు, ఇమే లోకాః=ఈ లోకములు, పరాఞ్చశ్చ=ఉత్తమములుగాను, అవరాఞ్చశ్చ=అధమములుగాను, ప్రభాన్తి= ప్రభావ సంపన్నము లగును.

తాత్పర్యము: బంబ విశ్వవయసు లనువారు ఈ యతిగ్రాహ్యముల మహిమను తెలిసికొనిరఁట. అందువలన వారి కీ లోక ములు ఉత్తమములుగాను, అధమములుగాను ప్రభావ సంపన్నము లైనవి. కావున ఈ యతిగ్రాహ్య మహిమను పూర్వోక్తవిధముగ తెలిసికొనిన యజమానుని నిమిత్తము ఈ అతిగ్రాహ్య గ్రహములు గ్రహించఁబడినచో, ఈ లోకము లీ యజమానుని నిమిత్తము ఉత్తమములుగాను, అధమములుగాను ప్రభావ సంపన్నము లగును. ఇచట ప్రకారాంతరముగ అతిగ్రాహ్య ప్రశంస చేయఁబడినది.

అష్టమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే నవమోఽనువాకః

మూలము: [1]దేవా వై యద్యజ్ఞేఽకుర్వత తదసురా అకుర్వత తే దేవా అదాభ్యే ఛన్దాగ్ంసి సవనాని సమస్థాపయన్తతో దేవా అభవన్పరాఽసురా యస్యైవం విదుషోఽదాభ్యో గృహ్యతే భవత్యాత్మనా పరాఽస్య భ్రాతృవ్యో భవతి [2]యద్వై దేవా అసురా నదాభ్యేనాదభ్నువ న్తదదాభ్యస్యాదాభ్యత్వం [3]య ఏవం వేద దభ్నోత్యేవ భ్రాతృవ్యం నైనం భ్రాతృవ్యో దభ్నోతి [4]ఏషా వై ప్రజాపతే రతిమోక్షిణీ నామ తనూ ర్యదదాభ్య ఉపనద్ధస్య గృహ్ణాత్యతిముక్త్యా [5]అతి పాప్మానం భ్రాతృవ్యం ముచ్యతే య ఏవం వేద [6]ఘ్నన్తి వా ఏతత్సోమం యదభిషుణ్వన్తి సోమే హన్యమానే యజ్ఞో హన్యతే యజ్ఞే యజమానో బ్రహ్మవాదినో వదన్తి కిం తద్యజ్ఞే యజమానః కురుతే యేన జీవన్సువర్గం లోకమేతీతి జీవగ్రహో వా ఏష యదదాభ్యోఽనభిషుతస్య గృహ్ణాతి జీవన్త మేవైనగ్ం సువర్గం లోకం గమయతి [7]వి వా ఏతద్యజ్ఞం ఛిన్దన్తి యదదాభ్యే సగ్ంస్థాపయన్త్యగ్ంశూనపి సృజతి యజ్ఞస్య సంతత్యై (౨) ||

(దభ్నోత్యనభిషుతస్య గృహ్ణాత్యేకాన్నవిగ్ంశతిశ్చ ।)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే నవమోఽనువాకః || ౯ ||

## వేదార్థదీపిక

అవతారిక: అష్టమానువాకమునందు అతిగ్రాహ్య గ్రహ గ్రహణము విహిత మైనది. ఈ నవమానువాకమునందు అదాభ్య గ్రహ గ్రహణము విధించఁబడుచున్నది.

1. అర్థము: దేవాః=దేవతలు, యజ్ఞే=యజ్ఞమునందు, యత్= ఏ యంగమును, అకుర్వత=అనుష్ఠించిరో, అసురాః=అసురులు, తత్ వై=ఆ యంగమునే, అకుర్వత=చేసిరి. తే దేవాః=ఆ దేవతలు, అదాభ్యే=అదాభ్య గ్రహమునందు, ఛన్దాంసి=గాయత్ర్యాది ఛందస్సులచే నిష్పాద్యములైన, సవనాని= మూఁడు సవనములను,

సమస్థాపయన్=సమాప్తిని పొందించిరి. తతః=ఆ సమాప్తివలన, దేవాః=దేవతలు, అభవన్=విజయులైరి. అసురాః=అసురులు, పరాభవన్=పరాభూతులైరి. ఏవం విదుషః=ఈ విధముగ తెలిసికొనిన, యస్య=ఏ యజమానునినిమిత్తము, అదాభ్యః=అదాభ్య గ్రహము, గృహ్యతే యత్= గ్రహింపఁబడుచో, (సః=ఆ యజమానుఁడు,) ఆత్మనా=స్వయముగ, భవతి=విజయుఁ డగును. అస్య=ఈ యజమానునియొక్క, భ్రాతృవ్యః=శత్రువు, పరాభవతి=పరాభూతుఁ డగును.

తాత్పర్యము: అసురులు దేవతలందరి మాత్సర్యముచేత దేవత లనుష్ఠించిన యజ్ఞాంగమును తాము కూడ అనుష్ఠించిరి. అప్పుడు దేవత లసురులను వంచించుటకై గాయత్రీ, త్రిష్టుప్, జాగతీ చ్ఛందస్సులచే నిష్పాద్యములైన ప్రాతర్మాధ్యందిన సాయంసవనములను మూఁడింటిని అదాభ్య గ్రహమునందు సమాప్తిఁ గావించిరి. అనఁగా– "వసవస్త్వా ప్రవృహన్తు గాయత్రేణ ఛన్దసా" ఇత్యాది మంత్ర త్రయముచేత సోమాంశువులను వేఱు చేయవలెను. అభిషవనిమిత్తము వస్త్రమునందు వస్త్రమునందు కట్టఁబడిన సోమలతలయొక్క కొనలను ఈ మంత్రములను చెప్పుచు వేఱు చేయవలెనని యర్థము. ఇదియే ఛందస్సులయొక్కయు సవనములయొక్కయు సమాపనము. ఈ సమాపనముచే దేవతలు విజయము నొందిరి. అసురులు పరాభవము నొందిరి. ఈ విధమును తెలిసికొనిన యజమానునినిమిత్తము అదాభ్య గ్రహమును గ్రహించవలెను. అప్పు డా యజమానుఁడు స్వయముగ విజయము నొందును. అతని శత్రువు పరాభవమును పొందును. ఇచట అదాభ్య గ్రహ గ్రహణము విహిత మైనది.

2. అర్థము: దేవాః=దేవతలు, యత్ వై=ఏ కారణము వలననైతే, అసురాన్=రాక్షసులను, అదాభ్యేన=అదాభ్యగ్రహముచేత, అదభ్నువన్= హింసించిరో, తత్=ఆ కారణమువలన, అదాభ్యస్య=ఆదాభ్య గ్రహమునకు, అదాభ్యత్వమ్=ఏ యితరముచేతను హింసించుట కశక్యమైనది, అను నర్థమున 'అదాభ్య' మను పేరు సిద్ధించినది.

తాత్పర్యము: దేవత లసురులను అదాభ్య గ్రహముచేత హింసించిరి. కనుక అసుర దంభన హేతువైన యీ గ్రహము ఇతరముచే హింసింప శక్యము కానిదను నర్థముచే అదాభ్యమను పేరు సిద్ధించినది. ఇచట 'అదాభ్య' పద నిర్వచనముచే ప్రశంస చేయఁబడినది.

3. అర్థము: యః=ఏ యజమానుఁడు, ఏవమ్=ఈ పూర్వోక్త విధముగ, వేద=తెలిసికొనెనో, సః=అతఁడు, భ్రాతృవ్యమ్=శత్రువును, దభ్నోత్యేవ=తప్పక హింసించును. ఏనమ్=ఈ యజమానుని, భ్రాతృవ్యః=శత్రువు, న దభ్నోతి=హింసించఁడు.

తాత్పర్యము: ఈ పూర్వోక్త విధముగ తెలిసికొనిన యజమానుఁడు తన శత్రువును హింసించును. ఇతనిని శత్రువు హింసించఁడు. ఇచట వేదనము ప్రశంసించఁబడినది.

4. అర్థము: అదాభ్యః యత్=అదాభ్య గ్రహ మేది కలదో, ఏషా వై= ఇదియే, ప్రజాపతేః=ప్రజాపతియొక్క, అతిమోక్షిణీ నామ తనూః=అతిమోక్షిణీ యను పేరు గల తనువు. (ఏనమ్=ఈ అదాభ్య గ్రహమును, ఉపనద్ధస్య=వస్త్రముచే బంధించఁబడిన సోమముయొక్క, (బన్ధనాత్=బంధనమునుండి,) అతిముక్త్యై= అతిశయముగ మోక్షణముకొఱకు, గృహ్ణీతి=గ్రహించవలెను.

తాత్పర్యము: అదాభ్య గ్రహము ప్రజాపతియొక్క అతిమోక్షిణీ యను శరీరము, వస్త్రబద్ధమైన సోమలతయొక్క బంధనము నుండి అతిమోక్షణమునకై అదాభ్య గ్రహమును గ్రహించవలెను. అతిశయేన పాపాత్ మోక్షః అతిమోక్షః. సః అస్యాః అస్తీతి అతిమోక్షిణీ. పాపమునుండి అధికముగ విముక్తిని కలిగించునదని యర్థము. వస్త్రమునందు మూట కట్టఁబడిన సోమలతా సమూహమును అభిషవము చేయుటకై అభిషవ సాధనములైన ఫలకముల పైని ఉంచుదురు. ఉపాంశు గ్రహ గ్రహణ సమయమునందు సోమముయొక్క వస్త్రబంధమును తొలఁగించి "ఇన్ద్రాయ త్వా వృత్రఘ్న" ఇత్యాది మంత్రములను పఠించుచు సోమమును కొలుతురు. ఆ

వస్త్ర బంధన మోక్షణములకు పూర్వమే అదాభ్య గ్రహమును గ్రహించవలెనని భావము. ఇచట అదాభ్య గ్రహ గ్రహణ కాలము విధించఁబడినది.

5. అర్థము: యః=ఏ పురుషుఁడు, ఏవమ్=ఈ విధముగ, వేద=తెలిసికొనెనో, సః=అతడు, పాప్మానం భ్రాతృవ్య మతి=పాపరూపమైన శత్రువు నతిక్రమించి, (తత్కృతమైన ఉపద్రవమునుండి కూడ), ముచ్యతే=విడువఁ బడును.

తాత్పర్యము: ఈ విధముగ తెలిసికొనిన యతఁడు పాపరూపమైన శత్రువు నధిగమించి ఆ పాపము చేసిన ఉపద్రవము నుండి విడువఁబడును. (ఇచట వేదనము ప్రశంసించఁబడినది.)

6. అర్థము: అభిషుణ్వన్తి యత్=అభిషవము చేయుట యేది కలదో, ఏతత్=ఇది, సోమమ్=సోమమును, ఘ్నన్తి వై=వధించుచున్నా రనుటయే. సోమే హన్యమానే=సోమము వధించఁబడుచుండఁగా, యజ్ఞః=యజ్ఞము, హన్యతే=వధించఁబడుచున్నది. యజ్ఞే హన్యమానే=యజ్ఞము వధించఁబడుచుండఁగా, యజమానః=యజ మానుఁడు, హన్యతే=వధించఁబడినవాఁ డగుచున్నాఁడు. యేన=దేనిచేత, జీవన్=జీవించుచు, సువర్గం లోకమ్=స్వర్గలోకమును, ఏతి=పొందుచున్నాఁడో, తత్ కిమ్=అటువంటి దేనిని, యజమానః=యజ మానుఁడు, యజ్ఞే=యజ్ఞమునందు, కురుతే= చేయుచున్నాఁడు, ఇతి=అని, బ్రహ్మవాదినః= మంత్రజ్ఞులు, వదన్తి=చెప్పుచున్నారు (ప్రశ్నించుచున్నారు). అదాభ్యః యత్= అదాభ్య గ్రహ మేది కలదో, ఏషః=ఇది, జీవగ్రహః వై=జీవనోపేతమైన గ్రహమే. ( తత్=ఆ కారణమువలన,) అనభిషుతస్య=అభిషుతము కానిదానిని, గృహ్ణాతి= గ్రహించవలెను. (తదా=అప్పుడు, ఏషః=అనభిషుత ద్రవ్యోపేత గ్రహము,) జీవన్తమేవ=జీవించుచు నేయున్న, ఏనమ్=ఈ యజమానుని, సువర్గం లోకమ్= స్వర్గలోకమును, గమయతి=పొందించును.

తాత్పర్యము: యజ్ఞమునందు సోమము నభిషవము చేయుదురు కనుక దానిని వధించుచున్నారనియే యర్థము. సోమము వధించఁబడినప్పుడు యజ్ఞము వధించఁబడిన దగును. యజ్ఞము హత మైనప్పుడు యజమానుఁడు హత ప్రాయుఁ డగును. కనుక అభిషవరూప వధరహిత ద్రవ్యోపేతమైన యే గ్రహముచేత యజ్వ జీవించుచునే స్వర్గమును పొందునో, అట్టి ద్రవ్యముతో కూడిన ఏ గ్రహమును యజమానుఁడు గ్రహించుచున్నాఁడు? అని మంత్రజ్ఞులు ప్రశ్నించుచున్నారు. అదాభ్య గ్రహము జీవనోపేతమైనదిగా బ్రహ్మవాదులు నిశ్చయించిరి. కనుక అభిషవరూపవధరహితమైన ద్రవ్యముయొక్క రసమును ఆ యదాభ్యగ్రహమునందు గ్రహించవలెను. అట్టి యన భిషుత ద్రవ్యరసోపేతమైన అదాభ్య గ్రహము ఈ జీవించుచున్న యజమానునే స్వర్గమును పొందించును. ఇచట అదాభ్య గ్రహమునకు అనభిషుత ద్రవ్యరసము విధించఁబడినది.

7. అర్థము: అదాభ్యే=అదాభ్య గ్రహమునందు, సంస్థాపయన్తి యత్=గాయత్ర్యాది ఛందోపేతములైన మూఁడు సవన ములకు సమాపనము చేయుచున్నా రనుట యేది కలదో, ఏతత్=ఇది, యజ్ఞమ్=యజ్ఞమును, విచ్ఛిన్దన్తి వై= విచ్ఛిన్నము చేయుచున్నారనుటయే. (తత్=ఆ కారణమువలన,) యజ్ఞస్య సంతత్యై= యజ్ఞముయొక్క అవిచ్ఛిత్తికొఱకు, అంశూనపి=సోమలతయొక్క అంశువులను కూడ, సృజతి=సోమరసమునందు మేళనము చేయవలెను.

తాత్పర్యము: అసురులను వంచించుటకై "వసవస్త్వా" ఇత్యాది మంత్రముల నుచ్చరించుచు సోమలతయొక్క కొనలను వేఱుచేయుట అనెడి సవనత్రయ సమాపనము చేయుచో దానిని ఇతరులు కూడ చేయుదురు. అప్పుడు ఉపాంశ్వంతర్యామాదులననుష్ఠించకపోవుటచే యజ్ఞము విచ్ఛిన్న మగును. యజ్ఞవిచ్ఛిత్తి లేకుండుటకై వేఱు చేయఁబడిన సోమాంశువులను సోమరసమునందు మేళనము చేయవలెను. ఇచట సవనత్రయమునందలి మహాభిషవములందు సోమాంశుమేళనము విహిత మైనది.

నవమానువాకము సమాప్తము

## అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠకే దశమోఽనువాకః

మూలము: [1]దేవా వై ప్రబాహుగ్గ్రహా నగృహ్ణత స ఏతం ప్రజాపతి రగ్ంశు మపశ్య త్తమగృహ్ణీత తేన వై స ఆర్ధ్నో

ద్యస్యైవం విదుషో ఽగ్ంశు ర్గృహ్యత ఋధ్నోత్యేవ [2]సకృదభిషుతస్య గృహ్ణాతి సకృద్ధి స తేనాఽఽర్ధ్నో

[3]న్మనసా గృహ్ణాతి మన ఇవ హి ప్రజాపతిః ప్రజాపతేరాప్త్యై [4]ఔదుమ్బరేణ గృహ్ణాత్యూర్గ్వా ఉదుమ్బర

ఊర్జమేవావ రున్ధే [5]చతుఃస్రక్తి భవతి దిక్షు (౧)ఏవ ప్రతి తిష్ఠతి [6] యో వా అగ్ంశో రాయతనం

వేదాఽఽయతనవా న్భవతి వామదేవ్యమితి సామ తద్వా అస్యాఽఽ యతనం మనసా గాయమానో

గృహ్ణాత్యాయతనవానేవ భవతి [7] యదధ్వర్యురగ్ంశుం గృహ్ణన్నార్ధయే దుభాభ్యాం నార్ధ్యేతాధ్వర్యవే

చ యజమానాయ చ యదర్ధయే దుభాభ్యా మృధ్యేతానవానం గృహ్ణాతి సైవాస్యర్ధి [8]ర్హిరణ్యమభి

వ్యనిత్యమృతం వై హిరణ్య మాయుః ప్రాణ ఆయుషైవామృతమభి ధినోతి [9]శతమానం భవతి

శతాయుః పురుషః శతేన్ద్రియ ఆయుష్యేవేన్ద్రియే ప్రతి తిష్ఠతి (౨) (దిక్ష్వనితి/విగ్ంశతిశ్చ ।)

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే దశమో ఽనువాకః ॥ ౧౦ ॥

## వేదార్థదీపిక

అవతారిక: నవమానువాకమునందు అదాభ్య గ్రహము నిరూపిత మైనది. ఈ దశమానువాకమునందు అంశుగ్రహము విధించఁబడుచున్నది.

1. అర్థము: దేవాః=దేవతలు, ప్రబాహుక్ గ్రహాన్ వై= తుల్యస్వభావము కలిగిన గ్రహములనే, అగృహ్ణత=గ్రహించిరి. సః ప్రజాపతిః=ఆ ప్రజాపతి, ఏతమ్ అంశుమ్=ఈ అంశు గ్రహమును, అగృహ్ణీత=గ్రహించెను. తేన వై=ఆ అంశుగ్రహ గ్రహణముచేతనే, సః=ఆ ప్రజాపతి, ఆర్ధ్నోత్=సమృద్ధుఁ డయ్యెను. ఏవం విదుషః=ఈ విధ

ముగ తెలిసికొనిన, యస్య=ఏ యజమానునినిమిత్తము, అంశుః=అంశుగ్రహము, గృహ్యతే=గ్రహించఁబడునో, సః=అతఁడు, ఆర్ధ్నోత్యేవ=తప్పక సమృద్ధుఁ డగును.

తాత్పర్యము: దేవతలు తుల్యస్వభావ గ్రహములనే గ్రహించిరి. ఆ ప్రజాపతి తద్విలక్షణమైన ఈ యంశు గ్రహమును తెలిసికొని దానిని గ్రహించెను. దానిచేతనే ఆ ప్రజాపతి సమృద్ధి కలవాఁ డయ్యెను. ఈ విధముగ తెలిసికొనిన ఏ యజమానునినిమిత్తము అంశుగ్రహము గ్రహించఁబడునో, అతఁడు సమృద్ధిమంతుఁ డగును. ఇచట అంశుగ్రహము విధించఁబడినది.

2. అర్థము: సకృత్ అభిషుతస్య=ఒక్కమారు అభిషవము చేయఁబడిన సోమమును, గృహ్ణాతి=అంశుగ్రహమునందు గ్రహించవలెను. సకృత్ హి=ఒక్కమారే అభిషవము చేసి, సః=ఆ ప్రజాపతి, తేన=ఆ గ్రహముచే, ఆర్ధ్నోత్=వృద్ధి (సమృద్ధి) నొందెను.

తాత్పర్యము: ఒక్కమారు అభిషుతమైన సోమమును అంశుగ్రహమునందు గ్రహించవలెను. ఒక్కమారు అభిషవము చేసియే ఆ గ్రహముచేత ప్రజాపతి సమృద్ధుఁ డయ్యెను. ఇచట అభిషవమునకు అవృత్యభావము విధించఁ బడినది.

3. అర్థము: మనసా=మనస్సుచేత, గృహ్ణాతి=గ్రహించవలెను. ప్రజాపతిః=ప్రజాపతి, మనసః ఇవ హి=మనస్సువంటివాఁడు కదా! ఏతత్= ఇది, ప్రజాపతేః=ప్రజాపతియొక్క, ఆప్త్యై=ప్రాప్తికొఱకు, భవతి= అగుచున్నది.

తాత్పర్యము: అంశుగ్రహములోనికి సకృదభిషుత సోమమును మంత్రోచ్చారణము చేయక మనస్సుచేత గ్రహించవలెను. ప్రజాపతి సంకల్పముచేతనే జగత్తును సృష్టించెను కనుక అతఁడు మనస్స్వరూపుఁడు. ఈ విధముగ గ్రహించుట ప్రజాపతిని పొందుటకు కారణ మగును. ఇచట గ్రహణ మంత్రోచ్చారణమును నివారించుటకై మానసమైన అనుసంధానము విధించఁబడినది.

4. అర్థము: ఔదుమ్బరేణ=మేడిచెట్టునకు సంబంధించిన కొయ్యతో నిర్మితమైన పాత్రముచే, గృహ్ణాతి=గ్రహించవలెను. ఉదుమ్బరః=ఉదుంబరము (మేడి), ఊర్క్ వై=రసస్వరూపమే. (తదా=అప్పుడు, అయమ్=ఈ యజమానుఁడు,) ఊర్జమ్=రసము (బలము)ను, అవరున్ధే ఏవ=తప్పక పొందును.

తాత్పర్యము: మేడికొయ్యతో నిర్మితమైన అంశుగ్రహముచే సోమమును గ్రహించవలెను. మేడి రసస్వరూప మైనదే కావున యజమానుఁడు రసమును (బలమును) తప్పక పొందును. ఇచట గ్రహణపాత్రము విహిత మైనది.

5. అర్థము: చతుఃస్రక్తి=పూర్వోక్త పాత్రము నాలుగు అంచులు ( కోణములు) కలదియై, భవతి=ఉండవలెను. దిక్ష్వేవ=దిక్కులందే, ప్రతితిష్ఠతి= ప్రతిష్ఠితుఁడగును.

తాత్పర్యము: గ్రహణ పాత్రము చతుష్కోణములు కలదిగా నుండవలెను. దిక్కులు నాలుగు కనుక నాలుగు అంచులు గల పాత్రముచే సోమమును గ్రహించుటచే తప్పక యజమానుఁడు నాలుగు దిక్కులందు ప్రతిష్ఠితుఁ డగును. ఇచట పాత్రముయొక్క ఆకారము విధించఁబడినది.

6. అర్థము: యః వై=ఏ యజమానుఁడైతే, అంశోః= అంశుగ్రహముయొక్క, ఆయతనమ్=ఆయతనమును (స్థానమును), వేద= తెలిసికొనెనో, సః=అతఁడు, ఆయతనవాన్=గృహవంతుఁడు, భవతి= అగును. వామదేవ్యమ్ ఇతి సామ వై= వామదేవమహర్షిచే కనుఁగొనఁబడిన ఋక్కునం దుత్పన్నమైన సామమే, అస్య=ఈ అంశు గ్రహముయొక్క, ఆయతనమ్= స్థానము. తత్=ఆ సామమును, మనసా=మనస్సుచే, గాయమానః=గానము చేయుచున్నవాఁడై, గృహ్ణాతి=గ్రహించవలెను. ఆయతనవాన్= గృహవంతుఁడు, భవత్యేవ=తప్పక అగును.

తాత్పర్యము: వామదేవమహర్షి "కయా నశ్చిత్ర ఆ భువత్" అను ఋక్కును కనుఁగొనెను. ఆ ఋక్కునందు పుట్టిన సామము అంశుగ్రహమునకు స్థానము. ఈ యంశుగ్రహముయొక్క స్థానమును తెలిసికొనిన యజమానుఁడు ఆయతనము ( గృహము) కలవాఁ డగును. ఆయతనమైన ఆ సామమును మనస్సుచే గానము చేయుచు

అంశుగ్రహములోనికి సోమమును గ్రహించవలెను. ఈ విధముగ చేసిన యజమానుఁడు తన్వక గృహము (ఆ యతనము) కలవాఁ డగును. ఇచట వామదేవ్య సామమునకు గ్రహణ మంత్రత్వము విధించఁబడినది.

7. అర్థము: అధ్వర్యూః=అధ్వర్యుఁడు, అంశుం గృహ్ణన్= అంశుగ్రహమును గ్రహించుచు, న అర్ధయేత్ యత్=సమృద్ధము నుగా చేయనిచో, అధ్వర్యవే చ=అధ్వర్యునికొఱకును, యజమానాయ చ=యజమానునికొఱకును, ఉభాభ్యామ్=ఉభయులకొఱకు, న ఋధ్యేత=సమృద్ధి కలుగదు. అర్ధయేత్ యత్= సమృద్ధమునుగా చేయుచో, ఉభాభ్యామ్=ఉభయులకొఱను, ఋధ్యేత=సమృద్ధి కలుగును. అనవానమ్=అనుచ్ఛ్వాసముగా, గృహ్ణాతి= అంశుగ్రహమును గ్రహించవలెను. సైవ=ఆ అనుచ్ఛ్వాస గృహీతియే, అస్య=ఈ అంశుగ్రహముయొక్క, ఋద్ధిః=సమృద్ధి. అనుచ్ఛ్వాస గృహీతి=ఉచ్ఛ్వాస రహితముగ గ్రహించుట.

తాత్పర్యము: అధ్వర్యుఁడు అంశు గ్రహమును గ్రహించుచు సమృద్ధమునుగా చేయనిచో అధ్వర్యు యజమానుల కుభయు లకు సమృద్ధి కలుగదు. గ్రహమును సమృద్ధమునుగా చేయుచో, ఆ యుభయులకు సమృద్ధి కలుగును. అంశు గ్రహమును ఉచ్ఛ్వాసమును విడువకుండ గ్రహించవలెను. అనుచ్ఛ్వాసముగ అంశుగ్రహమును గ్రహించుటయే ఈ అంశుగ్రహముయొక్క సమృద్ధి. గ్రహ గ్రహణ సమయమున అనుచ్ఛ్వాసము ఇచట విధించఁబడినది.

8. అర్థము: హిరణ్యమ్ అభి=హిరణ్యమున కభిముఖముగా, వ్యనితి= ఉచ్ఛ్వాసమును విడువవలెను. హిరణ్యమ్=బంగారము, అమృతం వై=అమృత స్వరూపమే. ప్రాణః=ప్రాణము, ఆయుః=ఆయుస్స్వరూపము. తథా సతి=అట్లు కాఁగా, ఆయుషైవ=ఆయుస్స్వరూపమైన ప్రాణవాయువుచేతనే, అమృతమ్= హిరణ్య రూపమైన అమృత మును, అభిధినోతి=అభిముఖముగ సంతోషపఱచినవాఁ డగును.

తాత్పర్యము: అంశుగ్రహ గ్రహణ సమయమున ఉచ్ఛ్వాసము అగునెడల హిరణ్యము నభిముఖముగ నుంచుకొని ఆ హిర ణ్యమున కభిముఖముగ ఉచ్ఛ్వసించవలెను. హిరణ్యము అమృత స్వరూపమే. ప్రాణవాయువు ఆయుస్స్వ రూపము. హిరణ్యాభిముఖముగ నుచ్ఛ్వసించిన యజమానుఁడు ఆయుస్స్వరూపమైన ప్రాణవాయువుచేతనే హిరణ్య రూపమైన అమృతమును అభిముఖముగ సంతోషపఱచినవాఁ డగును. ఉచ్ఛ్వాసము కలిగినచో తద్దోష నివారణమునకై హిరణ్యాభిముఖముగ ఉచ్ఛ్వసించవలెనని యిచట విధించఁబడినది.

9. అర్థము: శతమానమ్=పూర్వోక్త హిరణ్యము శతమాన పరిమితమై, భవతి=ఉండవలెను. పురుషః=పురుషుఁడు, శతాయుః=నూఱు సంవత్సరములు ఆయుః పరిమితి కలవాఁడు. శతేన్ద్రియః=నూఱు ఇంద్రియములు కలవాఁడు. తథా సతి=అట్లు కాఁగా, యజమానః=యజమానుఁడు, ఆయుషి=సంపూర్ణాయువునందు, శతే న్ద్రియే=నూఱు ఇంద్రియములందును, ప్రతితిష్ఠతి=ప్రతిష్ఠితుఁ డగును.

తాత్పర్యము: పూర్వమంత్రోక్తమైన హిరణ్యము శతమాన పరిమితమై యుండవలెను. (శతమానము=మూఁడు రూపాయల యెత్తు). పురుషుఁడు నూఱు సంవత్సరములు ఆయువు కలిగియుండును. పురుషుని ఇంద్రియములు నూఱు. దశేంద్రియములు దశనాడులందు సంచరించుచుండుటచే శతేంద్రియుఁడని యర్థము. విహితమైన హిరణ్య మునకు, పురుషుని ఆయుఃపరిమితికి, ఇంద్రియములకు శతసంఖ్యా సాదృశ్యము ఉండుటచే యజమానుఁడు శతేంద్రియములందు ప్రతిష్ఠితుఁడై శతాయు వగును. ఇచట హిరణ్యముయొక్క పరిమితి విధించఁబడినది.

## దశమానువాకము సమాప్తము

# అథ షష్ఠకాణ్డే షష్ఠ ప్రపాఠక ఏకాదశోఽనువాకః

మూలము: [1]ప్రజాపతి ర్దేవేభ్యో యజ్ఞాన్వ్యాదిశత్స రిరిచానోఽమన్యత స యజ్ఞానాగ్ం షోడశధేన్ద్రియం వీర్య మాత్మానమభి సమక్షిద తత్షోడశ్యభవన్న వై షోడశీ నామ యజ్ఞోఽస్తి యద్వావ షోడశగ్ం స్తోత్రగ్ం షోడశగ్ం శస్త్రం తేన షోడశీ తత్షోడశినః షోడశిత్వం యత్షోడశీ గృహ్యత ఇన్ద్రియమేవ తద్వీర్యం యజమాన ఆత్మన్దత్తే [2]దేవేభ్యో వై సువర్గో లోకః (౧)న ప్రాభవత్త ఏతగ్ం షోడశిన మపశ్యన్త మగృహ్ణత తతో వై తేభ్యః సువర్గో లోకః ప్రాభవ ద్యత్షోడశీ గృహ్యతే సువర్గస్య లోకస్యాభిజిత్యా [3]ఇన్ద్రో వై దేవానా మానుజావర ఆసీత్స ప్రజాపతి ముపాధావత్తస్మా ఏతగ్ం షోడశినం ప్రాయచ్ఛ త్తమ గృహ్ణీత తతో వై సోఽగ్రం దేవతానాం పర్యైద్యస్యైవం విదుషః షోడశీ గృహ్యతే (౨) అగ్రమేవ సమానానాం పర్యేతి [4]ప్రాతఃసవనే గృహ్ణాతి వజ్రో వై షోడశీ వజ్రః ప్రాతః సవనగ్ం స్వాదేవైనం యోనే ర్నిర్గృహ్ణాతి [5]సవనేసవనేఽభి గృహ్ణాతి సవనాత్సవనాదేవైనం ప్ర జన యతి [6]తృతీయసవనే పశుకామస్య గృహ్ణీయాద్వజ్రో వై షోడశీ పశవస్తృతీయ సవనం వజ్రేణైవాస్మై తృతీయసవనా త్పశూనవ రున్ద్దే [7] నోక్థ్యే గృహ్ణీయాత్ప్రజా వై పశవ ఉక్థాని యదుక్థ్యే (౩) గృహ్ణీయాత్ప్రజాం పశూనస్య నిర్దహే [8]దతిరాత్రే పశుకామస్య గృహ్ణీయాద్వజ్రో వై షోడశీ వజ్రేణైవాస్మై పశూనవరుధ్య రాత్రియోపరిష్టా చ్ఛమయ [9]త్యప్యగ్నిష్టోమే రాజన్యస్య గృహ్ణీయా ద్వ్యావృత్కామో హి రాజన్యో యజతే [10]సాహ్న ఏవాస్మై వజ్రం గృహ్ణాతి స ఏనం వజ్రో భూత్యా ఇన్ధే నిర్వా

దహత్యేకవిగ్ంశగ్ం స్తోత్రం భవతి ప్రతిష్ఠిత్యై [11]హారివచ్ఛస్యత ఇన్ద్రస్య ప్రియం ధామ (౪)ఉపాఽఽ ప్నోతి [12]కనీయాగ్ంసి వై దేవేషు ఛన్దాగ్ంస్యాసన్జ్యాయాగ్ంస్యసురేషు తే దేవాః కనీయసా ఛన్దసా జ్యాయశ్ఛన్దోఽభి వ్యశగ్ంసన్తతో వై తేఽసురాణాం లోక మవృఞ్జత యత్కనీయసా ఛన్దసా జ్యాయ శ్ఛన్దోఽభి విశగ్ంసతి భ్రాతృవ్యస్యైవ తల్లోకం వృఙ్క్తే [13]షడక్షరాణ్యతి రేచయన్తి షడ్వా ఋతవ ఋతూనేవ ప్రీణాతి చత్వారి పూర్వాణ్యవ కల్పయన్తి (౫) చతుష్పద ఏవ పశూనవ రున్ధే ద్వే ఉత్తరే ద్విపద ఏవావ రున్ధే [14]ఽనుష్టుభమభి సం పాదయన్తి వాగ్వా అనుష్టు ప్తస్మాత్ప్రాణానాం వాగుత్తమా [15]సమయావిషితే సూర్యే షోడశినః స్తోత్ర ముపాకరోత్యేతస్మిన్వై లోక ఇన్ద్రో వృత్ర మహన్సాక్షాదేవ వజ్రం భ్రాతృవ్యాయ ప్ర హర [16]త్యరుణపిశఙ్గోఽశ్వో దక్షిణైతద్వై వజ్రస్య రూపగ్ం సమృద్ధ్యై (౬).

(లోకో విదుషః షోడశీ గృహ్యతే యదుక్థ్యే ధామ కల్పయన్తి సప్తచత్వారిగ్ంశచ్చ).

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠప్రపాఠకే ఏకాదశోఽనువాకః ||౧౧||

సువర్గాయ యద్దక్షిణాని సమిష్ట యజూగ్ంష్యవభృథ యజూగ్ంషి స్ఫ్యేన వేదిం ప్రజాపతి రిన్ద్రో ఘ్నన్తి దేవా వా ఇన్ద్రియం దేవా అదాభ్యే దేవా వై ప్రబాహుక్ప్రజాపతిః స రిరిచానః స యజ్ఞానాగ్ం షోడశధైకాదశ || ౧౧ ||

సువర్గాయ యజతి ప్రజాః సౌమ్యేన గృహ్ణీయాత్ప్రత్యఞ్చం గృహ్ణీయాత్ప్రజాం పశూన్త్రిచత్వా రిగ్ంశత్ ||౪౩||

హరిః ఓమ్

ఇతి కృష్ణయజుర్వేదీయతైత్తిరీయ సంహితాయాం షష్ఠాష్టకే షష్ఠః ప్రపాఠకః ||౬||

సమాప్తోఽయం షష్ఠః కాణ్డః || ౬ ||

# వేదార్థదీపిక

అవతారిక: దశమానువాకమునందు అంశుగ్రహము నిరూపిత మైనది. ఈ యేకాదశానువాకమునందు షోడశిగ్రహము విధించఁబడుచున్నది.

1. అర్థము: ప్రజాపతిః=ప్రజాపతి, దేవేభ్యః=దేవతలకొఱకు, యజ్ఞాన్=యజ్ఞములను, వ్యాదిశత్=విభజించి యిచ్చెను. సః=ఆ ప్రజాపతి, రిరిచానః=శూన్యుడనని, అమన్యత=తలఁచెను. సః=అతఁడు, యజ్ఞానామ్=సర్వయజ్ఞముల సంబంధియు, షోడశధా=షోడశభేద భిన్నమునైన, ఇన్ద్రియం వీర్యమ్=ఇంద్రియ సామర్థ్య ప్రదమైన అంశమును, ఆత్మానమ్ అభి=తన కభిముఖముగ, సమవృణక్=బాగుగ నుంచుకొని శ్రాంతుఁ డయ్యెను. తత్=ఆ సామర్థ్యము, షోడశీ=షోడశి నామక క్రతువు, అభవత్=అయ్యెను. షోడశీ నామ యజ్ఞః=సోమయాగ వ్యతిరిక్తమైన షోడశి నామక యజ్ఞము, న అస్తి వై=ఉండనే లేదు. యత్ వావ=ఏది యైతే, షోడశమ్=షోడశనామకమైన, స్తోత్రమ్=స్తోత్రమో, షోడశమ్=షోడశనామక మైన, శస్త్రమ్=శస్త్రమో, తేన=దానిచేత, షోడశీ= షోడశిక్రతువు, భవతి=అగుచున్నది. తత్=ఆ కారణమువలన, షోడశినః= షోడశి క్రతువునకు, షోడశిత్వమ్='షోడశి'అను పేరు, భవతి=సార్థక మగుచున్నది. షోడశీ=షోడశి గ్రహము, గృహ్యతే యత్=గ్రహించఁబడుచున్నచో, యజమానః=యజమానుఁడు, ఇన్ద్రియమేవ తత్ వీర్యమ్=ఇంద్రియగతమే యైన ఆ సామర్థ్యమును, ఆత్మన్=తనయందు, ధత్తే=ధరించును.

తాత్పర్యము: ప్రజాపతి దేవతలకు యజ్ఞములను విభజించి యిచ్చి తనకై యేదియు లేకపోవుటచే తాను శూన్యుఁడ నైతినని తలఁచి, తన కభిముఖముగ ( తనకై) సర్వయజ్ఞ సంబంధియు, షోడశ భేద భిన్నమునైన ఇంద్రియ సామర్థ్య ప్రదమైన అంశమును ఉంచుకొని శ్రాంతుఁ డయ్యెను. ఆ సామర్థ్యము షోడశి నామక క్రతు వయ్యెను. కాని ఆ షోడశిక్రతువు సోమయాగ వ్యతిరిక్తమైన మఱియొక నూతన యజ్ఞము కాదు. యజ్ఞమునందు ప్రయోగించఁబడునట్టి షోడశస్తోత్ర షోడశశస్త్రములే షోడశిక్రతువు. కనుకనే షోడశి క్రతువునకు షోడశినామ మేర్పడినది. ఈ షోడశిగ్రహమును గ్రహించవలెను. షోడశిగ్రహమును గ్రహించిన యజ్వ ఆ యింద్రియ సామర్థ్యమునే తనయందు ధరించును. ఇచట షోడశిగ్రహము విధించఁబడినది.

2. అర్థము: దేవేభ్యః=దేవతలకొఱకు, సువర్గః లోకః= స్వర్గలోకము, న ప్రాభవత్ వై=స్వాధీనమే కాలేదు. తే=ఆ దేవతలు, ఏతం షోడశినమ్=ఈ షోడశి గ్రహమును, అపశ్యన్=చూచిరి (తెలిసికొనిరి). తమ్= దానిని, అగృహ్ణత=గ్రహించిరి. తతః వై=ఆ షోడశి గ్రహ గ్రహణమువలననే, తేభ్యః=వారి కొఱకు, సువర్గః లోకః=స్వర్గలోకము, ప్రాభవత్=స్వాధీన మయ్యెను. షోడశీ గృహ్యతే యత్=షోడశి గ్రహము గ్రహించఁబడినచో, (ఏతత్= ఈ షోడశి గ్రహ గ్రహణము,) సువర్గస్య లోకస్య=స్వర్గలోకముయొక్క, అభిజిత్యై= జయము (ప్రాప్తి) కొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: ఒకప్పుడు దేవతలకు స్వర్గలోకము స్వాధీనము కాలేదు. అప్పుడు ఆ దేవతలు షోడశిగ్రహమును తత్సాధనముగా కనుఁగొని దానిని గ్రహించిరి. దానివలననే వారికి స్వర్గము స్వాధీన మయ్యెను. కనుక షోడశిగ్రహ గ్రహణము స్వర్గలోకప్రాప్తికి సాధన మగును. షోడశి గ్రహము ఇచట ప్రశంసించఁబడినది.

3. అర్థము: ఇన్ద్రః=ఇంద్రుఁడు, దేవానామ్=దేవతలలో, అనుజావరః=అత్యంత నికృష్టుఁడు, ఆసీత్ వై=ఆయెనఁట! సః=ఆ యింద్రుఁడు, ప్రజాపతిమ్=ప్రజాపతిని, ఉపాధావత్=సమీపించెను (సేవించెను). తస్మై=ఆ యింద్రునకై, ఏతం షోడశినమ్=ఈ షోడశిగ్రహమును, ప్రాయచ్ఛత్=ఇచ్చెను. తమ్=ఆ గ్రహమును, అగృహ్ణత=గ్రహించెను. తతః వై=దానివలననే, సః=ఆ యింద్రుఁడు, దేవతానామ్=దేవతలలో, అగ్రమ్=శ్రేష్ఠ

మును, పర్యైత్=పొందెను. ఏవం విదుషః=ఈ విధముగ తెలిసికొనిన, యస్య=ఏ యజమానునినిమిత్తము, షోడశీ=షోడశిగ్రహము, గృహ్యతే=గ్రహించఁబడునో, సః=అతఁడు, సమానానామ్= సమానులలో, అగ్రమేవ=శ్రేష్ఠత్వమునే, పర్యేతి=పొందును.

తాత్పర్యము: ఒకప్పుడు ఇంద్రుఁడు నికృష్టులలో ఇంకను నికృష్టుఁ డయ్యెను. అతఁడు ప్రజాపతియొద్దకు వెళ్లి సేవించఁగా అతఁడు ఇంద్రునకు షోడశిగ్రహము నొసఁగెను. ఇంద్రుఁడు ఆ షోడశిగ్రహమును గ్రహించఁగా దానివలననే అతఁడు దేవతలలో శ్రేష్ఠుఁ డయ్యెను. ఈ విధముగ తెలిసికొనిన యజమానునినిమిత్తము షోడశిగ్రహమును గ్రహించినచో, ఆ యజమానుఁడు సమానులలో శ్రేష్ఠుఁ డగును. ఇచట షోడశిగ్రహము ప్రకారాంతరముగ ప్రశంసించఁబడినది.

4. అర్థము: ప్రాతఃసవనే=ప్రాతఃసవనమునందు, గృహ్ణాతి=షోడశి గ్రహమును గ్రహించవలెను. షోడశీ=షోడశి గ్రహము, వజ్రః వై=వజ్రస్వరూపమే. ప్రాతఃసవనమ్=ప్రాతఃసవనము, వజ్రః=వజ్రస్వరూపము. స్వాత్ యోనేః ఏవ= స్వీయ యోని (కారణము) నుండియే, ఏనమ్=ఈ షోడశి గ్రహమును, నిర్మృహ్ణాతి= నిష్కర్షించి గ్రహించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: షోడశిగ్రహమును ప్రాతఃసవనమునందు గ్రహించవలెను. వజ్రమువలె షోడశిగ్రహ ప్రాతఃసవనములు రెండును అనిష్ట నివారకములు కావున, తత్సామ్యముచే వజ్రస్వరూపములు. ఆ కారణమువలన తనకు యోనియైన ప్రాతఃసవనమునందు షోడశి గ్రహమును గ్రహించినవాఁ డగును. ఇచట షోడశిగ్రహ గ్రహణమునకు కాలము విహిత మైనది.

5. అర్థము: సవనేసవనే=ప్రతి సవనమునందు, అభి=అంతటను, గృహ్ణాతి=ఈ షోడశి గ్రహమును గ్రహించవలెను. సవనాత్ సవనాత్ ఏవ= ప్రతిసవనమునుండియే, ప్ర జనయతి=ప్రకర్షముగా పుట్టించినవాఁ డగుచున్నాఁడు.

తాత్పర్యము: ప్రాతఃసవన మాధ్యందిన సాయంసవనములందు మూఁడింటియందును షోడశి గ్రహమును గ్రహించవలెను. అట్లు గ్రహించిన యజమానుఁడు ప్రతిసవనమునందును ఈ షోడశి గ్రహమును ప్రకర్షముగా పుట్టించినవాఁ డగును. ఇచట షోడశి గ్రహణ కాల విషయమున పక్షాంతరము చెప్పఁబడినది.

6. అర్థము: పశుకామస్య=పశువులను కోరునట్టి యజమానుని నిమిత్తము, తృతీయ సవనే=తృతీయ సవనమునందు, గృహ్ణీయాత్=షోడశి గ్రహమును గ్రహించవలెను. షోడశీ=షోడశి గ్రహము, వజ్రః వై=వజ్ర స్వరూపమే. తృతీయసవనమ్=తృతీయసవనము, పశవః=పశు స్వరూపము. (అధ్వర్యుః= పశుకాముని నిమిత్తము తృతీయ సవనమున షోడశి గ్రహమును గ్రహించిన అధ్వర్యుఁడు,) వజ్రేణైవ=షోడశి రూప వజ్రముచేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, తృతీయ సవనాత్=తృతీయ సవనమువలన, పశూన్=పశువులను, అవరున్ధే= పొందును.

తాత్పర్యము: పశుకాముని నిమిత్త మధ్వర్యుఁడు తృతీయ సవనమునందు షోడశి గ్రహమును గ్రహించవలెను. అనిష్ట నివారకత్వ సాదృశ్యముచే షోడశి గ్రహము వజ్రస్వరూపమే. పశుప్రాప్తి హేతు వగుటచే తృతీయ సవనము పశు స్వరూపము. ఈ విధముగ పశుకామునినిమిత్తము షోడశి గ్రహమును గ్రహించిన యధ్వర్యుఁడు ఈ పశుకాముఁడైన యజమానునికొఱకు షోడశిరూప వజ్రముచేతనే తృతీయసవనమువలన పశువులను పొందును. "ఖాదిరో యూపో భవతి ఖాదిరం వీర్యకామస్య యూపం కుర్వీత"– "యూపము చండ్ర చెట్టునకు సంబంధించినదై యుండవలెను. వీర్యకాముని నిమిత్తము ఖాదిరమును యూపమునుగా చేయవలెను" అను వాక్యద్వయమువలన ఒక యూపమునకే నిత్యత్వము కామ్యత్వము రెండును విధింపఁబడినవి. ఆ విధముగానే ఇచట షోడశి గ్రహమునకు 5వ మంత్రమువలన నిత్యత్వము, ఈ 6వ మంత్రమువలన కామ్యత్వము విధించఁబడినవి. నిత్యముగా విధించఁబడిన షోడశి గ్రహమునకే యిచట కామ్యత్వము విధించఁబడినది.

7. అర్థము: ఉక్థ్యే=ఉక్థ్య క్రతువునందు, న గృహ్ణీయాత్= షోడశి గ్రహమును గ్రహించరాదు. ఉక్థాని=ఉక్థ్య క్రతువునందలి శస్త్రములు, ప్రజాః పశవః వై=ప్రజా స్వరూపములు, పశు స్వరూపములే. ఉక్థ్యే=ఉక్థ్య క్రతువునందు, గృహ్ణీయాత్ యత్=షోడశి గ్రహమును గ్రహించునెడల, (అయమ్=ఈ షోడశి గ్రహము) అస్య=ఈ యజమానునియొక్క, ప్రజామ్=సంతానమును, పశూన్= పశువులను, నిర్దహేత్=ఎక్కువగ దహించును.

తాత్పర్యము: ఉక్థ్య క్రతువునందు షోడశి గ్రహమును గ్రహించరాదు. ఉక్థ్య క్రతువునందలి శస్త్రములు ప్రజా స్వరూపములు. పశు స్వరూపములును. షోడశి గ్రహము వజ్ర రూపమని పూర్వము చెప్పఁబడినది. ఉక్థ్య క్రతువునందు షోడశిని గ్రహించుచో, వజ్ర రూపమైన షోడశి గ్రహము ఈ యజమానునియొక్క సంతానమును, పశువులను నిర్దహించును. శాఖాంతరముననుసరించి ఉక్థ్యక్రతువునందు కూడ ప్రసక్తమైన షోడశిగ్రహ గ్రహణము ఇచట నిషేధించఁబడినది.

8. అర్థము: పశుకామస్య=పశువులను కోరునట్టి యజమానుని నిమిత్తము, అతిరాత్రే=అతిరాత్ర క్రతువునందు, గృహ్ణీయాత్=షోడశి గ్రహమును గ్రహించవలెను. షోడశీ=షోడశి గ్రహము, వజ్రః వై=వజ్ర స్వరూపమే. (అధ్వర్యుః=పశుకాముని నిమిత్తము షోడశిని గ్రహించిన యధ్వర్యుఁడు), వజ్రేణైవ= వజ్రరూపమైన షోడశి గ్రహముచేతనే, అస్మై=ఈ యజమానునికొఱకు, పశూన్= పశువులను, అవరుధ్య=పొంది, ఉపరిష్టాత్=షోడశి గ్రహ గ్రహణానంతరము ( అనుష్ఠేయమైన), రాత్రియా=రాత్రిశబ్దోపలక్షితమైన శస్త్రసమూహముచేత, శమయతి=వజ్రరూప షోడశి కృత దాహమును శమింపఁ జేయును.

తాత్పర్యము: అధ్వర్యుఁడు అతిరాత్ర క్రతువునందు పశుకాముని నిమిత్తము షోడశి గ్రహమును గ్రహించవలెను. షోడశి వజ్రరూపమే. అయినను అధ్వర్యుఁడు వజ్రరూప షోడశి గ్రహముచే ఈ యజమానునికొఱకు పశువులను పొంది, షోడశి గ్రహ గ్రహణానంతరము అనుష్ఠేయమైన శస్త్రసమూహముచే వజ్రరూప షోడశి కృతమైన దాహమును శాంతింపఁజేయును. షోడశి క్రతువునందువలె అతిరాత్ర క్రతువునందు కూడ పశుకామమునకు షోడశి గ్రహము విహిత మైనది. 'పశుకామస్య'అని యుండుటచే ఇతరులకు అతిరాత్రమునందు షోడశి గ్రహ గ్రహణము లేదు.

9. అర్థము: అగ్నిష్టోమేపి=అగ్నిష్టోమ మనెడి యాగమునందు కూడ, రాజన్యస్య=యజ్ఞకర్తయైన క్షత్త్రియుని నిమిత్తము, గృహ్ణీయాత్=షోడశి గ్రహమును గ్రహించవలెను. రాజన్యః=(పట్టభద్రుఁడైన రాజు కాని) క్షత్త్రియుడు, వ్యావృత్కామః=విప్ర వైశ్యులకంటె ఉత్కర్ష రూపమైన వ్యావృత్తిని కోరువాఁడై, యజతే హి=యాగము చేయుచున్నాఁడు కదా!

తాత్పర్యము: ద్వాదశ స్తోత్రములతోడను, శస్త్రములతోడను కూడియుండునది అగ్నిష్టోమ క్రతువు. అది బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులకు త్రివర్ణీయులకు సాధారణ మైనది. అయినను రాజన్యుఁడు విప్ర వైశ్యులకంటె తాను ఉత్కర్షముతో నుండవలెనెడి కోరికతో యాగము చేయును. కనుక అట్టి రాజన్యుని నిమిత్తము అగ్నిష్టోమమునందు కూడ షోడశి గ్రహమును గ్రహించవలెను. ఇచట అధికారి విశేషము నుద్దేశించి షోడశి గ్రహము విధించఁబడినది.

10. అర్థము: సాహ్నే ఏవ=ఏకాహ క్రతువైన సోమయాగమునందే, అస్మై=ఈ యజమానునికొఱకు, (అధ్వర్యుః=అధ్వర్యుఁడు,) వజ్రమ్= వజ్రరూపమైన షోడశి గ్రహమును, గృహ్ణాతి=గ్రహించవలెను. సః వజ్రః= వజ్రరూపమైన యా షోడశి గ్రహము, ఏనమ్=ఈ యజమానుని, భూత్యై= ఐశ్వర్యముకొఱకు, ఇన్ధే=ప్రకాశింపఁజేయును. వా=లేదా, నిర్దహతి= అత్యంతము దహించును. (అతః=ఈ కారణమువలన, ఏ తన్నివృత్యా=ఈ పాక్షిక దాహ నివృత్తిచేత,) ప్రతిష్ఠిత్యై=యజమాన ప్రతిష్ఠకొఱకు, ఏకవింశం స్తోత్రమ్= ఏకవింశ స్తోత్రము, భవతి=సంపాదితమై యుండవలెను.

తాత్పర్యము: ఏక దివస నిష్పాద్యమైన సోమయాగమునందే అధ్వర్యుఁడు యజమానుని నిమిత్తము వజ్రరూప షోడశి గ్రహ మును గ్రహించవలెను. ఈ వజ్రరూప షోడశి గ్రహము యజమానుని ఐశ్వర్యముకొఱకు ప్రకాశింపఁజేయును. లేదా, యజమానుని దహించును. యజమానుని దహించుట పాక్షికము. ఈ పాక్షిక దాహ నివృత్తిచేత యజమానుని ప్రతిష్ఠకై షోడశి గ్రహ స్తోత్రమునకు ఏకవింశ స్తోమమును సంపాదించవలెను. ఏకవింశ స్తోమ సంపాదనము ఎట్లనగా:-

ప్రగీత మంత్ర సాధ్య స్తుతి స్తోత్రమగును. "ఏకం సామ తృచే క్రియతే స్తోత్రియమ్" అను విధి ననుస రించి, ఆ గానము ఋక్సముదాయమునందు చేయవలెను. షోడశి స్తోత్రమునకు "అసావి సోమ ఇన్ద్ర తే" అను ఋక్కు మొదటిది. "ఇన్ద్రమిద్ధరీ వహతే" అను ఋక్కు రెండవది. "ఆ తిష్ఠ వృత్రహన్" అను ఋక్కు మూఁడవది. ఈ ఋక్సముదాయము (తృచము) మూఁడు పర్యాయములు ఆ వృత్తి చేయుటచే ఏకవింశతి ఋగాత్మక స్తోమ మగును. అవృత్తి విధము:-

i). ప్రథమ పర్యాయము ప్రథమ ద్వితీయ ఋక్కులను మూఁడేసి మారులు గానము చేసి, తృతీయ ఋక్కును ఒక్కమారు గానము చేయవలెను.

ii). ద్వితీయ పర్యాయము ప్రథమ ఋక్కును ఒక్కమారు గానము చేసి, ద్వితీయ తృతీయ ఋక్కులను మూడేసి మారులు గానము చేయవలెను.

iii). తృతీయ పర్యాయము ద్వితీయ ఋక్కును సకృద్గానము చేసి, ప్రథమ తృతీయ ఋక్కులను మూఁడేసి మారులు గానము చేయవలెను. ఉట్లు చేయుటవలన మూఁడు ఋక్కులను ఒక్కొక్క పర్యాయము ఏడు మారులు గానము చేసిన ట్లగును. కాఁగా త్రిరావృత్తిచే ఇరువదియొక్క మారులు గానము అగును. ఈ విధముగ షోడశి స్తోత్రమునకు ఏకవింశతి స్తోమమును సంపాదించిన ట్లగును. ఈ విషయమే ఛందోగ బ్రాహ్మణమునందు ఈ విధముగ ఆమ్నాత మైనది.

"సప్తభ్యో హిం కరోతి స తిసృభిః స తిసృభిః స ఏకయా సప్తభ్యో హిం కరోతి స ఏకయా స తిసృభిః స తిసృభిః సప్తభ్యో హిం కరోతి స తిసృభిః స ఏకయా స తిసృభిః సప్త సప్తి మేకవింశస్య విష్టుతిః" సప్తభ్యః=ఏడుగురు ఋత్విజులచేత, హిం కరోతి=గానము చేయఁబడవలెను. విష్టుతిః=యథోక్తావృత్తి విశిష్టమైన ఏకవింశతి నామక స్తోమ సంబంధినియగు విశిష్ట స్తుతి. ఈ స్తుతికి 'సప్తసప్తిమ్' అను నామధేయము కలదు. శేషము పైని వివరించఁబడినది.

11. అర్థము: హరివత్='హరి' శబ్ద ఘటితమైన శస్త్రము, శస్యతే= గానము చేయఁబడవలెను. (తేన=ఆ శస్త్రగాన ముచేత, అయమ్=ఈ యజమానుఁడు,) ఇన్ద్రస్య=ఇంద్రునకు, ప్రియం ధామ=ప్రీతికరమైన స్థానమును (ఇంద్ర లోకమును), ఉపాప్నోతి=పొందును.

తాత్పర్యము: "ఇన్ద్రమిద్ధరీ వహతే" ఇత్యాది ఋక్కులందు హరి శబ్దము బహుళముగ ఆమ్నాత మైనది. ఈ ఋక్కులు మూఁడును 10 వ మంత్ర వ్యాఖ్యానమున ఉదాహరింపబడినవి. ఆ శస్త్రమును యజమానుఁడు గానము చేయవలెను. ఆ శస్త్రముచే ఇంద్రునకు సంతోషము కలుగును కావున ఈ గానము చేసిన యజమానుఁడు ఇంద్రలోకమును పొందును. ఇచట షోడశి శస్త్రము విధించఁబడినది.

12. అర్థము: దేవేషు వై=దేవతలయందైతే, కనీయాంసి ఛన్దాంసి= అల్పాక్షరములైన ఛందస్సులు, ఆసన్=ఉన్నవి. అను రేషు=అసురులయందు, జ్యాయాంశి=బహుళాక్షర ఛందస్సులు, ఆసన్=ఉన్నవి. తే దేవాః=ఆ దేవతలు, కనీయసా ఛన్దసా=అల్పాక్షర ఛందస్సుచే, జ్యాయః ఛన్దః అభి=బహుళాక్షర ఛందస్సున కంతట, వ్యశం సన్=విహరించి శస్త్రమును పఠించిరి. తతః వై=దానివలననే, తే=ఆ దేవతలు, అసురాణాం లోకమ్=అను

రుల లోకమును, అవృఞ్జన్= నశింపఁజేసిరి. (యజ్వా=యాగకర్త,) కనీయసా ఛందసా=అల్పాక్షరమైన గాయత్రీ ఛందస్సుచే, జ్యాయః ఛన్దః అభి=బహ్వాక్షరమైన పంక్తి ఛందస్సున కంతటను, విశంసతి యత్=విహరించి శస్త్రమును పఠించుచో, తత్ భ్రాతృవ్యస్య లోకమేవ=ఆ శత్రువుయొక్క స్థానమునే, వృఙ్క్తే=నశింపఁజేయును.

తాత్పర్యము: దేవతలయందు అల్పాక్షర ఛందస్సులు, అసురులయందు బహ్వాక్షర ఛందస్సులు ఉన్నవి. దేవతలు అల్పాక్షర ఛందస్సుచేత బహ్వాక్షర ఛందస్సున కంతట విహరించి శస్త్రమును పఠించి ఆ విహరణ పూర్వకమైన శస్త్రపఠనముచేతనే అసురుల లోకమును నశింపఁజేసిరి. కనుక యజ్ఞకర్త అల్పాక్షర ఛందస్సుచేత బహ్వాక్షర ఛందస్సున కంతట విహరించి శస్త్రమును పఠించవలెను. ఆ శస్త్ర పఠనముచేతనే యజమానుఁడు తన శత్రుస్థానమును నశింపఁజేయును.

వివరణము: షోడశి శస్త్రము 11వ మంత్రముచే విధింపఁబడినది. ఈ శస్త్రమునకు సంబంధించిన ఋక్కులయందు అనేకములైన ఛందస్సులు కలవు. "ఆ త్వా వహన్తు హరయః" ఇత్యాది ఋక్కులు మూఁడు గాయత్రీ ఛందస్సు కలవి. "ఉపో షు శృణుహీ గిరః సునన్దృశం త్వా వయం మఘవన్" ఇత్యాది ఋక్కునందు ఒక గాయత్రీ ఛందస్సు, రెండు పంక్తి ఛందస్సులు కలవు. "యదిన్ద్ర పృతనాజ్యేఽయం తే అస్తు" ఇత్యాదికమునందు ఉష్ణిక్ బృహతీ ఛందస్సులు కలవు. వీనిలో గాయత్రీ ఛందస్సునకు ఇరువది నాలుగు అక్షరములు. ఇరువది యెనిమిది అక్షరములు ఉష్ణిక్ ఛందస్సునకు కలవు. ఈ రెండు ఛందస్సులు అల్పాక్షరములు కలవి యగుటచే వీనికి కనీయస్త్వము, దేవచ్ఛందస్త్వము ఏర్పడినవి. ఎనిమిదేసి అక్షరములు కల అయిదు పాదములతో విరాజిల్లుచున్న పంక్తి ఛందస్సునకు నలువది అక్షరము లున్నవి. బృహతీ ఛందస్సు ముప్పదియాఱు అక్షరములు కలది. ఈ రెండు ఛందస్సులు అధికాక్షరములు కలిగియుండుటచే వీనికి భూయస్త్వము, అసురచ్ఛందస్త్వము ఏర్పడినవి. దేవతలు ఈ ఛందస్సులలో గాయత్రీ ఛందస్సుచే పంక్తి ఛందస్సున కంతటను విహరించి శస్త్రమును పఠించిరి.

విహార ప్రకారము :– విహృతము అవిహృతము అను భేదములచే శస్త్రము రెండు విధములుగా నున్నది. అవిహృత శస్త్రమును విహృతమునుగా చేయవలెనని యీ పంౘెండవ మంత్రము చెప్పినది. ఎట్లనఁగా :–

i) గాయత్రీ ఛందస్సుయొక్క ప్రథమ పాదమును పంక్తి ఛందస్సుయొక్క ప్రథమ పాదమును సంయోగము చేసి ఒక అర్ధర్చమును చేయవలెను.

ii) గాయత్రియొక్క రెండవ పాదమును పంక్తియొక్క రెండవ పాదమును సంయోగించి ఒక అర్ధర్చమును చేయవలెను.

iii) ఇట్లే ఈ రెండు ఛందస్సులయొక్క తృతీయ పాదములను సంయోగించి ఒక అర్ధర్చమును చేయవలెను. ఇఁక పంక్తి ఛందస్సున మిగిలియున్న నాలుగు అయిదు పాదములను రెండింటిని ఒక అర్ధర్చమును చేయవలెను. అంత్యమునందు ప్రణవమును చేర్చవలెను. ఈ విధముగ చేసిన నాలుగు అర్ధర్చములు రెండు అనుష్టుప్పు లగును. ఆ విధముగ ఏర్పడిన అనుష్టుప్పులను పఠించినచో పంక్తి ఛందస్సున కంతట విహరించి శస్త్రమును పఠించిన ట్లగును. విహరించి పఠించవలెను అను వాక్యమున కిదియే అర్థము. (ఈ విహరణ ప్రకారము విధించఁబడినది.)

13. అర్థము: (పూర్వోక్తములయిన మూఁడు ఋక్కులలో మధ్యమ ఋక్కులోని ముప్పది యెనిమిది అక్షరములలో,) షడక్షరాణి=ఆఱు అక్షరములు, అతిరేచయన్తి=అనుష్టుప్పునకు మించి యున్నవి. ఋతవః=ఋతువులు, షట్ వై= ఆఱే. ఋతూనేవ=ఋతువులనే, ప్రీణాతి=సంతోషపఱచినవాఁ డగును. పూర్వాణి చత్వారి=మధ్యమ

ఋక్కుయొక్క మొదటి నాలుగు అక్షరములను, ఉపకల్పయన్తి=ప్రథమ ఋక్కునందు కలుపవలెను. చతుష్పదః పశూన్ ఏవ=నాలుగు పాదములు కలిగియున్న పశువులనే, అవరున్ద్ధే=పొందును. ఉత్తరే ద్వే=మధ్యమ ఋక్కుయొక్క అత్యాక్షరములను రెండడింటిని, ఉపకల్పయన్తి=తృతీయ ఋక్కునందు కలుపవలెను. ద్విపదః ఏవ=రెండు పాదములు కలిగియున్న ప్రజలనే (సంతానమునే), అవరున్ద్ధే=పొందును.

తాత్పర్యము: పూర్వోక్తములయిన ఋక్కులలో ప్రథమ ఋక్కునకు ఇరువది యెనిమిది అక్షరములు, ద్వితీయ ఋక్కునకు ముప్పది యెనిమిది అక్షరములు, తృతీయ ఋక్కునకు ముప్పది అక్షరములును కలవు. వీనిలో మధ్యమ ఋక్కులో ఆఱు అక్షరములు అనుష్టుప్పుయొక్క అక్షరములకంటె అధికముగా నున్నవి. ఋతువులు ఆఱు కనుక యజమానుఁడు ఆఱు ఋతువుల ఫలములను పొందును. మధ్యమ ఋక్కులోని మొదటి నాలుగక్షరములను ప్రథమ ఋక్కునందు కలుపవలెను. అప్పుడు ప్రథమ ఋక్కు ముప్పదిరెండు అక్షరములు కల దగును. దీనివలన యజమానుఁడు చతుష్పాత్తులైన పశువులను పొందును. మధ్యమ ఋక్కులోని అంతిమాక్షరములను రెండింటిని తృతీయ ఋక్కులో కలుపవలెను. అప్పుడు ద్వితీయ తృతీయ ఋక్కులు రెండును ముప్పదిరెండేసి అక్షరములు కల వగును. రెండక్షరములను కలుపుటచే యజమానుఁడు ద్విపాదులైన ప్రజలను (సంతానమును) పొందును. ఈ మూఁడు ఋక్కులను ఈ విధముగ మార్పు చేయుటచే మూఁడు అనుష్టుప్పు లగును. ఈ విధముగ అయిన అనుష్టుప్పులను యజమానుఁడు పఠించవలెను. సంఖ్యాంతరాభిప్రాయముతో ఇచట విహరణము చూపఁబడినది.

14. అర్థము: అనుష్టుభమ్ అభి సంపాదయన్తి=పూర్వోక్త విధముగ ఋక్కుల నంతటను అనుష్టుప్ రూపమును సంపాదించినవా రగుచున్నారు. అనుష్టుప్= అనుష్టుప్పు, వాక్ వై=వాక్స్వరూపమే. ప్రాణానామ్=ఇంద్రియములలో, వాక్= వాగింద్రియము, ఉత్తమా=శ్రేష్ఠమైనది.

తాత్పర్యము: పూర్వోక్తవిధముగ ఋక్కుల నంతటను అనుష్టుప్పులుగా సంపాదించినవా రగుచున్నారు. ప్రాణశబ్దోపలక్షితములైన ఇంద్రియములలో వాగింద్రియము శ్రేష్ఠమైనది. అనుష్టుప్పు వాక్స్వరూపమే. విహరణమునందు ఫలము ఇచట చూపఁబడినది.

15. అర్థము: సూర్యే=సూర్యుఁడు, సమయావిషితే= అర్ధాస్తమయమును పొందినవాఁ డగుచుండఁగా, షోడశినః స్తోత్రమ్=షోడశి స్తోత్రమును, ఉపాకరోతి=ఉపాకరణము చేయవలెను. ఏతస్మిన్ వై=ఈ అర్ధాస్తమయ సమయమునందే, లోకే=భూలోకమునందు, ఇన్ద్రః=ఇంద్రుఁడు, వృత్రమ్= వృత్రుని, అహన్=సంహరించెను. (అయమ్=అర్ధాస్తమయమున షోడశి స్తోత్రము నుపాకరణము చేసిన ఈ యజ్వ) సాక్షాదేవ=సాక్షాత్తుగానే, భ్రాతృవ్యాయ= శత్రువుకొఱకు (శత్రువుపైని), వజ్రమ్=వజ్రాయుధమును, ప్రహరతి= ప్రయోగించినవాఁ డగును.

తాత్పర్యము: సూర్యుఁడు అర్ధాస్తమయమును పొందిన సమయమున యజ్వ షోడశి స్తోత్రము నుపాకరణము చేయవలెను. పూర్వ మింద్రుఁడు ఈ యర్ధాస్తమయ సమయమునందే భూలోకమునందు వృత్రుని వధించెను. కనుక ఈ విధముగ చేసిన యజ్వ తన శత్రువు పైని సాక్షాత్తుగ వజ్రాయుధమును ప్రయోగించినవాఁ డగును. ఇచట స్తోత్రోపాకరణమునకు కాలము విధించఁబడినది.

16. అర్థము: అరుణ పిశఙ్గః=అరుణ మిశ్ర పిశంగ వర్ణము కల, అశ్వః=గుఱ్ఱము, దక్షిణా=షోడశి క్రతువునందు దక్షిణ. ఏతద్వై=ఇదియే, వజ్రస్య=వజ్రాయుధముయొక్క, రూపమ్=రూపము. సమృద్ధ్యై= సమృద్ధికొఱకు, భవతి=అగుచున్నది.

తాత్పర్యము: షోడశి క్రతువునందు అరుణ మిశ్ర పిశంగ వర్ణము కల  అశ్వము దక్షిణ. ఇదియే వజ్రాయుధముయొక్క వర్ణము. ఇది సమృద్ధికొఱ కగును.

షష్ఠప్రపాఠకము సమాప్తము

షష్ఠకాండము పరిసమాప్తము

# షష్ఠకాండగత విషయ సమీక్ష

"అప ఉన్దన్తు జీవసే" (కా. 1 ప్ర. 2 అ. 1.) ఇత్యాదికము అధ్వరకాండము. "ఆదదే గ్రావా ఽసి" (కా. 1. ప్ర. 4. అ. 1.) ఇత్యాదికము గ్రహకాండము. "ఉదు త్యం జాతవేదసమ్" ( కా. 1. ప్ర. 4. అ. 43.) ఇత్యాదికము దక్షిణాకాండము. ఈ మూఁడింటికి ఈ షష్ఠకాండమునందలి "ప్రాచీనవగ్ంశం కరోతి" ఇత్యాదికము విధి. "దేవ సవితః ప్ర సువ" ఇత్యాదికము వాజపేయమునకు మంత్రకాండము. అనఁగా వాజపేయక్రతువునకు సంబంధించిన మంత్రము లీ మంత్రకాండమునం దామ్నాతము లైనవి."దేవా వై యథాదర్శం యజ్ఞానాహరన్త" ఇత్యాదికము వాజపేయక్రతువిధాయకమైన విధికాండము. "త్రివృత్స్తోమో భవతి" ఇత్యాదికములు నవములు. "నమో వాచే యా చోదితా" ఇత్యాదికము శుక్రియ మంత్రకాండము. "దేవా వై సత్రమాసత" ఇత్యాదికము శుక్రియవిధికాండము. ఈ తొమ్మిదికాండములు చంద్రకాండములు. ఇందువలన ఈ కాండములందు చంద్రుని ఋషినిగా ధ్యానించవలెను.

ఏకాహము, అహీనము, సత్రము అని సోమయాగము మూఁడు విధములుగ నున్నది. ఒక్క అహస్సునందే ప్రాతస్సవనాది సవనత్రయముచే నిష్పాద్యమైన సోమయాగము ఏకాహ మనఁబడుచున్నది. ద్విరాత్రము నారంభించి యేకాదశరాత్రపర్యంతములైన సోమయాగము లహీనము లనఁబడుచున్నవి. అనఁగా అహీననామకమైన సోమయాగమని యర్థము. త్రయోదశరాత్రము నారంభించి సహస్రసంవత్సరపర్యంతములైన సోమయాగములు సత్రనామకములు. అనఁగా ఈ సర్వమునకు సత్రనామక సోమయాగమని యర్థము. ద్వాదశాహము ద్విరూపము. అందు అహీనరూపముచే ద్విరాత్రాదులకు, సత్రరూపముచే త్రయోదశరాత్రాదులకును ద్వాదశాహము ప్రకృతి యగుచున్నది. ఆ ద్వాదశాహక్రతువునకు ఏకాహరూపమున జ్యోతిష్టోమము ప్రకృతి యగుచున్నది. కనుకనే "ఏష వావ ప్రథమో యజ్ఞో యజ్ఞానాం యజ్జ్యోతిష్టోమః" అను శ్రుతి ఆమ్నాత మైనది.

జ్యోతిష్టోమము, అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థము, షోడశి, అతిరాత్రము, అప్తోర్యామము, వాజపేయము అనునట్టి యేడు క్రతువులును సప్తసంస్థాంతర్గతము లైనను, అగ్నిష్టోమమునందు అంగజాత మంతయు ఉపదిష్ట మగుటవలన అదియే సర్వ క్రతువులకు ప్రకృతి యగుచున్నది. ఇందువలన సోయయాగమే ప్రథమమున నభిహిత మైనది. సోమయాగము ననుష్ఠించఁబోవు యజమానుఁడు 'సోమేన యక్ష్యమాణో బ్రాహ్మణానార్షేయాన్నృత్విజో వృణీతే" అను నాపస్తంబసూత్రమునఁ జెప్పఁబడినవిధముగ ఆర్షేయులైన బ్రాహ్మణులను ఋత్విజులనుగా వరించి యజ్ఞము ననుష్ఠించుట కనువైన స్థలమును నిర్ధారించి యజ్ఞదీక్షను వహించవలెను. దీక్షాంగమైన వపనవిధికి పూర్వము నిర్ధారించఁబడిన యా ప్రదేశమునందు యజ్ఞశాలను నిర్మింపఁజేయవలెను. యజ్ఞశాలావిధాయకమైన "ప్రాచీవవగ్ంశం కరోతి" అను మంత్రముతో ఈ షష్ఠకాండ మారంభమైనది.

అనంతరము యజ్ఞగృహమునకు కుడ్యస్థానీయమైన ఆవరణము, ద్వారములు, "పరిశ్రయత్యన్తర్హితః" ఇత్యాదిమంత్రములచే విధించఁబడినవి. పిమ్మట దీక్షాంగమైన వపనమును, తత్ప్రికారమును "కేశశ్మశ్రు వపతే" ఇత్యాది మంత్రములు విధించినవి. ఈ విధముగనే వపనానంతరకర్తవ్యములైన స్నానము, ఆచమనము, క్షౌతవస్త్రధారణము మొదలగునవి విధించఁబడినవి. యజ్ఞకర్త యజ్ఞదీక్షాంగముగ కళ్లకు కాటుకను ధరించుట యనునది ఒకయంశము. లోకమునందు స్త్రీలు కాటుకతోఁ గూడియున్న చేతివ్రేలిని ప్రథమమున ఎడమకంటిలోనికి పోనిచ్చి సంఖ్యానియమము లేకుండ నిటునటు శీఘ్రముగ త్రిప్పుదురనియు, యజ్ఞదీక్షితుఁడు శలాకతో ప్రథమమున కుడికంటియందు ఐదుమాఱు లిటునటు త్రిప్పుచు కాటుకవంటి యంజనమును పెట్టుకొనవలెననియు "దక్షిణం పూర్వమాఙ్క్తే" అను మంత్రమునందు చాల చక్కగా వివరించఁబడినది. ఈ దీక్షాంగముల సముదాయమును దీక్ష ణీయేష్టియని యందురు. దీక్షణీయేష్టియందు అధ్వరమంత్రముల యతిదేశమువలన ప్రాప్తములైన "ఆకూత్యై ప్రయుజేఽగ్నయే" ఇత్యాది మంత్రములకు బ్రాహ్మణము చెప్పఁబడినది.

యజమానుఁడు యజ్ఞదీక్షను స్వీకరించినపిమ్మట దేవయజనస్వీకారమును చేయును. ఆ దేవయజనమునందే సోమయా గోపయోగియైన సోమమును (సోమలతను) కొనుటకై సోమక్రయణీ విషయమైన హోమాదిక మభిహిత మైనది. సోమలతను తెచ్చినవానికి గోవునిచ్చి యతనినుండి సోమలతను కొనవలెను. ఆ గోవు సోమక్రయణి యనఁబడుచున్నది. "ఇయం తే శుక్ర"

ఇత్యాదులు హోమమంత్రములు. ధ్రువ యనెడి పాత్రమందుఁగల ప్రాయణీయేష్టిసంబంధియైన ఆజ్యముతో సోమక్రయణిని చూచుచు నధ్వర్యుఁడు హోమము చేయును. "ఇయం తే శుక్ర" ఇత్యాది హోమమంత్రవ్యాఖ్యానముకంటె పూర్వము ప్రాయణీయేష్టి, సోమక్రయణీయు రెండు అనువాకములం దభిహితము లైనవి. పిమ్మట హోమమంత్రములు బ్రాహ్మణముచే వ్యాఖ్యానించఁబడినవి.

సోమక్రయణి క్రయప్రదేశమునకు వచ్చినపిమ్మట ఆ గోవుయొక్క అడుగులజాడలలో నేడవ అడుగుజాడయందు హోమము చేయవలెనని "సప్తమే పదే జుహోతి" అను మంత్రము హోమమును విధించినది. ఈ సందర్భమున సోమక్రయణియొక్క మహిమాదులు చెప్పఁబడినవి. అనంతరము సోమమును కొలుచుట, సోమక్రయము "అరుణో హ స్మాహౌపవేశిః" ఇత్యాది మంత్రములచే విధించఁబడినవి. అనంతరము కొనినసోమమును యజ్ఞశాలకు శకటముమీఁద తీసికొనివచ్చుట మున్నగు నంశములు చెప్పఁబడినవి. యజ్ఞశాలకు సోమమును తెచ్చినపిమ్మట అతిథిరూపమైన సోమమును సత్కరించుటకై ఆతిథ్యేష్టి చెప్పఁబడినది. "అగ్నే రాతిథ్యమసి" ఇత్యాదికముచే ప్రథమకాండమునందలి బ్రాహ్మణముచే వ్యాఖ్యానించఁబడినవి. ఇచట ఆతిథ్యకర్మ, యజమానపత్ని శకటమున స్పృశించుట మొదలగు నంశములు విధించఁబడినవి. ఈ సందర్భమున ఆతిథ్యేష్టిమధ్యమందు వహ్నిమంథనము, ఆ మథితాగ్నిని ఆహవనీయాగ్నియందు ప్రక్షేపించుట మొదలగునవి విధించఁబడినవి.

సోమమును యజ్ఞశాలకు తెచ్చి యా యజ్ఞశాలయం దుంచిన పిమ్మట సోమముచే చేయఁబడఁబోవు యాగమునకు విఘ్నకారులైన యసురులు జేతవ్యులని, తద్విజయమునకై ఉపసదులు (అనెడి హోమములు) ప్రథమకాండ ద్వితీయ ప్రపాఠకాంతమునందు వర్ణించఁబడినవి. అనఁగా తన్మంత్రము లచట నామ్నాతము లైనవి. ఆ మంత్రములకు విధాయకము, వివరణాత్మకమునైన బ్రాహ్మణ మీ షష్ఠకాండమునం దభిహిత మైనది. యజ్ఞశాలకు సోమలతను మోఁపుగా కట్టి తెత్తురు కనుక తద్బంధన [illegible]ముచే తృప్తిపఱచుచు నుపచారము చేయుటకై వర్ణించఁబడిన "అꣳశురꣳశుస్తే దేవ సోమాఽఽప్యాయతామిత్యాహ" ఇత్యాదిమంత్రము లిచట చెప్పఁబడినవి. ఆతిథ్యేష్టియందు ప్రస్తరము, అచటఁగల బర్హిస్సు అనునట్టి యుభయము నగ్నియందు పడవేయరాదు కనుక ప్రస్తరమును వేదికి దక్షిణభాగమున ఉంచి నమస్కారోపచారమును చేయుదురు. ఆ సందర్భమున "ఏష్టా రాయః ప్రేషే భగాయేత్యాహ ద్యావాపృథివీభ్యామేవ నమస్కృత్య" – 'భక్తజనులం దిచ్ఛకలగియున్న యో దేవా! యజ్ఞవాదులమైన మాకొఱకు యజ్ఞమును ధనముకొఱకు, అన్నముకొఱకు, ఐశ్వర్యాది షడ్గుణసంపద కొఱకు నొసఁగుము' అను మంత్రము చెప్పఁబడినది. 'సమగ్రైశ్వర్యము, ధర్మము, యశము, సిరి, జ్ఞానము, వైరాగ్యము' అనునవి ఐశ్వర్యాది షడ్గుణములు.

అనంతరము "అగ్నే వ్రతపతే త్వం వ్రతానాం వ్రతపతి రసి" అను మంత్రముచే ఆహవనీయోపస్థానము చేసినయనంతరము" "దేవాసురాః సంయత్తా ఆసన్తే దేవాః" ఇత్యాది మంత్రముచే యజమానున కవాంతరదీక్ష విధించఁబడినది. దేవతలు, అసురులును యుద్ధమునకు సంయుతులైనప్పుడు దేవతలు భయపడినవారై యగ్నిని ప్రవేశించి, యా యగ్నిని వరూథమును (కవచమును)గాఁ జేసికొని యసురులను జయించిరి. ఈ యవాంతరదీక్షను గైకొనిన యజమానుఁడు కూడ "నగ్నిని ప్రవేశించి శత్రువును జయించునని' ఈ యవాంతర దీక్షామంత్రమున కర్థము. యోగశాస్త్రప్రసిద్ధమైన సంయమవిశేషము పరకాయ ప్రవేశహేతు వగుటవలన దేవత లా సంయమవిశేషముచే నగ్నిశరీరమున ప్రవేశించిరని విద్యారణ్యమున వివరించఁబడినది. దేవత లందఱు అగ్ని శరీరమున ప్రవేశించుటవలన అగ్ని సర్వదేవతాస్వరూపుఁడుగా వేదమున పలుతావులం దభివర్ణింపబడెను. అవాంతరదీక్ష తపోరూప మగుటవలన అగ్నిసమానమనియు సాయణాచార్యులు వక్కాణించినారు.

అనంతరము సౌమికియైన వేది విధించఁబడినది. ఆ వేదివిధికి పూర్వము "యజ్ఞో దేవేభ్యో నిలాయత విష్ణూరూపం కృత్వా స పృథివీం ప్రావిశత్తం దేవాః ——— తదేకం వేద్యై వేదిత్వమ్" అను మంత్రమున వేది ప్రస్తుతించఁబడినది. ఆ మంత్రము షష్ఠకాండస్థ ద్వితీయ ప్రపాఠకగత చతుర్థానువాకవ్యాఖ్యానమున వివరించఁబడినది. ఈ సందర్భమున యజ్ఞము చేయునట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు వేఱువేఱుగా నవాంతరదీక్షానియమ విశేషములు విధించఁబడినవి. ఈ విధముగ ఉపసద్ధోమములు, షట్త్రింశపదపరిమిత వేదియు విధించఁబడినపిమ్మట ఆ వేదిప్రదేశమునకు ఉత్తరవేది నిర్మాణము విధించఁబడి

నది. తదనంతరము హవిర్ధాన నిర్మాణము విహిత మైనది. హవిర్ధాన మనఁగా హవిర్ద్రవ్యము నుంచుటకు యోగ్యమైన శకటము. అట్టి శకటములు (హవిర్ధానములు) రెంటిని ఈ సోమయాగమునం దుపయోగింతురు. ఆ శకటముల నుంచుటకై హవిర్ధాన మనెడి మండపము కూడ విధించఁబడినది. యజ్ఞపురుషునకు హవిర్ధానమండపమును శిరస్సునుగా "శిరో వా ఏతద్యజ్ఞస్య యద్ధవిర్ధానమ్" అను మంత్రము వర్ణించినది. పిమ్మట సదోమండప నిర్మాణము, తద్విశేషములును అభిహితము లైనవి. అనంతరము వైసర్జన హోమములు విధింపఁబడినవి.

అనంతరము అభిహితవ్యమైన అగ్నీషోమీయ పశ్వంగయూపచ్ఛేదనము, నిర్దిష్టప్రదేశమందు యూపస్థాపనము, స్థాపితమైన యూపమునకు యజ్ఞపశుబంధనము తదుపాకరణము, పశువిశసనము, వపోత్ఖేదనము, వసాహోమము, ఉపయట్సంజ్ఞకహోమములు, గుదకాండహోమము వరుసఁగా విహితము లైనవి. ఇంతటితో అగ్నీషోమీయ పశుకర్మ పరిసమాప్త మైనది. అనంతరము సోమాభిషవోపయుక్తములైన వసతీ వరీ సంజ్ఞకములైన యుదకములను గ్రహించుట, హవిర్ధానశకటమునుండి అధిషవణఫలకముల పైని సోమమును దింపుటయు విహితము లైనవి. పిమ్మట సుత్యాదినమునందు కర్తవ్యములైన గ్రహములు (పాత్రములు) ప్రధానముగ ప్రతిపాదించఁబడినవి. అనఁగా ఆ యా దేవతలకు ఉద్దిష్టమైన సోమరసమును పాత్రములందు నింపి యా యా దేవతలకై యాసాదనము చేయుట వర్ణించఁబడినది. ఈ ప్రకరణమున ఉపాంశుగ్రహమునుండి షోడశ్యంతములైన గ్రహములన్నియు యథాక్రమముగ నభిహితములైనవి. ఈ సందర్భమున కొన్నివిశేషము లిచట వివరించఁబడుచున్నవి.

చతుర్థానువాకమునందు ఐంద్రాగ్నగ్రహ గ్రహణము విహితమైనది. ఈ గ్రహమునకు ఇంద్రాగ్నులు దేవతలు. పూర్వము చెప్పఁబడిన ఋతుగ్రహములు స్వర్గలోక ప్రాప్తికొఱకు గ్రహింపఁబడునట్టివి. ఇంద్రాగ్నులు జ్యోతిస్స్వరూపులు. అట్టి యింద్రాగ్నిదేవతాకమైన (ఐంద్రాగ్న) గ్రహమును ఋతుగ్రహముతోఁగూడ గ్రహించినచో యజ్ఞకర్త ఋతుపాత్రముపైని జ్యోతిస్సును స్థాపించినవాఁ డగును. ఋతుపాత్రముతోఁ గూడ గ్రహించఁబడిన ఐంద్రాగ్నగ్రహము స్వర్గలోకప్రకాశక మగును. దేవతలలో బలవంతులైన యింద్రాగ్నులకు సంబంధించిన గ్రహమును గ్రహించుటవలన యజమానుఁడు బలమును పొందును గూడ. విశ్వేదేవదేవతలు దేవతలుగాఁ గల గ్రహము వైశ్వదేవగ్రహము. ఈ వైశ్వదేవగ్రహమును శుక్రదేవతాకమైన శుక్రగ్రహముతోఁ గూడ గ్రహించవలెను. ప్రజలు విశ్వేదేవదేవతా సంబంధులు. సూర్యుఁడు శుక్రగ్రహ స్వరూపుఁడు. శుక్రుఁడు తేజస్స్వరూపుఁడు. వైశ్వదేవగ్రహమును శుక్రగ్రహముతోఁ గూడ గ్రహించుటవలన యాగకర్త ప్రజలయందు తేజస్సును స్థాపించినవాఁ డగును. ఈ విధముగ యజ్వవలన ప్రజాక్షేమము గూడ కలుగుచున్నది.

పంచమానువాకమునందు మరుత్వతీయ గ్రహముల గ్రహణము, మాహేంద్ర గ్రహ గ్రహణము విధించఁబడినవి. మరుద్దేవతల గణములు దేవతలుగాఁ గల గ్రహములు మరుత్వతీయము లనఁబడుచున్నవి. ఇంద్రుఁడు మరుద్గణముల సహాయముతో మాధ్యందినసవనమునందు వృత్రుని సంహరించెను. యజ్ఞము చేయుచున్న యజమానునినిమిత్తము గ్రహించఁబడునట్టి మరుత్వతీయ గ్రహములు యజమానునకు శత్రుసంహారకము లగును. వృత్రుని సంహరించిన యింద్రునకు ఋతువులు మోహాకము లైనవి. అనఁగా ఋతువిషయక జ్ఞానము నశించినది. దానివలన నతఁడు ఋతువులను తెలిసికొనలేకపోయెను. కనుక ఋతుపాత్రముతోఁ గూడ మరుత్వతీయ గ్రహములను గ్రహించవలెను. ఇట్లు చేసినచో యజ్వకు ఋతువుల పరిజ్ఞానము కలుగును. ఈ మరుత్వతీయ గ్రహ గ్రహణమువలన నింకను అనేక ప్రయోజనములు గలుగునని యీ యనువాకమునఁ జెప్పబడినవి. ఇచట మాహేంద్ర గ్రహ గ్రహణము కూడ విధించఁ బడినది. ఇంద్రుఁడు వృత్రుని సంహరించెనని పూర్వము చెప్పఁబడినది. అతఁడు వృత్రుని సంహరించుటవలన గొప్పవాఁ డయ్యెనని దేవతలు పలికిరి. వృత్రహనన రూపమైన మహాకార్యమును చేయుటవలన ఇంద్రునకు మహేంద్రుఁ డను పేరు సార్థక మైనది. ఆ యింద్రుఁడు తాను చేసిన యాగమునందు మహేంద్ర గ్రహమును గ్రహించెను. అందువలన నతఁడు దేవతలలో నధికుఁ డయ్యెను. కనుక ఈ యాగకర్త కూడ మహేంద్ర గ్రహమును గ్రహించుటవలన ప్రజలలో నధికుఁ డగును. శుక్రపాత్రముతోఁ గూడ మహేంద్ర గ్రహమును గ్రహించవలెననియు, శుక్రగ్రహము తేజోరూప మగుటవలన యజమానునందే తేజస్సును స్థాపించిన ట్లగుననియు ఈ యనువాకమునఁ జెప్పబడినది.

ఇఁక షష్ఠానువాకమునందు ఆదిత్య గ్రహ గ్రహణము, సప్తమానువాకమునందు సావిత్ర వైశ్వదేవ గ్రహ గ్రహణము,

అష్టమానువాకమునందు పాత్నీవత గ్రహ గ్రహణము విధించఁ బడినవి. ఆదిత్య గ్రహ గ్రహణ విధి సందర్భమున ఒక ఆఖ్యాయిక చెప్పఁబడినది. అదితిదేవి పుత్రకామినియై సాధ్యు లనెడి దేవతలకొఱకు ఆధానప్రకరణోక్త విధముగ సంపాదితమైన యన్నమును (బ్రహ్మౌదనమును) పచనము చేసి ఆ యన్నమును హోమము చేసి, హుతము కాఁగా మిగిలిన యన్నమును (హుతశేషమును) తినెను. అనంతర మామె రేతస్సును ధరించి నలుగురు పుత్రులను (ఆదిత్యులను) కనెను. ఆ పుత్రచతుష్టయమువలన పుత్రేచ్ఛ తీరక రెండవ పర్యాయము బ్రహ్మౌదనమును వండెను. మొదట ఆమె హోమానంతరము హుతశేషమును భుజించుటవలన నలుగురు ఆదిత్యులు పుట్టిరి. హుత మగుటకు పూర్వమే భుజించినచో ఇంతకంటె ధనికులైన కుమారులు పుట్టుదురని తలఁచి హుత మగుటకు పూర్వమే భుజించినది. అనంతర మామె రేతస్సును ధరించినది కాని, హోమముకంటె ముందుగా భుజించుట యనెడి అపరాధముచే ఆమెకు గర్భస్థానము గర్భశూన్యముగానే అయినది. పిమ్మట ఆ యదితి శూన్యగర్భని వారణమునకై మూఁడవ పర్యాయ మాదిత్యులకొఱకే యన్నమును వండి 'యీ గర్భస్థానము నా భోగముకొఱ కగుఁగాక' యని యా బ్రహ్మౌదనము నాదిత్యులకొఱకు హోమము చేసినది. పిమ్మట ఆ యదితిగర్భమునుండి వివస్వంతుఁ డనుపేరు కల ఆదిత్యుఁ డుద్భవించెను. ఈ మనుష్యు లా యాదిత్యునిసంబంధులే. ఈ సప్తమాద్యనువాకములందు విహితములైన సావిత్ర వైశ్వదేవాదిగ్రహముల గ్రహణమువలన ననేక ప్రయోజనములు చెప్పఁబడినవి. ఈ విధముగ తత్తత్తల విశేషములతో సవివరముగ వర్ణించఁబడిన యితర గ్రహములను గూర్చి వేదార్థదీపికనుండి తెలిసికొనవలసినది. ఇంతటితో షష్ఠకాండమునందలి పంచమ ప్రపాఠకము సమాప్త మైనది.

ఇఁక షష్ఠప్రపాఠకమునందలి ప్రథమానువాకమున ఋత్విజులకు బహూకరించవలసిన దక్షిణలు, ద్వితీయానువాకమున సమిష్ట యజుర్హోమము, తృతీయానువాకమున అవభృథము విహితము లైనవి. దీనితో సౌమికమంత్రకాండమునకు వ్యాఖ్యానరూపమైన బ్రా[illegible]ణము సమాప్త మైనది. ఇంకను బ్రాహ్మణశేషములైన యెనిమిది అనువాకము లామ్నాతము లైనవి. ఆ యెనిమిది అనువాకములలో క్రమముగ యూపైకాదశిని, పశ్వైకాదశిని, పాత్నీవతపశువు మొదలగు నంశములు వివరించఁబడినవి. ఇంతటితో షష్ఠకాండము పరిసమాప్తమైనది.

* * *